# శ్రీరుద్రాభిషేక మాహాత్మ్యము

[నమక చమకాంధ్ర భాష్యము]

అర్థపంచక సహితము

[యజ్ఞ, శివ, విజ్ఞానశాస్త్ర, శాక్తాద్వైతపరము]

శ్రీ విద్యారణ్యాది భాష్యవిషయసహితము

ప్రథమ భాగము

గ్రంథకర్త

సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ

తెలికిచెర్ల రాజేశ్వరశర్మ

వేదశాస్త్ర పండితుడు, విశ్రాన్త ప్రధానాంధ్రోపాధ్యాయుడు

మునిసిపల్ హైస్కూల్ - శ్రీకాకుళం (జిల్లా)

ప్రకాశకులు :

తెలుగు సారస్వత సంఘము

శ్రీహరికోట.



వెల: రూ. 45-00

(రెండుభాగములు కలసి)



శ్రీ కాంచీ కామకోటి పీఠాధిపతులు
జగద్గురు శ్రీమచ్చంద్రశేఖరేంద్ర సరస్వతీ,
శ్రీమజ్జయేంద్ర సరస్వతీ. — స్వామివార్లు.

॥ శ్రీః ॥

# ఆశీస్సులు

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య, శ్రీమచ్ఛంకర భగవత్పాద ప్రతిష్ఠిత, శ్రీ కాంచీ కామకోటి పీఠాధిప జగద్గురు శ్రీమచ్చంద్రశేఖరేంద్ర సరస్వతీ శ్రీ పాదాదేశానుసారేణ శ్రీమజ్జయేంద్ర సరస్వతీ శ్రీపాదైః క్రియతే నారాయణ స్మృతిః॥

"వేదో ధర్మమూలమ్" అను సూక్తి ననుసరించి మన ధర్మగ్రంథములు వేదములని తెలియుచున్నది. వానిలో యజుర్వేదము శుక్ల కృష్ణ భేదమున ద్వివిధము. తైత్తరీయశాఖలో శ్రీకృష్ణ యజుర్వేద సంహితలో సప్తకాండములు కలవు. వానిలో చతుర్థకాండమున పంచమ ప్రశ్నమున "నమకము", సప్తమ ప్రశ్నమున "చమకమును" జెప్పఁబడినవి. వీనికి రుద్రమను నామము కలదు. నమకమున మధ్యను వచ్చినది "నమస్సోమాయానువాకము". అందులో మధ్యను "నమశ్శివాయ" అను పంచాక్షర మంత్రము కలదు. రుద్రమున శ్రీ పరమేశ్వరుడు భగవంతుడుగా, సర్వవ్యాపక స్వరూపుడుగాఁ జెప్పఁబడెను. సర్వాన్తర్యామిగా వివరింపఁబడెను. ఈ రుద్రమును అర్థసహితముగా జపించినచో అది అమితఫలము నొసంగును. మహామహిమాన్వితమగు రుద్రమునకు విద్యారణ్య భాస్కరాచార్య విష్ణు సూర్యాదులు పెక్కురు మహానుభావులు పెక్కు వ్యాఖ్యలు వ్రాసిరి. ఈ రుద్రమునకు సర్వులకు సులభగ్రాహ్యమగునట్లు సంస్కృత వ్యాఖ్యల నాధారముగా గైకొని సులభశైలిలో అర్థ తాత్పర్య విశేష విషయసహితముగా, శ్రీ తెలికిచర్ల రాజేశ్వరశర్మగారు ఆంధ్రమున రచించిన ఈ మహాగ్రంథమును స్థాలీపులాకన్యాయముగా జదివించి ఆలకించినారము.

శ్రీ సనత్సుజాతీయమును శఙ్కరభాష్య సహితముగా ఆంధ్రీకరించి ముద్రించిన వీరి గ్రంథమును ఇంతకుమున్నే చదివితిమి. ఆంధ్రభాషలో రచించి ఆంధ్రులకు విజ్ఞానదాయకముగా మహోపకార మొనర్చిన వీరి కృషి శ్లాఘనీయము. మత సామరస్యముతోబాటు ఆధునిక విజ్ఞాన విషసూచకముగా ఆంధ్రమున, రుద్రభాష్యమును రచించుట, అద్భుతానందకరము. ఇది వైదిక విజ్ఞాన శాక్తాద్వైత జ్ఞానదాయకముగూడ నగుట శ్లాఘ్యము. విష్ణుపరముగా అర్థమును వ్రాసి అద్వైతాసక్తిని వీరు కల్గించినారు. బహుభాష్య విషయసహితముగ విరాటోద్యోగ పర్వములను విరచించినారుడు ముదావహము. వైదిక విజ్ఞానదాయకముగ సౌరారుం రహస్యాది గ్రంథములను రచించి శ్రీ శర్మగారు వానిని సైతము లోకమునకొసంగి, ఆంధ్రప్రజానీకమునకు అనేక తత్త్వార్థములను, ధర్మగ్రంథ తత్త్వములను దెలియజేయుదురు గాక. ఈ విధముగా లోకమున కుపయోగపడుటకు దగిన శక్తిని, ఆయురారోగ్యాదులను ఈ గ్రంథకర్త రాజేశ్వరశర్మగారికి పరమేశ్వరుడొసంగి, శ్రేయస్సును జేకూర్చునుగాక యని ఆశీర్వదించుచున్నాము.

ఇతి నారాయణస్మృతిః

యాత్రాస్థానము
పాలఘాటు
తే 15-5-'82
దుందుభినామ సం॥ త్సర
వైశాఖ బహుళ అష్టమి ఆదివారము





జగద్గురు శ్రీశ్రీశ్రీశ్రీమదభినవ విద్యాతీర్థస్వామివారు
శ్రీ శృంగేరి జగద్గురు మహాసంస్థానము - శారదాపీఠము - శృంగేరి

# ఆశీస్సు

తమరు ఒసంగిన అర్థపంచక సహిత శ్రీ రుద్రాభిషేక మాహాత్మ్యము మద్రాసులో యాత్రాస్థానమున అందినది. శ్రీవారి సన్నిధినుంచగా వారు ఆ గ్రంథమును అచ్చటచ్చట నవలోకించి చదివిరి. గ్రంథకర్త కృషిని ప్రశంసించినారు. ఇట్లే ఉత్తమమైన వేదార్థప్రకాశక గ్రంథములను ప్రకటించుచు శ్రీహరికోట తెలుగు సారస్వత సంఘమువారు ఆంధ్రలోకమునకు మేలు చేకూర్చుదురు గాక యనియు, గ్రంథకర్త లోకమునకు వేదవిజ్ఞానమును అందిచ్చుచు, అభివృద్ధిని చెందును గాక యనియు, శ్రీవారు ఆశీర్వదించిరి.

యాత్రాస్థానము
మద్రాసు - జనవరి నెల 1982

నారాయణశాస్త్రీ



శ్రీశ్రీశ్రీ జనార్దనానంద సరస్వతీస్వామివారు

శంకరమఠము - విశాఖపట్టణము

( సలక్షణ ఘనాపాఠీ, వేదార్థప్రకాశక

శ్రీ కుప్పా లక్ష్మణావధానిగారు పూర్వాశ్రమ నామధేయము )

# మౌఖికాభిప్రాయము

తే 19—2—1982

శ్రీ జనార్దనానంద సరస్వతీ స్వాములవారికి శ్రీ రుద్రాభిషేక మాహాత్మ్య గ్రంథమును ఒసంగగా వారు స్థాలీపులాకన్యాయముగా జదివి చెప్పిన విషయము ఏమన? "వేదోక్త ధర్మరక్షణ ప్రచారములకు ఉపయుక్తమగునట్లు ఈ గ్రంథము చాల శ్రమదీసికొని రూపొందించినారు. మీ బృహత్తర పరిశ్రమకు నేను చాల ఆనందించితిని. "తిస్ర ఉత్తరా ఆహుతీర్జుహోతి" అనుచోట "ఉత్తరా హుతులను" అని చెప్పవలెను. "బ్రహ్మవిద్యా రూపత్వాత్ ఉపనిషన్మంత్రాః ప్రశ్నః" అనుచోట "ప్రశ్నః" అను పదమునకు ప్రపాఠకము అని యర్థము": అని వారు వాక్రుచ్చినారు. ఈ వాక్యములను వారి ఛాయాచిత్రము చెంతను అచ్చొత్తించుటకు అనుమతి నొసంగిరి. ఇది వారు సన్న్యాసదీక్ష కవిరుద్ధముగా మౌఖికముగా నొసంగిన అభిప్రాయము.

ఇతి. శమ్. ఓమ్.



## శ్రీ నమక భాష్య స్మారక చిహ్నము

*గ్రంథకర్త అత్తమామలు*



బ్రహ్మశ్రీ మోపేకుర్తి వేంకటసత్యనారాయణశాస్త్రిగారు,

వారిసతీమణి శ్రీమతి సుభద్రమ్మగారు

— శ్రీ గురుభ్యోనమః —



శ్రీ సామవేదం సూర్యనారాయణశాస్త్రి

సాహిత్య విద్యాప్రవీణ, ఉభయభాషా ప్రవీణ

విశ్రాంత సంస్కృతోపాధ్యాయుడు — శ్రీకాకుళం

యం. హెచ్. స్కూల్. — 26-3-82.

# -: సమ్మోదవచనము :-

"తత్త్వాన్యప్యుపదేష్టుముత్తమగురూన్ దత్వానుగృహ్ణాతినః"

శ్రీ వేంకటాధ్వరిః

పాఠకమహాశయులారా!

పరమకారుణికుడగు భగవానుడు స్వస్వరూపజ్ఞానరహస్యముల నుప దేశించుగురువర్యులను మనకు లభింపజేయుచు మనల ననుగ్రహించుచున్నా డని శ్రీ వేంకటాధ్వరుల సూక్తిసుగంధరాజము స్మరింపజేసినది.

మనము పురాతన నానాజన్మకర్మఫలముల ననుభవించుటకనేక జన్మములను బొందుచున్నాము. సుకృత విశేషమునచే జననమున జ్ఞానము కలుగునో వెంటనేముక్తులగుదుము. ఇందులకు "జ్ఞానేన మోక్ష మాప్నోతి" మొదలగు ప్రమాణములెన్నియో గలవు. అంతవరకు "పునరపిజన నం పునరపిమరణం పునరపి జననీ జఠరేశయనమ్" అను శ్రీమచ్ఛంకర భగవత్పాదులవచనానుసారము సంసారచక్రమున పరిభ్రమింపవలసినదే. జ్ఞానయోగులు విచారణచే సుఖదుఃఖాత్మకమగు సంసారము తమకు ప్రకృతి సంబంధమువలనగలిగినదని తాము యథార్థముగ అసంగచిద్రూపుల మని తమకు ప్రకృతి సంబంధములేశ గూడలేదని శ్రవణ మనన నిదిధ్యాసనము లచే అనుభవమును సంపాదించి ముక్తులగుదురు. మఱికొందఱు దృఢమగు వైరాగ్యముకలవారై "త్వమేవశరణం మమ" అని చిత్తము స్వేష్టదేవతాయత్తము గావించి తత్స్వరూపమును భావించుచు ఆతనిగుణములను కీర్తించుచు అర్థ జ్ఞానముతో తన్నామసంకీర్తనము చేయుచు నందే నిమగ్నులయ్యెదరు. స్థూల భక్తియేయిట్టి సూక్ష్మభక్తినిగలిగించును. అప్పుడు భగవంతుడువారి హృద యమునందే నివసించును. "నాహంవసామివైకుంఠే" అని గదా భగవద్వచ నము. వారిహృదయమున నివసించి "తేషామజ్ఞానజంతమః" నాశయామ్యాత్మ

భావస్థోజ్ఞానదీపేనభాస్వతా" అని గీతాచార్యులు భక్తులరక్షించు విధములు చెప్పినారు.

భాగవతములో "సాధవోహృదయంమహ్యంసాధూనాంహృదయంత్వహమ్।
మదన్యత్తేనజానన్తినాహంతేభ్యోమనాగపి" అని కలదు.

మఱియు "సాక్షాత్తత్వమసీతివేదవచసాయోబోధయత్యాశ్రితాన్।
అని భక్తులకు మహావాక్యబోధను తానేచేయునని,

"స్వాత్మానం ప్రకటీకరోతిభజతాంయోభద్రయాముద్రయా"

అనీయుదక్షిణామూర్తిస్తోత్రమున భక్తులకభయమొసంగుచు, ఆత్మస్వరూప మును ప్రకటించును; అని కలదు. కాన భక్తినిరపాయమగుఉత్తమమార్గము. కాని అదియు నందఱికిగలుగదు.

"నమాందుష్కృతినోమూఢాఃప్రపద్యన్తేనరాధమాః।
మాయయాపహృతజ్ఞానా ఆసురంభావమాశ్రితాః"

మాయచేవారిజ్ఞానముదొంగిలింపబడినట్లు జ్ఞానములేనివారై మూఢులుక్రూర కర్మములను జేయుచు తృప్తినొందుదురుగాని నన్ను శరణుపొందరు; అని ఒకచోట, మఱియు, మఱియొకచోట

"తానహంద్విషతఃక్రూరాన్ సంసారేషునరాధమాన్।
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవయోనిషు॥"

అట్టివారెన్నిజన్మలెత్తినను నన్నుపొందలేరు. వారునాకుశత్రువులనికోపముతో భగవానుడు పల్కెను. కావున మనము మాయనుదాటుటకు భగవంతుని సేవించుటకంటె మఱియొకదారిలేదు. "మమమాయాదురత్యయా" అనియు, "మామేవయే ప్రపద్యన్తేమాయామేతాంతరన్తితే" అనియు శ్రీ కృష్ణభగ

వానులు సేవించినారు. కావున భక్తితో సేవించి వాని అనుగ్రహమును సంపాదింపవలెను. దానికి అనేకజన్మకృతపాపము ప్రతిబంధకమగుచున్నది. దురితక్షయద్వారా పరమేశ్వరప్రీతిని సంపాదింపవలెను. అందులకు స్వాశ్రమధర్మాచరణము అవశ్యకర్తవ్యము. చిత్తశుద్ధియు ప్రయత్నపూర్వకముగా సంపాదింపవలెను. దానికై మనపూర్వులు సదాచారసంపత్తిని నిత్యకర్మానుష్ఠానమును జరుపుకొనుచు నహంకారమమకారములవీడుటకై "ధియో యోనః ప్రచోదయాత్" అని మనస్సునకు నింద్రియములకు నేకాగ్రతను సంపాదించెడివారు. అనిత్యము అసుఖము అయినలోకమును బొంది వ్యామోహపడక సచ్చిదానందరూపుని సేవించెడివారు. సత్కర్మాచరణపరులు భగవత్స్వరూపమును తనకంటె వేరుగా భావింతురు.

"సర్వేవేదాయత్పదమామనన్తి" సర్వవేదవాక్కులు ఆపరమాత్మనే చెప్పుచున్నవి. అప్పరమేశ్వరుడు యజ్ఞాత్మక స్వరూపుడు. శ్రుతిస్మృతి విహితములగు యజ్ఞములు పవిత్రకర్మరూపములు. అందుచేనవి పరమేశ్వరరూపములు "యజ్ఞోవైవిష్ణుః" అని తైత్తరీయము, "అహంక్రతురహంయజ్ఞః" అని భగవద్గీతావచనము "యజ్ఞో యజ్ఞపతిర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః యజ్ఞభృద్యజ్ఞకృద్యజ్ఞీ యజ్ఞభుగ్యజ్ఞసాధనః" అని శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రములోను చెప్పబడినది కాన యజ్ఞములు యజ్ఞాంగములును భగవంతుడే. భేదభక్తిలో తన ఉపాస్యదైవతమునకు స్వరూపకల్పనముచే తన చిత్తముదానియందు స్థిరపడును కరచరణాద్యవయవములందు పూజలు చేయుగల్గును. నిరంతర ధ్యానముచే తన చిత్తము ద్రవించును. అప్పుడందా దైవతస్థానము లభించును. దానితో అభేదభక్తియు నేర్పడును. మొదట భేదభావమున్నను క్రమముగా చిత్తశుద్ధినిబట్టి అభేదభక్తిగా నయ్యదిమారును. కాన భగవన్నామ జపము, అభిషేకము, హోమము, మొ॥ ప్రక్రియలుగల ఈగ్రంధరాజము, కర్మయోగులకు, భక్తులకు, జ్ఞానులకు నుపయోగపడుచున్నదని సుస్పష్టము.

జ్ఞానేన మోక్షమాప్నోతి భక్తిర్జ్ఞానాయ కల్పతే।
కృష్ణప్రసాదాద్భక్తిస్స్యాత్తస్మాత్సేవ్యో హరిస్సదా॥

అనుటవలన మనయందున్న అసురభావము తొలగుటకు భగవత్సేవ దానివలన భగవదనుగ్రహము తరువాత పరాభక్తి దానివలన జ్ఞానము, జ్ఞానమువలన మోక్షముగలుగుటకీ రుద్రాభిషేకమాహాత్మ్యమను గ్రంథమన్నివిధముల సహాయపడుచున్నది.

కరుణాకరుడగు పరమేశ్వరుడు తన అంశలైన జీవులను దుస్తరాపార సంసారసాగరమునుండి తరింపనెంచియెన్నోయుపాయములను కల్పించెను. వానిలో ప్రధానమైనదివేదవాఙ్మయము. కాని అది సంస్కృతపండితులకు శాస్త్రజ్ఞులకుగూడ దురవగాహము. అందుచే సాయణాది మహర్షులు వేదములకు భాష్యములవ్రాసిరి. అయినను సామాన్యులుగూడ దానిని గ్రహించి ఉపయోగించుకొనవలెనని శ్రీ తిరుమలదేవస్థానమువారు వానికర్థాదులను పండితోత్తములచే తెనుగునవ్రాయించి ప్రచురింపఁజేయుచున్నారు.

ఆట్టి సత్సంకల్పము తమంతట తమకేకలుగగా "భక్తిపరులగు శ్రోత్రియులు నిత్యకర్మానుష్ఠానమున ఆదరముచే అంధప్రాయముగానైనను పారాయణము అభిషేకముహోమము, మొ॥ వానికి విధ్యుక్తమని నమకచమకములను గ్రహించుటనుజూచి, అర్థజ్ఞానముతో వీరుజరుపు[illegible]యని తలంచి, చి. నాశిష్యుడు రాజేశ్వరశర్మ "శ్రీ రుద్రాభిషేకమాహాత్మ్య" మను పేర, శ్రీ నమకచమకభాష్యాంధ్ర వివరణముతో యజ్ఞ—శివ—విష్ణు శాక్తాద్వైత-విజ్ఞానశాస్త్రపరములగు నర్థములవివరించుచు, (అర్థపంచక సహితముగా) గ్రంథరాజమును సకలజనోపయోగముగారచించినాడు. కాన ఇది మహోత్తమగ్రంథరాజమై యొప్పుచున్నది.

ఈ గ్రంథకర్తసదాచార సంపత్తిగల శ్రోత్రియకుటుంబమున జన్మించెను. బాల్యమునుండి సద్గుణములతో పెరుగుచుండెను. వీరిసుగుణములలో భగవద్భక్తితోబాటు తల్లిదండ్రులయెడ భక్తియునగ్రగణ్యమే. ఉపనయనముకాగానే పితృపాదులనుండియు గురువరేణ్యులనుండియు మంత్రదీక్షను గ్రహించి దేవతోపాసన నారంభించిన మహాభక్తుడు. అవ్యాహతముగా పరీక్ష

లందుత్తీర్ణుడయి ప్రాచ్యవిద్యాబిరుదద్వయాంకితుడాయెను. శ్రీ కాకర్లోన్నత పాఠశాలకు ప్రధానాంధ్రోపాధ్యాయుడై శ్లాఘ్యముగా పదవిని నిర్వహించుచు వాసిగాంచెను. విరామసమయములందు అత్యంతాసక్తితో వేదవిద్యనభ్యసించెను పరోపకారమునకు వైద్యము బహూపకారియని దానిని అభ్యసించెను నిరన్తరకృషిచే సిద్ధుడై వ్యాసమహర్షి విరచితమైన మహాభారతమందలి సనత్సుజాతీయమును ఆమూలాగ్రముగా పరిశీలించి, చక్కని తెనుగున అందఱికి నందుబాటులోనున్నట్లు వివరణపూర్వకముగా ఉద్గ్రంథమును రచించెను. ఇప్పుడు వీరీమహాగ్రంథమును అర్థపంచక సహితముగా భాష్య వివరణములతో తీర్చిదిద్ది ప్రచురించి కృతార్థుడాయెను. ఈవిధముగా శ్రుతి మాత ప్రసాదమును పొందినందులకు నాకు సమ్మోదము ఇక గ్రంథమును గూర్చి, గ్రంథరచననుగూర్చి నిరూపించుకొన్నియంశములను జూపెదను. గంభీరమును అతివిశాలమునగు నిందలివిషయములన్నియును ముఖ్యములే. ప్రతిమంత్రమునకు నర్థతాత్పర్యములు కలవు. సాయణాచార్యభట్టభాస్కర భాష్యముల వివరణము చక్కగా సాగినది విశిష్టవిమర్శయుతముగా అర్థ పంచకము, పురశ్చరణము ధ్యానశ్లోకతాత్పర్య విశేషములు పాఠకుల [illegible]కు హత్తుకొనునట్లు విరచింపబడెను. పెక్కువిషయములసంకలనము గ్రంథమును విస్తరింపజేసెను. మఱియు బీజాక్షరసంపుటికొక ప్రత్యేకతకలదు. మంత్రములలోని బీజాక్షరములను, వానియధిదేవతలను, వారి శక్తులను తెలియజేయుచు మంత్రజపమువలన గల్గుసిద్ధులను విశదీకరించెను. మంత్రములలోని నామములకు అనేక నిఘంటువులనుబట్టియు, వ్యాకరణ శాస్త్రముననుసరించియు. వివిధార్థములు, వాని వ్యుత్పత్తులును విశదపఱచబడినవి. అర్థాన్తరములు, విశేషములు బాగుగాపొందుపఱచబడినవి. మంత్రములనెన్ని పర్యాయములు జపింపవలెనో వానిఫలములెట్టివో ఏయేవస్తువులతో, హోమములెట్లు జరుపవలెనో అను ప్రక్రియలు స్పష్టముగాగలవు. రుద్రాది పదముల వ్యుత్పత్తినిబట్టి యనేకార్థములను దెలియజేసెను. పాపక్షయము, ఐహికాముష్మిక సౌఖ్యము, రోగనివృత్తి, గ్రహారిష్టశాంతి, శత్రుజయము,

భగవత్సాన్నిధ్యము, భగవత్సారూప్యము, మోక్షము సిద్ధించుప్రక్రియలు అద్భుతముగా వివరింపబడినవి. సమారాధిత దక్షిణామూర్తియగు నీతడు తన సంపూర్ణశేముషీ వైభవముచే గ్రంథము రుద్రాధ్యాయమేయయినను ప్రతినామమునకు శివకేశవపరములయిన రెండర్థములను సప్రమాణముగా నిరూపించి, కృతార్థుడాయెను. గ్రంథమందంతటను శ్రుత్యర్థముల నిరూపించుటకు స్మృతులు, భగవద్గీతా విష్ణుసహస్రనామస్తోత్రములనుండి ప్రమాణములనే కాక, భాగవతాది పురాణములనుండియు, భారవి కాళిదాసాది కవుల కావ్యములనుండియు, వేయేండ్ల శతకములనుండియు ప్రమాణములనిచ్చుచు తన బహుగ్రంథపాండిత్యమును వెల్లడిచేసెను.

రుద్రుడే పరమాత్మయనియు, అతనిరూపాన్తరములే, మూర్తిత్రయమనియు, దిక్పాలురనియు, పంచభూతములనియు, సూర్యచంద్రులనియు, త్రిభువనములనియు, నిదియదియననేల వ్యక్తావ్యక్తములన్నియు రుద్రుడే అనియుపనిషత్ప్రతి పాదితార్థము తరచితరచి, యపరోక్షముగావించెను. శక్తిత్రయము అది శక్తికంటె భిన్నముకాదుగదా! మూలప్రకృతి స్వరూపమును దానిరూపాన్తరములను నిస్సందేహముగా నిరూపించెను.

ఒకే పరమాత్మ ఇంద్రమిత్రాదిరూపములగలడనియు, అతనినే అనేకవిధనామముల చెప్పుచున్నారను విషయము ఋగ్వేదాంతర్గత సారమున

"ఇంద్రంమిత్రంవరుణమగ్నిమాహురథోదివ్యః ససుపర్ణోగరుత్మాన్।
ఏకం సద్విప్రాబహుధావదన్తి అగ్నింయమంమాతరిశ్వానమాహుః"

అని కలదుకదా!

7 వ మంత్రార్థమున రుద్రుడే ఆదిత్యుడని, అతనికి భక్తిపూర్వకముగా నమస్కారములనర్పించిన, బోదకాలు, మూర్ఛ, కేన్సర్, ॥మొ॥; అరుణపారమంత్రములతో ప్రార్థనముచేసిన, బొల్లిమచ్చలు, కుష్ఠువ్యాధిమొ॥ నివారింపబడునని చెప్పబడెను. సూర్యరశ్ములు రుద్రుని అనుచరులని ధ్యానించుట, స్తుతించుట జీవుల కర్తవ్యమనియు జెప్పబడెను. అయానాపు బీజాక్షరనిగదితవస్తుసంపుటీకరణముచే, వ్యోమనౌకల్ను సృష్టించుట, నూతన సృష్టినావిర్భవింపజేయుట, వాయుస్తంభనము, భూమిలోగలలో హస్తితైలాదివసువుల

గని పెట్టుట జరుగనని చెప్పబడెను. ఏయేమంత్రము జపముచే అణిమాది సిద్ధిసాధనము, లంబికాయోగమున వాయుస్తంభనము, సావిత్రియొక్కయు గణపతియొక్కయు సాక్షాత్కారము, శక్త్యుపాసనము, భూతవైద్యము ఇంద్రియజయము, సకలైశ్వర్యసంపాదనము, మొ॥ ఫలితములేర్పడునో వివరింపబడెను ఇట్టి విపహస్రాధిక విశేషములుగలవు చ. వి గ్రహింపవలయునుగాని వ్రాయవలసికాదు. ఈ ఉత్కృష్టగ్రంథస్థరహస్యములు సూర్యరశ్ములవలె, సముద్రరత్నములవలె సంఖ్యాతీతములని ఈతడు వ్రాసిన గ్రంథమువలన సందఱు తెలుసుకొందురుగాక.

మఱియు "భిన్నరుచిర్హిలోకః" అనునట్లు ఇందుగల విశేషములలో అతివిశేషము, రహస్యములలో నతిరహస్యమైనదిగనా, శ్రీ విష్ణుసూరి కృత భాష్యము. అయ్యదియెంతో రుచికరము. కావుననే. చి. శర్మతుదిని ప్రత్యేక శ్రద్ధతో నుంచినాడు జీవుడు కర్మయోగియై, భక్తుడై. ఉపాసకుడై, తుదక భేదభావమున నద్వైతియగునుగనా! ఒకస్థితికివచ్చిన అభేదభక్తునకు అయ్యది సుబోధమగుననుకొందును. తపనగల సత్పురుషులు సంగ్రహింపవలెనుగదా!

ఇందెన్నోరహస్యములుగలవు. వానినన్నింటిని ప్రథమానువాకము మొ॥తుదివఱకు తెనుగున గ్రంథకర్త మనకందించినాడు. మనమద్దానిని మననముచేయుటయే వానికృషికిఫలము. మనకు ఋణవిముక్తి. ఇంతటితో పాఠక సోదరుల సెలవుతీసికొనుచున్నాను.

వీని ధర్మపత్ని అన్నిటవీనికి సహకరించు సద్ధర్మచారిణి; పవిత్రశీల, సత్కులసంజాత పెద్దల తపస్సు వీని సత్కుటుంబమునకు అభివృద్ధిని, భగవదనుగ్రహమును, సకల శుభసంపదలనిరంతరము చిరకాలమును ప్రసాదించుగాక.

నా శిష్యుడు చిరంజీవి శర్మ ఇట్టి సద్గ్రంథములను పాఠకలోకమునకింకను వ్రాసియిచ్చుటకు సర్వేశ్వరుడు చిరాయురారోగ్యైశ్వర్యాది సకల శుభములను వీనికి ప్రసాదించుగాక. ఇదియే నా సమ్మోదవచనము.

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః                ఇట్లు

సా. సూర్యనారాయణశాస్త్రి



సంపూర్ణ గ్రంథోద్ధారకులు

శ్రీ B.T.A. రామాచార్యులు గారు, శ్రీమతి వెంకటలక్ష్మితాయారు, వారి చిరంజీవులు.



కళాప్రపూర్ణ

డా. దివాకర్ల వేంకటావధాని

ఎమ్. ఏ. (ఆనర్స్) పిహెచ్. డి.

# అభిప్రాయము

వేదశాస్త్ర పండితులు, సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ బిరుదాంకితులు, అధీతయజుర్వేదులు, ఆంధ్రపండితులుగా పనిచేసి విశ్రాంతి నొందినవారు నైన, బ్ర. వే. శ్రీ తెలికిచర్ల రాజేశ్వరశర్మగారు రచించిన శ్రీ రుద్రాభిషేక మాహాత్మ్యమను పేరుగల నమకచమకాంధ్రభాష్యము నందందు పఠించి యానందించితిని. శ్రీ శర్మగారాంధ్రగీర్వాణములందు మంచి పండితులగుటయేకాక యజుర్వేదమునంతను సంప్రదాయసిద్ధముగా నధ్యయనము కావించిన పుణ్యాత్ములు. వారు మూడు నాలుగేండ్లక్రింద రచించి ప్రచురించిన సనత్సుజాతీయాంధ్రభాష్యమును పఠించి వారి ప్రతిభా పాండితీ పాటవముల కచ్చెరువందియుంటిని. అట్టివారిప్పుడు నమకచమకముల కర్థపంచక వివరణపూర్వకముగా నాంధ్రమున భాష్యము సంతరించుట వేదార్థ జిజ్ఞాసువులైన యాంధ్రుల సుకృత విశేషము.

వేదత్రయిలో నడిమిది యజుర్వేదము. అందు నడిమిదైన చతుర్థ కాండమున నమకచమకములున్నవి. శివుడు పరబ్రహ్మ స్వరూపుడు. అతనికిఁ గల పెక్కునామములు చతుర్థీ విభక్త్యంతములుగను నమశ్శబ్ద పురస్సరములుగను

నమకమున చెప్పబడినవి. నమకము నుపనిషత్తుగా భావించు సంప్రదాయము కూడ నున్నది. "చమే, చమే" అని పఠించువారికి కావలసిన వస్తువులన్నియు పేర్కొనబడియుండుటచే చమకమునకా పేరు సార్థకమైనది. యజుర్వేదము నంతను అధ్యయనము చేసినను చేయకపోయినను, పలువురు ప్రాధాన్యమునుబట్టి నమకచమకములనైన నధ్యయనము చేసి, తన్మంత్ర పఠనపూర్వకముగా రుద్రాభిషేక మొనరించి ధన్యాత్ము లగుచుందురు. నమకచమకముల అధ్యయనమువలన బ్రహ్మహత్యాది మహాపాపములుకూడ పటాపంచలై పోవునని పెద్దలు చెప్పుదురు.

సాయనాచార్యులవారు వేదముల కన్నిటికిని భాష్యము రచించియుండిరి. భట్టభాస్కరులు యజుర్వేదమునకు రచించిన భాష్యముకూడ లభించుచున్నది. విష్ణుసూరి నమకచమకములకు ప్రత్యేకముగా భాష్యము వెలయించియుండెను. ఇవన్నియు సంస్కృతమున రచింపబడియుండుటచే విద్వదేకవేద్యములు. సాయనాచార్యులవారు యజుర్వేద మంత్రములకున్న బహుళార్థముల నెఱింగియు వేదాన్తార్థము విగూఢముగుటచే సామాన్యులకు దురవగాహముగా నుండుననను నుద్దేశమున యజ్ఞపరమైన అర్థమునుమాత్రము వివరించియుండిరి. "జ్ఞానహేతుత్వమత్యస్య తథోపవిషదీరిత"మ్మని వారు భాష్యమున నుడివియున్నారు. అన్యులర్థాన్తరములను కూడ విశదీకరించి లోకోపకారము కావించియున్నారు. వేదశబ్దము "విద్" ధాతువునుండి యేర్పడినది. అది దాని సర్వజ్ఞానమయత్వమునకు తార్కాణము. వేదములను వల్లించు వారచ్చటచ్చట కనిపింతురు. కాని తదర్థవేత్త లంగుళీ సంఖ్యేయులుగా నుందురు.

శ్రీ రాజేశ్వరశర్మగారు భాష్యములన్నియు పఠించి నమకచమకములకుగల యర్థము నాంధ్రభాషలో వివరించియున్నారు. అందును వానికి యజ్ఞపరముగను, శివపరముగను, విష్ణుపరముగను, విజ్ఞానశాస్త్రపరముగను, శాక్తాద్వైతపరముగను కూడ నర్థములను, విశదీకరించుట వారివంటి మహాపండితులకు తప్ప నన్యులకు సాధ్యముకాని పని. సాధారణముగా పండితులకు విజ్ఞానశాస్త్రములో పరిచయ ముండుట అరుదు. అట్లే విజ్ఞానశాస్త్రవేత్తలకు సంస్కృతభాషా పరిచయ ముండుటయు మిక్కిలి యరుదు. అందుచే వేదములందిమిడియున్న విజ్ఞానశాస్త్ర విషయములు అస్ఫుట స్ఫురితములుగనే యుండిపోయినవి. శ్రీ శర్మగారు

విజ్ఞానశాస్త్రవేత్తలనుండి మాయాశాస్త్రములకు సంబంధించిన విషయముల నెఱింగి యీ భాష్యమునందు సమన్వయము కావించియున్నారు. ఇది యెంతయు ప్రశంసింపదగిన విషయము. ఈ ప్రయత్నము విజ్ఞానశాస్త్రవేత్తల దృష్టినికూడ వేదములవైపు మళ్ళించుననుటలో సందేహము లేదు. శ్రీ శర్మగారు భాష్యమునందు భాగవత భారతాది గ్రంథములనుండియు, కాళిదాసాదుల కావ్యములనుండియుకూడ సందర్భోచితముగా పెక్కు పద్యములను శ్లోకములను ఉద్ధరించియున్నారు. ఇది వారి బహుగ్రంథపఠనమునకును, పాండితీశౌందర్యమునకును పరిశోధన పాటవమునకును నిదర్శనము.

ఆంధ్రభాష్యమున తొలుత ప్రతిపదార్థమును తాత్పర్యమును, తరువాత సాయనాచార్య భాష్యగత విషయములును, పిమ్మట భట్టభాస్కర భాష్యగత విషయములును వివరింపబడినవి. అవసరమైనచోట్ల ధ్యానశ్లోకములుద్ధరింపబడినవి. ఈ శ్లోకములందలి విశేషణములుకూడ మంత్రములందలి విశేషణముల అర్థమునే వివరించుచుండును. శ్రీ శర్మగారు పురశ్చరణ విధానమును ఆయా నామములందు గల బీజాక్షరవిన్యాసమునుగూడ వ్యక్తముచేసియున్నారు. నమకమునందలి వివిధ నామములకు వారు నిఘంటు నిర్దేశపూర్వకముగా కావించిన బహుళార్థ వివరణము సమంజసమును పాండితీస్ఫోరకమునై యున్నది. ఒక్క రుద్ర శబ్దమునకే భాష్యకారులెన్నో యర్థములను చెప్పియున్నారు. శ్రీ శర్మగారు వానినన్నిటిని సర్వసుబోధముగా వివరించియున్నారు. కొన్నిచోట్ల భాష్యకారులు సంగ్రహముగా నర్థముచెప్పి యూరకుందురు. అట్టియెడ శ్రీ శర్మగారు స్వప్రతిభోచితముగ నాయా భాగములందిమిడియున్న గంభీరార్థమును వ్యక్తముచేసి యున్నారు. "నమస్తేఽస్తు భగవన్విశ్వేశ్వరాయ" మున్నగునవిందుకు దృష్టాంతములు. కొన్ని మంత్రములకు వినియోగమునుకూడ వారు తెల్పియున్నారు. ఆ విధముగా హోమాదుల నొనరించుచో వాంఛితార్థప్రాప్తి కలుగుట నిస్సంశయము.

గ్రంథాంతమున శ్రీ శర్మగారు శ్రీ విష్ణుసూరి భాష్యమును ఆంధ్రీకరించియున్నారు. ఇది శాక్తాద్వైత పరమైనట్టిది. విష్ణుసూరికృత భాష్యార్థమును చక్కగా నాకళించుకొన్నవారికి అజ్ఞానము తొలగును. సంసార బంధములు పాయును. జననమరణ కారణములగు కర్మబంధములు విచ్ఛిన్నములగును.

వారు యోగనిష్ణాతులై, మోక్షము నొందుదురు. దేనిని జపించినచో అమృతత్వము కల్గునని యడిగిన జాబాలికి యాజ్ఞవల్క్యుడు శతరుద్రీయముచేతని సమాధానము చెప్పెను. నమకము శతరుద్రదేవతాకమగుటచే దానికి శతరుద్రీయమను నామము కలిగినది.

ఈ విధముగా శ్రీ శర్మగారు కావించిన కృషి సర్వాంధ్ర జన శ్రేయో దాయకమైనది. వారు తాము తరించుటయే కాక తోడివారికిని తరణోపాయము చూపినారు. పరోపకారాయ సతాం విభూతయః. వారు భయభాషలందును మేటి పండితులగుటచే, నీ కార్యము నింత నిర్దుష్టముగను సమగ్రముగను చేయజాలిరి. వారి భాష వారి హృదయమువలెనే నిర్దోషమును నిరాడంబరమును నిర్మలమునై యున్నది. సాయనాచార్యులవారి గురువు విద్యాతీర్థ మహేశ్వరుడని చెప్పుదురు. ఆ పదమునకు శ్రీ శర్మగారు పరబ్రహ్మపరముగా కూడ నర్థము చెప్పియున్నారు. "గురుస్సాక్షాత్ పరబ్రహ్మ" అని కదా అభిజ్ఞుల సూక్తి. శ్రీ శర్మగారు "వేద వేద్యే పరేపుంసి" అను శ్లోకమున వేదమే ప్రాచేతసుని ముఖమున రామాయణ ముగా వెలువడినదని చెప్పబడి యుండుటచే రామాయణముయొక్క వేదత్వమును వేదమంత్ర నిర్దేశపూర్వకముగా నిరూపింప యత్నించుచున్నారట. అది తప్పక చేయదగిన పని. వారికే సాధ్యమైనపని. ఈ విధముగా బ్రహ్మవాచ్యములైన వేదములందలి అర్థమును సర్వ సుబోధమొనరించుచు జగత్కల్యాణమునకు తోడ్పడుచున్న శ్రీ శర్మగారి ప్రయత్నములను నిర్విఘ్నముగా నెఱవేర్ప పరమే శ్వరుని ప్రార్థించుచు వారికి ఆశీస్సు లొసగుచు విరమించుచున్నాను.

విదుషా మగ్రగణ్యేన
శ్రీ రాజేశ్వర శర్మణా
కృతా వేదాంధ్రవాగ్వృత్తిః
జీయాదా చంద్ర తారకమ్

ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాదు

దివాకర్ల వేంకటావధాని
విశ్రాంతాంధ్రాచార్యుడు




*Dr. D. Arka Somayaji,*

M A , Ph D ,



Secretary
Hindu Dharma Rakshana Samstha
Recipient of Presidential Award
as a Sanskrit Scholar
and
Retd Principal
D N R College, Bheemavaram

బ్రహ్మశ్రీ పండితవర్యైః శ్రీమద్రాజేశ్వరశర్మభిః సంప్రతి శ్రీహరికోట నివాసిభిః రచితం శ్రీ రుద్రాభిషేక మాహాత్మ్యం బహోస్థ్వేషు మయాపరిశీలితమ్. గ్రంథోఽయం శ్రీ శర్మభిః కృతం మహాంతం పరిశ్రమం వ్యనక్తి. బహవో విషయాః హృదయంగమతయా ప్రతిపాదితాస్తత్ర. బహుముఖ పండితాః ఇమే శర్మాణః ఇతి నిశ్చప్రచమ్ - భగవాన్ పరమశివః ఇమాన్ పండిత ప్రకాండాన్ బహూనేతాదృశాన్ గ్రంథాన్ నిర్మాతుమను గృహ్ణీయాదిత్యాశీ సమానః

ధూళిపాళోపాభిధః అర్క సోమయాజీ

హిందూ ధర్మ రక్షణ సంస్థ
తిరుపతి
20-3-82



# విషయసూచిక

## మొదటిభాగము

# -: శ్రీ రుద్రనామానుక్రమణిక :-

## అకారాదిగ

### ప్రథమ ద్వితీయభాగములలో

| | | | |
|---|---|---|---|
| 118 | ,, | ధావద్భ్యః | 365, 966 |
| 119. | ,, | ధన్వాకృద్భ్యః | 411, 982 |
| 120. | ,, | ధృష్ణవే | 500, 1026 |
| 121. | ,, | నీలగ్రీవాయ | 149, 425, 1004 |
| 122. | ,, | నీలకంఠాయ | 173 |
| 123. | ,, | నిషంగిణే | 308. 313, 958, 959 |
| 124 | ,, | నిచేరవే | 325, 960 |
| 125. | ,, | నక్తంచరద్భ్యః | 337, 961 |
| 126 | ,, | నిషాదేభ్యః | 408, 981 |
| 127. | ,, | నీప్యాయ | 514, 1023 |
| 128. | ,, | నాద్యాయ | 518, 1029 |
| 129. | ,, | నివేష్ప్యాయ | 594, 1051 |
| 130. | ,, | నీలలోహితాయ | 627, 1060 |
| 131. | నమః | ప్రథమాయ | 134, 446, 1007 |
| 132. | ,, | పశూనాంపతయే | 198, 942 |
| 133. | ,, | పథీనాంపతయే | 204, 942 |
| 134. | ,, | పుష్టానాంపతయే | 217, 945 |
| 135. | ,, | పత్తీనాంపతయే | 286, 949 |
| 134. | ,, | పరివంచతే | 321, 960 |
| 135. | ,, | పరిచరాయ | 326, 960 |
| 136 | ,, | ప్రకృంతానాంపతయే | 339, 961 |
| 137. | ,, | ప్రతిదధానేభ్యః | 351, 964 |
| 138. | ,, | పుంజిష్ఠేభ్యః | 408, 981 |
| 139. | ,, | పశుపతయే | 198, 423, 1004 |
| 140. | ,, | పూర్వజాయ | 460, 1018 |

సూచన:- పునరుక్తనామములను విడుచుటచే 13 నామముల సంఖ్యతగ్గినది.

## -: కృతి సమర్పణము :-

*"మహాదేవస్వరూపస్య వేంకటేశస్యార్పణమ్!"*

(1) శ్లో॥ శ్రీ వేంకటేశస్సకలావనీశః కలౌయుగే భక్తజనార్థదాతా!
సవీవరుద్రోహరిరబ్జజాతస్సంహార సంరక్షణ సృష్టికర్తా॥

(2) శ్లో॥ మహాదేవో భూతరూప సూర్యచంద్రాగ్నిరూపభాక్।
చేతనా చేతనాకారో నమస్తే పథిదోఽభవత్॥

(3) శ్లో॥ దక్షగర్వాపహారీసన్ చమకేప్రతిపాతః॥
సర్వజీవన సంపత్తి ప్రదాతేతి నిరూపితః॥

(4) శ్లో॥ కలౌవేంకటరూపస్సన్ భక్తప్రార్థనతోషితః॥
దదాతిసర్వంభక్తానాం మార్కండేయాది రక్షకః॥

(5) శ్లో॥ తస్యభార్యామంగమాంబా శక్తిత్రయవిలాసినీ।
శ్రీవాణీ గిరిజారూపైస్సిత్యం భక్తైస్సుసేవితా॥

(6) శ్లో॥ వేంకటేశోమహాదేవో దక్షిణామూర్తిరూపభాక్।
దదౌమేరచనాశక్తిం ఆంధ్రసంస్కృతభాషయోః॥

(7) శ్లో॥ యత్ప్రసాదాదహం లక్ష్మీకాంతాకామేశ్వరాత్మజః॥
రాజేశ్వరశ్చ్యోరుద్రస్య మాహాత్మ్యే మలిఖంముదా॥

(8) శ్లో॥ రుద్రాధ్యాయస్య పఠనం అభ్యాసంకృతవానహో।
ఇతిమత్వాశ్రీనివాసః కృతవాన్ గ్రంథముద్రణమ్॥

(9) శ్లో॥ కృతినాథస్త్రిభాగస్య గ్రంథస్యాస్య సదాశివః।
నృసింహసూర్యరూపోయః కులదైవమ భూన్మమ॥

(10) శ్లో॥ యస్యాంబశివనామాభూత్ భక్తశ్శ్రీరామరుద్రయోః।
రచితోఽయం మహాగ్రంథస్తస్యకాంక్షాచికీర్షయా॥

(11) శ్లో॥ మోడేకుర్తికులేజాతః సత్యనారాయణాభిధః।
శ్వశురః శాస్త్రివర్యోమే మహావిద్వచ్ఛిరోమణిః॥

(12) శ్లో॥ అహంసాంబశివాఖ్యశ్చ తస్యజామాతరావుభౌ।
తస్యస్మారక చిహ్నోఽద్యోభాగో గ్రంథస్యనిశ్చితః॥

(13) శ్లో॥ ఈశ్వరాన్వయసంజాతః సత్యనారాయణాత్మజః।
సూర్యనారాయణాఖ్యోమే జీవనారోగ్యదాయకః॥

(14) శ్లో॥ తస్యస్మారకచిహ్నోఽయం ద్వితీయోభాగ-ఈరితః।
మయావిలిఖితోనూనం చమత్కార్థప్రకాశకః॥

(15) శ్లో॥ ఈశ్వరాన్వయసంజాతః సత్యనారాయణాభిధః।
జ్ఞానవిద్యాప్రదాతామే దాతౄణామగ్రణీస్సుధీః॥

(16) శ్లో॥ శ్రీశ్రీయానందనాథాఖ్యః శ్రీవిద్యాప్రథితోగురుః।
మహాగ్రంథప్రణేతాచ మహోపాసకశేఖరః।
తస్యస్మారక చిహ్నోఽయం శాక్తాద్వైతార్థభాగభాక్॥

(17) శ్లో॥ బుక్కపట్నం తిరుమలాఖ్యకులవారధి చంద్రమాః।
నృసింహాచార్యవర్యస్య పుత్రో నిష్కామకర్మకృత్॥

(18) శ్లో॥ ఆనందరామనామాయం శఠమర్షణగోత్రభాక్।
శ్రీవేంకటేశభక్తోఽయం ద్రవ్యమార్థిత్యసందదౌ॥

(19) శ్లో॥ రుద్రాభిషేకమాహాత్మ్యగ్రంథ ముద్రాణకారణం।
గ్రంథోయశ్చాంధ్రభాషాయాం రచితశ్శంకరాజ్ఞయం॥

(20) శ్లో॥ రామాచార్యం రామకృష్ణం మన్మిత్రందాశ్చమండలం।
అప్తవర్గం బంధువర్గం వేంకటేశ్వరరూపభాక్॥

(21) శ్లో॥ పాయాత్సదాశివోరుద్రో మత్కుటుంబంచమాంసదా।
ఆయురారోగ్యసంధాతా భక్తాభీష్టప్రదాయకః॥

## గ్రంథకర్త దంపతులు



శ్రీ తెలికిచర్ల రాజేశ్వరశర్మగారు
వారిసతీమణి
శ్రీమతి వెంకట పద్మనాభమ్మగారు

A1



—: శ్రీ సరస్వత్యై నమః :—

—: శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః :—

# నివేదన

— శ్రీకాకుళవాసి, శ్రీహరికోట నివాసి : శర్మ.

శ్లో॥ సదాశివసమారంభాం శంకరాచార్యమధ్యమాం।
అస్మదాచార్యపర్యన్తాం వందే గురుపరంపరామ్॥

"జన్తూనాం నరజన్మ దుర్లభమ్" అని శంఖారావముగావించినారు సద్గురువులు శ్రీ శంకరాచార్యులవారు. "నా జననంబున్ సఫలంబుఁజేసెదఁ బునర్జన్మంబులేకుండగన్" అని యెలుగెత్తిచాటినాడు భక్తశిఖామణిపోతన్న. కావునఁ బ్రతిమానవునకును బహుజన్మపుణ్యలభ్యమైన మానవజన్మతోఁ బునర్జన్మలేకుండ జేసికొనుటకుఁ బ్రయత్నించుటయేకదా! ముఖ్యకర్తవ్యము. అందులకు (1) వైదికధర్మమార్గపరత్వమును (2) ఆత్మానాత్మవివేచనమును ముఖ్యసాధనములు. ఆసాధనములను జేఁబట్టినవాడే "నానాఛిద్రఘటోదరస్థితమహాదీపప్రభాభాస్వరమైన" జ్ఞానమునార్జించుకొనఁగలడు. "యస్తు

విజ్ఞానవాన్ భవతియుక్తేనమనసాసదా। సతుతత్పదమాప్నోతియస్మాద్భూయో నజాయతే" అనుకఠోపనిషత్సూక్తిని ఆకళించుకొని, ఇంద్రియనిగ్రహుడై బ్రహ్మప్రాప్తికిఁ బ్రయత్నింపఁగలడు. అందుచే మానవుడు మూర్ఖలలక్షణమైన సతతనిద్రను విడనాడి, మేల్కాంచి, భారతుడై = జ్ఞాననిరతుడై "రుద్రోవా ఏషోఽగ్నిః" అను శ్రుతిలోఁజెప్పినట్లు అగ్నియైన రుద్రుని ఆరాధింపవలెను. ఈ విషయమునే "ఉత్తిష్ఠతమాన్వప్త, అగ్నిమిచ్ఛధ్వంభారతాః" అనెడి యారుణమంత్రము ప్రబోధించినది. పై విషయములను పెద్దలవలనవిని, వేదం = బ్రహ్మణంవేదయతీతివేదః" అను వ్యుత్పత్తినెఱింగి, బ్రహ్మవస్తు ప్రతిపాదకవేదములుగల రుద్రమును నా 19. వ. యేటనభ్యసించి, ప్రతి దినము పారాయణముచేయ దొడగితిని. రుద్రమనగా, "నమకము, చమకము." అది అధిలోకము; అధిజ్యోతిషము; అధివిద్యము; అధిప్రజము; అధ్యాత్మమును. అది నిగమాభరణము; కృష్ణయజుర్వేద సంహితలోఁ జతుర్థ కాండమున 5, 7 ప్రశ్నలలోఁగలదు. దాని ప్రభావమే, వేదమందలి అన్ని వన్నములందును వివరింపఁబడినది. బ్రహ్మాండమందలి భాషలన్నింటను అందలి విషయమే వివిధరూపముల వివరింపఁ బడినదనుట అతిశయోక్తి కానేరదు. "ఉత్తముల మహిమనీరుకొలది తామరసమ్మీ" అను పింగళి సూరన్నగారి సూక్తి నిత్యసత్యము. అధికారిభేదము ననుసరించియు, వేద పాఠకుని పాటవమునుబట్టియు ఉత్తమమైనవేదముయొక్క మహిమపాఠకులకు దెలియుచుండును. వారిలో వృద్ధిచెందును. తామరకు నీరువలె పాఠకులకుఁ బాటవము అవసరముకదా! విజ్ఞానఖనులగు వేదములందు రుద్రుని విషయము ప్రత్యక్షరమునందునుగలదనుట నిస్సంశయము రుద్రుడే అగ్నియై ఆయువు నొసంగును అతడే ఆదిత్యుడై ఆరోగ్యమును, సోముడై అన్నమును, దక్షిణా

మూర్తియై విద్యలను, విష్ణువై రక్షణను, బ్రహ్మయై సృజనశక్తిని జీవుల కొసంగును. గణపతియై సర్వకార్యవిఘ్ననివారకుడగును. షణ్ముఖుడై విజేత యగును. దేవమనుష్యాదుల కార్యనిర్వహణమున, దూతలగు,అగ్ని,హనుమ, శ్రీకృష్ణుడు మున్నగువారిలోఁ దేజస్విగానుండి క్షేమమును జేకూర్చును. అతడే పాపాత్ములకు భయంకరుడై, భక్తులకు భయవినాశకుడగును. అతడు చేతనాచేతనస్వరూపుడగుటచే సకలజీవులకును సకలమునొసంగును.

ఇంద్రాదిదేవతలందును, లతావృక్షాదులందును, రత్నాద్యచేతనములందును మహాశివుని మహిమకలదు కావున మానవులు ఏమికావలెనన్నను శ్రీ రుద్రాభిషేకముగావించి శివునకు లక్షపత్రిపూజలు ఒనరించెదరు. ప్రతి మానవుడు తొలుత స్థిరాసనుడై, స్థిరచిత్తుడై జ్యోతిర్మయవిష్ణుశంకర చిత్రము నెదుటనిడుకొని చెక్కుచెదరని చూపులతోఁజూచుచు ధ్యానించవలెను. పిమ్మట చిత్రమునుఁజూడక కనులుమూసికొని ధ్యానించవలెను పిమ్మట కాన వచ్చువస్తువలందెల్ల శంకర విష్ణువుల స్వర్ణతేజంబున ధ్యానించవలెను. ఇట్లు సగుణుడుగా తొల్తధ్యానించి, పిమ్మట నిర్గుణునిగాఁ దేజోరూపునిగా ధ్యానించవలెను. "సమంకాయశిరోగ్రీవమ్'' మున్నగు గీతాసూక్తులలో జెప్పినట్లు సమాధిలోనుండి మానసిక పూజను సదాశివునకు సమర్పించవలెను. ఇట్టి నిష్ఠ, తిష్ఠకుదురుటకే ఆసనములు నిర్ణయింపబడినవి. ఆహారనియమములు ఏర్పఱుపబడినవి ''అలంకారప్రియోవిష్ణురభిషేకప్రియశ్శివః" అను సూక్తిలో విష్ణువును అలంకరింపవలెననియు, శివునకు అభిషేకము గావింపవలెననియు జెప్పఁబడెను. అందుచేతనే సకలజనులును శ్రీ రుద్రాభిషేకముచేసెదరు. "శ్రీ'' అనగా ప్రణవము ఓంకారము. శ్రీ అనగా లక్ష్మి. రుద్రుడనగా శివుడు

# నివేదనము

కేశవుడు అభిషేకముఅనగాస్నానము స్నానమునకువాడుజలముప్రకృతి.ఆది శక్తి. శ్రీ రుద్రాభిషేకమున శక్తిశివులను, లక్ష్మీనారాయణులను ఏకాకారులను గావించి లింగమును పూజించుట జరుగునన్నమాట, శ్రీ రుద్రాభిషేకమునకు, జలము, క్షీరము, తైలము, తేనె,తిలలు,శ్వేతతండులములు, పెరుగు,ఆవునేయి, చెరకురసము, నారికేళజలము, శర్కరవినియోగించెదరు. కొబ్బరి, అరటి, వడపప్పు, పంచదార, పలువిధములగు ఫలములును నైవేద్యముగా పరమ శివునకు సమర్పించెదరు. మారేడుపత్రి, తులసిదళములు, పలువిధములగు పూలుతెచ్చి పూజించెదరు. బంగారు వెండినగలతో, రత్నాలంకారములతో మహాదేవుని అలంకరించెదరు. నవగ్రహబాధానివృత్తికి నవరత్నములతో శివుని అలంకరించెదరు. కావుననే మానవులు రత్నాభరణములను దాల్చెదరు శ్రీ రుద్రాభిషేకమాహాత్మ్యమును దెలిసికొనుటకు, ఆయావస్తువుల మహిమను ఇంచుకంత తెలిసికొనవలెనుగదా! అవి జీవులకెట్లుపకరించునో తెలిసి కొందముగాక. "భావప్రకాశిక" మున్నగు వైద్యశాస్త్రగ్రంథమును పరిశీలించి నచో శ్రీ రుద్రాభిషేకవస్తుమహిమ వైజ్ఞానికముగా వ్యక్తమగును. అదేమన?

(1) అపామార్గము (శ్వేతము, రక్తవర్ణము) ఇదియే ఉత్తరేణి ఇది దన్తవ్యాధులను నిర్మూలించును.

(2) అరటి. ఇది మధురపదార్థము. కఫహరము రక్తపిత్తదాహక్షయ వాతరోగనివారకము. మాంసకృత్తులను వృద్ధిచేయును.

(3) అరటిదుంపమూత్రవ్యాధిహరము. కేశములను నలుపుచేయును.

(4) ఆవుపాలు-పెరుగు-నేయి ఇవి అగ్నిదీపనకరములు శుక్రధాతు

వృద్ధికరములు. వాతనాశకములు, మూత్రకు పాండురోగాదులకు నివారకములు, ఆయుర్వృద్ధికరములు.

(5) తిలలు ఉష్ణకఫపిత్తహరములు. చర్మవాతరోగనివారకములై, స్థైర్యబలవృద్ధికరములై జీర్ణశక్తినిచ్చును.

(6) కొబ్బరి:-శైత్యకరము. జఠరాగ్నిదీపకము శూలవ్యాధినివారకము అపస్మారాదిరోగఘ్నము.

(7) చెఱకురసము మధురము, శీతలమునై, కఫవాతమూర్చాదిరోగహరమగును. బలముచేకూర్చును.

(8) ప్రతిస్తన్యవృద్ధికరము. ఉష్ణకరము వాతఘ్నము.

(9) తేనెవిషబాధాహరము.

(10) రజతము వాతపిత్తప్రమేహాదిరోగనాశకము.

(11) స్వర్ణము రక్తవృద్ధికరము క్షయవ్యాధినివారకము, ఊపిరితిత్తుల జబ్బులను దొలగించును.

(12) తామ్రము మధురము. శీతము, ఇంద్రియపటుత్వకరము. నేత్రరోగహరము. ఇట్లు పరిశీలించినచో శివపూజాద్రవ్యములన్నియు ఇంద్రాది దేవతాణుశక్తి సంపన్నములై, జీవులదేహములందు అణురూపమునగల దేవతల శక్తులను వృద్ధిచేయునని తెలియును. అందుచేతనే శ్రీ రుద్రాభిషేకమున కంతటిశక్తికలదని జనులెల్లరు తెలిసికొనియెదురుగాక గ్రంథవిస్తరభీతిచే

ఈ విషయమును ఇంతటితో ముగించుచున్నాను. ఈ విషయములన్నియును రుద్రమునఁగలవు. మతసామరస్యమునకు శ్రీ రుద్రము అటుపట్టు ఆధ్యాత్మిక విద్యకు ఆకరము. విజ్ఞానశాస్త్ర విషయములకు నిలయము. తన్నునమ్మి ఆరాధించువారికి మోక్షదాయకము. కావుననే ఐదు అర్థములతో రుద్రమును యథాశక్తి వివరించి ఆంధ్రమున వ్రాసితిని. ప్రాంశులభ్యఫలమునకు ఆశించు వామనుడువలె హాస్యాస్పదుడనగుదునేమోయను, నాయొక్క శంకను ఆరుద్రుడే తొలగించినాచే ఈ గ్రంథమును ఆంధ్రమున వ్రాయించి తన మహిమను దానే లోకమునఁ బ్రకటించినాడు.

వేదమంత్రములందు అధ్యాత్మికజ్ఞానముతోఁబాటు సకల ప్రాపంచిక విషయములునుగలవు. పెరుగును గవ్వమునఁదటిచి అందలి వెన్ననుదీసి మఱిగించి ఘృతమును గ్రహింతురు. అటులనే వేదమంత్రార్థములను బహు ప్రమాణములననుసరించి గ్రహించవలెను. "స్మృతిః ప్రత్యక్షమైతిహ్యం। అను మానశ్చతుష్టయమ్" అను శ్రుతిలోఁజెప్పినట్లు, స్మృతిని, ప్రత్యక్షానుమానము లను ఐతిహ్యములననుసరించి, అంతరార్థములను గ్రహించవలసియున్నది. "శక్తిగ్రహంవ్యాకరణోపమానకోశాప్తవాక్యైః వ్యవహారతశ్చ। సాన్నిధ్యత శ్శబ్దవిదోవదన్తి" అను ముక్తావళి సూక్తిలో జెప్పినట్లు వ్యాకరణమును, ఉప మానమును, కోశాప్తవాక్యములను, వ్యవహారమును, సాన్నిధ్యమును ఆధారముగాఁగైకొనియు, అర్థములను గ్రహించవలసియున్నది. అంతేకాదు శ్రీ మమ్మటాచార్యుడు స్వవిరచిత కావ్యప్రకాశికలో జెప్పినట్లు "సంయో గము, విప్రయోగము, సాహచర్యము" మున్నగు 14మార్గములననుసరించియు జాతిపదముయొక్కయు అర్థమును నిర్ణయించవలెను. అందుచే నేను పైన

## నివేదనము

బేర్కొనినట్లు ఐదు అర్థములను యథాశక్తి వివరించిచూపితిని.పాఠకులీ విషయ మును గ్రహించి, నన్ను క్షమింతురుగాక.

శ్లో॥ శరణం సద్గురుచరణం నిగమాభరణం భవాబ్ధిసంతరణం।
యత్పరిచరణం కరణమనిష్టనివృత్తేరభీష్టప్రాప్తేః॥

సద్గురుచరణము సర్వులకును శరణము (రక్షకము) గురుచరణసేవ అనిష్ట ముల నివారించి, అభీష్టము నొసంగును. సంసార సముద్రమును దాటఁగల జ్ఞానమునొసంగును. విద్యాజీవన దాతలు ఈశ్వరాంశసంపన్నులుకదా! వారి నామస్మరణము పాపపరిహారకమును విధ్యుక్తధర్మమునుగదా! కావున ఇప్పట్టున నాగురువుల నామములను, జీవనదాతలనామములను స్మరించు చున్నాను. మా తండ్రిగారు శ్రీ కామేశంశాస్త్రిగారే నాకు బ్రథమ ప్రధాన గురువులై సంస్కృతాంధ్రభాషాఖ్యాపసాధనిర్మాణమునకు బునాదిఁవాయి వేసినారు. పిమ్మట సాలూరుసందలి వేదసమాజపండితులైన శ్రీ పప్పు సుబ్బయ్యశాస్త్రిగారు, శ్రీ సామవేదం సూర్యనారాయణశాస్త్రిగారును గావ్య నాటక పరిజ్ఞానమునుజేకూర్చినారు. తర్వాత విజయనగర మహారాజావారి సంస్కృతకళాశాలలో సాహిత్యాచార్యులైన శ్రీ కట్టిశ్రీరామమూర్తిశాస్త్రిగారు వ్యాకరణాలంకారశాస్త్రాదులబోధించి, నాకు ఇంచుకంతజ్ఞానమును జేకూర్చి నారు. వేసవికాలపు సెలవులలో శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారు నాచే వేదాన్త విద్యాగ్రంథపఠనముచేయించి, తమ మనుమడు, డాక్టరు చి. సీతా రామధన్వన్తరితో మైత్రిచేకూర్చి, మా యిరువురికిని విద్యాపరీదాతృమంత్రము నుపదేశించినారు కళాశాలావిద్యాభ్యాసము ముగిసినపిమ్మట, ఇంటికడనే

# నివేదనము

యుండి భాషాప్రవీణపరీక్షకు జదువుచున్ననాచే శ్రీ త్రిరిణీ గంటి రామమూర్తి గారు రుద్రాదివేదభాగములను అధ్యయనము చేయించినారు. అప్పటినుండి 19 సం॥ ప్రాయముగలనేను నిత్యము రుద్రపారాయణము ఆచరించుచున్నాను శ్రీ ఈశ్వర సూర్యనారాయణశర్మగారు శ్రీ గైనేడి వెంకటరావు డాక్టరు గారును ప్రోత్సహింపగా శ్రీ వేమూరి రామచంద్రశాస్త్రిగారు (కమీషనర్) నాకు శ్రీకాకుళనగరమున M. H. స్కూలులో తే 1945-8-5 దీని ఆంధ్ర పండితోద్యోగము నొసంగినారు. వీరు ముప్పురునునాకు జీవనదాతలు. ఉద్యోగనిర్వహణకాలమున ఆప్తబంధువులు శ్రీ నాగవరపు సుబ్బారావుగారు (M. A; B. E. D.) ఆంగ్లభాషను గణితశాస్త్రమునుబోధించినన్ను ఆంగ్లభాషా పరీక్షలలో నుత్తీర్ణులగావించినారు పిమ్మట 50 సం॥ ప్రాయముననేను సలక్షణ ఘనపాఠి, ప్రభుత్వ సమ్మానితుడునగు బ్రహ్మశ్రీ. గంటి సూర్య నారాయణావధానిగారియొద్దను, శ్రీ కృష్ణయజుర్వేదమును సంపూర్ణముగా సలక్షణముగా అభ్యసించితిని. పైనఁ బేర్కొనిన నాగురువర్యులను,జీవనదాతల కును, నాశతాధిక నమోవాకములను సమర్పించుచున్నాను.

సంస్కృతభాషలో శ్లోకరూపమునఁ గవితనల్లుటయలవడినను గర్మానుసారిణియైన బుద్ధి ఉద్యోగజీవనముననన్ను జొనిపి, పరులకు ఉచిత విద్యాబోధన, నాచేఁజేయించినది. పెక్కురు పలువిధములైన పరీక్షలకువలయు విషయములను నాచెంత నేర్చుకొని కృతార్థులైరి అంతలో "గద్యంకవీనాం నికషంవదన్తి" అను వామనసూక్తిస్మరణకు వచ్చినది. వచనరచనగావింప వలెననెడి బుద్ధిపొడమినది. అందుచే, నానలుబదవయేట ఆంధ్రవచన రచన కుపక్రమించి, సంస్కృతమహాభారతమునందలి విరాటపర్వమును అష్టభాష్య విషయసహితముగను, ఉద్యోగపర్వమును బంచభాష్యవిషయసహితముగను శిష్టవ్యావహారికభాషలో వ్రాసితిని. ఉద్యోగపర్వాంతర్గతమగు శ్రీసనత్సు జాతీయమును (షడ్భాష్యాంధ్రానువాదసహితమును) గ్రాంధికబాషలో బ్ర. శ్రీ వే మాతండ్రిగారికోరికననుసరించివ్రాసితిని. ఇట్లుండమాతోటల్లుడు

ఆస్తికభక్తశిఖామణి, నవలారచయిత శ్రీ ఖండవిల్లి సాంబశివరావుగారు, శ్రీ రుద్రమునకు అర్థతాత్పర్యములను వ్రాసియివ్వనికోరిరి. అవుడించుకంత యాలోచించితిని. ఉపనిషత్తులకును సంస్కృతాంధ్రభాషలందలి కావ్యనాటకములకును జెందినగ్రంథములెన్నియో వలువురు పెద్దలచే వ్రాయబడినవి. కాని రుద్రమునకు మాత్రము ఆంధ్రభాషలో వివరణము విపులముగా వ్రాయఁబడలేదు. దానిని వ్రాయుట మంచిదని మహాదేవుడునన్ను ప్రేరేపించగా వ్రాసితిని. దైవాజ్ఞ అనుల్లంఘనీయముకదా! శ్రీ రుద్రాంధ్రభాష్యమును అర్థపంచకముతో మహాగ్రంథముగావ్రాసితిని. ఇవేకాక, స్తోత్రమాల [వతాత్పర్యము] రామాయణ పదారము [ద్వైతపరము] లలితాత్రిశతిచరిత్ర [వైజాగ్] శారారుణరహస్యములు అను గ్రంథములను సైతము వ్రాసితిని నావిద్యాభ్యాసఫలమును గురుజీవనదాతల నామస్మరణపూర్వకముగా బెద్దల యెదుటనుంచుట నావిధికదాయని వ్రాసితిని. చదువరులు క్షమింతురుగాత.

కాలానుగుణముగా నేనెవ్వడనో నాగోత్రాదులేమో తెలుపవలెనుగదా! మాయింటిపేరు తెలికిచర్లవారు. రాజేశ్వరశర్మయనునది నాతల్లిదండ్రులు నాకిడిననామధేయము. మాదికౌండిన్యసగోత్రము. లక్ష్మీకాంతాకామేశ్వర నామాంచితులు నాతల్లిదండ్రులు. నాకు పిల్లనిచ్చినమామగారు బ్రహ్మశ్రీ మోడేకుర్తి వెంకటసత్యనారాయణశాస్త్రిగారు. మా తండ్రిగారు సంస్కృతాంధ్రభాషాపండితులై, జ్యోతిషధర్మశాస్త్రవేదాన్తశాస్త్రపండితులై పేరుగాంచినారు. మామామగారు వ్యాకరణాదిశాస్త్రములలో మహాపండితులై వెలసినారు. అంతేకాదు. వారు విజయనగరంజిల్లాలోని జామిగ్రామమునఁగల శుక్లయజుర్వేద సంస్కృతపాఠశాలాప్రధానాధ్యాపకులై శతాధికపండిత శిష్యులను తయారుచేసి ఆంధ్రదేశమున నలుదిక్కుల వెలసిల్లఁజేసినమునులు. ఇరువురు మహాపండితుల యండదండలనందుకొనుట నాపూర్వజన్మపుణ్యఫలము.

## శ్రీ రుద్రాభిషేకమాహాత్మ్యము

నాపితరులస్మారక చిహ్నముగా వ్రాసిన "శ్రీనివసత్పుజాతీయము" మాకులదేవత శ్రీ రాజరాజేశ్వరీదేవికంకితముగావింపబడినది ఈ రుద్రాభిషేకమాహాత్మ్యము శ్రీ శ్రీనివాసస్వరూపమహాదేవునకంకితమొనర్పబడినది. దీనికి జెందిన విషయములు కృతిసమర్పణశ్లోకములందు వివరింపబడినవి. తే 1977-7-1 దీని ఆంధ్రపండితోద్యోగమునుండి విశ్రాంతినొందిన నేను బహుకుటుంబికుడనైన కారణమున నాజ్యేష్ఠపుత్రుడు. చి. Y. R. K. కామేశ్వరరావు ఉద్యోగిగానున్న కారణమున వానిచెంతనుండగోరి, రాకెట్టుకేంద్రమైన ఈ శ్రీహరికోటకు శ్రీకాకుళమునుండి సకుటుంబముగా వచ్చేసితిని. అవసరమగునపుడు అడవియామలకము అంబుధిలవణముతో చేరునుగదా! నేనిటకువచ్చువరకే నా ప్రియశిష్యమిత్రులును శ్రీకాకుళపురప్రముఖులును ఈ గ్రంథముద్రణకు 5 వేలు సాయమొనర్చిరి వైజాగులోని డి.జి.ఎస్.పి ఆఫీసులో, A. S. W.గానున్న నాయాప్తబంధువులు చి. D. నారాయణమూర్తి బావగారు నిష్కల్మషాభిమానముతో శ్రీ B. తిరుమలరావుగారు, Ghief Engineer శ్రీ రామశేషాద్రిగారి వంటి ఆస్తిక శిఖామణుల పరిచయభాగ్యము చేకూర్చి, వారిచే మూడున్నరవేలుసాహాయ్యముచేయించిరి. ఈసహాయకుల నామములను కృతజ్ఞతాసూచకముగా గ్రంథము చివరచేర్చితిని.

ఇల్లలికినమాత్రాన పండుగగునా? ఉపవనము కూడబెట్టిన మాత్రాన గ్రంథముద్రణఫలమబ్బునా? ఈ పొత్తము వెల్గులోనికివచ్చునెట్లు? అనెడియాలోచనతో మునిగియున్న నన్ను శ్రీ మహాదేవుని మహిమ శ్రీహరికోట వాస్తవ్యులైన విద్యావంతులయెడకుఁ జేర్చినది. "విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్" అన్నారుకదా! పెద్దలు. తొల్త శ్రీ Gh. V. రమణరావుగారు.

# నివేదనము

శ్రీ V. రామకృష్ణారావుగారింట నిత్యము సమావిష్టమగువృద్ధమిత్రమండలితో
నన్ను జేర్చినారు. సూదంటురాయివలె శ్రీ V. రామకృష్ణారావుగారు
నన్నాకర్షించి, సర్వమత సమన్వయమగునట్లు నాచే గొన్ని నెలలపాటు
శ్రీ భగవద్గీతోపన్యాసము చెప్పించి, నాకు ప్రాణమిత్రులైరి శ్రీరామాచార్యులు
గారివంటి పెద్దప్రభుత్వోద్యోగులు నాయుపన్యాసములాలకించు సన్నివేశము
కల్పించిరి. వారితో నాకు పరిచయముచేకూర్చిరి. అంతటితోనగక, ఈనా
రుద్రాభిషేకమాహాత్మ్య గ్రంథముద్రణకు దాము విరివిగా, విరాళమిచ్చి,
వృద్ధమిత్రులనుండియు బెద్దపెద్ద ప్రభుత్వోద్యోగులనుండియు విరాళములను
స్వీకరించి 2 వేల నిధినిప్రోగుచేసియిచ్చిరి వారికివే నాకృతజ్ఞతాభివందన
ములు. ప్రాచీనదేవాలయోద్ధరణమువంటి ఘనకార్యములనాచరించు శ్రీమాన్
చి. ఆనందరామాచార్యులుగారితో గ్రంథముద్రణవిషయమును ముచ్చ
టించగా వారు నాప్రాణమిత్రులు శ్రీ రామకృష్ణారావుగారికోర్కెను మన్నించి
ఈనాగ్రంథముద్రణ కార్యనిర్వహణమునకు బద్ధ కంకణులైరి. వారు
ఈ విషయమును శ్రీ శ్రీ శ్రీ T. T. D. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ P. V. R. K.
ప్రసాద్‌గారితో వివరించి చెప్పగా, వారు సరసహృదయులు, సత్కార్యా
చరణదీక్షాపరులు నగుటచే చక్కగా నాలకించి, వెనువెంటనే ఈ గ్రంథ
ముద్రణకు శ్రీ T. T. D. వారి గ్రంథముద్రణనిధినుండి సహృదయంతో
విరాళము నిప్పించిరి. వారికిని నాశతాధికకృతజ్ఞతాభివందనములను
సమర్పించుచున్నవాడను. అంతతో నూరుకొనక చి. ఆచార్యులుగారు దాత
లచేసైతము ధనమునిప్పించిరి. గ్రంథముద్రణకైనవ్యయములో కొంతధనము
చి. ఆచార్యులుగారు సమకూర్చినదేయని చెప్పకతప్పదు. కృతజ్ఞతా సూచక

ముగా దాతల నామధేయములను దాతల పత్రికలో జేర్చువారికి నాయభినందన లను సమర్పించుచున్నాను.

ఇప్పట్టున కృతజ్ఞతాసూచకముగా ఆశీఃపూర్వకముగా జరితలకు, చి. ఆచార్యులుగారి పరిచయముచేకూర్చుట నావిధికావున వారి విషయమును వ్రాయుచున్నాను నాయుపన్యాసమునకు శ్రోతలుగా విచ్చేసిన చిరంజీవి రామాచార్యులుగారు పరిచితులుగా, దాతలుగా, ఆప్తులుగా, హితులుగా మార్పుచెంది, వేదభాగముల నభ్యసించుకారణమున ఈనాడు నాకుప్రియశిష్యమిత్రులై చిరంజీవులుగా నాచే బిలువబడుట విశేషము. వీరింటి పేరు బుక్కపట్నం తిరుమల. అనందరామాచార్యులుగారన్నది వీరి నామధేయము వీరు శఠమర్షణగోత్రోద్భవులు. శ్రీ రాజ్యలక్ష్మి లక్ష్మీనరసింహాచార్యులనెడి పుణ్యదంపతుల పుత్రులు. తిరుపతిలోనుండెడి వీరివంశపు మూలపురుషులు శ్రీ కాళహస్తి రాజాస్థానపండితులై ముక్కుతిమ్మనార్యమహా కవివలె రాజపుత్రికతోబాటు హరణముగా న్యూజివీడు సంస్థానమునుజేరిరి. రాజావరణముచే విజయవాడ సమీపమునగల ఉరుటూరు అగ్రహారమును బహుమతిగాబొందిరి వీరితండ్రిగారు 1941 సం॥న బెజవాడలో కో ఆపరేటివ్ ఆఫీసరుగా పనిచేయుకాలమున చి. ఆచార్యులుగారు అటజన్మించిరి. వీరికి 4 గురు సోదరులును, ఒక సోదరియుగలరు. ఉద్యోగరీత్యా విచ్చేసిన వీరి తండ్రిగారితోబాటు వీరును దమ 6 వయేటవయసులో శ్రీకాకుళమండల ముఖ్యపట్టణమగు శ్రీకాకుళమునకు విచ్చేసి గుడివీధిలోనుండెడివారట. తెనాలిలో తమమేనమామగారింటనుండి విద్యనభ్యసించినారు. 1962 సం॥న హైదరాబాదులో B.Com., పట్టభద్రులైనారు. గుంటూరు వాస్తవ్యులైన శ్రీమాడభూషి వెంకటాచార్యులుగారి ద్వితీయ పుత్రిక చి సౌ. వెంకటలక్ష్మి

## నివేదనము

నామధేయవతి వీరికి ధర్మపత్ని. ఈనాడు వీరు శ్రీహరికోటలో వర్క్షి ఆఫీసరుగా పనిచేయుచునే ఇచటను దేవాలయ నిర్మాణసంఘసభ్యులుగానుండి దేవాలయనిర్మాణము చేయించుచున్నారు. బహుకుటుంబీకులైన వీరికి ఆస్తికత, సత్కార్యాచరణదీక్ష, పరోపకారబుద్ధి, సమదృష్టి ఉగ్గుపాలతో లభించిన సుగుణములు. సంగీత విద్వాంసులు శ్రీ పారుపల్లి సుబ్బారావుగారికి శిష్యులై అతిబాల్యమునుండి సంగీత విద్యనభ్యసించి, నాటకములందు నటించుచు పెక్కు రజతపతకములను బహుమతిగా గైకొనిరి. నాటకములందు భక్తతుకా రామ్, హరిశ్చంద్రుడు శ్రీనివాసుడు మున్నగుపాత్రలధరించి, నటించి,నాటక నిర్వహణచే సంపాదించిన ద్రవ్యముతో సత్కార్యములు చేయుట వీరికి పరిపాటియైనది. శ్రీ వెంకటగిరి మహారాజావారి సంస్థానమునకు జెందినట్టియు సూళ్ళూరుపేట తాలూకాలో గల మన్నారుపోలూరియందలి శ్రీకృష్ణదేవాలయమున ధ్వజస్తంభపునఃప్రతిష్ఠ, కుంభాభిషేకము చేయించినారు. అప్రక్కనే గల మంగళంపాడిగ్రామమందలి శ్రీ వేణుగోపాలస్వామివారి ఆలయ మహామండపనిర్మాణకార్యమును గొనసాగించినారు. ఈనా రుద్రాభిషేకమాహాత్మ్య గ్రంథమును సూళ్ళూరుపేటలో గల శ్రీ R. M. ఆంజనేయులుగారి కళాచిత్ర ముద్రణాలయమున ముద్రింపించినారు. వీరికిగల నిష్కపట భక్తిభావమునకు మెచ్చి, శ్రీమన్మహాదేవుడు నల్గురు పుత్రికలు మాత్రమేగల వీరికి సుందర వేణుగోపాలనామక సుపుత్రుని ప్రసాదించి, ఈ పవిత్రదంపతులకు మహానందము చేకూర్చినాడు. ఈపిల్లవాని జాతకచక్రము ఆయురారోగ్యైశ్వర్య విద్యాధికారాది సంపత్తిగల్గియున్నదని జ్యోతిష్కులువాక్రుచ్చినారు. వీరికి పరమేశ్వరుడు ఆయురారోగ్యైశ్వర్యవంశాభివృద్ధులను చేకూర్చి సంరక్షించుగావుతన్.

# శ్రీ రుద్రాభిషేకమాహాత్మ్యము

శ్రీరామాచార్యప్రసాదుల సమ్మేళనము శ్రీహరికోటకు అపూర్వశోభావహము. శ్రీ P. V. R. K. ప్రసాద్‌గారు I. A. S. ఆఫీసర్లు అయినను గర్వరహిత జ్ఞానసంపన్నులు. సత్కార్య సమాచరణదీక్షాబద్ధకంకణులు. హిందూ ధర్మ ప్రచారకాగ్రేసరులు. వేదవిద్యాపోషణతత్పరులు. కావుననే అసంఖ్యాక దేవాలయములను వేదవిద్వాంసులతో విరాజిల్లజేయుచున్నారు శ్రీనివాస మండపముతో సత్రములతో విరాజిల్లు గ్రామనగరములే వీరి ఘనతను వేనోళ్ళచాటుచున్నవి. వైదిక ధర్మప్రచారమునకు వీరుచేపట్టిన ప్రణాళికలు లెక్కకుమిక్కుటములు. కావుననే నావంటివారి గ్రంథరాజములెన్నియో వీరి సహాయమున వెలుగులోనికివచ్చినవి. ఈనాడు వీరు శ్రీహరికోటను శ్రీరుద్రాభిషేకమాహాత్మ్యముతో విరాజిల్లజేయుటయేకాక, దేవాలయాది నిర్మాణము తోడను ప్రకాశింపజేయుచున్నారు. పరమేశ్వరుడు వీరికి కుటుంబసమేతముగానుండ నాకృషిని ప్రోత్సహించిన శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారిని (పబ్లిక్ రిలేషన్ ఆఫీసర్) ఆయురారోగ్యాదులనొసంగి సంరక్షించుగావుతన్.

కళాచిత్ర ముద్రణాలయస్థాపకులైన శ్రీ R. M. అంజనేయులుగారు చక్కని విజ్ఞానముకలవారు. తమ ప్రెస్సు చిన్నదైనను ఈ మహాగ్రంథ ముద్రణను సాహసించిచేపట్టినారు. వీరి పుత్రులు మువ్వురిలో ప్రకాశ, భాస్కరనామధేయులును, కూర్పరియైన విద్యాసాగరనామకుడును గ్రంథ ముద్రణమును చక్కగాసాగించి, శ్రీ అంజనేయులుగారికి అమితసహాయము

# నివేదనము

ఆచరించుచున్నారు వీరికి మహాదేవుడు ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగి సంరక్షించుగావుతన్.

శ్రీ సనత్సుజాతీయమును, శ్రీ రుద్రాభిషేకమాహాత్మ్యమును ముద్రిత ములై తప్పక వెలుగులోనికివచ్చునని యాశీర్వదించిన, లౌకికసాధువులైన, దివంగతులైన శ్రీ మాతండ్రిగారికివే నా నమోవాకములు. విద్యాజీవనదాతలకి వే నా యభినందనములు. కోరినదేతడవుగా ఆశీస్సులను అభిప్రాయములను ఒసంగిన పీఠాధిపతులకు, స్వాములకును సాష్టాంగనమస్కారముల నర్పించు చున్నాను. చక్కని యభిప్రాయములనొసంగి, నన్నాశీర్వదించిన బ్రహ్మశ్రీ, అర్కసోమయాజులుగారికిని, శ్రీ వెంకటావధానులుగారికిని, గురువులు శ్రీ S. సూర్యనారాయణశాస్త్రిగారికి నా నమస్కారములను సమర్పించుచున్నాను. ఈ గ్రంథమును తనదిగాభావించి, నదుముకట్టి ద్రవ్య మా ర్జిం చి, అచ్చొత్తించిన, చి. ఆనందరామాచార్యులు గారికి ఇతోఒధికాభివృద్ధి కల్గుగాకయని యాశీర్వదించుచున్నాను. శ్రీ T. T. D. నుండి ద్రవ్య సహాయమందజేసిన శ్రీ ప్ర సా ద్ గా రి కి వే నా యభివందనములు. ద్రవ్యసహాయమందజేయించిన, చి. నారాయణమూర్తి బావగారికిని, వారికోరిక చేదాతలను ప్రోత్సహించి సాయపడిన, చి. B. తిరుమలరావుగారికి నివే నా శుభాశీస్సులు. నా మిత్రులకు శ్రీ రామకృష్ణాదులకివేనాయభినందనలు. గ్రంథముద్రణకు ధనసహాయమొనరించినట్టియు, శ్రీకాకుళనగరస్థులైన పెద్ద లకు నమస్కరించుచు, చి. నాశిష్యమిత్రుల నాశీర్వదించుచున్నాను. చక్కగా సాహసించి క్షముద్రించిన, చి ఆంజనేయులుగారికిని ముద్రణకార్యకారులకు నివేనాయాశీస్సులు. విద్యాజీవనదాతల చిత్రములను కృతజ్ఞతాసూచకముగా ఇందు ముద్రించుచు, దాతలనామములను గ్రంథాంతమునఁబొందుపఱచినాను.

## శ్రీ రుద్రాభిషేకమాహాత్మ్యము

గ్రంథరచనలోను, ముద్రణలోను దొరలినలోపములను దెలియఁజేసినచో మలిముద్రణమున సవరించుకొనగలనని పాఠకలోకమును సవినయముగాఁ బ్రార్థించుచున్నాను. తప్పొప్పులపట్టిక ననుసరించి సవరించుకొని చదువవలసినదిగా నాప్రార్థన.


విశ్రాంతప్రధానాంధ్రో
పాధ్యాయుఁడు
శ్రీహరికోట
I. S. R. O.
తే 1-3-1982 దీ

ఇట్లు
బుధజనవిధేయుఁడు
తెలికిచెర్ల రాజేశ్వరశర్మ
వేదశాస్త్రపండితుఁడు
సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ.



తెలుగు సారస్వతసంఘం (శ్రీహరికోట) కార్యాచరణ సభ్యులు:
(ఎడమనుండి) సర్వశ్రీ బి. వెంకటేశ్వర్లు, రాఘవయ్యనాయుడు, ఐ. రామకృష్ణారావు, టి. రాజేశ్వరశర్మ, వి. వెంకటసుబ్బయ్య, సి.వి. రమణరావు గార్లు.

# సమ్మోదము

## తెలుగు సారస్వత సంఘము - శ్రీహరికోట

~(•)~

ఆర్యులారా!

నేను వేమూరి వెంకటసుబ్బయ్యను. విశ్రాంతోపాధ్యాయుడను. వీరు నా మిత్రులు (1) వి. రామకృష్ణారావుగారు. (రిటైర్డ్ అడిటర్ ఎగ్రికల్చర్స్) (2) సి. వి. రమణరావుగారు (రిటైర్డ్ టీచరు) (3) బి వెంకటేశ్వరరావు గారు (4) రాఘవయ్యనాయుడుగారు. మేము ఉద్యోగులైన పిల్లలమూలమున శ్రీహరికోటకు పలుప్రాంతములనుండి వచ్చేసి, కలిసి, మిత్రులమైతిమి. వృద్ధులమైనకారణమున ఒకచోటనుచేరి సద్గోష్ఠి జరుపుకొనుచున్నారము. ఇట్లుండ శ్రీ కొండూరి నరసింహంపంతులుగారు (రిటైర్డ్ లేండ్మార్టుగేజి బేంకి మేనేజరుగారు) కావలినుండి ఇట నున్నకొడుకువెంతనుండవచ్చేసిరి. వీరు ఆంగ్లమునగల అద్వైతవేదాన్తగ్రంథము నెల్లపఠించి, విజ్ఞానులై, ఆధ్యాత్మికవిజ్ఞానమర్థించిన మాకు సాయం సమయమున, మా మిత్రులు, శ్రీ రామకృష్ణారావుగారి మేడపై జ్ఞానబోధచేయదొడగిరి ఇంతలో 1979 ఫిబ్రవరిలో తమ పుత్రునివెంతనుండవచ్చిన, ఈ శ్రీ తెలికిచెర్ల రాజేశ్వరశర్మగారితో మా మిత్రులు, శ్రీ రమణరావుగారు పరిచయ మొనర్చుకొన్నట్లు మాకు తెలియజేసిరి మేమెల్లరము శ్రీ శర్మగారి చెంతకువెళ్ళి సంభాషించునపుడు మాటలలో వీరి ఘనతను తెలిసికొంటిమి. వీరు కేవలము విశ్రాంతినొందిన ప్రధానాంధ్రోపాధ్యాయులేకాదు, వేదశాస్త్రపండితులు. శ్రీ సనత్సుజాతీయాది మహాగ్రంథరచయితలు. ఉపన్యాసకులుకూడ మా నరసింహంపంతులుగారి కోరికపైని, వీరు వేదమహత్వమునుగూర్చి 4 దినములు ఉపన్యసించిరి. అది

మొదలు వీరితో మా వృద్ధమండలికి మైత్రి యేర్పడినది. పిమ్మట మామిత్రుని మేడపైనే ప్రతిదినము సాయంకాలమున సమావిష్టులమగుచు, షణ్మతవిషయములతో శ్రీ భగవద్గీతను వివరించి చెప్పగోరితిమి కోరినదే తడవుగా శుభముహూర్తమున ఆరంభించి వీరు గీతనుగూర్చి చెప్పదొడగిరి గీతాశ్రవణాసక్తులైన ఉద్యోగుల కోరికపైని ప్రతిదినము, సాయంకాలమున 7 గం. నుండి $8\frac{1}{2}$ గం. వరకును గీతనుగూర్చి ప్రబోధించుచు, దానికి చెందిన ఉపనిషద్విషయములను సైతము వివరించి చెప్పుటకు 11 నెలలు పట్టినది దానితో శ్రీహరికోటవాసులైన స్త్రీపురుషులకును, ఉన్నతోద్యోగులకును వీరిపైని గీతాగురువులను సద్భావమేర్పడినది.

మా మిత్రులు శ్రీ రామకృష్ణారావుగారు ఆస్తికులు; విజ్ఞానులు. దేవాలయము ఆశ్రమపాఠశాల నిర్మింపజేసినఘనులు నిష్కామముగా గీతోపన్యాసకులైన, శ్రీ శర్మగారిపట్ల ఘనగౌరవముకలవారు. ముఖములు చూచుకొనిన వేళావిశేషముచే శ్రీ శర్మగారికి ప్రాణమిత్రులైరి విరాళగ్రహణమునకును, సన్మాన స్వీకారమునకు విముఖులైన శ్రీ రాజేశ్వరశర్మగారి ఋణము తీర్చుకొనుటయెట్లాయని ఆలోచించు శ్రీ రామకృష్ణారావుగారు, శ్రీ శర్మగారి కోరికపైని వారురచించిన శ్రీ రుద్రాభిషేకమాహాత్మ్యగ్రంథ ముద్రణ కార్యమును జేపట్టిరి. మదరాసులోని ప్రెస్సులకేగి తెలిసికొనగా ఈ గ్రంథ ముద్రణకు షుమారు రు. 20 వేలఖర్చుఅగునని తెలిసినది ఇపుడు 30 వేలు పైగా ఖర్చుఅయినది శర్మగారిగ్రంథముద్రణకు శ్రీకాకుళమున, వైజాగులోను లభించిన రు. 8 వేలనువారినుండిగైకొని, శ్రీరామకృష్ణారావుగారు శ్రీహరికోటలోని శ్రోతలగు దాతలనుండి 3 వేలు గ్రహించగా మొత్తము రు 11 వేలు అయినది. ఇదిచాలదే? సహాయకులెవరా? అని ఆలోచనలోనుండగా శ్రీ బి. టి. ఏ. రామాచార్యులుగా మా మిత్రుల స్ఫురణకువచ్చిరి గీతాశ్రోతలలో, శ్రీ రామాచార్యులుగారొకరు. కొండనుతలక్రిందనిడుకొనివిరాళ్ళకు వెతుకసేల

ఆచార్యులుగారు స్వయముగా దాతలు. ఆస్తికులు. విజ్ఞానవంతులు. బాల్యమునుండియు నాటకములు ప్రదర్శించి, వచ్చినద్రవ్యముతో సత్కార్యములనాచరించుస్వభావముకలవారు. శ్రావ్యమగు కంఠము, చక్కని సంగీతజ్ఞానముకలవారు తాము హరిశ్చంద్రుడు, భక్తతుకారాము మున్నగు పాత్రలు స్వీకరించి, నటించి ప్రజలమెప్పుపొంది, స్వర్ణరజతపతకముల నందినవారలు. స్వశ్రమార్జితవిత్తముతో. మన్నారుపోలూరు, మంగళంపాడి గ్రామములందలి విష్ణుదేవాలయముల నుద్ధరించినవారలు. నిష్కాములు. పరోపకారనిరతులు. ప్రస్తుతము శ్రీహరికోటలో దేవాలయనిర్మాణము గావించు మహామహులు కాన వారినీ గ్రంథముద్రణకార్యము నెరవేర్ప నర్థించుట యుక్తమని తలంచి, శ్రీరామకృష్ణారావుగారు, శ్రీ శర్మగారినితోడ్కొని వారిచెంతకేగి, పైవిషయమును తెలియజెప్పిరి. తోడనే ఆచార్యులుగారు గ్రంథముద్రణ ద్వారా సరస్వతీసేవచేయ బద్ధకంకణులైరి.

శ్రీ ఆచార్యులుగారు, శ్రీ శర్మగారి పై నిష్కపటాభిమానముచూపుచు, క్రమక్రమముగా వేదవిద్యనేర్చుకొని వారికి శిష్యులై అఖండగురుభక్తిని నిరూపింపదొడగిరి. ఇటులనే మఱికొందఱు ఉద్యోగులును వేదవిద్య నేర్చుకొనుచుండిరి.

శ్రీ ఆచార్యులుగారిసహాయ మనుసరించియే, మేము శ్రీహరికోటలో తెలుగు సారస్వతసంఘమును స్థాపించి, కరపత్రములను అచ్చొత్తించితిమి. ఈ సంఘమునకు నేను కార్యదర్శిని మా గురువు శ్రీశర్మగారు చైర్‌మేన్; శ్రీరామకృష్ణారావుగారు కోశాధికారులు. మిగిలిన ముగ్గురును డైరక్టర్లుగా నున్నారు, సూళ్ళూరుపేటలోగల "కళాచిత్ర" ప్రెస్సులో శ్రీ రుద్రాభిషేక మాహాత్మ్యమును ముద్రించుటకు నిర్ణయించి, ప్రెస్ యజమానులైన శ్రీ ఆర్. ఎం. ఆంజనేయులుగారికి, 1980 మార్చిలో ఈగ్రంథమునొసంగితిమి. ఏమి పుణ్యవిశేషమో? గ్రంథమహత్త్వమేమో మాకు తెలియదు. శ్రీ ఆచా

ర్యులుగారు గురుభక్తిపరాయణులై, శర్మగారిపరోక్షమున, శ్రీ వేంకటేశ్వరు లకు మ్రొక్కులిడి, శ్రీ టి. టి. డి. ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ ప్రసాద్‌గారితో మాటాడి, శ్రీ టి. టి. డి. ద్రవ్యనిధినుండి ఈ గ్రంథముద్రణకు రెండు భాగములకు 10వేలు ఆర్థికసంపత్తిని సమకూర్చిసహకరించినారు. శ్రీ ప్రసాద్ గారికి శతాధికవందనములను సమర్పించుచున్నాము. ప్రసాద్‌గారు నిర్మల మనస్కులు. సత్కార్యాచరణదక్షులు వారి మహిమకొనియాడసలవికానిది. ఇక ఆచార్యులుగారి ప్రయత్నము అత్యద్భుతము రు. 1116 ఒసంగుగ్రంథో ద్ధారకులు రు. 516 లు ఇచ్చు మహారాజపోషకులు, రు. 116 లిచ్చు రాజ పోషకులు ఎందరువచ్చినదితో చదువరులకే తెలియును. శ్రీ ఆచార్యులుగారి అమృతవాక్కులు చెవులపడినదేతడవుగా, దాతలు శంఖముపేర చెక్కులంపు టకు వెనుదీయలేదు. అప్పుల అభివృద్ధినికోరవలెనేకానిపొగడబొదు. మహా దేవస్వరూపుడైన శ్రీ వేంకటేశ్వరుడు ఆచార్యులుగారికి అన్నివిధముల అభి వృద్ధిని చేకూర్చునుగాక.

హనుమంతునియెదుటనా! కుప్పిగెంతులు. మాకు ఈనాడుమిత్రులును గురువులునగు శర్మగారియెదుటనా! మామాటలు. ప్రౌఢిమసతను వారిగ్రంథ ములే లోకమునకు తెలియజేయును. వారి పాండిత్యమును వారి రచనాపాటవ మును తెలియజేయుశక్తిమాకేది? ఒకమాటనువారి చెవినివేసినచో దానికెన్ని అర్థములను చెప్పగలరో వినితెలిసికొనవలసినదే. అభిప్రాయదాతల వాక్కు లచే గ్రంథముయొక్కయు, గ్రంథకర్తయొక్కయు గొప్పతనము అందఱికిని తెలియును. మేమును కవిపండితులమగుదుమేని గ్రంథకర్తల మహిమను చెప్పగలవారలమగుదుము. గ్రంథాధిదేవతయగు రుద్రుడేకదా! సర్వులకును సర్వమును ఒసంగువాడు. ఆ మహాదేవుడే గ్రంథకర్తతోబాటు మమ్ములను, మాసంఘమునను, దాతలను సంరక్షించుగాక యని పదేపదే ప్రార్థించుచున్నాము

మహోరుద్రుపసిదయచే మాసారస్వతసంఘము గ్రంథప్రకాశకమయినందులకు, మహాదేవునకును, గ్రంథకర్తకును, దాతలకును, ఇవే మాకృతజ్ఞతాభివందనములు.

ఇట్లు

శ్రీహరికోట
25-7-82

వి. వెంకటసుబ్బయ్య
కార్యదర్శి
తెలుగుసారస్వతసంఘము

---

ముద్రాపకులు



ఆర్. ఎం. అంజనేయులు

కళాచిత్ర ప్రింటర్స్

సూళ్ళూరుపేట.

# ముద్రాపకుల విజ్ఞప్తి

వేదశాస్త్రపండితులు, సాహిత్యవిద్యాప్రవీణ, పూజ్యులు శ్రీ రాజేశ్వర శర్మగారి "శ్రీ రుద్రాభిషేకమహాత్మ్యము"ను ముద్రించే మహదవకాశము మా కళాచిత్ర ప్రింటర్సుకు కలగడం యాదృచ్ఛికమే లేకుంటే ఎక్కడ శ్రీకాకుళము! ఎక్కడ శ్రీహరికోట! శ్రీ శర్మగారు తాత్కాలికంగా శ్రీహరికోట నివాసులుకావడం, వారు యీ బృహద్గ్రంథాన్ని ముద్రించే సంకల్పంలో నుండగా రాకెట్ కేంద్రంలో ఉన్నతోద్యోగంలోవున్న శ్రీ B. T. A. రామాచార్యులుగారు వీరి సంకల్పానికి సహకరించి యీ గ్రంథముద్రణనుచేయవలసినదిగానన్నుకోరినప్పుడు ఇంతటి గురుతరమైన బాధ్యతను స్వీకరించి సక్రమంగా నెరవేర్చగలమా? అనే సందేహం నాలోకలిగింది. కానీ శ్రీ రామాచార్యులుగారు, శ్రీ రామకృష్ణరావుగారు, శ్రీ శర్మగారు, ఆశీస్సులతో నన్ను భుజంతట్టి ప్రోత్సహించారు. అప్రోత్సాహబలమే నాలో ఎంతో వుత్సాహాన్ని కలిగించింది. ఈ ముగ్గురుమూర్తుల ఆశీస్సుల ప్రభావమే నాకు రక్షకవచమై యీ గ్రంథముద్రణకు ధైర్యాన్ని ప్రసాదించింది.

రెండు ఫారముల ముద్రణ జరుగగానే శ్రీ శర్మగారు ప్రూఫులు దిద్దే భారాన్నిసైతం నామీదనే వదిలారు. ఇదివారికి నామీదవున్న అచంచలమైన విశ్వాసానికి అభిమానానికి తార్కాణం!

గ్రంథముద్రణపూర్తయి పెద్దల అభిప్రాయసేకరణ ముద్రణ అవుతున్నసందర్భంలో గ్రంథకర్త శ్రీ శర్మగారు యీ గ్రంథాన్నిగూర్చి నీ అభిప్రాయం వ్రాయమని నన్ను ఆదేశించారు. యీ మహద్గ్రంథాన్నిగూర్చి అభిప్రాయం వ్రాయగలిగిన అర్హతనాలోలేకపోయినా నేనంటే ఎంతో అభిమానంచూపే పెద్దలు శ్రీ శర్మగారిమాటను కాదనే ధైర్యంనాలోలేదు.

ఆలాయినా కవులు నిరంకుశులుకదా, అందుచే వారివాక్కును వేదవాక్కుగా భావించి యీ రుద్రాభిషేకమహాత్మ్యమనే గ్రంథమును గురించికాక యీ గ్రంథముద్రణకు అవకాశముకలిగిన సంఘటనలను గురించి మాత్రమే నాలుగుమాటలు వ్రాయడం ధర్మమని యీ సాహసానికి పూనుకున్నందుకు పండితప్రకాండులైన పెద్దలు మన్నింతురుగాక!

ఈ బృహద్గ్రంథాన్నిగూర్చి తమ అమూల్య ఆశీస్సులను, అభిప్రాయాలను అందజేసిన జగద్గురువులు శ్రీకంచికామకోటి పీఠాధీశ్వరులు, శ్రీశృంగేరి శారదా పీఠాధిపతులు, విశాఖ శంకరమఠం శ్రీ జనార్ధనానందసరస్వతి స్వాములులాంటి హిందూధర్మ ప్రబోధకులు, పండితప్రకాండులైన కళాప్రపూర్ణ డా॥ దివాకర్ల వేంకటావధానిగారు, హిందూధర్మరక్షణ సంస్థ కార్యదర్శి శ్రీ అర్కసోమయాజీగార్లలాంటి ఉద్దండ పండితులు వెలిబుచ్చిన అభిప్రాయాల సరసననాబోటి అల్పజ్ఞుని అభిప్రాయం ప్రకటించడం హాస్యాస్పదంగా వుంటుందని నాభావన అందుకే ఇది అభిప్రాయంకాదు. కేవలం విజ్ఞప్తి మాత్రమేనని సవినయంగా మనవిచేస్తున్నాను.

పూర్వపురోజులలో రాజులపరిపాలనలో ఎందరో మహోద్దండ పండితులైన కవులుండేవారు వారి సాహిత్యపోషణాభారాన్ని రాజులు భరించి వారిని ప్రోత్సహించేవారు అందువల్లనే ఎన్నో మహోన్నతమైన ప్రాచీన గ్రంథాలు మనకీనాడు లభించే అదృష్టం కలిగింది.

రాజ్యాలుపోయాయి ఎందరో రాజులు కాలగర్భంలో కలసిపోయారు కానీ వారి సంస్కృతీ సంస్కారాలు మాత్రం చరిత్రపుటలలో మనకు మిగిలిపోయాయి "ఎదురైనచో తన మదకరీంద్రము డిగ్గి కేలూత యొసగియెక్కించుకొనియె" అంటూ మహాకవి అల్లసాని పెద్దనామాత్యులు రాయలవారి నిర్యాణానంతరం "ఎ్రికిరియున్నాడ జీవచ్ఛవంబనగుచు" అని వాపోయాడు.

ఈనాడు సాహితీసమరాంగణుడైన శ్రీ కృష్ణదేవరాయలు లేకపోయినా అష్టదిగ్గజాలవంటి కవిశ్రేష్ఠులు మాత్రంవున్నారుదేశంలో, కానివారికి ఆదరణే శూన్యమైనది.

ఇది ప్రజాయుగం, ప్రజలే యీ నాడు రాజులుగా రాజ్యాలు పరిపాలిస్తున్నరోజులు, కావున కవులకు కళలకు ప్రోత్సాహం. ప్రజలు, ప్రజా ప్రభుత్వాలే కల్పించాల్సినరోజులవి.

అందుకు నిదర్శనంగానే శ్రీహరికోట జనారణ్యంలో సాహితీ పిపాసువులైన పెద్దలు కలసి "తెలుగుసారస్వత సంఘము" అనే సాహితీసంస్థను నెలకొల్పడం ఎంతో శుభసూచకం, దానికితోడు కలియుగదైవం శ్రీ వెంకటేశ్వరస్వామివారినిలయమైన తిరుమల తిరుపతి దేవస్థానములపాలకవర్గం వారునేడు సాహిత్యపోషకులై ఎన్నో అమూల్యములైన గ్రంథముల ముద్రణలకు ఆర్థికసహకారమంద జేయడంఎంతో ముదావహము, శ్రీవేంకటేశ్వరస్వామి ఈనాటి కవుల పాలిటకామధేనువై అలనాటి శ్రీకృష్ణదేవరాయలవలె ప్రోత్సాహమందిస్తూ అభయహస్తంతో ఆదుకుంటున్నారనుట అతిశయోక్తి కాదు! దేవాలయపాలకవర్గము, కార్యదీక్షాతత్పరులైన కార్యనిర్వహణాధికారుల ప్రోత్సాహము నేటికవులకెంతో అండదండలుగావుండడం విశేషమని భావిస్తూ శ్రీహరికోట "తెలుగుసారస్వతసంఘం" ప్రప్రథమంగా శ్రీశర్మగారి "శ్రీ రుద్రాభిషేకమహాత్మ్యము" ముద్రణకు శ్రీకారంచుట్టి విజయం సాధించినట్లే భవిష్యత్తులో అనేక గ్రంథరాజములకు శ్రీ వెంకటేశ్వరస్వామి వారి ఆశీస్సులతో వెలుగును ప్రసాదించి కవులకు, కళలకు నిలయమై సాహితీ వినీలాకాశంలో వింతకాంతులు విరజిమ్ముతూ విజ్ఞానజ్యోతులను ప్రసరింపజేసి తెలుగు ప్రతిభను విశ్వవిఖ్యాతిగావించేందుకు కృషిచేయగలదని విశ్వసిస్తూవారికి శ్రీ వేంకటేశ్వరస్వామి కృపాకటాక్షములు పరిపూర్ణంగా లభించాలని శ్రీవారిని ప్రార్థిస్తున్నాను. భవదీయుడు

ఆర్. ఎం. అంజనేయులు

సూళ్ళూరుపేట — కళాచిత్ర ప్రింటర్స్



శ్రీః

—: శ్రీ మేధా దక్షిణామూర్తయేనమః :—

—: శ్రీ మహా దేవాయనమః :—

# శ్రీ రుద్రాభిషేకమాహాత్మ్యము

—: అర్థపంచక సహితము :—

## : ప్రార్థన :

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనంధ్యాయేత్ సర్వవిఘ్నోపశాన్తయే.

శ్లో॥ శారదా శారదాంభోజవదనా వదనాంబుజే।
సర్వదా సర్వదాస్మాకం సన్నిధిః సన్నిధింక్రియాత్॥

శ్లో॥ గురవే సర్వలోకానాం, భిషజే భవరోగిణాం।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయేనమః॥

శ్లో॥ అప్రమేయత్రయాతీత నిర్మలజ్ఞానమూర్తయే।
మనోగిరాం విదూరాయ దక్షిణామూర్తయేనమః॥

శ్లో॥ శుక్లాం బ్రహ్మవిచార సారపరమా
మాద్యాంజగద్వ్యాపినీం।
వీణా పుస్తకధారిణీమభయదాం
జాడ్యాంధకారాపహాం।

హస్తై స్ఫాటిక మాలికాం విదధతీం
పద్మాసనే సంస్థితాం।
తాంవందే పరమేశ్వరీం భగవతీం
బుద్ధి ప్రదాం శారదామ్॥

శ్లో॥ వందే శంభుముమాపతిం సురగురుం
వందే జగత్కారణం।
వందే పన్నగభూషణం మృగధరం
వందే పశూనాం పతిం।
వందే సూర్యశశాంకవహ్నినయనం
వందే ముకుందప్రియం।
వందే భక్తజనాశ్రయంచ వరదం
వందే శివం శంకరమ్॥

శ్లో॥ యోదేవస్సవితాస్మాకంధియో ధర్మాదిగోచరాః।
ప్రేరయేత్తస్యయద్భర్గః తద్వరేణ్యముపాస్మహే॥

శ్లో॥ సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమాం।
అస్మదాచార్య పర్యన్తాం వందే గురు పరంపరామ్॥

శ్లో॥ నమఃపుంసే పురాణాయ పూర్ణానందాయ విష్ణవే।
నిరస్తనిఖిలధ్వాన్త తేజసే విశ్వహేతవే॥

శ్లో॥ నమ ఆచార్యేభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యః॥





: శ్రీ మేధా దక్షిణామూర్తయేనమః :

ఓం నమో భగవతే రుద్రాయ

హరిః ఓమ్

## శ్రీ రుద్రస్యసాయణాచార్య కృతోపోద్ఘాతః

శ్లో॥ యస్యనిశ్వసితం వేదా, యోవేదేభ్యోఽఖిలం జగత్।
నిర్మమే తమహం వందే,విద్యాతీర్థమహేశ్వరమ్॥ 1

తాత్పర్యము :- పరమాత్మయొక్క ఉచ్ఛ్వాసనిశ్వాసములేవేదములు. అట్టి వేదముల ద్వారా అఖిల జగంబులను, వాని విషయములను వివరించెను. అట్టి సకలవిద్యలకును తీర్థుడు. (అనగా సద్విషయములనుపదేశించువాడు) కాన తచ్ఛబ్దవాచ్యుడగు మహేశ్వరుని నేను నమస్కరించుచున్నాను.

శ్లో॥ ఇష్టకాచితయస్సర్వా। శ్చతుర్థేహిసమాపితాః।
రుద్రాధ్యాయే పంచమేతు। చిత్యగ్నౌ హోమఉచ్యతే॥ 2

తా॥ ఇష్టకలు, చితులు, అనునవన్నీ చతుర్థాధ్యాయమున బూర్తి చేయబడినవి. చిత్యగ్నియందు జేయు హోమము, దాని విధానమును ఐదవ దగు రుద్రాధ్యాయమున జెప్పబడుచున్నవి.

శ్లో॥ కర్మపరికరణే పాఠాత్। కర్మాంగత్వమపీష్యతే।
జ్ఞాన హేతుత్వమప్యస్య। తథోపనిషదీరితమ్॥ 3

తా॥ కర్మ పరికరణమున బఠించుట వలన రుద్రమునకు గర్మాంగత్వమును ఇష్టమగుచున్నది. (అంగీకరింపబడుచున్నది.) "ఈ రుద్రము జ్ఞానమునకు హేతువు;" అను విషయముకూడ ఉపనిషత్తులో జెప్పబడినది. రుద్రము ఉపనిషత్తుగను జెప్పబడెను

శ్లో॥ కింజప్యేనామృతత్వంనో। బ్రూహీత్యుక్తోమునిర్జగౌ।
శతరుద్రీయకేణేతి। జాబాలా ఆమనన్తిహి॥ 4

తా॥ ఏమి జపించుటచే మాకు అమృతత్వము (మోక్షము) లభించునో చెప్పుమని యడిగిన జాబాలిమునికి, శతరుద్రీయముచే ముక్తి లభించునని యాజ్ఞవల్క్యముని చెప్పెను. అందులకు జాబాలులు అంగీకరించిరి.

శ్లో॥ స్మృత్యాగమ పురాణేషు। రుద్రాధ్యాయ ప్రశంసనం।
బహ్వస్తి తద్విస్తరేణ। రుద్రకల్పేఽభిధాస్యతే॥ 5

తా॥ స్మృతులు, ఆగమములు, పురాణములు, అనువానియందు, రుద్రాధ్యాయముయొక్క ప్రశంస ఎక్కువగా గలదు. అది విస్తరముగా రుద్రకల్పమందు జెప్పబడెను.

శ్లో॥ ఇహకర్మాంగతా యాదృక్। వర్ణితా బ్రాహ్మణేనతాః।
బోద్ధుం శబ్దార్థమాత్రస్య। వివృతిఃక్రియతేస్ఫుటా॥ 6

తా॥ బ్రాహ్మణమున, రుద్రమునకు జెందిన కర్మాంగత్వము సంపూర్ణముగా వర్ణింపఁబడినది. ఆవిషయ మెఱుగుటకు, శబ్దార్థ మాత్రమునకు వివరణము స్ఫుటముగా జేయఁబడుచున్నది.

కల్పము :— హోత ఉదఙ్ముఖుఁడై, ఉలవ గంజి తోడను, అడవి నువ్వుల గంజితోడను, అడవి గోధుమల గంజితోడను, శతరుద్రీయమునకు జెందిన హోమము చేయవలెను. లేదా, ఉలవలతోనో, అడవి నువ్వులతోనో, అడవి గోధుమల పిండితోనో, నేతితోనో, నేతిలో ముంచిన మేడి పుల్లల తోడను, దర్భపుల్లతోడను, యవధాన్యము తోడను, హోమము చేయవలెను. లేదా, మేకపాలతోడను, లేడిపాలతోడను, జిల్లేడాకులతోడను, హోమము చేయవలెను. ఉత్తరపు దిక్కుగాఁగాని, ఉత్తరాపర దిక్కుగాఁగాని, చివరలు వచ్చునట్లు, దర్భల నుంచి, నీరు జల్లవలెను, దర్భను స్వయముగా ద్రుంచి వేయవలెను. (పరిచారము ననుసరించి, చేయవలెను. "నమస్తే రుద్రమన్యవ"

అనెడి అనువాకములను, మూఁడుగా విభజించియు, ప్రథమానువాకమునుండి మొదలిడియు, ఁజేయవలెను. „నమస్తక్షభ్యః" అను వానిని, జాను ప్రమాణమున ధరింపవలెను. „రథకారేభ్యశ్చ" అనుదానితో మొదలిడి, నమస్స్వాయుధాయ" అనువరకుఁగల వానిని, నాభిప్రమాణమున హోమము చేయవలెను. మిగిలిన వానిని ముఖప్రమాణమున హోమము చేయవలెను. „సహస్రాణి సహస్రశః" అనునది మొదలుగా ఁబదియనువాకములతో హోమము చేయవలెను. పిమ్మట అన్వారోహములను హోమము చేయవలెను.

„నమోరుద్రేభ్యోయేపృథివ్యామ్" అని జానుప్రమాణమున ధరించిన వాఁడై „నమో రుద్రేభ్యోయేఽన్తరిక్షే" అనువానిని, నాభి ప్రమాణమున, „నమో రుద్రేభ్యోయేదివి" అనువానిని ముఖప్రమాణమున, హోమముచేసి, వానినే యజమానిచే ఁజదివించి, విపరీతములైన ఈ ప్రత్యవరోహములను, హోమముచేసి, సంచరమున ఁబశువులకు జిల్లేడు ఆకులను విడువవలెను. తన ద్వేషులకును సంచరమున ఉంచవలెను.

~X~



# శ్రీ రుద్రాధ్యాయస్య భట్టభాస్కర కృతోపోద్ఘాతము

మహారుద్రాయనమః. "ఓమ్" ప్రణవరూపుఁడైన మహారుద్రునకు నమస్కారము. అటుపిమ్మట అగ్ని ఋషిగాగల అగ్నికాండమునే ఆరాధింపవలెను. అట తుదిగానున్న ఇష్టకము నందు "నమస్తే రుద్రమన్యవ" అనెడి అనువాకముతో శతరుద్రీయమును హోమము చేయవలెను. "రుద్రోవా ఏషయదగ్నిః సవీతర్హిజాతః" అను బ్రాహ్మణము పై విషయమునకు ప్రమాణము.

రుద్రుఁడే ఈయగ్ని. రుద్రుఁడు అగ్నియై జన్మించెను అని పైవాక్యములకు అర్థము. "రుద్రోవా ఏషయదగ్నిః తస్యైతే తనువా ఇత్యాదిగ" అగ్నియైన రుద్రునకు ఇవన్నియు శరీరములు, అని పై వాక్యమునకర్థము. పై రెండు శ్రుతులును, రుద్రుఁడు అగ్ని స్వరూపుఁడనుటకు ప్రమాణములు.

"అజాక్షీరేణజుహోతి గ్రామ్యాణాం, పశూనాంపయసాజుహుయాత్" ఇత్యాది బ్రాహ్మణమ్. "అర్కపర్ణేన జుహోతీతి" "అంగిరస్సువర్గం లోకం యన్తః" ఇత్యాది బ్రాహ్మణమ్. అనెడి బ్రాహ్మణ శ్రుతులచే, మేకపాలతో హోమము చేయవలెను. గ్రామీణములైన పశువుల పాలతో హోమము చేయవలెను. జిల్లేడాకులతో హోమము చేయవలెను. అని హోమప్రక్రియ గూర్చి చెప్పఁబడెను. దానినాచరించు వారికి స్వర్గలోకము ప్రాప్తించుననియు చెప్పఁబడెను. అప్పుడు ప్రయోగమునకు చెందిన క్రమము చెప్పఁబడుచున్నది. ఎట్లన?

ఉత్తరాభిముఖుడై, ముఖప్రమాణమున ధరించుచు ''నమస్తే రుద్ర మన్యవే'' అనుదానిని ప్రతిపద్యాన్తమునఁజేర్చి, పలికి, ద్వితీయ చతుర్థాను వాకములను గుర్తించిన తర్వాత ''నమః కృత్స్నేభ్యః'' అని స్వాహాకారము చేయవలెను. తర్వాత తూర్పుగా అవరణముంచి, నాభిప్రమాణమున ధరించుచు ''సంగ్రహీతృభ్యశ్చవ'' అనుదానితో అవశిష్టము నొంది పలుకవలెను. పంచమ షష్ఠ సప్తమానువాకములను గుర్తించిన పిమ్మట ''నమోవర్యాయచ'' అనుదానితో స్వాహాకారము చేయవలెను. తర్వాత దక్షిణముగా అవరణ ముంచి, జానుప్రమాణమున ధరించుచు, ''నమోవర్యాయచ'' అనుదానితో అవశిష్టము నొంది పలుకవలెను. అష్టమ నవమైకాదశములను గుర్తించిన తర్వాత ''యఏతావంతశ్చ'' అనుదానితో స్వాహాకారము చేయవలెను.

''త్రేధావిభక్తంజుహోతి'' ''ఇయత్యగ్రేజుహోతి'' అను బ్రాహ్మణ వచనమననుసరించి, మువ్విధముల విభజించియు, ఏకభాగమును హోమము- చేయవలెను. ఈ విధమున తొంబదియారు మంత్రములు గలవు. పిమ్మట పడమరగా (దిరిగి, గుల్ఫ ప్రమాణమున ధరించుచు, ''నమో రుద్రేభ్యోయే పృథివ్యామ్'' అను మంత్రముతో హోమమొనర్చి, పై మంత్రమును యజమానిచే బలికించవలెను. ''తిస్రఉత్తరా ఆహుతీర్జుహోతి'' అను బ్రాహ్మణమున, ఉత్తర ముఖముగానుండి, మూడుసార్లు ఆహుతులను హోమము చేయవలెనని కలదు. ''ఏతావై దేవతాస్సువర్గ్యాయా ఉత్తమా'' అను మంత్రముతో నాభిప్రమాణమున ధరించుచు, ''నమో రుద్రేభ్యోయేదివి'' అను మంత్రముతో హోమమొనర్చి యజమానిచే (బలికించవలెను.

ఈ రుద్రాధ్యాయమునకు భగవానుడైన రుద్రుడే ఋషి. అగ్నికాండ ఋషియే ఛందస్సు, మహావిరాట్టైన శంభుడే దేవత. ప్రతి మంత్రమునకు జెందిన ఋష్యాదులు, వ్యాఖ్యానసమయమున (జెప్పఁబడఁగలవు. ఈయజ్ఞ సంయుక్తము కాని, లేక, యజ్ఞ సంయుక్తములైన ప్రయోగములుకాని కల్పము లగును. శ్రుతి స్మృతి పురాణాదులలో (ప్రసిద్ధములును, పావకుయకరములును,

మోక్షధర్మ ప్రతిపాదకములును, ధనారోగ్యాయుర్దాయాదుల నొసగుటయను ఫలములు పెక్కులుకలవు. వానిలో గొన్నింటిని జెప్పుదుము. ప్రతిమంత్రము నకు జెందిన ప్రయోగ విశేషములు, మున్ముందు జెప్పబడగలవు.

"అథహైనం బ్రహ్మచారిణఊచుః; కింజప్యేనైవామృతత్వమశ్నుతఇతి"
బ్రూహీతి; సహోవాచ యాజ్ఞవల్క్యః; శతరుద్రీయేణేతి"

బ్రహ్మచారులు యాజ్ఞవల్క్యుని గాంచి, అయ్యా! ఏమి జపించిన అమృతత్వము (మోక్షము) లభించునో చెప్పుడని యడిగిరి. శతరుద్రీయముచే మోక్షము లభించునని యాజ్ఞవల్క్యుడు వారికి సమాధానమొసగెనని, జాబాలోపనిషత్తులో గలదు

"ఏతానిహవా అమృతస్య నామధేయానిభవన్తి;
ఏతైర్వా అమృతో భవతీతి" కైవల్యోపనిషత్॥

ఈనమకమందలి నామములన్నియును, అమృతుడైన పరమాత్మ నామములు. వీనిచేతనే మోక్షము లభించునని, ముక్తుడగుననియు, గైవల్యోపనిషత్తులో గలదు.

"యశ్శత రుద్రీయ మధీతేసోఽగ్నిపూతో భవతి;
స్వర్ణస్తేయాత్పూతోభవతి; సురాపానాత్పూతోభవతి;
బ్రహ్మహత్యాత్ పూతోభవతి; కృత్యాకృతాత్పూతోభవతి;
తస్మాద విముక్తమాశ్రితోభవతి; అత్యాశ్రమీసర్వదాసకృద్వాజపేత్;
అనేన జ్ఞానమాప్నోతి; సంసారార్ణవనాశం, తస్మాదేవం విదిత్వైనం
కైవల్య ఫలమశ్నుతే; కైవల్య ఫలమశ్నుతఇతి". కైవల్యోపనిషది.

శతరుద్రీయమును అధ్యయనమొనర్చినవాడు, (అభ్యసించి, నిత్యము పఠించు వాడు) అగ్నివలె బవిత్రుడగును. స్వర్ణచౌర్యమనెడి మహాపాతకమొనర్చినను బవిత్రుడగును. సురాపాన దోషము తొలుగించుకొని పవిత్రుడగును. బ్రాహ్మణ హత్య అనెడి మహాపాతకమునుండియు విముక్తుడై పవిత్రుడగును.

నిత్యకృత్యముల నాచరింపకుండుట యనెడి దోషము తొలగించుకొని పవిత్రు డగును. అందువలన అవిముక్తుడైన (శాశ్వతముక్తుడైన) పరమాత్మనాశ్రయించినవాఁడగును. బ్రహ్మచర్యాద్యాశ్రమముల నతిక్రమించువాడై, ఎల్లపుడు నొకమారైనను శతరుద్రీయమును జపించినచో జ్ఞానము పొందును. శతరుద్రీయ పాఠకుఁడు సంసార సముద్రమును నశింపఁజేసికొనఁగలడు. అనగా జనన మరణరూప సంసారము తొలగినవాఁడగును. అందువలన ఈ మహత్వమెఱిగి, కైవల్యఫలమును అనగా మోక్షమును దప్పక పొందును; అని కైవల్యోపనిషత్తులోఁజెప్పబడెను. (1) నమకము (2) చమకము (3) పురుష సూక్తము (4) శ్రీసూక్తము (5) దుర్గాసూక్తము, అను వానిని జపించుటయు, వానితో రుద్రాభిషేకమొనర్చుటయును, శతరుద్రీయాధ్యయనమే అగును.

**ఆహశాతాతపః :—**

"స్తేయంకృత్వా గురుదారాంశ్చగత్వా, మద్యంపీత్వా,
బ్రహ్మహత్యాంశ్చకృత్వా।
భస్మచ్ఛన్నో, భస్మశయ్యాశయానో, రుద్రాధ్యాయీ
ముచ్యతే సర్వపాపైః॥" ఇతి

దొంగతనము చేసియు, గురు భార్యను బొందియు, కల్లు త్రాగియు, బ్రాహ్మణులను సంహరించియు, మానవుఁడు మహాపాతకములను బొందుచున్నాడు. అట్టి వాఁడును భస్మనుదేహమున బూసికొని, భస్మనే పాన్పుగావించి, దానిపై నిద్రించియు, శ్రీనమక చమకములను నిత్యము పఠించినచో, పై పాపముల నుండి విముక్తుడగును; అని శాతాతపుఁడు పల్కెను.

**ఆహచయాజ్ఞవల్క్యః :—**

"సురాపస్స్వర్ణహారీచ రుద్రజాపీజలేస్థితః।
సహస్రశీర్షజాపీచ ముచ్యతే సర్వకిల్బిషైః॥"

కల్లు త్రాగుటచే, బంగారమును అపహరించుటచే పాతకుడైన మానవుడు కూడ నీటనుండి, శ్రీ నమక చమకములను, ఋషభ సూక్తమును జపించినచో, సర్వపాపముల నుండి విముక్తుడగును.

"శుక్రియారణ్యక జపో, గాయత్ర్యాశ్చ విశేషతః।
సర్వపాపహరా హ్యేతే రుద్రైకాదశినీ తథా,"
వేదమేకగుణంజప్త్వా, తదహ్నైవవిశుద్ధ్యతి।
రుద్రైకాదశినీంజప్త్వా, తదహ్నైవవిశుద్ధ్యతీతి॥

శుక్ల యజుర్వేద మందలి ఆరణ్యక భాగమును జపించుట, గాయత్రిని జపించుట, పదునొకండుసార్లు రుద్రాధ్యాయమును పఠించుట, అనునివి సర్వపాపములను హరించును. ఒకే దినమున వేదమును బూర్ణముగా పఠించువాడు ఆదినముననే విశుద్ధుడగును. అట్లే ఒకే దినమున రుద్రాధ్యాయమును పదునొకండు సార్లు జపించువాడు ఆదినముననే విశుద్ధుడగును, అని యాజ్ఞ్యవల్క్యుడు పలికెను.

***ఆహశంఖః :—***

"సువర్ణస్తేయీ, రుద్రాధ్యాయీ ముచ్యత ఇతి"

బంగారమపహరించుట మహాపాపము. అట్టి పాపమాచరించినవాడును, రుద్రాధ్యయనమొనర్చినచో ముక్తుడగును.

***ఆహతురత్ర్యంగిరసౌ :—***

"ఏకాదశ గుణాన్వాపి, రుద్రానావృత్య ధర్మవిత్।
మహాపాపైరపిస్పృష్టో ముచ్యతేనాత్రసంశయః"

ధర్మవేత్త పదునొకండు పర్యాయములు, రుద్రమంత్రములైన నమకచమకములను ఆవృత్తిచేసి, పఠించినచో, మహాపాపములతో స్పృశింపబడినను,

ముక్తుఁడగును. ఈ విషయమున సందేహము లేదు; అని అత్రియును, అంగిరసుఁడును బల్కిరి.

*వాయుప్రోక్త పురాణే :—*

"యశ్చ రుద్రాన్ జపేన్నిత్యం, ధ్యాయమానో మహేశ్వరం।
యశ్చ సాగర పర్యన్తాం సశైలవనకాననాం।
సర్వా త్మ గుణోపేతాన్ సువృక్ష జలశోభితాం।
దద్యాత్కాంచన సంయుక్తాం భూమించౌషధిసంయుతాం।
తస్మాదప్యధికంతస్య సకృద్రుద్ర జపాద్భవేత్।
మమభావం సముత్సృజ్య, యస్తురుద్రాన్ జపేత్సదా।
సతేనైవచదేహేన, రుద్రస్సంజాయతే ధ్రువం।
జపేనానేన విప్రేంద్రాన్, నృపాశ్చాన్యే ద్విజాతయః।
హిత్వైవ సంకలంపాపం గతాశ్శివపురంపురా।
అహంచ పరమేశస్య సామీప్యం లబ్ధవాన్ తథేతి॥"

మహేశ్వరుని ధ్యానించుచు, రుద్రములను (నమకచమకములను) నిత్యము జపించువాఁడు ముక్తుఁడగును. భూమిపై (బర్వతములు, తోటలు, మహారణ్యములును గలవు. భూమి మహావృక్షములతోడను, జలము తోడను, శోభిల్లియున్నది. దాని నిండ బంగారు గనులు గలవు. ఓషధులు మిక్కుటముగాఁగలవు. అట్టి భూమండలమును, ఆత్మగుణోపేతులైన అనగా సుగుణ సంపన్నులైనవారికి అందఱికిని దానముగా నొసంగవలెను. అట్టి భూమి నంతటిని సంపూర్ణముగా నొసంగిన దాత, రుద్రమంత్రములను ఒక్కసారి జపము చేసిన, తానిచ్చిన భూమికంటె అధికముగా భూమిని (బొందఁగలడు మమకారమును(నాదియను భావమును) బాగుగా విడనాడి, నమకచమకము లను, సదా జపించుఁవాడు, ఆ దేహముతోడనే రుద్రుఁడై జన్మించును. అది నిశ్చయము. ఈ రుద్రజపముచే విప్రోత్తములు, రాజులు, ఇతరులైన

ద్విజన్ములును(వైశ్యులు) సకల పాపములను బోగొట్టుకొని, పూర్వము శివపుర మైన కైలాసమును బొందిరి. నేనును అట్టే శివసాన్నిధ్యరూప ముక్తిని బొందితిని; అని వాయుపురాణమునఁగలదు,

"నమకం చమకంచైవ పురుషసూక్తంతథైవచ।
నిత్యంత్రయంప్రయుంజానో బ్రహ్మలోకేమహీయతే"

తా॥ నమకము, చమకము, పురుషసూక్తము, అను మూడింటిని, నిత్యము ఆచరణలో నుంచి, పఠించువాఁడు బ్రహ్మలోకమున మహత్వము నొంది యుండును.

"నమకం చమకం హోత్రాన్ పురుష సూక్తం జపేత్సదా।
ప్రవిశేత్స మహాదేవం గృహం గృహపతిర్యథా"

తా॥ నమకమును, చమకమును, చిత్రిపన్నమును, బురుష సూక్తమును, నిత్యము జపించువాడు, ఇంటి యజమాని ఇంటిలోఁ బ్రవేశించినట్లు, మహా దేవునిలోఁ బ్రవేశించును. అనగా శివసారూప్యమనెడి ముక్తిని బొందును.

"భస్మ దిగ్ధ శరీరస్తు భస్మశాయీ జితేంద్రియః।
సతతం రుద్రజాప్యోఽసౌపరాంముక్తిమవాప్స్యతి"

తా॥ భస్మమును దేహమున బూసికొని, భస్మమున శయనించి, జితేంద్రియుడై, సతతమున నమక చమకములను జపించువాడు, పరమమైన ముక్తిని అనగా శివసాయుజ్యమును బొందఁగలడు.

"రోగవాన్ పాపవాంశ్చైవ రుద్రం జప్త్వా జితేంద్రియః।
లోగాత్పాపాద్వి నిర్ముక్తో హ్యతులం సుఖమశ్నుతే"

తా॥ రోగవంతుఁడు పాపవంతుఁడునైనవాఁడు, జితేంద్రియుడై, నమకచమక ములనుజపించి, రోగహీనుఁడై, పాపహీనుడై, సాటిలేని మోక్షసుఖమును బొందును; అని వాయుపురాణమునఁ గలదు.

**అహశంఖః :—**

"రహసికృతానాం మహాపాతకానామపి శతరుద్రీయం ప్రాయశ్చిత్తమితి"

రహస్యముగాఁ జేసిన మహాపాతకములను సైతము పోఁగొట్టుకొనుటకు శత రుద్రీయమే ప్రాయశ్చిత్తమని, శంఖుఁడు వక్కాను.

**అహాపస్తంబః :—**

"యస్యరుద్రః ప్రజాఃపశూన్వాభిమన్యేత, ఉదబ్జ
రేత్య రుద్రాన్ జపన్ చరే దిత్య యజ్ఞసంయుక్తః కల్ప ఇతి"

రుద్రములను జపించువాఁడు సంతానమును, పశువులను బొందును; అని కల్పమునఁ జెప్పఁబడెను.

**ఈశానయజ్ఞేచ :**

"అత్రరుద్రాన్ జపేత్ ప్రథమోత్తమావేతి"

అయంచ బ్రహ్మవిద్యా రూపత్వాత్ ఉపనిషన్మంత్రరాశిః ప్రశ్నః"

ఉపనిషత్తు బ్రహ్మవిద్యా రూపము, అనగా బ్రహ్మవిద్యను బ్రతిపాదించును. రుద్రములుసంహితలోనివికదా? అవి ఉపనిషత్తులలోఁజేరునా? బ్రహ్మవిద్యను బ్రతిపాతించునా? సంహిత, ఉపనిషత్తు, అనువానిలో నేది ప్రథమము? ఏది ఉత్తమము?? రుద్రములను జపించవలెనందురు కదా? ఏమిచేయుటయని ప్రశ్న ఒదవెను.

"అతఏవ రహస్య ప్రకరణే ఆమ్నాయతే బ్రాహ్మణ వీని
యోగానురోధేనత్వత్ర్యాచక్ష్మహే। ఏక శతమ
ధ్వర్యు శాఖాస్తాసు సర్వాసుచేయం రుద్రోపనిషదామ్నాయతే।
శతంరుద్రాదేవతా అస్యేతి శతరుద్రీయ ముచ్యతే
శతంరుద్రాద్ధశ్ఛేతిథప్రత్యయః। అనయాచ రుద్రో

పనిషదాబ్రహ్మ విద్యా ప్రతిపాద్యతే"

దానికి సమాధానమిట్లు కలదు

వేదభాగాలలో సంహిత ప్రథమమునఁ గలదు. బ్రాహ్మణము ద్వితీయ భాగము. ఉపనిషత్తు తృతీయ భాగము. మూడింటికినీ సమిష్టిగానే వేదమను సంజ్ఞ కలదు. మూడింటను బ్రహ్మపదార్థ బోధకలదు. రుద్రములనెడి ఈ నమక చమకములు సంహితలో 4వ అష్టమునఁగలవు. అయినను వీనికి రుద్రోపనిషత్తు అనియు నామము గలదు. అందుచేతనే రహస్య ప్రకరణమున ఈ విషయము వివరింపఁబడినది. బ్రాహ్మణ వినియోగానురోధముతో (బ్రహ్మ పదార్థబోధలో ఇది వినియోగింపఁబడునను తలంపుతో) ఇట విమర్శించి, విశేషించి చెప్పుచున్నాము. పరికింపగా అధ్వర్యు శాఖలు నూటయొకటి (101) కలవు. వానిలో అన్నింటియందును ఈ రుద్రోపనిషత్తు చెప్పఁబడుచున్నది. బ్రహ్మపదార్థబోధచే దీనికి ఉపనిషత్తుఅను సంజ్ఞయుఁగలదు. దీనికి నూర్వుర రుద్రులు దేవతగాఁ గలరు. కాన ఇది శతరుద్రీయమను నామమునఁ జెప్ప బడుచున్నది. ఈ రుద్రోపనిషత్తుచే బ్రహ్మవిద్య ప్రతిపాదింపఁబడుచున్నది.

"బ్రహ్మణస్త్రీణి రూపాణిసంతి
ఏకం కార్యరూపం సర్వోపాదానతయాసర్వాత్మకమ్.
ఇతరత్ పురుషాఖ్యం సృష్టిస్థితి సంహారనిమిత్తమ్
ద్వయమప్యా విద్యకమ్
అన్యత్ పరంరూపం, నిర్గుణం,నిరంజనం, సత్యజ్ఞానానందలక్షణమ్."

పరబ్రహ్మకు మూఁడు రూపములు కలవు. వానిలో నొకటి కార్యమైన జగద్రూపము (బ్రహ్మాండరూపము) కలది. కార్యమైన జగత్తులోఁ బరమాత్మ, ఉపాదాన కారణముగా (ప్రధాన కారణముగా) సకల వస్తు స్వరూపముగాఁ గలడు. రెండవదైన పరబ్రహ్మరూపము పురుషుఁడను పేరుకలది. అదియే జగత్తుయొక్క సృష్టి స్థితి లయములకు నిమిత్తమైయున్నది. పరమాత్మకుఁగార్య కారణరూపముగా నేర్పడిన ఈ రెండును అవిద్యా ప్రభావముచేఁగల్గినవే.

ఈ కార్యకారణరూపములు రెండింటికంటె అతీతముగా, సూక్ష్మముగానున్న మూలతత్వరూపము "పరము" అనుసంజ్ఞకలది. అది సత్వరజస్తమోగుణరహితము కాన నిర్గుణము. నిరంజనము (లోకసంబంధము లేనిది). తామరాకుపై నీరు వలె ఉండునది. ఆ మూలతత్వ రూపము "సత్యము, జ్ఞానము, ఆనందము" అను మూడును లక్షణములుగాఁ గల్గియున్నది.

తదేత దృషిణాప్యుక్తమ్, "విశ్వం భూతం భువనం, చిత్రం, బహుధా జాతం,జాయమానంచయత్। సర్వోహ్యేష రుద్రః" ఇతి.

ఆ పరమాత్మయే ప్రకృతిననుసరించి, విశ్వమాయెను. అందుఁ జిత్రములైన భువనములు కలవు. అవియును బరమాత్మయొక్క రూపాంతరములే. వానిలోఁ జీమ మొదలు, బ్రహ్మ వరకు బహువిధ జీవకోట్లు కలవు. ప్రాణరహిత వస్తువులు కలవు. వాటన్నిటిలో (బరమాత్మ అణురూపమునఁ గలడు. ప్రకృతి మహిమచే అనేక విధములఁ బుట్టినాడు. పుట్టుచున్నాడు. అదంతయు నాతని క్రీడ. కావున ఈకానవచ్చునదంతయు రుద్రుఁడే; అని ఋషిచేఁ జెప్పఁబడెను.

"యోదేవానాం ప్రథమంపురస్తా ద్విశ్వాధియో రుద్రోమహర్షిః" ఇతిచ,

రుద్రుఁడే దేవతలలో (ప్రథముఁడు. అతడే ఈ సమస్త విశ్వమును అయెను; అని చెప్పెను.

"సంసారీ చిదచిద్వ్యక్తోఽవ్యక్తః క్వచిత్క్వచిద నావిలం।
జయత్యనాదినిధనో మహాదేవో మహార్ణవః" ఇతి.

సంసార హీనుడైన పరమాత్మ మాయాసంబంధముచే సంసారియాయెను. ఒకప్పుడు చిత్తుకంటెను, అచిత్తుకంటెను అన్యుఁడుగా నుండెను. ఒకప్పుడు జనన మరణరూపమలము లేక నిర్మలుఁడైయుండెను. ఆద్యంతము లులేనివాడై సర్వోత్కృష్టుడై యుండెను. ఈ కానవచ్చు జగత్తు, మహార్ణవము కూడ ఆ మహా

దేవుఁడే అనియుఁజెప్పఁబడెను.

"మూర్త్యష్టక మధిష్ఠాయబిభర్తీదంచరాచరం।
ఆత్మత్రయ మధిష్ఠాయ, సృష్ట్యాది ప్రకరోతిసః॥

మహాదేవుఁడే, (1) ఆకాశము, (2) వాయువు, (3) అగ్ని, (4) నీరు, (5) పృథివి, (6) సూర్యుఁడు, (7) చంద్రుడు, (8) సోమయాజి, అను నెనిమిది మూర్తులను అధిష్ఠించి, ఈచరాచర ప్రపంచమును భరించుచున్నాడు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులనెడి మూఁడాత్మలను అధిష్ఠించి, సృష్టి స్థితి లయము లను అతఁడే చేయుచున్నాడు.

"తత్రయోఽసౌసంహార కర్తాతంసర్వదాదేవోఽధితిష్ఠతి।
కార్యకాలే, త్వన్యా, సా, చ, దేవస్య, ఘోరా, తనూః; అన్యాశివా॥"

సృష్టి స్థితి సంహారములలో సంహారమనెడి క్రియను సదా ఆచరించు దేవుఁడు, ఈ మహాశివుఁడే. అతడే సంహారమూర్తిని అధిష్ఠించియున్నాడు. పరమాత్మ కారణము ఈ బ్రహ్మాండమంతయు, అతని కార్యము. ఈ సృష్టికార్యమాచ రించు కాలమున, ఆ దేవదేవుని శరీరము "ఘోరా" అను పేరుతోఁగలదు. కారణరూపముతోనున్నపుడు అతని శరీరము "శివా" అనుపేరుతో గలదు.

యథోక్తమ్; "రుద్రోవా ఏషయదగ్నిః,
తస్యైతే తనువౌ, ఘోరాన్యా, శివాన్యేతి"

ఈ యగ్ని రుద్రుఁడే. ఆతనికి ఘోర, శివ, అను నామధేయములతో రెండు శరీరములు కలవు.

"యచ్ఛత రుద్రీయంజుహోతి, యైవాస్య ఘోరాతనూః,
తాంతేన శమయతీత్యాదిచ"

శతరుద్రీయముతో, "ఘోర" అను పేరుగల శివుని శరీరము గూర్చి, హోమము చేయుదురు. ఆ శతరుద్రీయము తోడనే, అఘోర అను నామము గల శరీరమును శాంతింపఁజేయుదురు.

"శక్తిశ్చ సర్వదా త్రివిధా సంహారకారిణీ తస్య॥
సంహారకర్తృపరిష్కృతయో, దేవస్య ఘోరాస్తనవః
తాసు భయ శంకా, తస్మాత్ ప్రథమేనానువాకేన,
తాదృశం, దేవం, క్రుద్ధం ప్రసాద్య, తస్యైవ సంహారకరణానిచ,
నమ ఇత్యాదిభిః, నమస్కృత్య ప్రసాదయతి."

సంహారకారిణి యున్నగు నామములతోనున్న మహాదేవుని శక్తులు ముత్త్రివిధములు. సంహారకారి యున్నగు నామములతోనున్న మహాదేవుని శరీరములును గలవు. వానికి "ఘోర" అను నామము గలదు. వాని విషయమున భయమును, జంకును భక్తులకుఁగలవు. అందువలననే ప్రథమాను వాకముతోఁ క్రుద్ధుఁడైన ఆ మహాదేవుని స్తుతించి, తమపై దయకల్గునట్లు భక్తులు కావించుకొందురు. "నమస్తే రుద్ర"యున్నగు మంత్రములతో మహా దేవుని క్రోధమును ఉపసంహరింపఁజేయుదురు. అందుచే. ఆ మంత్రములతో దేవుని నమస్కరించి, భక్తులు అతనిని ప్రసన్నుని గావించుకొనుచున్నారు. ఆ విషయమే

"యైవాన్య ఘోరాతనూః తాంతేన శమయతి"

అను మంత్రమున చెప్పఁబడెను.

"యద్వసోర్ధారాంజుహోతి"

అను మంత్రముతో "శివ" అను నామముగల శివుని శరీరమును, ఉపసంహ రించి, భక్తులు, అతనికి తృప్తినిగావించుచున్నారు.

"నమో హిరణ్యబాహవే" అను మంత్రముతో ఆరంభమైన ద్వితీయాను వాకము మొదలుగాఁగల ఎనిమిది యనువాకములతో, మహాదేవుని విశ్వ రూపమును, స్తుతించి, నమస్కరించుచున్నారు. ఇట్లు ఆచరించుటచే మహా శివుఁడు మిక్కిలి ప్రసన్నుఁడగుచున్నాడు. పిమ్మట 10,11, అనువాకములతో అభయ మొసగుమని శివుని యాచించుచున్నారు. ఇదియే మహావాక్యార్థము.

ప్రథమానువాకముతోఁ గ్రోధమందిన దేవుని ప్రసన్నునిఁ గావించి, పిమ్మట ఎనిమిదనువాకములతో, దేవుడేయధిష్ఠానము నధిష్ఠించికలఁడో తెలియని వారై, సమస్త చరాచర ప్రపంచమును అతని యధిష్ఠానమేయను శంకతో నమస్కరించి, తుదియనువాకములతో అభయమొసంగుమని భక్తులు ప్రార్థించినట్లు కొందఱు చెప్పిరి. ఏమైననేమి?

స్వయం ప్రకాశమానుఁడైన మహాశివుఁడు పరమ స్వాతంత్ర్యము కలవాఁడు. అందుచేఁ గొంచెము కొంచెము ప్రకృతి నధిష్ఠించి, జగత్తునకుఁ జెందిన నిగ్రహానుగ్రహములను ఆచరించుచున్నాడు; అని చెప్పవచ్చును. అది యుక్తముగానున్నట్లున్నది. ఏమన?

(1) యక్ష రూపమున ఆవిర్భవించి, దేవతలను వ్యామోహపఱచెను.

(2) విటవేషమును దాల్చినవాఁడై భార్యలతోఁగూడి, రమించి ఋషులను వ్రతమునుండి తొలగించెను.

(3) కిరాత వేషమును దాల్చినవాఁడై పాండుపుత్రుఁడైన అర్జునునితో యుద్ధక్రీడ సల్పెను.

(4) భైరవ బీజ శరీరముతో ఎట్లో వేషముదాల్చిన పార్వతీదేవితో సహక్రీడించి, గజాననుని జనింపఁజేసెను.

(5) ఇంద్ర రూపముతో ఒకానొక భృత్యుని సమీపించి, తపము నుండి తొలగింపఁదలంచెను.

(6) అర్భకుని రూపములోఁ పార్వతీదేవి తొడపైఁ గూర్చుండి యుండెను.

(7) గుప్తగూఢ రూపముతో ఒకానొక ఋషికి జ్ఞానముపదేశించెను,

(8) ఉన్మత్త వేషభూషితుఁడై, దేవోత్త మునికి, అలంకృతమైన తన జననమును జగత్కారణముగా ప్రదర్శించెను.

(9) నేరముచేసిన కారణమున దననుదాను జంపుకొనఁగోరిన ఒకానొక భృత్యుని, ఆ పని నుండి నివారించుటకు బట్టలనుతుకు జాతినుండి ప్రభవించెను.

(10) నేల కన్నమునుండి జారిన హవిస్సును, ఒకానొకని కక్కడనే ప్రత్యక్షమై భుజించెను.

ఇట్లు తనకిష్టమైన వివిధవేషములను, వివిధ రూపములను స్వీకరించి, క్రీడించు దేవదేవునియొక్క విలాసమై, ఈయైశ్వర్యమంతయు బ్రవర్తించు చున్నదని తోచుచున్నది. అందుచే భక్తులు ఈతని విశ్వరూపప్రభావమును, రెండు నుండి యెనిమిదనువాకములు పూర్తియగు వఱకును స్తుతించి, నమస్కరించిరి.

"చరితానివిచిత్రాణి గుహ్యాని గహనానిచ।
బ్రహ్మాదీనాంచ సర్వేషాందుర్విజ్ఞేయోఽసి శంకర!"

తాత్పర్యము :— శంకరా! నీ చరిత్రములు విచిత్రములు. రహస్యములు. చాలా గహనముగా (క్లిష్టముగా) నున్నవి. అందుచే బ్రహ్మాదు లందఱికిని దెలిసికొనశక్యము కాకయున్నవి.-అని పెద్దలచేఁజెప్పఁబడెను.

—: ఉపోద్ఘాతము సమాప్తము :—



—: శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః :.





# శ్రీరుద్రాభిషేక మాహాత్మ్యము

:: శ్రీ నమక-చమక భాష్యాంధ్ర వివరణము ::

:: అర్థపంచకసహితము ::

1) యజ్ఞపరము, 2) శివపరము, 3) విష్ణుపరము,

4) శాక్తాద్వైతపరము, 5) విజ్ఞా[illegible]పరము.

## 1వ మంత్రము :

*నమస్తే రుద్ర మన్యవ ఉతోత ఇషవే నమః।*
*నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యాముత తే నమః॥*

**అర్థము :—**

హే రుద్ర! = ఓ ఈశ్వరుడా!, తే = నీదగు, మన్యవే = కోపమునకు, నమోఽస్తు = నమస్కారము అగుగాక. ఆ కోపము మా వైరుల పట్లనే ప్రస రించుగాక. మావట్ల ప్రసరింపకుండుగాక , ఉత = అంతేకాదు, తే = నీయొక్క, ఇషవే = బాణమునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక. అటులనే, తే = నీయొక్క, ధన్వనే = ధనస్సునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక, ఉత = అంతేకాదు, తే = నీయొక్క, బాహుభ్యాం = ధనుర్బాణ సహితమైన హస్తములకు, నమోఽస్తు = నమస్కారమగుగాక. ఈ సమస్తము వైరులపట్లనే తప్ప నావట్ల ప్రవర్తింపకుండుగాకయని అభిప్రాయము.

**తాత్పర్యము :—**

సా.భా. :— ఓ రుద్రుడా! నీ కోపమునకు నమస్కారము. ఆ నీకోపము నా బాహ్య శత్రువులపైని, నా యాంతరంగిక శత్రువులైన కామక్రోధాదులపైని ప్రవర్తించునుగాక. అనగా నన్ను బాహ్యశత్రుహీనునిగా, అరిషడ్వర్గహీనునిగా. చేయుదువుగాక. అంతేకాదు, నీ బాణమునకు, నీ ధనుస్సునకు, ధనుర్బాణ సహితములైన నీ బాహువులకును, ఇదే నా నమస్కారము .

భ.భా. భాష్యము :— పై మంత్రమునకు గశ్యపుడు ఋషి. రుద్రుడు దేవత. అనుష్టుప్పు ఛందస్సు. ఇది మొదలు పంచమంత్రములు ప్రత్యేక కృతములు.

**విశేషములు :—**

"ఓం, స్వాహా, స్వధా, వషట్, నమః" అనునవి పంచ బ్రహ్మలకు నామములు. వాఙ్మనః కాయములచే ఆరాధించు భక్తులకు వశుఁడగుటను, సంపాదించు నమశ్శబ్దము, పరబ్రహ్మతత్త్వమునకు అపర నామధేయము.

(1) రోదయతీతి రుద్రః = అంత కాలమున అంతటిని ఏడిపించు వాడని యర్థము.

ఈ రుద్ర శబ్దమునకుఁ బౌరాణికార్థములు పెక్కులు కలవు. అవేవన?

(2) రుత్ = నాదాంతే, ద్రవతి, ద్రావయతీతివా, రుద్రః = నాదా స్తమున ద్రవించువాడు, ద్రవింపఁజేయువాఁడు; అనగా మార్కండేయాది భక్తుల మొఱవిని, మనసు కరగుటచే, దయచూపి, రక్షించి, ఆనందపఱచువాడు.

(3) రుత్యా = వేదరూపయా = వేదస్వరూపమైన రుతిచే ధర్మాదు లను లోకమున కందించి, వ్యాపింపఁజేయువాడు. అనగా మహాదేవుఁడు వేద ములద్వారా లోకములందు ధర్మములను వ్యాపింపఁ జేసెనన్నమాట.

(4) రుత్యావా గూర్వయావాచ్యం ప్రాపయతి = అనగా వేదములు శాస్త్రములు, పురాణములు, కావ్యములు, స్తోత్రములు, మున్నగునవన్నియును. వాఙ్మయములే. వానిద్వారా, వేదవాచ్యమైన, అలౌకిక బ్రహ్మస్వరూప మును, ప్రకృతి విషయములను, లోకమునకుఁ దెలియజేయువాఁడు మహా దేవుడే.

(5) రుత్యా ప్రణవరూపయా స్వాత్మానంప్రాపయతి = అనగా ప్రణవరూపమునఁదన స్వరూపమును ప్రకటించి, పొందించువాఁడు. ప్రణవ మనగా ఓంకారము. "అ+ఉ+మ్" పై మూడక్షరములును, విశ్వతైజస ప్రాజ్ఞులనఁబడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను దెలియఁజేయును.

"అకారోనయతే విశ్వముకారశ్చాపితైజసం।
మకారశ్చ తథాప్రాజ్ఞం, నామాత్రా విద్యతేక్వచిత్॥"

అనెడి మాండూక్యోపనిషద్వాక్యము పైవిషయమునే ప్రకటించును.

(6) రుద్రోరౌతీతి;సత్యేరోరూయమాణోద్రవతి, ప్రవిశతిమర్త్యాన్ = రౌతి. అనగాఁ దాండవసమయమున, సప్తస్వరసమయమును, నాదబ్రహ్మ రూపమునగు, ధ్వనిగావించువాఁడని యర్థము. లేక, సత్యము నందు, అనగాఁ బరబ్రహ్మలో, జీవులనుగర్మఫలానుభవాంతమునఁజేర్చువాఁడు లేక సృష్ట్యారంభవమున బ్రహ్మయందలి మాయశక్తి, వృషభరూపయై అనగా జీవరూపయై, స్వయంప్రకాశమానయై, మహానాదమొనర్చుచు, మర్త్యులను, అనగా మరణస్వభావులైన జీవులను జేరును; అనియుఁ జెప్పవచ్చును.

"చత్వారిశృంగాః, త్రయో అస్యపాదా, ద్వేశీర్షే, సప్తహస్తాసోఅస్య।
త్రిధాబద్ధో వృషభోరోరవీతి, మహాదేవో మర్త్యాగ్ంఆవివేశ"

అను శ్రుతియుఁబై విషయమునే బ్రకటించుచున్నది. ఎట్లన?

పరబ్రహ్మయే మహాదేవుఁడు. అనగా స్వయంప్రకాశమానుడు. అతనిలో గల శక్తియే, మూలప్రకృతియే వృషభము "శక్తిశక్తిమంతులకభేదమూ" అను న్యాయమున, శక్తిమంతుఁడైన మహాదేవుఁడే, శక్తియైన వృషభమై అతిశయనాదమొనర్చుచు, జీవులలో జేరునన్నమాట.

అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమేపరాం।
జీవభూతాం మహాబాహోయయేదంధార్యతే జగత్॥

అను గీతాసూక్తిలోఁజెప్పిన పరాప్రకృతియే వృషభము. అదియే జీవభూతమై జగత్తును ధరించుచున్నది. ఆ వృషభము, ఇలా, పింగళా, సుషుమ్నానాడులతోడను, సత్వరజస్తమోగుణములతోడను, బద్ధమైయున్నది. అదియే రోరూయమాణమగుచు, మర్త్యులను బ్రవేశించినది; అని పై శ్రుతి తెలియఁజేయుచున్నది.

(7) రుక్ అనగా తేజస్సు. "భూమ్నినిత్యయోగేవారపప్రత్యయః" అను సూత్రముచే, రప్రత్యయముచేరి, వర్ణవ్యావృత్తి జరుగగా రుద్రః అను

పడమేర్పడెను. అందుచే రుద్రుఁడనగా తేజశ్శాలి అనియర్థమేర్పడెను.

(8) రోధిక, బంధిక, మోహిక, అను శక్తులు కలవాఁడై భక్తులను ద్రవింపఁజేయును. అనందవలనను గాన రుద్రుఁడాయెను.

(9) "రుదం సంసార దుఃఖం ద్రావయతి" అనగా సంసార దుఃఖమును తొలగించువాఁడని యర్థము.

"అశుభ ద్రావకో రుద్రో యఃజహార పునర్భవం।
తస్మాచ్ఛివస్తతో రుద్రశబ్దేనాత్రాభిధీయతే॥"

అను సూక్తియుఁబైవిషయమునే వ్యక్తముసేయుచున్నది. ఎట్లన? శివుఁడు తననుగొల్చువారి యశుభములను దొలగించి, వారి పునర్జన్మను హరించువాడు కావున రుద్రుఁడాయెనని తెలుపుచున్నది.

(10) రుతః = శబ్దం, ద్రాతి = దదాతీతిప్రాణోరుద్రః శబ్దము నొసంగుఁవాఁడు కావున రుద్రుఁడు ప్రాణస్వరూపుఁడాయెను.

(11) "రుతిం = శబ్దంవేదాత్మానం బ్రహ్మణేదదాతి కల్పాదౌ" కల్పాదిలో వేదరూపమైన శబ్దమును బ్రహ్మకొసంగునుగావున రుద్రుఁడాయెను.

"యోవైవేదాంశ్చప్రహిణోతితస్మై" అను సూక్తియు బైవిషయమునే ప్రకటించుచున్నది. పైనఁబేర్కొన్న శక్తులున్నకారణమున, నమస్వరూపుఁడైన అనగా బ్రహ్మస్వరూపుఁడైన రుద్రునకుఁ దొలుత నమస్సులు ఆచరింపబడెను.

భక్తుఁడు పరమశివుని మన్యువునకుఁ దొల్త నమస్కరించెను. మన్యువు అనగా క్రోధము. శివుని క్రోధము అణుశక్తి వంటిది. దానికి గురియైనవాడు మన్మథునివలె భస్మమగుద్దురు. శివుని క్రోధమెక్కినవారు కావున మన్మథ

దహనానంతరము దేవతలెల్లరు విచ్చేసి, "క్రోధం ప్రభో సంహార సంహార" అని విలపించినట్లు మహాకవి కాళిదాసు పేర్కొనినాడు. భక్తులపట్ల క్రోధమును ఉపసంహరింపవలసినదిగాఁ బ్రతిమానవుఁడు ప్రార్థించును. పిమ్మట శివుని శరంబునకు నమస్కారము సమర్పింపఁబడెను. శివుని శరము సోముఁడు, అనగాఁ జంద్రుఁడు అని "తఇషుగ్ం సగ్స్కుర్వతాగ్నిమనీకగ్ం సోమగ్ం శల్యం విష్ణుం తేజనమ్" అనుమంత్రమువలనఁ దెలియుచున్నది. పైమంత్రము వలన శివునకు అగ్ని సైన్యముగను, చంద్రుఁడు శరముగను, విష్ణువు తేజన ముగనున్నట్లు తెలియుచున్నది.

"తస్యా అగ్ని రనీకమాసీత్, సోమశ్శల్యో విష్ణుస్తేజనం, వరుణః పర్ణాని" అను సూక్తియుఁ బైవిషయమునే స్పష్టపఱచుచున్నది.

"ఓషధయస్సంవదన్తే సోమేన" అను శ్రుతివలన సోముడు ఓషధీశుఁడని తెలియుచున్నది. ఏ సస్యమైనను జంద్రకిరణ ప్రసారము చేతనే ఆహారమును గైకొనును. సస్యబీజములు సూర్యకిరణ ప్రసారముచే గట్టిపడును. పంట కాలమున సూర్యచంద్రకిరణ ప్రసారములేకున్నచో సస్యములన్నియును బొల్లు గింజలతో నిండును. "ఓషధీభ్యోఽన్నం" అను శ్రుతిలోఁజెప్పినట్లు ఓషధుల నుండియే, చెట్లు, లతలు, చేలు మున్నగువానినుండియే ప్రజలకాహారము లభించును. లేకున్నచోఁ బ్రజలు అన్నహీనులగుదురు. సూర్యుని తేజస్సే చంద్రునిలోఁజేరును. అందుచేఁ జంద్రకిరణ ప్రసారమే లేకున్నచోఁ బ్రకృతి యంతయును అనారోగ్యభూయిష్ఠమగును. అట్టి సోముఁడు శివుని శరము కావున, సోమునిలోని శక్తులన్నియును శివుని శరంబునఁ గలవన్నమాట. అందుచే సోమాత్మకమైన శివ శరంబు సృష్టికంతటికిని, ఆహారారోగ్యముల నొసంగుగాక; అని శివుని శరంబునమస్కరింపఁబడెను.

"బాహుభ్యాముత తే నమః" అని నమః పదము బాహుపదముతో జోడించుటచే బ్రహ్మశక్తి సంపన్నము శివుని శరంబని తెలియుచున్నది,

"క్షోణీరథోహరిశ్శరః" అను సూక్తిచే శివుని శరంబున నారాయణ తేజస్సు కలదని తెలియుచున్నది.

పిమ్మట పరమశివుని ధనస్సునకు నమస్కారము సమర్పింపఁబడెను. "హుంకారేణైవధనుషా" అను కాళిదాస సూక్తియు శివునకు హుంకారమే ధనస్సు అని తెలియుచున్నది. అట్టి హుంకారముచేఁ బెక్కురు రక్కసులు శివునిచే సంహరింపఁబడిరి.

హుంకారమందలి ఉకారమకారములు తైజసప్రాజ్ఞులను సూచించును. అనగా విష్ణువును, శివుని తెలియఁజేయును. అందుచే హుంకారము శివకేశవ శక్తిసంపన్నము. అది శివ ధనుస్సు కావున దానిని నమస్కరించిరి.

"కనకశైలో దేవస్యధనుః" అను పౌరాణిక సూక్తిచే శివునకుఁ ద్రిపుర సంహార సమయమున, బంగారు కొండయగు మేరువు ధనుస్సాయెను. మేరువులోఁగల వస్తులన్నియు శివధనుస్సులోఁగలవన్నమాట. పృథుచక్రవర్తి పరిపాలనలో ధర్మము నాల్గుపాదములతో నడచిన కారణమున భూభార మధికమాయెను. ఆ భారము తగ్గించుకొనుటకై భూమి గోరూపము దాల్చగా, హిమవంతుడు దోగ్ధకాగా మేరువు దూడ ఆయెను. భూమిలోఁగల సకలవస్తువులను సాస్థామేరువులోఁ జేరెను. అందుచే మేరురూప ధనస్సులోగల వస్తువులు తమకు లభింపవలెనన్న యాశతో భక్తులు శివ ధనుస్సును నమస్కరించిరి.

మహాభారతమునందలి—

సకృత్వా ధనురోంకారం సావిత్రింజ్యాంమహేశ్వరః।
హయాంశ్చ చతురోవేదాన్ సర్వదేవ మయోరథః॥"

అను శ్లోకమును బరిశీలించినచో మహాదేవుని రథము, సర్వదేవమయమనియు, నాల్గువేదములశ్వములాయెననియు, సావిత్రి వింటిత్రాడాయెననియు, ఓంకా

రము ధనుస్సు అయినదనియుఁ దెలియుచున్నది. ఓంకారము త్రిమూర్త్యాత్మకము సృష్టి స్థితి లయములు గావించుటకు ఇచ్ఛాక్రియాజ్ఞాన శక్తులు మూఁడును ధనుస్సులోనున్నవన్నమాట. అనగాఁద్రిమూర్తుల నావరించియుండు, మూల ప్రకృతియే శివధనుస్సు అని తెలియుచున్నది. ఓంకార రూపుఁడగు రుద్రుఁడు పురుషుఁడు. ధనుస్సు నందలి త్రాడు ప్రకృతి. కావున శక్తిసహిత పురుషునకే నమస్కారములను సమర్పించినట్లు తెలిసికొనవలసియున్నది.

పిమ్మట శివుని బాహువులకు నమస్కారములు అర్పింపఁబడెను. బాహువులు రెంటిలో ఒకటి శరమును, రెండవది శరాసనమును బట్టుకొని యుండును. శరము నారాయణుడు, శరాసనము ప్రకృతియు నగుటచే, నారాయణుని రక్షణ శక్తి ఒక బాహువునకుఁ, బ్రకృతిశక్తి వేరొక బాహువునకుఁ గలవు. పంచభూతములు మనస్సు, బుద్ధి, అహంకారము అను నెనిమిదియును బ్రకృతి భేదములే.

"భూమిరాపోఽనలో వాయుః ఖంమనో బుద్ధిరేవచ।
అహంకార ఇతీయంమేభిన్నా ప్రకృతి రష్టధా॥"

అను గీతాసూక్తి పైవిషయమునకుఁ బ్రమాణము. కావున అష్టి ప్రకృతి వలనఁ బ్రమాదములు వాటిల్లకుండ నారాయణునిచే రక్షింపఁజేయవలసినదిగా రుద్రుని, భక్తుఁడు ప్రార్థించెను.

సకల వ్యసనములకు మూలమైన మన్యువు తొలుత నమస్కరింపఁబడెను. అటుపిమ్మట భయహేతువగు శరాసనమును, శరాసనధారులగు బాహువులును నమస్కరింపఁబడెను. పైవిషయములను బరిశీలించినచో శివుఁడు, సృష్టి రూపుఁడును, సమష్టిరూపుఁడునై యుండునని తెలియుచున్నది.

*పురశ్చరణము :—*

పైమంత్రమును శ్రీ దక్షిణామూర్తి సన్నిధిని 11 వేలు జపహోమాదికరించి నచో సకలపాపములు నశించును. ఆ మంత్రముతో లక్షసార్లు జపించినచో

నష్ట జన్మకృత పాపము నశించును. ఈ దక్షిణామూర్తి చెంతనే అగ్నిని ప్రతిష్ఠించి, ఘృతపాయసహోమ మాచరించినచో శైవ సాక్షాత్కారము జరుగును. పై మంత్రపఠనమున కర్హతలేనివారు ఈ క్రింది శ్లోకమును పఠించుటయు, జపించుటయును మంచిది.

ధ్యానము :—

శ్లో॥ ఆకర్ణకృష్టధనుషిజ్వలన్తీం
దేవీమిషుం భాస్వతి సందధానం।
ధ్యాయేన్మహేశం, మహనీయవేషం
దేవ్యాయుతం యోధతనుం యువానమ్॥

తాత్పర్యము

మహాశివుడు మెఱయుచున్న ధనుస్సును చెవుల వఱకులాగి, అందు జ్వలించుచున్నట్టి దేవీస్వరూపమైన బాణమును సంధించెను. ఆతడు మహనీయ వేషుఁడు. దేవీ సహితుఁడు. యోధ వేషధారి, యువకుడు. అట్టి మహాశివుని ధ్యానింపవలెను. ఇందు రుద్రుఁడు యోధ శరీరుఁడు.

విశేషము :

యోధులకుఁ దన శత్రువులను జయింపవలెనను తలంపుండును. అందుచే వారిపై, మన్యువు (అనగా) కోపముండుట సహజము. దానిని దన బాహ్యాస్త్రగత శత్రువులపైనేకాని, తనపై ప్రసరింపజేయరాదని ఋషులు శివుని ప్రార్థింతురు. మంత్రమందలి "నమస్తే........................మన్యవే" అను వాక్యమందలి భావము, శ్లోకమందలి "యోధతను" పదముచే సూచింపఁబడెను. మంత్రమందలి "ఇషవే, ధన్వనే" అను పదములందలి విషయము, శ్లోకమందలి "ధనుషి, ఇషు" అనుపదములచే సూచింపబడెను. ధనుర్బాణములు బాహువులచేఁగదా హాల్చఁబడును. కావున మంత్రమందలి "బాహుభ్యాం" అనుపదమందలి భావము "ఆకర్ణకృష్ట-సందధానమ్" అనెడి శ్లోకస్థ పదములచే సూచింపఁబడెను. కావున ఈ శ్లోకము జపార్హమని తెలియుచున్నది.

క్రియనుండి శరపదముద్భవిల్లెను. శరువు అనగా ఆయుధము. సమూహార్థమున "య" ప్రత్యయము చేరగా "శరవ్య" అను పదమేర్పడెను.

"అవసృష్టా పరాపత శరవ్యే బ్రహ్మసగ్ంశిత" అను శ్రుతి ననుసరించి పాశాద్యర్థముగల "శరు" పదమునకు "య" ప్రత్యయము చేరగా, శరవ్య పదమేర్పడెననియుఁ జెప్పవచ్చును. అప్పుడు శరవ్య పదమునకుఁ బాశమర్థముగాఁ జెప్పవలెను. శరములకు పాత్రమైనది. అనగా ఆధారమైనది. కావున శరవ్యయనగా అమ్ములపొదియని చెప్పవచ్చును. సర్వశరములును శివములు. శుభకరములు అగుటచే, శరాధారమైన "శరవ్య" సైతము శుభకరము కావలెనని ప్రార్థన. అచేతనములును చేతన కార్యకర్తలే యనుటకు "గ్రామః ప్రసీదతు" అనగా గ్రామము అనుగ్రహించుగాక యను ప్రయోగమే కారణము

"అథోయ ఇషుధిస్తవారే అస్మిన్నిధేహితమ్" అను మంత్రమున, శివుని ఇషుధికి (అమ్ములపొదికిని) శివశక్తికలదని నిరూపించుటచే ఇట శివుని శరవ్యయు అమ్ములపొదియు, భయహేతువు కారాదు; శాంతముగా నుండవలెనని ప్రార్థింపఁబడుచున్నది. శివుని శరధి, అంపపొది మహాసముద్రము. మహాసముద్రస్థశక్తులన్నియును శివుని శరధిలోఁగలవు, కాన, సముద్రరూపమైన శరధి ప్రార్థింపబడెను.

శర, శరాసన, శరధులు మూఁడును "త్రిపుటి" త్రిపుటియే ప్రకృతి. కావునఁ బురుషుఁడగు శివునితోఁబాటు ప్రకృతియును భక్తునివట్ల, శాంతముగా నుండవలెనని గావించిన ప్రార్థన ఇందు సూచింపఁబడెను.

**పురశ్చరణము :—**

**దేశమును కాలించు నృపాలుఁడు తన దేశమందలి దుర్భిక్షమును నివారించుటకై పై మంత్రమును జపించి, తిలగుడమిశ్రితమైన చరువుతో హోమము చేయవలెను. పైవిధమునచేసినచో దేశము సుభిక్షమగును.**

పై మంత్రార్థముగల ఈ శ్లోకమును జపించి, శివుని ధ్యానించుట మంచిది.

**ధ్యానము :**

*శ్లో॥ ధ్యాయేద్దేవం సుస్మితం స్యందనస్థం।*
*దివ్యాకారం తేజసాదీప్యమానం।*
*ఇష్విష్వాసాలంకృతాభ్యాం కరాభ్యాం।*
*హారాకారం స్తూయమానం సురాద్యైః॥*

**తాత్పర్యము :**

ఇంతట రుద్రుడు హారాకారుడుగా వర్ణింపబడెను. అతడు దేవి సహితుడై, స్యందనమునందుండెను. చిఱునవ్వు మోము గలవాడై, దివ్యతేజంబున వెలుగుచుండెను. అతని హస్తములు శరశరాసనములతో నలంకరింపబడెను. అతడు దేవతాదులచే స్తుతింపబడుచుండెను. అట్టి దేవుని ధ్యానింపవలెను.

**విశేషము :**

రుద్రుడు పురుషుడు. అతని హస్తములందలి శరశరాసనధనుం ప్రకృతి స్వరూపములు. నారాయణరూప శరమగుటచే, శివకేశవ భేదంబులు ఏకాకారముగానున్నవన్నమాట. మంత్రమునందలి "ఇషుః, ధనుః, శరవ్యా" అనుపదముల భావము శ్లోకమందలి "ఇష్విష్వాసాలంకృతాభ్యాం" అను పదముచే సూచింపబడెను. హారాకారుడైనను శివుడు సుస్మితుడై యుండెనని వర్ణించుటచే అతని శరశరాసన ధనువులు శివములు, అనగా శాంతములై యున్నవని తెలియుచున్నది. మంత్రమునందలి "మృడయ" అను పదమందలి భావము శ్లోకమందలి "స్తూయమానం" అను పదముచే సూచింపబడెను. సుఖము చేకూర్చుమనియేకదా, భక్తులు శివుని స్తుతింతురు. పైవిధమున మంత్రభావము ఇమిడియుండుటచే ఈ శ్లోకము జపార్హమని తెలియుచున్నది.

## 3వ మంత్రము :

*యాతే రుద్ర శివాతనూరఘోరాపాపకాశినీ ।*
*తయా నస్తనువా శన్తమయా గిరి శంతాభిచాక శీహి॥ ఇతి*

**అర్థము :—**

"రుద్రోవా ఏషయదగ్నిః" అను శ్రుతిలో శివునకు, శరీరద్వయ మున్నట్లును, అందొకటి "ఘోర" రెండవది "శివ" అను నామములతో ఒప్పుచున్నట్లు తెలియుచున్నది. హింసించు శరీరము ఘోరనామకము. అను గ్రహించు శరీరము శివనామకమని తెలిసికొనవలసియున్నది. హేరుద్ర = ఓ శివ!, తే = నీ యొక్క, యాతనూః = ఏ దేహము, శివా = అనుగ్రహించునో అది అఘోరా = అఘోరనామముకలది అనగా శివయైనది. ఏ శరీరము, అపాపకాశినీ = పాపమును బ్రకాశింపఁజేయదో, అనగాఁ బాపపరిహారకమో, ఆ శరీరము ఘోరనామకమైనది. హేగిరిశన్త = కైలాసగిరియందుండి, ప్రాణు లకు సుఖము చేకూర్చువాఁడా! శంతమయా = అతిశయముగా సుఖముచేకూర్చు, తయా = ఆ, తనువా = శరీరముతో, నః = మమ్ములను, అభిచాకశీహి = సుఖములతో, బ్రకాశించువారిగాఁజేయుము.

**తాత్పర్యము :—**

సా. భా. :— రుద్రోవా ఏషయదగ్నిస్తస్యైతేతనువౌ, ఘోరాన్యా శివాన్యేతి "అను సూక్తిలో రుద్రుఁడు అగ్నిస్వరూపుఁడు. అతనికి, "ఘోరా, శివా" అను రెండు శరీరములుగలవు. అని చెప్పఁబడెను. కావున శివునకు రెండుదేహము లున్నట్లుతెలియుచున్నది. అందు మొదటిది ఘోర, అనగా హింసించునది. రెండవది శివ, అనగా అనుగ్రహించునది. అని తెలియుచున్నది

ఓ రుద్రుఁడా! మమ్ములను అనుగ్రహించు నీ శివమగు శరీరము మా పట్ల, అఘోరమై అనగా అహింసాత్మకమై యుండుగాక. ఆ నీశరీరము మా పట్ల, హింసారూపమైన, అనిష్టమును బ్రకాశింపఁజేయకుండునుగాక. ఇట పాపమనగా హింసారూపమగు అనిష్టము ఓ పరమశివా! నీ శరీరము మమ్ములను స్వయముగా హింసింపకుండుటయే కాదు. పరుల వలన ఏ యనిష్టము కలుగనీయక, కాపాడవలెను. మమ్ములనెవరును హింసింపకుండ కాపాడవలెను. మాకేపాపములు అంటనీయక, కాపాడవలెను. మాలో నేవేని పాపములు, లోపములును ఉన్నచో, తొలగింపుము. వానిని బహిర్గతములు కానీయకుము అని మేము నిన్ను ప్రార్థించుచున్నాము.

శం = సుఖం తనోతీతి-శంతమ్; అనగా సుఖమును జేకూర్చునదియని యర్థము. ఓ దేవా! నీవు కైలాసగిరియందుండియే, నిత్యము ప్రాణులకు సుఖము చేకూర్చువాఁడవు. కావున నీవు గిరిశంతుఁడను నామముకల్గెను.

ఓ గిరిశంతా! అత్యంత సుఖకారిణి యగు నీ శరీరముతో, మమ్ములను బ్రకాశవంతులఁ గావింపుము. చల్లని నీ తేజస్సు, మాపైఁ బడినచో మేము సుగాంతివంతులము కాఁగలము అని ప్రార్థించెను.

భ. భా. భాష్యము:— పై మంత్రమునకు గార్గ్యపుఁడు ఋషి. శంభువుదేవత స్వరాడనుష్టుప్పులు ఛందస్సులు శివుని శాంత శరీరము సాయుధము, నిరాయుధమని ద్వివిధముగా వర్ణింపఁబడెను. అయ్యా! నీ శరీరము అభయహేతువు. అంతేకాదు. అఘోరమైనది. భయమునకే కాదు, స్వపర భయహేతువులను సైతము తొలగించు శక్తి దానికిఁ గలదు. కావుననే నీ దేహమును, "శివా, అఘోరా" అని మేము కొనియాడుచున్నాము. పాప మనగా వ్యసనము, దుఃఖమున్నచోట మాకుఁగల దుఃఖమును తొలగించుటయే కాదు. దుఃఖహేతువులైన వ్యసనములను సైతము, వ్యక్తము కానీయక కాపాడుము తండ్రీ! వ్యసనములు పైకివచ్చినచో సంఘములో మాకు మంచి

గౌరవము ఉండదుగదా! నీవు పాప వినాశహేతు భూతుఁడవుగదా! చేయు పాపములను హరించి, పాప ఫలములను మా కంటనీయకుముతండ్రీ! నీ నామము స్మరించినంతనే, మాకుఁగల ఆగామి సంచిత ప్రారబ్ధకర్మలు నశించు నను నమ్మిక, ఆశ మాకుఁగలవు. నీవు నిరతిశయానంద స్వభావుఁడవు. కావున నీశంతను శరీరము మర్త్యులకు అతిశయ సుఖము నొసఁగుగాక. మఱల మఱల మమ్ములను గాంతివంతులఁగావింపుము. నీయనుగ్రహ దృష్టి మాపైఁ బ్రసరింపజేయుము.

గిరిశంతుఁడనగాఁ కైలాస గిరిపై నుండి ప్రాణులకు సుఖము కలుగఁ జేయు వాఁడనియేకాదు. గిరి యనగా మేఘము. అందుండి సత్యము వర్షింపఁ జేయుచుఁ బ్రాణులకుఁ బర్జన్య రూపమున సుఖశాంతులను జేకూర్చుచున్నాఁడు.

"అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్న సంభవః
యజ్ఞాద్భవతి పర్జన్యః"

అను గీతాసూక్తిని బరిశీలించినచో, అన్నమైన బ్రహ్మ నుండి భూతములుద్భ వించినవి. పర్జన్యుని వలన (మేఘము వలన) ఆహారరూపమైన అన్నము ఉద్భ వించినది, యజ్ఞ స్వరూపుఁడైన విష్ణువు నుండి పర్జన్యుఁడుద్భవించెనని యుఁ దెలియుచున్నది. విష్ణువునుండి యేర్పడిన పర్జన్యుఁడే, విష్ణువుచే జన్మింపబడిన భూతములను గాపాడుచున్నాడన్నమాట. "కారణగుణాః కార్యే సంక్రామన్తి" అనగాఁ గారణ గుణములు కార్యమునందు సంక్రమించునని యర్థము. ఇటుఁ గారణుఁడైన విష్ణువు యొక్క గుణములు కార్యమైన పర్జన్యునియందు సంక్ర మించినవి. ఆగుణములు రక్షణక్రియను జెందినవి. క్రియాశక్తి సంపన్నుఁ డైన విష్ణువేజ్ఞానశక్తి సంపన్నుడైన శివుఁడాయెను. ఆశివుఁడే పర్జన్యుఁడైవర్షించి, సస్యములఁబెంచి, ఆహారమొసఁగి, ప్రాణులను గాపాడుచున్నాడని తెలియుచున్నది.

అంతేకాదు, గిరి యనగా వాక్కు అనియర్థము. వేదరూపమైన వాక్కు నందు శివుఁడు అర్థరూపముననుండి ప్రాణులకు సుఖమును జేకూర్చుచున్నాడు.

వేదరూపమైనవాక్కు అనగా "తత్త్వమసి" వాక్యముచేఁ దెలియు బ్రహ్మ పదార్థము. అదిమూల ప్రకృతికి ఆధారము. దానినుండి (1) భూమి, (2) నీరు (3) అగ్ని, (4) వాయువు, (5) ఆకాశము, (6) మనస్సు, (7) బుద్ధి, (8) అహంకారము, అనెడి అష్టప్రకృతులువెలసినవి. వానినుండి జగత్తు ఏర్పడినది. ఈ విషయమే

"భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా।
అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమేపరాం।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్॥"

అను గీతాసూక్తివలనఁ దెలియుచున్నది. ఈ మూలప్రకృతి సహిత పురుషుఁడే రుద్రుఁడు. అతడే లోకకల్యాణహేతువు. ఈ విషయమునే కాళిదాస మహాకవియుఁ దనరఘు వంశకావ్యమున-

"వాగర్థావివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే।
జగతఃపితరౌవందే పార్వతీ పరమేశ్వరౌ॥

అను పద్యమున "వాగర్థ" పదముచే వ్యక్తపఱచినాడు. ఇందలి వాక్పదముచే శివుఁడును, అర్థపదముచేఁ పార్వతియును సూచింపఁబడిరి. వారిద్దఱియొక్క అవినాభావసంబంధరూపమగు అర్ధనారీశ్వరత్వమే సంపృక్తపదముచే సూచింపఁబడెను. వారేజగత్పితరులై లోకసుఖము చేకూర్చుచున్నారన్న మాట

ఇంతేకాదు. ఈ మహారుద్రుఁడే ప్రణవమైన "ఓంకారమున" నుండి, ధ్యేయరూపమున, నిరతిశయ బ్రహ్మానంద రూపసుఖముచేకూర్చుచున్నాడు. ఓంకారము, విశ్వతైజసప్రాజ్ఞులనమష్టిరూపము. త్రిమూర్త్యాత్మకము. ఈ విష

యము ఇంతకుముందు వివరింపఁబడెను. "హరి, రామ" అను రెండుపదము లును ఓంకారములే. ఓంకారపవిత్రము శివలింగపురాణములందు, వాల్మీకి రామాయణమున, వివరింపఁబడెను. ఓంకారధ్యానముచేఁ గల్గునదేఆనందము. శివరామవిష్ణురూపములను గన్నులారఁజూచుచు, వారిచరిత్రలనేపఠించుచు, ఆలకించుచు, తదేకధ్యానముననుండిరేని, అట్టిభక్తులకుఁదప్పక,మోక్షానందము లభించును. మార్కండేయుఁడు, హనుమంతుఁడు, ప్రహ్లాదుఁడు, మున్నగు వారెల్లరను ఓంకారోపాసకులే. ఇట్టితత్త్వధ్యానమునకే, జ్ఞానమార్గము, తపో మార్గము, యోగమార్గము, కర్మమార్గము, భక్తిమార్గము మున్నగు మార్గములు తోడ్పడుచున్నవి. ఆయామార్గముల నాశ్రయించుభక్తులకు, ఓగిరిశంత! నీ శాంతతనువుతోఁ గ్రొత్తశోభచేకూర్పుము; అని గావించినప్రార్థన ఇందుసూచింపఁబడెను.

*పురశ్చరణము :-*

పై మంత్రముతో గోశాంతిచేయవలెను. గోవులసాలమధ్యభాగమున ఒకమూరెడుపరిమాణముగల, అగ్నికుండమునునిర్మింపవలెను. అందు అగ్నిని బ్రతిష్ఠించి, దానిలో అపామార్గసమిధలను (ఉత్తరేణిసమిధలను) దధిమధు ఘృతములలోముంచి, పదివేలసంఖ్యతో హోమముచేయవలెను. ఈ మంత్రముతోడనే మఱొక గోశాంతిని జేయవచ్చును. ఎట్లన?

బ్రాహ్మణులచే అభిమంత్రితమైన ఘటజలమును, సుగంధద్రవ్యము లతోనింపవలెను. పిమ్మట పైమంత్రమును, నూరువేలుజపించి, ఆ నీటిని ఆవులపై జల్లవలెను. పిమ్మట పైమంత్రార్థముగల శ్లోకముతో మహాదేవుని ధ్యానింపవలెను.

ధ్యానము:-

శ్లో॥ స్మేరాననం చంద్రకళావతంసం
గంగాధరం శైలసుతాసహాయం।
త్రిలోచనం భస్మభుజంగ భూషణం
ధ్యాయేత్పశూనాం పతిమీశితారమ్॥

తాత్పర్యము :-

ఇందు మహాదేవుడు గోశాంతి రసస్వరూపముగా పశుపతిగా వర్ణింపబడెను. గంగాధరుడైన శివుని శిరంబున చంద్రకళ చూడామణిగానుండెను. అతనిమోము చిఱునవ్వుతో నిండియుండెను. అతనికి పర్వత పుత్రికయైన పార్వతితోడుగా నుండెను. అతడు ముక్కంటియై భుజగభూషణుడై విరాజిల్లెను, అతడే పశువులకు అనగా జీవులకెల్ల ప్రభువు! అని ధ్యానింపవలెను.

విశేషము :

ఈ మంత్రమున చెప్పబడిన "ఘోర" "శివ" అను రెండు శరీరములును పార్వతిగా, గంగగా రూపొంది, ఆ పరమశివునే అంటిపెట్టుకొని యున్నవి. గంగా పార్వతీ సహితుడైన శివుడు ఇందు చక్కగా వర్ణింపబడెను. అపమృత్యు పరిహారము నకై పూజింపబడు దుర్గయే, ఇందలి శైల సుతయని తెలిసికొనవలెను. ఇట వర్ణింపబడిన గంగయే, అపాంకాళినియని తెలిసికొనవలసియున్నది. ఇట భక్తులే పశువులుకాగ శివుడు పశుపతిగా వర్ణింపబడెను. ఇట గోశాంతియనగా మహాశాంతియనియు తెలిసికొనవలసి యున్నది.

## 4వ మంత్రము :

*యామిషుంగిరి శన్త హస్తే బిభర్ష్యస్తవే।*

*శివాంగిరిత్ర! తాంకురు మాహిగ్ంసీః పురుషంజగత్॥*

**అర్థము**

హే గిరిశన్త = ఓ రుద్రుఁడా! యాం = ఏ, ఇషుం = బాణమును, అస్తవే = శత్రువులపైఁ జిమ్ముటకు, హస్తే = చేతియందు, బిభర్షి = దాల్చు చున్నావో, హేగిరిత్ర = ఓ కైలాసగిరిని రక్షించువాఁడా!, తాం = ఆచేతఁదాల్చిన బాణమును, శివాం = మాపట్ల శాంతమైనదిగా, కురు = చేయుమా; పురుషం = మాదగుమనుష్యజాతిని, జగత్ = మనుష్యవ్యతిరిక్తమైన స్థావర జంగమ ప్రపంచమును, మాహింసీః = హింసింపకుము.

**తాత్పర్యము :—**

సా. భా. :— ఓగిరిశంత! రుద్ర! వైరులపైఁ జిమ్ముటకు, నీవుచేత బాణమును దాల్చితివి. కైలాసగిరిని, బాలించు ఓ రుద్రుఁడా! శత్రువులను శిక్షించుటకుఁ జేతఁ దాల్చిన నీయాబాణమును, మాపైఁ జిమ్మక, దానిని శాంతముగలదిగా నుంచుము. పురుషులమగు మమ్ములను, మనుష్యవ్యతిరిక్తమై, స్థావరజంగమములతోనిండిన యీ జగత్తును హింసింపకుము తండ్రీ అని ప్రార్థించెను.

భ. భా. భాష్యము:— పై మంత్రమునకు గౌతముఁడు ఋషి గోఘామఁ(?) రౌంపటంచుఁరు. రుద్రుఁడుదేవత. అనుష్టుప్పు ఛందస్సు.

త్రిపురాసురసంహారసమయమున, శివుఁడు దాల్చిన ఘోరతనువు "యామిషుంగిరిశంత" "శివేనవచసాత్వా" అను రెండుమంత్రములచేస్తుతింపఁబడి, ప్రసన్నమూర్తిగామార్చఁబడెను. ఇట "త్రిపుర" పదమునకుఁ ద్రిపురుఁడను రక్కసుఁడేకాక, వేరొకయర్థమునుగలదు. అదేమన! "పురమేకాదశద్వారమ్" "నవద్వారేపురేదేహే" అను మంత్రములననుసరించి, పురశబ్దమునకు దేహమనియునర్థముకలదు. అపక్షమునఁ ద్రిపురములనగా మూఁడుదేహములని యర్థము. అవియే "అండాండ, పిండాండ, బ్రహ్మాండము"లనెడి ప్రకృతి దేహములు స్థూలసూక్ష్మకారణదేహములును త్రైత్రిపుటితోఁబాటు ఒక త్రిపుటియే అవి బ్రహ్మసృష్టిలోఁ బ్రకృతిదేహములు. అవి మాయాప్రభావముచే, విజృంభించి, పురుషుఁడైన పరమాత్మచే ఉపసంహరింపఁబడినవి. అండాండాదుల సంహారమునకు బాణమేలయనరాదు. అందు అసురసంపదకుఁ జెందిన రక్కసులెందఱోకలరు. వారందఱిని, లయమునొందింపవలసిన బాధ్యత మహాదేవునిది. అందుచే అతఁడు సోమరూపమైన శరమును జేతఁదాల్చి, వారందఱిని హతమార్చెను. అట్టి శరమును భక్తులమగు మాపై విడువక, దానిని శాంతింపఁజేయుము. అని శివుడు ప్రార్థింపఁబడెను.

"అస్తవే" అనుపదమునకు వైరులవిషయమున అనియర్థము. దేవతల ప్రార్థనచే హస్తవ్యస్తులైన రక్కసులపైఁ జిమ్ముటకు మహాదేవుఁడుచేతిలో శరము దాల్చెను. దేవరాక్షస సంఘర్షణము సృష్ట్యాదినుండియుగలదు ఆదేవరాక్షసుల సంపదలుగీతలో 16 వ అధ్యాయమున చక్కగా వివరింపఁబడినవి. దానిని బరిశీలించినచోఁ బ్రతిజీవియందును దైవాసురసంపదలుగలవు. వానిసంఘర్షణము నిత్యము జరుగుచునేయున్నది. అట్టి సంపదలలో రాక్షసంపదనణంచుటకు, దైవీసంపదనువృద్ధిచేయుటకును జిత్తశుద్ధియవసరము. అట్టి చిత్తశుద్ధికిఁ బ్రాణాయామప్రక్రియ పరమసాధనము. ప్రాణాయామప్రక్రియలో "ఇళా పింగళాసుషుమ్నా" నాడులకుఁజెందినప్రక్రియపరమోత్కృష్టము. వానిలో నొకటి సోమదేవతాకమైన నాడి. అదియే శివునిచేతిలోని సోమరూపశరముచే

సూచింపఁబడినది. అట్టి శరమును మాపట్ల శక్తినొసఁగునదిగా వినియోగింపు మని శివుఁడు ప్రార్థింపబడెను.

నీ భృత్యులందఱును సాధువులే. కావున వారిని గాపాడుము తండ్రీ! నీ సృష్టిలోఁ బురుషులతోఁబాటు జంగమప్రపంచమునఁ జేరుగోమహిష్యాదు లునుగలవు. అవియే మంత్రమందలి "జగత్పదముచే" సూచింపఁబడినవి. అట్టి జగత్తును సైతముసుదా! హింసింపకుము. వానిని సాధుజనుల కనుకూల ముగా నుంచుము. జగంబున జంగమములతోఁబాటు స్థావరములైన వృక్షల తాదులునుగలవు. అవన్నియు ఓషధులకోటిలోఁజేరును. "ఓషధీభ్యోఽన్నమ్" అను శ్రుతిలోఁ జెప్పినట్లు అవి జంగమ ప్రపంచమునకుఁగావఁసిన యన్నము నొసంగును. వాటికన్నిటికిని బ్రభువు సోముఁడు. అతఁడే వృక్ష లతాదులను బెంచువాఁడు. అట్టి సోముఁడు నీచేత "ఇషు" రూపముననుండెను. కావున ఆ సోమరూప శరముతోఁ బురుషులను జగత్తును గాపాడుము తండ్రీ! అని రుద్రుఁడు ప్రార్థింపఁబడెను.

ఇట "గిరిత్ర" శబ్దమునకు అర్థము కైలాసగిరియందు నివసించుటచే దానిని మన్నించి కాపాడువాడని చెప్పుదురు. అంతేకాదు, ప్రకృతి కనుకూల ముగా వర్షింపజేయుటకై రుద్రుఁడు గిరియైన మేఘముననుండి లోకమును గాపాడుచున్నాడు. కాన అతనికి "గిరిత్ర" అను పేరు సార్థకమాయెను. గిరి సదృశ రథమును గాపాడువాఁడనియు గిరిత్ర పదమునకు అర్థము కలదు. గిరి యనగా రథము. దాని యవయవములే దేవతలు. వారిని గాపాడువాడు కావున రుద్రుఁడు గిరిత్రుఁడాయెను. త్రిపురాసుర సంహారమున శివునకు భూమి రథమాయెను. భూమి ప్రకృతి స్వరూప. ప్రకృతియందలివారే దేవతలు కాన, వారు రథావయవములైరి. అందుచేఁ బ్రకృతి ప్రకృత్యంగముల రక్ష ణము శివునకవశ్య కర్తవ్యము.

అంతేకాదు. "గిర్" అనగా వాక్కు వాక్కులను రక్షించువాఁడుకాన గిరిత్రుఁడాయెను. "పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ" అనివాక్కులు నలు విధములు. వాక్కు వికారములే విద్యలు. విద్యలనొసఁగువాఁడు, విద్యలకు నిధి, దక్షిణామూర్తి స్వరూపుఁడైన మహాదేవుఁడు. అతఁడు భక్తులకు యథాభి ప్రేతముగా విద్యలనొసఁగును. సోమకాసురుఁడు, వేదాదివిద్యలనెల్ల అపహరిం పగా, మునులెల్లరు మూగలై శిష్యులుగా నిల్చియుండ, యువకుఁడు, వటవిటపి సమీపవాసియు, విద్యానిధియునగు, దక్షిణామూర్తి, వారికి వాక్కులను విద్యల నొసఁగెనని

"వృద్ధాశ్శిష్యా గురుర్యువా"
"వటవిటపిసమీపే భూమిభాగేనిషణ్ణం
సకలమునిజనానాం జ్ఞానదాతారమారాత్ ।
త్రిభువనగురుమీశం దక్షిణామూర్తిదేవం ।
జననమరణదుఃఖచ్ఛేద దక్షంనమామి"

అను సూక్తులవలనఁ దెలియుచున్నది. అట్టి మహామహిమసంపన్నుఁడైన శివుఁడు తన శరంబున స్థావరజంగమాత్మక ప్రపంచమును హింసింపక, రక్షింప వలసినదిగా మహాశివుఁడు ప్రార్థింపఁబడెను.

## 5వ మంత్రము :

*"శివేనవచసాత్వా గిరిశాచ్ఛావదామసి ।*
*యధానస్సర్వమి జ్జగదయక్ష్మగ్ం సుమనా అసత్ ॥*

**అర్థము :—**

హేగిరిశ = కైలాసవాసివైనశివా! త్వా = నిన్ను అచ్ఛా = పొందుటకు, శివేన = మంగళకరమైన, స్తుతిరూపమైన, వచసా = వాక్కుతో, వదామసి = ప్రార్థించుచున్నాము. యథా = ఏ ప్రకారమున, నః = మాదగు, సర్వం

ఇత్ = సమస్తమైన, జగత్ = జగంబును, మనుష్యపశ్వాదికమైన జంగమ జాతమంతయును, అయక్ష్మ = రోగరహితమును, సుమనాః = చక్కని మనస్సుతోఁగూడి నదియును, అసత్ = అగుగాక.

తాత్పర్యము :-

సా. భా:— మహాశివ! నీవు కైలాసమున నివసించుచున్నావు. నిన్ను జేరుటకు మంగళకరమైనస్తుతులొనర్చుచుఁ బ్రార్థించుచున్నాను. మాదగు ఈ సర్వజగత్తు, మనుష్యపశ్వాది జంగమములతో నిండియున్నది. ఈ జంగమ ప్రపంచమునీరోగమై సౌమనస్యసంపన్నమగునట్లుఁ గావింపుము తండ్రి !

భ. భా. భాష్యము:— పై మంత్రమునకు గౌతముఁడు ఋషి. రుద్రుఁడు దేవత. అనుష్టుప్ ఛందస్సు.

ఇందలి గిరిశశబ్దమునకుఁ గైలాసగిరియందు శయనించువాఁడను నర్థము సుప్రసిద్ధమైయున్నగి. అంతేకాదు గిరికి = మేఘమునకు ఈశుఁడనియుఅర్థము గలదు. పృషోదరాదిగణమునఁ జేరుటచే "గిరీశ" అనునది "గిరిశ" అను పదముగామారినది. "పర్జన్యోవర్షతి" అనుశ్రుతిచే నీటిని వర్షించువాఁడు పర్జన్యుఁడని తెలియుచున్నది.

"ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతఃక్వమేఘః" అను కాళిదాసకృత మేఘసందేశసూక్తిచే "ధూమము, అగ్ని, నీరు, గాలి" అను నాల్గింటికలయిక చేఁ బర్జన్యము ఏర్పడుననితెలియుచున్నది. పై నాల్గింటిలో అగ్నిజలవాయువులు మూడును శివునియష్టమూర్తులలోఁ జేరినవి. కాన గిరికి = పర్జన్యునకు ఈశుఁ డని చెప్పుట సమంజసముగానున్నది. జగత్సంహారకర్తయగు శివుని మూర్తు లగుటచే సర్వకాలము ప్రకృతిలో విజృంభించు, అగ్నిని, నీటిని, గాలిని, అరి కట్టుట విజ్ఞానవేత్తలకును అశక్యమే, అగ్ని జీవులహృదయమందు "జఠరముగా" సముద్రమున "బడబగా", అటవులందు "దావము"గా, మేఘములందు "విద్యుత్తు"గాఁ గానవచ్చుచున్నది. అది అణుస్వరూపము. దానినరికట్టుట,

రుద్రునికిఁ దక్క యేరికినిశక్యము కాదు. కావుననే రుద్రునిస్తుతించి, అగ్నిప్రమాదమునరికట్టుకొనుట ముఖ్యము. శివుఁడు అణుస్వరూపుఁడు. అగ్నిఅణుస్వరూపము. అణువును అణువుతప్ప, వేరొకటి చల్లార్పలేదు.

"అణోరణీయాన్ మహతోమహీయాన్
ఆత్మాస్యజంతోర్నిహితోగుహాయాం।
తమక్రతుః పశ్యతివీతశోకోధాతుః
ప్రసాదాన్మహిమాన మాత్మనః"

అను శ్రుతి పై విషయమునే వ్యక్తముసేయుచున్నది. అగ్నినిఁజల్లార్చుటకు జలమవసరము. అట్టి జలముకూడ శివునిమూర్తియే. జలముగంగారూపమున, శివజటాజూటమునఁగలదు. అందుచే శివుఁడు గంగాధరుఁడాయెను. అగ్నియు జలమునుండియే ఉద్భవించుననుు, సంగతి "అప్సుజ్యోతిః ప్రతిష్ఠితమ్" అను శ్రుతివలనఁదెలియుచున్నది. పై విషయమునే కాళిదాసమహాకవియు "నప్రభాతరళం జ్యోతిరుదేతివసుధాతలాత్" అను శాకుంతల సూక్తిలో నిరూపించినాడు. ఎట్లన? ప్రభాతరళమైనజ్యోతి (విద్యుచ్ఛక్తి) వసుధాతలమునుండి (భూమినుండి) పుట్టదు. నీటినుండిపుట్టును; అనిసూచించినాడు.

శివమూర్తియైన జలముకూడ శివమూర్తియైన అగ్నినుండియేపుట్టును, అను విషయము, "ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అనుశ్రుతివలనను, జ్యోతిష్యాపః ప్రతిష్ఠితాః" అనుశ్రుతివలనను దెలియుచున్నది. కావున జలప్రమాదము అగ్నివలనను, అగ్నిప్రమాదము జలమువలనను ఉపశమించుసే కాని, వేరొకదానిచే ఉపశమింపవు. కావున జలాగ్నిప్రమాదములురెండును, శివునిచే దప్ప, వేరొక్కనిచే నివారింపఁబడవు.

పర్జన్యనిర్మాణసాధనములలో నొకటగువాయువుకూడ శివునియష్టమూర్తులలోనొకడైయున్నాఁడు. వాయువుజలాగ్నులకుఁదోడై, ప్రకోపింపఁజేయుటయేగాక తానుమజలాగ్నులచేతనే ప్రకోపించును. జలాగ్నులతో

వాయువు కలదనువిషయము "ఆకాశాద్వాయుః" అను శ్రుతివలనఁ దెలియు చున్నది. ఈనాటి విజ్ఞానశాస్త్రపరిశోధకులుకూడ, అగ్నిలోఁగలవాయువే, ధూమరూపమున వెలువడుచున్నదని చెప్పుచున్నారు. వాయువికారమే ధూమము. ధూమాగ్ని జలవాయుసంయోగమే పర్జన్యము. పర్జన్యప్రభువే రుద్రుఁడు. ఆ రుద్రుఁడే ఈ మంత్రమందలి "గిరిశ" శబ్దముచే నిరూపింపఁ బడెను.

గిరిశపదము నకు వాక్కులకుఁ బ్రభువనియు అర్థముకలదు. రుద్రుఁడు వాక్పతి. అంతేకాదు. వేదములకునుబతియే. కావుననే శివుఁడు, వేదములన్ని యును అపహరింపఁబడినసమయమున దక్షిణామూర్తియై విద్యలెల్లనొసఁగెనని ఇంతకుమున్నే వ్రాసియుంటిని.

గిరియనగా వేదములకు మూలమైన ప్రణవము. దానికిని మహాదేవుఁడే ప్రభువు. శివునకుఁగేశవునకును ఉపాసనలో, సృష్టిరక్షణకార్యములలో భేదము కలదుకాని వాస్తవికముగాభేదములేదు. ఈ విషయమునే శివాయ విష్ణు రూపాయ, శివరూపాయ విష్ణవే. "అను సంధ్యావందనసూక్తి నిరూపించు చున్నది. దీనినాధారముగాఁగొనియే, కవిబ్రహ్మతిక్కన, హరిహరాద్వైతమత మును స్థాపించి, మతకలహములనడంచినాడు. ఆ విషయమునే ఆంధ్రవిరాట పర్వారంభమున.

> "శ్రీయనగౌరినాఁబరగు చెల్వకుఁజిత్తమువల్లవింపఁగ
> ధ్రాయితమూర్తియై హరిహరంబగురూపముదాల్చి విష్ణురూ
> పాయనమశ్శివాయయనిపల్కెడి భక్తజనంబు వైదిక
> ధ్యాయితకిచ్చమెచ్చుపరతత్త్వముఁ గొల్చెదనిష్టసిద్ధికై."

అను పద్యమునందు ఇమిడ్చిచూపినాడు.

ఇంతయేల "హరిహర" పదముల యర్థమును గమనించితిరేని, ఏమి యును భేదముకానరాదు. కావున శివసహస్రనామములెల్ల విష్ణుపరముగాను, విష్ణుసహస్రనామములెల్ల శివపరముగాను జెప్పవచ్చుననుఊహాపోహముచున్నది

పరికింపగా "ఓంకారమునకు," "హరిపదమునకు," శ్రీకారమునకును భేదములేదు. అందుచేతనే వేదమంత్రోచ్చారణారంభమున "శ్రీగురుభ్యోనమః హరిఓమ్" అని పల్కెదరు. పైమూఁడింటిని ప్రణవమనియే పెద్దలుచెప్పుదురు. ప్రణవమునకుఁ బ్రభువగుటచేఁ బ్రభుశక్తులన్నియును బ్రణవమునఁ గలవన్న మాట. ఇదియే ఇందలి విశేషము.

అప్పరమశివుని, శివవచస్సులతో శిష్టులును, భక్తులును స్తోత్రము చేయుదురు. మహాదేవుని గుణసంకీర్తనపరము లైన వాక్కులన్నియునుఁ గల్యాణకరములే. అవన్నియును స్తోత్రరూపము లే. వాక్కులు రెండురకములు. (1) శివములు (2) అశివములు, అని. అశివములునరక హేతువులు. శివములు శుభంకరములును, ముక్తిదాయకములును. అట్టి శివవచస్సులే (1)పరా (2) పశ్యంతీ, (3) మధ్యమా, (4) వైఖరీ అని నలువిధములు గానున్నవి. వీనిలో "పరా, పశ్యన్తీ," అనువాక్కులురెండును ముక్తిదాయకములు. శివంకరములైన వాక్కులతో స్తోత్రముచేయుట, మానసిక, శారీరిక వాఙ్మయ తపస్సులు మూడింటిలో వాఙ్మయతపస్సునకుఁ జెందును. ఆ విషయమే

"అనుద్వేగకరంవాక్యం సత్యంప్రియహితంచయత్ ।
స్వాధ్యాయాభ్యసనంచైవ వాఙ్మయంతపఉచ్యతే॥

అను గీతాసూక్తిలో వివరింపఁ బడెను. ఎట్లన? వాక్కులు ఉద్వేగము కల్గింపరాదు. సత్యములై, ప్రియములైయుండవలెను. అవి స్వాధ్యాయాభ్యసనమునకు ప్రయోగపడవలెను. ఇట్టి వాక్కులన్నియు శివవచస్సులేయగును.

"ఐశ్వర్యమీశ్వరాదిచ్ఛేత్" అనుసూక్తిలో ఈశ్వరునినుండి, ఐశ్వర్యమును గోరవలెననికలదు. ఈశ్వరుఁడుపరమైశ్వర్యగుణసంయుక్తుఁడు అందుచే ఐశ్వర్యకాంక్షి, ఈశ్వరుని శివవచస్సులతో స్తోత్రముచేయవలెను.

"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అనుసూక్తిలో భాస్కరునినుండి ఆరోగ్యమును గోరవలెననికలదు. అట్టి సూర్యుఁడు శివుని అష్టమూర్తులలోనొకడు. అను విషయము "సూర్యాచంద్రమసౌసోమయాజీచేత్యష్టమూర్తయః" అను

సూక్తిచేఁదెలియును. కావున సూర్యశివులశక్తులు సమానములు. అందుచే శివుఁడు సకల జగత్తులకు ఆరోగ్యప్రదుఁడు కావలెనని తలంచి, శివుని, శివ వచస్సులతో స్తోత్రముచేయుట మంచిది. అశివవచస్సులతో స్తోత్రముఁచేసినచో శివుఁడా గ్రహించును. ఈ విషయము మాత్వారుద్ర! చుక్రుధా మనయోభిర్మా దుష్టతీ వృషభమానహూతి" అను మంత్రమున రుద్రుడా! మమ్ములను, నీక్రోధపాత్రులఁ గావింపకుము. దుష్టవాక్కులతోఁ గావించు నమస్కృతులకు అగ్రహింపకుము; అని చక్కగా నిరూపింపఁబడెను. అందుచే శివవచస్సులతో నిన్నుస్తోత్రముచేయుదును; అనిభక్తుఁడు ప్రార్థించును

జగత్తు స్థావరజంగమాత్మకము. భార్యా పుత్రాదులు, పశుపక్ష్యాదులును జంగమకోటికిఁ జెందుదురు. వృక్షపర్వతాదులు స్థావరకోటికిఁజెందును వాటికన్నిటికినీ రోగములుకలవు. ఓ రుద్రా! వాటినన్నిటిని దొలగించి, వృక్షసంపదను, పశుసంపదను, పర్వతస్థ వస్తుసంపదను, వృద్ధిచేయుము. మానవులను ఆరోగ్యవంతులఁ గానింపుము. నీవు మాపట్ల శోభనమనస్కుఁడవగుటయేకాక, మాయందఱికిని సౌమనస్యమును, మనోనైర్మల్యమును జేకూర్పుము తండ్రీ!. మనస్సునకుఁ గలమలినత్రయమును దొలగించి, భక్తులమగు మాకుఁ జిత్తశుద్ధినిఁ జేకూర్పుము, అని మహారుద్రుఁడు ప్రార్థింపఁబడెను.

*పునశ్చరణము :-*

పై రెండుమంత్రములను 21 దినములు జపియించి, పునశ్చరణచేసినచో, అకాలమరణముతొలగును. రాజులు తమ రాష్ట్రవాసులను అకాలమరణమునుండి రక్షించుటకు, సిద్ధుఁడైన బ్రాహ్మణునిచే జపముచేయింపవలెను రాజులులేని యీరోజులలోఁ ప్రజాప్రభుత్వమే దేవాదాయశాఖాధిపతులను, శాసించి, వారిచే జపాదులుచేయించుటయుత్తమము. జపానన్తరమునఁ దిలవ్రీహి గోధూమయవలతోడను, దధిమధుఘృతములతోడను, లక్షహోమము జేయించుట చాలమంచిది. తొమ్మిది దినములదీక్షచే, ఉపద్రవనాశము

అష్టదినదీక్షచే అకాలమరణాదుల నిర్మూలనమును జరుగును.

ధ్యానము :-

"సాంగ్రామికేణవపుషా ప్రవిరాజమానం।
దృష్ట్యాత్సురత్రయ తృణాశనిమందహాసం।
దైత్యాది ధను మచలేశ్వరచాపపాణిం
ధ్యాయేత్ పురారి మమరౌఘ రథాధిరూఢమ్"

తాత్పర్యము :-

మహారుద్రుఁడు యుద్ధసన్నద్ధుఁడగుటచే అందుఁకుఁదగిన శరీరముతో శోభిల్లుచుండెను. గర్వించు సురత్రయమును దృణాశనులైన పశువులుగా భావించి, మందహాసమొనరించుచుండెను. దైత్యులను సంహరింపఁదలచి, పర్వతరాజైనమేరువునేచాపముగాఁ జేతఁదాల్చియుండెను. త్రిపురాసురునకు శత్రువై వానిని సంహరించెను. దేవసంఘమునే రథముగాభావించి, యధిష్ఠించెను. అని శివుని ధ్యానించెను. ఇందలి "దైత్య, అమర" అను పదములచే దుష్టులు, ఇష్టులును సూచింపఁబడిరి. దుష్టశిక్షణకు ఆయుధములు అవసరము కావుననే రుద్రుఁడు, చేతఁజాపమునుదాల్చి, రథారూఢుడై సాంగ్రామికవేషము దాల్చెను. పై మంత్రమందలి "ఇషుం, అయస్మగ్ం" అనుపదములకు, జెందినభావము "చాప, అమరౌఘ" అనెడి శ్లోకస్థ పదములచే సూచింపఁబడెను. సురలైనను దృప్తులైనచో హాస్యాస్పదులగుదురు. అదిసత్కార్యకాదు. కావుననే రుద్రుఁడు వారిని జూచి, మందహాసము చేసెననియు, హేయముగాఁ దలంచెనను విషయము "దృష్ట్యత్పురత్రయతృణాశనిమందహాసమ్" అనెడి శివగత విశేషణముచే వ్యక్తమగుచున్నది.

## 6వ మంత్రము :

"అధ్యవోచదధివక్తా ప్రథమోదైవ్యోభిషక్ ।
అహీగ్శ్చసర్వాన్ జంభయన్ సర్వాశ్చయాతుధాన్యః"॥

అర్థము :—

హే రుద్ర! = ఓ రుద్రుడా! అందఱిలోన నీవే అధికుఁడవని చెప్ప బడుచున్నావు. కాన నిన్ను, అధివక్తా = అధివక్తవని, అధ్యవోచత్ = లోకము చెప్పెను, దేవానాంమధ్యే = దేవతలమధ్యను, ప్రథమః = నీవేముఖ్యుడవు, దైవ్యః = స్వయముగా దేవతలను పాలింప సమర్థుఁడవు , భిషక్ = ధ్యాన మాత్రముచే సర్వరోగములను ఉపశమింపఁజేయు వైద్యుఁడవు, సర్వాన్ = సమస్తమైన,అహీగ్ శ్చ = సర్పవ్యాఘ్రాదులను , సర్వాః = సకలమైన,యాతుధా న్యశ్చ = రాక్షసజాతులను, జంభయన్ = నశింపజేయువాడవును అగుచున్నావు

తాత్పర్యము :-

సా.భాష్యము :— మహాదేవా! మాయందఱిలో "నీతఁడే అధికుఁడని", నిన్నుద్దేశించి చెప్పుటచే నీవే అధివక్తవైతివి. దేవతలలో నీవే ప్రథముఁ డవు; ముఖ్యుఁడవుకదా! నీవు దైవ్యుఁడవు. అనగా దేవతలనెల్ల స్వయముగా పాలింప సమర్థుఁడవు. నిన్ను దలంచినంతనే సర్వరోగములునుపశమించును. కాన నీవు చికిత్సకుఁడవు. సర్వ సర్పములను, వ్యాఘ్రాదులను,సర్వరాక్షసు లను నశింపఁజేయువాఁడవుకదా! కావున మమ్ములను గాపాడుము తండ్రీ!

భభా భాష్యము :— పైమంత్రమునకుఁ గణ్వుడు ఋషి. శంభువు దేవత. అనుష్టుప్ ఛందస్సు. "నమస్తే రుద్రమన్యవ" అను మంత్రము మొదలు "శివేనవచసాత్వా" అను వరకుఁగల మంత్రము లైదును ప్రత్యక్ష కృతములు. ఈ మంత్రము మొదలు "నమోఅస్తు నీలగ్రీవాయ" అనువరకు గల మంత్రములు నాల్గును, పరోక్షకృతములు.

"బ్రాహ్మణాయాధిబ్రూయాత్" అను మంత్రమున బ్రాహ్మణునుద్దేశించి నీవధికుఁడవని చెప్పినట్లు కలదు. దానిని పరిశీలించినచో శివుఁడే దేవతలలో నెల్ల అధికుడని తెలియుచున్నది. ఈశ్వరుఁడష్టైశ్వర్యసంపన్నుఁడు. "అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తిప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము" అనునవి అష్టైశ్వర్యములు. శివుఁడష్టైశ్వర్యములను భక్తులకొసఁగఁగల సమర్థుఁడు. అందుచే భక్తులపట్ల శివుడు అధివచన స్వభావుడు. అధివచన సమ ర్థుఁడును. అతడు పశువులను అనగా జీవులను అధికారిగానుండి, శాసించి, పలుక సమర్థుఁడు కాన అధివక్త ఆయెను. ఈశ్వరుఁడాయెను. శివేతరులు అందఱును అనీశ్వరులే. వారు అధికులమని పల్కితిరేని హాస్యాస్పదులగుదురు.

పరమశివుఁడే సృష్టికిఁ బ్రథముఁడు. ఈ విషయమే "అహమాదిర్హి దేవా
నామ్" అను గీతాసూక్తిలో అహంపదార్థమైన పరబ్రహ్మయే దేవులకెల్ల ఆది
యైనవాఁడని చెప్పఁబడెను. "ఆదిదేవో మహాదేవః" అని విష్ణుసహస్రనామమున
సైతము విష్ణుపరముగాఁ బేర్కొనఁబడెను. అపరబ్రహ్మయే ఇందుఁ బేర్కొనఁ
బడిన రుద్రుఁడు. దేవభవుఁడు అనగా స్వయంప్రకాశమానుఁడై స్వయముగా
వెలసినవాఁడు కాన దైవ్యుఁడాయెను. లేక దేవుఁడైన పరమాత్మనుండి వెలసిన
వాఁడు కాన దైవ్యుఁడు ఆయెనని చెప్పవచ్చును. రుద్రుఁడే సృష్టిస్థితిలయ కార్య
నిర్వహణకై, బ్రహ్మాండమున బ్రహ్మవిష్ణుమహేశ్వరరూపమున బ్రకాశిల్లెను.
కాన దైవ్యుఁడాయెను. కూర్మోంగానీవ సర్వశః" అను సూక్తిలో జీవితావసరము
లకై కూర్మము అంగములనెల్ల బైటఁబెట్టి, కార్యాంతమున ముడుచుకొనును. అట్లే
పురుషుఁడు సృష్ట్యవసరమునఁ దనలోని ప్రకృతిని బైటపెట్టి, సృష్ట్యంతము న
దానిని దనలోనికిఁ గైకొనుచున్నాడు. అని చెప్పఁబడెను. దానిని గమనించి
పెద్దలు "ఆరోపదృష్టితో పురుషుఁడే" ప్రకృతియని చెప్పుచున్నారు. అతఁడే
దైవ్యుఁడు.

దేవనమునందు అనగాఁ గ్రీడాదులలో సుఖరూపనగలడు. కాన దైవ్యుఁ
డాయెను; అని చెప్పవచ్చును. పురుషుఁడైన పరమాత్మ దృష్టిలో సృష్టియొక
క్రీడ. ప్రకృతినం యోగమొక క్రీడ. అట్టి క్రీడలోఁ గల్గునానందము సత్త్వ
గుణమయసుఖము. అదియే తైత్తిరీయమునఁ జెప్పిన మానుషానందము "యోదేవ
దేవానామానందః" అను మంత్రమున, దేవులలో అనగా దేవనములలోఁ గల
ఆనందము దేవుఁడని కలదు. అదియే ఇందు దైవ్యశబ్దముచేఁ జెప్పఁబడెను.
"దేవనం దేవః" అని భాష్యమునఁ జెప్పఁబడెను. జగత్సృష్టిరూపమైన మాను
షానందము అశాశ్వతము. దీనినే పోతనామాత్యుఁడు తన భాగవతమునఁ గృష్ణా
వతారఘట్టమున "పుట్టువులేని నీకభవ! పుట్టుటక్రీడయకాక పుట్టుటే" అను
పద్యమున శ్రీ కృష్ణరూపజననము క్రీడయని వివరించి చెప్పెను.

అంతేకాదు. రుద్రుఁడు దైవ్యుఁడు, అనగా విజిగీషలో జయరూపుఁడు.
శత్రువులను జయింపఁ గోరికయు దేవనమే. అందు జయముపొందువాఁడు

దైవ్యుఁడు. విజిగీషలోని విజయము క్షత్రియ ధర్మము. త్రిమూర్తులలో విష్ణువునకుఁ జెందినది విజిగీష. అది తైజసశక్తియన్నమాట.

"శౌర్యంతేజోధృతిర్దాక్ష్యం, యుద్ధేచాప్యపలాయనందానమీశ్వర భావ శ్చక్షత్రకర్మ స్వభావజమ్" అనుగీతాసూక్తిలోని" యుద్ధేచాప్యపలాయనమ్" అనుపదముచే బోధితమైన విషయమే (యుద్ధమున వెన్నుచూపి పఱుగెత్తకుండుటయే) విజయము. రుద్రుఁడు జయరూపుఁడని చెప్పుటచే శివునిలో శివవిష్ణుశక్తిసంపన్నమైన తేజస్సుకలఁదు. శివకేశవులిరువురును ఒకటేయని తెలియుచున్నది. కావున సుఖముకాని, విజయముకానికావలెనన్నచోఁ బైమంత్రమును జపించితీరవలెనని తెలియుచున్నది.

అంతేకాదు. దైవ్యుఁడనగా, వ్యవహారమున వివిక్తరూపుఁడని తెలియుచున్నది. వివిక్తమనగా రహస్యము వివిక్తరూపుఁడనగా రహస్యరూపుఁడని యర్థము. అనగా రుద్రుని నిజస్వరూపము, దృగ్గోచరముకాదు. అదియే సువర్ణ తేజోరూపమగు పరబ్రహ్మమన్నమాట. "సువర్ణజ్యోతిః" అను తైత్తరీయమంత్రమునఁ బైవిషయము సువ్యక్తమగును.

దైవ్యుఁడనగా ద్యోతనమునఁ బ్రకాశరూపుఁడని తెలియుచున్నది. ఆదిత్యుఁడు దైవ్యుఁడు. శివుని అష్టమూర్తులలో ఒకఁడు కావున రుద్రుఁడు సూర్యరూపుఁడై ఆకాశమునఁ బ్రకాశించుచున్నాడని యర్థము. "తేజసామపితేజస్వీ" అను సూక్తిలోఁ జెప్పినట్లు, తేజస్సులలోఁదేజస్వియై దైవ్యరూపమున రుద్రుడు ప్రకాశించుచు, లోకములను బ్రకాశింపఁజేయుచున్నాడని తెలియుచున్నది. "జ్యోతిషామపితజ్జ్యోతిః" "జ్యోతిషాంరవిరంశుమాన్" అను గీతా సూక్తులచేఁ బై విషయము ప్రస్ఫుటమగుచున్నది.

దైవ్యుఁడనగా స్తుతిలోస్తుత్యరూపుఁడని తెలియుచున్నది. ఇదియే విష్ణుసహస్రమందలి "స్తవ్యఃస్తవప్రియః స్తోత్రంస్తుతిస్తోతా, రణప్రియః" అను సూక్తివలనఁ దెలియుచున్నది. అనగా స్తుతి, స్తుత్యుఁడు, స్తవ్యుఁడు, స్తోత్రము కూడ విష్ణువే. అనగా సర్వ వ్యాపకుఁడైన శివుడే అన్నమాట. పరమాత్మను

దెలియఁజేయు వేదవేదాన్తములు, పురాణములు మునగునవన్నియు, బ్రహ్మ విష్ణు మహేశ్వరుల స్తుతులే. వానిలో స్తుతింపఁదగు పరమాత్మయే స్తుత్యుఁడు. అట్టి స్తుత్యుఁడైన రుద్రుఁడు దైవ్యుఁడుగా ఇందుఁ బేర్కొనబడెను. భక్త శిఖామణి పోతన్న —

(1) చేతులారంగ శివునిఁబూజింపడేని,
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని,
దయయు సత్యంబు లోనుగాఁదలపడేని,
కలుగ నేటికిఁదల్లుల కడుపుచేటు"

(2) "శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ"

అను తనసూక్తులలో బైవిషయమునే చక్కగా వివరించి చూపినాడు.

రుద్రుఁడు గతిలో గన్తవ్య రూపుఁడు; లేక వాయురూపుఁడనియుఁ దెలియుచున్నది. గతి అనగా ఉత్తమగతి, మోక్షము. గన్తవ్యుఁడు అనగాఁ జేర దగినవాఁడు. పరబ్రహ్మ. అట్టి పరబ్రహ్మయే రుద్రుడు. "గతిర్భర్తా, ప్రభు స్సాక్షీ" అను విష్ణు సహస్ర సూక్తిలో "గతి" పదము విష్ణుపరముగాఁగలదు. దానిని శివపరముగా సైతము చెప్పవచ్చును. కావున "గతి, గన్తవ్యుఁడు" అను రెండు పదములును బరమాత్మ వాచకములే. రుద్రుఁడును బరమాత్మయే. కాన గతి గన్తవ్య రూపుడైన రుద్రుడు దైవ్య పదముచే ఇందుబోధింపబడెను దైవ్యుఁడైన రుద్రుడు వాయురూపుడై సర్వాంతర్యామిగానుండెను.

అంతేకాదు, దివ్యజ్ఞానోపపన్నులైన దేవతలలో రుద్రుఁడు ముఖ్యుడు. ఈ విషయమే "ఆదిత్యానామహం విష్ణుః" అను విభూతియోగ శ్లోకమునఁ జెప్పబడెను.

మహాదేవుడు ఇందు భిషక్కుగాఁగూడ పేర్కొనబడెను. భిషక్కు అనగా వైద్యుడు. జీవుల కంటికి, వ్యాధులు, సంసారము, ఆధ్యాత్మికాధి భౌతికాధి దైవికములనెడి తాపములును, మిక్కిలి బాధాకరములు. అవి సప్త వ్యసనములవలె జీవులను గష్టములపాలుచేయును. అకష్టములనెల్లఁదొలగించు చికిత్సకుడే రుద్రుడు. కావున జీవులపాలిట భిషక్కు ఆయెను.

"భిషక్తమంత్వాభిషజాంశృణోమి" అను మంత్రమున- ఓ దేవా! నిన్ను వైద్యులలోనెల్ల, గొప్ప వైద్యునిగాఁదలంచుచున్నాను; అని పేర్కొనెను విష్ణు సహస్రనామములలో, విష్ణుపరముగా "భిషక్" అనుపదము "త్రిసామా, సామగస్సామనిర్వాణంభేషజంభిషక్" అను సూక్తిలోఁ బేర్కొనఁబడెను. "భియాసాదయితా = భిషక్ "(భి+షక్)" అనగా భయమును నశింపఁజేయు వాఁడని యర్థము. రుద్రుఁడు భక్తులైన మార్కండేయాదుల భయమును బోగొట్టువాఁడు కాన "భిషక్" అయెను.

"భయకృత్ భయనాశనః" అను విష్ణు సహస్రనామములలో, విష్ణువు భయనాశనుడుగాఁ బేర్కొనబడెను. ఆ విష్ణువే, ఇట రుద్రుఁడు, కావున శివునకును, "భిషక్" అను నామము ఎంతయుఁ దగియున్నది. "భీతౌ సజ్జతే = ప్రాప్యతే" అను నర్థమును గ్రహించినచో, భీతి కల్గునపుడు, కుంతీదేవి చెప్పినట్లు భగవంతునే ధ్యానించి, భీతిని బోగొట్టుకొనెదము. గజేంద్రుఁడు మకరము వలన గష్టము వాటిల్లినపుడు

"లావొక్కింతయులేదు, ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులా।
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చెఁదనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్।
నీవే తప్పనితఃపరంబెఱుగ, మన్నింపన్ దగున్ దీనునిన్।
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా॥"

అని దేవుని బ్రార్థించి, కష్టమును బోగొట్టుకొనెను. కావున శివకేశవులిరువురును భీతి సమయముచే భయనాశకులై ప్రాప్యులగుచున్నారు, కావున భిషక్ పదము శివుని వట్ల సమంజసముగా నున్నది.

"దేహభేదనైస్సీదతి = సజ్జతి, అను గృహ్ణాతివాభిషక్" అను నర్థమును బరిశీలించినచో, దేహములను భేదించి, అనుగ్రహించువాఁడు కావున, రుద్రుఁడు భిషక్కాయెను అని తెలియుచున్నది. మహాశివుఁడు తన భక్తులైన, వ్యాఘ్రాసుర, గజాసురుల దేహములను బరిమార్చి, వారి చర్మములను వస్త్రములుగావించుకొని, తనతో వారికి, సన్నిహిత సంబంధము చేకూర్చి. అనుగ్రహించెనని, శివపురాణ కథలవలనఁ దెలియుచున్నది.

అంతేకాదు, రుద్రుడే విష్ణువు కావున, అతడు శ్రీరాముడై అవతరించి శాపముచే, శిలయిగానున్న అహల్యకు దనపాదస్పర్శచే, శిలారూపమును దొలగించి, నిజరూపమునొసంగి, అనుగ్రహించెనని, రామాయణ కథ వలన దెలియుచున్నది. సకల సర్పములను సంహరించి, రక్షించువాడు శివుడు. సర్పములు స్వయముగా ప్రాణులచెంతకువచ్చి, జంతువులను హింసించునవి కావున, వానికి "అహి" అనెడి నామము వచ్చినట్లు, "అగత్య హింసంతి జంతూనితి అహయః" అను వ్యుత్పత్తిచే దెలయుచున్నది. సర్పములు జీవులకు మృత్యుదాయకములు. శివుడు మృత్యుంజయుడు కాన, సర్పములనెల్ల అతడు సంహరించి, జీవులను గాపాడును.

"ఊరక సజ్జనుండొదిగియుండినసైన, దురాత్మకుండుని ష్కారణమో ర్వలేక, యపకారముసేయుట, వాని విద్యగా"అని భాస్కర శతకమున జెప్పినట్లు, సర్పములు దురాత్మకములు; అనగా దుష్టస్వభావములు. కాన వానినుండి శివుడు రక్షించవలెను.

"నమో అస్తు సర్పేభ్యోయేకేచపృథివీమను।
యేఅంతరిక్షే, యేదివి, తేభ్యస్సర్పేభ్యోనమః"

అను కేతు మంత్రార్థమును గమనించినచో, సర్పములు పృథివియందు, అంతరిక్షమునందు, స్వర్గమునందును గలవనియు, వానికి నమస్కారమనియు జెప్పినట్లు తెలియును.

జాతకములందుగల రాహు కేతు గ్రహముల కాలమున సాధారణముగా కష్టములు సంభవించుట కలదు. ఆకష్టములు తొలగించుకొనుటకు, రాహు కేతు గ్రహముల జపములుచేయుదురు. అపమృత్యుపరిహారమునకై, త్ర్యంబక జపముచేయుదురు. అపమృత్యుహరుడు శివుడు. అందుచే తనే, శివాభిషేకము చేయుదురు. శివుడే ప్రణవము. (ఓంకారము) నమశ్శబ్దముకూడ ఓంకారమే. కావుననే ప్రతినామమునకును మొదట "ఓం" అనియు, చివర "నమః" అనియు పదములను జేర్చెదరు, ఆ నమః శబ్దమే "నమోఽఅస్తు సర్పేభ్యః" అను

మంత్రమున గలదు. దీనినిబట్టి, సర్పబాధ తొలగించువాడు నమస్స్వరూపు డైన రుద్రుడన్నమాట, కావుననే పై మంత్రమున, సర్వసర్ప సంహర్త శివు డని తెలియుటకే "అహీగ్ంశ్చ సర్వాన్ జంభయన్" అని చెప్పబడినది.

ఇట జంతు హింసకములు సర్పములే కాదు. వ్యాఘ్రవృశ్చికాదులును గలవు. ఇట "అహి" పదమునకు సర్వక్రూర జంతువులని యర్థము. వాట న్నిటిని, జంభయన్ = నశింపజేయుచు, రక్షింపవలసిన బాధ్యత లయ కారుడైన శివునిదే. శివుడు దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షింపకున్నచో "పృథివీశాంతిరంతరిక్షగ్ం శాంతిర్ద్యౌశాంతిర్దిశశ్శాంతి రవాంతరదిశాశ్శాన్తిః" అను దశశాంతులలోని మంత్రమున జెప్పినట్లు, భూమి, అంతరిక్షము, స్వర్గము, మున్నగు చోట్ల శాంతి యేర్పడదు.

మహాదేవ! క్రూరసత్వములతో బాటు, యాతుధానులనెల్ల (రాక్షసుల నెల్ల) సంహరించి, రక్షింపుము తండ్రీ! యాతుధాన్యులు సామాన్యులుకారు. "యాతయంతి = దుఃఖం యాంతీతియాతవః" అను వ్యుత్పత్తినిబట్టి, అందరి కిని దుఃఖములు గల్గించు మాయలకు యాతువులు అనిపేరు. "యాతవః ధీయన్తే = త్విష్ఠన్తిఏతేషు" అను వ్యుత్పత్తినిబట్టి యాతుధానులు అనగా, మాయ లకు నిలయమైన రాక్షసులని యర్థము. రాక్షసులు నిర్నిమిత్తముగా లోక ములను బీడించుట, త్రిపురాసుర, రావణాదుల చరిత్ర వలన మనలకు దెలి సిన విషయమే. శివకేశవాత్మకుడైన రుద్రుని వలననే పదునాల్గు భువనంబుల వారికిని రాక్షస బాధలు తొలగినవి. ఆ రాక్షసులు దుర్గుణములే. వారి మాయలే, సృష్టిలోగల అసుర సంపద. అట్టి యాసుర సంపదలనుదొలగించి, జీవులకు దైవీ సంపదల నొసగువాడు శివుడే. కావున శివా! యాతుధానులనెల్ల సంహరింపుమని నరులు నిత్యము శివుని బ్రార్థింపవలెను.

మృత్యుంజయా! ప్రత్యక్షముగా జీవులనెల్ల హింసించి, అశాంతిని జేకూర్చు, వృశ్చికాదులను సింహ వ్యాఘ్రమ చోరాదులను, సంహరించి, రక్షిం పుము. అంతేకాదు, పరోక్షముగా లోకములను బీడించు మాయావులైన రక్షః పిశాచాదులను, అపస్మారాదిరోగములను, నశింపజేసి, మమ్ములనురక్షింపుము

భయపడకుడు. మిమ్ములనెల్ల రక్షింపఁగలను" అని అభయమొసగి, దేవా! మమ్ములను రక్షింపుమని రుద్రుఁడు ప్రార్థింపబడెను.

*పురశ్చరణము*

కృచ్ఛ్రవ్రతమాచరించి, శాకమూలయవచరుభోజనుఁడై పగలు అవశ్యకులతో అవిరోధముగా మెలగుచు, పంచదినములు పైమంత్రమును జపించి, పురశ్చరణగావించి, రాజు భూమిని రక్షింపవలెను, సర్వరక్షణకై తెల్లావాలను, బియ్యమును, దూర్వాలను, యవలనుఆజ్యములో దడిపి, అగ్నిలో అష్టసహస్ర హోమము ఆచరింపవలెను. రాజు దీర్ఘాయుష్మంతుఁడగుటకు, తిల గుడయవపయోనుశ్రితమైన చరువుతో అష్ట సహస్ర హోమమాచరింపవలెను. పిమ్మట త్రివిధ దక్షిణల నొసగవలెను. ఉత్తమ మధ్యమాధమ పద్ధతులలో బంగారు నాణెములను దక్షిణగా నొసంగవలెను. "అత్యల్ప దక్షిణో యజ్ఞో యజమానంశవయతే" అను వచనము వలన అత్యల్పముగా దక్షిణ నొసగినచో యజమానికి నష్టము కల్గును.

"విభవేసతియో మోహాన్నకుర్యాద్విధివిస్తరం।
నైవతత్ఫలమాప్నోతి ప్రలోభాక్రాన్తమానసః"

అను శాస్త్రవచనమును బరిశీలించినచో, లోభాక్రాన్తమానసుఁడై ధనమున్నను మోహముచే యథావిధిగా దక్షిణలనొసగకున్నచో దాని ఫలము నందఁజాలడని తెలియుచున్నది. "ఆచార్యో భగవానేవేతిమంతవ్యః" అను శాస్త్ర వచనము ననువరించి, ఆచార్యుని భగవంతునిగా భావించవలెనని చెప్పిరి. కావ అతనికి రెండురెట్లు దక్షిణ నొసంగవలెను.

మొదట అగ్నియెదుట మంత్రకలశమునుంచి, అగ్నియందు దేవుని ఆవాహనచేసి, హోమము చేయవలెను. హోమానన్తమన రాజుపైఁ గలశోదకము జల్లవలెను. గురువును జక్కగా నాదరించు రాజునకుఁ జక్కని రక్షణ జరుగును. ఇట్లే 11సార్లు మంత్రించి, ప్రత్తి గింజలు, లవణము, ఆవాలు జల్లిన దిక్కువిడిచి, రాజు ఏదిక్కునకేగినను, వానికి వ్యాఘ్ర బ్రహ్మరాక్షసాదులవలన ఏప్రమాదమును వాటిల్లదు. ఇట్లే గర్భరోగాదులు నశించుటకును, ఈ మంత్రమునకుఁ జెందిన హోమవిధానమాచరింపవలెను, ఆవాలనేడుసార్లు అభిమంత్రించి, శిఖలో బంధించియుంచినచో రోగి ఆరోగ్యవంతుఁడగును. తెల్లావాలను ఏడుసార్లు అభిమంత్రించి, కొప్పులో ముడచి యుంచినచో బాలురకు గ్రహోచ్చాటాది బాధలు తొలగును.

ధ్యానము :—

*"చంద్రార్ధ మౌళింకాలారింవ్యాళయజ్ఞోపవీతినం।*
*జ్వలత్పావకసంకాశం ధ్యాయేద్దేవంత్రిలోచనమ్॥"*

తాత్పర్యము :-

ఇందు మహాదేవుఁడు దుష్ట శిక్షణను, శిష్టరక్షణను గావింప సమర్థుడై యున్నట్లు వర్ణింపబడెను. శిష్టరక్షణకై లోకములకుఁ జల్లదనము చేకూర్చుటకై శివుఁడు చంద్రుని మౌళిపై దాల్చెను. అతడు కాలారి. అనగా మృత్యుంజయుఁడు. అతడు సర్పములను యజ్ఞోపవీతముగాఁ దాల్చెను. ప్రజ్వరిల్లు పావకునితో, సమానముగానుండెను. అగ్నిని మూడవకన్నుగాఁ గల్గియుండెను. అట్టి శివుని ధ్యానించెను.

స్వయంప్రకాశమానుఁడే దేవుఁడు. అతడే సర్వాధికుఁడు. కాన జీవులకెల్ల అధివక్తగా నుండెనని దేవపదముచే వ్యక్తమగుచున్నది. జ్వలత్పావకుఁడు సువర్ణ తేజస్కుఁడు. అతనితో సరిగానున్నవాఁడు, అనగా సువర్ణజ్యోతియైన మూలవిరాట్టు రుద్రుఁడనియు, అతడే సృష్ట్యాదినున్న ప్రథముడఁని దీనిచే గోచరించుచున్నది,

బ్రహ్మ సుఖస్థాపకుఁడు. విష్ణువు విజయదాయకుఁడు, శివుఁడు కామ దుఁడు. కాన ఆనందదాయకుఁడు. పై మువ్వురును అగ్ని స్వరూపులే. అట్టి అగ్ని శివునకు మూడవకన్ను. కానఁ త్రిలోచన పదముచే, మంత్రమందలి దైవ్యపదార్థములైన సుఖానంద విజయముల నొసంగి, స్తుత్యుఁడాయెనను విషయము గోచరించుచున్నది.

ఓషధీశుఁడైన చంద్రుని మౌళిపైదాల్చెననుటచే మంత్రమందలి, భిష క్పదార్థము గోచరించుచున్నది.

"కాలారి"యను పదముచే గోచరించు మృత్యుంజయత్వము, "అహీగ్ శ్చసర్వాన్" అను పదములచే గోచరించు మృత్యుంజయత్వము నొకటేయని తెలియుచున్నది. వ్యాళములవంటి యాతుధానులను ధ్వంసమొనర్చువాడుకాన "వ్యాళయజ్ఞోపవీతి" పదముచే మంత్రమందలి "జంభయన్ సర్వాంశ్చ యాతుధాన్యః" అను పదములచేఁ దెలియఁదగు విషయము గోచరించుచున్నది.

## 7వ మంత్రము :

*"అసౌయస్తామ్రో అరుణ ఉతబభ్రుస్సుమంగళః*
*యేచేమాగ్ంరుద్రా అభితోదిక్షు శ్రితాస్సహస్రశోవై*
*షాగ్ంహేడఈమహే"*

అర్థము :

యః = ఏ రుద్రుఁడు, అసౌ = ఈ మండలస్థాదిత్యరూపుఁడో, సచ = అతఁడు, తామ్రః = ఉదయకాలమున అత్యంతము రక్తవర్ణుఁడాయెను., అరుణః = ఉదయాత్పూర్వము ఇంచుకంత రక్తవర్ణుఁడాయెను, ఉత = అంతేకాదు, బభ్రుః = ఉదయానంతరకాలమున పింగళవర్ణుఁడాయెను. ఆయా కాలములందు అతనిలో మిగిలిన వర్ణములు కలవు., సుమంగళః = అంధ

కారాదులను నివారించుటచే అత్యంతము మంగళ స్వరూపుఁడాయెను, యే = కిరణరూపులైన ఏయీ తరరుద్రులు, ఇమాంఅభితః = ఈ భూమిపైనంతటను దిక్షు = తూర్పు మున్నగు దిక్కులందును, శ్రితాః = వ్యాపించియున్నారో, తే = వారును, సహస్రశః = సహస్ర సంఖ్యాకులై కలరు, ఏషాం = సూర్య రూపులును, సూర్యరశ్మిరూపులునగు ఈరుద్రులకు అందఱకును, హేడః = క్రోధసదృశమైన తీక్ష్ణత్వము కలదో దానిని, అవ+ఈమహే = అవేమహే = భక్తి నమస్కారాదులతో నివారించుచున్నారము.

*తాత్పర్యము :-*

సా.భా. :— ఇందు రుద్రుఁడు ఆదిత్యుఁడుగా, ఆదిత్య కిరణములుగా భావింపఁబడెను. ఆదిత్యుఁడనగా సూర్యుఁడు. రుద్రాదిత్య లిరువురును పరబ్రహ్మ స్వరూపులుగాన, రుద్రుని మండలస్థాదిత్యునిగాఁజెప్పెను. అతడు ఉదయకాలమున అత్యంత రక్తుఁడు. అనగా మిక్కిలి యెఱ్ఱగానున్నవాడని యర్థము. అతడు ఉదయాత్పూర్వము ఈషదర్క్త వర్ణుఁడు, కాన అరుణుడాయెను. ఉదయానన్తర కాలమున రుద్రరూపాదిత్యుఁడు పింగళవర్ణుఁడై యుండెను. మిగిలిన వర్ణములన్నియును, అతనిలో అయా కాలములందుఁ గలవు. నానావర్ణుఁడైన అయాదిత్యుఁడ అంధకారాదులను నివారించు కారణమున అత్యంతము మంగళకరుఁడై యుండెను. రుద్రుఁడు భిషక్కుగా నుండి ఆరోగ్య ప్రదుఁడైన కారణమున ఆదిత్యుఁడుగా, ఆదిత్య కిరణములుగాఁబేర్కొనబడెను. సూర్యరశ్మి రూపులైన రుద్రులు భూమిపైనంతటను, అన్ని దిక్కులందును, సహస్ర సంఖ్యాకులై వ్యాపించియున్నారు. ఆదిత్య రూపుఁడును, ఆదిత్యరశ్మి రూపుఁడునగు, రుద్రులలో, హేడము అనగాఁ క్రోధసదృశమైన తీక్ష్ణత్వము కలదు. భక్తిపూర్వక నమస్కారములచే ఆ తీవ్రత్వమును నివారించు చున్నాము.

భ.భా. భాష్యము :— "అసౌయస్తామ్రః" మున్నగు మంత్రములు ద్వాదశాక్షరపంక్తి ఛందస్సునకుఁ జెందినవని కొందఱు, పంచ పదములు

గల పంక్తి ఛందస్సునకుఁ జెందినవని కొందఱందురు. "అసౌయోఽవసర్పతి" అను మంత్రము షట్పదమైన జగతీ ఛందస్సునకుఁ జెందినది. ఈ 7,8 మంత్రములకు రెండింటికిని కాలుఁడు ఋషి. మరుత్వంతుఁడనికొందఱందురు ఆదిత్యాత్మక రుద్రుఁడు వీనికి దేవత.

"అసౌయస్తామ్ర" ఇత్యనేన ఆదిత్యముపతిష్ఠతే" అను శతపథ బ్రాహ్మణోక్తినిబట్టి పైమంత్రమున రుద్రుఁడాదిత్యాత్ముడుగా నిరూపింపఁబడుటచేఁ బైమంత్రమునకు రుద్రుని దేవతగాఁ బెద్దలు చెప్పిరి. మహాదేవునకు జగదుప సంహారమునకై అష్టమూర్తులు నిరూపింపఁబడినవి. అవియే

"పృధివీసలిలంతేజో వాయురాకాశ ఏవచ।
సూర్యాచంద్రమసౌసోమయాజీచేత్యష్టమూర్తయః"

అను సూక్తిలో వివరింపఁబడినవి. పై మూర్తులలో ఆదిత్యుఁడొకడు. "ఆకాశాద్వాయుః। వాయోరగ్నిః" అను మంత్రములోఁ జెప్పినట్లు, ఆరంభమైన సృష్టి పై యాకాశాదుల మూలముననే, ఉపసంహరింపఁబడినది. కావునఁ బైఎనిమిది యును ఉపసంహారక మూర్తులు. అందుచే రుద్రాదిత్యులొకటేయనుటలో వివాదములేదు.

రుద్రునిలోఁగల దివ్యతేజస్సు ద్వాదశాదిత్యులలోఁజేరి ప్రళయకాలమునఁ బ్రకృతి నంతటిని ఉపసంహరించుచున్నది. కావున ఆదిత్యుఁడును, ఆదిత్యరశ్మిలును రుద్రరూపములై ప్రకృతిలో వ్యాపించుచున్నవి.

"ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అను సూక్తిలోఁ జెప్పినట్లు ఆరోగ్య ప్రదాత ఆదిత్యుఁడు. అతడే రుద్రుఁడు. కావుననే "ప్రథమోదైవ్యోభిషక్" అను మంత్రములో రుద్రుడు భిషక్కుగా జెప్పఁబడెను. ఆదిత్యరూప రుద్రుని అనుగ్రహ సంపాదనకై భక్తులు "అసౌయస్తామ్రో అరుణః" "అసౌయోఽవసర్పతి" అనురెండు మంత్రములతో రుద్రునిఁ బ్రార్థించుచున్నారు. ఆతడే రుద్రుఁడని అంగుళితోఁజూపుటకే "అసౌ" పదము చెప్పఁబడినది.

ఆకాశమున మెఱయు రుద్రుఁడు ఉదయసమయమున, తమస్సంపర్క ముచే తామ్రవర్ణుఁడై యుండును నల్లని వస్తువులపైఁబడు తెల్లని కాంతులు తామ్రవర్ణముగా నుండును. ఈ విషయము ఉదయసమయమునఁ దూర్పు దిక్కు మొదటిభాగమునఁగల ఆకాశమును జూచితిరేని సుస్పష్టమగును. అంతే కాదు, భూచ్ఛవిసంపర్కము వలన సైతము ఉదయకాల సూర్యకాంతి ఎఱ్ఱగనే యుండును. ఉదయకాలమునకు ముందుగానున్న కాలమున సూర్యకాంతి లేత యెఱుపురంగులో నుండును. ఆకాలమున సూర్యుఁడు అరుణుడుగానుండును తర్వాత రానురాను సూర్యుడు పింగళవర్ణుఁడుగానుండును. అదియే బభ్రువర్ణము. దానినే ఎఱుపుతోఁగూడిన పసుపురంగు అందురు. ఈ బభ్రువర్ణముచేతనే సూర్యుఁడు విశ్వమంతటిని మేల్కొలిపి విజ్ఞానమునొసగును.

"విశ్వం బిభర్తి పోషణాదినా ఇతి బభ్రుః" అనువ్యుత్పత్తిచేఁ బైయర్థము వ్యక్తమగుచున్నది. సూర్యకాంతులచే రోగములను రూపుమాపు పద్ధతిని, విజ్ఞాన శాస్త్రవేత్తలు కనుగొని, ఈనాడువాడుకలోనుంచిరి. బూరగాలు జబ్బును సూర్యుని రక్తవర్ణకిరణప్రసారముచే నిర్మూలించుచున్నారు. సూర్యుని పింగళవర్ణకిరణప్రసారముచే మూర్ఛమున్నగు జబ్బులు నివారింపఁ బడుచున్నవి. సూర్యకాంతిగల విద్యుచ్ఛక్తిసాయమున "కేన్సరు" వ్యాధి (పుట్టు వ్రణముబాధ) తగ్గింపఁబడు చున్నది. ప్రకృతి వైద్యములో రోగనిర్మూలనకు సూర్యకాంతి ఉపయోగపడుచున్నది.

సూర్యుఁడురోగనాశనమొనర్చి ఆరోగ్యదాత యగుచున్నాడు. సూర్య ప్రభావస్ఫోరకములగు అరుణసారమంత్రము లను జపించి, బొల్లిజబ్బు (తెల్ల మచ్చలు) పోగొట్టుకొనుట, అనాదికాలమునుండియు, నేటివరకునుగలదు. "మయూరుఁడు" అనుమహాకవి సూర్యశతకమును సంస్కృతమున రచించి కుష్ఠువ్యాధినిపోగొట్టుకొనినట్లు మయూరశతకమువలన దెలియుచున్నది. ఇంత యేల? సంధ్యావందనమందలి

"ఉద్యన్తమస్తంయన్తమాదిత్యమభిధ్యాయన్।
కుర్వన్ బ్రాహ్మణోవిద్వాన్ సకలంభద్రమశ్నుతే।
అసావాదిత్యోబ్రహ్మేతి బ్రహ్మైవసన్। బ్రహ్మాప్యేతియఏవంవేద"

అను మంత్రమును బరిశీలించినచో, సూర్యుఁడే బ్రహ్మావదార్థమనియు, అట్టి ఆదిత్యుని, సూర్యోదయ, సూర్యాస్తమయ, మధ్యాహ్న సమయములందు ధ్యానించిన, సకల భద్రములు కల్గునని తెలియుచున్నది. సూర్యుఁడు ఉదయమున బ్రహ్మ స్వరూపుఁడు; మధ్యాహ్న సమయమున రుద్రస్వరూపుఁడు; సాయంసమయమున విష్ణు స్వరూపుఁడని నిగమాదులలోఁ గలదు. ఉదయ సాయంకాల సూర్యకిరణములు బలవర్ధక తేజస్సు నొసగును. మధ్యాహ్న కాల కిరణములు రోగహారియైన తేజస్సు నొసగును. సూర్యకిరణశక్తిని గ్రహించియే "సోలార్ బేటరీస్" తయారుచేసి, గోళాంతర యాత్రను నేటి వైజ్ఞానికులు సాగించుచున్నారు.

రుద్రతేజస్సు సూర్యునిలోఁ గలదు. కాన అది పాపహరము. పాప రూప రోగహరమని తలంచియే

"సూర్యశ్చ,మామన్యుశ్చ,మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః।పాపేభ్యోరక్షన్తాం యద్రాత్ర్యాపాపమకార్షం। మనసావాచా హస్తాభ్యాం। పద్భ్యాముదరేణ శిశ్నా। రాత్రిస్తదవలుంపతు। యత్కించదురితంమయి। ఇదమహం, మామమృత యోనౌ। సూర్యేజ్యోతిషి జుహోమిస్వాహా॥"

అను మంత్రముతో ఉదయమునను, "అగ్నిశ్చమామన్యుశ్చ" అను మంత్ర ముతో సాయంసమయమునను, సూర్యుని బ్రార్థించుచున్నారు. సూర్యుఁడు మానసిక వాచిక రోగములను, బాపములనేకాక, హస్తాది రోగములను, హస్తాదికృత పాపములను సైతము బోఁగొట్టుచున్నాడు. కావుననే ఈమంత్ర మున, రుద్రుని సూర్యునిగాఁ బేర్కొని, అతని వర్ణములను ద్రామాదులను బేర్కొని, అతనిని సుమంగళునిగాఁ బేర్కొనినారు.

సుమంగళుఁడు అనగా సర్వమంగళ సమృద్ధిగలవాఁడని యర్థము. మంగళములనగా శుభములు. అవి పాపపరిహారకములు, సర్వరోగ నివారక ములు కూడ. అట్టి మంగళములను, జీవులకొసగువాఁడు కాన, సూర్యరూప

రుద్రుఁడు సుమంగళుఁడాయెను. పగటిపూట సూర్యుడు తన వర్ణములతో, ఆరోగ్యదాత, రోగపరిహారకుడునుగావచ్చును. కాని రాత్రి ఎట్లు? అని శంకింపనక్కఱలేదు. రాత్రియందు సూర్యుఁడు తనతేజస్సును అగ్నియందును అగ్నిగోళమగు చంద్రునియందును ప్రవేశపెట్టును. ఈ విషయము శ్రీ కాళి దాసుని రఘువంశ శ్లోకమునందలి "దినాంతే నిహితం తేజః సవిత్రేవ హుతాశనః" అనుదానివలనఁ దెలియుచున్నది. అందుచే రాత్రిపూట రుద్రుడు తనరూపముగల చంద్రాగ్నులద్వారా ప్రకృతి కభివృద్ధినొసగుచు, జీవుల రోగములను బాపుచున్నాడు; కాన సుమంగళుఁడాయెను.

అంతేకాదు, సూర్యకిరణములును రుద్రపదముచే బోధితములగు చున్నవి. సూర్యరశ్ములు రుద్రులు, అనగా రుద్రునితో సమాన వేషము, సమాన విభూతియును గలవిగా దేవునిచే సృష్టింపఁబడినవి. అవి దేవునకు అనుచరులుగానున్నవి అవి అన్నిదిక్కులందును వేలకొలదిగా వ్యాపించి యున్నవి. అవి జగత్తులయొక్క, అనగా జగంబులందలి జీవులయొక్క పుణ్య పాప కర్మానురూపముగా, వానికాపుణ్యపాపఫలములను ఒసంగును. అందుచే శిష్టులు, వారిని, సకలజీవులను బాపపరిహారమొనర్చి, రక్షింపవలసినదిగాఁ త్రిసంధ్యలందును "ఓం నమః ప్రాచ్యైదిశే, యాశ్చదేవతా, యేతస్యాం ప్రతివసన్తి, ఏతాభ్యశ్చవోనమః" అనురీతిని అన్ని దిక్కులందు దేవతలను ప్రార్థించుచున్నారు. ఇట, దేవతలనగా, రుద్రరూప సూర్యరశ్ములని యర్థము

ఆదిత్యాత్ముఁడైన రుద్రుని, స్వభూతములే రశ్మిరూప రుద్రులై, పృథివి యందంతటను వ్యాపించియున్నవి. అందుచే జీవులు నిత్యము, రుద్రరూపా దిత్యుని యొక్కయు, రుద్రరూపములైన రశ్ములయొక్కయు క్రోధరూపమైన తీవ్రతను,గ్రోధమునుఅనాదరభావము తొలగించుటకై, వానిని నమస్కరించి, స్తోత్రముచేయుచున్నారు. "హేడ"అను పదమునకు, యాస్కాదినిఘంటువుల ననుసరించి, తీక్ష్ణత, అవమానము, క్రోధమూ అనెడి యర్థములున్నట్లు తెలియుచున్నది.

"శమోదమస్తపశ్శౌచమ్" "శౌర్యం తేజోధృతిః" "కృషిగౌరక్ష్య వాణిజ్యమ్" మున్నగు గీతాసూక్తులనుబట్టి అన్నిజాతులవారికిని గొన్నికర్మలు విహితములైయున్నవని తెలియును. వానినాచరింపకుండుటయే విహితాతిక్రమణము. నిత్యకర్మాష్టకమును, బంచయజ్ఞములను నిత్యము ఆచరింపవలెను. వానినాచరింపకుండుటయు విహితాతిక్రమణమే. అంతేకాదు,

"ఆశాసంహరణంబు నోర్మియు మదత్యాగంబుదుర్దోషవాం।
చాశాన్యత్వము, సత్యమున్, బుధమతాచారంబు సత్సేవయున్।
వైశద్యంబును, శత్రులాలనము, మాన్యప్రీతియున్, బ్రశ్రయ।
శ్రీశాలిత్వము, దీనులందుఁ గృపయున్ శిష్టాళికిన్ ధర్మముల్"

అను సుభాషితమునఁ జెప్పిన ధర్మముల నాచరింపకుండుటయు, విహితాతిక్రమణమే అగును. దీనికిఁదోడుగా, నిషిద్ధ కర్మలను, దుష్కర్మలను ఆచరించుటయు, దోషమే అగును. అపుడు సృష్టిస్థితిలయకారునకు, ఆగ్రహము, అనాదరభావము, తీక్ష్ణత, జీవులపట్లకలుగును. అపుడు లయకారుడైన రుద్రుఁడు ఆదిత్యరూపమునను, ఆదిత్యాంశువుల రూపమునను జీవులను శిక్షించును. అందుచే రుద్రప్రీతికై, స్తుతినమస్కారములనాచరించి, అతనిని బ్రసన్నునిగావించుకొనవలెను.

భక్తశిఖామణి పోతన్న పై విషయమెఱిగినవాఁడు కాపున భక్తులనుప్రోధించుటకై

"చేతులారంగ శివునిఁ బూజింపడేని,
నోరునొవ్వంగ హరికీర్తి నుడువడేని,
దయయు సత్యంబులోనుగాఁ దలపడేని,
గలుగనేటికిఁ దల్లుల కడుపుచేటు"

అని ఉత్తేజకరమగు పద్యమును వ్రాసినాడు. అందుచేఁ బ్రతిదినము ప్రతి మానవుఁడును త్రిమూర్త్యాత్మకుడైన సూర్యుని రక్షింపుమని

ప్రాతస్స్మరామిఖలుతత్సవితుర్వరేణ్యం।
రూపంహిమండలమృచోఽథతనూర్యజూంషి।
సామానియస్య కిరణాః ప్రభవాదిహేతుం।
బ్రహ్మాహరాత్మకమచింత్యమలక్ష్యమూర్తిమ్॥

అను శ్లోకముతోఁ బ్రార్థింపవలెను.

భావము :—

లోకమంతయు సవితయొక్క (సూర్యునియొక్క) వరేణ్యముతో (తేజస్సుతో) నిండియున్నది. అదియే అతని రూపము. ఋగ్వేదమందలి ఋక్కులే అతని మండలము; యజుర్వేదమందలి మంత్రములు అతనిశరీరము సామవేద మంత్రములు అతని కిరణములు. అతడే ప్రకృతియొక్క సృష్టి స్థితి లయములకు హేతువు.. అతడు బహ్మ+అ+హర+ఆత్మకుఁడు. అనగా బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపుఁడు. అతని మహిమ అచింత్యము; ఊహాతీతము. అతని మూర్తి అలక్ష్యము. అనగాఁ జూడశక్యముకానిది. బ్రహ్మ స్వరూపుఁడైన సూర్యుని తేజస్సే ప్రకృతియందంతటను వ్యాపించి, దానిని నడిపించుచున్నది. అదియే సువర్ణజ్యోతిగాఁ దైత్తరీయోపనిషత్తులో "సువర్ణ జ్యోతిః" అని చెప్పఁబడినది ఋగ్వేదమున బ్రహ్మపదార్థముయొక్క మండల శక్తి సామూహికశక్తిగా వివరింపఁబడినది. యజుర్వేదము బ్రహ్మపదార్థ శరీర మగుటచే శరీరమునకుఁజెందిన కర్మకాండయంతయు యజుర్వేదమున వివరింపఁబడినది. సామవేదము కిరణములగుటచే బ్రహ్మపదార్థవ్యాప్తికిఁ జెందిన విషయములు (కిరణజన్య శక్తులు) అందు వివరింపఁబడినవి. త్రిమూర్తి స్వరూపుడైన కారణమున ఆదిత్యుఁడు సృష్ట్యాదికారణభూతుఁడాయెను. అందుచే అతని ప్రభావము, ఆకారమును, అచింత్యము, అలక్ష్యము నాయెను. కావున మనము నిత్యము, రుద్రాత్మక సూర్యుని ధ్యానించి, స్తుతించి అనుకూలుని గావించుకొనవలెను.

## 8వ మంత్రము :

*"అసౌయోఽవసర్పతి నీలగ్రీవో విలోహితః।*
*ఉతైనంగోపా అదృశన్నదృశన్నుదహార్యః।*
*ఉతైనం విశ్వాభూతానిసదృష్టోమృడయాతినః॥"*

**అర్థము :—**

యః = ఏ రుద్రుఁడు; నీలగ్రీవః = కాలకూటమను విషము దాల్చుటచే నీలవర్ణమైన గ్రీవము కల్గియుండెనో; అసౌ = ఈతడు; విలోహితః = విశేషమైన రక్తవర్ణము కలవాఁడై, మండలవర్తియై; అవసర్పతి = ఉదయాస్తమయ సంపాదకుఁడై ప్రవర్తించుచున్నాడు; ఉత = అంతేకాదు; గోపాః = వేదశాస్త్ర సంస్కారహీనులైన గోపాలురుకూడ; ఏనం = ఈయాదిత్యరూపుఁడై మండలమునఁగల రుద్రుని; అదృశన్ = చూచుచున్నారు; ఉదహార్యః = నీరమును గొనివచ్చు వనితలును, ఏనం = ఈరుద్రుని; అదృశన్ = చూచుచున్నారు; ఉత = అంతేకాదు; ఏనం = ఆదిత్యరూపుఁడగు ఈ రుద్రుని; విశ్వాభూతాని = గోవులు, బఱ్ఱెలు,మున్నగు సకలప్రాణులును; అదృశన్ = చూచుచున్నవి; సదృష్టః = వేదశాస్త్రజ్ఞులచేతను, వేదశాస్త్రాదులు తెలియనివారిచేతను బహుపశ్వాదులచేతను జూడఁబడువాఁడైన, ఆ రుద్రుఁడు; నః = మమ్ములను; మృడయాతి = సుఖవంతులనుగాజేయునుగాక.

**తాత్పర్యము :-**

సా.భావ్యము :— మహాశివుఁడు క్షీరసముద్ర మథనమునఁ బుట్టిన గరళమును గంఠమునఁదాల్చి, నీలగ్రీవుఁడాయెను. రక్తవర్ణుఁడై, ఉదయాస్తమయములను లోకమునకు తెలియఁబఱచుచు, కాలబోధకుఁడేకాక, కాలస్వరూపుఁడునై యుండెను. రుద్రుఁడు కైలాసముననున్నపుడు, వేదశాస్త్ర పరిజ్ఞాతల జ్ఞాననేత్రమునకు మాత్రమే గానవచ్చును.సామాన్యులకుఁ గానరాడు అందుచేనందఱికిని దర్శనమొసఁగుటకై రుద్రుఁడు ఆదిత్య రూపమును

దాల్చెను. కావుననే, మండలస్థుఁడైన ఆదిత్యరూపరుద్రుని, వేదశాస్త్ర సంస్కార శూన్యులైన గోపాలురుకూడ జూచుచున్నారు.

అంతేకాదు, నదీతటాకాదులనుండి నీరము గొనివచ్చు వనితలును ఆదిత్యుని జూచుచున్నారు. అంతేకాదు, గో మహిష్యాది సకల ప్రాణులును ఆదిత్యుని జూచుచున్నవి. అట్లు అందఱికిని దర్శనమొసగు, రుద్రరూపాదిత్యుఁడు సకల జీవులచే (జూడబడుచు, మమ్ములనందఱిని, సుఖవంతులఁ గావించుగాకయని భక్తులెల్లరు ప్రార్థించుచున్నారు.

భ.భా. భాష్యము :— రుద్రస్వరూపము ఆదిత్యమండల రూపమున అందఱికిని ప్రత్యక్షమగుటచే ఈ మంత్రమున రుద్రునిగూర్చి "అసౌ" అను పదము ప్రయోగింపఁబడెను. ఆదిత్యుడస్తమయ సమయమున, అధోమార్గమున బోవుచున్నట్లు, కనఁబడుటచే "అవసర్పతి" పదము ప్రయోగింపబడెను. నిజమునకదిలోకాన్తరగమనముకాని, అధోగమనముకాదు. అతని గమనమున అతఁడు, నీలగ్రీవుఁడుగాఁ గానవచ్చును. మహాశివుని గ్రీవము (కంఠము) కాలకూటవిషాలంకృతమైనకారణమున, నీలముగాఁ గానవచ్చును. అతని దేహము, సూర్యరూపమునఁ గానవచ్చుకారణమున, మండుచున్న అగ్నితో సమానముగాఁ గానవచ్చును. జ్వలత్పావకుఁడు, పింగళవర్ణుఁడు; సూర్యుఁడును బింగళవర్ణుఁడే. అట్టి పింగళవర్ణమే రుద్రునియందునుగలదు.

ఇటనీలగ్రీవ, విలోహితపదములురెండును, శివునకువలె, సూర్యున కును విశేషణములే. సూర్యుఁడు నీలగ్రీవుఁడెట్లాయెను? అందులకేమో!చూడుడు "గ్రసంత్యుదకమ్" అనువ్యుత్పత్తిననుసరించి, నీరమును ద్రాగునవికానఁ, గిర ణములకు "గ్రీవ" అనునామమేర్పడెను. నీలమైన గ్రీవములు (కిరణములు) కలవాఁడునీలగ్రీవుఁడు.

"అపోవాఇదగ్ంసర్వం, విశ్వాభూతాన్యాపః— — —జ్యోతీగ్ష్యాపః" అనుమంత్రమున జ్యోతిస్సులు అనగా "తేజఃపుంజములు" జలస్వరూపములని

చెప్పబడెను. దీనినిబట్టి, తేజఃపుంజములైన కిరణములందు జలముగలదు; అనితెలియుచున్నది. సూర్యుఁడు తనకిరణములచే నేలమీఁది తేమనుగ్రహించి, తపింపఁజేసి, వర్షించుచున్నాడు. దీనిననుసరించియే భారవికవి "అభివర్ష తియోఽనుతాపయన్" తపింపఁజేయుచునే వర్షించుచున్నాడు; అనిచెప్పెను. సూర్యుడుదయము నుండియు, నీటిని గ్రహించి, అస్తమయము పొందు చున్నాడు. అపుడాతనికి, (దమస్సుతో సంసర్గము కల్గుచున్నది. . తమస్సు తోడను, నీటితోడను గూడిన కారణమున, (గిరణములకు లోహితవర్ణ మేర్ప డుచున్నది. అపుడు నీలగ్రీవుఁడైన సూర్యుఁడు విలోహితుఁడై కానవచ్చును.

"యోరుద్రో అగ్నౌయో అప్సుయ ఓషధీషు,
యోరుద్రో విశ్వాభువనావివేశతస్మై రుద్రాయనమోఅస్తు"

అను మంత్రమును బరిశీలించినచో, రుద్రుఁడు అగ్నియందును, నీటియందును ఓషధులయందును గలడు. అతడు సకల విశ్వములందు వ్యాపించియున్నాడు. అని తెలియుచున్నది. రుద్రుఁడే అగ్ని. అగ్నిమండలమే సూర్యుఁడు. సూర్య రూపరుద్రుఁడు జలములందును గలడు. అపుడు జలము సూర్యుని, సూర్య కిరణములను ఆవరించియుండును. అట్టి సూర్యుఁడు సర్వకాలములందును సర్వత్ర వ్యాపించును. అపుడు తమస్సంపర్కముచే, సూర్యుడును, సూర్య కిరణములును లోహితములై కానవచ్చును. ఇట్టు సూర్యుడు, ఉదయాస్తమయ ములచే, లోకయాత్ర గావించుచు, అబాలగోపాలము అందఱకును గానవచ్చు చున్నాడు.

ఇంతేకాదు, ఆదిత్యరూఁపుడైన దేవుని, అజ్ఞులలోఁ బ్రథములైన గోపా లురుకూడఁ గాంచుచున్నారు. వారికంటె, క్షుద్రులైన ఉదహార్యలు అనగా జలవాహికలై బ్రతుకు వనితలుకూడ, అట్టి ఆదిత్యుని (జూచుచున్నారు. "నేక్షేతోద్యంతమాదిత్యమ్" అను సూక్తిలో ఉదయించు సూర్యునిఁ జూడ రాదని కలదు. అమాట, దృష్టిలోవ రూపానారోగ్య నివారణకై చెప్పఁబడినది

కాని ప్రకృతిలో సంచరించు గోపాలురు, ఉదహార్యులైన వనితలును అజ్ఞులు కాన అదిత్యుని జూచుచున్నారు.

ఇట గోప శబ్దమునకుఁ గేవలము గోపాలురనియేకాదు అర్థము. "స్వర్గేషు పశువాగ్వజ్రదిజ్నేత్రఘృణిభూజలే" అను అమరకోశ సూక్తినిబట్టి గో శబ్దమునకు (1) స్వర్గము, (2) ఇషువు, (3) పశువు, (4) వాక్కు. (5) వజ్రము, (6) దిక్కు, (7) నేత్రము, (8) ఘృణి, (9) భూమి, (10) జలము అని అర్థములు కలవు. వీనిని రక్షించువారెల్లరును గోపులే యగుదురు. (1) గోపులు = అనగా స్వర్గపాలకులు. ఇంద్రాది దేవతలన్న మాట. వారందఱును మందేహాది రాక్షసులబారినుండి తప్పించుకొనుటకు, అదిత్యునిఁ బ్రార్థింతురు. ఆ రాక్షసులు, సూర్యుని సైతము అరుణ ద్వీపము నుండి అడ్డుచుండ, త్రిసంధ్యలందు విడుచు అర్ఘ్యప్రదానముచే వారి యడ్డంకి తొలగును. అపుడాదిత్యుడు, వారిని బ్రకృతిని గాపాడును.

గో + ప = ఇషు + ప = అనగా ధనస్సుతో ప్రజలను రక్షించువారు. రాజులన్నమాట. వారు సూర్యవంశజులు, చంద్రవంశజులు, అని రెండు విధములుగాఁగలరు. వారందఱికిని, సూర్యుఁడు, సూర్యతేజస్సుతోఁగూడిన చంద్రుఁడును అరాధ్యదేవతలు. "అష్టాభిశ్చసురేంద్రాణాం మాత్రాభిర్నిర్మితో నృపః" అను సూక్తినిబట్టి, రాజులతో అష్టదిక్పతుల అంశలును గలవని తెలియుచున్నది. అష్టదిక్పతులలోగల, ఈశానుఁడును, అగ్నియును, రుద్రాంశతో నున్నవారే. అరుద్రుఁడే ఆదిత్యరూపమున వెలయుచున్నాడు. అందుచే రాజులు అరోగ్య ప్రాప్తికై అదిత్యుని బ్రార్థింతురు.

గోశబ్దమునకుఁ బశువులనియునర్థముగలదు. అపుడు "గోప" శబ్దము నకుఁ బశుపాలకుఁడనియర్థముపచ్చును. పశుపాలరుఁడనగా జీవులనురక్షించు శివుఁడనియు నర్థముకలదు. కాని ఇట "గోప" శబ్దమునకు గోపాలురనియే అర్థము చెప్పవలసియున్నది. గోపాలురు అజ్ఞులై ఆదిత్యుని వింతగాఁ జూచు చున్నారు.

"గో+వ" అనగా వాక్కులను బాలించువాఁడు; అనియర్థముకలదు. వాక్కులు "పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి" అని నాల్గువిధములు. భక్తి జ్ఞానయోగకర్మమార్గములలో దైవమును జేరఁదలచినవారెల్లరు, పైవాక్కులకుఁ జెందిన పద్ధతులను బాటించవలసినదే. అందువలన జ్ఞానులుధ్యానమగ్నులైన పుడుఁ పశ్యన్తీ వాక్శక్తిపరులై ఇళాపింగళాసుషుమ్నానాడులలో సూర్యనామీననుస రించి, అంతర్లోకమున, ఆదిత్యరూపమును పిలోకింతురు. ఆనందింతురు.

"గో+ప" అనుపదమునకు వజ్రముతో రక్షించువాఁడనియు నర్థము గలదు. అపుడు 'గోప'పదమునకు ఇంద్రుడనియర్థము చెప్పవలసియున్నది. వజ్రము ఇంద్రునియాయుధమగుటయే, అందులకుఁగారణము. ముల్లోకముల కును ముక్కోటిదేవతలకును, ప్రభువగు ఇంద్రుఁడు దివమునుండి, భూలోక వాసులకు హితమగు నాహారమునొసగు సస్యములనుపోషించుటకై వర్షము కురిపించును. వర్షముచేఁ బెరుగుసస్యములపూవులందుఁ జంద్రకిరణములంవలి అమృతముపడుటచేతనే అవిగింజకట్టును. ఆగింజలు సూర్యకిరణప్రసారముచే గట్టిపడిధాన్యములగును. అవియేజీవులకాహారముఅగును. అపుడింద్రునిపాలన పక్రమమగును. అందుచే ఇంద్రుడు తనసస్యరక్షణక్రియకు సాయపడుటకై తనసహాయుఁడైన మండలస్థాదిత్యునిఁజూచును.

"గో+వ" పదమునకు దిక్కులనుపాలించు దిక్పతులనియునర్థము గలదు. ఇంద్రాగ్నియమనైఋతివరుణవాయుకుబేరేశానులేకదా! అష్టదిక్ప తులు. అందుఁగలయీశానుఁడే ఆదిత్యరూపమున మండలమునుండి రక్షించు చున్నాడు. అతనిని మిగిలినదిక్పతులు చూచుచున్నారు.

"గో + వ" పదమునకు నేత్రము లను రక్షించుకొనువారనియు నర్థము గలదు నేత్రములు జ్యోతీరూపమైన దృష్టికిఆధారములు. జ్యోతిస్స్వరూపుఁడు సూర్యుఁడు. సూర్యచంద్రులనాడులననుసరించి, కాంతినేత్రములందుఁ బ్రస రించును. సూర్యచంద్రాంశువుల ప్రసారము తక్కువైనపుడు దృష్టిలోపము నేర్పడును. కావునదృష్టినిసంపాదింపఁ గోరువారు ఆదిత్యుని బ్రార్థింతురు' కంటిజబ్బులు ప్రాప్తించినవారు, సూర్యునకుమ్రొక్కలిడి, సూర్యక్షేత్రములను దర్శించుట, భారతీయులకు అనాదిసిద్ధమైన ఆచారమైయున్నది. "చంద్ర సూర్యౌచనేత్రేకర్ణావాశాః" అను శ్లోకము నఁ బరమాత్మకు సూర్యచంద్రులే నేత్రము లనిగలదు. కావున నేత్రశక్తికధిపతులు, సూర్యచంద్రులు. అందుచే నేత్రరక్షకులు, సూర్యునిజూచి, ప్రార్థించుటయుక్తముగానున్నది. "చంద్ర మామనసోజాతః చక్షోస్సూర్యోఅజాయత" అనుపురుషసూక్తమంత్రమును బరిశీలించితిమేని పరమాత్మయొక్క, మనస్సునుండి చంద్రుఁడు, చక్షుస్సు నుండి సూర్యుఁడు ఉద్భవించినట్లు తెలియుచున్నది. కావున, నేత్రాధిపతి సూర్యుడే. నేత్రారోగ్యముకోరువారు సూర్యుని బ్రార్థింపవలసినదే.

"గో + ప" అనుపదమునకు "గోభిః = కాంతికిరణైఃపాంతీతి, గోపాః" అనువ్యుత్పత్తిననుసరించి, కాంతికిరణములతో, లోకములను రక్షించు గ్రహములు, నక్షత్రములు, అనియర్థము చెప్పవలసియున్నది. నక్షత్రము ల కన్నిటికిని బ్రభువుచంద్రుఁడు. చంద్రాదిగ్రహములకన్నిటికిని అధిపతి సూర్యుఁడు. గ్రహము లకును, నక్షత్రములకును దేజస్సొసగువాఁడు సూర్యుఁడే గ్రహనక్షత్రము ల గమనము లననుసరించి, జీవుల జీవితము లుల్లసిల్లును. గమనభేదము ననుసరించియే, సకలలోకము ల వృద్ధిక్షయములు జరుగుచుండును. అవియన్నియు, లోకములను గ్రహించి, పట్టియుంచును. కావుననే వానికి "గ్రహములు" అనునామమేర్పడెను. వానికధిపతి సూర్యుఁడు కాన, చంద్రాది గ్రహములు రుద్రరూపాదిత్యుని జూచుచున్నవి.

"గో+ప" అను పదమునకు భూమిని రక్షించువారనియు నర్థము కలదు. ఆ పక్షమున గోప శబ్దమునకు రాజులు అని యర్థము చెప్పవలసి యున్నది. రాజులు తమపాలనలోఁగల భూభాగమందలి సకల జనులు, ఆయురారోగ్యములు గలవారైయుండుటకుఁ బ్రయత్నింతురు. ఆయువునకు ఆరోగ్యమును ఒక కారణమే. అట్టి యారోగ్యము నొసగువాఁడు భాస్కరుఁడని "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అను సూక్తివలన (దెలియుచున్నది. అందుచే రాజులు నిత్యము సూర్యుని ఆరాధించుచు, సూర్యుని దర్శింతురు. సూర్య దర్శన నమస్కారములద్వారా, ఆరోగ్యప్రాప్తి జరుగునని "సౌరారుణ" మంత్రములవలనఁ దెలియుచున్నది.

"గో+ప" శబ్దమునకు జలమును గాపాడువాఁడనియు నర్థముగలదు. అనగా జలాధిదేవత వరుణదేవుఁడని యర్థము. అతడు సకల జీవరాసులకు ఆహారమగు నీటిని, సూర్యుఁడు తన వేడి కిరణములచే ఆవిరిచేసి, పీల్చకుండ నుండుటకై సూర్యుని వీక్షించి ప్రార్థించును. ఒకవేళ తన వేడిమిచే నీరు ఇంకినను, మఱల వర్షింపజేయువాడు ఆ సూర్యుఁడే. కావున అతనిని వరుణుఁడు ఈక్షించి, వర్షింపజేయవలసినదిగా ప్రార్థించును. నీటిని వర్షించు పర్జన్యునిలోఁగల ధూమజ్యోతిస్సలిలమరుత్తులనెడి నాల్గుభాగములలోనున్న జ్యోతిస్సు సూర్యునిదే. సూర్యుడే పృథివీజల హరుఁడు. పృథివీజలదాత. కాన అతఁడు ఈక్షింపఁబడును.

"ఆపోవా ఇదగ్ం సర్వం, విశ్వాభూతాన్యాపః, ప్రాణావాఆపః, పశవఆపోఽన్నమాపోఽమృతమాపస్సమ్రాడాపో, విరాడాప, స్స్వరాడాప, శ్ఛందాగ్ష్యాపో, జ్యోతీగ్ష్యాపో, యజూగ్ష్యాప, స్సత్యమాప, స్సర్వా దేవతా ఆపో, భూర్భువస్సువరాపఓమ్"

అను మంత్రమును బరిశీలించినచో అపః = జలమే ఈసమస్త ప్రకృతి. జలమే సకల ప్రాణులు, జలమే ప్రాణములు. జలమే పశువులు. జలమే అన్నము.

జలమే అమృతము. జలమే సమ్రాట్ అనగా జీవుఁడు. జలమే స్వరాట్టు అగు ఇంద్రుడు. జలమే ఛందస్సులు అనగా వేదములు. జలమే తేజస్సులు. జలమే అదిత్య శరీరమైన యజస్సులు. జలమే సత్యమైన పరబ్రహ్మ. జలమే సకల దేవతలు. జలమే భూర్భువస్సువములనెడి లోకములు. జలమే ఓంకారము (ప్రణవము); అని తెలియుచున్నది. అట్టి జలమూ అదిత్యుఁడే. జలదాతయు నాదిత్యుఁడే. అదిత్యుఁడొకవేళ తన తీవ్ర కిరణములతో జలమంతటిని హరించెనేని, తనను దాను భక్షించు కొనుటయేకాదు, తన మూలమున ప్రకృతికంతటికిని నాశమేర్పడును.

అంతేకాదు, సకల ప్రాణులకు, అమృతాశనులైన ఇంద్రాది దేవతలకు వేదములకు, తేజస్సులకు, భూరాదిలోకములకు, ఓంకార స్వరూపునకును నాశమేర్పడి, ప్రళయమేర్పడును అట్టి మహాప్రళయ మేర్పడకుండనుండుటకై, గోపశబ్దవాచ్యులైన ఇంద్రాదులెల్లరును అదిత్యునీక్షించుచు, గాపాడుమని ప్రార్థింతురు. అట్టిచో సామాన్యులైన ఉదహార్యులాలోకించి, ప్రార్థించుటలో వింతయేమున్నది.

మహాదేవ స్వరూపుఁడైన సూర్యుని మహిమనెఱిగి, అతని నీక్షించి, పూజించుటలో అందఱును గోపాలకసదృశులే; అని తెలుపుటకై విశ్వమందలి భూతములెల్ల ఈభగవంతుని సూర్యరూప రుద్రుని జూచిరని చెప్పఁబడినది. అంతేకాదు, శ్రుత్యాదులచే సైతము తెలియరాని మహిమగల సూర్యుని ప్రత్యక్షముగా నందఱును జర్మచక్షుస్సులతోడనే చూచుచున్నారు. ప్రత్యక్షను భూయమానుఁడైన అతఁడుమమ్ములను సుఖపెట్టుగాక. కొందఱు అస్తమయము నొందు సూర్యుని జూచుచున్నారని వివరించి చెప్పుచున్నారు. ఉదయకాలపు సూర్యుఁడువలె, అస్తమయ సూర్యుఁడును జగదుపకారకుఁడు కావలెనని కోరుచు, అతనివలని యుపకారములను, ఇందు ప్రదర్శింపమొదలిడి, గోపాలురు అదిత్యుని జూచుచున్నారని చెప్పిరి.

వారేకాదు, గోవులు గ్రామ నగరములను జేరు సమయమును నిరీక్షించుచు, ఉదకవాహికలుకూడ అస్తమయాదిత్యునిఁ జూచుచున్నారు. సూర్యుఁడస్తమించిన పిమ్మట ఉదకము తేరాదు; అని నిషిద్ధశాస్త్రము కలదు. కాన సూర్యాస్తమయమునకుఁబూర్వమే నీటిని దేవలయును. మృగ పక్షి వరాహాదులు కూడ గృహగమన సమయమాసన్నమాయెనో, లేదోయని సకల భూతములును అస్తమయ సూర్యుని వీక్షించుచుండెను. ద్విజులును అగ్నిహోత్ర సంధ్యావందనకాలమ్ము నరించినవారై అస్తమయసూర్యుని నిరీక్షించుచున్నారు.

"నేక్షేతోద్యన్తమాదిత్యం నాస్తంయంతంకదాచన" అను శాస్త్రవచనమున ఉదయాస్తమయాదిత్యునిఁ జూడరాదనియే చెప్పఁబడెను. చూచినచోఁ బ్రమాదము వాటిల్లును. అట్టి ప్రమాదము వాటిల్లకుండ, పాపము సంభవించకుండ కాపాడి, సకలజీవులకు ఉపస్థానఫలము నొసగవయ్యా, తండ్రీ! అని ప్రార్థించవలెను. అందులకే మంత్రమున "మృడయ" సుఖమూ చేకూర్పుము; అను పదముపయోగింపఁబడెను.

### ఉపాసనావిధి — ఫలము :—

పై రెండు మంత్రములను ఏకాంతమున ఐదునారు దినములు నిరంతరము జపించవలెను. పైరెండు మంత్రముల జపముచే అనావృష్టి సమయమందునను, వర్షము కురియును. ఆరుద్రకార్తె యారంభముననుు, ఒకప్పుడు ఆర్ద్రాకార్త్యంతమువరకును బంచసిద్ధులైన విప్రులచే జపము చేయించవలెను. వారికి ఉష్ణీషమును (తలపాగను) సూత్నవస్త్ర, కంఠాభరణ, కర్ణాభరణ, కరాలంకారాదుల నొసంగవలెను. తిలతండులయవలను, దధిమధుఘృతములతోఁ దడిపి, 100వేలసార్లు హోమము చేయవలెను. ఇట్లు జపహోమాదుల నాచరించినచోఁదప్పక కుంభవృష్టి కురియును. మెడబంటి నీటిలో నిల్చి, పైరెండు మంత్రములను బఠించుచు, దోసిళ్ళతో నీళ్ళను ఆదిత్యునిదిక్కు చిమ్మవలెను. పంచసిద్ధులైన విప్రులలో నొకడు జపముచేయుచుండగా, క్షీర

ములోఁ దడిపిన వేతస సమిధలను నల్గురు హోమయు చేయవలెను. ఇట్లు 11 దినములు దీక్షచేసి, తుదిదినమున, ఎనిమిదివేలు ఎఱ్ఱదామర పూలతో రుద్రుని ప్రత్యేకముగాఁ బూజింపవలెను ఈ యాగము పూర్తియగువరకు అగ్నిని భద్రముగా నుంచవలెను. ఇట్లాచరించినచోఁ జివరిదినమున మహా వృష్టి కురియును. 10వేల వేతస పుష్పములతో హోమముచేసి, "ఉద్యన్తమ స్తంయంతమ్" అను మంత్రముతో సూర్యోపస్థానముచేసినచో సూర్యుఁడు కోరిన వరమొసంగును. దినమునకు 8వేలు చొప్పున, 9 దినములు జపించి, తేనెలోఁదడిపిన జపాపుష్పములను, 21వేలు హోమము చేసినచో సూర్యుఁడు సంవత్సరముపాటు కోరిన కోరికలనొసంగును. వాఁడు చతుర్వేది కులమున జన్మించును.

ధ్యానము :-

*శ్లో॥ మండలాంతరగతం హిరణ్మయం।*
*భ్రాజమానవపుషం శుచిస్మితం।*
*చండదీధితిమఖండవిగ్రహం।*
*చింతయేన్మునిసహస్రసేవితమ్॥*

**తాత్పర్యము :-**

ఇందు మహాదేవుఁడు సూర్యమూర్తిగా ధ్యానింపఁబడుచుండెను. అతడు సూర్యమండలాంతర్గతుఁడై యుండెను. అతని శరీరము సువర్ణచ్ఛాయతో మెఱయుచుండెను. తెల్లని చిఱునవ్వు కాంతి ముఖమునుండి తొణికిసలాడు చుండెను. అతని కిరణములు చాల తీవ్రముగా నుండెను. అతని విగ్రహము అఖండమై యుండెను. వేలకొలది మునులు అతనిని సేవించుచుండిరి. అట్టి సూర్యరూప రుద్రుని ధ్యానించవలెను.

విశేషము :—

"అసౌయోఽవసర్పతి" అను పదములచేఁ దెలియునర్థమే "మండలాంతరగతమ్" అను పదముచే సూచింపఁబడెను. మొదటి మంత్రమందలి "తామ్ర, అరుణ, బభ్రు" అనుపదములచే వ్యక్తమగు వర్ణవిశేషములే "హిరణ్మయం, భ్రాజమానవపుషం, చండదీధితిమ్" అను పదములచే వ్యక్తములగుచున్నవి. "గోపాః, ఉదహార్యః, విశ్వాభూతాని" అనుపదములచే వ్యక్తమగు విషయములే "మునిసహస్ర సేవితమ్" అను పదముచే సూచింపఁబడెను. సూర్యుని సేవించువారు, చూచెడి వారలందఱును, మునులు, మునితుల్యులేయని తెలిసికొనవలసియున్నది. "రుద్రా అభితో దిక్షు" అను పదముచే వ్యక్తమగు భానుని మహిమయే "అఖండ విగ్రహమ్" అను పదముచే సూచింపఁబడెను. "హేడ ఈమహే, హృదయాతినః" అను పదములందలి భావమే "చింతయేత్" అను పదముచే సూచింపఁబడెను.

పైరెండు మంత్రముల సారాంశము ఈ శ్లోకమున సువ్యక్తమగుచున్న కారణమున ఇది మంత్రతుల్యము, జపార్హమునాయెను.

## 9వ మంత్రము :

*నమోఅస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయమీఢుషే।*
*అథో యేఅస్యసత్వానో ఽహంతేభ్యోఽకరంనమః॥*

అర్థము :—

సహస్రాక్షాయ = ఇంద్రమూర్తి ధారణముచే వేయికన్నుల వాఁడైన; నీలగ్రీవాయ = శివునకు; నమోఅస్తు = నమస్కారమగుగాక. పర్జన్యరూపధారియై; మీఢుషే = వృష్టికర్తయై సుఖమొసగు శివునకు; నమః = నమస్కారము; అథః = అంతేకాదు; యే = ఏవి; అస్య = ఈరుద్రునియొక్క; సత్వానః = భృత్యరూపములైన ప్రాణులుకలవో; తేభ్యః = వానికి; అహం = నేను; నమః = నమస్కారము; అకరం = చేయుచున్నాను.

**తాత్పర్యము :-**

సా.భా :— పూర్వమంత్రములందుఁ జెప్పినట్లు నీలగ్రీవుఁడైన రుద్రుఁడే, ఇంద్రరూప ధారణమున సహస్రాక్షుఁడాయెను. అతఁడే పర్జన్య మూర్తి ధారణముచే "మీఢ్వాన్" అనగా వృష్టికర్త అయెను. అట్టి ఇంద్ర పర్జన్య రూపధారియైన శివునకు నా నమస్కారములు అందునుగాక. అంతే కాదు, రుద్రుని సత్వానులు అనగా భృత్యులైన ప్రాణులు అందఱికిని నేను నమస్కరించుచున్నాను.

భ.భా. భాష్యము :— ఈ మంత్రమునకు, ఋషి, దేవతయు, శంభుఁడే. అనుష్టుప్పు ఛందస్సు.

నీలకంఠుఁడు సూర్యరూపమునఁ బ్రత్యక్షమైనట్లు పైరెండు మంత్రము లందును వివరింపఁబడెను. ఈమంత్రమున నీలగ్రీవుఁడు సహస్రాక్షుఁడైనట్లు (ఇంద్రుఁడైనట్లు) చెప్పఁబడెను. సహస్రాక్షుఁడనగా వేయికన్నులుకలవాఁడనియే కాదు. పరబ్రహ్మయని యర్థము. పరమపురుషుఁడు అక్షరపరబ్రహ్మ. అతఁడు తొల్త జలభూతమును సృష్టించినట్లు "అపఏవససర్జాదౌతాసువీర్యమధా సృజత్"। తదండమభవద్ధైమమ్" అను సూక్తి వలన దెలియుచున్నది. అనగా బరబ్రహ్మ తాను సృష్టించిన నీటిలోఁ దన వీర్యమునువేయగానది, హిరణ్మయ మైన బ్రహ్మాండమాయెను అని తెలియుచున్నది. అదియే అండాండ పిండాండ బ్రహ్మాండములలో మొదటిది. అందుఁ బరమాత్మ, తనశక్తిని బహువిధముల దన మాయా ప్రభావముచేఁ బ్రదర్శించెను. అదియే ప్రకృతి విలసనము. ఈ విషయమే

*సహస్రశీర్షాపురుషః సహస్రాక్షస్సహస్రపాత్।*
*సభూమింవిశ్వతో వృత్వా అత్యతిష్ఠద్దశాంగుళమ్॥*

అను పురుషసూక్తమంత్రమునఁ బ్రదర్శింపఁబడెను. అనగా బ్రహ్మనిర్మిత మైన పదునాల్గు భువనములను బ్రహ్మయే ఆవరించియుండెను. అతడే బహు నేత్రములఁ జూచుచుండెను. అదియే అతని సహస్రాక్ష స్వరూపము. ఆ పర బ్రహ్మయే అశ్వత్థరూపుఁడై ఆవరించియున్నాడు.

ఊర్ధ్వమూలమధశ్శాఖమశ్వత్థం ప్రాహురవ్యయమ్" అను గీతాసూక్తిలో, నైవిషయమే చక్కగా నిరూపింపఁబడెను. నిజమారయఁ బరమాత్మకు రూపము లేదు. అతఁడు శబ్దస్పర్శాదిరహితుఁడు, అను నీ విషయము "నరూపమస్యే హతథోపలభ్యతే" "అశబ్ధమస్పర్శమరూపమవ్యయమ్" అను గీతాసూక్తుల వలనఁ దెలియుచున్నది,

అయినను అప్పరమాత్మ ఆత్మనిర్మితబ్రహ్మాండమున, సృష్టిస్థితిలయ కార్యనిర్వహణకై త్రిమూర్తులను ఆత్మశక్తితోఁ బ్రతిష్ఠించి, వారిసృష్టిలోగల పదునాల్గుభువనములలోనివగు స్వర్గమర్త్యపాతాళలోకములయాధిపత్యమును, ఆత్మశక్తిసంపన్నుఁడైన ఇంద్రునకప్పగించెను. అయిందుఁడే ఈ మంత్రమునఁ బేర్కొనఁ బడినసహస్రాక్షుడు. అతఁడు పరబ్రహ్మముఖమునుండి ప్రాదుర్భవించినట్లు

*"ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత"*

అను పురుషసూక్తమంత్రమువలనఁ దెలియుచున్నది. నరే రుద్రుఁడే సహస్రాక్షుఁ డనుటలో నంతరార్థమేమన?

పరాత్పరుఁడైన పరమశివుడు జీవులకాదిత్యరూపుఁడైకానవచ్చి, ఆరోగ్యమునొసగుచున్నాడు. ఆరోగ్యవంతులైన జీవులకు, అన్నమును ఐశ్వర్యము నొసఁగి, రక్షింపవలసిన బాధ్యత పరమశివునదేకదా! పరమశివుడు అవాఙ్మనస గోచరుడుకదా! జ్ఞానులకుదక్క అందఱికిని గానరాడుకదా! ఎట్లు? అందుచేతనే అతడు ఇంద్రరూపముదాల్చి, జీవకోటికి ఐశ్వరమును, అన్నమును, గ్రమశిక్షణనొసగి రక్షించుచున్నాడు. "ఇది = పరమైశ్వర్యే" అను ధాతువునుండిపుట్టిన ఇంద్రపదమునకుఁ బరమైశ్వర్యసంపన్నుఁడనియర్థము. అట్టి యింద్రుఁడే సహస్రాక్షుఁడై వేయికన్నులతోఁగాంచుచు జీవులను గ్రమ శిక్షణలోనిడి కాపాడుచు,ఐశ్వర్యమొసఁగుచున్నాడు."ఐశ్వర్యమేశ్వరాదిచ్ఛేత్" అను సూక్తిననుసరించి, జీవులకునైశ్వర్యమొసఁగువాఁడు ఈశ్వరుఁడు. ఆ యీశ్వరుఁడే తనయైశ్వర్యదానశక్తిని ఇంద్రునిలోఁ బ్రవేశపెట్టి, వానిచే జీవులకిప్పించుచున్నాడు.

పరమశివునిముఖమునుండియేకదా ఇంద్రాగ్నులజన్మ. ముఖము జ్ఞానేంద్రియశక్తిసంపన్నము. శ్రవణశక్త్యాధారమైన శ్రవణము, దర్శనశక్తి కాధారమైననేత్రము, అఘ్రాణశక్తికాధారమైనఘ్రాణము, వాక్ఛక్తికాధారమైన జిహ్వయునుముఖమునందేగలవు. ఆ సమష్టిశక్తులన్నియును బ్రహ్మముఖవి నిర్గతుఁడైన ఇంద్రునిలోఁగలవు. కావుననే సహస్రాక్షుఁడైన ఇంద్రునిలోఁ దనశక్తినిమిడ్చి, ఇంద్రరూపమున శివుఁడు లోకములను గాపాడుచున్నాడు. కావున నీలగ్రీవుఁడైన సహస్రాక్షునకు భక్తులైన జీవులు నమస్కరించుచున్నారని ఇందలి యంతరార్థము.

*"ఇంద్రంనరోనేమధితాహవంతే।*
*యత్పార్యాయునయతేధియస్తాః"*

అను శ్రుతిని బరిశీలించినచో నరులెల్లరు అన్నార్థులై ఇంద్రునిగూర్చియజ్ఞములు హోమములుచేయగా ఇంద్రుఁడానందించి, పర్జన్యుఁడై (మేఘుఁడై) వర్షము కురిపించుచున్నాడని దెలియుచున్నది.

*శ్లో॥ "దుదోహగాం సయజ్ఞాయ, సస్యాయమఘవాదివం।*
*సంపద్వినిమయేనోభౌ దధతుర్భువనద్వయమ్"*

అను కాళిదాససూక్తిని బరిశీలించినచో నృపాలుఁడు ఇంద్రప్రీతికై, భూమి యందలి, సారమైన వస్తువులు గ్రహించి, యజ్ఞముచేయగా, ఇంద్రుఁడు అహారమొసగు సస్యములయభివృద్ధికై వర్షముకురిపించుచున్నాడు. ఇరువురును తమ సంపదను మార్చుకొనుచున్నారు.

*శ్లో॥ దేవాన్భావయతానేన, తేదేవాభావయంతువః।*
*పరస్పరం భావయంతః శ్రేయఃపరమవాప్స్యథ॥*

మానవులు యజ్ఞాదులచే దేవతలను గౌరవింపగా వారు జలసంపద నొసంగికాపాడుచున్నారు. అన్యోన్యము ఆదరించుకొనుచు గొప్పశ్రేయస్సును బొందుదురుగాక; అని గీతాసూక్తిలో సైతము పై విషయమే ప్రదర్శింపఁ బడెను. పై విషయములనుబట్టి. రుద్రశక్తిసంపన్నుఁడైన ఇంద్రుఁడే అన్నదాత యని తెలియుచున్నది.

సృష్టిలోస్థితిస్థాపకుఁడు విష్ణువు. లయకారకుఁడు శివుఁడు. పరికింపగా వీరు ఇరువురును ఒకటే. కావున వీరిరువురియంశలును ఇంద్రునితోఁగలవు. కావున ఇంద్రార్థకమైన వాసవపదము హరిపరముగా విష్ణుసహస్రమందలి "వసవోవాసవోహరిః"అను సూక్తిలో ఉదహరింపఁబడెను. "అహల్యాయై జార————గౌతమబ్రువాణ" అను శ్రుతిని బరిశీలించినచో, అహల్య భూరూపధారిణియైన అదితియనియు, ఇంద్రుఁడు ఆదిత్యరూపుఁడైన పరమాత్మ యనియు, ఇంద్రునకు జారత్వమేలేదనియు ఁదెలియుచున్నది తన భార్య యగు అహల్యను ప్రేమించుటచే అహల్యాపతియగు గౌతముఁడు ఆగ్రహించి, ఇంద్రుని శపించెననియు, శాపవశమున, ఇంద్రుని శరీరమున, స్త్రీ మూత్ర ద్వారములే సహస్రాక్షులుగా నేర్పడిగానవచ్చుచున్నవనియును బురాణగాథచేఁ దెలియుచున్నది. దానిని బరిశీలించినచోఁ బరబ్రహ్మ శక్తిసంపన్నులైన మహా మహులకును ఇంద్రాదులకును బాపపరిహారకములగు శిక్ష లనుభవింపక తప్ప దనియును దెలియుచున్నది. వ్యభిచారదోష సంపన్నుఁడైనను ఇంద్రుడు రుద్రాంశ సంపన్నుడగుట చేతనే త్రిలోక పూజ్యుఁడైనట్లు దీనివలనఁ దెలియు చున్నది. సుగ్రీవుఁడు ఇంద్రమూర్తినివలెఁ బర్జన్యమూర్తిని సైతము స్వీకరించెను. అందు మూలమున "మీఢుషే" అనుపదము ఇందు బ్రయో గింపఁబడెను. "మీఢ్వాన్" అనగా సృష్టికర్త పర్జన్యుఁడు (మేఘుఁడని) యర్థము. పర్జన్యుఁడు వృష్టిద్వారా భూములను దడిపి, సస్యపోషకమగు సారమొసగుచున్నాడు. అట్టిసారమొసగబట్టి భూములు చక్కగాబండి, జీవులకు

దగినయన్నమునొసంగుచున్నవి. రుద్రశక్తి ఇంద్రునిద్వారా పర్జన్యునిలోఁ గలదను విషయము "పర్జన్యాయప్రజాయత, దివస్పుత్రాయమీఢుషే" అను శ్రుతివలనఁ దెలియుచున్నది. అంతేకాదు.

*"యాభిరాదిత్యస్తపతిరశ్మిభిస్తాభిః పర్జన్యోవర్షతి।*
*పర్జన్యేనౌషధివనస్పతయః ప్రజాయంత। ఓషధివనస్పతిభి*
*రన్నమ్॥*

అను మంత్రార్థమును బరిశీలించితిమేని పై విషయము స్పష్టమగును ఎట్లన?

రుద్రాంశగల అదిత్యుఁడు తనకిరణములతో భూమిని దపింపఁజేసి, తేమనుగొనగాదానితోఁ బర్జన్యమేర్పడుచున్నది, అదివర్షించుచున్నది. పర్జన్యుని వలననే ఓషధివనస్పతులు జన్మించుచున్నవి. వానినుండి అన్నము లభించుచున్నది.

"అన్నాద్భవన్తిభూతాని పర్జన్యాదన్నసంభవః। యజ్ఞాద్భవతిపర్జన్యః" అను గీతాసూక్తియుఁ బైవిషయమునే ప్రకటించుచున్నది. పర్జన్యుఁడు శివశక్తి సంపన్నుఁడేకాదు. విష్ణుశక్తిసంపన్నుఁడుకూడ. కాబట్టే విష్ణుసహస్రమున పర్జన్యః పావకోఽనలః" అనుసూక్తిలోఁ బర్జన్యపదము విష్ణు పరముగా బ్రయోగింపబడెను. పరికింపగా శివకేశవులు ఒక్కటియేయని తెలియుచున్నది.

రుద్రరూపపర్జన్యుఁడు జగద్యోనియగు ప్రకృతిలోఁ దనవీర్యమును వర్షించి, పురుషరూపమున గర్భములనుధరించి, పోషించి, రక్షించుచున్నాడు "గర్భఃకుక్షిస్థజంతౌచ" అను సూక్తివలన గర్భపదమునకుఁ గుక్షిస్థ జంతువని యర్థమున్నట్లు తెలియుచున్నది.

*శ్లో॥ మమయోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భందధామ్యహం।*
*సంభవస్సర్వభూతానాంతతోభవతి భారత॥*

అను గీతాసూక్తిలో, భారత! నా యోని మహద్బ్రహ్మము. అందు నేను గర్భమును ధరించితిని. దానినుండి సర్వభూతములును సంభవించుచున్నవని కృష్ణభగవానుఁడు చెప్పెను. ఇందుఁగల "అహం" శబ్దమునకు నేను అనగా శివకేశవరూపమగు పరబ్రహ్మయని యర్థము. ఆ పరబ్రహ్మయే సూర్యుఁడు; ఇంద్రుఁడు; పర్జన్యుఁడునై కానవచ్చుచున్నాడు. కార్యరూపజగత్తును నడుపుచున్నాడని తెలియుచున్నది.

"ఒక సూర్యుండు సమస్త జీవులకుఁదానొక్కొక్కడై తోచు పో
లికనే దేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జఁ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానాథానూనరూ
పకుఁడై యొప్పచునుండునట్టి హరినే ప్రార్థింతు శుద్ధుండనై"

అను పోతన్నగారి పద్యమును బరిశీలించినచో ఒకే సూర్యుఁడు తటాకాద్యుపాధుల భేదముచే అనేకవిధముల గోచరించును. అట్లే అందఱి పాపములను హరించు హరిలేక హరుండు ఆయా భక్తుల హృత్కమలములందు అనేక రూపుఁడై గోచరించునని తెలియుచున్నది. ఆ హరియే ఈహరుఁడు. ఈహరుడొక్కడేయైనను ఆయా కార్యనిర్వహణావసరముల ననుసరించి, ఉపాధిభేదము లచే సూర్యుఁడుగా, ఇంద్రుఁడుగా పర్జన్యుఁడుగా భక్తులకు గోచరించుచుండెను.

అంతేకాదు, శివుననుసరించి పెక్కుభూతగణములు కలవు. అవియే ప్రమథ గణములు. అవన్నియును శివుననుసరించియే యుండును. శివుడు సూర్యరూపుఁడైనపుడు సూర్యానుచరములైన కిరణములు, గ్రహగణములును అతని ననుసరించియుండును. అట్లే శివుడు సహస్రాక్షరూపుఁడైనపుడు, ఇంద్రానుచరులు దేవగణములుగానుండి అతని ననుసరించుచున్నారు. అట్లే శివుడు పర్జన్యరూపుఁడగునపుడు, అతని అనుచరులు మేఘగణములై అతని ననుసరించియుండును. అందుచే భక్తులు శివుని, అతని ప్రమథగణములను నమస్కరింతురు. అటులనే జీవకోటి సూర్యుని గ్రహగణములను ఆరోగ్యము గోరియు; ఇంద్రుని దేవగణములను,

ఐశ్వర్యమును, అన్నమునఁ గోరియు; పర్జన్యుని, మేఘ బృందమును జలమును గోరియు, నమస్కరింతురు. కావున మహాదేవ! నీవు ఇంద్రరూపుఁడవై ఐశ్వ ర్యమును, అన్నమును ఒసగి కాపాడుము తండ్రీ! నీవు పర్జన్యుడవై జల మొసగి రక్షింపుము ; అని భక్తులు ప్రార్థింతురు.

## ఉపాసనావిధి — ఫలము :—

ఉపాసకుఁడు పై మంత్రమును ఐదునైదుదినములు హవిష్యాశియై జపించవలెను. శివసమీపమున ఆలయముయొక్క పశ్చిమద్వారమున అరత్ని మాత్రకుండమున అగ్నిలో అర్కపుష్పములతో అమావాస్యమొదలు, పది దినములు ప్రతిదినము సహస్రహోమముచేయవలెను. అపుడు ఘృతపాయ సము సమర్పించువానికి సర్వార్థ సిద్ధిజరుగును. పుత్రకాములు 5 దినములు దీక్షబూని, పై మంత్రమును, శివాలయమునందో, నదీతీరము ననో, గోశాల యందో జపించవలెను.

దేవాలయమున దేవోపరిభాగముననో, కుంభమునందో ఆవాహన మొనర్చి, దానికిఁ బశ్చిమభాగమున అగ్నిని బ్రతిష్ఠించి, అందుజమ్మిపుల్లలనో, జమ్మియాకులనో, దధిమధుఘృతములతోఁ దడిపి, ప్రతిదినము, పదునొకండు వేలు హోమముచేయవలెను. పిమ్మట మూడుదినము లో, ఐదుదినములో దీక్షబూని, ప్రతిదినము ఎనిమిదివేలో, నాల్గువేలో, ఎనిమిదివందలో, తామర పూవులనుగాని, మారడిపత్రినిగాని, మహాదేవుని శిరస్సున సమర్పించవలెను. ఇట్లాచరించిన పిమ్మట, తుదిదినమునఁ గొన్నివందలమంది బ్రాహ్మణులకు భోజనముపెట్టవలెను. విశేషముగా ద్రవ్యత్యాగముచేయవలెను. రుద్రరూపు లైన పదునొకండుగురు విప్రులకు భోజనముపెట్టి, వారికి దక్షిణనొసంగి, దేవసన్నిధిని ఆచార్యునకు భోజనమిడి, పిత్తులునాటినభూమిని దక్షిణగా నొసంగవలెను. ఆ భూమి 72 వందల చ॥మూరలు విస్తీర్ణముగల్గియుండవలెను

ప్రతిదినము పాదనిష్కముపరిమితిగల బంగారమును సహస్రబెట్టివానితోఁ గుండలములనుజేయించి, అతనికొసఁగవలెను. ఏకాగ్నికిఁ గాంస్యపాత్రను ఇట్లే ఒసంగవలెను. ఇట్లాచరించినచో, శంభుప్రభావముచేఁ బుత్రికామి పుత్రవంతుఁడగును. ఈ ఫలము 7 జన్మలవరకును బ్రాప్తించును.

*ధ్యానము :-*

*శ్లో॥ శరచ్చంద్రప్రకాశేనవపుషాశీతలద్యుతిం।*
*ధ్యాయేత్సింహాసనాసీనం ఉమయాసహితం శివమ్॥*

***తాత్పర్యము :-***

మహాదేవుఁడు శుభప్రదుఁడు. అతఁడుఉమాసహితుడై, సింహాసనమున గూర్చుండెను. అతని శరీరము శరచ్చంద్రునివలె ప్రకాశించుచుండెను. అతని శరీరకాంతి చల్లగా నుండెను. అట్టి మహాశివునిధ్యానించవలెను.

*విశేషము :—*

శివుడు సహస్రాక్షుఁడును, పర్జన్యమూర్తియునై, లోకమునకు అన్నమును జలమును ఒసగి రక్షించుచుండెనని మూలమంత్రమున గలదు. ఆ భావమే ఈశ్లోకమందలి "శరచ్చంద్ర ప్రకాశేనవపుషాశీతలద్యుతిమ్" అను పదములచే సూచింపఁబడెను. ఎట్లన?

శివుడు చంద్రశేఖరధరుఁడు. చంద్రుఁడు ఓషధీశుఁడు. తన కిరణములందలి అమృతమును సస్యములకందించువాడు. అక్కారణమున సస్యములు సఫలములై జీవులకు అన్నమొసగుచున్నవి. కావున చంద్రుని మూలముననే, జీవులు అన్నాదులగుచున్నారు.

"ఓషధయస్సంవదన్తేసోమేన" అను మంత్రమున చంద్రుని వలననే ఓషధులు పెరుగుచున్నట్లు చెప్పఁబడెను.

*అప్సుమేసోమో అబ్రవీదన్తర్విశ్వానిభేషజా।*
*అగ్నించవిశ్వశంభువమాపశ్చవిశ్వభేషజీః॥*

అను మంత్రార్థమును బరిశీలించినచో నీటినుండి ఉదయించిన చంద్రుడు, విశ్వాన్తరమున విరాజిల్లి, విశ్వసుఖకరమగు అగ్నినిప్రసరింపజేసి, జలమొసగి భూమిని రక్షించుచున్నట్లు తెలియుచున్నది.

పై విషయమునుబట్టి మూలమంత్రార్థమిందు గోచరించుచున్నది. సహస్రాక్షుడైన ఇంద్రుడేకదా సింహాసనాసీనుడై త్రిలోకములనేలుచున్నాడు.

ఆ యింద్రుడు సదాశివస్వరూపుడనియేకదా మూలమంత్రమునగలదు. పాలకుడైన రాజువెంట నేగు అనుచరులే శివునిఅనుచరులైన ప్రమథగణములు వారంఋను బ్రకృతిజన్యులు. ప్రకృత్యాశ్రితులే. ఆప్రకృతియే ఉమ. కావున మూలమందలి రెండవపాదమునందలి విషయము "ఉమాసహితం శివమ్" అను శ్లోకము నందలి పదములవలన బ్రస్ఫుటమగుచున్నది. కావున ఈ శ్లోకము మంత్రతుల్యము; జపార్హమునైయున్నది.

## 10వ మంత్రము :

*ప్రముంచధన్వన స్త్వము భయోరార్త్ని యోర్జ్యాం।*
*యాశ్చతే హస్త ఇషవః పరాతాభగవోవప॥"*

అర్థము:—

హేభగవః = ఓభగవంతుడా! పూజావంతుడా! మహదైశ్వర్య సంపన్నుడా! త్వం = నీవు, ధన్వనః = ధనుస్సుయొక్క, ఉభయోః = రెండు, ఆర్త్నియోః = చివరలందుగల, జ్యాం = వింటిత్రాటిని, ప్రముంచ = విడువుము. తే = నీయొక్క, హస్తే = చేతియందు, యాః = ఏ, ఇషవః = బాణములు; వర్తన్తే = కలవో, తాఅపి = వానినిగూడ, పరావప = విడిచి పెట్టుము.

**తాత్పర్యము :-**

సా.భా. :— ఓ భగవంతుడా! నీవు పూజావంతుఁడవు. మహదైశ్వర్య సంపన్నుఁడవు. ఓ రుద్రా! నీవు నీ ధనస్సున రెండు చివరలకుఁగట్టిన త్రాటిని విడువుము. విప్పివేయుము. నీచేతనున్న బాణములను విడిచిపెట్టుము మాపై విడువకుము తండ్రీ! అని శివుని భక్తుడు ప్రార్థించుచున్నాడు.

భ.భా.భా. :— ఇది మొదలు మూడు మంత్రములు అనుష్టుప్పులు. నారదుడు ఋషి. రుద్రుడు దేవత.

"నమస్తే రుద్రమన్యవ" అను మంత్రము మొదలు, తొమ్మిది మంత్రములతో గుద్ధుడైన మహాదేవుని, దయావంతు నొనర్చుకొనిన పిమ్మట, ఆతని క్రోధమును ఉపసంహరించుటకుఁగల కారణములను మొదలిడెను. ఉపసంహారమంత్రములలో మొదటి రెండును ప్రత్యక్షకృతములైన మంత్రములు. మూడవది పరోక్షకృతమైన మంత్రము.

*శ్లో॥ ఉత్పత్తించ వినాశంచ భూతానామాగతిం గతిం।*
*వేత్తి విద్యామవిద్యాంచ సవాచ్యో భగవానితి॥*

అను సూక్తిననుసరించి జగదుత్పత్తిని, జగద్వినాశమును, పంచభూతముల ఆవిర్భావమును, ఉపసంహారమును, బ్రాహ్మణుల ఉత్పత్తి వినాశములను, విద్యను, అవిద్యను ఎఱిగినవాఁడే భగవంతుడని తెలియుచున్నది.

1వ మంత్రమున హూంకారమే శివుని ధనుస్సని పేర్కొంటిని. హూంకారము విష్ణుశివాత్మకము. కాన, శివుని చేతియందలి ధనుస్సుకూడ విష్ణుశివాత్మకమన్నమాట. ధనుస్సు చివరలందుఁ గట్టినత్రాడు శివకేశవులకుఁ జెందిన ప్రకృతియన్నమాట. ప్రకృతి సాయము తోడనే పురుషుఁడు బ్రహ్మాండమును, అందలి జీవులను సృష్టించుచున్నాడు.

*శ్లో॥ మమయోనిర్మహద్బ్రహ్మతస్మిన్ గర్భందధామ్యహం।*
*సంభవస్సర్వభూతానాంతతో భవతిభారత!*

అను గీతా సూక్తియే, పైవిషయమునకు ప్రమాణము అ ప్రకృతి తనయధీన మునగల జీవులకు, అగామిసంచిత ప్రారబ్ధకర్మల ననుసరించి, సుఖ దుఃఖ ములను, జననమరణములను జేర్చి, వారిచే (అ బాధల) ననుభవింపఁజేయు చున్నది. కావునఁ బ్రకృతి యనగా ఁబ్రకృతిరూపమగు శివధనుస్సు. అందలి త్రాడు జీవులకు భయంకరము , అందుచే భక్తులు - ఓ మహాశివ! నీధనుస్సు చివరలకు ఁగట్టిన త్రాటిని విప్పివేయవయ్యా! అని ప్రార్థించిరి.

*శ్లో॥ కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే।*
*పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥*

అను గీతాసూక్తిని బరిశీలించినచో సుఖదుఃఖాది కార్యములకుఁ గారణము ప్రకృతియనియు, పురుషులు సుఖదుఃఖ భోక్తలనియు, అందుచే ఁబ్రకృతి జీవ భయంకరయనియు విదితమగును.

ధనుస్సునెక్కిడినచో అది వర్తులాకారమగును. వర్తులము బ్రహ్మాండా కార సూచకము . బ్రహ్మాండము ప్రకృతి పురుషులకలయికచే నేర్పడుచున్నది. అందుఁగల జీవకోటి పురుషశక్తి సంపన్నము . ప్రకృతి వశం గతము. ధను స్సును త్రాటితో వేరుచేసినచో ఁబ్రకృతి పురుషులు వేరుగానుండిరన్నమాట. అపుడు పురుషుని యానతిలేనిదే ప్రకృతి జీవులనేమియుఁజేయలేదు. అందుచే భక్తులు ప్రకృతిని వేరుచేసి, తమను మహాదేవునిలో లీనమొనర్చుకొమ్మని ప్రార్థించుచున్నారు.

శ్లో॥ ఐశ్వర్యస్యసమగ్రస్య ధర్మస్యయశస శ్శ్రియః।
జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాంభగఇతీరణా॥

అను శ్లోకమును బరిశీలించినచో (1) సమగ్రమగునైశ్వర్యము, (2) ధర్మము (3) యశస్సు (4) శ్రీ (5) జ్ఞానము, (6) వైరాగ్యము, అనునారింటికిని "భగః" అనునామధేయముగలదు. పైయారునుగలవాడే భగవంతుడు. అని తెలియును. అతఁడే మహాదేవుఁడు. ఐశ్వర్యమనగాఁ బ్రభుత్వము. సామర్థ్య మన్నమాట. అదియేవిభుత్వము.

నతత్ర సూర్యోభాతినచంద్రతారకౌ।
నేమావిద్యుతోభాంతికుతోఽయమగ్నిః।
తమేవభాంతమను భాతిసర్వం।
తస్యభాసాసర్వమిదంవిభాతి॥

అను శ్రుతినిబరిశీలించినచో, సూర్యుఁడును, జంద్రుఁడును, విద్యుత్తు, అగ్ని యును, స్వయముగాఁ బ్రకాశింపఁజాలవు. స్వయంప్రకాశమానుఁడైన పర బ్రహ్మననుసరించి, సర్వమును బ్రకాశించుచున్నది. ఆ పరమాత్మతేజస్సు చేతనే ఈసకలమును బ్రకాశించుచున్నది. కావున భగవంతుఁడు తన తేజస్సుతో, సమస్తమును అదుపులోనుంచఁ గలసమర్థుఁడు కాన విభుఁడాయెను

శ్లో॥ "అహంసర్వస్యప్రభవః మత్తస్సర్వంప్రవర్తతే।
శ్లో "అహమాదిర్హిదేవానాం మహర్షీణాంచసర్వశః"

వైరాగ్యముకలవాఁడు భగవంతుఁడు. రాగమనగాఁగోరిక. అదిలేనివాడు విరాగి. వానిధర్మమే వైరాగ్యము. కాంతాకనకములందలి యభిలాషయేరాగము. అది లేనివాఁడు సాక్షాత్తుభర్గుఁ డొక్కడే.

శ్లో॥ "వేధాద్వేధాభ్రమం చ క్రే కాంతాసు కనకేషుచ।
తాసుతేష్వప్యనాసక్తః సాక్షాత్ భర్గః నరాకృతిః॥

అను మహాకవిసూక్తియుఁ బైవిషయమునే ప్రకటించుచున్నది. ఎట్లన?

భగవంతుఁడు జీవులకుఁ గాంతాకనకములందను రాగము కల్గియుండుట యను రెండుభ్రమలను, శుక్తియందు రజత భ్రాంతివంటివానిని సృష్టించెను. ఈ రెండుభ్రమలును లేక అనగాఁ గాంతాకనకములందు రాగములేకయుండు వాడు సాక్షాత్తుగాఁ బరమశివుఁడొక్కఁడేయని వర్ణించెను.

కావున భగవంతుఁడైన శివుడు తప్పుమార్గమునఁ బడిన జీవులకు భయము కల్గించుటకై ధనువుచేతఁ దాల్చియెక్కు పెను. సన్మార్గపరులైన భక్తులు తమనట్టి శిక్షలనుండి తప్పించవలసినదిగాఁ బ్రార్థించుచు ధనువుచివరలందలి త్రాటిని విడదీయుమని ప్రార్థించిరి.

అంతటితో ఊరుకొనక భక్తులు పరమశివా! నీచేతనున్న బాణములను విడిచిపెట్టుము. మాపైఁ బ్రయోగింపకుమని ప్రార్థించిరి. కారణమేమన?

మొదటిమంత్రార్థమున సోముఁడును విష్ణువును శివుని శరంబులని పేర్కొనఁబడెను. సోముఁడు ఓషధీశుఁడు, అన్నదాత. విష్ణువుజగద్రక్షకుఁడు. శివునకాగ్రహము కల్గినచో, శివశరంబులైనసోమునకును, విష్ణువునకును అగ్రహము కల్గును. సోముఁడాగ్రహించినచో, ఓషధులు, తద్ద్వారా అన్నమును జీవులకు లభింపవు. అందుచే జీవులన్నహీనులై బాధపడుదురు. అట్లుసోముఁడాగ్రహించినట్లు, అతఁడు స్వేచ్ఛాసంచారమొనర్చిరక్షించునట్లును జేయుటకై శరరూపసోముని విడువుమని భక్తులు పరమశివుని బ్రార్థించిరి. విష్ణువాగ్రహించి, ఉపేక్షించెనేని, దుష్టశక్తులైన రాక్షసులు, అసురసంపద యును విజృంభించి, లోకములను బీడింతురు. వారెనడంచి లోకములను రక్షించుటకై పరమశివా! నారాయణుని బ్రోత్సహించి, విడువుముతండ్రీ! యని భక్తులు శివుని బ్రార్థించిరి.

## 11వ మంత్రము :

*"అవతత్యధనుస్త్వగ్ం సహస్రాక్షశతేషుధే।*
*నిశీర్య శల్యానాంముఖా శివోనస్సుమనాభవ॥*

**అర్థము:—**

హేసహస్రాక్ష = ఇంద్రరూపుఁడవైన ఓ రుద్రుఁడా! శత+ఇషుధే = వందలకొలది అమ్ములపొదులుకలవాఁడా! ధనుః = ధనుస్సును, అవతత్య = దించి, అనగావింటిత్రాటినుండివేరుచేసి, శల్యానాం = బాణములయొక్క, ముఖా = ముఖములను, చివరలను, లోహములతోఁ జేసిన బాణముల అగ్రములను, నిశీర్య = అంపపొదులలోనుంచి, నిరుపయోగములఁ గావించి, నః = మాపట్ల, సుమనాః = అనుగ్రహయుక్తుఁడవై, శివః = శాంతుఁడవు, భవ = కమ్ము.

**తాత్పర్యము :-**

సా. భా. :— ఓరుద్రా! ఇంద్రరూపుఁడవైన నీకు వేయి కన్నులు కలవు. నీకువందలకొలదిగా అమ్ములపొదులుకలవు. నీవువింటిత్రాటినివిప్పి, బాణముల అయోముఖములను (ఇనుపచివరను) అంపపొదులలోనుంచి, మా పట్ల అనుగ్రహయుక్తుఁడవుకమ్ము. శివుఁడవు, అనగా, శాంతుఁడవు అగుము.

భ. భా. కా. :— రుద్రుఁడు ఇంద్రుఁడైనకారణమున సహస్రాక్షుఁడాయెను. కామోద్రేకుఁడైన యింద్రుఁడంతటివాఁడు గౌతమశాపగ్రస్తుఁడై, మూత్రవసువసమ్మితమైన సహస్రాక్షులు కల్గియుండెనని పురాణగాథకలదు. దానినిబట్టి భగవంతుఁడైనను దుష్కర్మఫలమనుభవింపక తప్పదని తెలియుచున్నది. కర్మఫలహరుఁడైన శివుఁడైనను గర్మఫలమనుభవించకతప్పదు.

అల్పులైనచోఁ బాపకర్మానుభవార్హములైన శిక్షలనెన్నిటినైన అనుభవించవలసి నదే; యని ఋజువుసేయుటకే, శివుఁడింద్రుఁడై తన కర్మఫలమనుభవించినట్లు తెలియఁజెప్పెను. ఇందలి విశేషమేమన?

అక్షపదమునకు ఇంద్రియమని యర్థముకలదు. సహస్రాక్షుఁ డనగా సహస్రేంద్రియుఁడునియర్థము సహస్రకోటి జీవరాసులును శివస్వరూపములే. అతని యణువులే. కాన శివుఁడు సహస్రాక్షుఁడాయెను.

"సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం।"
"సహస్ర శీర్షాపురుషః సహస్రాక్షస్సహస్రపాత్"

అను మంత్రములుపై విషయమునకుఁ బ్రమాణములు. అంతేకాదు.

శ్లో॥ "యథాకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగోమహాన్
తథాసర్వాణిభూతాని మత్స్థానీత్యుపధారయ।"

అను గీతాసూక్తిని బరిశీలించినచో ఒకేవాయువు అంతటను వ్యాపించినట్లు ఒకే బ్రహ్మవస్తువు అన్నింటియందునుగలదు. అన్నిభూతములు నాతనిలోఁ గలవు అని తెలియుచున్నది. కావున సకలభూతముల అక్షులును (కనులును) అతని యక్షులేకాన శివుఁడు సహస్రాక్షుడాయెను.

శ్లో॥ "సర్వతఃపాణిపాదంతత్సర్వతోఽక్షిశిరోముఖం।
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్యతిష్ఠతి"

అను గీతాసూక్తియును, అంతటను భగవంతుని పాణిపాదములు, అక్షులు, శిరస్సులు, ముఖములు, మున్నగునవి గలవనియును. భగవంతుఁడంతటను వ్యాపించియుండెననియును జెప్పుచున్నది. కాన శివుఁడు సహస్రాక్షుఁడని చెప్పవచ్చును.

శ్లో॥ "సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షస్సహస్రపాత్"

అను విష్ణుసహస్రసూక్తియును ఈవిషయమునే వ్యక్తముసేయుచున్నది.

ఓరుద్ర! నీవు శతేషుధులుగలవాఁడవు. అని భక్తులు ప్రశంసించిరి. ఇందలి విశేషమేమన?

పరమశివునకుఁ బెక్కు ఇషుధులుగలవు. ఇషుధులనగా అంపపొదులు పెక్కుకలవని తెలియుచున్నది. ఈ రుద్రమునందే చిట్టచివరనుగల "సహస్రాణి సహస్రధా బాహువోస్తవ హేతయః" అను మంత్రమును బరిశీలించినచో శివునకుఁగల బాహువులు రెండేఅయినను, వానియందుఁ గలయాయుధములు మాత్రము, సహస్రసంఖ్యాకములని తెలియుచున్నది. బాణములును, ఆయుధములేకాన, వానినిదాచుటకవసరమగు తూణములును శతసంఖ్యాకములై యుండును. కావున "శతేషుధే" అని సంబోధించుటయుక్తముగా నున్నది.

"క్షోణీరథోహరిశరో మేరుధన్వాంబుధీషుధిః" అను అమరసూక్తినిబట్టి, మహాశివునకుఁ ద్రిపురాసురసంహారసందర్భమున, సముద్రము అంపపొదిగా నున్నట్లు తెలియుచున్నది. అసాధారణ శూరులును, బహువరసంపన్నులునగు, ముప్పురరక్కసులను, మూఁడుపట్టణములను ఏకకాలమున ధ్వంసమొనర్చుటకు, జగదేకవీరుఁడైన శివునకు, సకలదేవతలును, సహాయులుగానుండిరి. అట్టిరక్కసులను, సంహరింప, అసంఖ్యాకాయుధములును, నిష్ఫలములుకాగా నారాయణుఁడు, శరముకావలసివచ్చెను. నారమునకు జీవకోటికి, అయనుఁడు నారాయణుఁడు. అట్టినారాయణరూప శరధారణమునకు సముద్రుఁడుతప్ప, మరొకడు, బాణకోశముగానుండఁ జాలఁడు. నారాయణునిలో, ముక్కోటి జీవరాసులుగలవు. అవన్నియును త్రిపురాసురసంహారసమయమున, నారాయణాంశసంపన్నములైన శరములగుటచే, అవిదాచుటకువలయు ఇషుధులును, శతసంఖ్యాకములాయెను. అంతేకాదు. ఇంకొకవిశేషమేమన?

పరబ్రహ్మయొక్క ప్రథమసృష్టిపంచభూతాత్మకమైన జలము. అదియే ప్రకృతి. ఆ ప్రకృతి మధ్యమున, ఇద్దఱుదేవులుగలరు. వారేజీవాత్మ పరమాత్మలు. వారు హృదయాకాశముననుండిరి. వారిలోఁ బరమాత్మచే ఈ సృష్టిగావింపఁబడినది. అను నీ విషయము.

*శ్లో॥ "అపోఽథఅద్భ్యః సలిలస్యమధ్యేఉభౌదేవౌ*

అను సనత్సుజాతీయ సూక్తివలనఁ దెలియుచున్నది. పై విషయము "ద్వాసుపర్ణా, సయుజాసఖాయా, సమానం వృక్షం పరిషస్వజాథే" అను శ్రుతి వలన సైతము తెలియుచున్నది. పైశ్రుతిలో రెండు పక్షులు, ఒక వృక్షమును ఆశ్రయించియున్నవని చెప్పఁబడెను. ఆ పక్షులే జీవాత్మ పరమాత్మలు. ఆవృక్షమే సలిలరూపమైన ప్రకృతి. వీనినిబట్టి తెలియునదేమనగా!

"శతేషుధే" అను పదములోఁ బేర్కొనిన శివుని ఇషుధి (అంపపొది) సముద్రము. అదియే జలభూతము. అదియే ప్రకృతి. అందున్న జీవులే శతసంఖ్యాకములైన ఇషువులు. పంచ భూతములే ఇషుధులును. అట్టి ఇషువులతో నిండిన ఇషుధులను జేతఁదాల్చిన మహాశివుఁడే పరబ్రహ్మ అను విషయము పైసంబోధనచేఁ దెలియుచున్నది. ఇంతేకాదు

*శతంచైకాచహృదయస్యనాడ్యః।*
*తాసాంమూర్ధానమభినిస్సృతైకా।*
*తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి*
*విష్వఙ్ఙన్యాఉత్క్రమణేభవన్తి॥*

అను శ్రుతిలోఁ జెప్పఁబడిన విషయమే, "శతేషుధే" అను పదముచే స్ఫురించు చున్నది, ఎట్లన? "ఇళా, పింగళా, సుషుమ్నా" యున్నగునామములతోనున్న నూటయొక్కనాడులు హృదయమునుజేరుచున్నవి. వానిలో సుషుమ్నానాడి. పరమాత్మకునిలయమైన మూర్ధమును జేరుచున్నది. దానిని యోగమార్గమున, ధ్యానమార్గమున, దపోమార్గమునఁ జూచినవారు మోక్షమును బొందుదురు. చూడనివారుపునర్జన్మపతితులగుదురు. అని పై శ్రుతియొక్కభావము.

ఇందలిహృదయము దహరాకాశము. దానికాధారముప్రకృతి అదియే జలము అ జలమే ఇందలి "ఇషుధి" పదముచేసూచింపఁబడినది. హృదయమును జేరు ఇళాపింగళానాడులే సూర్యచంద్రులు. వానినుండి యేర్పడిన జీవులే మిగిలిననాడులు చంద్రుఁడే. శివుని శరము; అని మొదటిమంత్రమునఁ జెప్పియుంటిని. అజీవులే మంత్రమున "నాడీ"పదముచేతను, "శతేషువులు" అను పదముచేతను సూచింపఁబడుచున్నారు. అట్టి జీవరూపశరములకు నిల యమే ఇషుధి. అదియే సముద్రము. ప్రకృతియును అదియే శివుని అంపపొది. ఆ విషయమెఱిగినవాఁడే అమృతత్వమును బొందును.

"అవతత్యధనుః" అను పదమునకు ధనస్సును వింటిత్రాటితో వేరు చేసియనియర్థము. ఇటవింటిచే బురుషుఁడు, వింటిత్రాటిచేఁ బ్రకృతి సూచింపఁ బడుచున్నారు. ప్రకృతిపురుషులకలయికచేతనే సృష్టియేర్పడును. వారువేర్వే రుగానున్నచోఁ బురుషుఁడు యోగనిద్రలోనుండును. జీవులన్నియుఁ బరమాణువులై వానిలో నిమిడియుండును. జీవులు పురుషునిలోనిమిడి యుండుటమే తాదాత్మ్యముక్తి. అదియేసాయుజ్యముక్తి. అట్టిముక్తిని, దమకు, ఒసఁగవలసినదిగా భక్తులు మహాదేవుని బ్రార్థించుచున్నారన్నమాట. పరమ శివ! నీ శరములముఖములను గుంఠితములు (వాడిలేనివిగా) గావింపుము. నీ శరములను అంపపొదిలోనుంచుము. అని భక్తులు ప్రార్థించిరి. ఇందలి విశేషమేమన?

శివునిశరము సోమాత్మకమని చెప్పియుంటినిగదా! సోముఁడు సముద్రోద్భవుఁడు. ఓషధీశుఁడు. అతఁడు శరముగానున్నచో దానిని శివుఁడు సంహారసమయమున నుపయోగించును సోమాత్మకశరము జీవులనుగడ్డ కట్టించి, హతమార్చును. దానినుపసంహరించి, అంపపొదిలోఁజేర్చి, భక్తుల మగుమమ్ములను గాపాడుమని ప్రార్థించిరి.

అంతేకాదు. శివునిశరము నారాయణాత్మకముకూడ. నారాయణుఁడు జీవకోటికి, నిలయము. అతఁడు శరము గానుండి, సంహారకర్మకుపయోగింపఁ బడినచో, జీవకోటియంతయు నశించునన్నమాట. నారాయణుడు అనగా జల రాశినిలయముగాఁ గలవాడనియు నర్థముగలదు. జలరాశిప్రకృతి. ప్రకృతి నిలయముగాఁ గలవాడు, జగన్నాటక సూత్రధారియైన పురుషుఁడన్నమాట. నారమునకు, జలరాశికి అయనుఁడు అనగా నిలయము అనునర్థముచెప్పినచోఁ బ్రకృతికి ఆధారుఁడైన పురుషుడనియుఁ దెలియును అట్టినారాయణుని సంహార కర్మలో శరము గా నుపయోగించినచో, జలప్రళయమేర్పడి, ప్రకృతియే ధ్వంసమైనచో బ్రహ్మాండమేలేదన్నమాట. అట్టిప్రమాదమేర్పడనీయక, పరమ శివా! నారాయణాస్త్రాది నీ శరములను అంపపొదిలోనుంచి, కాపాడుము తండ్రీ! అని భక్తులు ప్రార్థించిరన్నమాట.

మహాదేవా! నీవుశివుఁడవు. అనగా శాంతుఁడవు. "నతితీక్షాసమమస్తి సాధనమ్" అనునార్యోక్తినిబట్టి శాంతముతో సరియగుసాధనము ఇంకొకటి లేదు. సద్గుణములలో, శాంతమేప్రధానము. కావుననే విప్రలక్షణములను గూర్చిచెప్పునపుడు.

శ్లో॥ "శమోదమస్తపశ్శౌచం క్షాంతిరార్జవమేవచ।
జ్ఞానంవిజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మస్వభావజమ్"

అను గీతాసూక్తిలో శమమునే తొల్త మహావిష్ణువు పేర్కొనెను. శమమే లేకున్నచో మిగిలిన దమాదులు విప్రునకుఁ జేకూరవు. విప్రులకేకాదు, బ్రహ్మర్షులకైనను శమమే ముఖ్యము. శమమనగా "మనో బుద్ధి చిత్తాహంకారములనెడి అంతఃకరణ చతుష్టయ విజయము. అట్టి శమసంపన్నులలో నీవగ్రేసరుడవు. కావుననే దుష్ట సంహారమొనర్చి, శాంతము స్థాపించగలవాఁడవైతివి. శమదమాదిషట్కసంపత్తికి మూలమైన శమమునకు, నీవు నిలయమన్నమాట అందుచేతనే శివుడన్నమాట నీకు సార్థకమైనది. కావుననే కాంతా కనకములను జయించిన వాఁడవు, నీవొక్కడవే; అను ఘనతనార్జించితివి.

*శ్లో॥ వేధాద్వేధా భ్రమంచక్రే కాంతాసుకనకేషుచ।*
*తాసుతేష్వప్యనాసక్తః సాక్షాద్భర్గః॥*

అని ఒక మహాకవి, నిన్నుగొనియాడెను. దీనిననుసరించియే

తనకోపము తన శత్రువు
తన శాంతము తనకు రక్ష. దయచుట్టంబౌ।
తన సంతోషము స్వర్గము।
తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ.

అని సుమతీ శతకకర్తయు పేర్కొనెను.

"శమప్రధానేషు తపోవనేషు" అను సూక్తిలో తపోవనములు, శమప్రధానములని, శ్రీ కాళిదాస మహాకవి పేర్కొనెను.

శ్లో॥ "ప్రశమాభరణం పరాక్రమస్సనయాపాదితసిద్ధిభూషణః"

అను సూక్తిలో భారవికవి. పరాక్రమమునకు శమము ఆభరణమగుటయేకాక, ఘనతనుగూడ చేకూర్చునని చెప్పెను. "శమస్తపో, దమస్తపః శాంతంతపః" అను శ్రుతిలో శమమును, దమమును, శాంతమును దపస్సులుగాఁ పేర్కొనెను. శమములేనిదే, శాంతము ప్రాప్తించదుకదా! అట్టి శమగుణసంపన్నులకు, నీవు మార్గదర్శివి.

అంతేకాదు. "శామ్యతివరమానంద రూపత్వాన్నిర్వికారో భవతీతిశివః" అను వ్యుత్పత్తి ననుసరించి, చూచినచో (బరమానంద రూపుఁడగుటచే, నిర్వికారు డైనవాఁడే శివుఁడని తెలియుచున్నది.

"సత్ + చిత్ + ఆనందము" అనువానిలో ఆనందము బ్రహ్మ స్వరూపము అనుటకు "ఆనందో బ్రహ్మేతివిజానాత్" అను శ్రుతియే ప్రమాణము పరమానందుఁడగుటచేతనే, శివుఁడు నిర్వికారుఁడై, ధీరుఁడై, శాంతినిజేకూర్చుచు శాంతుడాయెను.

"వికారహేతౌసతివిక్రియంతే।
యేషానంచేతాంసి। తఏవధీరాః॥"

అను సూక్తిలోఁజెప్పినట్లు, నిర్వికారుదే ధీరుడన్నమాట. అట్టి నిర్వికారాగ్ర గణ్యుఁడగుటచేతనే మహాదేవుడు శివుడాయెను. గంగయను భార్య శిరముపై నుండుట, త్రిపురసుందరి పార్వతి అర్ధదేహమందుండుటయును వికార హేతువులే. అయినను శివునిచిత్తము చలింపలేదు. అదియే అతనిలోని ఘనత. అందుచేతనే శివుడు నిర్వికారుఁడును, శాంతుఁడు నాయెను. శివుని శాంత గుణమే "శమ్" అను పదమునమాత్రలలో నిరూపింపబడెను. శివుని రూపాంతరులైనందుననే, మిత్రుడు, వరుణుడు, ఇంద్రుడు, అర్యమ్నుడు, బృహస్పతియును శాంతులైరనియును, వారు జీవులకు, శాంతిదాతలు, సుఖ కరులు కావలెననియును, "శంనోమిత్రః శంవరుణః, శంనోభవత్వర్యమా, శన్నఇంద్రో బృహస్పతిః" అను శాంతి శ్రుతిలో (జేర్కొనబడెను.

"శారతే సజ్జనమనాంస్యస్మిన్నితివా శివః" అను వ్యుత్పత్తిననుసరించి చూచినచో, సజ్జనమనస్సులు, ఈ మహాదేవునియందు, శయనించును; అనగా లగ్నమై యుండును. అందుచే శివుడాయెనని దెలియుచున్నది.

"సత్ + జనులు = సజ్జనులు" సద్భావమును, సాధుభావమును, ప్రశస్త కర్మలను, యజ్ఞదాన తపస్సులను "సత్" అందురు.

శ్లో॥ సద్భావేసాధుభావేచసదిత్యేతత్ ప్రయుజ్యతే।
ప్రశస్తేకర్మణితథాసచ్ఛబ్దః పార్థయుచ్యతే।
యజ్ఞేతపసిదానేచస్థితిస్సదితిచోచ్యతే॥

అను గీతాసూక్తులే అందులకు ప్రమాణము.

"సత్" అనగాఁ బరబ్రహ్మ; సద్భావమనగా బ్రహ్మత్వము అనియర్థము సద్భావమును బొందిన జ్ఞానులు సజ్జనులన్నమాట. బ్రహ్మజ్ఞానుల మనస్సులు సత్పదార్థమైన శివునియందు లగ్నమైయుండుట సహజమేకదా!

సాధుభావము కలవాడు, ప్రశస్తకర్మలాచరించువాడు యజ్ఞదానతపస్సు లాచరించువాఁడును, సజ్జనుడే యగును. ప్రశస్తకర్మలు, యజ్ఞదాన తపస్సు లును, బ్రహ్మత్వ ప్రాప్తికి సాధనములు. నిష్కామముగా వానినాచరించు వాడు, బ్రహ్మజ్ఞాని, సజ్జనుడన్నమాట అట్టివారి మనస్సులు, సత్పదార్థమైన శివునియందుండుట సహజమేకదా! కావున పరమశివా! నీవు శాంతుడవై మాకు శాంతిని జేకూర్పుము మమ్మ సజ్జనులుగామార్చి, మామనస్సులను నీయందు లగ్నమొనర్చుకొని "శివ" యను నీనామమును సార్థకము కానిమ్మ తండ్రీ! యని భక్తులు ప్రార్థింపఁదొడగిరి.

అంతేకాదు, సాధుభావముగలవారే సాధువులు, సజ్జనులు సజ్జనుల సాధుభావము, ప్రియప్రాయమైన ప్రవృత్తిచేతను,వినయమధురవాక్కులచేతను సహజముగాఁగల్యాణకరమైన మతిచేతను, నిందావిరహితమైన పరిచయము చేతను, ప్రత్యక్ష పరోక్షములందుమార్పులేని నిర్వ్యాజప్రేమచేతను వ్యక్తమగు నని

శ్లో॥ ప్రియప్రాయావృత్తిర్వినయమధురోవాచినియమః।
ప్రకృత్యాకల్యాణీమతిరనవగీతః పరిచయః॥
పురోవాపశ్చాద్వాతదిదమవిపర్యాసితరసం।
రహస్యం సాధూనామనుపధి, విశుద్ధం విజయతే॥

అను భవభూతి మహాకవి సూక్తివలన దెలియుచున్నది కావున మహాశివా! మామనస్సెల్లపుడును నీయందే లగ్నమగునట్లు గావింపుము తండ్రీ! యని భక్తులు ప్రార్థింపదొడగిరి.

"శేతేసజ్జనమనసీతివాశివః" అను వ్యుత్పత్తిననుసరించి, చూచినచో, సజ్జనులైన మార్కండేయాదుల మనస్సులలో నీవెల్లప్పుడు నుందువు; అని తెలియుచున్నది కావున మా మనస్సులలో నుండుము తండ్రీ! అని ప్రార్థించిరి.

"శివం = కల్యాణం, తద్యోగాద్వాశివః" శివమనగా గల్యాణము. కల్యాణ యోగమువలన, శివుడాయెనని పై వ్యుత్పత్తివలన దెలియుచున్నది.

"కారణగుణాః కార్యేసంక్రామన్తి" అను న్యాయముననుసరించి, సృష్టి కారణమైన నీయొక్క కల్యాణగుణము నీచే సృష్టింపబడి, నీకార్యములైన జీవులకు సంక్రమించునుగాక. నీ ప్రసాదముచే, నీ భక్తులమగు మాకుఁ గల్యాణము కల్గుగాకయని, భక్తులు శివుని బ్రార్థించిరి. సజ్జనులైన నీ భక్తులు కావించు ఆచారములను, లోపములున్నను, క్షమించి, శాంతుడవై, నాభక్తులే యీ జీవులని తలంచి, జీవులమగు మావట్ల, అనుగ్రహయుక్తుడవుకమ్ము. ఇట్లు మాచే బ్రార్థింపబడిన నీవు, శివా! సుమనస్కుడవై భయహేతువులైన, ధనురాదుల నుపసంహరించి, మమ్ములను నిర్భయులఁగావించి, కాపాడుము తండ్రీ!

"భయకృద్భయనాశనః"అను విష్ణుసహస్రసూక్తిననుసరించి, మహాశివా! నీవే భయము కల్గించువాఁడవు. నీవే భయనాశనుఁడవునుగదా! కావున భక్తులమైన మమ్ము, నిర్భయులగావించుటకై నీధనురాదుల నుపసంహరింపుము తండ్రీ! యని భక్తులు శివుని బ్రార్థించిరి.

"సుష్ఠుమన్వత ఇతిసుమనాః" అను వ్యుత్పత్తిననుసరించి, మహాదేవా! నీ భక్తులు ఆయురారోగ్య సంపన్నులై, సుష్ఠుగానున్నట్లు తలంచుము.

"శోభనంమనో యస్యసః సుమనాః" అను వ్యుత్పత్తినననుసరించి, శంభో! నీభక్తులమగు మావట్ల, శోభనమైన మనస్సు కలవాడవు అగుము; అని భక్తులు శివుని ప్రార్థించిరి.

## 12వ మంత్రము :

*విజ్యంధనుఃకపర్దినో విశల్యోబాణవాగ్ంఉత।*
*అనేశన్నస్యేషవఆభురస్యనిషంగధిః॥*

*అర్థము :—*

కపర్దినః = జటాజూటముగల శివునియొక్క, ధనుః = ధనుస్సు, విజ్యం = విగతమైన వింటిత్రాటుకలది; అస్తు = అగుగాక; ఉత = అంతేకాదు తే = నీయొక్క; బాణవాన్ = బాణములుగల అంపపొది; విశల్యః = బాణములులేనిది; అస్తు = అగుగాక; అస్య = ఈ రుద్రునియొక్క; ఇషవః = బాణములు, అంపపొదిలోనుంచుటచే; అనేశన్ = సంపుటకసమర్థములు, అగుగాక; అస్య = ఈరుద్రునియొక్క; నిషంగధిః = అంపపొది, అభురస్తు = బాణవహనమనెడి చిన్నపనిచేయుటకుమాత్రమే సమర్థము అగుగాక నిషంగధిః = కత్తులుదాచు ఒర; అభురస్తు = కత్తులు మోయుటకుమాత్రమే సమర్థమగుగాక.

*తాత్పర్యము :-*

సా.భావ్యము :— ఓ రుద్రా! నీవు జటాజూటధారివి. నీవు నీధనుస్సును వింటిత్రాడు లేనిదిగాఁజేయుము. అంతేకాదు, బాణములను అంపపొదిలో దాచి, ఆయంపపొదిని బైటికిఁగానరానిదిగాఁజేయుము. రుద్రా! నీ బాణములు అంపపొదిలో దాచుటచే, సంహారక్రియకు అసమర్థములు అగుగాక నీయమ్ములపొది, బాణములు మోయుటకేతప్ప, బాణాకర్షణయోగ్యము

కాకుండుగాక. నీ ఖడ్గకోశము (కత్తుఒయొర) ఖడ్గమును మోయుటకేతప్ప, ఖడ్గాకర్షణమునకు మాత్రము అసమర్థము అగుగాక.

భ.భా.భా. :— పరమాత్మ శివస్వరూపుఁడు. పరమాత్మ నివాసము సహస్రారము. ఆ సహస్రారమునకుఁగల ఆచ్ఛాదనమే జటాజూటరూపమున, బాహ్య ప్రపంచమునకుఁగానవచ్చుచున్నది. ఆయాచ్ఛాదనమే మాయ. అది శివుని చెంతనున్నను అతని ఆకళించుకొనలేదు. మాయ శివునేకాదు; విష్ణువును సైతము అంటలేదు. ఈవిషయమునే పోతనామాత్యుడు—

"పుట్టువులేనినీకభవ! పుట్టుట క్రీడయకారవుట్టుచే।
యెట్టనుడున్భవాదిదశలెల్లను జీవునియందవిద్యదా॥
జుట్టుచునుండుఁగాని, నిను జుట్టునదింబలెఁజెంతనుండియున్।
జుట్టగలేమి, తత్క్రియలఁజొక్కనియొక్కటిఁగంటిమీశ్వరా॥"

అను శ్రీకృష్ణ జననఘట్టమందలి పద్యమున వివరించెను కాన ఇట "కపర్ది" పదముచే, మాయను జటాజూటరూపమున, బాహ్యముగా నుంచినవాఁడని తెలిసికొనవలసియున్నది.

ఓ పరమశివా! నీ ధనుస్సు "వి+జ్య" అనగా వింటి త్రాడులేనిది అగుగాక; అని భక్తులు ప్రార్థించిరి. అట్లనుటకు గారణమేమో పరిశీలించ వలసియున్నది. పరికింపగా శివవిష్ణువు లిరువురును ఒక్కటేకాని, వేరుకాదు. త్రిమూర్తులలో శివుడు సంహారకర్తకాగా, విష్ణువు స్థితికారుఁడాయెను. వీరు ఇరువురును మాయారహితులే కావలెను గాని, మాయాసహితులుకారాదు. శివుని మాయయే శివధనుస్సునందలి త్రాడు. అది శివుని చేతనున్నచో అతని దృష్టిపథమునున్నవారిపై దాని ప్రభావము ప్రసరించును. అందుచే జీవులట్లు ప్రార్థించిరి. మాయ, జటాజూటము, వింటిత్రాడు, మున్నగు రూపములతో నున్నది. అది సృష్ట్యారంభమున జలరూపముననున్నది. ఇచ్ఛా, క్రియాజ్ఞాన శక్తులు, లక్ష్మి సరస్వతీ పార్వతులును మాయారూపాంతరమే. శివకేశములు

మాయా సహితులైరేని సృష్టికంతటికిని ప్రమాదము వాటిల్లును సృష్టికి ప్రమాదమేర్పడినచో, సృష్టిలోనేకల భక్తులకును ప్రమాదము వాటిల్లును. మాయవలన వచ్చిన ప్రమాదములే, జీవులకుఁగల జనన మరణములు. అవే కాదు, ఆధ్యాత్మికాది భౌతికాది దైవిక దుఃఖములుకూడ మాయాకల్పితములే. వాటినుండి తప్పించుకొనుటకే భక్తులిట్లు ప్రార్థించిరి.

అంతేకాదు, మహాదేవా! నీ బాణవంతమును అనగా అమ్ములపొదిని, శత్రుసంహారమునకై, బాణములతో నింపియుంచితివి. ఇపుడు నీయెదుటనున్నవారము భక్తులము. భక్తరక్షణమేకదా నీ పరమ కర్తవ్యము. అందుచే భక్తులమగు మమ్ములను గాపాడు సమయమున మాత్రము నీ బాణాల సంచిలో శల్యములు (బాణములు) లేకుండఁజేయుము ఇట్లు ప్రార్థించుటచే, భక్తుల స్వార్థపరత్వముగోచరించునేమో? భక్తులందఱును జ్ఞానులుకాన నిష్కాములును, నిర్భీకులునైయుండురేకదా! సమంజసము. భక్తులెంత జ్ఞానులైనను రుద్రుని యిషుధిలో బాణములుండుట భయహేతువేకదా! అందువలన ఆ భక్తులు, ఆత్మరక్షణతోఁ బాటు, సృష్టిరక్షణము సైతము ముఖ్యమని తలంచి, ఇషుధులను, శల్యహీనములుగానుంచుమని, శివునిఁబ్రార్థించిరి. శివధనుస్సే మేరువు శివుని యిషుధి అంబుధి (సముద్రము) మేరువు ధననిలయము. దానిని మాయారూపమగు త్రాటితోఁ గట్టినచో అది జీవులకు హానికరమేయగునుగాని, ధనదముకానేరదు. అందుచే ధనుస్సును జ్యాహీనము గావింపుమని, భక్తులు ప్రార్థించిరి అట్లే శివుని యిషుధియగు సముద్రమును విశల్యముగా (బాణహీనముగా) నుంచుమనిరేమో. అట్లుకోరుటలో అంతరార్థమేమో పరికింతుముగాక.

సముద్రము జలనిధికదా! అది జలభూతము. "ఆపఏవససర్జాదౌ" అను సూక్తిచే, అదియే పరమాత్మయొక్క తొలిసృష్టియని తెలియుచున్నది. దాని నుండి పంచభూతములేర్పడినవి. అందుసంధింపఁబడినశరము నారాయణాత్మకము. నారాయణావతారమేకదా శ్రీరాముఁడు. అతను సముద్రముపై శరము

సంధింప, సముద్రుడు భీతుఁడై, రక్షింపుమనివేడగా, ఆ సముద్రుని సలహా ననుసరించియే, శ్రీరాముఁడు అమోఘమైన తన బాణమును రాక్షసావాసమైన తావున విడిచెను. దీనిచే గ్రహింపవలసినదేమనగా, నారాయణ రూపశరము అమోఘము. అది సముద్రునేకాదు. సృష్టినేతారుమారు సేయును. సముద్రము ప్రకృతిస్వరూపము. అది శివాత్మికయైన లక్ష్మీదేవికి జన్మభూమి. అదియే మేఘములద్వారా జగములకు జీవనాధారమైన జీవనమును (నీటిని) ఒసంగజేయునది. కావున దానికిఁ బ్రమాదమేర్పడినచో, అది జీవనహీనమైనచో, జగములన్నియును జీవనహీనములు (నీరులేనివి) అగును. అందుచే భక్తులు, శివుని యిషుధిని శల్యహీనముగావింపుమని శివునిఁ బ్రార్థించిరి.

పరికింపగా "అపోఽఖ అద్భ్యః" అను సూక్తిచే జలమే ప్రకృతియని తెలియుచున్నది. ఆ జలమునకునిధియైన సముద్రము "యదాగమాస్తద్గుణీభూతాః తద్గ్రహణేనగృహ్యన్తే" అనున్యాయముచే జలభూతమేమాయెను. అంతేకాదు. "అపోవాఇదగ్ం సర్వం, విశ్వాభూతాన్యాపః ప్రాణావా అపః, పశవఆపోఽన్నమాపోఽమృతమాపస్సమ్రాడాపో, విరాడాపస్స్వరాడాపశ్ఛందాగ్‌ష్యాపో, జ్యోతీగ్‌ష్యాపో, యజూగ్‌ష్యాపస్సత్యమాప, స్సర్వాదేవతాఆపో భూర్భువస్సువరాపఓమ్ "అను మంత్రమును బరిశీలించినచో జలమే సకల విశ్వస్వరూపము; జలమే జీవులు; జలమే ప్రాణములు; జలమే వేదములుమన్నగునవి. అట్టి జలమునకు నిధియైనసముద్రము, లక్ష్మీనారాయణులనివాసము. అదినారాయణాస్త్రాది శల్యములకు ఆలవాలమైనచో అవి సంహారకములగును. కాన వానిమూలమున శివుని యిషుధియైన సముద్రమునకును వినాశమేర్పడినచో, జలభూతవినిర్గతమగు సృష్టికే వినాశమేర్పడును. అట్టిప్రమాదమువాటిల్లకుండుటకై, భక్తులు, మహాదేవుని, అతనియంపపొదిని, విశల్యముగావింపుమనికోరిరి.

మహాదేవుని స్వభూతములైన ఇషువులు శాంతించుఁగాక! మహేశుని ఇషుధిలోఁగల బాణములు, అంపపొదికంటె విభిన్నమైన స్థలముననెచటనైన

అదృశ్యములైయుండుఁగాక. అట్లైననేకాని ఇషుధికి విశల్యత్వము ప్రాప్తింపదు కదా! ఇందలియంతరార్థమేమన!

"అణోరణీయాన్ మహతోమహీయాన్" అను శ్రుతిలోఁ జెప్పినట్లు పరమేశ్వరుఁడును, నారాయణుఁడును అణువుకంటె అణుస్వరూపులు. మహత్తుకంటె మహీయాంసులు. అణువులు లోకకల్యాణమునకువలె, లోక వినాశమునకును హేతువులే. వానిలోఁ బరమేశ్వరశక్తి యిమిడియున్నది. అందుచే అవినశించుటయో, కానరాకుండుటయో మంచిది. అట్లైన లోకకల్యాణముజరుగును గాన భక్తులు అట్లు ప్రార్థించిరి.

నిషంగధిపదమునకు అంపపొదియనియేకాదు ఖడ్గకోశమనియు నర్థము కలదు. ఎట్లన?

"నితరాం, నియమేనవా, కోశేసజ్జత ఇతి నిషంగః = ఖడ్గః; సనిధీయతే యత్రనిషంగధిః" అనువ్యుత్పత్తిననుసరించి, మిక్కిలినియమపూర్వకముగాఁ గోశమునందుండు కారణమున, ఖడ్గమునకు నిషంగము అను నామమువాట్లి ల్లెను అదియుండుకోశమునకు నిషంగధియనిపేరు. ఖడ్గకోశమందలి ఖడ్గము కూడ కానరాకుండయుండవలసినదిగా భక్తులుకోరిరి. కారణమేమన?

మహాశివుని యాయుధములలోఁ బినాకము త్రిశూలమును బ్రసిద్ధములు ఈ మంత్రమున ధనుర్బాణములు, అమ్ములపొది, అనుమూఁడును మూఁడు పాదములలోఁ బేర్కొనఁబడినవి. నాల్గవపాదమున నిషంగధిపదముచే, ఖడ్గమును, ఖడ్గకోశమును బేర్కొనఁబడినవి. పైవ్యుత్పత్తిచే ఖడ్గకోశమును నర్థముచేకూరినది.

"నిషఙ్గతేకోశే" అనువ్యుత్పత్తిననుసరించి "నిష" పదమునకు "గధిన్" ప్రత్యయముచేరగా నేర్పడిన, నిషంగధిపదమునకు, ఒకకోశమందు ఖడ్గము అను నామము వాటిల్లినది. ఖడ్గకోశము "అథః = ఖడ్గహీనమైయుండుఁగాక యనియు; ఖడ్గము "అథః = స్వ్యానశక్తిరలది అగుగాక" యనియుఁ, బైపాదమునకు అర్థములు లభించినవి.

"అ + ఈషత్, భవతీతి, అభుః = అభవనమ్" అనివ్యుత్పత్తి. ఖడ్గధార
ణమే నిషంగధికి అనగా ఖడ్గకోశమునకు స్వభావము. ఖడ్గమున్నచో ఖడ్గ
కోశము పుష్కలమేయగును. ఖడ్గములేకున్నచో ఖడ్గకోశము అభువు అనగా
నిష్ఫలమేఅగును. అట్టేనిషంగధి అనగా ఖడ్గము, అభువు అనగాఁ గుంఠిత
ప్రభావము (మహిమలేనిది అగుగాకయని యర్థము.)

ఇపుడు ఇందలి యంతరార్థమును గమనింపవలసియున్నది. శివా
యుధములలో ఖండపరశువు ఒకటికలదు. కాని ఖడ్గమున్నట్లుకానరాదు.
శివాయుధప్రశంసాఘట్టమున ఖడ్గకోశమునకు, ఖడ్గమునకును, ప్రశస్తియేలేదు
విష్ణు ఖడ్గమునకుఁ బ్రశస్తికలదు. కాన ఇట ఖడ్గప్రసంగముచే శివకేశవాభేద
నిరూపణమే ముఖ్యమన్నమాట. అందుచేతనే శివాయుధములతోఁబాటు, విష్ణ్వా
యుధములును, భక్తులపట్ల ప్రకృతి స్థాపనపట్ల అనుకూలములుగా నుండవలెనే
కాని, సంహారకరములు కారాదు; అన్నదే భక్తుల కోరిక. ఇట్లు ఖడ్గముచే
విష్ణ్వాయుధములన్నియును సూచింపఁబడును.

విష్ణువు ఖడ్గమునకు నందకమని పేరు. "కౌమోదకీగదా, ఖడ్గోనందకః"
అను అమరసూక్తిచేఁబై విషయము తెలియుచున్నది. విష్ణుఖడ్గము శత్రుసంహా
రకమైనను, భక్తులను మాత్రము ఆనందపఱచును. కావుననే దానికి
"నందకము" అను నామము సార్థకమైనది. దేవతల యాయుధములలో,
గధ, ఖడ్గము, అనునవి క్రోధగుణ సూచకములు. అవి శూన్యములు కావలె
ననుటచే, భగవంతుడు భక్తులపట్ల, క్రోధశూన్యుఁడగుటతోఁబాటు, భక్తులను
భగవన్మహిమచే క్రోధశూన్యులుగా నుండువలెనన్నదే యిందలి యంతరా
ర్థము. కారణమేమన? "క్రోధ ఏకో మహాన్ శత్రుః" అను సూక్తిచే, అరిషడ్వ
ర్గములో క్రోధము మహాప్రమాదకరమని దెలియుచున్నది. అట్టి ప్రమాదము
తమకు లేకుండుటకే భక్తులు పై విధమున బ్రార్థించిరి.

**ఉపాసనావిధి — తత్ఫలము :—**

్యంధనః" అను పై మంత్రము మహాశివుని క్రోధోపసంహారక మంత్రములలో మూఁడవది. ఇది పరోక్షకృతము. జపిత ఆత్మసంశోధన మొనర్చుకొని కృచ్ఛ్రవ్రతమాచరించి, నవదినములు జపించినచో సిద్ధుఁడగును. యుద్ధకాలములో భూపతి యాయుధములను పై మంత్రములతో అభిమంత్రించి, కుశకంటకములను వేయిసార్లు హోమముచేయవలెను. దానివలన యుద్ధోపనీతులైన శత్రువులు క్షీణింతురు.

*(1) ధ్యానము :-*

*శ్లో॥ ఉద్యద్భాస్కరకోటి ప్రకాశమాదీప్త దహన మూర్ధానం।*
*భీషణభుజంగభూషం ధ్యాయేద్వివిధాయుధం రుద్రమ్॥*

**తాత్పర్యము :—**

మహారుద్రుఁడు ఉదయకాలకోటి సూర్యసమానతేజస్కుఁడు. ప్రజ్వలత్పాలాగ్ని శిరస్కుఁడు. భయంకరనాగభూషణుఁడు. వివిధాయుధశాలి. అట్టి మహాశివుని ధ్యానించవలెను.

*(2) ధ్యానము :-*

*శ్లో॥ రుద్రంసురనియన్తారం శూలఖట్వాంగధారిణం।*
*జ్వాలామాలావృతంధ్యాయేత్ భక్తానామభయప్రదమ్॥*

**తాత్పర్యము :—**

మహారుద్రుఁడు దేవతలకునియన్త. ఆఁతడు త్రిశూలమును, ఖట్వాంగమును చేతఁదాల్చెను. ఆతడు జ్వాలామాలావృత దేహుఁడై యుండెను. ఆతడు భక్తులకు అభయప్రదుఁడు, అట్టి మహాశివుని ధ్యానించవలెను.

1 వ శ్లో॥ విశేషము

11 వ మంత్రమునందలి "భగవః" అను పదమందలి యంతరార్థము పై ప్రథమాధ్యాయశ్లోకమునందలి "ఆదీప్తదహనమూర్ధానమ్" అనుపదముచే సూచింపఁబడినది. ఎట్లన?

"ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత"

అను శ్రుతినిబరిశీలించినచో విరాట్స్వరూపుని ముఖమునుండి ఇంద్రాగ్నులు జన్మించినట్లు తెలియుచున్నది.

"అగ్నిర్మూర్ధా, చివఃకకుత్పతిః" అను శ్రుతివలన విరాట్స్వరూపుని మూర్ధయే అగ్నియైనట్లుతెలియుచున్నది. ఇంద్రాగ్నులజన్మకారణుఁడును, అగ్ని మూర్ధముగా (శిరస్సుగా) గల పరబ్రహ్మయే విరాట్స్వరూపుడు. అయా దివిరాట్టే, భగవంతుఁడు. పై మూఁడుశ్రుతులందలి ముఖ్యవిషయము ననుసరించియే రుద్రుఁడు" ఆదీప్తదహనమూర్ధానుఁడుగా వర్ణింపఁబడెను.

11 వ మంత్రమునందలి "సహస్రాక్ష" పదమునకు సహస్రసంఖ్యాకమైన కిరణములు ప్రసారముగల సూర్యుఁడనియు నర్థముకలదు. ఆ సహస్రాక్ష పదమందలి యంతరార్థమే, "ఉద్యద్భాస్కరకోటిప్రకాశ" పదముచే అభివ్యక్తమగుచున్నది.

"ఉభయోరార్త్న్యోర్జ్యామ్" విజ్యంధనుఃకపర్దినః

అను పదములందలి యంతరార్థమే "భీషణభుజంగభూషమ్ వివిధాయుధం" అను విశేషణములచే సూచింపఁబడుచున్నది. ఎట్లన?

త్రిపురాసురసంహారసమయమున, శివునిశరముగా హరియును, ధనువుగా మేరువును, ధనుఃకోటినిబద్ధమైన త్రాడుగా, ఆదిశేషుఁడును, సమకూర్పఁబడి, శివునిసంగ్రామమునకు, సాయపడిరి. ఆ శివునివింటిత్రాడే ఆదిశేషుఁడను సర్పరాజు. భుజగము (సర్పము) శివునిమేని భూషణము. అన్నాగము కడు భీషణము. అట్టి భీషణభుజంగములెన్నియో, శివునకు భూషణములుగాఁగలవు. వానివలన జీవులకు అపమృత్యువుకలుగఁ గూడదనియే భక్తుల ప్రార్థనము.

2వ శ్లో॥ విశేషము :—

"సహస్రాక్ష", "శతేషుధే" అను సంబుద్ధ పదములలో సహస్రాక్ష పదము గలదు. సహస్రాక్షుడనగా = తేజఃపుంజమైన సూర్యుఁడనియర్థము. రుద్రుఁడు అనగా = తేజఃపుంజమనియే అర్థము. కాన మంత్రమందలి సహస్రాక్ష పదమునకుమారుగా "రుద్ర" అను పదము శ్లోకమునఁగూర్పబడెను. రుద్రుడు సురనియన్త. ఇంద్రాదులైన సురులను, జగద్రక్షణాదికార్యములు ఆచరింప నియమించువాఁడు నాతఁడే. తనయనుచరులును, స్వనియోజితులునగు సురులను, బీడించునసురులను సంహరించుటకే, మహాదేవుడు, తనచేత ధనుర్బాణాదులనుదాల్చెను. మూలమంత్రములలోఁ బేర్కొనఁబడిన ధనుర్బాణాదులకోవకుఁ జెందినవే శూలఖట్వాంగాదులు. రుద్రుఁడే సహస్రాక్షుఁడు; అనగా సూర్యుఁడు. ఆ సూర్యుఁడు జ్వాలామాలావృతుఁడు. ఆ పదమే శ్లోకమున, శివునకు విశేషణముగాఁ బేర్కొనఁబడెను. భక్తులు తమకు అభయ ప్రదానము సేయుమనియు, అందులకై ధనుర్బాణాదులను ఉపసంహరింపుమనియు, పై మూఁడుమంత్రములలో శివుని బ్రార్థించిరి. ఆప్రార్థనమే ధ్యానశ్లోకమునందలి "భక్తానామభయప్రదమ్" అనుపదముచే సూచింపఁ బడినది. అందుచేపైమూఁడు మంత్రములకుమారుగా, ఈరెండు ధ్యానశ్లోకములును, జపార్థములైయున్నవి.

# 13వ మంత్రము :

*"యాతే హేతిర్మీఢుష్టమ హస్తేబభూవతే ధనుః।*
*తయాస్మాన్ విశ్వతస్త్వమ యక్ష్మయాపరిభుజ॥"*

అర్థము :—

హేమీఢుష్టమ! = అందఱికోరికలను అధికముగాఁ దీర్చు శివుఁడా! యా, తే, హేతిః = ఏ నీయాయుధము ఖడ్గాదిరూపమునఁగలదో; తే = నీ యొక్క, హస్తే = చేతియందు, యద్ధనుః = ఏధనస్సు, బభూవ = కలదో;

త్వమ్ = నీవు, అయుక్ష్మయా = ఉపద్రవములుకావింపని, తయా = ఆయా యుధయుచే, ఆ దనుస్సుచే, అస్మాన్ = మమ్ములను, విశ్వతః = అంతటను, అన్నివిధముల, పరిభ్భుజ = పరిపాలించుము.

**తాత్పర్యము :-**

సా. భాష్యము:- ఓ రుద్రా! నీవుమీఢుష్టముడవు, అనగా అతిశయ ముగా అందఱికోర్కెలను దీర్చువాఁడ వన్నమాట. అయ్యా! నీవు సూర్యేంద్ర పర్జన్యుల రూపముననున్నవాఁడవుకదా! కావున సకలకామములను, అభి వర్షించువాఁడవనుటలో సందియమేమున్నది. నీ చేతులలో ఖడ్గాదిరూపము లైన యాయుధములును, ధనుస్సునుగలవుకదా! అవి మాపట్ల, అయుక్ష్మలు. అనుపద్రవకారులు అవుగాత. వానిసాయమున, నీవు మమ్ములను, అన్ని విధములఁ బరిపాలించుము.

భ. భా. భాష్యము:- ఇదిమొదలు మూఁడు మంత్రములును అనుష్టు ప్పులు. ఋషియును, దేవతయును భగవంతుఁడగు శివుడే.

పరమశివా! మాకెన్నియోకామములుగలవు. వానిలో ముఖ్యమైనవి (1) ఆరోగ్యము, (2) ఆహారము, (3) జలము, (4) బలము, (5) ఐశ్వ ర్యము, విద్య, ఇట్లెన్నియో కావలెనని కోరికలు, మాకు గలవు. వానిలో ఆరోగ్యమును సూర్యరూపుడవై యొసగుచున్నావు. తద్వారాబలముచేకూరును. ఆహారమును, ఇంద్రరూపు డవైయొసగుచున్నావు. అదియును బలవర్ధకమే కదా! జలమును బర్జన్యరూపుడవై యొసగుచున్నావు. నీవేయీశ్వరు డవు; కాన ఐశ్వర్యమును, దక్షిణామూర్తివై విద్యలను ఒసగుచున్నావు.

"మమయోనిర్మహద్బ్రహ్మ, తస్మిన్ గర్భందధామ్యహమ్"

అను గీతాసూక్తిననుసరించి, నీయోనియేమహద్బ్రహ్మయని అందుగర్భమ్మును అనగా గుక్షిస్థజంతుకోటిని ధరించి దానికి జీవమొసగుచున్నావు. మహానుభావుఁ డవునీవేయని తెలియుచున్నది.

ఈయనువాకమందలి, 6, 7, 8, 9, మంత్రములనుబట్టి, సకల (మూల) దేవతాస్వరూపుడవై, సర్వులకు, సకలకామ్యములను, అభివర్షించు చున్నావని తెలియుచున్నది.

పరమేశ్వరా! నీచేతిలో ఖడ్గాద్యాయుధములు కలవు. అవన్నియును దేవతాస్వరూపములే నీచేతనున్న ధనుస్సు ఒకప్పుడు సోమాత్మకము. ఒకప్పుడు విష్ణ్వాత్మకము నీయాయుధములెల్ల దేవతాత్మకములే. అన్న విషయము క్రిందటి మంత్రములలో నిరూపింపఁబడియేయున్నది. అవన్నియును భక్తులనుగూర్చి అరోగహేతువులే యగుగాక. ఏమన?

నీయాయుధములన్నియును దేవతాత్మకములని చెప్పఁబడెనుగదా! ఆ దేవతలెల్లరును నీయంశలేకదా! కాన సకల దేవతాస్వరూపుఁడవైన నీవు, నీ భక్తులకు ఏరోగములును వాటిల్లనీయక కాపాడుము. రోగములకు ఆయుధాఘాతములవలె జీవుల దురితములును హేతువులే కావున మా దురితములను దొలగించియు, మాలోఁ బాపపుఁదలంపులు కలుగనీయకయును, మమ్ములను గాపాడుము.

"భయకృద్భయనాశనః" అను విష్ణుసహస్రసూక్తిచే, నీవే భయంకరుఁడవు; భయనాశనుఁడవనియును తెలియుచున్నది.

శ్లో॥ కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే।
పురుషస్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥

అను గీతాసూక్తిని పరిశీలించినచో, నీనుండి వెలువడిన ప్రకృతియే, కార్యకారణకర్తృత్వము విషయమై హేతువనియు, జీవుడు సుఖదుఃఖభోక్తృత్వమునకు, (సుఖదుఃఖానుభవమునకు) హేతువనియును దెలియుచున్నది జీవులమగు మేమెల్లరము, నీ ప్రకృతిమూలమున సృష్టింపఁబడినవారమే. ప్రకృతి నీనుండి వెలసినదే. కావున నీవు సర్వప్రకారముల, నీప్రకృతివిలసితములైన పంచభూతములనుండి, మాకు రోగములుకాని, ప్రమాదములుకాని, వాటిల్లకుండఁ జేసి, కాపాడుము తండ్రీ! అంతేకాదు. కేవలము, మమ్ములనేకాదు. మా ప్రార్థనచే, మాపుత్రులను పౌత్రులను సైతము కాపాడుము.

"హేతి" పదమునకు, ఆయుధము, హింస, అను రెండు అర్థములు కలవు. నీ ధనుస్సు, హింసార్థసాధనము, అందుచే నీవలనఁగాని, నీధనుస్సు వలనఁగాని మాకు హింసజరుగనీయక, రక్షింపుము; అని భక్తులు పరమేశ్వరుని ప్రార్థించిరి.

## 14 వ మంత్రము

*నమస్తేఅస్త్వాయుధాయాఽనాతతాయధృష్ణవే।*
*ఉభాభ్యాముతతే నమో బాహుభ్యాంతవధన్వనే"*

***అర్థము:—***

హేరుద్ర! = ఓ రుద్రుఁడా!, అనాతతాయ = ధనుస్సునబంధింపబడని కారణమున ప్రసరింపఁజేయఁబడినట్టియు, ధృష్ణవే = స్వరూపముచేతనే చంప సమర్థమైనట్టి, తే = నీయొక్క, ఆయుధాయ = ఆయుధమునకు, నమోఽస్తు = నమస్కారమగు గాక, ఉత = అంతేకాదు. తే = నీయొక్క, ఉభాభ్యాం = రెండు, బాహుభ్యాం = భుజములకు, నమః = నమస్కారము, అస్తు = అగు గాక. తవ = నీయొక్క, ధన్వనే = ధనుస్సునకు, నమోఽస్తు = నమస్కారమగు గాక.

***తాత్పర్యము :-***

సా. భాష్యము: ఓరుద్రా! బాణరూపమగు నీయాయుధమునకు, నమస్కారము. ధనుస్సంధానము లేనికారణమున, నీబాణము ప్రసారితముఃకాలేదు అయ్యా! నీబాణస్వరూపము గాంచినచో, అది శత్రుసంహారమునకు, మిక్కిలి సమర్థవంతమై, కానవచ్చుచున్నది. మమ్ములను బాధింపకుండుటకై, తొల్త దానికి నమస్కరించితిమి. మహాదేవా! నీయుభయబాహువులకును, నమస్కరించుచున్నాను. అంతేకాదు. నీధనుస్సునకు సైతము, ఇదిగో నానమస్కారము అని భక్తులు ప్రార్థించిరి

భ. భా. భా:- ప్రథమానువాకమందలి పదునైదు మంత్రములలో, మొదటిమంత్రమున శివుని ధనుర్బాణములకు బాహువులకును, నమస్కారములు సమర్పించఁబడెను పిమ్మట ధనుఃప్రభావము, శివశరీరప్రభావమును 2, 3, మంత్రములలో వర్ణింపఁబడెను. 4 వ మంత్రమున, శివధనుస్సు శాంతింపఁబడెను 5 వ మంత్రమున శివప్రార్ధన. 6 వ మంత్రమున శివుడు వైద్యుడుగానుండి, చేయవలసినపని వివరింప బడెను 7, 8, మంత్రములందు శివుడే సూర్యుడనియు, సూర్యకిరణములనియు, నిరూపింప బడెను. పిమ్మట వానిని గోవులు ప్రార్ధించుట, నిరూపింప బడెను. 9 వ మంత్రమున, శివుడు సహస్రాక్షుడుగాఁ బర్జన్యుడుగా బేర్కొన బడెను. 10 వ మంత్రమున ధనుర్బాణములను, వీడవలసినదిగా బేర్కొనెను. 11 వ మంత్రమున, శివుఁడు సుమనస్కుఁడుగా నుండవలెనని ప్రార్ధింపఁబడెను. 12, 13. మంత్రములందు ధనుర్బాణములను అంపపొదిని, శాంతముగానుంచి, కాపాడవలసినదిగా, భక్తులు ప్రార్ధించిరి ‹10 వ మంత్రముమొదలు, తుదిమంత్రమువరకు, ఉపసంహారమంత్రములు 14, 15 మంత్రములందు, ధనుర్బాణములను, పసుపట్ల ఉపసంహరింపవలసినదిగా భక్తులు శివుని ప్రార్ధింపఁదొడగిరి.

మహాదేవా! నీవువేరు. నీయాయుధములువేరు; అనునట్లుకనఁబడుచున్నారు. కాని, "ఆశ్రయాశ్రయిణోరభేదః" అనున్యాయమునననుసరించి, చూచినచో, నీవు ఆయుధములకు, ఆశ్రయముగానున్నావు. ఆయుధములు ఆశ్రయులుగానున్నవి. నీవింటియందలి బాణము, శ్రీహరియేకదా! పరికింపఁగా మీ యిరువురికిని భేదమేలేదు.

శ్లో॥ "శివాయవిష్ణురూపాయ శివరూపాయవిష్ణవే।
శివస్యహృదయంవిష్ణుః విష్ణోశ్చహృదయగ్ంశివః॥
యథాశివమయోవిష్ణురేవం విష్ణుమయశ్శివః।
యథాన్తరం నపశ్యామి తథామేస్వస్తిరాయుషి॥

అను సూక్తియుఁ బైవిషయమునే, స్పష్టపఱచుచున్నది. ఎట్లనఁ? శివుఁడును సర్వవ్యాపకుఁడేకాన విష్ణురూపుఁడే విష్ణువును, శివంకరుఁడే కానశివరూపుఁడే ఇద్దఱిహృదయములునొక్కటే. కావుననే శివకేశవులకు అన్తరము (భేదము) లేదు. ఆ విషయమెఱిగియే పరమశివా! నీతోఁబాటు నీయాయుధమైన బాణమును, విష్ణుస్వరూపమగుటచే, దానికిని నమస్కారము సమర్పింపఁబడెను. భక్తులనుగుమాపట్ల కృపాళుఁడవై, బాణమును ధనుస్సున సంధింపవైతివి. అందుచే నీ బాణము, అనాతతము అనగా అప్రసారితము అయెను. శివకేశవుల సంహారశక్తి భక్తులపట్ల ప్రసారితముకావని దీనివలనఁ దెలియుచున్నది.

కాని శివునివలె శివుని బాణమును (విష్ణురూపము) కాస, ఆసురసంపద నడంచుటకుఁ బ్రగల్భమే. అదియే "ధృష్ణవే" అను పదముచే, సూచింపఁ బడినది ఇందలి వింతయేమన?

దైవీసంపద, అసురసంపదయైన "దంభము, దర్పము, అభిమానము, క్రోధము" మున్నగునవి, సర్వులందును సమానముగనేయుండును. ఈ యాసురసంపద మిక్కుటమైనచో, సాత్త్వికులైన భక్తులుకూడ చెడిపోవుదురు అందుచేతనే భక్తులు, తమలోదాగియున్న అసురసంపదను శివబాణమైన శ్రీహరిద్వారా సంహరింపఁ జేయుమని, అనగాఁదొలగించుమని, శివునిఁ బ్రార్థించిరి. ఓశివా! గదాదులైన నీయాయుధములన్నియును, గోడపైవ్రాసిన సర్పాదులవలె నుండవలెనని అర్థించిరి.

పిమ్మట శివుని బాహుద్వయమును నమస్కరించిరి కారణమేమన?

శివుఁడు విరాట్స్వరూపుఁడు. అతని బాహువులనుండే పరిపాలనా సమర్థులైనరాజులు ప్రభవించిరి. అని"బాహూరాజన్యఃకృతః"అనుపురుషసూక్త మంత్రముచేఁ దెలియుచున్నది. అనగా శివుని బాహువులకుఁ బరిపాలనా సామర్థ్యము కలదన్నమాట అట్టి బాహుబలమును భక్తులనుగాపాడుటలో, వినియోగించవలసినదిగాఁ బ్రార్థించుచు, భక్తులు శివుని బాహువులకును నమస్సులు

సమర్పించిరి. అందుచే శివుని దక్షిణబాహువు, భక్తరక్షణసమర్థమై, ఉత్తర బాహువు, మార్కండేయాదులను భక్తులను ఉత్తమలోకములకుఁజేర్చి, (ఉత్ +తరము = ఉత్తరము) అనగాఁ దరింపజేసినదాయెను.

పిమ్మట భక్తులు ప్రధానమైన శివధనుస్సును నమస్కరించిరి. కేవల ధనుస్సునకు నమస్కారమేల? అందేమైన గొప్పతనముండవలెనుగదా! అదేమోపరిశీలింతము.

శివుని ధనుస్సునకు అజగవమని పేరు. "అ+జ+గవము "అ" అనగా బ్రహ్మ. "జ" అనగా బుట్టినది. "గవము" అనగా ఆధారమైనభూమి, అనగాఁ బరబ్రహ్మనుండి, ఏర్పడిన శక్తిరూపమైనప్రకృతికి ఆధారమైనవాఁడు పురుషుడు. అతఁడే శివుఁడు అతనివికారమే ధనుస్సు. అనగాఁ బురుషుఁడైన పరబ్రహ్మస్వరూపమే శివునివిల్లు అన్నమాట. (లేదా) "అజామేకాం లోహిత శుక్లకృష్ణాం" అను శ్రుతిలోఁ జెప్పినట్లు "అజకు" అనగాశక్తికి అధారమైన పురుషుఁడన్నమాట. ఇంక విశేషమేమన?

శివునివింటిబద్ధ, శివశక్తికలది. దానిత్రాడు సర్పరూపమైన ప్రకృతి. అట్టి శివశక్తులకలయిక, కలది కావుననే దానియందు విష్ణువు బాణరూపమున నుండుటచేతనే, దాని యాఘాతమునకుఁ దాళఁజాలక త్రిపురాసురుఁడు నశించెను. లేకున్నవాఁడునశింపడు. శివధనుస్సులో అంతటి ప్రభావముకలదు కావుననే శాంతిస్థాపనకై దానికి భక్తులు నమస్కారములు సమర్పించిరి. అని తెలిసికొనవలసియున్నది.

## 15 వ మంత్రము

*"పరితే ధన్వనో హేతిరస్మాన్ వృణక్తువిశ్వతః*

*అథో య ఇషుధిస్తవారే అస్మన్నిధేహితమ్॥*

అర్థము:.

హేరుద్ర = ఓశివుఁడా! తే = నీయొక్క, ధన్వనః = ధనుస్సునకుఁ జెందిన, హేతిః = బాణాదిరూపమైన ఆయుధము, అస్మాన్ = మమ్ములను, విశ్వతః = అన్నివిధములు, పరివృణక్తు = విడుచునుగాక. అథః = అంతేకాదు, తవ = నీయొక్క, యః = ఏ, ఇషుధిః = అంపపొదికలదో, తం = దానిని. అస్మదారే = మాకంటెదూరముగా, నిధేహి = ఉంచుము.

తాత్పర్యము :-

సా. భాష్యము: ఓరుద్రా! నీ ధనుస్సునకుఁ జెందినబాణములు శల్యరూపాయుధములు, మాపట్ల వినియోగింపక, దూరముగా, విడనాడుదువుగాక మమ్ములను బాధింపకుముతండ్రీ! ఇంతేకాదు. నీయంపపొదిని మాకంటె దూరముగానుంచుము.

భ. భా. భా. :- హేతియనగాహననసాధనము.ఒక్కొక్కదేవతహనన సాధనము ఒక్కొక్కవిధముగానుండును. ఇందుఁ బేర్కొనఁబడిన, శివుని హననసాధనము ధనుస్సు. దానికిఁ బినాకమను నామముకలదు. పినాకము స్వర్గమునుగానరానీయక, కప్పియుంచి, ఇంద్రాదులను, శత్రువులబారినుండి రక్షించును ఇంద్రుఁడు ముజ్జగములకును ప్రభువు. అతనియనుచరులైన దేవతలగణములే, దయా, హింసా, సహితాదులు. దేవదేవాధిపతుల దయా ప్రభావమువలననే, సకలలోకజీవులకును దైవీసంపద చేకూరును. త్రిలోకాధిపతియైన ఇంద్రునకు, రాక్షసప్రమాదమువాటిల్లినచో, భూలోకవాసులకు అతఁడు, సకాలవర్షణాదులనొసగి, రక్షింపఁజాలఁడు. అందుచే శివుఁడు, తన పినాకముతో దుష్టశక్తులను సంహరించి, స్వర్గమును, స్వర్లోకవాసులను, వారియండను నివసించు భూలోకవాసులనుగాపాడును. అట్టి దుష్టసంహారకమగు పినాకమును, భక్తులపట్లఁ, ప్రవర్తింపనీయక, దూరముగా నుంచవలసినదిగా, భక్తులు, పరమశివుని ప్రార్థించిరి.

భక్తులమగుమమ్మేకాదు. మా పుత్రపౌత్రాదులను సైతము నీయా యుధములు దూరముగానుండి, రక్షించునుగాక. మహాదేవా! నీయాయుధము లలో, ధనుస్సు, బాణము త్రిశూలము, ముఖ్యములు నీధనస్సుమేరువు. అది ధననిలయము. అది భక్తులకవసరమగు ధనమునొసగునుగాక. నీ బాణములలో నొకటి సోమరూపము. వేరొకటి విఘ్నరూపము. అవి ఓషధులను, తద్వారా అన్నమును ఒసగియును, మఱొకటి శత్రుసంహారముగావించియును, భక్తులను రక్షించుగాత. మహాశివా! నీయిషుధి (అంపపొది) సముద్రము. అదిసత్ప్ర కరము. భయంకరబాణములకు నిలయము. అది శత్రుసమూహముపై, బాణ ములను జిమ్ముచు, భక్తుల, బాహ్యాంతరశత్రువులను సంహరింపజేసి, భక్తు లనుగాపాడునుగాక అని భక్తులు పరమశివుని, ఆతని ఆయుధములను, స్తుతించి వానినుండి రక్షణనుబడయగోరిరి.

**ఉపాసనావిధి —**

10, 11, 12 మంత్రములకువలె ఈమూడు మంత్రములకును, ఉపా సనావిధి నిర్ణయింపబడెను.

వేయేసివత్తులను ఒకకట్టగాఁగట్టి, దానినొకదీపముగను, అట్టిదీపములను ఐదునొకండింటిని, తైలముతోసహా, ఒక కుండములోనుంచవలెను. వాని కగ్నిసంధానమొనర్చి, అందు రుద్రుని యావాహనమొనర్చి, పూజించవలెను. రుద్రునితోఁ బాటులోకపాలురను సైతము, ఆరాధించవలెను. ఇట్లు ఏడు దిన ములు, దీపారాధనమొనర్చి, ప్రతిదినము వేలకొలదిగా జపముగావించవలెను. దీపములందు దైవమునారోపించి, సేనానాయకుడు సైన్యములను నడిపించ వలెను. ఆ దీపములనుగాంచిన శత్రువులునశింతురు. శత్రురాజులు ఓడి పోవుదురు. ఈ ప్రక్రియనుగావించిన విప్రులను బక్కగా సత్కరించవలెను.

రాజకార్యసిద్ధికి నగరమునందును, దేవాలయములందును జప హోమాదులను జేయించి, పిమ్మటను శివునిధ్యానించవలెను.

ధ్యానము :-

శ్లో॥ ప్రణమదమర లోకమౌళిమాలాకుసుమ
రజోరుణపాదపద్మయుగ్మం।
అనవరతమనుస్మరేద్భవాన్యాసహజగతాం।
పితరం పినాకపాణిమ్॥

తాత్పర్యము :-

ప్రతిదినము భక్తుఁడు భవానీసహితుఁడును, జగత్తులకుఁ బితయునగు పినాకపాణిని స్మరించవలెను. పినాకపాణియైన పరమేశ్వరుని పాదపద్మములకు, అమరలోకము నిరంతరము ప్రణమిల్లుచుండును. అపుడు వారిమౌళులందలి పూలమాలలోఁగల కుసుమములందలి రజస్సు పరమేశ్వరుని పాదపద్మములపైఁ బడును. అందుచే అవి అరుణవర్ణమువైయుండును అట్టివరము శివుని నిరతము ధ్యానించవలెను.

విశేషము :—

పై శ్లోకమందలి "పినాకపాణి" పదము మహాదేవుని హస్తంగతములైన, ధనుర్బాణబాణాసనాదులను స్ఫురింపఁజేయును. పైమూఁడు మంత్రములందలి హేతిః, ఆయుధాయ, ధన్వనే, ఇషుధిః "అనుపదములచే వ్యక్తమగు విషయమునే వ్యక్తము చేయుచున్నవి.

13 వ. మంత్రమందలి, మీఢుష్టమ "పదముచే మహాదేవుఁడు, సకల లోకకామాభివర్షకుఁడనియు, "అయక్ష్మయా, పరిభ్బుజ" అను పదములచే, మహాశివుడు సకలప్రాణులను నీరోగులఁగావించి, రక్షించువాఁడనియుఁ దెలియు చున్నది.

14 వ మంత్రమందలి "ధృష్ణవే" అను పదముచే, మహాశంకరుఁడు శత్రుభయంకరుఁడై ప్రజారక్షకుఁడగు చున్నాడని తెలియుచున్నది.

15 వ మంత్రమందలి "అరేఅస్మన్నిధేహితమ్" అనుపదములచే, మహాదేవుడు, తనయాయుధములను, భక్తులకు, దూరముగానుంచి, రక్షించువాఁడని తెలియుచున్నది.

పై మూఁడు మంత్రములందలి ప్రధానవిషయములు, ఈశ్లోకమందలి "జగతాంపితరమ్" అను పదములచే, సువ్యక్తములగుచున్నవి, ఎట్లన?

లోకమున ఁబితయేకదా తన పిల్లలను నిరోగులఁగాఁజేసి, శత్రువుల వారినుండికాపాడును. అట్టి తండ్రిలోకములకు మహాదేవుఁడేకదా! కావునఁ బై మూఁడు మంత్రములను చూడఁగా, మంత్రార్థగుంఫితమైన యీ శ్లోకము యథార్థమని తెలియుచున్నది.

ఇట్లు శ్రీ విద్యారణ్యులవారిచేతను, శ్రీ భట్ట భాస్కరా
చార్యులవారిచేతను, వ్రాయఁబడిన భాష్యముల
ననుసరించి, తెలికిచెర్ల రాజేశ్వరశర్మచే,
విశేషవిషయసహితముగా వ్రాయఁ
బడిన రుద్రప్రశ్నప్రథమాను
వాకాంధ్ర వివరణ
సంపూర్ణము.



# శ్రీ రుద్రాభిషేకమాహాత్మ్యమున ప్రథమానువాక నామవివరణము

((1))

(1) కర్మపరము గ(2) శివపరముగ (3) విష్ణుపరముగ (4) శాక్తాద్వైతములకనుగుణముగ (5) బీజాక్షరసంపుటిపరముగ ఐదు అర్థములతో వ్రాయఁబడిన నామసంపుటిగల గ్రంథభాగము. 5 వ అర్థమున విజ్ఞానశాస్త్ర విషయములు సూచింపఁబడును.

పైన వ్రాయబడిన ప్రథమానువాకమందలి పదునైదు మంత్రము లందుసు (1) రుద్రః (2) మృడః (3) గిరిశన్తః (4) గిరిత్రః (5) గిరిశః (6) అధివక్తా (7) ప్రథమః (8) దైవ్యః (9) భిషక్ (10) తామ్రః (11) అరుణః(12) బభ్రుః (13) సుమంగళః (14) నీలగ్రీవః (15) సహస్రాక్షః (16)శివః (17) కపర్దీ అను నామములుకలవు వీనికి శివపరముగా, విష్ణుపరముగా శాక్తాద్వైతపరముగా, బీజాక్షర సంపుటిపరముగాఁ బ్రతినామమునకును నాల్గు అర్థములుకలవు. యజ్ఞపరమగునర్థము తొల్త వ్రాయఁబడెను. వీనిలో బీజాక్షరముల కలయికచే లభించు విశేషశక్తులను గమనించవలసియున్నది.

శివ + విష్ణుః— *(1) రుద్రః* = "రుద్రో బహుశిరా బభ్రుః" విష్ణుసహస్రసూక్తిలోగల పై నూఱు నామములును విష్ణుపరములే.

(1) రోదయతీతిరుద్రః

(2) రుదం రాతి = దదాతీతిరుద్రః

(3) రుత్ = దుఃఖం, దుఃఖకారణంవా ద్రావయతీతి రుద్రః, "తస్మాచ్ఛివః పరమకారణ "మితిలింగపురాణవచనాత్.

(4) రుతౌ = నాదాంతేద్రవతీ తిరుద్రః.

(5) రుత్యా = వేదరూపయా ద్రావయతీతి రుద్రః.

(6) రుత్యా = ప్రణవరూపయా స్వాత్మానం ప్రాపయతీతి రుద్రః.
అని అనేకవిధములుగా రుద్రపదమునకు వ్యుత్పత్త్యర్థములు కలవు. పై అర్థము లను బరిశీలించినచో రుద్రనామము శివకేశవుల కిరువురకిని జెల్లునని తెలియుచున్నది. ఎట్లన?

(1) శివుఁడు:- లయకారుఁడు; దుష్టరాక్షససంహర్త కావున అందఱిని రోదయతి = ఏడిపించుచుండును. అందుచే శివుఁడు రుద్రుఁడాయెను.

విష్ణువు:- స్థితికారుఁడు; దశావతారములందేకాక అనేకావతారములలో మధుకైటభాదులను, రావణాదులను, దుష్టశక్తులను సంహరించి, వారిని, వారివారిని ఏడిపించి, శిష్టులను రక్షించెను. కావున విష్ణువును రుద్రుఁడాయెను.

(2) "రుదం = సంసారదుఃఖం, రాతి = దదాతీతిరుద్రః
అను వ్యుత్పత్తినిగమనించినచో, జీవులకు సంసారదుఃఖమునొసఁగుటలోఁ గర్తృత్వము శివకేశవుల కిరువురకును సమానమే ఇరువురును విరాట్ స్వరూపులే. కాన శివకేశవులకిరువురకును "రుద్ర" అను నామము వర్తించునని తెలియుచున్నది.

(3) "రుదం = సంసారదుఃఖంద్రావయతీతిరుద్రః
అను వ్యుత్పత్త్యర్థమును బరిశీలించినచో, గజేంద్రుఁడుకుచేలుఁడు, అంబరీషుఁడు మున్నగువారి సంసారకష్టములను బాపిన విష్ణువునకును; కాంచీపురవాసియగు శివబ్రాహ్మణుఁడు, ద్రవిడరాజాస్థానకవియగు నక్కీరుఁడు, చిరుతొండనంబి, అర్జునుఁడు, మున్నగువారి సంసారకష్టములను బాపిన శివునకును "రుద్ర" అను నామముసమముగనే వర్తించుననుట నిర్వివాదాంశము

(4) "రుతా = నాదాంతే, ద్రవతీతిరుద్రః"
అను వ్యుత్పత్తినిఁ బరిశీలించినచో శివకేశవులిరువురును భక్తుల ప్రణవనాదాంతమున ఆనందసాగరమగ్నులై ద్రవింతురు. అంతేకాదు. సంగీతనాదాంతమున ద్రవించుటయును ఇరువురకుసమానమే. విష్ణువు, తుంబురుని, సంగీతమున

అధిగమింపయత్నించిన నారదునియొక్క సంగీతనాదముచే దర్శించియలరెను. సంగీతయుక్తతాండవమున, ఢక్కానాదమున శివుఁడు దర్శించెనన్న సంగతి చదువరులకెల్ల సువిదితమేకదా!

(5) "రుత్యా = వేదరూపయాద్రావయతీతిరుద్రః"
వేదమనగఁ బరమాత్మ శివకేశవులిరువురును బరమాత్మస్వరూపులే పరమాత్మచే బ్రహ్మాండమున నియోజితులైనవారే. వారిరువురును వేదరూపరుతిచే బ్రహ్మాండమును ద్రవింపఁజేయువారే, కాన రుద్రపదముచే శివకేశవులిరువురును బోధింపఁబడుచున్నారన్న మాట.

(6) "రుత్యా = ప్రణవరూపయాస్వాత్మానంప్రాపయతీతి రుద్రః"
రుతియనగా ప్రణవము. ఓంకారము (అ+ఉ+మ్) పరబ్రహ్మస్వరూపము. త్రిమూర్త్యాత్మకము. అదిపరమాత్మనే జీవరూపమునఁ బదునాల్గు భువనంబుల వెలయింపఁజేయుచున్నది. అదియే సకలచేతనాచేతనములకును ధృతినొసఁగుచున్నది. అదియే సకలవస్తువులశరీరము.దానిరూపాన్తరమేప్రకృతి."స్వభావస్తు ప్రవర్తతే" అను గీతాసూక్తిలో అదియే స్వభావపదముచేఁ బేర్కొనఁబడినది. ప్రకృత్యావృతమే, సకలబ్రహ్మాండము. త్రిమూర్తులలో శివకేశవులిరువురును గలరు. వారిరువురును ప్రణవరూపరుతిచే, స్వాత్మను అంతటను జేర్చువారే. కాన రుద్రనామము శివకేశవులకిరువురకును జెల్లును.

*విష్ణుసూరి భాష్యము:—*

శివుఁడు రుజను, సంసారమును దొలగించును సంసారక్లేశములు కల్గించి, జీవులను ఏడిపించును. అందుచే శివునకు రుద్రనామమువాటిల్లెను.

*బీజాక్షరసంపుటి:—*

"రుద్ర" అనునామమున "ర్+ఉ+ద్+ర్+అ" అను ఐదక్షరములు కలవు. ఇవి పంచ భూతములకును బంచ [illegible] అక్ష



(6) రుత్యా = ప్రణవరూపయా స్వాత్మానం ప్రాపయతీతి రుద్రః.
అని అనేకవిధములుగా రుద్రపదమునకు వ్యుత్పత్త్యర్థములుకలవు. పై ఆర ర్థములను బరిశీలించినచో రుద్రనామము శివకేశవుల కిరువురకిని జెల్లునని తెలియుచున్నది. ఎట్లన?

(1) శివుఁడు:- లయకారుఁడు; దుష్టరాక్షససంహర్త కావున అందఱిని రోదయతి = ఏడిపించుచుండును. అందుచే శివుఁడు రుద్రుఁడాయెను.

విష్ణువు:- స్థితికారుఁడు; దశావతారములందేకాక అనేకావతారములలో మధుకైటభాదులను, రావణాదులను, దుష్టశక్తులను సంహరించి, వారిని, వారివారిని ఏడిపించి, శిష్టులను రక్షించెను. కావున విష్ణువును రుద్రుఁడాయెను.

(2) "రుదం = సంసారదుఃఖం, రాతి = దదాతీతిరుద్రః
అను వ్యుత్పత్తినిగమనించినచో, జీవులకు సంసారదుఃఖమునొసఁగుటలోఁ గర్తృత్వము శివకేశవుల కిరువురకును సమానమే ఇరువురును విరాట్ స్వరూపులే. కాన శివకేశవులకిరువురకును "రుద్ర" అను నామము వర్తించునని తెలియుచున్నది.

(3) "రుదం = సంసారదుఃఖం ద్రావయతీతిరుద్రః
అను వ్యుత్పత్త్యర్థమును బరిశీలించినచో, గజేంద్రుఁడుకుచేలుఁడు, అంబరీషుఁడు మున్నగువారి సంసారకష్టములను బాపిన విష్ణువునకును; కాంచీపురవాసియగు శివబ్రాహ్మణుఁడు, ద్రావిడరాజాస్థానకవియగు నక్కీరుఁడు, చిరుతొండనంబి, అర్జునుఁడు, మున్నగువారి సంసారకష్టములను బాపిన శివునకును "రుద్ర" అను నామమునమముగనే వర్తించుననుట నిర్వివాదాంశము

(4) "రుతా = నాదాంతే, ద్రవతీతిరుద్రః"
అను వ్యుత్పత్తినిఁ బరిశీలించినచో శివకేశవులిరువురును భక్తుల ప్రణవనాదాంతమున ఆనందసాగరమగ్నులై ద్రవింతురు. అంతేకాదు. సంగీతనాదాంతమున ద్రవించుటయును ఇరువురకుసమానమే. విష్ణువు, తుంబురుని, సంగీతమున

అధిగమింపయత్నించిన నారదముని యొక్క సంగీతనాదముచే దర్పించియలరెను. సంగీతయుక్తతాండవమున, ఢక్కానాదమున శివుఁడు దర్పించెనన్న సంగతి చదువరులకెల్ల సువిదితమేకదా!

(5) "రుత్యా = వేదరూపయా ద్రావయతీతి రుద్రః"

వేదమనగఁ బరమాత్మ శివకేశవులిరువురును బరమాత్మస్వరూపులే పరమాత్మచే బ్రహ్మాండమున నియోజితులైనవారే. వారిరువురును వేదరూపరుతిచే బ్రహ్మాండమును ద్రవింపఁజేయువారే, కాన రుద్రపదముచే శివకేశవులిరువురును బోధింపఁబడుచున్నారన్న మాట.

(6) "రుత్యా = ప్రణవరూపయాస్వాత్మానం ప్రాపయతీతి రుద్రః"

రుతియనగాఁ బ్రణవము. ఓంకారము (అ+ఉ+మ్) పరబ్రహ్మస్వరూపము. త్రిమూర్త్యాత్మకము. అదిపరమాత్మనే జీవరూపమునఁ బదునాల్గు భువనంబుల వెలయింపఁజేయుచున్నది. అదియే సకలచేతనాచేతనములకును ధృతినొసఁగుచున్నది. అదియే సకలవస్తువులశరీరము. దానిరూపాన్తరమే ప్రకృతి. "స్వభావస్తు ప్రవర్తతే" అను గీతాసూక్తిలో అదియే స్వభావపదముచేఁ బేర్కొనఁబడినది. ప్రకృత్యావృతమే, సకలబ్రహ్మాండము. త్రిమూర్తులలో శివకేశవులిరువురును గలరు. వారిరువురును బ్రణవరూపరుతిచే, స్వాత్మను అంతటను జేర్చువారే. కాన రుద్రనామము శివకేశవులకిరువురకును జెల్లును.

*విష్ణుసూరి భాష్యము:—*

శివుఁడు రుజను, సంసారమును దొలగించును సంసారక్లేశములు కల్గించి, జీవులను ఏడిపించును. అందుచే శివునకు రుద్రనామమువాటిల్లెను.

*బీజాక్షరసంపుటి:—*

"రుద్ర" అనునామమున "ర్+ఉ+ద్+ర్+అ" అను పంచాక్షరములు కలవు. ఇవి పంచ భూతములకును బంచ... అష.



రములన్నియును మంత్రబీజములే. విరాట్ స్వరూపమునుఁ జెందిన ప్రకృతి వికృతులే. దేవతాస్వరూపములే. దేవతాశక్తిసంపన్నములుకూడ. అక్షరము లకు లింగభేదము, వర్ణభేదము, రోగనివారకశక్తి, శరీరమునకుఁ బుష్టి నొసగుఁశక్తి మున్నగుశక్తులుకలవు. "చతుర్థీతాదాత్మ్యే" "(చతుర్థీతాదర్థ్యే) అను సూత్రముననుసరించి, దేవతాసూచకవర్ణములు, ఆయాదేవతలకు విశేషణములై, మూలదేవతతో అభేదమునుబొందును.

ప్రకృతమగు రుద్రనామమందలి ఐదుక్షరములును రుద్రునకు విశే షణములై, రుద్రునితో అభిన్నములగును. వానియందలి శక్తినిగమనింతము గాక.

రేఫము:— (ర్) అగ్నిదైవత్యము; రక్తవర్ణము; సంహారశక్తి సంప న్నము. ఉకారము:- వాయుదైవత్యము; కృష్ణవర్ణము; రాజవశీకరము. దకారము:- దుర్గాబీజము; శ్యామవర్ణము; సర్వార్థదము. అకారము:- సర్వ దైవత్యము; రక్తవర్ణము; వశీకరము. పై నాల్గుబీజాక్షరముల సమష్టిరూపము; రుద్రనామము. కావున రుద్రనామోచ్చారణముచే, జపితలైనరాజులకు శత్రు సంహారశక్తి, రాజవశీకరణశక్తియును లభించును. సర్వార్థములును సమ కూరును. జపితలగు భక్తులకు, అగ్నిమాంద్యము, వాతరోగములు క్షాత ప్రేలవిభయము, తొలగిపోవును. రక్తసంబంధములైన నీలిమ మున్నగు రోగములును, దొలగిపోవును దీనినుపాసించువారు, వాయ్వగ్నిభేదములను, గనుగొని, వానితో మారణాయుధములు సృష్టించఁగలరనితెలియుచున్నది రుద్ర నామమున ఐదుక్షరములచేఁ దెలియుద్రవ్యములేవో, వానిఁ కలయికచే నేర్పడు రసాయనికద్రవ్యమేమో, ముందు తెలిసికొందుము.

2 వ నామము:- శివ+విష్ణుః-

మృడః-

"మృడయతి భక్తాన్ సుఖం కరోతీతిమృడః" "మృడ = సుఖనే ఇతి

ధాతోః స్వయంసుఖీవా” అను వ్యుత్పత్త్యర్థమును బరిశీలించినచో ఈ నామము శివకేశవులనిరువురిని దెలియఁజేయును; అనితెలియును.

శివుఁడు మార్కండేయాది భక్తులకు రక్షణనొసంగి సుఖముచేకూర్చినట్లే విష్ణువుకూడ బ్రహ్లాదాది భక్తులకును రక్షణనొసంగి సుఖముచేకూర్చెను. కాన మృడపదముచే శివకేశవులనిరువురిని బిలువవచ్చునన్నమాట. "మృడః = స్వయంసుఖీ” అనియర్థముచెప్పుదురేని, శివుఁడు పార్వతితోఁగూడి సుఖియైనట్లే కేశవుడును లక్ష్మీదేవితోఁగూడి సుఖియగుచున్నాడు. కావున మృడపదము శివకేశవులకిరువురకిని వర్తించును.

*విష్ణుసూరి:-*

ఉపాధియైన మాయనుదొలగించి జీవులకు మోక్ష సుఖముచేకూర్చుటచే శివుఁడు మృడుడు అయెను,

*బీజాక్షరసంపుటి:-*

మృడ అను నామమున "మ్+ఋ+డ్+అ” అని నాల్గుఅక్షరములు కలవు. ఇవి "విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృత, తురీయపురుషులకుఁ జిహ్వ ములు. అంతఃకరణచతుష్టయమునకును జిహ్వములు.

మకారము :— మదనదైవతాకము; శ్యామవర్ణము; సర్వజయప్రదమునై యున్నది. ఋకారము; బ్రహ్మదైవత్యము పీతవర్ణము; గ్రహబాధావినాశకము

డకారము:— నేత్రము,అనగాజ్యోతిర్దైవతాకము;పీతవర్ణము;కాలజయప్రదము

అకారము:— సర్పదైవత్యము; రక్తవర్ణము; వశీకరము. పైనాల్గువర్ణముల సమష్టిరూపము మృడనామము. కావునఁ దన్నామోచ్చారణముచే జపితలైన భక్తులకు, జీవకోటికిని గోరికలెల్ల నెఱవేరును. సిలిమాదిరోగములుతొలగును. సర్వవిధముల జయముహాటిల్లును. బ్రహ్మదైవత్యమైన ఋకారము ఇందున్న

కారణమున, జపితలకు వారివారి యర్హతల ననుసరించి, వేదశాస్త్రాది విజ్ఞానములభించును. తపోజపంబులకువలయు అంతశ్శుద్ధి, చిత్తైకాగ్రతచేకూరును. అంతేకాదు. తవర్ణప్రభావముచే నేత్రరోగములుతొలగి, దూరదర్శన శక్తి యును లభించును, తకారము పీతవర్ణముగుటచే "కామెల" మున్నగు రోగ ములు నశించును. అనతికాలములోనేచేపట్టినకార్యములందు జయమువాటిల్లును రక్తసంబంధరోగములు నశించును. సర్వవశీకరణశక్తిచేకూరును.

*3 నామ:- గిరిశన్తః:-*

(1) "గిరౌస్థిత్వాసుఖంతనోతీతిగిరిశన్తః" అను వ్యుత్పత్తిచే శివుఁడు కైలాసముపైనుండి, జీవకోటికి సుఖముచేకూర్చునట్లే, విష్ణువును శేషాచల భద్రాచలాదులపైనుండి జీవకోటికి సుఖముచేకూర్చుచున్నాఁడు. వీరిరువురును బరమాంశసంపన్నులే.

(*ii*) గిరౌమేఘేపర్జన్యరూపేణస్థితఃశం,తనోతీతిగిరిశంతః అను వ్యుత్పత్తిననుసరించి చూచినచో, మేఘమునందు శివుఁడుపర్జన్యుఁడైయున్నట్లు విష్ణువును బర్జన్యుఁడైకలడు. "పర్జన్యఃపావనోఽనలః" అను విష్ణుసహస్ర సూక్తిలోఁ బర్జన్యపదము విష్ణుపరముగానుండుటయే, పై విషయమునకుఁ బ్రబలప్రమాణము. శివకేశవులిరువురును బర్జన్యరూపులై, మేఘమునందుండి, జీవకోటికి సుఖముచేకూర్చుట సమానమే. కావున "గిరిశన్త"పదము శివకేశవు లిరువురను దెలియఁజేయును.

(*iii*) "గిరి = వాచి, వేదరూపేణతిష్ఠన్, అర్థరూపేణశం తనోతి," అను వ్యుత్పత్త్యర్థమును బరిశీలించితిమేని, శివకేశవులిరువురును వేదరూపవాక్కు నందు అర్థరూపమునందుండి సర్వులకును సుఖముచేకూర్చుచున్నారనుట విజ్ఞు లందఱకును సువిదితమేకదా!

(*iv*) "ప్రణవేతిష్ఠన్, శం = బ్రహ్మానందంతనోతి" అనెడి యర్థ మును బరిశీలించినచో (అ+ఉమ్) అను ప్రణవమునందలి, ఉకారమకార

ములు విష్ణుశివులను దెలియఁజేయును. కావున వీరు ఇరువురును ప్రణవమున నుండుట సుస్పష్టమేకదా! ప్రణవరూపశివకేశవులు, ప్రణవోపాసకులకు బ్రహ్మానందము ఒదలించుట సుస్పష్టమే. కావున గిరిశన్తనామము శివకేశవులకుఁజెల్లును.

వి. సూరి:-

గిరివలె సంసారము దుస్తరము. దానియందు శివుఁడు జీవేశ్వరుల రూపమున నుండుటచే గిరిశన్తనామకుఁడాయెను.

బీజాక్షరసంపుటి:-

"గిరిశన్త"అనునామమున "గ్+ఇ+ర్+ఇ+శ్+అ+న్+త్+అ"అని తొమ్మిదక్షరములుకలవు. అవి శరీరమందలి నవద్వారములకును, నవగ్రహములకును జిహ్నములు. గణపతి బీజమైన గకారమురక్తవర్ణము, విఘ్నవినాశకమును. విష్ణుబీజమైన ఇకారము శ్యామవర్ణము, రక్షకరము. అగ్నిబీజమైన రేఫము రక్తవర్ణము; సంహారశక్తిసంపన్నము. లక్ష్మీబీజమైన శవర్ణము వ్యోమవర్ణము; శ్రీకరము సర్వదేవతాకమైన అకారము రక్తవర్ణము; వశీకరము. సావిత్రీబీజమైన నకారము స్ఫటికవర్ణము; పాపనాశకము వాస్తుదేవతాకమైన తకారము శ్వేతవర్ణము; జయప్రదము. పై తొమ్మిదివర్ణముల సమష్టిరూపము "గిరిశన్త" అను నామము కావున ఈ నామమును జపించినవారికి ముద్రణాధికారము, సైన్యాధిపత్యమును లభించును. నామారంభమున, గకారేకారసంయోగమైన "గివర్ణము కలదు. దానిప్రభావముచే, సర్వవ్యాపకమైన అనగా రాష్ట్రవ్యాప్తమో, లేక దేశవ్యాప్తమోయగునాయకత్వము, సేనాధిపత్యము, రక్షకాధిపత్యమును జేకూరును. గణపతి బీజమున్నకారణమున, ఈ నామజపముచేఁ జేపట్టినకార్యములు నిర్విఘ్నముగా ఫలించును. రక్తశ్యామవర్ణముల మిశ్రమము ఇందుండుటచే సంకీర్ణరోగములు తొలగించుకొను శక్తి జపితలకేర్పడును. రక్తమాలిన్యముచే నేర్పడు చర్మవ్యాధులు తొలగును.

"రి"వర్ణము ఈ నామమందలి ద్వితీయవర్ణము. దీనిమహిమచే, అగ్ని ప్రమాదము, అగ్నిమాంద్యాదిరోగములయలజడి, క్షీణించును. విషక్రిమి సంహారశక్తియు, విఘ్నసంహారశక్తియు, శత్రుసంహారశక్తియును జపితలకు లభించును.

"శ"అనునది ఇందలి తృతీయవర్ణము. అదిసర్వదేవతాత్మమైన అకారముయొక్కయు, లక్ష్మీబీజమైన శవర్ణముయొక్కయు సమష్టిరూపము. అట్టి వర్ణమున్నకారణమున "గిరిశస్త" నామము జపించువారికి, అఖండైశ్వర్యము, సర్వవశీకరణశక్తియును దప్పకవాటిల్లును. జపితలు ఓజోగుణసంపన్నులు, దివ్యతేజస్సంపన్నులునగుదురు. రక్తవ్యోమవర్ణముల కలయికయిందున్న కారణమున, జపితలకు మహాశ్రవణశక్తియు, ఆకాశగమనశక్తియును ఏర్పడును. శరీరనాళములందు, రక్తవాయు ప్రసారాభావముచేఁ గల్గురోగములు ఈ నామోచ్చారణ ప్రభావముచే నశించును.

"స్త" అనునది, ఇందలి నాల్గవవర్ణము ఇందు సకారతకారా, కారముల కలయిక, కలదు. సకారము సావిత్రీబీజము. తకారము వాస్తుబీజము. అకారము సర్వదైవబీజము. వీనిమహిమవలనఁ బైనామము జపించువారికిఁ గ్రోత్తవిషయములను గనుగొనుశక్తియు, గృహదేవాలయాదులు, యంత్రాగారములు, ఆనకట్టలు, యంత్రపరికరములు, తయారుచేయుశక్తియును లభించును. అంతేకాదు. సావిత్రీదేవతాప్రభావముచే భౌతికరసాయనికాది విజ్ఞానశాస్త్రజ్ఞానము, అపారముగాలభించుటతోఁ బాటు వాస్తుదేవతా ప్రభావముచేఁ బలుపకయములైన ఇంజనీరింగు విద్యలును, వ్యవసాయశాస్త్రజ్ఞానమును లభించును. సర్వరోగనివారకశక్తియు, శారీరకరోగనివారకశక్తియును జపితలకు లభించును.

పైనూరు వర్ణములను రక్తశ్వేతశ్వేతవర్ణములు కలవగుటచే, మిశ్రమ రోగ నివారక శక్తియును దప్పక చేకూరును. ముఖ్యముగా, శ్వేత్రము, ఎర్ర

మచ్చలు, మున్నగు చర్మరోగములను నివారించుశక్తి "గిరిశన్త" నామజపిత లకుఁ దప్పక వాటిల్లును.

పై నామము జపించువారికి, సర్వత్రవిజయమువాటిల్లును. దానితో బాటు సర్వవశీకరణశక్తియు, సకలపాపనిర్మూలనశక్తియును బ్రాప్తించును. కానఁ బైనామము జపించుభక్తులు, జీవన్ముక్తినో, విదేహముక్తినో తప్పక పొందఁగలరు. శుక్రాంగారకాది గ్రహమండలయాత్రను జపితలు తప్పక చేయఁగలరు.

## 4 నామము

### శివ+విష్ణు (1) గిరిత్రః :-

"గిరింత్రాయతే నివాసత్వేన బహుమన్యతే" అనెడివ్యుత్పత్తిని బరిశీలించి నచో శివుఁడు, తననివాసమైన, కైలాసగిరిని, గాపాడునట్లు, విష్ణువు, తననివా సములైన శేషాద్రిభద్రాద్రులను అర్చావతారమున, రక్షించును. అంతేకాదు. త్రిపురాసురసంహార సమయమున మహాదేవుఁడు ధనువురూపమునఁ జేతనున్న మేరువును రక్షించునట్లు, విష్ణువు అదేసమయమున, శరరూపధరుఁడై తన కాశ్రయమైన చాపరూపమేరువు పర్వతమునుగాపాడెను. శ్రీ కృష్ణాష్టోత్తర నామ శతకములననుసరించిచూచినచో, విష్ణువు శ్రీ కృష్ణరూపమున గోవర్ధన గిరినిగాపాడెను; అని తెలియును.

(ii) "గిరేర్మేఘస్యత్రాయకః వర్షయితృత్వాత్" అనెడి వ్యుత్పత్తిని బరిశీలించినచో శివకేశవులిరువురును బర్జన్యస్వరూపులై, వర్షింపఁజేసి ప్రకృ తిని రక్షించుచున్నారని తెలియుచున్నది "గిరిశన్త" నామవివరణమున ఈ విషయమేస్ఫుటముగా నిరూపింపఁబడినది.

(iii) "గిరిసదృశరథస్యత్రాయకః, తదవయవానాం దేవానాంత్రాయ కత్వాత్" అనెడివ్యుత్పత్తిని బరిశీలించినచో మహాదేవుఁడు త్రిపురసంహార

సమయమున గిరిసదృశరథమైనభూమిని, తదంగములైన, చక్రముల రూప మునఁగల సూర్యచంద్రులనుగాపాడెను పై యర్థమునుసరించి, పై నామమును విష్ణుపరముగను సమన్వయ పఱచవచ్చును. ఎట్లన?

"ఆత్మానంరథినం విద్ధిశరీరంరథమేవతు"

అను కఠోపనిషత్సూక్తి ననుసరించిచూచినచోఁ బరమాత్మయైన నారాయణుఁడు రథికుఁడు. శరీరమే ఆతని రథము అని తెలియును.

*శ్లో॥ "భూఃపాదౌయస్యనాభిర్వియద సురనిలశ్చంద్ర సూర్యౌచనేత్రే।*

*కర్ణావాశాశ్శిరోద్యౌర్ముఖమపిదహనో యస్యవాస్తేఽయమబ్ధిః"*

అను విష్ణు సహస్రశ్లోకమును బరిశీలించినచోఁ బరమాత్మయగు శ్రీమన్నారాయణునికి, భూమిపాదములుగను, ఆకాశము నాభిగను, అనిలము ప్రాణము లుగను, చంద్రసూర్యులు నేత్రములుగను, గర్తములు దిక్కులుగను, స్వర్గము శిరస్సుగను, అగ్నిముఖముగనున్నట్లు తెలియుచున్నది.

*"చంద్రమామనసోజాతః, చక్షోస్సూర్యోఅజాయత।*
*ముఖాదింద్రశ్చాగ్నిశ్చ, ప్రాణాద్వాయురజాయత।*
*నాభ్యాఆసీదన్తరిక్షం, శీర్ష్ణోద్యౌస్సమవర్తత।*
*పద్భ్యాంభూమిర్దిశశ్శోత్రాత్"*

అను పురుషసూక్తమంత్రమును ఆధారధేయయోః "ఆశ్రయాశ్రయిణోరభేదః" అను న్యాయమునుసరించి బరిశీలించినచో, ఆధారముగుపరమాత్మకు, మనస్సుగానున్నచంద్రుఁడు, నేత్రములుగానున్నసూర్యుఁడు ముఖముగానున్న ఇంద్రాగ్నులు, ప్రాణముగానున్నవాయువు, నాభిగానున్నఅంతరిక్షము, శిరస్సుగానున్నస్వర్గము, పాదములుగానున్నభూమి, శ్రోత్రములుగా (చెవులుగా) నున్నదిక్కులను ఆధేయములని తెలియుచున్నది. కావునఁ బరమాత్మయగు

విష్ణువు, సకలదేవతాత్మకమైన తన శరీరరథమును సంరక్షించుచున్నాడనుట సమంజసమేకదా!

(iv) "గిరాం = వచసాంత్రాయకః = పరిపాలకః" అను వ్యుత్పత్తిని పరిశీలించితిమేని, పరమాత్మ శివకేశవస్వరూపుఁడై, అలౌకికవాక్కులగువేదములను, పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీరూపములగు వాక్కులను గాపాడుచున్నాడనుట, అందఱకును సువిదితమే.

అందుచే "గిరిత్రః" అను నామము శివకేశవులకు సమానముగా వర్తించుననుటయుక్తి యుక్తమేకదా!

విష్ణు = సూ. భా:-

గిరియనగాఁ బ్రపంచము. దానిని శివుఁడు సూర్యచంద్రస్వరూపుఁడై తన కాంతినొసంగి, రక్షించుచుండును. కావున గిరిత్రనామకుఁడాయెను.

బీజాక్షరసంపుటి:-

"గిరిత్ర" అను నామమున "గ్ + ఇ + ర్ + ఇ + త్ + ర్ + అ" అనియేడక్షరములుకలవు. ఇవి జ్ఞానేంద్రియములతోడి మనోబుద్ధులకును, సప్తసూర్యమండలములకును చిహ్నములు. పై నామమున, జెప్పినట్లు, గకారేకారసంయోగమైన "గి" వర్ణముయొక్క ప్రభావముచే, మహానాయకత్వమును, సంకీర్ణరోగములు నివారించుశక్తియును, జపితలకేర్పడును. అట్లే రేఫేకారసంయోగమైన "రి"వర్ణముయొక్క ప్రభావముచే అగ్నిమాంద్యాది రోగనివారకశక్తి, వారికిఁజేకూరును. (1) వాస్తుదేవతాకమైన "తవర్ణము" శ్వేతవర్ణము, సర్వజయప్రదము. (2) అగ్నిబీజమైనరేఫము రక్తవర్ణము సంహారశక్తిసంపన్నము. (3) సర్వదేవతాకమైన అకారము రక్తవర్ణము, వశీకరమును. పై మూడువర్ణములకలయికచేనేర్పడిన "త్ర" వర్ణముయొక్క ప్రభావముచేఁ బైనామమును జపించువారికి, వాస్తుశాస్త్రజ్ఞానములభించును. అంతేకాదు. మహాయంత్రములు, మహాభవనములు తయారుచేయుట,

నిర్మించుట, మున్నగుశక్తులులభించును. ఎదుటవారికి తంత్రములను విచ్ఛిన్నముచేసి, వారినెల్లవశపఱచుకొని, సర్వవ్యవహారములందును విజయము సంపాదించు, రాజకీయనీతిశాస్త్రవేత్తలుకాఁగలరు. శ్వేతరక్తవర్ణములకుఁ జెందిన రోగములు నివారింపఁగలవారలగుదురు.

మొత్తముపైని, పైనామము జపించువారికి, మహాప్రఖ్యాతియు, అయుధనిర్మాణశక్తియును లభించుట నిస్సందేహము.

*౬ నామము*

*శివ+విష్ణు (1) గిరిశః :-*

గిరౌ = కైలాసగిరౌ శేతే "ఇతి గిరిశః" అనెడివ్యుత్పత్తిననుసరించి, శివుడు కైలాసపర్వతముపై, శయనించెననితెలియుచున్నది. అట్లే, విష్ణువును అర్చావతారములలో, శ్రీవెంకటేశ్వరరూపమున శేషాచలముపైని శ్రీరామరూపమున, భద్రాచలముపైని, శయనించెను. అందుచేశివకేశవులిరువురును దమకభిమతములైన గిరులపైన, శయనించినట్లుతెలియుచున్నది. కాన "గిరిశ" నామము ఇరువురికిని జెందియున్నది

(ii) "గిరేః పర్వతస్య మేఘస్యవా, గిరాం ప్రణవాత్మక వేదవచసాం, వా, ఈశః" అనెడి వ్యుత్పత్తినిఁ బరిశీలించినను, శివకేశవులు ఇరువురును, వారివారికభిమతములగు పర్వతములకుఁ బ్రభువులైయున్నారు. ఇరువురును బ్రణవమైన ఓంకారముననుండి, దానికిఁ బ్రభువులైనవారేకాన "గిరిశః" అను నామముచే శివకేశవులిరువురును జెప్పఁబడుచున్నట్లు తెలియుచున్నది. ఇరువురును, గిరికి అనగా పర్జన్యునకు, మేఘునకుఁ బ్రభువులే. కావున ఈ యర్థమునందును పైనామము ఇరువురిని సమానముగానే తెలియఁజేయుచున్నది

*వి. సూరి. భా:-*

సంసారరూపమైన గిరియందు జీవేశ్వరులరూపమున శయనించువాఁడగుటచే, శివునకు గిరిశుఁడను నామము ఖ్యాతిగాంచెను.

*బీజాక్షరసంపుటి:-*

"గిరిశ" అను నామమున "గ్+ఇ+ర్+ఇ+శ్+అ" అను నార క్షరములును, మణిపూరాదిషట్చక్రములకును, షడృతువులకును జిహ్వ ములు. "గిరిశన్త" అనెడినామమునఁగల మొదటి మూఁడక్షరములే ఇందును గలవు. కాన గిరిశన్తనామోపాసనచేలంభించు శక్తులు గిరిశనామోపాసనచే సైతము లభించునని తెలిసికొనవలసియున్నది.

*6 నామము:—*

*శివ + విష్ణు : -"అధివక్తా"*

భగవంతుఁడు సర్వాధికుఁడు. భక్తులకెల్లఁ బ్రభువు. కాన, నేనే, అధికుఁడను; నాపైశక్తి మెలగుడు. నేనే, మీ యోగక్షేమములను జూచు కొందును; అని చెప్పినట్లు "అనన్యాశ్చిన్తయన్తోమాం" అనెడి గీతాసూక్తి వలన దెలియుచున్నది. ఇదియే అధివక్తృత్వము అంతేకాదు. "లోకబంధుర్లోక నాథః" అను విష్ణుసహస్రనామ సూక్తిని బరిశీలించినచో, భగవానుఁడే లోకనాథుఁడు అందుచేఁ నాతఁడే జీవులనట్లు, అధికారిగా నుండి, శాసించి, పలుకసమర్థుఁడు. అట్టి అధివక్తృత్వము,శివకేశవులు ఇరువురియందునుగలదు. ఇద్దఱును లోక నాథులే. కావున "అధివక్త" అను నామము శివకేశవులకిరువురికినిఁ జెల్లు ననుట సమంజసమేకదా!

*వి. వ్యాఖ్యా -*

- పరమశివుఁడు, తానే బ్రహ్మాండమరీతటికిని, మూలమైనవాఁడనినయు, సర్వజ్ఞుఁడననియు వేదమంత్రములచే వివరింపఁజేసెను. కావున "అధివక్త" అను నామమును ధరించెను.

***బీజాక్షరసంపుటి-***

"అధివక్త" అనునామమున "అ+ధ్+ఇ+వ్+అ+క్+త్+అ" అనియెనిమిదక్షరములుకలవు. ఇవి యోగమునందలి అష్టాంగములను "భూమి నీరు, గాలి, అగ్ని, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము" అని యెనిమిది విధములైన ప్రకృతినిసూచించును.

(i) ఇందు మూఁడు అకారములు కలవు.

అకారము:— సర్వదైవత్యము, రక్తవర్ణము, వశీకరము. త్రిరావృత్తమైన అకారము త్రిపుటినితెలియఁజేయును.

"త్రిపుటులలో" అండాండపిండాండ బ్రహ్మాండములొకటి. పై మూఁడింటియందును, అకారార్థమైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులును, వారి శక్తులునుగలవు. అట్టియకారము పై నామముననుండుటచే దానిని జపించు భక్తులకు త్రిమూర్తులశక్తులులభించును. అందుచే జపితలు క్రొంగ్రొత్తవస్తువులను సృష్టించుచు, వానిచే జీవకోటినిగాపాడుచు, దుష్టశక్తులను సంహరింపఁగలరు. నవీనవిజ్ఞానశాస్త్రముననుసరించి, వ్యోమనౌకాదులను నిర్మింపఁగలరు. అణు శక్త్యాదులచేఁ గల్గుప్రమాదములనుదొలగించుటకై, నూతనౌషధములనుగన్గొని వానిద్వారా జీవకోటినిగాపాడుచు, శత్రువులను సంహరింపఁగలరు. అకారము రక్తవర్ణమైన కారణమున, జపితలు రక్తదోషముచే నేర్పడు రోగములను నివారించి, రక్తాభివృద్ధిఁగావించి, ఎఱ్ఱకణములను క్షీణింపఁజేయుక్రిములను సంహరింపఁగలరు. ఉపాసకులు దివ్యతేజస్సంపన్నులు కాఁగలరు. సృష్టిలో వారికివశము కానిదెద్దియు నుండదని తెలియుచున్నది.

(ii) ధకారము:— ధనదము, పీతాభము, అర్థసిద్ధిదము. "ధనం దదాతీతిధనదః = కుబేరః కుబేరుడు తనవశమునఁగల, నవనిధులలోని ధనమును లోకులకొసగును. అటులనే, ధకారముతోఁగూడిన నామము జపితలకు అవసరమగు ధనరాశినొసగును. "డుధాఞ్ = ధారణపోషణయోః" అను

ధాతువునుండి యేర్పడిన ధకారమునకు, ధరించుట, పోషించుట, అను నర్థములుకలవు. ధకారముతోఁగూడిన ఈ నామముచేఁ దెలియుదేవతలు దీనిని జపించువారినిఁ జేపట్టి, కాపాడి, పోషింతురు. అంతేకాదు. ధార్యధారకములకభేద మనున్యాయము ననుసరించి, జపితలకునట్టిశక్తిలభించును. కాన జపితలు, తమతపశ్శక్తిచే ఆశ్రితులను జేరఁదీసి, రక్షించి, పోషింపఁగలరు. అంతేకాదు. ఆ జపితలు, సర్వభౌతికశక్తులను స్వీకరించి, భూమ్యాదిమండలములలో నెచటనైనను నిల్వఁగలరు. ఎట్టివారినైనను దమశక్తులనొసంగి పోషింపఁగలరు; అని తెలియుచున్నది.

(*iii*) ఇకారము:— విష్ణుదైవత్యము. శ్యామవర్ణము. రక్షాకరము. విష్ణువనగా సర్వవ్యాపకుఁడు. ఇకారము విష్ణుబీజమేకాదు; శక్తిబీజముకూడ. అందుచే ఇకారముతోఁగూడిన పైనామమును జపించువారికి, సర్వవ్యాపకశక్తిలభించును. అనగా జపితలైన భక్తులకు, "కామగమనములభించునన్న మాట. అంతేకాదు. ఇకారము శ్యామవర్ణమై, రక్షాకరమైన కారణమున భక్తులకుఁగల నీలిమాదిరోగములను నివారించి, రక్షణనొసంగుననన్నమాట.

(*iv*) వకారము:— వరుణదైవత్యము, శుక్లవర్ణము, రోగనాశకము వరుణుఁడు జలాధిదేవత. అంతటనావరించియుండుశక్తికలవాఁడు. అందుచే వకారముతోఁగూడినపైనామమును జపించువారు జలప్రమాదములు తొలగించుట, తొలగించుకొనుటయేకాక, సముద్రయానము, సముద్రపరిశోధనము, మున్నగు కార్యములనుసైతము ఆచరింపఁగలరు అంతేకాదు. సముద్రాధిపత్యముకూడవారికి లభించును. జలోదరాదిరోగనివారణశక్తియును వారికి లభించును. వకారము శుక్లవర్ణము. కావున వకారముగల పైనామము జపించుభక్తులు సాత్వికప్రకృతులై, తెల్లనితేజస్సుతో నిండియుందురు. "బొల్లి" మున్నగురోగములను, నివారించుకొనుటయేకాక, ఇతరుల రోగములను సైతము తొలగించగలరు. ఆరోగ్యవంతులగుదురు.

(v) కవర్ణము:— ప్రజాపతిదైవత్యము. పీతవర్ణము వృష్టికరము. ప్రజాపతియనగా సృష్టికర్తయైన పరబ్రహ్మ. కవర్ణము ప్రజాపతి బీజమగుటచే, ఆ కవర్ణముతోఁగూడిన పైనామమును జపించుభక్తులకుఁ గ్రొత్త క్రొత్తవస్తువులను సృష్టించుశక్తియేర్పడును. అంతేకాదు అనామమును జపించు భక్తులు మహాజ్ఞానులగుదురని తెలిసికొనవలసియున్నది. కవర్ణము పీతవర్ణము; వృష్టికరము; అయినకారణమునఁ గవర్ణముతోఁగూడిన యీనామమును జపించుభక్తులు, పీతవర్ణమునకుఁజెందినరోగములనుపరులకు గల్గినరోగములను సైతము, పోఁగొట్టఁగలరు-ఈనాటి కృత్రిమవర్షపద్ధతి అక్కఱలేకయే, భక్తులు పైనామమును జపించి, అనావృష్టికిఁగుఱియైన ప్రాంతమునందు వర్షము కురిపింపఁగలరు.

(vi) తవర్ణము:— దీనితోగూడిన "అధివక్త" అను నామమును, జపించువారు, గిరిత్రనామమును జపించువారివలె, వాస్తుశాస్త్రజ్ఞులై, నూతన భవనాదులను నిర్మింపఁగలవారును, సర్వవిజేతలును, శ్వేతరోగనివారకులును అగుదురు.

7 నామము:-

*శివ+విష్ణు— ప్రథమః-*

"ప్రథ = ప్రఖ్యానే" అనుధాతువునుండిపుట్టిన ప్రథమపదమునకుఁ బ్రసిద్ధుఁడనియర్థము. అంతేకాదు. ప్రధానుఁడు; మొదటివాఁడనియు నర్థము కలదు "బ్రహ్మజజ్ఞానం ప్రథమంపురస్తాత్" అనుశ్రుతినిబరిశీలించినచో బర బ్రహ్మయే సృష్టికార్యమున కుపక్రమించునపుడు, బ్రహ్మాండమున "విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతములనెడినామములలో వెలసెను అతడే" విశ్వ,తైజస, ప్రాజ్ఞ "నామములతోడను, బ్రసిద్ధుఁడైయుండెను. పైమువ్వురే బ్రహ్మవిష్ణు మహేశ్వరులు. వారుమువ్వురును బ్రథములే; ప్రధానులే; ఏకాకారులే; కావుననే ప్రథమశబ్దముచే శివకేశవులిరువురును జెప్పఁబడుచున్నారనుట నిస్సందేహము. "అదిదేవోమహాదేవః" అనెడి విష్ణుసహస్రనూక్తిలో - జెప్ప

ఒడిన అదిదేవుడు విష్ణువేకాదు. శివుడుకూడ; అని చెప్పవలసియున్నది. కావున ప్రథమపదమ్ము శివకేశవులిరువురికిని సమానముగనే వర్తించుననె తెల్పియుచున్నది.

వి. సూరి:-

పరమశివుడే పురాణపురుషుడు. సర్వశ్రేష్ఠుడు. మాతాపితృరూపమున ప్రథమభూమికను అధిష్ఠించినవాఁడు; అనికాళిదాసమహాకవి "వాగర్థావివసంపృక్తౌ ...... ................. జగతఃపితరౌవన్దే" అనెడిశ్లోకమున జెప్పినాడు. కానశివుడు ప్రథమనామకుడాయెను.

బీజాక్షరసంపుటి:—

"ప్రథమః" అనునామమున "ప్+ర్+అ+ధ్+మ్+అ అని ఏడు వర్ణములు కలవు వానిలో అకారముమూడు సార్లు ప్రయోగింపబడినది. ఆ "అకారత్రయము" సర్వదేవతాత్మకము. ఇచ్ఛా,క్రియా, జ్ఞానశక్తులను మూడింటిని దెలియజేయును; అనిచెప్పవచ్చును అంతేకాదు, త్రికాలములను సైతముతెల్పును. అందుచే నైనామమునుజపించు వారికి, సత్కార్యాచరణేచ్ఛ, సత్కార్యాచరణశక్తి మోక్షజ్ఞానమును లభించును. కానజపితలు, మహాజ్ఞానులు, మహాశక్తులు, మహాకార్య నిర్వాహకులునుగాగలరు.

పకారమ్ము:— ఇది పర్జన్యబీజము; క్షీరాభము తనగా శ్వేతవర్ణము; వృద్ధిసిద్ధికరము.

రేఫము:— వహ్నిబీజము; రక్తవర్ణము; రక్తవర్ణము; సంహారకరము.

అకారము:— సర్వదేవతాత్మకము; రక్తవర్ణము; వశీకరము

ధకారము:— ధర్మబీజము; కుంతాభము; జయప్రదము.

మకారము:— మదనబీజము; శ్యామవర్ణము; సర్వజయప్రదము. ఈ నామమున వృద్ధికరములును, జయప్రదములునగు వర్ణములెక్కువగాగలవు.

సంహారకరమైన రేఫముతోఁగూడినవి కావునఁబైనామమ నుపాసించువాడు వ్యతిరేకశక్తులను నిర్మూలించుకొని, సర్వకార్యములందును విజయముపొంద గలడన్నమాట. ఇందలి వర్ణములెక్కువగా శ్వేతవర్ణములు, రక్తవర్ణములు నగుటచేఁ బైనామమునుపాసించువాఁడు బొల్లిజబ్బును, రక్తక్షీణరోగములను బోఁగొట్టుకొనఁగలడు. సకాలవర్షములుకురిపించి, ఈతిబాధలు తొలగించి, దేశమును సుభిక్షమొనర్చి, ప్రజలకోరికలనెల్లసమకూర్పఁగలవాఁడగును.

*8 నామము-*

*శివ + విష్ణు దైవ్యః:-*

(i) "దేవేషుభవః" అనెడివ్యుత్పత్తిని బరిశీలించినచోఁ బ్రకాశమాను లైన దేవతలలో రుద్రుఁడు, స్వయంభువుఁడనితెలియును. శివకేశవులిరువు రును బరమాత్మాంశజులగుటచే దేవులలో స్వయంభువులే. శివకేశవులిరు వురకును దైవ్యుఁడనునామము చెల్లునని తెలియుచున్నది.

(ii) "దేవనేషు = క్రీడాసు, సుఖరూపః దైవ్యః" అను నర్థమునను సరించి చూచినను, శివకేశవులు ఇరువురును సృష్టిక్రీడలో సమానపాత్ర వహించినవారే; సుఖస్వరూపులే. సుఖకరులే దేవమానుషానందరూపులే. "ఆనందో బ్రహ్మ" అను శ్రుత్యర్థమునకు ఇరువురునుగుణియైనవారే. క్రీడలలో సుఖరూపుడు, అనగా ఆనందరూపుఁడనియర్థము. సుఖము ఆనందముయొక్క రూపాన్తరము. "ఆనందోనందనోనందః" అను విష్ణుసహస్రసూక్తిలో ఆనంద పదము విష్ణుపరముగాగలదు కావున శివకేశవులిరువురును దైవ్యులే. ఆనంద రూపులే. అందుచే దైవ్యపదము శివకేశవులిరువురికినీ సమానముగానే వర్తించును.

(iii) "విజిగీషాయాంజయరూపః = దైవ్యః" అను నర్థమును; బరి శీలించినచో శివకేశవులిరువురును విజిగీషకలవారే. విజిగీషులలో జయ

రూపులే. ఇరుపురుసురాక్షస సంహర్తలై జయులుగా అనగా సర్వోత్కృష్టులుగా నున్న వారే "దైవ్యః, జయః, శివః" అని ఇందు శివపరముగా దైవ్యపదము గలదు. "వినయోజయస్సత్యసంధః" అను సహస్రనామములలో జయార్థమైన దైవ్యపదము విష్ణుపరముగాఁగలదు. కాన దైవ్యనామము శివకేశవులిరువురిని సమానముగానే తెలియఁజేయును.

(iv) "వ్యవహారేవివిక్తః = దైవ్యః" అను నర్థమును బరిశీలించినచోఁ బరమేశ్వరుఁడు వివిక్తరూపుఁడు; రహస్యరూపుఁడనితెలియుచున్నది. శివకేశవు లిరువురును రహస్యరూపుఁలే. వారిరూపములుకంటికిఁగానరానివి. వాక్కులతో వాఁకొనశక్యము కానివి. ఇందు వివిక్తుఁడను పదముచే, శివుఁడు, పేర్కొన బడినట్లే "వివిక్తశ్శ్రుతిసాగరః" అను సహస్రనామ సూక్తిలో వివిక్తపదముచే విష్ణువుపేర్కొనబడెను. కాన వివిక్తుడనునర్థమునఁ జెప్పఁబడిన "దైవ్య" పద ముచే శివకేశవులిరువురును జెప్పఁబడుదురనుట నిస్సంశయము.

(v) "ద్యోతనేప్రకాశరూపః = దైవ్యః" అను నర్థమును బరిశీలించి నచో, ఈ నామము శివకేశవులిరువురికిని జెల్లునని చెప్పవచ్చును. ఎట్లన? "యఏకోరుద్రఉచ్యతే" అను అరుణమంత్రమున అదిత్యుడు రుద్రుఁడుగా జెప్పఁబడెను. ప్రణవమునందలి ఉకారముచేఁ జెప్పఁబడుతైజసపురుషుఁడు విష్ణువు. అవిష్ణుని తేజస్సేసూర్యునిలోఁగలదు. కావుననే సూర్యుఁడు విష్ణువు యొక్క నేత్రముగా "చంద్రసూర్యౌచనేత్రే"అను సూక్తిలోఁబేర్కొనఁబడెను. అందుచే శివకేశవులిరువురును ప్రకాశరూపులే. కావున దైవ్యపదము శివ కేశవులిరువురికిని జెల్లునని తెలియుచున్నది "ప్రకాశాత్మాప్రతాపనః" అను విష్ణుసహస్రనామసూక్తిలోఁగల ప్రకాశాత్మపదముకూడ ఇట్లే హరిహరులకు జెల్లునని చెప్పవచ్చును.

(vi) "స్తుతౌస్తుత్యరూపః = దైవ్యః" అను నర్థమును బరిశీలించినను బైనామము ఇరువురికినిజెల్లును. ఎట్లన? దైవ్యుఁడనగాస్తుత్యుఁడు, స్తవ్యుడు, స్తుతింపఁదగినవాఁడనికదాయర్థము. శివకేశవులు ఇరువురును, స్తుత్యులే;

స్త్రవ్యులే. ఇరువురును బరమాత్మయొక్క అంశజులే. సమానులే. అంతేకాదు. ఏకరూపులే. ఇందుఁగల దైవ్యపదమును, విష్ణుసహస్రమందలి స్తవ్యపదమును ఏకార్థకములే. కాన దైవ్యపదము హరిహరులకు సమానముగనే చెల్లును.

(vii) "దైవ్యః = గతాగన్తవ్యరూపః, వాయురూపోవా" అను నర్థమును బరిశీలించినచో, ఉత్తమగతియైనమోక్షము విషయమై, చేరఁదగినవాఁడని, వాయురూపమున సర్వాంతర్యామిగ నున్నవాఁడని, తెలియుచున్నది. "అగ్నిర్వాయుశ్చసూర్యశ్చ" అను అరుణమంత్రార్థమును బరిశీలించినచో, అగ్ని, వాయువు, సూర్యుఁడును ఒకటే. పైమూడురూపములును శివవిష్ణుస్వరూపములే. పైరూపములతో హరిహరులు ఇరువురును సర్వాన్తర్యాములేయై యున్నారు. వారు ఉత్తమగతియైనమోక్షము విషయమై చేరఁదగినవారే. కాన పైయర్థములందు "దైవ్య"పదము శివకేశవులిరువురికిని జెల్లును; అని తెలిసికొనవలసియున్నది.

వి. సూ. భాష్యము:-

"ఏకోదేవస్సర్వభూతేషుగూఢః" అను శ్రుతిలోఁజెప్పినట్లు, సకలప్రాణులందును,నిగూఢముగానుండి, ప్రకాశించుటచే శివుఁడు దైవ్యనాముఁడాయెను.

*బీజాక్షరసంపుటి:-*

"దైవ్యః" అను నామమున "ద్+ఐ+వ్+య్+అః" అనియైదక్షరములుకలవు. అవి పంచభూతములను, బంచకోశములను సూచించును.

దకారము:— దుర్గాబీజము; శ్యామవర్ణము; సర్వార్థసిద్ధిదము.

ఐకారము:— వాగ్బీజము; స్ఫాటికవర్ణము; జ్ఞానసిద్ధిదము.

వకారము:— వరుణబీజము; కృష్ణవర్ణము; ఉచ్చాటనప్రదము.

అకారము:— సర్వదేవతాత్మకము; రక్తవర్ణము; వశీకరము. దకారైకారములు వరుసగా దుర్గావాగ్బీజములగుటచే శక్తిదేవతాకములు. అట్టి "దై" కారముతోఁగూడిన "దైవ్య"నామమును జపించువారికిఁ గష్టముల నతిక్రమించుశక్తియు, శత్రుదుర్గములను జయించుశక్తియును లభించును. అంతే కాదు. బ్రహ్మజ్ఞానసంపన్నులుకాఁగలరు. పై రెండువర్ణములను శ్యామస్ఫటిక వర్ణములైనకారణమున, సంకీర్ణరోగములను నివారించుశక్తియు జిత్తశుద్ధియును జపితలకేర్పడును. పై రెండువర్ణములును, సర్వార్థసిద్ధిజ్ఞానసిద్ధులనొసగున వగుటచే జపితలకు, లౌకికకార్యములందువలె అంతరంగికకార్యములందును. సిద్ధిచేకూరును. సహజస్వచ్ఛజ్ఞానము లభించును.

వకారము:— వరుణదేవతాకము.

యకారము:— వాయుదేవతాకము. పైరెండువర్ణములును సర్వదేవతాకమగు అకారముతోఁగూడినకారణమున "వ్య" వర్ణముగల పైనామమును జపించువారు జలోదరము, వాతరోగము మున్నగునవి లేక హాయిగానుందురు అంతేకాదు. మహాయోగులునుగా గలరు. వాయువరుణదేవతాసంయోగముగల నామమును జపించువారు, విజ్ఞానశాస్త్రమున, జలవాయుపరిశోధనలుగావించు వారలును, జలయానవాయుయాన నిర్మాణనిపుణులునుగాగలరు.

వ్యవర్ణము శుక్లకృష్ణరక్తవర్ణములుగలదగుటచే పైనామమును జపించువారు సూర్యతేజస్సులో గల శుక్లకృష్ణరక్తవర్ణకిరణముల ప్రభావమును బరిశోధించి, వానియుపయోగమును లోకమునకు జేకూర్పగలవారలగుదురు.

దైవ్యనామ జపమహిమచే జపితలైనభక్తులు వశీకరణశక్తిసంపూర్ణులై, శత్రుశక్తులనుచ్చాటనమొనర్ప గలరు. తాము .స్వయముగారోగములను బరిహరించుకొని, మహావైద్యులై, సకలప్రపంచరోగనివారకులుకా గలరు. జ్ఞానసిద్ధిద్వారా సర్వార్థసిద్ధినొందగలరు.

***9 వ నామము:—***

***శివ+విష్ణు— భిషక్:-***

(i) "భిషక్ = భయనాశనః" భయమును నశింపఁజేయువాఁడు; అను నర్థమును బరిశీలించినచో శివకేశవులిరువురును భక్తులభయమును నశింపఁ జేయువారే. మార్కండేయుఁడు, గజేంద్రుఁడు మున్నగువారిని రక్షించుటయే ఇందులకుఁదార్కాణము

(ii) "భిషక్ = వ్యాధితాపసంసారాదివ్యసనములకుఁ జికిత్సకుఁడు" అను నర్థమును బరిశీలించినచో శివకేశవులిరువురును సమస్తభక్తులవ్యాధు లను, తాపత్రయమును, సంసారకష్టములను దొలగించుటలో సమర్థులే. వారి రువురును భక్తులవ్యసనము లను దొలగించినవారే. కావుననే శివకేశవులు భక్తులపట్లనేకాదు. సకల జీవరాసులపట్లను జికిత్సకులే. భిషక్పదము విష్ణు సహస్రమునందు విష్ణుపరముగాఁ జెప్పఁబడెను. కావున శివకేశవులిరువు రును భిషక్పదముచేఁజెప్పఁబడుచున్నారనుట నిర్వివాదముకదా!

(iii) "భిషక్ = భీతికల్గునపుడు మనసాధ్యానింపఁ బడిపొందఁబడు చున్నాడు" అను నర్థమును బరిశీలించినచో జీవకోటియంతయును శివకేశవు లలో నేయొకరినో భయనివారణకై ప్రార్థించును అనువిషయము భక్తులచరిత్ర వలనఁ దెలియుచునేయున్నది.

(iv) "భిషక్ = దేహమును భేదించి, యనుగ్రహించువాఁడు" అను నర్థమును బరిశీలించినచో శివుఁడు వ్యాఘ్రాసురాదులనువలె, విష్ణువు అహ ల్యాదులను దేహభేదనముచేరక్షించెననునది వ్యక్తమగుచునేయున్నది, కాన ఏయర్థము ననుసరించిచూచినను, భిషక్పదము శివకేశవులకు జెల్లుననుట నిస్సంశయము.

వి. మూరి భాష్యము -

పరమ శివుఁడు భక్తులకుఁగల్గు సంసారరోగమును నివర్తించును; కావున భిషక్ నామకుఁ డాయెను.

*బీజాక్షరసంపుటి-*

"భిషక్ అను నామమున" "భ్ + ఇ + ష్ + అ + క్" అను ఐదు అక్షరములును, పంచతన్మాత్రలను, పంచభూతములను సూచించును.

భకారము:— భృగుదైవతాకము, రక్తవర్ణము, సర్వార్థసిద్ధిదము.

ఇకారము:— విష్ణుదైవత్యము, శ్యామవర్ణము, రక్షాకర ...

షకారము:— సూర్యబీజము; రక్తవర్ణము, సర్వార్థసిద్ధిదము.

అకారము:— సర్వదేవతాకము, రక్తవర్ణము, వశీకరము.

కకారము:— ప్రజాపతిబీజము, పీతవర్ణము, వృష్టికరము.

పై నామమున మూడక్షరములు రక్తవర్ణములు; ఒకటి శ్యామవర్ణము; మఱొకటి పీతవర్ణము. కావునఁ బైనామమును జపించువారు, రక్తదోషమునను, జెందిన రక్తపుఁబోటుమున్నగురోగములను, కామెలరోగములను, శ్యామలరోగమును, బోగొట్టుకొనుచుఁ దమజపప్రభావముచేఁ దననాశ్రయించినవారికి, అట్టి రోగములులేకుండఁగాపాడఁగలరు. అంతేకాదు. కుజశని సూర్యగ్రహముల వక్రీభవనముచేఁ గల్గునాపదలను వోఁగొట్టఁగలరు. కుజగ్రహమండలయాత్రచేయఁగలరు. భకారప్రభావమువలన జపితలు రాజనీతిజ్ఞులును, నూత్నవిషయపరిశోధకులునుగాఁగలరు. విష్ణుసూర్యబీజములైన ఇకారషకారములుగల పై నామమును జపించువారికి, రాజరికమువంటి యధికారము, పరిపాలనా దక్షతయునేర్పడును. జపితలు సకలకార్యసిద్ధినొంది, రక్షణసమర్థులుకాఁగలరు.

10 వ నామము-

శివ+విష్ణు "తామ్రః":-

"అసౌయస్తామ్రః" అను శతపథబ్రాహ్మణసూక్తిచేఁ దామ్రుడు అనగా ఎఱ్ఱనిరంగుతోఁగూడిన సూర్యుఁడని తెలియుచున్నది. నమక మంత్రమునుబట్టి రుద్రుఁడే తామ్రవర్ణుఁడైన సూర్యుఁడైనట్లు తెలియుచున్నది. తామ్రుఁడుఅనగా రోహితవర్ణముగలవాడుఁ, ఎఱ్ఱని వాడన్నమాట. రుక్మవర్ణము అనగా ఎఱ్ఱని బంగారురంగుఅనియుఁ జెప్పవచ్చును. తామ్రుఁడు అనగా బంగారురంగుగల వాఁడన్నమాట. పై రెండు అర్థములందును "సువర్ణవర్ణోహేమాంగః, వికరో రోహితోమార్గః" అను విష్ణుసహస్ర సూక్తులననుసరించి, తామ్రః అనగా విష్ణువు అనియునర్థమును జెప్పవచ్చును. "సదాపశ్యః, పశ్యతేరుక్మవర్ణః "అనుశ్రుతిచే శివకేశవరూపుఁడగు పరమాత్మ రుక్మవర్ణుఁడనగాఁ జెప్పబడుచున్నట్లు తెలియు చున్నది. కావునఁ దామ్రపదము శివకేశవులను ఇరువురని సమానముగా దెలియఁజేయునని తెలియుచున్నది

వి. సూరి :-

ప్రకృతినుండివచ్చు రజస్సుతోఁగూడి, తామ్రవర్ణుఁడగుటచే శివుఁడు, తామ్రనామకుఁడాయెను

బీజాక్షరసంపుటి:—

"తామ్రః" అను నామమున "త్+ఆ+మ్+ర్+అ" అనునైదు వర్ణములుకలవు, ఇవిపంచేంద్రియములను, పంచభూతములను సూచించును.

తకారము:— వాసుదైవత్యము, శ్వేతవర్ణము, సర్వజయప్రదము.

ఆకారము:— పరాశక్తిబీజము, శ్వేతవర్ణము, ఆకర్షకము.

మకారము:— మదనబీజము, శ్యామవర్ణము, సర్వజయప్రదము.

రేఫము:— వహ్నిబీజము, రక్తవర్ణము, సంహారకరము.

అకారము:— సర్వదేవతాబీజము, రక్తవర్ణము, వశీకరము పై నామమున శ్వేతవర్ణములైన అక్షరములురెండును, రక్తవర్ణాక్షరములురెండును, శ్యామవర్ణమొక్కటియునుగలవు. కావున ఈ నామమును జపించువారు, మిశ్రమవర్ణములుగల, మిశ్రమవ్యాధులను దొలగించుకొనఁగలరు. అంతే కాదు. వాస్తుశాస్త్రజ్ఞానమును, వశీకరణశక్తిని, సంపాదించుకొని, అగ్నిభేదము లను, వానివలన ప్రయోజనములను, దెలిసికొనగలవారలగుదురు. సర్వులను ఆకర్షించి, దుష్టశక్తులను సంహరించి, సర్వత్రవిజయముపొందగలవారలగుదురు.

## 11 వ నామము

### శివ - అరుణః :-

రుద్రుడే సూర్యుడు. అతడు ఉదయానంతరమున ఇంచుకంతయెఱ్ఱగా నుండును. కాన సూర్యరూపరుద్రునకు అరుణుడను నామముచెల్లును. ఉదయాదూర్ధ్వంరక్తః” అను భాష్యార్థమునననుసరించి, రక్తుడైనసూర్యుడు. అరుణుడు కాన రుద్రుడును అరుణుడేయగును.

### విష్ణు:-

అరుణుడనగా విష్ణువు అనియు జెప్పవచ్చును ఎట్లన? “లోహితో రోహితో రక్తః” అను నిఘంటువచనముచే, రక్తుడు, రోహితుడు అనునవి పర్యాయపదములు. “విక్షరోరోహితోమార్గః” అను విష్ణుసహస్ర సూక్తిచే రోహితుడనగా విష్ణువు అని తెలియుచున్నది

“స్వచ్ఛందతయారోహితాంమూర్తిం మత్స్యమూర్తిం, వహన్‌రోహితః” అను భాష్యవచనముచే, రోహితమైన మత్స్యమూర్తిని దాల్చుటచే విష్ణువునకు రోహిత నామము వచ్చినట్లు తెలియుచున్నది. కావున “రోహితః, రక్తః, అరుణః” అను పదములు సమానార్థకములే. అందుచే విష్ణువునకును అరుణుడను నామము చెల్లునని తెలియుచున్నది.

వి. సూరి. భాష్యము:-

"మహాదేవుడు విశేషమను నామాంతరముగల, తామసశక్తితోగూడి యుండుటచే "అరుణుడు" అను నామముకలవాడాయెను.

బీజాక్షరసంపుటి:-

"అరుణ" అను నామమున "అ+ర్+ఉ+ణ్+అ" అని యైదక్షరములుకలవు. ఇవి పంచమహాయజ్ఞములను పంచకోశములను సూచించును.

అకారము:- సర్వదైవత్యము, రక్తవర్ణము, వశీకరము.

రేఫము:- వహ్నిదైవత్యము, రక్తవర్ణము, సంహారకరము.

ఉకారము:— వాయుదైవత్యము, కృష్ణవర్ణము, రాజవశీకరము.

ణకారము:— నందిబీజము, రక్తవర్ణము, అర్థసిద్ధిదము. పై నామమున రెండు అకారములుకలవు. అకారము సర్వదేవతాకము. కావున పైనామము జపించువారికి సర్వదేవతా ప్రీతిలంభించును. అందుచేవారు సర్వత్ర విజయవంతులును, సర్వకార్యధురంధరులును అగుదురు.

అగ్నిదేవతాకమగు రేఫమిందున్నకారణమున పైనామము జపించువారు అగ్నిప్రమాదమును బోగొట్టుకొనగలరు. అంతేకాదు. ఓజోగుణసంపన్నులై, అగ్నిశక్తిసంపన్నములైన వస్తువులశక్తి సామర్థ్యములను తెలిసికొనగలరు. వాయుదేవతాకమైన ఉకారమున్నకారణమున పైనామము జపించువారు యోగశక్తిసంపన్నులగుదురు. నందిబీజమైన, ణకారమున్నకారణమున పైనామమును జపించువారు, పశుశాస్త్రజ్ఞులు, పశురోగసంహారకులు, పశుపోషకులును అగుదురు. పాడితోడిపంటగలవారలగుదురు. పై నామమున రక్తవర్ణాక్షరములు ఎక్కువగానున్నకారణమున పైనామము జపించువారు, రక్తరోగనివారకులగుదురు. రక్తవర్ణదేవతలను ప్రత్యక్షమొనర్చుకొనగల

వారలగుదురు. అంతేకాదు. పై నామము జపించువారు, సామాన్యవశీకరణ శక్తితోఁబాటు, రాజవశీకరులై, శత్రుసంహారకులై సకలపురుషార్థసిద్ధినొందఁ గలవారలగుదురు.

## 12 వ నామము

*శివ :- బభ్రుః :-*

బభ్రువర్ణమనగాఁ పింగళవర్ణము. అట్టి పింగళవర్ణముతోఁగూడిన సూర్యుఁడును రుద్రస్వరూపుడే. అతఁడు విశ్వమంతటిని మేల్కొల్పి, జ్ఞానము నొసఁగును. కావున అదిత్యరూపధారియైన రుద్రునకు "బభ్రుః" అనునామము చెల్లును. "విశ్వంబిభర్తి బోధన ప్రదానాదినా "అనువ్యుత్పత్తిచేఁ బైయర్థము లభించుచున్నది.

**విష్ణు:-**

బభ్రువు అను నామము శివునకువలె విష్ణువునకును జెల్లును. "రుద్రో బహుశిరాబభ్రుః" అను విష్ణుసహస్రసూక్తియే ఇందులకుఁ బ్రమాణము. "బిభర్తిలోకానితిబభ్రుః" అను శంకరభాష్యవచనముచే విష్ణువులోకులను, లోకములను దనతో భరించి, పోషించుచున్నాడని, తెలియుచున్నది. "పదు నాలుగు భువనంబులు, కుదురుగనీకుక్షిలోన" అను శ్రీకృష్ణశతకపద్యము నకుఁ బైవిషయమేప్రమాణము కావున బభ్రుపదముచే శివకేశవులిరువురును సమానముగనే చెప్పఁబడుచున్నారని తెలియుచున్నది.

**వి. సూరి :-**

పరమశివుఁడే భూతాత్మగానున్నవాఁడు. కావున బభ్రు నామకుఁడాయెను

**బీజాక్షరసంపుటి:—**

బభ్రు అను నామమున "బ్+అ+భ్+ర్+ఉ" అను నైదక్షర ములుకలవు. ఇవి పంచాగ్నులను, బంచకర్మేంద్రియములను సూచించును.

బకారము:— బకారము త్రిమూర్తి దేవతాకము, పీతవర్ణము సర్వార్థ సిద్ధిదము.

అకారము:— సర్వదేవతాబీజము, రక్తవర్ణము, వశీకరము.

భకారము:— భృగుదేవతాకము, రక్తవర్ణము, సర్వార్థసిద్ధిదము.

రేఫము:— వహ్నిబీజము, రక్తవర్ణము, సంహారకరము.

ఉకారము:— వాయుబీజము, కృష్ణవర్ణము, రాజవశీకరము అగ్ని వాయుసూర్యులు సకలసృష్టికిని మూలకారణులు. సూర్యుఁడు త్రిమూర్తి స్వరూపుఁడు. పైనామమున "బ"కారము త్రిమూర్త్యాత్మకము. అనగా సూర్యశక్తి సంపన్నమన్నమాట. దానికిఁతోడు, 'అ'కారము సర్వదేవతాక మొకటికలదు. రేఫము అగ్నిదేవతాకము. 'ఉ'కారము వాయుదేవతాకము. కాన పైనామమును జపించువారు అగ్నివాయుసూర్యశక్తిసంపన్నులై, సకలవస్తువులను గ్రొత్తగాసృష్టించఁగలరు. రక్షింపగలరు. నశింపఁజేయగలరు. అగ్నిమాంద్యాదులను, వాతరోగాదులను దొలగించుకొనగలరు. తొలగించగలరు. తామారోగ్యవంతులై అరోగ్యమును సర్వులకు జేకూర్పగలరుకూడ.

ఇందు భృగుదేవతాకమైన "భ"కారముకలదు. భృగువు అనగా శుక్రుడు. విద్యాకారకుడు. రాజనీతివేత్త. కాన భకారయుక్తమగు పైనామమును జపించువారు, రక్తదోషరోగరహితులగుటతోబాటు, సూర్యునిరక్తకిరణ ప్రభావమును గుర్తించగలవారలగుదురు. పై నామమున "బ"కారము పీత వర్ణము; "ఉ"కారము కృష్ణవర్ణమునగుటచే పైనామమును జపించువారు, సూర్యకిరణములందలి, పీతకృష్ణవర్ణప్రభావము నెఱుగగలరు. పీతకృష్ణవర్ణ రోగనివారకులు, కాగలరు. రాజవశీకరులు, వశీకరణశక్తిసంపన్నులునై, సర్వార్థసిద్ధినొందగలరు.

## 13 వ నామము-

### శివ :- సుమంగళః:-

సూర్యస్వరూపుడగు రుద్రుడు, పాపపరిహారకుడును, సర్వరోగనివారకుడనై జీవులకు సర్వమంగళముఃనొసగుచు, సర్వమంగళసమృద్ధుడైయుండును కాన రుద్రునకు "సుమంగళః"అను నామముచెల్లును.

### విష్ణు

"సుమంగళః" అను నామము విష్ణువునకునుజెల్లును ఎట్లన? "పవిత్రంమంగళంపరమ్" అనెడి విష్ణుసహస్రసూక్తిచే "పరంమంగళం'' అను నామము విష్ణువునకున్నట్లు తెలియుచున్నది. ఇందలి "పరం" అను పదమునకు ఉత్కృష్టుడని యర్థము. "సుమంగళః" అను నామమందలి "సు" అను ఉపసర్గమునకు ఉత్కృష్టుడనియే అర్థము సుమంగళుడనగా ఉత్కృష్టుడుకాన, సు = సుష్టుగా అనగాస్మరించినమాత్రాన జీవులకు అశుభములనుదొలగించి, మంగళః = శుభములను జేకూర్చును అని యర్థము "పరంమంగళం" "సుమంగళః" అను రెండుపదములును ఒకేయర్థమును బోధించును. కాన "సుమంగళః" అను నామము విష్ణువునకునుజెల్లును.

### వి. సూరి :-

పరమమంగళరూపుడగుటచే శివుడు సుమంగళనామకుడాయెను.

### బీజాక్షరసంపుటి:-

"సుమంగళః" అను నామమున "స్+ఉ+మ్+అ+మ్+గ్+అ+ళ్+అ" అని తొమ్మిదక్షరములుగలవు. అవి, నవదుర్గలను, శరీరమందలి నవద్వారములను సూచించును.

సకారము:— శక్తిబీజము, రక్తవర్ణము, స్థితికరము.

ఉకారము:— వాయుదేవతాకము, కృష్ణవర్ణము, రాజవశీకరము.

మకారము:— సదసద్దైవత్యము, శ్యామవర్ణము, సర్వజయప్రదము.

●కారము:— సర్వదేవతాకము, రక్తవర్ణము, వశీకరము.

గకారము:— గాణాపత్యము, రక్తవర్ణము, విఘ్ననాశనము.

శకారము :— ఆత్మతత్త్వము, రక్తవర్ణము, సర్వసిద్ధిదము.

పైనామమున అకారత్రయమును, శక్తిబీజమైన సకారముతోడను, ఆత్మతత్త్వమైన శకారముతోడను, వాయుదేవతాకమైన ఉకారముతోడను, జ్ఞానదాయకమై, విఘ్నపరిహారకమగు, గకారముతోడను, సర్వకామదమగు మకారద్వయముతోడను గూడియుండుటచే, దానిని యోగమున ప్రాణాయామ పద్ధతి నలవరచుకొని, జపించు భక్తులు, తమ సహస్రారమున ప్రకృతి పురుషులను వేర్వేరుగను, సమిష్టిగను గాంచగలరు. ఆత్మతత్త్వమును అవగాహన మొనర్చుకొను జ్ఞానులు కాగలరు. మకారద్వయమున్నకారణమున పైనామము నుపాసించువారు, తొలుత ఐహికకామములను, సంపూర్ణముగా నొంది, పిదప జ్ఞానులగుదురు, ఆత్మశక్తినలవరచుకొన్నకారణమున అష్టవిధ ప్రకృతిలోగల విజ్ఞానశాస్త్ర విషయములనెఱిగి, వానిలాభములను లోకమున ప్రకటింపగలరు

పైనామమున రక్తవర్ణాక్షరములు అరుగలవు. కావున పైనామమును జపించువారు, యోగశక్తిచే, రక్తవర్ణములైన గ్రహమండలములలో సంచరించి అటనుండు విశేషములను దెలిసికొనగలరు. అంతేకాదు. శ్యామకృష్ణవర్ణము లైన అక్షరములు మూడుకలవు. అందుచే పైనామమును జపించు భక్తులు సూర్యరూపరుద్రునిలోగల కృష్ణవర్ణ కిరణప్రభావమును బాగుగా దెలిసికొన గలరు. స్థితిశక్తి గతిశక్తి సంపన్నులై రాజాధిరాజులను సైతము వశపఱచుకొని సర్వత్ర విజయము బొందగలరు.

## 14 వ నామము:— శివ:-

### నీలగ్రీవః :-

గరళము కంఠమందుండుటచే శివుని గ్రీవము నీలమాయెను. అందుచే శివుడు నీలగ్రీవుడు. అంతేకాదు, సూర్యరూప రుద్రునకు నీలగ్రీవ నామముచెల్లును. ఎట్లన? "గ్రసన్త్యుదకమ్" అను వ్యుత్పత్తిచే నీరమునుద్రాగు కిరణములకు గ్రీవ అను నామము కలదు నీలమైన గ్రీవము కలవాడగుటచే, సూర్యరూప రుద్రుడు నీలగ్రీవుడాయెను.

### విష్ణు :-

నీలగ్రీవ పదము విష్ణువునకు జెల్లును. ఎట్లన?

"ధ్యేయస్సదాసవితృమండల మధ్యవర్తీ నారాయణః"

అను సుకవి సూక్తిని బరిశీలించినచో సూర్యమండలస్థ విష్ణువే, నారాయణుఁడనియు, అతడే సూర్యరూపమున వెలుగుచున్నాడనియు దెలియుచున్నది. సూర్యుఁడు త్రిమూర్తి స్వరూపుడు. కావున రుద్రుఁడును సూర్యుఁడును ఒకటే యైనట్లు, విష్ణువును సూర్యుఁడును ఒకటేయన్నమాట. అందుచే సూర్యనామములు విష్ణువునకునుజెల్లును, కావున విష్ణువు నీలగ్రీవుఁడేయన్నమాట. సూర్యకిరణములవలె, విష్ణుకిరణములును నల్లనివే. కావుననే విష్ణువునకు "కృష్ణః" అను నామమువచ్చెను. అందులకు "అగ్రాహ్యః శాశ్వతః కృష్ణః" అను విష్ణుసహస్రసూక్తియే ప్రమాణము.

### బీజాక్షరసంపుటి:-

"నీలగ్రీవః" అను నామమున "న్ + ఈ + ల్ + అ + గ్ + ర్ + ఈ + వ్ + అ" అని తొమ్మిదక్షరములుకలవు. అవి నవబ్రహ్మలను, శరీరస్థ నవద్వారములను సూచించును.

నకారము:— సావిత్రీదేవతాకము, స్ఫటికవర్ణము, పాపనాశనము.

ఈకారము:— మాయాశక్తిబీజము, వశీకరము.

లకారము:— పృథివీతత్త్వము, పీతవర్ణము, స్తంభనము.

అకారము:— సర్వదైవత్యము; రక్తవర్ణము, వశీకరము.

గకారము:— గాణాపత్యము, రక్తవర్ణము, విఘ్ననాశనము.

రేఫము:— వహ్నిబీజము, రక్తవర్ణము, సంహారకరము.

ఈకారము:— మాయాశక్తిబీజము, వశీకరము.

వకారము:— వరుణబీజము, శుక్లవర్ణము, రోగనాశనము. పైనామమున, రెండకారములు, రెండీకారములునుగలవు. వానికిఁదోడు సావిత్రీదేవతాకమైన "న"కారముకలదు. అకారము త్రిమూర్త్యాత్మకము. ఈకారద్వయమును, నకారమును శక్తిదేవతాకములు. కావునఁ బైనామమును జపించువారు శక్తిపురుషులను సమానముగా నారాధించువారగుదురు, శక్తిశక్తిమంతుల కభేదమును తెల్పుశాక్తేయులకుఁ బైనామము, ముముక్షువులకిని ఉపాస్యమన్న మాట. అంతేకాదు. పైనామమున వహ్నిదేవతాకమైనరేఫము కుండలినీ శక్తిని సూచించును. పృథివీతత్త్వమైన లకారము, మూలాధారమును సూచించును. కావున ఉపాసకులు, మూలాధారమునుండి కుండలినీ శక్త్యుత్థాపన మొనరించి, సహస్రారముచేర్చి, శక్తిశక్తిమంతులనారాధింతురు వారికి యోగమునఁ గల్గు విఘ్నములను, గాణాపత్యమైన గకారమునుపాసించి, తొలగించుకొందురు. వరుణదేవతాకమైన వకారముయొక్క ప్రభావముచే ఉపాసకులపై అమృతసేచనము జరుగుచు. అపుడువారు ఆనందాబ్ధినోలలాడి, పరబ్రహ్మసాక్షాత్కారమునొందుదురు. కావున మహాప్రభావమైన "నీలగ్రీవ" నామము అత్యుత్తమమనితెలియుచున్నది.

స్ఫటికవర్ణమును, సావిత్రీదేవతాకమునైన "న కా ర ము యొ క్క" ప్రభావముచే ఉపాసకులు, తమపాపములు పోగొట్టుకొని, దివ్యతేజస్సంపన్నులై, అపమృత్యువును దొలగించుకొనుటయేకాక, సావిత్రీదేవివలెఁ బరులకును ప్రాణభిక్షనిడఁగలరు. సవిత అనగా సూర్యుఁడు. సవితృదేవతాకమైన, నకారమున, రోగనివారకశక్తికలదు. కావున ఉపాసకులు, నీరోగులగుదురు. పైనామమును జపించువారు, సూర్యకిరణములలోఁ గలరోగనివారకశక్తిని గనుగొనఁగలరు. వశీకరణశక్తికల ఈకారము మాయాశక్తిబీజమగుటచే, ఈకారముతోఁగూడిన ఈ నామమును జపించువారు భూతప్రేతపిశాచబాధలను బోఁగొట్టఁగలరు.

లకారము పీతవర్ణమును స్తంభనశక్తిసంపన్నమునై పృథివీబీజమునైయున్నది. కావునఁ బైనామమును జపించువారు, పీతవర్ణముగల రసాయనికపటద్ధములనుగన్నులకుఁ దగల్చుకొని, భూగర్భపరిశోధనసల్పి, లోహములున్నగువానిని భూసారభేదమును తెలిసికొనఁగలరు.

గకారము:— గాణాపత్యము, రక్తవర్ణము, విఘ్ననాశనము నగుటచే గకారముతోఁగూడిన నామము జపించువారు శత్రుభంజకులై, అడ్డంకులు తొలగించుకొని, రక్తవర్ణముచే సూచితమైన రజోగుణమునకు అలంబనులై సేనానాయకత్వమునుగాని, రాజరికమునుగాని, నిర్వహింపఁగలరు.

రేఫము:— వహ్నిబీజము; రక్తవర్ణము, సంహారకరమునగుటచే, రేఫముతోఁగూడినపైనామమును జపించువారు శత్రుసంహారకులగుటయేకాక, విషక్రిమిసంహారకులునై వహ్నితోనడుచుయంత్రములను గనుగొనఁగలరు.

వకారము:— వరుణాదేవతాకము. శుక్లవర్ణము రోగనాశనకరమునగుటచే వకారముగల ఈ నామమును జపించువారు, రోగనివారకులై వరుణాధిపత్యముగల జలమునఁ బ్రయాణింపఁగలవారునుగాఁ గలరు.

*15 వ నామము;— శివ- సహస్రాక్షః—*

"అసౌయోఽవసర్పతి" అను మంత్రముచే మహాదేవుఁడు సూర్యుఁడై నట్లు తెలియుచున్నది. అటులనే "నమో అస్తునీలగ్రీవాయసహస్రాక్షాయమీఢుషే" అను మంత్రముచే మహాశివుఁడు ఇంద్రరూపుఁడు, పర్జన్యరూపుఁడునైనట్లు తెలియుచున్నది, సమిష్టిగానున్నజీవచైతన్యమంతయు, శివస్వరూపమైనందున శివుఁడు వేలకొలది అక్షులుకలవాఁడై సహస్రాక్షుఁడైనట్లు "సహస్రశీర్షాపురుషః" అను పురుష సూక్తమంత్రము వలనఁ దెలియుచున్నది. ముఖాదింద్రశ్చాగ్నిశ్చ" అను మంత్రమువలనఁ బరమాత్మముఖమునుండి ఇంద్రుఁడును, అగ్నియును ప్రభవించినట్లు తెలియుచున్నది. పరమాత్మాంశయే, శివుఁడు ఆ శివుఁడే ఇంద్ర రూపుఁడై జీవులకైశ్వర్యమునొసంగుచున్నాడు; అను విషయము, ఇంద్రోసరోనే మధిశాహవంతే" అను శ్రుతివలనఁ తెలియుచున్నది. అయింద్రుఁడే అహల్యా కాముకుఁడై గౌతమశాపముచే, సహస్రాక్షుఁడైనట్లు (వేయికన్నులుకలవాఁడై నట్లు) తెలియుచున్నది. కావునఁబైకారణములచే మహాదేవునకు సహస్రాక్ష నామముచెల్లుచున్నది.

విష్ణు-

"ఉదీర్ణస్సర్వతశ్చక్షుః" సహస్రాక్షస్సహస్రపాత్" అనెడివిష్ణు సహస్ర సూక్తులచే" సహస్రాక్ష" అను నామము , విష్ణువునకును జెందినట్లు తెలియు చున్నది. శివునివలె విష్ణువును సమష్టిజీవచైతన్యమైనట్లు తెలియుచున్నది. అందుచే జీవుల అక్షులన్నియును విష్ణువునకుఁ జెందినవే యన్నమాట కావున విష్ణువు సహస్రములకొలది అక్షులు కలవాఁడాయెను.

"సహస్రాక్ష" అను నామమునగల అక్షీపదమువ్యాకరణముచే "అక్ష"పదముగామారును. అక్షపదమునకు ఇంద్రియమనియు నర్థము కలదు

ఆ పక్షమున సహస్రములకొలది, అక్షులు అనగా ఇంద్రియములు కలవాఁడనియు నర్థముచెప్పవచ్చును. అదియును విష్ణువు సమష్టిచైతన్య స్వరూపుఁడనియే తెలియఁజేయును. కావుననే స్వచైతన్యముతో సమస్తమునుజూచుచు, సర్వతశ్చక్షుఁడాయెను. "విశ్వతశ్చక్షురుత విశ్వతస్పాత్" అనెడి నారాయణ శ్రుతియే పైవిషయమునకుఁ బ్రమాణము. కావున సహస్రాక్ష అను పదము శివకేశవులిరువురిని బోధించునని తెలియుచున్నది.

వి. సూరి :-

ప్రకృతియొక్క ప్రధాన విక్షేపశక్తియేవృత్తి ఆట్టి వృత్తిచేఁ బ్రతిబింబిత మైన చైతన్యమే అక్షము అట్టి అక్షములు సహస్రములకొలదికలవాఁడు కావున శివుఁడు సహస్రాక్షుఁడాయెను.

బీజాక్షరసంపుటి:-

"సహస్రాక్షః" అనునామమున స్ + అ + హ్ + అ + స్ + ర్ + అ + క్ + ష్ + అ" అని పదక్షరములుకలవు. అవి దశదిశలకును ఉపలక్షకములు. పదేంద్రియములనుగూడసూచించును పైనామమునఁ బదివర్ణములుకలవు. వానిలో అకారము మూఁడుసార్లువచ్చెను. అదిసర్వదైవత్యము. అనగాఁ ద్రిమూర్త్యాత్మకము. ఇందుఁ బరాశక్తిబీజమైన "అ"కారము, ప్రాజాపత్యమైన "క"కారమునుగలవు. కావున శక్తిసహితపురుషుఁడైన, ప్రజాపతియైన పరమాత్మయొక్క సాక్షాత్కారముకోరువారికి, పైనామమును జపించుట అతి ముఖ్యము వరికింగాఁ బరాశక్తియే పరాప్రకృతి. పరాశక్తిసృష్టికార్యమున ఇచ్ఛాక్రియాజ్ఞానశక్తిస్వరూపయై, సృష్టిలో బ్రహ్మాండమునఁ బ్రతిష్ఠింపఁబడిన హిరణ్యగర్భునకు సహకారిణియై, శక్తి నామమున వ్యవహరింపఁబడుచున్నది. ఆ హిరణ్యగర్భుఁడే శివుడు. అట్టి శివశక్తులనుదెలియఁజేయు, సకారద్వయము, హకారమును, అకారత్రయమునుగలవు దానికితోడు వహ్నిదేవతాకమైన "రేఫము", సూర్యదేవతాకమైన "షకారమును" గలవు. కావున పైనామ

మును జపించుట. శాక్తేయులకువలె, సామాన్యులకును అతిప్రధానమే. ద్వాదశాత్మకుడైన సూర్యుడు ఇందు షకారముచే సూచింపబడుచున్నాడు. అతడే జీవులలో పింగళానాడిగానున్నవాఁడు. అగ్నికుండలినీ స్వరూపము. పింగళా మార్గమున కుండలినీ శక్తిని ఆరాధించుట ముఖ్యమను విషయము పైనామముచేఁ దెలియుచున్నది.

సృష్టికిమూలకారణులు సూర్యాగ్నివాయువులు. వారిలో రేఫముచే అగ్నియును, షకారముచే సూర్యుఁడును, దెలియజేయబడుచున్నారు. "తన్మధ్యపతితః తద్గ్రహణేనగృహ్యతే" అను న్యాయముచే సర్వదైవత్యమగు అకారముచేవాయువుచెప్పఁబడినట్లు తెలియుచున్నది "అగ్నిర్వాయుశ్చసూర్యశ్చ" అనెడి అరుణమంత్రపుటర్థమును బరిశీలించినచో, పైమువ్వురిచే సృష్టి జరుగుచున్నట్లును, వారిలో సూర్యుడు దివమునుండియు, వాయువు అంతరిక్షమునుండియు, అగ్నిపృథివిపైనుండియు, జీవులను రక్షించుచున్నట్లు "సూర్యోనోదివస్పాతువాతో అంతరిక్షాత్" అనెడి సౌరమంత్రమువలన దెలియుచున్నది. కావున పైనామమును జపించువారికి పైమువ్వురి శక్తులును సంక్రమించును. పైమువ్వురును శివకేశవస్వరూపులే. అందుచే పైనామమును సదా, ఉపాసించుట ముఖ్యమని తోఁచుచున్నది పైనామమునపేరురక్తవర్ణాక్షరములుకలవు. అందుచే దానిని జపించువారికి రక్తపుపోటు మున్నగు జబ్బులుతొలగునని తెలియుచున్నది

శుద్ధస్ఫటికవర్ణమైన "హకారమును", పీతవర్ణమైన "రకారమును" గల పైనామమును జపించువారు, పీతవర్ణరోగములను, పాండురోగమును దొలగించుకొనగలరు. పైనామమును జపించువారు అష్టసిద్ధులను బొంద గలరు. నిలకడనొందినవారై సమస్తమును వశమున నుంచుకొనగలరు. పరాయుధములనాకర్షించు విద్యుచ్ఛక్తి పరికరములను సంగ్రహించుకొని, వ్యతిరేకశక్తులను సంహరించుకొనగలరు దీనిని జపించి, అనావృష్టినిదొలగించి, సకాలవర్షములు కురిపించి, సర్వార్థసిద్ధులను సంపాదించుకొనగలరు.

16 వ నామము- శివ- (1) శివః:-

"అనగా శాంతుడనియర్థము. అంతఃకరణవిజేతలలో అగ్రేసరుఁడై దుష్టసంహారమొనర్చి, శాంతముస్థాపించెను. కావున శివుఁడాయెను.

(ii) "శామ్యతి పరమానందరూపత్వాత్ నిర్వికారోభవతీతి శివః" అను వ్యుత్పత్తిచే బరమానందరూపుడై నిర్వికారుఁడగుటచే శివుఁడాయెనని తెలియుచున్నది.

(iii) "శేరతేసజ్జనమనాంసి అస్మిన్నితివాశివః" అనువ్యుత్పత్తిని బరిశీలించినచో సజ్జనమనస్సులాతనిలో లీనమగుటచే, శివుఁడైనట్లు తెలియు చున్నది.

(iv) "శేతేసజ్జనమనసీతివాశివః" అను నర్థమును బరిశీలించినచో మార్కండేయాది భక్తులమనస్సులో మెలగువాఁడుకాన శివుఁడైనట్లు తెలియు చున్నది.

(v) "శివం = కల్యాణం, తద్యోగాద్వాశివః" అను నర్థమును బరి శీలించినచోఁ గల్యాణయోగమువలన శివుడైనట్లుదెలియుచున్నది. పైనఁ బేర్కొ నిన భాస్కరాచార్యప్రోక్తమైన అర్థపంక్తిమునననుసరించి, మహాదేవునకు శివుఁడను నామము చక్కగా అమరియున్నది.

విష్ణు :- "శివుడు" అను నామము విష్ణువునకెట్లుచెందునో పరిశీ లించెదముగాక.

"సర్వశ్శర్వశ్శివస్థాణుః" అనెడి విష్ణుసహస్రసూక్తిలో శివనామము విష్ణుపరముగాఁ బేర్కొనబడెను. అంతేకాదు. భాష్యమున "నిస్త్రైగుణ్యత్వేన శుద్ధత్వాత్ హరశ్శివః" అని శంకరాచార్యులవారు పేర్కొనినకారణమునఁ బరిశీలించినచో విష్ణువు సత్త్వరజస్తమోగుణశూన్యుఁడై శుద్ధుఁడగుటచే, విష్ణువు

నను శివనామమునుచెల్లునని తెలియుచున్నది. శివకేశవులిరువురును, సిస్త్రి గుణ్యులైన శుద్ధులేకాక శివనామము శివకేశవులిరువురకును జెందునని చెప్ప వచ్చును. "సబ్రహ్మాసశివఃసహరిః" అనుశ్రుతి శివకేశవాభేదమును దెలియఁ జేయుచున్నది. కాన "శివ" అను నామముచే హరిహరులు ఇరువురును జెప్పఁబడుదురు.

పైవ్యుత్పత్తులతో జోడించి ఈ విషయమును వ్రాయవలెను

(i) గజేంద్రరక్షణమున "మనోబుద్ధిచిత్తాహంకారములజయించి,దుష్ట మైనమొసలిని సంహరించియు, కుచేలు నాదరించు సమయమున దుష్టమైన దరిద్రమును దొలగించియు, బైయిరువురినిగాపాడెను శాంతస్థితిని జేకూర్చెను కాన విష్ణువునకు శివనామముచెల్లును అట్లే శివుఁడును భక్తులను రక్షించి, శాంతస్థితిని జేకూర్చెనుగాన శివుఁడాయెను.

(ii) హరిహరులిరువురును సచ్చిదానంద స్వరూపులై, నిర్వికారులై యున్నవారే. భక్తరక్షణక్రియలో ఇరువురును దాత్కాలికవికారమందినను, శాశ్వతస్వరూపమునవారిరువురికిని, వికారములేదని చెప్పవచ్చును. కావున ఇరువురును శివనామకులే.

(iii) మూఁడవ పదార్థమును బరిశీలించినచో గజాసురాది భక్తుల మన స్సులు శివునిలో లీనమైనట్లు, ధ్రువాదిభక్తులమనస్సులు, విష్ణువులో లీనమై నవి. కావున ఇరువురును శివులే.

(iv) నాల్గవపదార్థమును బరిశీలించినచో మార్కండేయాది భక్తుల మనస్సులలో శివుఁడు మెఱయునట్లు ప్రహ్లాదాదిభక్తులమనస్సులలో విష్ణువు మెఱయుచున్నాడు. కాన ఇరువురును శివులే.

(v) ఐదవపదార్థమునరయుచుంచి, కల్యాణయోగము హరిహరులు ఇరు వురంలోను గలదు. కాన ఇరువురును శివులే.

వి. సూరి :- సాక్షిత్వముచే ఆక్రమింపఁబడని శుద్ధప్రత్యక్ చైతన్యమే శివుని స్వరూపము. అట్టి రూపమున జీవులకుఁ బరమానందమును అతఁడు చేకూర్చును. కావున శివుఁడను నామముసార్థకమాయెను.

*బీజాక్షరసంపుటి:-*

"శివః" అను నామమున "శ్+ఇ+వ్+అ" అను నాల్గుక్షరములు కలవు. పైనామమున లక్ష్మీనారాయణదేవతాకములైన శకారేకారములుగలవు అందుచేఁ బైనామమునుజపించువారు లక్ష్మీనారాయణకటాక్షపాత్రులై సంపద నొంది సర్వులను సంరక్షింపఁగలరు. అందులకుఁదోడు పైరెండువర్ణములును వ్యోమశ్యామవర్ణములగుటచే దానిని జపించువారు, శరీరనాళములందు రక్త ప్రసరణమును జక్కగానంది, శ్యామలరోగమును నివారించుకొనగలరు. ఇతరులను సైతముపైరోగమునుండినివారింపఁగలరు.

సర్వదేవతాకమైన అకారముతోఁగూడిన వకారము, వరుణదేవతాక మందుఁగలదు. కానఁబైనామము జపించువారు, వరుణదేవతాప్రీతినంది, సకాలమునవర్షములుకురిపించి, సర్వులరోగములను రూపుమాపి, సకల జనులను వశమొనర్చుకొనగలరు. ఐశ్వర్యారోగ్యకాములు, పైనామము జపించుట మంచిది

## *17 వ నామము;— శివ- కపర్దీ;—*

"క+పర్దీ" క = శిరస్సున, పర్దము = నిండియున్నది. అనగా జటా జటారూపమున శిరస్సునావరించియుండునది, అదికలవాఁడు కపర్ది. పరమ శివుని నివాసము, క = అనగా శిరస్సు. శిరస్థానీయమైన సహస్రారమన్న మాట. దాని నావరించియుండునది జటాజూటారూపమైన మాయ. అట్టి మాయ కల్గియు, దాని నంటకయుండువాఁడే కపర్ది. పరమ శివుడు. అంతేకాదు. క = గంగాజలముచే, పర్దీ = పరిశుద్ధముచేయఁబడువాడు. అనగా జీవరూప

మున నున్నపుడు పరమాత్మయైన శివునకు అంటినమలము గంగాజలముచే తొలగింపఁబడును, అందుచేఁ బరిశుద్ధమైన వాడన్నమాట ఈ విధముగా "కపర్ది" పదము శివునకుఁ జెందియున్నది.

**విష్ణు:-** కపర్ది = విష్ణువు అనియుఁ జెప్పవచ్చును. ఎట్లన? "కం శిరోజలయోః" అను నిఘంటువుచే "క" శబ్దమునకు శిరస్సు, జలముఅని రెండర్థములుగలవని తెలియుచున్నదికదా! జటాజూటరూపమగుమాయచే శివుని శిరస్సు, ఆవరింపఁబడినట్లే, మయూరపింఛముచే విష్ణువు శిరస్సు, ఆవరింపఁబడియుండును. శివకేశవులిరువురును ఏకరూపులే. సహస్రారనివాసులే. సహస్రారము శిరస్థానీయము. సహస్రారనివాసులైన శివకేశవులు, మాయారూప జటాజూటమయూరపింఛములచే ఆవరింపఁబడి, ఆచ్ఛాదితులై జగంబులకుఁ గానరాకయున్నారు. కాన కపర్దిపదము శివకేశవులిరువురకును సమానముగనే చెందియున్నదని చెప్పవచ్చును అంతేకాదు క = అనగా జలము ప = పూరము. శిరస్సునగలగంగా జలపూరముచే హిరణ్యగర్భరూప శివుఁడు పరిశుద్ధుఁడైనట్లు, స్వపాదోద్భవమైన గంగాజలపూరముచే హిరణ్యగర్భరూప విష్ణువు పరిశుద్ధుఁడగుచున్నాడు. కావున "కపర్ది"పదము అర్థద్వయమునందును శివకేశవులు ఇరువురకును సమానముగనే చెందియున్నది.

**విష్ణు - సూరి - భాష్యము:-** కేశాదులవలెనుండు సూక్ష్మతమవాసనా సమూహమునకు "గపర్ద"మను నామముకలదు. చతుర్విధవృత్త్యాశ్రయమైన అంతఃకరణమునకును, "కపర్దమ"ను నామముకలదు. వానితోఁ దాదాత్మ్యముపొంది, అట్టి కపర్దము కలిగియుండుటచే శివుఁడు కపర్దినామకుఁడాయెను.

*బీజాక్షరసంపుటి:—*

"కపర్దీ" అను నామమున "క్ + అ + ప్ + అ + ర్ + ద్ + ఈ" అని

యేవతరము లుండవు. అవి శరీరస్థసప్తధాతువులను సప్తవాయుమండలములను సూచించును.

సర్వదేవతాకమైన "అకారము"తోఁగూడిన కకారము, ప్రాజాపత్యము. అట్టికకారముగల పైనామమును జపించువారు, సంతానహీనులైనచో సంతానవంతులును, జ్ఞానహీనులు బ్రహ్మజ్ఞానసంపన్నులునుగా గలరు. కకారము పీతవర్ణముగుటచేతను, అకారము రక్తవర్ణముగుటచేతను, పైనామమును జపించువారు, రక్తక్షీణతచేగల్గు పీతవర్ణరోగమైన కామెలరోగమునుదొలఁగించుకొనగలరు. పైనామముజపించి, వర్షముకురిపించి, సస్యవృద్ధిచేసి, సర్వులను వశమొనర్చుకొనగలరు. పర్జన్యదేవతాకమైన పకారముకూడ పైనామమునగలదు. కాన దానిని జపించువారు, కృత్రిమమేఘములను సైతము సృష్టింపగలవారై వృష్టిమూలమున సస్యములు ఫలించునట్లుకావించి, ఆహారవృద్ధిని, ఆరోగ్యశుద్ధిని జేకూర్పగలరు.

అగ్నిబీజమైన రేఫము రక్తాభము, సంహృతికరము

దుర్గాబీజమైన దకారము శ్యామవర్ణము, సర్వార్థదము. పైరెండువర్ణములును, మాయాబీజమైన ఈకారముతోగూడియున్నవి. దుర్గాసూక్తము ననుసరించిచూచినచో దుర్గయువహ్నియు నొక్కటే. దుర్గాగ్నులిరువురును మాయావృతులే. అందుచే పైవర్ణములుగల పైనామమును జపించువారు దుర్గారూపమైన కుండలినీ శక్తిని, ప్రాణాయామోద్దీపితమగు అగ్నిచే విజృంభింపఁజేసి, శరీరస్థశత్రు శక్తులను సంహరించి, సర్వత్రసిద్ధినొందగలరు. బాహ్యప్రపంచమునసైతమువారికే విజయము ప్రాప్తించును. పైనామము జపించువారు అగ్నిభేదములను, వానిచే ప్రకృతిలోగల్గుఫలితములను గుర్తింపఁగలరు. బాహ్యశత్రువులను సైతము అగ్నిశక్తిసంపన్నాయుధములచే హతమార్చి, సర్వులను వశపఱచుకొందురు.

ఇంతవరకునుగల మంత్రనామములు పదునేడింటికిని మంత్రార్థమున యజ్ఞపరమగునర్థముకలదు మిగిలిన అర్థపక్షయము వివరించినిరూపింప బడెను.

ఇటుపైని అనుక్రమమునవచ్చు మంత్రము "నమస్తే" అస్తుభగవన్ విశ్వేశ్వరాయమహాదేవాయ, త్రయంబకాయ, త్రిపురాంతకాయ, త్రికాగ్ని కాలాయ, కాలాగ్నిరుద్రాయ, నీలకంఠాయ, మృత్యుంజయాయ సర్వేశ్వరాయ, సదాశివాయ, శంకరాయ, శ్రీ మహాదేవాయనమః" అనెడి మంత్రముయొక్క అర్థము పర్యాలోచింపబడును. పైమంత్రమున బదునొకండు నామములు గలవు. అవి ఏకాదశరుద్రులనుసూచించును. వాని యర్థములను వానిమహిమను బరిశీలించెదము. ఈ నామములకు విష్ణుసూరిగారి భాష్యములేదు. వారి మతమునకుజెందిన విషయములు ఈ అర్థములందే, యథామతి, సూచింపబడినవి. యజ్ఞపరమగునర్థమును వినియుండేకలదు.

ఇందు "భగవన్" అను పదముచే సదాశివుడు సంబోధింపబడెను. "ఉత్పత్తించవినాశంచ" ఐశ్వర్యస్యసమగ్రస్య అను రెండు శ్లోకములందు జేర్కొనబడిన "భగ"శబ్దము, "భగవ"చ్ఛబ్దమును శివకేశవులకు, ఇరువుర కును సమముగానే వర్తించును. భగ భగవచ్ఛబ్దార్థములు ఇంతకుముందు వివ రింపబడెను. ఇకమిగిలిన నామములకు శివ విష్ణు బీజాక్షరసంపుటితపరముగా నున్న యర్థములను యథాశక్తి నేను వ్రాయుచున్నాను. గమనించెదరుగాక.

***(1) విశ్వేశ్వరః :-*** విశ్వమనగా అండాండపిండాంత బ్రహ్మాండములతో నిండిన పదునాల్గుభువనముల సమష్టిరూపము అనంతము పరమాత్మనుండి బహిర్గతమైన ప్రకృతియొక్క విలాసము. "మమయోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భందధామ్యహమ్" అను గీతాసూక్తిలో చెప్పబడిన మహద్బ్రహ్మయే ప్రకృతి. అదియే విశ్వము. అందు అష్టైశ్వర్యయుక్తుడైయుండి నడుపునట్టి ప్రభువే విశ్వేశ్వరుడు. ఆతడు శివకేశవస్వరూపుడే. కావున విశ్వేశ్వరనామము శివకేశవులిరువురకిని సమానముగానే చెల్లుననుట నిర్వివాదముకదా!

"విశ్వం విష్ణుర్వషట్కారః" అను విష్ణుసహస్రనామోక్తిలోఁ జెప్పఁబడిన విశ్వము విష్ణువైనట్లు శివుఁడును గావచ్చునుగదా! శంకరాచార్య విరచిత విష్ణు సహస్ర భాష్యమునఁ జెప్పఁబడిన విశ్వశబ్దార్థము శివకేశవులకు సమానము గానే చెల్లును. గమనింపుడు. ఎట్లన? విశ్వసృష్టికిఁ గారణము పరబ్రహ్మ. కార్యమైన ప్రకృతియుఁ బరబ్రహ్మయే. వారు కార్యకారణరూపబ్రహ్మయొక్క రూపాన్తరములేకదా! శివకేశవస్వరూపములే. "బ్రహ్మైవేదం విశ్వం విశ్వ మిదంవరిష్ఠమ్" పురుషఏవేదం విశ్వమ్" అను శ్రుతులు పై విషయమునే తెలియఁజేయును.

"తత్సృష్ట్వాతదేవానుప్రావిశత్" అను శ్రుత్యర్థమును బరిశీలించినచో బరబ్రహ్మయే బ్రహ్మాండమునకు, బైనుండి పర్యవేక్షణచేయునాతఁడు. అతడే సృష్టిస్థితిసంహారకార్యనిర్వహణకై బ్రహ్మ విష్ణు శివస్వరూపుఁడై సృష్టిలోఁ బ్రవేశించెను. కాన విశ్వేశ్వరశబ్దము పైమువ్వురిని దెలియఁజేయునని తెలియు చున్నది.

పరికింపగావిశ్వమేప్రకృతి. ఈశ్వరుఁడే శివకేశవస్వరూప పరబ్రహ్మ. కావునఁ బ్రకృతి పురుషుల సమష్టిరూపమే విశ్వేశ్వరుఁడని తెలియుచున్నది.

ఎవ్విధమున అర్థమును బరిశీలించినను విశ్వేశ్వరశబ్దము శివకేశవుల నిరువురిని దెలియఁజేయును.

*బీజాక్షరసంపుటి:—*

"విశ్వేశ్వరః" అను నామమున "వ్+ఇ+శ్+వ్+ఏ+శ్+వ్ +అ+ర్+అ" అని పదక్షరములుకలవు. అవి ఇంద్రియదశకముతోఁ గూడిన అనగా "కర్మేంద్రియ జ్ఞానేంద్రియముల"తో గూడిన ప్రకృతినిదెలియ జేయును. ఇందు "ఏ"అను మొదటియక్షరములో వకారము వరుణదేవతా కము. ఇకారము విష్ణుదేవతాకము. ప్రకృతియైనజలమునకు అధిదేవతయగు

వరుణుఁడు విష్ణ్వంశ సంపన్నుడే, అట్టి వరుణునకు పోదుగా "ఇకారము"చే వ్యక్తమగు విష్ణువుకలడు అతఁడు రక్షకుఁడు. కాన ప్రకృతిపురుషుల సమిష్టి రూపము "వి"యనునక్షరము అందుచేఁ ప్రకృతి పురుషులిరువురునుగలిసి శ్వేతవర్ణరోగమైన శ్విత్రమును, శ్యామవర్ణమయిన శ్యామలరోగమును దొలగించి, సృష్టినిగాపాడుచున్నారని తెలియుచున్నది వర్షములు పక్కగా అనుకూలముగాఁ గురిసినచో వేసవిచే సంభవించురోగములు క్షీణించును. అందుచే ప్రకృతిలో సంభవించురోగములను నశింపఁజేయుటకై, జలాధిదేవతయగు వరుణుఁడు అనుకూలవర్షపాతమును జేకూర్చుచున్నాడని తెలియుచున్నది "శ్వే" అను దానిలోఁగల శవర్ణము లక్ష్మీబీజము వ్యోమవర్ణము. శ్రీకరము వకారము వరుణదేవతాకము; శుక్లవర్ణము. రోగనాశనము. ఏకారము వీరభద్రబీజము; పీతవర్ణము; సర్వార్థసిద్ధిదము. పైమూడు వర్ణములుగల శ్వేకారముతోగూడిన నామమును జపించువారికి లక్ష్మీప్రాప్తియు, జలధితరణశక్తియు శత్రుసంహారకశక్తియును హనుమంతునకువలెలభించును. అంతేకాక, వ్యోమయాన శక్తియు, ప్రాణశక్తిసంపన్నతయు లభించుటచే విజ్ఞాన శాస్త్రపరిశోధన చేయువారికి సర్వకార్యసిద్ధిచేకూరుననుమాట.

పైనామమందలి "శ్వ"వర్ణముచే సైతము ఇనుమడింపనశక్తులు జపితలకు లభించునని తెలియుచున్నది. రేఫము అగ్నిబీజము. ఆకారము సర్వదేవతా బీజము పైరెండువర్ణములకలయికగలనామమును జపించువారికి, అగ్నిమాంద్యాదిరోగములు తొలఁగుటతోఁబాటు, అగ్నిప్రమాదనివారకశక్తియు, అగ్నిగోళవిహారశక్తియును లభించును. అట్టికటి సర్వదేవతాస్వరూపుఁడైన, సర్వేశ్వరుఁడు వారిని తప్పకకాపాడునని తెలియుచున్నది.

## (2) మహాదేవాయ:- శివ:-

"మహాంశ్చాసౌదేవశ్చమహాదేవః" అను వ్యుత్పత్తిననుసరించిన, సర్వోత్కృష్టుడును స్వయంప్రకాశమానుఁడునగుదేవునకే మహాదేవుడను నామము

చెల్లును. సృష్టికంతటికిని మహాశివుడే ప్రథముడు. మహాత్ముడును. అతడే స్వయంప్రకాశమానుడునుగావున బరమశివునకు మహాదేవనామమువర్తించును "వామదేవోమహాదేవః" అను సమరసూక్తియే పైవిషయమునకు బ్రమాణము. "అమరేశోమహాదేవః" అను శివసహస్రసూక్తిచే దేవేంద్రాదులకు బూజ్యుడైన కారణమున మహాదేవనామము శివునకేర్పడినట్లు తెలియుచున్నది.

*శ్లో॥ "పూజ్యతేయస్సురైస్సర్వైః మహాంశ్చైవప్రమాణతః*
*మహేతిధాతుః పూజాయాంమహాదేవస్తతస్స్మృతః"*

అను సాంబపురాణసూక్తిని బరిశీలించినచో సర్వదేవతలచే బూజింపబడువాడును వేదశాస్త్రాది ప్రమాణములచే మహాత్ముడుగా జెప్పబడినవాడునగు పరమశివునకు మహాదేవనామమువచ్చినట్లుతెలియుచున్నది, "మహ = పూజాయామ్" అను ధాతువునుండియేర్పడిన మహచ్ఛబ్దమునకు బూజనీయుడనియర్థము చెప్పుటలో సందియములేదుకదా! పైకారణములచే బరమశివునకు మహాదేవ

విష్ణు:- శివునివలె విష్ణువును సర్వోత్కృష్టుడే; సకలదేవతాపూజ్యుడే స్వయంప్రకాశమానుడే కావున విష్ణువునకును మహాదేవనామముచెల్లును. అంతేకాదు. "ఆదిదేవో మహాదేవోదేవేశోదేవభృత్‌గురుః" అను విష్ణుసహస్ర సూక్తిలో విష్ణువు మహాదేవుడుగా పేర్కొనబడెను. సర్వభావములను విడిచి, ఆత్మజ్ఞానయోగమునందును, ఐశ్వర్యమందును, మహిమోపేతుడగుటచే విష్ణువునకు మహాదేవనామము చెల్లునని శంకరాచార్యులవారును నామ సహస్ర భాష్యమున పేర్కొనినారు. కావున మహాదేవుడనగా విష్ణువనియు తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి*-

"మహాదేవ"నామమున "మ్ + అ + హ్ + అ + ద్ + ఏ + వ్ + అ" అని

ఎనిమిదక్షరములు కలవు. ఇవి శరీరమందలి అష్టచక్రములను, అష్టసూర్య మండలములను సూచించును.

ఇందు మొదటియక్షరము మకారము మదనబీజము. కాన కామ స్వరూపప్రకృతిని సూచించును. చివరియక్షరము, అకారము సర్వదేవతాక మైన పురుషరూపమును దెలియఁజేయును. అందుచే ఇందలి వర్ణములెనిమిది యును జగత్సృష్టికారకమైన అష్టవిధ ప్రకృతిని సూచించును మకారాకార దకారవకారములు నాల్గును శక్తిస్వరూపసూచక వర్ణములు. అకారహకారైకారా కారములు నాల్గును శివస్వరూపసూచకములు. కావునఁ బైనామము శక్తిసహిత శివుని సూచించుచు జపితలకుఁ దమశక్తులనొసంగును. భక్తులకామములనడంచి వారికి ముక్తినొసంగును.

## (3) త్రయంబకాయ:- శివ:-

అంబకము అనగానేత్రము. అగ్నిదేవుడునుదుట మూఁడవనేత్రముగాఁ గలవాడు కావున మహాదేవునకు త్రయంబకుఁడను నామమువాటిల్లెను. ఇది పురాణప్రసిద్ధవిషయము. త్రయంబకం యజామహే "అను శ్రుతిచే త్రయం బకపదము వైదికమని తెలియుచున్నది. కప్రత్యయముచేరగా "కన్యకా" శబ్దమువలె అంబకశబ్దమేర్పడెను. "అంబా, అక్కా, అల్లా ఏతే మాతృ వాచకాః" అనుసూక్తిచే అంబాశబ్దము మాతృవాచకమనితెలియుచున్నది. అంబకలు అనగా అంబలనియర్థము. వారే జ్ఞానాంబాభ్రమరాంబా మూకాంబలు వారు ఆదిశక్తిస్వరూపలు అయ్యంబకలు. ముగ్వురును భార్యలుగాఁగలవాడు కానఁ బరమశివుని త్రయంబకుఁడనియు జెప్పవచ్చును. త్రిలోకములకు అంబకుఁడు = తండ్రికాన త్రయంబకుఁడాయెను.

## విష్ణు :-

త్రయంబకపదము మహావిష్ణువునకును జెల్లును. ఎట్లన? అంబకశబ్దము

నకు అమరసూక్తిననుసరించి, బాణము అనియునర్థముకలదు. విరాట్పురుషుఁ డైన విష్ణువునకు, వారుణాస్త్రము, వాయవ్యాస్త్రము, అగ్నేయాస్త్రమని మూడు అంబకములుకలవు. కావున విష్ణువు త్రయంబకుఁడాయెను, పైమూఁడు అస్త్రములతో విష్ణువు దుష్టశక్తులను సంహరించి, లోకములను గాపాడినట్లు ఔటకాదికథలవలనఁ దెలియుచున్నది. వారుణాస్త్రమునకు మూలాధారుఁడైన సూర్యుఁడు దివమునుండియు వాయువు అంతరిక్షమునుండియు, అగ్ని పృథివిపైనుండియుఁగాపాడుచున్నట్లు "సూర్యోనోదివస్పాతు, వాతో అంత రిక్షాత్, అగ్నిర్నఃపార్థివేభ్యః" అను సౌరమంత్రమువలనఁ దెలియుచున్నది. పైమూఁడంబకములందును విష్ణుశక్తికలదు కావున విష్ణువు త్రయంబుకుఁ డాయెను.

అంతేకాదు. సూర్యుడు త్రిమూర్తిస్వరూపుఁడను విషయము "బ్రహ్మే హరాత్మకమచింత్యమలక్ష్యమూర్తిమ్" అను శ్లోకమువలనఁ దెలియుచున్నది. సూర్యుడే ఆదినారాయణుడు. అట్టి సూర్యునకు "ఉషాపద్మనీఛాయ"లను ముగ్వురు అంబకలు భార్యలుగాఁగలరు. కాన సూర్యరూపుడైన విష్ణువు త్రయంబకుఁడాయెననిచెప్పవచ్చును.

"మారుతేవేధసిబ్రధ్నే పుంసికః, కంశిరోంబునోః" అను నమరసూక్తిచే "క"శబ్దమునకుఁ బరబ్రహ్మము అను నర్థమున్నట్లు తెలియుచున్నది. అందుచే "త్రిఅంబ+కః"=త్రయంబకః "అని పదమునువిభజించి, శివ+విష్ణు స్వరూపుఁడైన పరమాత్మ" ఇచ్ఛాక్రియాజ్ఞాన"శక్తులనెడి ముగ్వురంబలు భార్య లుగాఁ గలవాడనియు జెప్పవచ్చునుగదా! అట్లైన త్రయంబక"పదము శివ విష్ణువులు ఇరువురికిని సమానముగాఁ జెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

"త్రయంబకః" అను నామమున త్+ర్+అ+య్+అ+మ్+బ్ +అ+క్+అ" అని పదియక్షరములుకలవు. అవిస్థూలసూక్ష్మకారణశరీర

విశిష్టజీవునిసూచించును. వానినిగాపాడు పరాత్పరుడే త్రయంబక పదముచేఁ దెలియువిరాట్ స్వరూపుడని తెలియుచున్నది. జీవుడు త్రయంబక జపమొనర్చి ఈశ్వరత్వమునొందును. కావునఁ బైనామము జీవేశ్వరులసమష్టిస్వరూపవాచక మన్నమాట. పైనామమున సర్వదైవత్యములైన అకారములునాల్గుకలవు. అవి విరాడ్ధిరణ్యగర్భావ్యక్తతురీయపురుషులను నల్వురిని సూచించును. పైనామ మందలి తకారము వాస్తుపురుషుని, రేఫయకారములు అగ్నివాయువులను, మకారముమదనుని, బకారము త్రిమూర్తులను, కకారము ప్రజాపతిని సూచించును. కావున బైనామమును జపించువారికి, వాస్తుశాస్త్రము అగ్ని వాయువరిశోధకశక్తియు లభించును. కావునవారు జీవులకోరికలను నెఱవేర్ప గలవారలు, భూతవ్యాధి నివారకులునై సర్వత్రజయముపొందగలరు.

## *(4) త్రిపురాంతకః:- శివ :-*

"త్రి+పుర+అంతకః" మూఁడుపురములను, నశింపజేసినవాఁడని యర్థము. ఇందలి విశేషమేమన? పూర్వము శివుడు త్రిపురులు అను పేరుగల ముగ్గురు రక్కసులను ఒక్కసారిగా ఒకేబాణముతో గాల్చిచంపెనని శివ పురాణాదికథలవలన దెలియుచున్నది. అందుచే మహాదేవునకు త్రిపురాంతక పదముసార్థకమాయెను.

అంతేకాదు. ప్రళయకాలమున "అండాండపిండాండ బ్రహ్మాండము" లనెడి ప్రకృతిశరీరములను మూఁడింటిని నశింపజేసినవాడు కాన మహాశివు నకు "త్రిపురాంతకుడను" నామమువాటిల్లెననియు బెద్దలుచెప్పుదురు. కోశ ములననుసరించి "పౄ=పాలనపూరణయోః" అను ధాతువునుండివుట్టిన పురశబ్దమునకు శరీరము పట్టణము. మున్నగునర్థములున్నట్లుతెలియుచున్నది. "పురమేకాదశద్వారమ్" అను కఠశ్రుతిచే బురశబ్దమునకు శరీరమనునర్థ మున్నట్లు తెలియుచున్నది.

విష్ణు :-

ఇట త్రిపురాంతకనామము విష్ణువునకును జెల్లును. ఎట్లన? ప్రతిప్రాణి యును జ్ఞానయోగాదిమార్గములననుసరించి, శివునివలె నారాయణుని సైతము ధ్యానించును. అపుడు విష్ణువు తన్నారాధించు ప్రాణికి జ్ఞానముచేకూర్చును. అపుడు ఆప్రాణితన జ్ఞానాగ్నిచే శరీరావిర్భావకారణములైన కర్మలను నశింప జేసికొనును. అపుడు ఆ మహావిష్ణువు ఆప్రాణికివాటిల్లిన స్థూలసూక్ష్మకారణ శరీరములను మూడింటిని నశింపజేసి ఆప్రాణినిదనలో జేర్చుకొని ముక్తుని గావించును. ప్రహ్లాదాది భక్తులందఱును ఇట్లేతరించిరి ప్రతిప్రాణికినివాటిల్లిన శరీరములను మూడింటిని నశింపజేసిన వాడగుటచే విష్ణువునకును త్రిపురాంతకనామము చెల్లుననిచెప్పవచ్చును గదా!

బీజాక్షరసంపుటి:-

పైనామమున "త్+ర్+ఇ+ప్+ఉ+ర్+ఆ+న్+త్+అ+క్+అ" అని పండ్రెండు అక్షరములుకలవు. ఇవి దశేంద్రియములను, మనోబుద్ధులను సూచించును ఈపండ్రెండును స్థూలసూక్ష్మశరీరరూప ప్రకృతికిఁ జెందినవి. వాటినన్నింటిని గర్మానుసారమున ఆయావ్యాపారములందుఁ బ్రవర్తింపజేయు పరాత్పరుఁడు పరమేశ్వరుఁడే; అను విషయమును బైనామము సూచించును. ఇందలి "త్రి"వర్ణమున వాస్తుదైవత్యమైన తకారము, వహ్ని దైవత్యమైన రేఫము, విష్ణుదేవతాకమైన "ఇ"కారమునుగలవు. కావున బైనామమును జపించువారు వాస్తుశాస్త్రముననుసరించి, భవనాదులను నిర్మించు నపుడు అందలి విషక్రిములను అగ్నిచేనశింపఁజేసి వానిని విష్ణువుకాపాడును; అని తెలియుచున్నది.

పైనామమున బర్జన్యదేవతాకమైనపకారము, వాయుదేవతాకమైన "ఉ"కారమును గలవు. కావునఁ బైనామముజపించువారు సప్తవాయుమండలములను, సప్తమేఘమండలములను దవః ప్రభావముచే వశపఱచుకొని

వాయుప్రమాదములను దొలగించి, సకాలవర్షములుకురిపించి, ఋష్యశృంగుని వలె, దుర్భిక్షములను దూరముచేసి, లోకములను గాపాడఁగలరని చెప్ప వచ్చును వారువాయువులను వశపఱచుకొని మేఘమండల విహారమును ఇంద్రజిత్తువలెఁ గావింపఁగలరు; అని తెలియుచున్నది.

వహ్నిదేవతాకమైన రేఫము పరాశక్తిదేవతాకమైన "అ"కారమునుగల పైనామమును జపించువారు దుర్గాసూక్తమునఁ జెప్పినట్లు అగ్నిస్వరూపిణియై జీవుల శరీరమందుఁ గుండలినీరూపముననున్న దుర్గాశక్తిని సాక్షాత్కరింపఁ జేసికొని, సమస్తము నాకర్షించి, అందలి దుష్టశక్తులను సంహరింపఁగలరు.

సర్వదేవతాకమైన "అ"కారముతోగూడి, వరుసగా సావిత్రీవాస్తుదేవ తాకములైన "నకార, తకారములు"గల పైనామము జపించువారు, క్రొంగ్రొత్తప్రణాళికానిర్మాణములుగలభవనములను, ప్రాజెక్టులను, వంతెన లను, యంత్రములను నిర్మించువైజ్ఞానికులుకాగలరు.

సర్వదేవతాకమైన "అకారము"తోగూడినట్టియు, ప్రాజాపత్యమైన "క"కారముగల పైనామము జపించువారు, కృత్రిమవర్షపాతముగావించగల ఘనులుకాగలరు. అంతేకాదు. పైనామమును జపించువారు, ఆయాదేవతల సాక్షాత్కారముపొంది, అనేకములైన నూతనవ్యాధులను దొలగింపగలవారును అగుదురు.

*(5) త్రికాగ్నికాలః:- శివ :-*

త్రికము అనగా మూడు త్రికమైన అగ్నులు అనగా దక్షిణాగ్ని, గార్హ పత్యము, ఆహవనీయము అనునవి యజ్ఞమునకు జెందినవై, యజ్ఞమునందు ఆరాధింపబబడును. ఈ మూడగ్నులతో సోమయాజిస్వరూపుడైనరుద్రుడు అందఱిని యజ్ఞయాగాదికర్మలనాచరించుటకై ప్రేరేపించును. కాన శివుడు

త్రికాగ్నికాలుఁడాయెను "కాలయతి = ప్రేరేయతి" అను నర్థమునను సరించి, కాలశబ్దమునకుఁ బ్రేరకుడను నర్థముకలదు అంతేకాదు. అగధాతువునకు "గచ్ఛతి = పోవుచున్నాడు అనియర్థముకలదు పైయర్థమునను సరించి, పరమ శివుఁడు త్రికాగ్నులతో అంతటను వ్యాపించుటకుఁబోవును కావుఁ ద్రికాగ్నికాల వధమేర్పడెననియుఁ జెప్పవచ్చును.

"త్రైనంగోపాఅదృశన్" అను మంత్రమునను సరించి పరిశీలించినచో, రుద్రుఁడే ఆదిత్యుఁడై, త్రిలోకములందును, స్వర్గమర్త్యపాతాళలోకము లందు అగ్నియై, ఊర్ధ్వాధో మార్గములందు సంచరించువాఁడై, కాలుడు అనగా ప్రేరకుఁడాయెను. అనగా శివుఁడే సూర్యుఁడై ముల్లోకములందు సంచరించుచు, సకలజీవకోటినీ, సకలకార్యములను జేయవలసినదిగాఁ బ్రేరేపించుచున్నాడని తెలియుచున్నది. కావున మహాదేవుడు త్రికాలాగ్నికాలనామకుఁడాయెను.

విష్ణు :-

త్రికాగ్నికాలనామము విష్ణువునకుఁజెల్లును. ఎట్లన? వామనావతారుఁడై బలినడంచుసమయమున "ఇంతింతైవటుఁడింతయై" అను పద్యమున బోతనా మాత్యుఁడు వర్ణించునట్లు విష్ణువు త్రికమును అనగా స్వర్గమర్త్యపాతాళలోకము లను, అగ్ని = అనగా వ్యాపించినవాఁడై, కాలుడు అనగా ముల్లోకముల పరి ణామమును గణించినవాడాయెను. కావున విష్ణువునకు "త్రికాగ్నికాలుఁడ"ను నామమువాటిల్లెను.

:-

పైనామమున "త్+ర్+ఇ+క్+ఆ+గ్+న్+ఇ+క్+అ+ల్+అ" అని పండ్రెండక్షరములుకలవు. అవి ద్వాదశాదిత్యులను వారినావరించి యున్నపరమాత్మను సూచించును.

వహ్నివాయువాస్తుదైవత్యములుగల "త్రి"వర్ణముతో గూడిన పైనామ
మును జపించువారు, వాయ్వగ్నిప్రమాదములు వాటిల్లని వ్యోమనౌకలను
సృష్టించి, గోళాన్తరయాత్రచేయగలరు.

పరాశక్తిప్రాజాపత్యబీజములైన కకారాకారములతోఁగూడిన పైనామ
మును జపించువారు, మహోపాసకులై నూతనసృష్టికావించి, ప్రపంచమంత
టిని ఆకర్షింపఁగలవారలగుదురు.

"గ్ని" అనుదానియందలియక్షరములు విఘ్నగణపతి సావిత్రీదేవతాక
ములు. అట్టి "గ్ని"కారముతోగూడిన నామముజపించువారుపైన బేర్కొన్న
కార్యములాచరించునపుడు గల్గు విఘ్నములను, పాపములను బరిహరించి,
సర్వులను రక్షింపఁగలవారలగుదురు.

సర్వదేవతాకమైన అకారమును పృథివీబీజమైన లకారముతోడను
గూడిన ఈ నామమును జపించువారలు వాయుస్తంభనమొనర్చి, పృథివిలోఁ
గల లోహతైలాదివస్తువులగనులను గనిపెట్టగలవారలగుదురు. అంతేకాదు.
పైనామము జపించువారు జంతువృక్షమనుష్యచర్మములపైనేర్పడు, తెలుపు
నలుపు, ఎఱుపు, పసుపురంగులమచ్చలతోగూడిన వ్యాధులను నివారింపఁ
గలవారలగుదురు.

## (6) కాలాగ్నిరుద్రః-

శివుడు ప్రళయకాలమున సంహారకర్తయగుటచే జీవులను మూడవకన్ను
యిన అగ్నిచే దహించుచుపీడిపించును. ప్రళయకాలాగ్నివలె భయంకరుడై
దుఃఖమును గల్గించును. కాన శివునకు గాలాగ్నిరుద్రనామము సార్థకము
అయెను. "రుః = దుఃఖం, దుఃఖహేతుర్వా తంద్రావయతీతి రుద్రః" అనెడి
శివపురాణవచనముచే, సామాన్యకాలమున అంతటను, వ్యాపించి, భక్తుల
దుఃఖమును, దుఃఖహేతువును దొలగించును. కావున శివునకు గాలాగ్ని
రుద్రనామము సార్థకమాయెను.

విష్ణు :-

"కాలశ్చాసౌ అగ్నిశ్చ = కాలాగ్నిః, కాలాగ్నిశ్చాసౌరుద్రశ్చ = కాలాగ్ని రుద్రః;" అని విగ్రహవాక్యమును జెప్పి, మూడు పదములను విష్ణుపరము లైన విశేషణములుగా జేసి, యర్థమును జెప్పవలసియున్నది. పైమూడుపదము లను విష్ణువాచకములేకాన అట్లు చెప్పవచ్చును.

"ఋతుస్సుదర్శనఃకాలః" అను విష్ణుసహస్రసూక్తిలో గాలపదము విష్ణు వాచకముగాగలదు. "కలయతిసర్వమ్" అను వ్యుత్పత్తిచే విష్ణువుకాల స్వరూపుడై సర్వమునుగణనముచేయుచున్నాడని తెలియుచున్నది. చతుష్షష్టి కళలకును (64) నివాసుడగుటచే గాలుడాయెననియు జెప్పవచ్చును. చిత్ర గుప్తస్వరూపుడై సకలజీవులకు వారివారిపుణ్యపాపఫలములనుఒసంగి, వారిచే ననుభవింపజేయుచున్నాడుకాన గాలుడను నామము విష్ణువునకుజెల్లును.

కాలుడైనవిష్ణువు "అగతి = గచ్ఛతి" అనువ్యుత్పత్తిచే అగ్నిఅయెను. అనగా అంతటనువ్యాపించియుండెను కావున విష్ణువుకాలాగ్నియాయెను. అతడే "రుద్రోబహుశిరాబభ్రుః" అను విష్ణుసహస్రసూక్తిలో జెప్పినట్లు, రుద్రుడై ప్రళయకాలమున బ్రజలను సంహరించుచు, వారికి దుఃఖమునొసంగు చున్నాడు. పైకారణములచే విష్ణువునకును "కాలాగ్నిరుద్ర"నామము చెల్లు నని చెప్పవచ్చును.

*బీజాక్షరసంపుటి*-

పైనామమున "క్ + అ + ల్ + అ + గ్ + న్ + ఇ + ర్ + ఉ + ద్ + ర్ + అ + య్ + అ" అని పదునాల్గుఅక్షరములుకలవు. ఇవి శుక్లకృష్ణపక్షముల నెడి జంటతోగూడిన ద్వాదశమాసములుకలకాలస్వరూపుని హిరణ్యగర్భుని సూచించును. వానినారాధించుటకుజేయుదీక్షయే చతుర్వింశతిరాత్రిదీక్ష. "చతుర్వింశతిగ్ంరాత్రిర్దీక్షతోభవతి" అనెడి స్వాధ్యాయబ్రాహ్మణశ్రుతిలో నీవిషయమే సూచింపబడెను.

పైనామమున మొదటి పరాశక్తి బీజమైన అకారముతోఁ గూడినట్టియు, ప్రజాపతిదేవతాకమునగు "క"కారముగలదు. ఇవియే శక్తిపురుషులు. వీని ప్రభావముచే భక్తుఁడైనజపిత సకాలమున వర్షముకురిపించి, అన్నదాతయై సర్వులను వశపఱచుకొనఁగలఁడు. పరాశక్తి బీజముతోఁ గూడినట్టియును, పృథివీ బీజమునగు "ల"కారము ఈనామమునఁగలదు. కావున పైనామము జపించువారు లంబినీయోగమున వాయుస్తంభనముగావించి, మూలాధారరూపయైన పరాశక్తిని షట్చక్రములపైకి ఆకర్షింపఁగలరు. అంతేకాదు. వారు సభాస్తంభనము గావించి, ప్రజలను ఆకర్షించుమహిమలు చూపఁగలరు. అణిమాదిశక్తులను సంపాదించుకొనఁగలరు. మూలాధారమున ఉపాను వాక్యాగ్నిని ఆరాధించి, ప్రవరునివలె దేశాంతరగమనముచేయఁగలరు.

ఇందలి "గ్ని"కారమున గాణాపత్యమైనగకారము, సావిత్రీదేవతాకమైన "న"కారమును, విష్ణుదేవతాకమైన ఇకారముతోఁగూడియుండుటచే పైనామము జపించువారు సావిత్రీసాక్షాత్కారమును, గణపతిసాక్షాత్కారమును పొంది, స్వయముగాఁ దమపాపములను విఘ్నములను దొలగించుకొని నిర్మలులై ఆత్మరక్షణతోఁబాటు జీవకోటిని సైతముకాపాడఁగలవారలగుదురు. స్ఫాటికరక్తశ్యామవర్ణములైన కాంతికిరణములను దమతపోఽగ్నినుండి ప్రసరింపఁజేసి బహువిధరోగములను ఆత్మశక్తితోనశింపఁజేయగలరు.

వాయ్వగ్నిదేవతాకములైన రేఫోకారములుగల పైనామమును జపించువారు మహాయోగులుకాగలరు. ఇందలి "ద్రు"కారము అగ్నిస్వరూపిణియుఁ బరాశక్తియునగు దుర్గకునిలయముకావునఁ బైనామము జపించువారు శక్త్యుపాసకులైన భూతవైద్యులుకాగలరు. మొత్తముపైని కాలాగ్నిరుద్రనామము మహాప్రభావసంపన్నము. దానిని జపించువారు నిజముగా కాలాగ్నిరుద్రులే కాఁగలరు.

(7) నీలకంఠః:- శివః-

నీలమైనకంఠముకలవాఁడు. ముల్లోకములరక్షణకై హాలాహలమును గంఠమున ధరించుటచే శివుని కంఠమునీలమాయెను అందుచేతే బరమశివుఁడైన మహాదేవునకు "నీలకంఠుఁడు" అని నామమేర్పడెను.

విష్ణు :-

విష్ణుపరముగా అర్థముచెప్పునపుడు నీలశ్చాసౌకంఠశ్చ = నీలకంఠః" అని విశేషణోభయపదకర్మధారయముచేసి చెప్పవలసియున్నది. "నీల = వర్ణే" అను ధాతువునుండియేర్పడిన నీలశబ్దమునకు ఇటనల్లగానుండువాఁడని యర్థము చెప్పవలెను. "కృష్ణోవర్ణశ్చమేయస్మాత్" అను మహాభారతోక్తిలో దానునల్లనివాఁడనని కృష్ణుఁడు స్వయముగా అర్జునునితోఁ బల్కెను. అదియే పైయర్థమునకు బ్రమాణము.

"కఠ = శోకే" అనుధాతువునుండియేర్పడిన కంఠశబ్దమునకు సంహారమున జీవులను ఏడిపించువాఁడని యర్థముచెప్పవలసియున్నది. "రుద్రోబహుశిరాబభ్రుః" అను విష్ణుసహస్రసూక్తిలో జెప్పినరుద్రశబ్దము సైతము పై యర్థమునే బలపఱచును. కావున "నీలకంఠ" నామము విష్ణువునకునుజెల్లును

బీజాక్షరసంపుటి:—

పైనామమున "న్+ఈ+ల్+అ+క్+అ+మ్+ఠ్+అ" అని తొమ్మిది అక్షరములుకలవు. ఇవి జీవుని శరీరమందలి నవద్వారములను, వానిని ప్రేరేపించుప్రకృతిని, తదధ్యక్షుఁడైన పరమాత్మను సూచించును. పైనామమున, నకారేకారలకారములు వరుసగా సావిత్రీమాయాపృథివీబీజములై శక్తినిబోధించుచుండ, కకారమకారఠకారములు మూఁడును వరుసగా ప్రజాపతిమదనచంద్రబీజములైయున్నవి. అవి పురుషబోధకములే. ఈ నామ

మున శక్తిపురుషుల ప్రభావములు సమానముగాఁగలవు. కావున శైవనామము నుపాసించువారు శక్తిపురుషులను సమానముగాఁ గొలిచెదరు. అందుచే అకార బోధితుఁడైన పరమాత్మ ఉపాసకులైన భక్తులను కేవలప్రకృతిబద్ధులను, సంసారాసక్తులనుగానీయక సంరక్షించుననని తెలియుచున్నది.

## 8) మృత్యుంజయః:- శివ:-

మృత్యువును జయించువాడు కానమృత్యుంజయుడను నామము శివునకువాటిల్లెను. ప్రాణత్యాగరూపమైన మృత్యువు ఆతనికిలేదన్నమాట. ఆతనికే కాదు ఆతనిభక్తులైన వ్యాఘ్రాసురుఁడు, గజాసురుడు, మార్కండేయుఁడు మున్నగువారికిని మృత్యువులేకుండఁజేసికాపాడెను. ప్రమాద మోహాజ్ఞానములు మృత్యువులని సనత్సుజాతీయమునఁజెప్పబడెను. అమువ్విధములైన మృత్యువులును బరమశివునకులేవు. కావుననే ప్రమాదకరములైన సర్పములను భూషణములుగాధరించెను. వామభాగమున త్రిపురసుందరియైనపార్వతిని, శిరమున గంగాదేవినిదాల్చియును, మోహహీనుఁడైయుండెను. అజ్ఞానములేనివాడు కావుననే వృద్ధులైన మునులను శిష్యులుగాఁజేకొని దక్షిణామూర్తియై, వారికి జ్ఞానోపదేశముచేసెను అందుచే మహాదేవునకు మృత్యుంజయనామముసార్థకమయ్యెను.

## విష్ణు:-

విష్ణువునుమృత్యుంజయుడే. ఎట్లన? అమృత్యుస్సర్వదృక్సింహః" అను విష్ణుసహస్రసూక్తిచే, మృత్యువు, మృత్యుహేతువునులేనివాడు కావున విష్ణువునకు "అమృత్యుః" అను నామమువాటిల్లినట్లుతెలియుచున్నది. "అమృత్యువు, మృత్యుంజయుఁడు" అను పదములురెండును సమానార్థకములే. శివుఁడువలె విష్ణువును దనభక్తులను గజేంద్రాదులను మృత్యువులేకుండఁజేసి, కాపాడినవాడే. దశావతారవిషయములను బరిశీలించితిమేని, శివునకువలె విష్ణువునకును

ప్రమాద మోహాజ్ఞానరూప మృత్యువులేనట్లు విదితమగును కాపున విష్ణువునకును మృత్యుం "జయపదమువర్తించునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

పైనామమున "మ్ + ఋ + త్ + య్ + ఉ + మ్ + జ్ + అ + య్ + అ" అని పదక్షరములుకలవు ఇవి దశదిక్వ్యాప్యమైన ప్రకృతిని తదధ్యక్షుడైన పరమాత్మను సూచించును

పైనామమున మదనబీజమైన మకారద్వయమును వాయుబీజములైన ఉకారయకారములును, జలబీజమైన జకారము, సర్వదేవతాకమైన అకార ద్వయమును, వాస్తుదేవతాకమైన తకారముతోఁగూడియున్నవి. అందుచేఁ బైనామమును జపించువారు వాయుశక్తితో, జలమున నడుచుయంత్రములను, నౌకాదులను అందముగా నిర్మించి, సర్వత్రజయముపొందఁగలవారగుదురు. జలస్తంభనాది విద్యాప్రదర్శకులును, ఇంద్రియ విజేతలునుగాఁగలరు.

*(9) సర్వేశ్వరః :- శివః-*

"ఈశ = ఐశ్వర్యే" అను ధాతువునుండియేర్పడిన ఈశ్వరశబ్దమునకు స్వయముగా అష్టైశ్వర్యవంతుడై, జీవులకు ఐశ్వర్యము కూర్చువాఁడని శివ పరమైన యర్థముచెప్పవలసియున్నది. ఐశ్వర్యమీశ్వరాదిచ్ఛేత్" ఈశ్వరుని నుండి ఐశ్వర్యముకోరవలెనని పెద్దలుచెప్పుదురు. సర్వులకు తననువేడిన జీవులకెల్ల, ఐశ్వర్యమును, అనగా సకలకార్యనిర్వహణసామర్థ్యమును, ఐశ్వర్య ములను ఇచ్చువాడుకాన సర్వేశ్వరుఁడను నామము శివునకేర్పడెను. "ఏష సర్వేశ్వరః" అను శ్రుతిచేనిరుపాధికైశ్వర్యవంతుఁడై భక్తులకు ఐశ్వర్యము నిచ్చువాడని తెలియుచున్నది. అంతేకాదు. "అశ్నోతి = వ్యాప్నోతితి-ఈశ్వరః"

అని నీలకంఠుఁడు చెప్పుటచే సర్వమునందును, అనగా జేతనాచేతనములన్నింటి యందునువ్యాపించియున్నవాడు కానశివునకు సర్వేశ్వరనామమువాజిల్లెననియు జెప్పవచ్చును.

**విష్ణు :-**

విష్ణువునకు నీనామముచెల్లుననుటకు "అజస్సర్వేశ్వరస్సిద్ధః" అనేడి విష్ణుసహస్రనామసూక్తియే ప్రమాణము, అనగా సకలేశ్వరులకును విష్ణువు ఈశ్వరు డన్న మాట.

ఇట సర్వేశ్వరశబ్దమునకు "సర్వశ్చాసౌ-ఈశ్వరశ్చ" అని విగ్రహ వాక్యముచెప్పి, విష్ణుపరముగా అర్థముచెప్పవచ్చును. "సర్వశ్శర్వశ్శివః" అను విష్ణుసహస్రనామసూక్తిచే విష్ణువు, సత్తు అసత్తు రూపముననున్న వస్తువులన్నియును జన్మించుటకును, నశించుటకు గారణమైనవాడు కాన సర్వుడామైనని తెలియు చున్నది. సర్వదాసర్వులకు జ్ఞానమునొసగువాడు కావున సర్వుడనునామము విష్ణువునకుజెల్లును. పరమాత్మమైన విష్ణువు సర్వశక్తిమంతుడుకాన ఈశ్వరు డని పిలువబడుచున్నాడు పైవిషయములచే సర్వేశ్వరుడనునామముచే విష్ణు వును జెప్పబడుచున్నట్లు దెలియుచున్నది

***బీజాక్షరసంపుటి:—***

ఇందు "స్+అ+ర్+వ్+ఏ+శ్+వ్×అ×ర్×అ" అని పదక్షర ములుకలవు ఇవి దశేంద్రియములను, దశదిక్కులను, వానికధిష్ఠానదైవమైన పరమాత్మనుదెలియుజేయును. ఇందుగలమూడకారములు "విరాట్, హిరణ్య గర్భ, అవ్యాకృతలను మూడుతత్త్వములనుదెలియజేయును. శక్తిబీజమైన సకారము అకారముతోగూడియుండుటచే నీనామమునుపాసించువారికిష్టవస్తుప్రాప్తి నిలుకడచేకూరును.

వహ్నిబీజమైనరేఫముతోడను, వరుణబీజమైన వకారముతోడను గూడి నట్టియు, సర్వదేవతాకమునగు అకారముగల పైనామమును జపించువారు, చరాచరవ్యాప్తమైన సకలవిధరోగములను నివారించు నౌషధములను సాధనములను గనుగొనుగొని రోగనివారకుల్లునై సర్వమును వశమొనరించుకొనఁ గలవారలగుదురు. లక్ష్మీబీజమైన శకారమును, వరుణబీజమైన వకారమును అకారముతోఁగూడియుండుటచే, అట్టి యక్షరమును జపించువారు జలనిధి నివాసయు, మాయాస్వరూపిణియునగు లక్ష్మినుపాసించువారై సకలైశ్వర్య సంపన్నులుకాఁగలరు. జలగతములైనరోగములను నివారించువారలుకాఁగలరు.

## (10) సదాశివః:- శివ+విష్ణుః:-

సదాశివశబ్దమునకే యర్థముచెప్పినను అదిశివకేశవులకు సమానముగనే వర్తించును. పరికింపుడు. సదా = ఎల్లప్పుడును, శివుడు = శుద్ధుఁడు, నిరుపాధికుఁడు; అనిచెప్పిరేని శివకేశవులు ఇరువురును సదాశుద్ధులేకదా! ఉపాధి రహితులేకదా! "విశుద్ధశ్శివతాస్వతః" అను వాయుసంహితోక్తి పైవిషయము నకుఁ బ్రమాణము

"సర్వశ్శర్వశ్శివః" అనుసూక్తి శివవిష్ణుసహస్రములు రెండింటియందును గలదు "సబ్రహ్మాసశివః సహరిస్సేంద్రః" అనుశ్రుతిలోని తచ్ఛబ్దము బ్రహ్మ విష్ణుమహేశ్వరులను ముగ్గురిని సమానముగానే బోధించుచున్నది. శివకేశవులు ఇరువురను సదాత్రిగుణాతీతమైన శుద్ధస్వరూపముగలవారే. వారిరువురను సత్త్వరజస్తమోగుణాతీతులే.

"శివం = కల్యాణం, తద్యోగాద్వా, శివప్రదత్వాద్వాశివః" అనునర్థమును బరిశీలించినచో శివకేశవులిరువురును గల్యాణకరులు, కల్యాణయుక్తులు కల్యాణప్రదులేయని తెలియుచున్నది.

"శామ్యతీతి = శివః పరమానందత్వాత్ నిర్వికారో భవతి" అను వ్యుత్పత్తిని బరిశీలించినను శివకేశవులు పరమానందులు కాన నిర్వికారులేయని తెలియుచున్నది.

"శీఙ్ = స్వప్నే" అను ధాతువునను సరించి, శేరతేసజ్జనమనాంసి అస్మిన్నితివా, శేతేసజ్జనమనస్స్వితివా, శివః" అనువ్యుత్పత్తులను జెప్పినను శివపదము శివకేశవులను దెలియఁజేయునని తెలియుచున్నది. వారిరువురును సజ్జనులమనస్సులందు ధ్యానమార్గమున శయనింతురు. వారిరువురియందును సజ్జనులమనస్సులు శయనించును. అనగా సజ్జనులు వారివారిమతముల నను సరించి, శివునో కేశవునో ధ్యానింతురు కాన శివకేశవులకిరువురికిని శివపదము సమానముగనే వర్తించును.

"సత్ + అ + శివః" అని పదమును విభజించినను, శివకేశవులిరువురును సత్పదముచేఁ జెప్పబడిన సర్వవ్యాపకులే. అ = సంపూర్ణముగా; శివలే = శుభస్వరూపులే. కానసదాశివనామము శివకేశవులకుసమముగనే వర్తించునని తెలియుచున్నది

*బీజాక్షరసంపుటి-*

ఇందు "స్ + అ + ద్ + అ + శ్ + ఇ + వ్ + అ" అని యెనిమిదక్షరములు కలవు. ఇవి పరమేశ్వరుని అష్టప్రకృతులను సూచించును. ఇందు శక్తిబీజమైన సకారము, సర్వదేవతాకమైన అకారము, ప్రకృతి పురుషుల అవినాభావమును (వేరుకాకయుండుటను) సూచించును దుర్గాబీజమైన దకారము పరాశక్తిబీజమైన అకారముతోఁగూడియున్నది. లక్ష్మీబీజమైన శకారము విష్ణుబీజమైన ఇకారముతోఁగూడియున్నది. వరుణబీజమైన వకారము సర్వదేవతాకమైన అకారముతోఁగూడియున్నది. ఇందుదేవతాబీజములే ఎక్కువగాఁ గలవు. ఇదిదేవ్యుపాసకులకు జపయోగ్యమైన ప్రధాననామము. పైనామము నుపాసించువారికి దుర్గాదేవి, పరమశక్తిని అపారసంపదను ఒసంగి, నూతన యంత్రనిర్మాణశక్తి నొసంగి, వారికి నూతన మహావిజయమును జేకూర్చును.

## (11) శంకరః:- శివ:-

శం = సుఖమును, కరః = చేకూర్చువాఁడు కాన శివుఁడు శంకరుఁడాయెను. దారువన వాసులైనమునులకు గల్గిన శంకలను అనగా తత్త్వజ్ఞాన సంశయములను, రః = దాహకుడై తొలగించినవాఁడు కాన మహాదేవునకు "శంకరః" అను నామము వాటిల్లినట్లు శివపురాణమువలనఁ దెలియుచున్నది.

### విష్ణు :-

శివునకువలె విష్ణువునకును, జీవులకు అహల్యాదులకును గల్గిన ప్రమాదభయములను దొలగించి, సుఖమును జేకూర్చిన వాఁడగుటచే శంకరుఁడను నామముగల్గును.

"శం = కుశలంకరేయస్యసః = శంకరః" అనెడి వ్యుత్పత్తిచే భక్తులకు అవసరమగుకుశలము దుష్టసంహారకుఁడైన విష్ణువుచేతిలోఁగలదు కాన విష్ణువు శంకరనామకుఁడాయెనని చెప్పవచ్చును.

### బీజాక్షరసంపుటి:-

పైనామమున "శ్ + అ + మ్ + క్ + అ + ర్ + అ" అని ఏడక్షరములు కలవు. ఇవి శరీరమందలి సప్తధాతువులను, సప్తవాయుమండలములను, తదధ్యక్షుఁడైన పరమాత్మను దెలియఁజేయును.

ఇందలి "శ"వర్ణముచే దెలియులక్ష్మియు మకారముచేఁ దెలియుమదనుడును, కకారముచే, దెలియు ప్రజాపతియును, రేఫముచే దెలియువహ్నియును, త్రిమూర్త్యాత్మకుఁడైన పరమాత్మయంశలే యనువిషయము పైనామమందలి అకారత్రయముచే దెలియుచున్నది. పైనామమును జపించువారు దివ్యతేజస్కులై, లక్ష్మీనిలయులై ప్రజాపతివలె వింతవస్తువులను సృష్టించి, జీవకోటికి ఆనందముచేకూర్చువారగుదురు; అని తెలియుచున్నది.

ఈ నమకమునగల మొదటి పదునైదు మంత్రములచే శివకేశవాది స్వరూపుడైన పరమాత్మయొక్క నిజతత్త్వము, భక్తుల ప్రార్థనచే దెలియును "నమోహిరణ్యబాహవే" అనుదానితో ఆరంభమైన మంత్రములు పరమాత్మ విభూతిని దెలియజేయును. ఇదియజుర్వేదసారభూతమైన మంత్రభాగము. దీని నడుమను "మధ్యమణిన్యాయమున" "నమస్తే అస్తుభగవన్ విశ్వేశ్వరాయ" అని పదునొకండు నామములు పెద్దలచే గ్రహింపబడినవి. ఇవి శివకేశవశక్తి స్ఫోరకములు. వీనిని జపించువారికి ఆయురారోగ్యైశ్వర్యాదులన్నియు సమకూరును. ముఖ్యముగా ముక్తిలభించును; అని తెలియుచున్నది. ఇటుపైని "హిరణ్యబాహవే" మున్నగునామములందలి శివకేశవవైభవము వివరింపబడును.

---

ఇట్లు సాయనాచార్య విరచితమైన, మాధవీయవేదార్థప్రకాశమను భాష్యమున యజుస్సంహితలో చతుర్థకాండమున పంచమప్రపాఠకమున రుద్రభాష్యమున ప్రథమానువాకము ఆంధ్రానువాద వివరణములు సమాప్తములు.

శ్రీ భట్టభాస్కర విరచితమైన యజుర్వేదభాష్యమున రుద్రప్రశ్నమున ప్రథమానువాకము సంపూర్ణము.

విష్ణుసూరికృత రుద్రభాష్యమున ప్రథమానువాకము సమాప్తము

శ్రీ కౌండిన్యస గోత్రోద్భవుడును శ్రీలక్ష్మీకాంతాకామేశ్వరపుణ్యదంపతులపుత్రుడును అగు తెలికి చెర్లోపనామక రాజేశ్వరశర్మచేవ్రాయబడిన ప్రథమానువాకనామాంధ్రభాష్యవివరణములును సమాప్తములు.

---

## -: ద్వితీయానువాకము :-

ప్రథమానువాకమున భగవంతుఁడైన రుద్రునియొక్క ప్రధానభూతమైన తనువున్ను (శరీరమును) వాని ధనుర్బాణహస్తములును, రుద్రానుగ్రహసంపాదనకై బహువిధముల స్తుతింపబడినవి. పిమ్మట జగన్నిర్వాహహేతువులైన శ్రీ పరమేశ్వరుని లీలావిగ్రహములు ఏనిమిది యనువాకములందును తదనుగ్రహసంపాదనకై స్తుతింపఁబడుచున్నవి. ఆ యెనిమిది యనువాకములందలి మంత్రములును యజుస్సులే. అవి ద్వివిధములుఎట్లనఁ? 2, 3, 4, అను వాకములందలి ప్రతియజూరూపమంత్రమునందును ఆద్యంతములందు "నమః"అను పదముకలదు. ఐదునుండి తొమ్మిదవయనువాకముతోఁ బూర్తియగు ఐదనువాకములందలి యజూరూపమంత్రములందు, మొదటను మాత్రమే "నమః" అను పదముకలదు. వీనినే, ఉభయతో నమస్కారములు అన్యతరతో నమస్కారములు, అనియందురు. ద్వితీయానువాకమునఁ బదమూఁడు యజుస్సులుకలవు.

## -: ప్రథమయజుస్సు :-

*(1) "నమోహిరణ్యబాహవే సేనాన్యేదిశాంచపతయేనమః"*

**అర్థము:—**

హిరణ్యబాహవే = బంగారునగలుగల బాహువులందుఁగల, సేనాన్యే = యుద్ధములందు సేనను జేర్చుసేనానాయకుఁడైన రుద్రునకు నమః = నమస్కారము, అస్తు = అగుగాక; దిశాం = దిక్కులకు, పతయే = పాలకుఁడైన రుద్రునకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక.

**తాత్పర్యము:-**

సా. భా:— బాహువులందు బంగారు నగలను ధరించునట్టియు

యుద్ధరంగమునకు సేనను జేర్చు సేనానాయకుఁడైనట్టియు, దిక్కులను బాలించు నట్టి రుద్రునకు నమస్కారమగుగాక.

**విశేషములు:—**

భ. భా:— "నమోహిరణ్యబాహవే" అనెడి యనువాకమునకు ఋషి మండూకుఁడు. మహాగాయత్రిఛందస్సు. రుద్రుడు దేవత. ఈనముకమున ప్రథమానువాకముచే, భగవంతుడు, రుద్రుఁడును, జగదుపసంహారకములైన అతని ధనుర్బాణాదులును అతని యనుగ్రహము సంపాదించుటకై, స్తుతింపఁ బడెను. అవన్నియును ఉపసంహరింపఁబడినపిమ్మట ఎనిమిది యనువాకము లందలి మంత్రములచే రుద్రుని విశ్వరూపమునుగొనియాడి నమస్కరింప మొదలిడెను.

"నమోహిరణ్యబాహవే" అనుదానితో ఆరంభించు మూడనువాకము లందును నమస్కారాదియును నమస్కారాంతమునగు ఒక్కొక్కయజుస్సే కలదని శాకపాణిచెప్పెను. నమస్కారాదియగు యజుస్సొకటియు, నమస్కారాంతమగుయజుస్సొకటియును గలవని యాస్కుడుచెప్పెను. ఎనిమిది యను వాకములను ఎనిమిది యజుస్సులని కాశకృత్స్నుడుపలికెను.

"ద్విద్విభ్యోజుహోతి" యనెడి శతపథబ్రాహ్మణవచనముచేఁ బ్రతి యజుస్సునందునుగల రెండేసిరుద్రములందును స్తుతినమస్కారములుకలవని తెలియుచున్నది. ఒకే యజుస్సునందుఁగల నామములలో ఒకటి ప్రవృత్తిని, మఱియొకటి నివృత్తిని సూచించునని భేదమునారోపించి, నమస్కారద్వయము ప్రయోగింపఁబడెనని చెప్పవచ్చును. ఒకే యజుస్సున బహునామములున్న పుడు వానిలో ఒకదానిని ఇతరమునకు విశేషణముగాఁ జెప్పవలెను; అని తెలిసికొనవలసియున్నది.

నమోహిరణ్యబాహవే" అను దానిలో మూడు నామములుకలవు. వానితో "హిరణ్యబాహవే" అను దానిని విశేషణముగాఁజెప్పవలెను.

*"తే హైతే ఘోరతరరుద్రాః, ఉభయతో నమస్కారాః;*

*అథైతే శాంతతరాయేఽ న్యతరతో నమస్కారాః"*

అను బ్రాహ్మణము ననుసరించి, ఘోరతరరుద్రములకు ఉభయతో నమస్కారములను, శాంతతరరుద్రములకు, ఒకనమస్కారమునుండుననికొందఱు చెప్పిరి.

"తుల్యసృష్టిప్రతిషేధాచ్చ" అను వచనము ననుసరించి, పూర్వము సృష్టి చేయుటకై బ్రహ్మచేఁ బ్రార్థింపఁబడినదేవుఁడు తనతో సమానధర్మముగల రుద్రుఁను సృష్టించెనని తెలియుచున్నది. కొన్నియజుస్సులలో బహువచనాంతనామములున్నపుడు, అందలి నమస్కారముదేవానుచరులైన రుద్రులకు సమర్పించఁబడెనని తెలిసికొనవలసియున్నది. ఏకవచనాంతనామములందు, దేవాధిష్ఠానశంకచే సర్వత్రసర్వేశుకును నమస్కారములు ఆచరింపబడుచున్నట్లు తెలిసికొనవలసియున్నది,

ఏవ్మట యజుస్సులకుఁగల ఛందస్సులను గూర్చి చెప్పఁదొడగెను. ఎట్లన? ఏకాక్షరములకు దైవీగాయత్రీఛందస్సును ద్వ్యక్షరములకు దైవ్యుష్ణిక్ ఛందస్సును, త్ర్యక్షరములకు దైవ్యనుష్టుప్ఛందస్సును, చతురక్షరములకు దైవీబృహతీఛందస్సును, పంచాక్షరములకు దైవీపంక్తి ఛందస్సునుజెల్లును. షడక్షరములకు దైవీత్రిష్టుప్ఛందస్సుకాని, యాజుషియైన గాయత్రీఛందస్సు కానిచెల్లును. సప్తాక్షరములకు దైవీజగతీఛందస్సుకాని, యాజుషియైన ఉష్ణిక్ ఛందస్సుకానిచెల్లును. అష్టాక్షరములకు ప్రాజాపత్యమైన గాయత్రీఛందస్సు కానియాజుషియైనఅనుష్టుప్ఛందస్సుకానిచెల్లును నవాక్షరములకుయాజుషియైన బృహతీఛందస్సుకాని అసురియైన జగతీఛందస్సుకానిచెల్లును. దశాక్షరములకు యాజుషియైన పంక్తి ఛందస్సుగాని, ఆసురియైన త్రిష్టుప్ఛందస్సుకాని చెల్లును. ఏకాదశాక్షరములకు యాజుషియైనత్రిష్టుప్ఛందస్సుకాని, అసురియైన

పంక్తిఛందస్సుకానిచెల్లును. ద్వాదశాక్షరములకు యాజుషియై జగతీఛందస్సు ప్రాజాపత్యమైన ఉష్ణిక్ ఛందస్సు, ఆసురియైన బృహతీఛందస్సు, సామమైన గాయత్రీఛందస్సునుజెల్లును. ఇవన్నియును యథాశాస్త్రముగాఁ దెలిసికొనఁదగినవే.

బ్రహ్మాండస్వరూపమైన విశ్వమునకును, బరమాత్మకును "స్వస్వామిభావ" రూపసంబంధముకలదు. స్వామియైన పరమాత్మకుఁజెందినదే "స" శబ్దముచేఁ జెప్పబడుప్రకృతి. ఈ కానవచ్చు విశ్వమంతయును ఆ ప్రకృతియే అందుచేతనే మొదటిమంత్రములోఁ బ్రకృతిపురుషుల సంబంధము భక్తుల ప్రార్థనారూపమునఁ బ్రదర్శింపఁబడినది. లోకమునస్వామియైనవాఁడెవ్వడును స్వమ్మును అనగాఁ దనకుఁజెందినవస్తుజాతమును హింసింపడుకదా! అటులనే స్వామియైన పరమాత్మ, తనలోనిదగు విశ్వమును హింసింపడని ప్రదర్శించుటకుఁ బరమాత్మకు విశ్వపతిత్వమును ఈ పైమంత్రములలోఁ బ్రతిపాదించుచున్నాడు. ప్రధానమైనదగుటచేనలనఁ బ్రథమమున ద్రవ్యవిషయికమైన అధిపత్యము ప్రతిపాదింపఁబడుచున్నది.

## *(1) నామము:- "హిరణ్యబాహవేనమః"*

***శివపరము:-***

భ. భా. భా. స్వర్ణనిర్మితములైన కటకాద్యలంకారములు బాహువులందుఁగల శివునకు నమస్కారము. ఇటబాహూశబ్దము మహాదేవుని శరీరమంతటికిని ఉపలక్షణము. అనగా శరీరమంతటిని సూచించునన్నమాట. అందుచే మహాదేవుని శరీరభాగమంతయును సువర్ణాలంకారాలంకృతమని చెప్పవచ్చును. లేదా శివుని సర్వాంగములును సువర్ణసదృశములనియైన చెప్పవచ్చును. "అ ప్రణకాత్ సర్వఏవసువర్ణస్తస్య" గోళ్లుమొదలు ఆ పరమశివుని శరీరమంతయును సువర్ణమే. "రుక్మాభం స్వప్నధీగమ్యం విద్యాత్తుపురుషం పరమ్" స్వప్నావస్థలోబుద్ధికిగోచరించు అప్పరమపురుషుని శివుని సువర్ణ

కాంతి సంపూర్ణునిగా దెలిసికొనుము; అనెడి పెద్దలవచనములను చెవులార వినుచున్నాముకదా! అవియే పైవిషయములకుఁ బ్రమాణములు.

"హితంచతత్ రమణీయంచ హిరణ్యమ్" అనెడి వ్యుత్పత్తి ననుసరించి పరిశీలించినచో, శివుని శరీరము, జీవుల బాహ్యాంతశ్శత్రుసంహారకము కావున హితమైనదనియు, బాహ్యాంతరానందకరము కావున, రమణీయ మనియు, అందుచే ఆతనికి "హిరణ్యబాహవే" అను నామమేర్పడెనని చెప్ప వచ్చును. మొత్తముపైని శరీరము హ్లాదయరమణీయమనిచెప్పవచ్చును.

శివుని బాహువులు బాహ్యశత్రువులైన రాక్షసులను, శత్రురాజులను సంహరించి, సృష్టికి హితముచేకూర్చుచున్నవి. అంతశ్శత్రువులైన కామక్రోధా దులను గలుగ నీయకయడంచి, భక్తులను గాపాడుటచే శివుని బాహువులు హితకరములని చెప్పవచ్చును. జ్ఞానముద్రధారణచే బాహువుజీవులయజ్ఞాన మును దొలగించి, జ్ఞానమునొసంగి, మోక్షానందము నొసంగుచున్నది. కావున రమణీయము అనియును జెప్పవచును.

అంతేకాదు. శివుడు సూర్యస్వరూపుఁడైనపుడు, అతని బాహువులు కిరణములై కాంతిప్రసారముచే, జీవులకు వాటిల్లు బాహ్యాంతరరోగములను దొలగించి, ఆరోగ్యప్రదానముచే ఆనందము నొసంగుచున్నవి. కావున శివుఁడు హిరణ్యబాహుడని చెప్పవచ్చును.

విష్ణు:-

"హర్యః = గతికాంత్యోః" అను ధాతువునుండి యేర్పడిన హిరణ్య శబ్దమునకుఁ గాంతివంతమైనది, పోవునది అని యర్థములుకలవు. "బాహృ = ప్రయత్నే" అను ధాతువునుండియేర్పడిన బాహుశబ్దమునకు వస్తువులను గ్రహించుటకుఁ బ్రయత్నించునదని యర్థముకలదు.

పైరెండుపదముల కలయికచే "హిరణ్యబాహూపద" మేర్పడెను. అనగా భగవత్స్వరూపుడైన పరమాత్మ, బ్రహ్మాండవాసులైన జీవులను పుణ్యపాపముల నుండియు, బాహ్యాంతశ్శత్రువులనుండియుఁ దొలగించి, రక్షించుటకై దశావతారుఁడై బ్రహ్మాండములోని కేగినవాఁడై జీవులనుబట్టుకొని ఉద్ధరింపఁ బ్రయత్నించినవాఁడు కావున హిరణ్యబాహూ నామకుఁడాయెను.

అంతేకాదు. "బాహూరాజన్యః కృతః" అను శ్రుతిచేఁ బరమాత్మ విష్ణువై తనబాహువులనుండి రాజులనుద్భవింపఁజేసి, వారిచేజీవులను రక్షింపఁజేసి, హితమైనవాఁడాయెను రామకృష్ణాదుల రూపమున రమణీయుఁడై జీవుల నానందపఱచెను. కావున విష్ణువు హిరణ్యబాహూవాయెనని చెప్పవచ్చును.

అంతేకాదు. ఇటుబాహూశబ్దము అంగమంతటికినుపలక్షణము; కాన బాహువు అనగా అంగము, దేహము అని చెప్పవచ్చును.

*"యదాపశ్యః పశ్యతే రుక్మవర్ణమ్"*
*"యఏషోఽన్తరాదిత్యేహిరణ్మయః పురుషః"*

అను శ్రుతులచేఁబరమాత్మయైన విష్ణువుయొక్క శరీరము స్వర్ణవర్ణముకల దనియు; విష్ణువు హిరణ్యమువంటి శరీరము కలవాఁడనియును దెలియు చున్నది. "సువర్ణవర్ణో హేమాంగో వరాంగః" అనెడి విష్ణుసహస్రనామసూక్తిలోఁగల సువర్ణవర్ణుఁడు, హేమాంగుఁడనెడి నామములు పై విషయమునే ప్రకటించు చున్నవి. శివకేశవులొకటియైనను బరమాత్మచేఁ బ్రకృతిలో స్థితిలయకార్య నిర్వహణకై విష్ణువు, శివుఁడు, అనుమూర్తులతో ద్వివిధముగాఁ బ్రవేశపెట్టఁ బడెను. అందుచే శివునకువలె, విష్ణువునకును "హిరణ్యబాహూఁడ" ను నామము చెల్లునని చెప్పవచ్చును.

*బీజాక్షరసంపుటి:-*

పైనామమున "హ్ + ఇ + ర్ + ణ్ + య్ + అ, బ్ + అ + హ్ + ఉ" అని పదునొకండక్షరములుకలవు. నామనిరూపణప్రకరణమున, నమక మునఁగల నామములలో ఇదియే మొదటిది. ఇందలి ఏకాదశాక్షరములును ఏకాదశరుద్రులను "పురమేకాదశద్వారమ్" అను శ్రుతిలోఁజెప్పబడినట్లియు, శరీరమునఁగల ఏకాదశద్వారములను (ఇంద్రియములను) నమకచమకము లందలి ఏకాదశానువాకములను సూచించును. ఇందలి అకారద్వయసహితై కారముచేఁ ద్రిమూర్తులును, అకారముచేఁ బరాశక్తియును బ్రకటింపఁబడు చున్నారు. శక్తిపురుషుల ప్రభావము వాయురూపమునఁ జేతనాచేతనము లందు గలదను విషయము నామము చివరనుగల యుకారముచే వ్యక్తమగు చున్నది. విష్ణుబీజమైన ఇకారము, శివబీజమైనహకారముతోఁగూడి, శివ కేశవాభేదమును సూచించును. పైవర్ణములుగల నామము నుపాసించు భక్తులకు బైయిరువురిలోఁగల స్థితిసంహారశక్తులేర్పడునని తెలియుచున్నది సర్వదైవత్యమైన అకారము అగ్నిబీజమైన రేఫముతోఁగూడియుండుటచే అగ్ని సర్వదేవతా స్వరూపమను విషయమునుస్పష్టమగుచున్నది. అందుచేఁ బైనామము నుపాసించుభక్తులలో "అగ్నిశ్చజాతవేదాశ్చ" అనెడి యారుణ మంత్రములో జెప్పిన అష్టవిధాగ్నులశక్తులేర్పడుననియు, అందుచే వారు అష్ట విధాగ్నిగోళములైన సూర్యాదిగోళములలో సంచరించి, అందలి విజ్ఞానశాస్త్ర విషయములను బ్రపంచమునఁ బ్రదర్శింపఁగలవారలగుదురనియుఁ దెలియు చున్నది. రాహుకేతువులొకటే కావున గ్రహగోళము లెనిమిదని చెప్ప వచ్చును.

"అరోగో భ్రాజః పటరః పతంగః" అనెడి అరుణమంత్రముచేఁ దెలియు అష్టవిధ సూర్యుల శక్తులను బైయెనిమిదిగోళములలో నెట్లుకలవో పైనామము నుపాసించువారు తెలిసికొనఁగలరనియుఁ దెలియుచున్నది

సర్వదేవతాకమైన అకారమును వాయుబీజమైన యకారమును, నంది బీజమైన ణకారముతోఁగూడియుండుటచే బైనామమును జపించువారు పశు శాస్త్రజ్ఞులై పశువులందేర్పడు వాతాదిరోగములను నిర్మూలించి అర్థసిద్ధిచేకూర్ప గలవారలగుదురనియుఁ దెలియుచున్నది.

పరాశక్తిబీజమైన అకారము, త్రిమూర్తిబీజమైన "బ"కారముతోఁగూడి యుండుటచే బైనామమును జపించువారు శాక్తేయులై బాబా మున్నగు మహా యోగులవలె ఆశ్చర్యకరప్రభావములను లోకమునఁ బ్రదర్శించి ప్రస్తుతము ప్రబలమగుచున్న నాస్తికతను దొలగించి, ఆస్తికతను వృద్ధి చేయఁగల వారలగుదురు,

వాయుబీజమైన ఉకారము శివబీజమైన హకారముతోఁగూడియుండుటచే బైనామము నుపాసించువారు శివస్వరూపమైన వాయువుయొక్క ప్రభావమును సంపాదించుకొని, సప్తమేఘమండలములను నడిపించు సప్తవాయువుల యొక్కయు "ప్రభ్రాజమానావ్యవధాతాః" అనెడి యారుణమంత్రమునఁ జెప్పిన ఏకాదశ స్త్రీ పురుషవాయువులయొక్క ప్రభావమును వ్యక్తము చేయగలవారలగుదురని తెలియుచున్నది.

## (2) నామము:- శివ:-

భ భా. భా. "నమస్సేనాన్యే" అథారుణః కేతురుపరిష్టాత్ ఉపాదదాత్ ..........................తతో దేవమనుష్యాః పితరః" అనెడి అరుణశ్రుతిచే బ్రథమసృష్టిలో జలరూపప్రకృతినుండి దేవమనుష్యాదిగణములు పంద్రెండు ఉద్భవించెను. ఆదేవమనుష్యాదులసంఘములనే, సేనలందురు. వారికందఱి కిని నాయకుడగుటచే శివునకు "సేనాని" అనెడి నామమేర్పడెను. (2) పర మాత్మ బ్రహ్మపదార్థము. పరమాత్మే తరమంతయు జీవాత్మగాఁ బరిగణింపఁ బడును. దానికే "భోక్త్రాత్మ" యనిపేరు. అట్టి జీవులసంఘములు చేతనములు

వానికిని సేనఁను నామముకలదు. వానికిని నాయకుఁడు శివుడే. (3) సృష్టిలో ప్రకృత్యాదిపృథివ్యంతమైన తత్త్వసంఘముచేతనము దానికిఁ జెందిన భోగ్య వస్తుజాతము అచేతనము. ఈచేతనాచేతన సంఘములకు "సేన"ఁను నామముకలదు. ఇట్టిసేనలకు "నేత" అనగానాయకుడు శివుడే ఈసేనలకును శివునకును స్వస్వామి సంబంధముకలదు. కావున మహాదేవుడు సేనాని నామధారియాయెను.

విష్ణు :-

సేనాపదమునకువలె గ్రామపదమునకును సంఘమని యర్థముగలదు. కావున శివునివలె విష్ణువునుచేతనాచేతనసేనలకు గ్రామములకు నాయకుఁడై, వానినన్నిటిని ముక్తిస్థానమునకు జేర్చువాడే కాన విష్ణువునకు "సేనానీః" అను నామముచెల్లును. "అగ్రణీర్గ్రామణీః" అను విష్ణుసహస్రమందలి "గ్రామణీః"అను పదము, "సేనానీః" అనుపదమును సమానార్థకములే కాన సేనానీః అను పదమునకు విష్ణువు అను అర్థముచెప్పవచ్చును.

*బీజాక్షరసంపుటి*

ఇందు "స్+ఏ+న్+అ+న్+ఈ" అని అరక్షరములుకలవు. ఇవి అన్నమయాదిషట్కోశములకును, షడృతువులకును జిహ్నములు. షట్కోశములందును, షడృతవులందును ప్రకృతి పురుషరూప పరమాత్మను ఉపాసించు దీక్షయే "షడ్రాత్రీర్దీక్షితో భవతి" అనెడి స్వాధ్యాయబ్రాహ్మణ మంత్రముచే సూచింపఁబడినది.

వీరభద్రబీజమైన ఏకారము శక్తిబీజమైన సకారముతోగూడియుండుటచే ఈ నామముతో ప్రకృతి సహిత పురుషుని ఉపాసించు భక్తులకు, నిశ్చలస్థితి యేర్పడి, సర్వార్థములందును సిద్ధిలభించును. పైనామము నుపాసించురాజు

లకును, వీరులకును సర్వత్ర విజయము లభించును. రోగులకుగల "కామెల, రక్తపుఁబోటు మున్నగు జబ్బులు తొలగును. "నా,నీ," అనువానియందలి, నకారాకారేకారములుమూడును శక్తిబీజములు. కావునఁ బైనామము శక్త్యుపాసకులకు గొప్పవిజయముచేకూర్చును. ముఖ్యముగా రాజులుపాసింపఁ దగినదీనామము.

*(3) నామము:- "దిశాంపతయేనమః"*

*శివ:-*

లోకపాలాత్మకుఁడగుటచే శివుఁడు తూర్పుమున్నగు దిక్కులకుఁ బతియాయెను. ఇంద్రాగ్నియమవరుణాదులు శివుని రూపాన్తరులని వైదిక మంత్రములచేఁ దెలియుచున్నది. కావున శివుడు లోకపాలాత్మకుఁడాయెను సవితయైన సూర్యుఁడు ఉదయించుటచే దూర్పునకుఁ బ్రాచీయనియును, దృశ్యమానుఁడై దక్షిణోత్తరమార్గముల బోవువాఁడగుటచే, దక్షిణోత్తరములనియును, అస్తమించుటచేఁ బడమరకు ప్రతీచీయనియును, నాల్గుదిక్కులకును నామములు వచ్చినవి. దిక్కులకు నియామకుడు ఆదిత్యుడు. అతడు కశ్యపనామముతో నివసించుచోటే మేరువు. అదే అన్నింటిలో ఉత్తమమైనది. అతని సంచారస్థలమైన లోకాలోకమేదక్షిణము. అతడే హిరణ్మయపురుషుఁడై దిగంతరమందు జూడబడుచున్నాడు. అందుచే ఆదిత్యుడే దిక్పతియాయెను. అయాదిత్యుఁడు శివుడేయని క్రిందటి మంత్రములందుఁ జెప్పబడెను పై విషయములను బ్రకటించుమంత్రములే.

"అసౌయస్తామ్రో అరుణః;"
"కశ్యపోఽష్టమః, సమహామేరుంనజహాతి;"
"సర్వేషాముత్తరోమేరుః, లోకాలోకశ్చదక్షిణః;"
"యఏషోఽన్తరాదిత్యేహిరణ్మయః పురుషోదృశ్యతే"

అనునవి ప్రతిదినము దేవసంకీర్తనము - విందిన తర్వాత, తదుపాసనాస్థాన భూతుడైన సవితయొక్క సంకీర్తనముచేయుబడుచున్నది అయాదిత్యుడే సకల ప్రాణులందును బుద్ధిరూపమున నున్నవాడు. పై విషయములను బరిశీలించి నచో "దిశాంపతి" శివుడే యనితెలియుచున్నది.

విష్ణు :-

దిశలనగా వ్యవస్థలు. అవి ద్రవ్యగుణకర్మాది విషయములుగా, ధర్మా ధర్మాధి విషయములుగా, దిగ్దేశకాలాది విషయములుగానున్నవి. వానిని బ్రవర్తింపజేయువాడై దిశాంపతినామమున నున్నవాడు శివుడేకాదు; విష్ణువు కూడ కాన దిశాంపతినామము శివునకువలె విష్ణువునకును జెల్లును. కావుననే విష్ణుసహస్రమున "విదిశోవ్యాదిశోదిశః" అనుచోట విష్ణువు "దిశః" అను నామమున బేర్కొనబడెను.

"దిశ = అతిసర్జనందానమ్" అను ధాతువునుండి యేర్పడిన "దిశ" శబ్దమునకు అవకాశమొసగునది అని యర్థము. ఇట దిశలు స్వంపదార్థములు. పతియనగాస్వామి. స్వస్వామిసంబంధముచే దిశలకు, దిశాంపతికిని భేదము లేదు. కాన "దిశః" దిశాంపతిః "అను రెండునామములును విష్ణువు" అను నర్థమును దెలియజేయును. అందుచే దిశాంపతినామము, విష్ణువునకు జెల్లునని చెప్పవచ్చును. అష్టదిశలందుండు ఇంద్రాదిదేవతలు శివస్వరూపులేకాదు. విష్ణుస్వరూపులుకూడ. అని గ్రహింపవలసియున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "ద్ + ఇ + శ్ + అ + మ్ + ప్ + అ + త్ + ఇ" అని తొమ్మిది వర్ణములుకలవు. అవి నవబ్రహ్మలను, నవావరణలను సూచించును. ఇందలి ఇకారద్వయమును, అకారమును పురుషబీజములు దకారశకారాకారములు శక్తిబీజములు. శక్తిపురుషబీజములు సమానసంఖ్యలోగలవు. షకారము

పర్జన్యబీజము తకారము వాస్తుబీజము. మకారము మదనబీజము అందుచే
బైనామము నుపాసించువారికి శక్తిపురుషులిరవురను జలమున బయనించు
నౌకాదులను నిర్మించుశక్తినొసంగి, తద్ద్వారా సకల వాంఛలను నెరవేర్చెదరు
ధనసంపన్నులగావింతురు.

## —: ద్వితీయయజుస్సు :—

*"నమో వృక్షేభ్యో హరికేశేభ్యః పశూనాంపతయేనమః"*

**అర్థము:—**

హరికేశేభ్యః = హరితవర్ణములైనకేశములు పర్ణరూపమునగల, వృక్షే
భ్యః = వృక్షాకార రుద్రమూర్తులకు, నమః = నమస్కారము, అస్తు = అగు
గాక; పశూనాంపతయే = పశువులకు బాలకుడైనరుద్రునకు, నమోఽస్తు =
నమస్కారమగుగాక.

**తాత్పర్యము:-**

సా. భాష్యము:- రుద్రులు వృక్షరూపులు. హరికేశములు చెట్ల
యాకలై హరితము గల్గియున్నవి. అందుచే వృక్షరూపులైన రుద్రులను
నమస్కరించుచున్నాను. పశుపాలకుడై పశుపతి యని ప్రసిద్ధిగన్న రుద్రుని
నమస్కరించుచున్నాను.

**4, 5. నామములు:- వృక్షేభ్యోనమః; హరికేశేభ్యోనమః:-**

**శివ:-**

శి. భా. భాష్యము:- సకలవృక్షములును రుద్రస్వరూపములే అతడు
అఖిలవృక్షములందునుగలడు. సూర్యేంద్రాగ్నిపర్జన్యులు రుద్రస్వరూపులే.
రుద్రతేజస్సుపై నల్గురిలో ముఖ్యముగాగలదు. వారిశక్తులన్నియును వృక్షము

లందునుగలవు. అందుచే రుద్రుఁడు వృక్షములందుండి చేతనాచేతన ప్రపంచమునకు శక్తినిచ్చుచున్నాఁడు. కావునఁ గొన్నిచెట్లు, వానిసంపద సూర్యతేజస్సుకలవై జీవకోటి కారోగ్యమును జేకూర్చుచున్నవి. రావిచెట్టు క్రిందఁ గూర్చుండి క్షయవ్యాధినిదొలగించుకొనుచున్నారు. జిల్లేడుపాలతో జంతుక్రిమికీటకాది విషబాధనుబోఁగొట్టుకొనుచున్నారు కల్పవృక్షములు ఇంద్రతేజస్సంపన్నములై ఐశ్వర్యభోగములనొసంగుచున్నవి. సంజీవనౌషధి అగ్నితేజస్సంపన్నమై ఆయుర్దాయమునొసంగినట్లు శ్రీరామకథవలనఁ దెలియుచున్నది. చంద్రుసద్దికఱ్ఱలరాపిడిచే అగ్నిపుట్టించియజ్ఞములుచేయుచున్నారు. వర్షన్యాంశముచెట్లలోఁగలదు. కావుననే అడవులలో వర్షపాతమధికముగా జరుగుచున్నది తేమచేకూర్చుటకు వృక్షసంపదయవసరము. ఈనాడువంట చెఱకునకై చెట్లనరకుటచే వృక్షసంపదక్షీణించి, సకాలమున వర్షపాతము లేకున్నది కావున ఈనాడు జాతీయప్రభుత్వము అటవికసంపదనధికము చేయవలసియున్నది.

"మంచాః క్రోశంతి" అను న్యాయమునకు అర్థము మంచములేడ్చుచున్నవనికాదు. లక్షణావృత్తిచే మంచమునందలి నల్లులు ఏడ్చుచున్నవని యర్థము దీసినే శాస్త్రకారులు "తత్స్థ్యాత్తాచ్ఛబ్ద్యమ్" అందురు. పైన్యాయము ననుసరించి వృక్షముల నధివసించియుండు రుద్రులకు నమస్కారములను భక్తులు సమర్పించుచున్నారు. మహాశివునికేశములు వృక్షములందుండుపర్ణములుగా నున్నవి. అవి హరితవర్ణముగలవి. వానియందు శివశక్తికలదు. కావుననే చెట్టి యాకులను ఆహారముగా ఔషధులుగా నుపయోగించుచున్నారు.

"క + ఈశ" అని పదమును విభజించి, "క" అనగా మూలప్రకృతియైన జలమునకు, ఈశ = అనగాఁ బ్రభువు పరమాత్మ శివుఁడు అని చెప్పవలెను. అతనిని "కేశుఁడు" అందురు. అతని శక్తి జలాహారములైన వృక్షములయొక్క పత్రములందు హరితవర్ణముగానుండును. అదియే పిండిపదార్థము

అదియే శివశక్తిచే చక్కెరగాఁగాలాంతరమున మార్పుచెంది ప్రజలకాహార మగును దానినే విజ్ఞానశాస్త్రవేత్తలు కిరణ జనసంయోగక్రియగా వర్ణింతురు. పైకారణమున హరికేశములను భక్తులు నమస్కరించుచున్నారు,

"వృశ్చంతేఃఛేదనకర్మణః సక్ప్రత్యయే వృక్షాః" ఛేదనము అనగా, నరకుట, నాశము అని యర్థము ఛేదనకర్మమైన "వృశ్చ" ధాతువునకు సక్ప్రత్యయముచేరగా "వృక్షాః" అను పదముఏర్పడెను. "వృక్షాః = వినాశ వన్తః" అనగా వినాశముగలవానికన్నిటికిని వృక్షములను సంజ్ఞకలదు. బ్రహ్మాండమందు ఉద్భవించిన బ్రహ్మాదిపిపీలికాంతములైన, అనగాఁ జీమ మొదలు బ్రహ్మవరకునుగల ప్రాణులన్నియును వృక్షములవలె వినాశము కలవే. శ్రీజగదీశచంద్రబోసుగారి ధర్మమున వృక్షములకును ప్రాణముకల దని తెలిసికొంటిమి. కావున వృక్షములును జీవులే.

*శ్లో॥ అబలస్వకులాశినో ఝషాన్,*
*నిజనీడద్రుమపీడినఃఖగాన్।*
*అనవద్యతృణాదినో మృగాన్,*
*మృగయాఘాయనభూభృతాంఘ్నతామ్॥*

అనెడి నైషధకావ్యశ్లోకమునందు నిజనీడద్రుమ పీడులైన = తనకు నీడనొసగు చెట్లను బీడించుపక్షులను, అనవద్యతృణాదులైన = ప్రాణము కలవగుటచే ఆదరింపఁదగు తృణములను భక్షించుమృగములను, బలహీనములైన చిన్న చేపలనుమ్రింగు పెద్దచేపలను సంహరించురాజులకుఁ బాపమువాటిల్లదని చెప్పఁబడెను.

పైశ్లోకమునకు వ్యాఖ్యానమువ్రాసిన మల్లినాథసూరిగారు, వృక్షముల కును దృణములకును బ్రాణముకలదను విషయమును స్పష్టపఱిచినారు.

'ఇందుఁగలడందులేడని సందేహమువలదు" శివుఁడు సకల వృక్షములందును గలడు. కావున భక్తులు హరికేశవృక్షస్వరూపుఁడైన శివునకు నమస్ప్రలర్పించు చున్నారు.

విష్ణు :-

శివునకువలె విష్ణువునకును "హరికేశవృక్షనామముచెల్లును ఎట్లన? వృక్షః = విష్ణువు. వరుణో వారుణోవృక్షః" అనెడి విష్ణుసహస్రసూక్తిలో వృక్షపదము విష్ణుపరముగాఁగలదు. వృక్షఇవస్తబ్ధోదివితిష్ఠత్యేకః" అనెడి శ్రుతిచేవృక్షమువలె అచలుఁడైయుండుకారణమున ఆనామము విష్ణువునకుఁ జెల్లును; అని తెలియుచున్నది.

రుద్రతేజస్సువలె విష్ణుతేజస్సుకూడ చెట్లలోఁగలదు. "వృక్షరాజాయతే నమః" అని లక్ష్మీనారాయణనివాసమైన అశ్వత్థవృక్షమును నమస్కరించు చున్నారు. వృక్షములలో విష్ణుప్రియములు, రుద్రప్రియములని ఆయాదేవత లకుఁ జెందినవి పెక్కుకలవు. ఆయాదేవతలాయావృక్షములందుండు కార ణముననే అట్టి వ్యవహారమేర్పడెను. దేవకాంచన వృక్షాదులు విష్ణుప్రియ ములై రోగనివారణ కుపయోగించుచున్నవి.

హరికేశః = విష్ణువు. కేశవశబ్దములోని ప్రశస్తార్థకమైన వకారము తొలగిన కేశశబ్దము మిగులును హరి అనగాఁ బాపపరిహారకమైన కేశములు కలవాడు హరికేశుఁడు = విష్ణువు. శివకేశవదేహభాగములన్నియును పవి త్రములేకానఁ బైయర్థము పొసగుచున్నది. "కేశవః = పురుషోత్తమః" అను విష్ణు సహస్రసూక్తికిఁ జెందినభాష్యమున శ్రీ శంకరులవారు ప్రశస్తకేశవులు కలవాఁడు కేశవుఁడనియు, అందలి వకారము ప్రశస్తార్థకమనియు వ్రాసి యున్నారు. దానిననుసరించి, పైయర్థము హరికేశశబ్దమునకుఁ జెప్పవచ్చునని తోచుచున్నది.

"క+అ+ఈశ" అను పదములకు బ్రహ్మవిష్ణుమహేశ్వరులని యర్థము పైమువ్వురి సమిష్టిస్వరూపము కేశము. అదిపాపపరిహారకుఁడైన హరివశమున గలదు. కావున విష్ణువు హరికేశుఁడాయెను. "కేశవః కేశిహాహరిః" అను చోట విష్ణుసహస్రభాష్యమున కేశములనగా సూర్యాదుల కిరణములని వ్రాసియున్నారు. "అంశవోయేప్రకాశన్తే" అను భారతశ్లోకమున; అంశువులకు (కిరణములకు) కేశములను సంజ్ఞయున్నట్లుకలదు అవి జీవులపాపపరిహారకములు. అట్టికేశములుకలవాడుకాన విష్ణువు హరికేశుడాయెను. ఈయర్థమున బహువ్రీహి సమాసమగును.

"త్రయఃకేశినః" అను శ్రుతివలన బ్రహ్మవిష్ణుశివ శక్తులకు కేశసంజ్ఞ యున్నట్లు తెలియుచున్నది "మత్కేశావసుధాతలే" అను నార్షోక్తిలో "కేశ" పదముశక్తిపర్యాయముగాఁ బ్రయోగింపఁబడెను. కావున హరికేశుఁడనగా, పాపపరిహారకములైన బ్రహ్మవిష్ణు శివశక్తులుకలవాఁడు విష్ణువు అని తెలియుచున్నది "హరిశ్చాసౌకేశశ్చ = హరికేశః" అని విశేషణోభయపదకర్మధారయ సమాసముగాఁ జెప్పినపుడు హరిశబ్దమునకు జీవులపాపములను హరించువాఁడు విష్ణువు అని తెలియుచున్నది.
కేశపదమునందలి విశేషార్థములును విష్ణువునే తెలియఁజేయుచున్నది.

శ్లో॥ "మారుతే వేధసి బ్రధ్నే పుంసికః, కంశిరోంబునోః"

అను నమరసూక్తిచే "క" శబ్దమునకు బహ్వర్థములు కలవనితెలియుచున్నది.
"క+ఈశుఁడు" = కేశుఁడు" అనగా

"వరాహస్వతపసః, విద్యున్మహసోధూపయః

అను వారుణమంత్రముచేఁ దెలియువరాహాదివాయువులు ఏడింటికిని విష్ణువు ఈశుఁడైవరుణప్రక్రియకావించుచున్నాడు. కాన కేశుఁడు = వాయువులకుఁ బ్రభువు" విష్ణువని తెలియుచున్నది.

"క + ఈశుఁడు = బ్రహ్మకు ప్రభువు విష్ణువు. అతనిచే సృష్టికార్యములు చేయించుచున్నాడని తెలియుచున్నది. "తస్యభాసాసర్వమిదంవిభాతి" అను కఠసూక్తిచే విష్ణుతేజస్సు సూర్యాదులందు గలదని తెలియుచున్నది. కావున "క + ఈశుఁడు = సూర్యునకు ప్రభువు విష్ణువే అని తెలియుచున్నది. "చక్షోస్సూర్యో అజాయత" అను పురుషసూక్త మంత్రముచే, విష్ణువు శిరోభాగము నుండి సూర్యేంద్రాగ్నులు ప్రభవించినట్లుతెలియుచున్నది కావున "క + ఈశుఁడు = కేశుఁడు" అనగా సూర్యాది జననకారణమగు శిరస్సునకు ప్రభువు విష్ణువని తెలియుచున్నది

క = అనఁగా జలమునకు విష్ణువే వరుణరూపుడై ఈశుఁడుగాఁగలడు. కావున హరికేశపదము విష్ణువును దెలియఁజేయుచున్నదని చెప్పవచ్చును.

(4) "వృష" అను పదమునందు వ్ + ఋ + క్ + ష్ + అ" అని ఐదక్షరములుగలవు ఇవి పంచాగ్నులను, పంచకోశములను సూచించును. బ్రహ్మదైవత్యమైన "ఋకారము"తో గూడిన వకారమువరుణదేవతాకము పైరెండు వర్ణములతోఁ గూడిన యీ నామమును ఉపాసించువారికి, గ్రహబాధలును, కామెల, తెల్లమచ్చలు శరీరమునఁ బొడముట, జలోదరము, మున్నగురోగములు తొలగిపోవును.

పైనామమునఁ బ్రజాపతిదేవతాకమైన కకారమును ద్వాదశాత్మదేవతాకమైన (సూర్యదేవతాకమైన) షకారమును సర్వదేవతాకమైన అకారముతో గూడియున్నవి. అందుచేఁ బైనామమును ఉపాసించుచో, దైవానుగ్రహముచే వర్షముకురియును. సర్వలాభములును సిద్ధులును చేకూరును. సర్వజనులును వారికి వశులైయుందురు.

(5) నామము:-

హరికేశుఁడు. ఇందు "హ్+అ+ర్+ఇ+క్+ఏ+శ్+అ" అని యెనిమిదక్షరములుకలవు. ఇవి "అష్టాచక్రానవద్వారా" అను శ్రుతిలోఁ జెప్పినట్లు అష్టచక్రసహిత జీవుని సూచించును ఇందు శివబీజమైన హకారము, సర్వదేవతాకమైన అకారముతోఁగూడియున్నది. అందుచేఁ బైయక్షరములుగల నామమును ఉపాసించువారు శుద్ధస్ఫటికతేజశ్శాలురై జ్ఞానులై సకలమును వశపఱచుకొనగలరు.

వహ్నిదైవత్యమైన రేఫము విష్ణుదైవత్యమైన ఇకారముతోఁగూడియున్నది. దీనినుపాసించువారు అగ్నిమాంద్యము, రక్తపుఁబోటు, శ్యామల నామకవాతరోగము, అను వానిని దొలగించుకొని శత్రువులను దొలగించుకొనఁగలవారలగుదురు. ప్రాజాపత్యమైనకకారము వీరభద్రదేవతాకమైన ఏకారముతోఁగూడియున్నది. ఈ రెండును పీతవర్ణములే. అందుచే ఈ నామము నుపాసించువారు రక్తక్షైణ్యముపొగొట్టుకొని ఒంటిపేక మనుష్యులైనను వాక్చాతురిచే శత్రుభయంకరులై సర్వార్థసిద్ధినొందఁగలరు. చల్లఁదనము చేకూర్చఁగలరు. లక్ష్మీబీజమైన శవర్ణము సర్వదైవత్యమైన అకారముతోఁగూడియుండుటచే ఈనామము నుపాసించువారు ఐశ్వర్యవంతులగుదురు.

(6) నామము:- "పశూనాంపతయేనమః"

శివ:-

భ. భా. భా. మనుష్యులు పశులు మున్నగునవి ద్విపాదపశువులు. గోవులు మున్నగునవి చతుష్పాదపశువులు. పాములు మున్నగునవి గూఢముగాఁ బాదములుగల పశువులు. వాటికన్నిటికిని ప్రభువు పరమేశ్వరుఁడే.

శ్లో॥ "బ్రహ్మాద్యాఃస్థావరాంతాశ్చపశవః పరికీర్తితాః"

అను సూక్తిచే చీమలుమొదలు బ్రహ్మవరకునుగల జంగమప్రాణులకును, కదలక మెదలక ఒకేచోట స్థిరముగానుండు చెట్లు కొండలు మున్నగు స్థావరములకును బశువులను సంజ్ఞకలదని తెలియుచున్నది. "విశ్వేశో భవః పశుపతి స్మృతః" అను పురాణవచనముచేఁ బైన పేర్కొనిన స్థావరజంగమరూప పశువులన్నిటికిని బ్రభువు పరమేశ్వరుఁడేయని తెలియుచున్నది.

శ్లో॥ "సర్వదాయత్పశూన్పాతితైశ్చయత్రమతే పునః।
తేషామధిపతిత్వాచ్చతస్మాత్పశుపతిస్స్మృతః"

అనెడి మహాభారతసూక్తిచే సర్వదాపశువులను గాపాడుచు, వానితోఁ గ్రీడించుచు, వానికధిపతియైన శివునకుఁ బశుపతి యనునామధేయమున్నట్లు తెలియుచున్నది,

విష్ణు:-

శ్లో॥ "ఉత్తరో గోపతిర్గోప్తా," "గోహితో గోపతిర్గోప్తా"

అని రెండుచోట్ల విష్ణుసహస్రమున "గోపతిః" యను నామముకలదు. "స్వర్గేషుపశువాగ్వజ్రదిఙ్నేత్రఘృణిభూజలే" అనెడి అమరసూక్తిచే గోశబ్దమునకు బశువులని యర్థముకలదని తెలియుచున్నది. దీనినిబట్టి, శివునివలె విష్ణువును గోవులకు బశువులకు జేతనాచేతన స్వరూపములకు బతియగుటచే విష్ణువునకును బశుపతినామము చెల్లునని తెలియుచున్నది.

పరికింపగా శివకేశవులిరువురును ఒకటే. ఇరువురును బశువులను జీవులను రక్షించుచు శిక్షించుచున్నవారలే. కావున శివకేశవులిరువురును బశుపతులేయని చెప్పవచ్చును. శివుని వాహనము వృషభము, విష్ణువాహనము

గరుడుడును బలివులేకదా! కాన బలిపతినామము శివకేశవులిరువురికిని జెల్లునని దెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి*

ఇందు "వ్+అ+శ్+ఉ+ప్+అ+త్+ఇ" అని యెనిమిదక్షరములుకలవు. ఇవి దేహమందలి ఎనిమిది చక్రములను, అష్టాగ్నిమండలమ్ము లను సూచించును. పర్జన్యబీజమైన వకారమును లక్ష్మీబీజమైన శవర్ణమును వాస్తుదైవత్యమైన తకారమును శివవిష్ణు వాయుబీజములతోగూడియున్నవి. అందుచే బైరామమును జపించువారు సంపన్నులును, ధనధిపులను గన్ను గొను విజ్ఞానశాస్త్రజ్ఞులును అగుదురని తెలియుచున్నది.

## —: శి వ. ధ్యానమ్ :—

*నమస్సస్పింజరాయత్విషీమతే పథీనాంపతయే నమః॥*

*అర్థము:—*

సస్పిః = బాలతృణము (లేతగడ్డి); పింజరః = పీతరక్తసంకీర్ణవర్ణము. సస్పింజరాయ = బాలతృణమువలె బింజరవర్ణముగల మహాదేవునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక. త్విషీమతే = కాంతిగల రుద్రునకు నమోఽస్తు = నమస్కారమగుగాక. పథీనాం = శాస్త్రములందు జెప్పబడిన దక్షిణోత్తర తృతీయమార్గములకు పతయే = పాలకుడైన రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక.

*తాత్పర్యము:—*

సా. బా. లేతగడ్డికి సస్పింజరమనిపేరు. అది షణ్ముఖుని ఎఱుపు కలిసి

సిన మిశ్రమ వర్ణముననుండును. సస్పివత్ప్రసనువు ఎఱుపురంగుకలయికగల మహాదేవునకు "సస్పింజరు"డను నామముకలదు. అతనిమూర్తియెల్లపుడును గాంతిమంతమే. శాస్త్రములందుఁ జెప్పబడిన దక్షిణోత్తర తృతీయమార్గములకు అతఁడు పాలకుఁడు. అట్టి మహారుద్రునకు నమస్కారము.

## (7) నామము:- సస్పింజరాయనమః:—

శివ:-

భ. భా. భా:— సస్పివలె (లేఁతగడ్డివలె) పీతరక్తవర్ణుఁడు శివుఁడు. అంతేకాదు. సస్పితికా ప్రభృతులు రాక్షసులు. యజ్ఞధ్వంసకారులు. అందుచే శివుఁడు వారిని నశింపఁజేసి, సంస్పింజరనామధారి యాయెను. యజ్ఞవిధ్వంసక రాక్షసులను సంహరించుటయేకదా శివుని కృత్యము. బాలతృణములవలె శివునిజడలు రక్తపీతవర్ణములు కల్గియుండును. అతనిదేహచ్ఛాయయునట్టిదియే

"ప్సా = భక్షణే" అను ధాతువునుండియేర్పడిన "సప్సి" పదము వర్ణద్వయవ్యత్యయముచే, హింస పదముసింహపదముగా మారినట్లు సస్పిగా మారినది. కాండేకాండేవైక్రియమాణేయజ్ఞగ్ంరక్షాగ్ంసిజిఘాంసంతి" అను శ్రుతిచే అయానక్షయములందుఁ జేయుయజ్ఞములను రాక్షసులుపాడుచేసి, యజ్ఞభక్షకులగుచున్నారు. అందుచే మహాదేవుఁడు, వారిని సంహరించి సస్పింజరనామకుడాయెను.

విష్ణు :-

దేవతలు, మహర్షులుచేయు యజ్ఞయాగాదులను ధ్వంసముచేయు, బలి, హిరణ్యకశివుఁడు, సుబాహుమారీచులు మున్నగురాక్షసులు దేవతాదులకు శత్రువులు; దేశద్రోహులు. పరమాత్మవామనుఁడు నృసింహుఁడు శ్రీరాముఁడు మున్నగు నవతారములను దాల్చి, రాక్షసులను సంహరించి, లోకములను గాపాడెను. కావున విష్ణుసహస్రమున శత్రుఘ్నుఁడు శితామిత్రుఁడు, దూరారిహా

"శత్రుజిత్తు" మున్నగునామములు విష్ణుపరముగాఁ బ్రయోగింపఁబడెను. నస్పింజర, శత్రుఘ్న" మున్నగుపదములు సమానార్థకములే. అందుచే, నస్పింజర నామము విష్ణువునకుఁ జెల్లును.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "న్+అ+న్+ప్+ఇ+మ్+జ్+అ+ర్+అ" అని పద క్షరములుకలవు. ఇవి కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను మనోబుద్ధులను సూచించును. వీనినధివసించినదువువారు శివకేశవులేకదా! ఇందలి అచ్చులలో సర్వదేవతాకమైన అకారము త్రిరావృత్తము. ఇకారము విష్ణుబీజము. హల్లులైన నకారపకారమకారజకారరేఫములు వరుసగా శక్తిపర్జన్య మదనేంద్ర వహ్నిబీజములు. పైనామము నుపాసించువారు శాక్తేయులై విజ్ఞానశాస్త్రజ్ఞులై కృత్రిమ వర్షపాతాదులనుగావించి, శత్రుసంహారకులై సర్వత్రవిజయవంతులగుదురు. ఆరోగ్యవంతులగుదురు. ఆరోగ్యదాతలగుదురు.

*(8) నామము:- "త్విషీమతే నమః"*

*శివ:-*

భ. శా. శా. శివుఁడు తేజిష్ఠవపుష్కుఁడు. (మహాతేజశ్శాలి) అగ్ని స్వరూపుఁడు ఆదిత్యస్వరూపుఁడు. కావుననే కుమారస్వామి జననసమయమున అతని తేజస్సునేయొక్కరును భరింపలేకపోయిరి. గంగ, అగ్ని మున్నగువారు భరించిరి. అంతేకాదు. వీరభద్రుఁడై దక్షాధ్వరధ్వంసమొనర్చునపుడు, శివుని ధాటిని ఎవ్వరును దాళలేకపోయిరి. మార్కండేయరక్షణావసరమున యముఁడంతటివాఁడు జోహార్లు, సమర్పించెనుగదా! ఇంకేమిచెప్పవలెను.

అతఁడు స్వయంప్రకాశజ్ఞాన స్వరూపుఁడు వటవిటపిసమీపమున దక్షిణామూర్తియై వృద్ధులైన ఋషులందరకిని జ్ఞానమొసగెనుగదా! అతని తక్కా

నాదమునుండియే వ్యాకరణాదిసకల శాస్త్రములును వెలసినవి. అందుచే శివునకు "త్విషీమంతుడు" అను నామము సార్థకమాయెను.

విష్ణు:-

శ్లో॥ "ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణస్సరసిజాసనసన్నివిష్టః"

అను నార్యోక్తిచే సూర్యమండలమధ్యవర్తి నారాయణుడని తెలియుచున్నది. అందుచే విష్ణువు ఎంతటి త్విషీమంతుడో చెప్పనక్కఱలేకయే అందఱికిని దెలియును గదా! నృసింహావతారము అతని మహాతేజశ్శాలిత్వమును సువ్యక్తమొనర్చెను. అతడు స్వయంప్రకాశజ్ఞాన స్వరూపుడు కావుననే హయగ్రీవుడై సర్వవిద్యలకును ఆధారుడైనాడు.

శ్లో॥ జ్ఞానానందమయందేవం నిర్మలస్ఫటికాకృతిం।
ఆధారం సర్వవిద్యానాంహయగ్రీవముపాస్మహే॥

అను నార్యోక్తియే పైవిషయమునకు ప్రమాణము "అదిత్యోజ్యోతిరాదిత్యః" అను విష్ణుసహస్రసూక్తిలోని "జ్యోతిరాదిత్యనామము" పైవిషయమునే ప్రకటించుచున్నది. "మహాతేజా మహోరగః" అను విష్ణుసహస్ర సూక్తిలోని "మహాతేజాః" అనునది, ఇందలి, "త్విషీమతే" అనునదియును ఒకే యర్థమును దెల్పుచున్నవి. "యదాదిత్యగతంతేజః" అను గీతాసూక్తిచే విష్ణుతేజస్సే సూర్యునియందున్నట్లు తెలియుచున్నది. కావున "త్విషీమంతుడు" అను నామము విష్ణువునకుసార్థకమే.

పరికింపగా శివవిష్ణుతేజస్సులు రెండును ఒక్కటే. సగుణోపాసనలో శివవిష్ణువులను భిన్నులుగా సేవించుచున్నారు. కాని వారిరువురును ఏకరూపులే. వారితేజస్సుచేతనే. సూర్యచంద్రాగ్నులతోబాటు సమస్తప్రకృతియును ప్రకాశించుచున్నది. సూర్యుడువారిచేతనే ఇద్ధుడై (తేజఃపూర్ణుడై) తపించుచున్నాడు.

"తస్యభాసాసర్వమిదంవిభాతి"
"యేనసూర్యస్తపతితేజసేద్ధః"

అను శ్రుతులు పైయర్థమునే ప్రకటించుచున్నవి. కావున "త్విషీమతే" అను నామము శివకేశవులకు సమానముగానే చెల్లును.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "త్+వ్+ఇ+ష్+ఈ+మ్+అ+న్" అని యెనిమిదివర్ణములు గలవు. అవి శివుని అష్టమూర్తులను, అష్టసూర్యమండలములను సూచించును. విష్ణుబీజమైన ఇకారము, వాస్తుబీజమైన తకారముతోడను, వరుణబీజమైన వకారముతోడను, గూడియుండుటచే నీనామము నుపాసించువారికి విష్ణువు జలోదరాదిరోగములను బరిహరించి, మృద్దారులోహాదులతో చిత్రవిచిత్రవస్తువులను నిర్మించుశక్తినొసంగి, సర్వజయములనొసంగును.

మాయాబీజమైన "ఈకారము" ద్వాదశాత్మబీజమైన అనగా సూర్యబీజమైన "షకారముతో"గూడియుండుటచే నీనామము నుపాసించువారికి సూర్యోపాసనాశక్తి లభించును, వారు మయూరకవివలె నీరోగులై జగత్ప్రసిద్ధకవులుకాఁగలరు. పరాశక్తిబీజమైన "అకారము" సాక్షాత్ శ్రీబీజమైన "నకారముతోడను, మదనబీజమైన "మకారము"తోడను కూడియుండుటచే నీనామము నుపాసించువారు శాక్తేయులై స్వయముగా అపమృత్యువును దొలగించుకొనుటయేకాక పరులకువాటిల్లు అపమృత్యువును సైతము తొలగించగలవారై ఆనందకరులుకాగలరు.

## (9) వ నామము:- "పథీనాంపతయేనమః"

*శివ:—*

భ. భా. భా:- పథము = మార్గము మహాదేవుడు. తన భక్తులను, లౌకిక వైదికములైన సన్మార్గములఁ బ్రవర్తింపఁజేసి యజ్ఞాదినిర్వాహకులుగా, అవినీతి

దూరులుగాఁ జేయుచున్నాడు. తన నుపాసించు జీవులను అర్చిరాది మార్గముల బోనిచ్చిముక్తులఁజేయుచున్నాడు.

పథీనాంపతయః = ద్రష్టలైన బ్రహ్మాదులకుఁ బరమ శివుఁడే ప్రభువు. పరమశివుఁడు బ్రహ్మావిష్ణు సురేంద్రాదులచే సృష్టిలో నూతనమార్గములను, రక్షణలో నూతనపద్ధతులను, ఐశ్వర్యప్రదానమునఁ గ్రొత్తత్రోవలను, బరిశీలింపఁజేసి, వారిని నూతన ద్రష్టలఁ గావించుచున్నాడు.

ఈనాడు విజ్ఞానశాస్త్రము దినదినాభివృద్ధినొందుచున్నది. భూజలాంతరిక్షప్రయాణములకు నూతనయంత్రములను సృష్టించుచున్నారు. రక్షణవిధానమునఁ గ్రొత్తపద్ధతులను గనుగొని గోళాన్తర యాత్రసాగించుచున్నారు. ధనార్జనలో, ఆహారవస్తు సంపాదనలో వింతవిషయములను గనుగొనుచున్నారు. జలాగ్నివాయు ఘనద్రవ వస్తునిర్మాణమునఁ గ్రొత్తపరిశోధనలు చేయుచున్నారు; వీటికన్నిటికిని బరమేశ్వరాను గ్రహముగల బ్రహ్మేంద్రాదులే మూలము. కానఁ బరమశివునకు "పథీనాంపతయే" అను నామము సార్థకమాయెను.

విష్ణు:-

ఈ "పథీనాంపతి" అను నామముయొక్క అర్థమునే విష్ణుసహస్రమున "ధర్మగుప్ధర్మకృత్ధర్మీ" అనుదానిలో "ధర్మగుప్" అను నామమున వ్యాసుఁడు ప్రదర్శించినాడు. లౌకికములును, వైదికములునగు సన్మార్గములన్నియును ధర్మములే. అవియే ఇందలి "పథిన్" శబ్దముచే జెప్పబడినవి అవియే యజ్ఞయాగాదులు. వానిని ధనభక్తులచేఁ జక్కగాఁ జేయించి వారిని, అవినీతిహీనులుగాఁజేసి, లోకస్థధర్మములను విష్ణువుకూడ రక్షించుచున్నాడు. "ధర్మస్యప్రభురచ్యుతః" అను విష్ణుసహస్రసూక్తిలో బైనామముయొక్క అర్థమే వివరింపఁబడినది.

శ్లో॥ "ధర్మసంస్థాపనార్థాయసంభవామియుగేయుగే"

అను గీతాసూక్తిలోఁ బైవిషయమే ప్రకటింపఁబడినది. పైనఁజెప్పినధర్మము లను ఆచరించుభక్తులను ముక్తులఁ గావించుచున్నాడు. కావున విష్ణువుకూడ "పతీనాంపతిః" అగుచున్నాడు.

అంతేకాదు. సృష్ట్యాదులలో నూతనమార్గద్రష్టలైన బ్రహ్మేంద్రాదులే "పతయః" అనుపదముచే వ్యవహరింపఁబడుచున్నారు. వారే శూరజనులు. వారికి శివుఁడువలె విష్ణువును ఈశ్వరుఁడే. పతియే నియంతయే. నియామకుఁడే "శౌరిశ్శూరజనేశ్వరః" "నియంతానియమోయమః" "ధృతాత్మానియమో యమః" అనెడి విష్ణుసహస్రసూక్తులలోని నియంతానియమః" అను నామము లచేఁ బైవిషయమే వివరింపఁబడినది. కావున "పతీనాంపతయే" అను నామము విష్ణుబోధకమునగును.

*బీజాక్షరసంపుటి:-*

"పతీనాంపతి" అనునది పతిపతిగామారును. ఇందు "ప్+అ+త్+ ఇ+ప్+అ+త్+ఇ" అని ఎనిమిదక్షరములుకలవు. అవి రుద్రుని అష్ట మూర్తులకును, అష్టాక్షరగాయత్రికిని ఉపలక్షకములు. సర్వదేవతాకమైన ఇకారముతోఁగూడిన పకారము పర్జన్యదేవతాకము రెండుసార్లు ఉపయోగింప బడినది. అందుచేఁ బైనామము నుపాసించువారు సకాలవర్షకారకులై లోకము లకు సకలవృద్ధిసిద్ధులనొసంగఁగలరు. విష్ణుదేవతాకమైన ఇకారముతోఁగూడిన తకారము, ధర్మబీజము, దానితోబాటు వాస్తుదేవతాకము తకారమును ఇందు గలదు. పైవర్ణములుండుటచే ఈ నామమును జపించువారు ధర్మనిలయము లైన దేవాలయములను సత్రములను పాఠశాలలను నిర్మింపఁగలవారలగుదురు

—: చతుర్థయజుస్సు :—

"నమోబభ్లుశాయ వివ్యాధినేఽన్నానాంపతయేనమః"

**అర్థము:—**

బిభర్తి రుద్ర మితి = బభ్రుః = వృషభః సఏవబభ్లుః; తస్మిన్ శేతే = తిష్ఠ తీతి = బభ్లుశః తస్మై బభ్లుశాయ = వాహనమైనఎద్దుపైఁ గూర్చుండునట్టియు; వివ్యాధినే = శత్రువులను విశేషముగా బీడించు శివునకు, నమః = నమస్కారము; అన్నానాంపతయే = అన్నములైన ఓషధులను పాలించు ప్రభువగురుద్రునకు; నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:- పరమశివుఁడు ఎద్దును వాహనముగాజేసికొని, దానిపైఁ గూర్చుండును. తనను ద్వేషించుశత్రువులను విశేషముగా బీడించును. జీవులకు అవసరమగు అన్నములకు ప్రభువై వానినిగాపాడును. అట్టి శివునికొఱకు నమస్కారము సమర్పింపబడెను.

*(10)* వ. నామము:- "నమోబభ్లుశాయ"

శివ:-

భ. భా. భా. నందికేశ్వరుడు శివునకు వాహనమై అతనిని భరించును శివుడు అతనిపైగూర్చుండియుండును. వృషభముజీవులకును ప్రపంచములకును జిహ్వము జీవులకును ప్రపంచమునకును అధిష్ఠానము శివుడు. అతడే పరమాత్మ. కావుననే ప్రకృతి నధిష్ఠించి పరమశివుడుండెనన్నమాట. అంతేకాదు. శివుడే సూర్యస్వరూపుడై ప్రకృతినిమేల్కొల్పును. సూర్యరూపుడుగానుండునపుడు ఉదయానంతరము కపిలపింగళవర్ణముకల్గియుండును. కపిలపింగళ వర్ణమునే బభ్రువర్ణమనందురు. సూర్యునికిరణములు ఎన్నిరంగులు కల్గి

యుండునో, అవి యేయేరోగములను నిర్మూలించునో, "అపాయస్త్రామో" అను మంత్రవివరణమున వివరింపబడెను. కావున బభ్రువనగా శివుడన్నమాట.

*విష్ణు:-*

బభ్రుపదమే వ్యాకరణముచే బభ్రుపదముగామారెను. బభ్రువుయొక్క రూపాన్తరము బభ్రువన్నమాట. రుద్రో బహుశిరాబభ్రుః" అను విష్ణుసహస్ర సూక్తిచే బభ్రునామము విష్ణువునకు జెల్లును. విష్ణువుపదునాల్గులోకములను దన కుక్షిలో భరించియుండెను. కాన విష్ణువు బభ్రువాయెను.

*"పదులునాగు భువనంబులు*
*కుదురుగ నీకుక్షి నిల్పుకొన నేర్పరివై"*

అను కృష్ణశతకపద్యమున పైవిషయమే వివరింపబడెను.

"బిభర్తీతి బభ్రుః" అను వ్యుత్పత్తిచే వృషభము శివునివలె, గరుడుడు విష్ణువును దనపైవహించును. ఆయర్థమునను బభ్రువనగా విష్ణువే అన్నమాట. "రవి ర్విరోచనస్సూర్యస్సవితా" అను విష్ణుసహస్రసూక్తిచే విష్ణువే సూర్యుడని తెలియుచున్నది. కావున సూర్యనామములన్నియును విష్ణుపరములగునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:—*

బభ్రుపదమునకు బీజాక్షరసంపుటి పరముగా అర్థము ఇంతకుమున్ను వివరింపబడెను.

*(11) నామము:- వివ్యాధినే నమః:—*

*శివ:-*

శ. శా. శా:- వివిధం = పలువిధముల, విధ్యతి = బుభుక్షాదిరూపేణ పీడయతి, అనగా జీవులకు ఆకలిదప్పికలు కల్గించి, పూర్వకర్మానుసారముగా

వారిని శివుడు పీడించుచున్నాడన్నమాట. అందుచే శివునకు "వివ్యాధి" అను నామము చెల్లును.

*విష్ణుః-*

"హింసయతీతిసింహః" కాలానుసారముగా జీవులను హింసించువాఁడు విష్ణువు, అనితెలియుచున్నది. "లోహితాక్షఃప్రతర్దనః" అను విష్ణుసహస్ర సూక్తిచే ప్రళయమున భూతకోటిని హింసించువాఁడు విష్ణువు అని తెలియుచున్నది. విష్వక్సేనో జనార్దనః" అను సహస్రసూక్తిచే "జనాన్ అర్దయతీతి = పీడయతీతి" జనులను బుభుక్షాదులచేఁ బీడించువాఁడు విష్ణువని తెలియుచున్నది.

"సింహః; ప్రతర్దనః, జనార్దనః" అను విష్ణుసహస్రనామములు "వివ్యాధినే" అను నామముయొక్క అర్థమునే వివరించుచున్నవి. కావున దానికిఁ బర్యాయపదములేయగును. అందుచే "వివ్యాధిన్" అను నామము విష్ణువునకుఁజెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటిః-*

ఇందు "వ్+ఇ+వ్+య్+ఆ+ధ్+ఇ+న్" అని యెనిమిదక్షరములుగలవు. ఇవి శివుని అష్టమూర్తులకు అష్టచక్రములకును జిహ్నములు. ఇందు విష్ణుబీజములైన ఇకారములు రెండు, పరాశక్తిబీజమైన "ఆకారమొకటియుఁ గలవు. వాయుబీజమైన యకారము, వారుణబీజములైన వకారములు రెండునుగలవు ధనదబీజమైన ధకారమును సావిత్రీబీజమైన నకారమును గలవు. పరికింపగా శక్తిబీజములు, పురుషబీజములును సమానముగాఁగలవు. ఈ నామము కేవలము ఐహికప్రదము. ఉపాసకులు శక్తిసహితపురుషునారాధించి, వాయుబీజప్రభావముచే భూతపిశాచాదులకు ఉచ్చాటనముచెప్పి, భూత

పిశాచాదిబాధలను దొలగింపఁగలరు. వారుణబీజప్రభావముచే జలోదరాది రోగములను నిర్మూలింపఁగలరు. తద్ద్వారాధనార్థనగావించి పరగ్రహబాధా నివారణచేఁ బ్రాప్తించిన పాపమును శక్త్యారాధనచేఁ దొలగించుకొనఁగలరు.

## *(12) వ. నామము:- "అన్నానాంపతయేనమః"*

*శివః-*

భ. భా. భా:- జీవులకవసరమైన అన్నములకు అనగా, ఆహారౌషధాదులకుఁ బతిపరమశివుఁడు అతఁడు తన్నారాధించు భక్తులకు ఆహారౌషధాదుల నొసంగి తృప్తినిబొందించఁగలడు. శివుడు సూర్యస్వరూపుఁడు. సూర్యతేజస్సు చంద్రునిలోఁగలదు. అట్టిచంద్రుని శివుఁడు తన జటాజూటముపై, భూషణముగా దాల్చును. కావున శివుని కరుణలేనిదే జీవులకుఁగాని, సస్యములకుఁ గాని సూర్యచంద్రకిరణప్రసారరూపలాభముచేకూరదు. సూర్యచంద్రుల దయలేకున్నచో జీవులనారోగ్యవంతులగుదురు. చేలుఫలింపవు. అందుచేఁ బ్రతిప్రాణియును ఆరోగ్యాహారాదిసంపాదనకు ఈశ్వరానుగ్రహము సంపాదించవలసినదే. అందులకుఁగాను అన్నపతియైన శివునిగూర్చిజపించవలెను. కాన అన్నపతినామము శివునకుఁజెల్లును.

*విష్ణు :-*

*శ్లో॥ "యజ్ఞగుహ్యమన్నమన్నాదవివచ*

అనెడి విష్ణుసహస్రసూక్తిచే అన్నమ్, అన్నాదః అను రెండును విష్ణునామములని తెలియును. "అత్తీతి అన్నమ్:" "అద్యతఇత్యన్నమ్" అనెడి వ్యుత్పత్తులచే, జీవులచేఁ దినఁబడునది, ప్రళయమున జీవులను దినెడివాడును, (తనలోనికిఁ దీసికొనెడివాఁడును అన్నము అనఁబడునని తెలియుచున్నది. అట్టి యన్నము పరమాత్మయైన విష్ణువనెడి విషయము

"అన్నం బ్రహ్మేతి విజానాత్"
"అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే"
"అద్యతే ఒత్తి చ భూతాని"

అనెడి శ్రుతులవలనఁ దెలియుచున్నది. అన్నాదుఁ డనగా అన్నమును దిను వాఁడు అనగా భోక్తయన్నమాట. అపుడు అన్నము భోగ్యము అగును. పరికింపగా భోక్తయైన అన్నాదుఁడును, అహంశబ్దముచేఁ జెప్పఁబడు పరమాత్మయే అన్నమాట. అంతేకాదు. అన్నముకలవాఁడు అన్నవంతుఁడు. అతడును బరమాత్మయే. ద్రవ్యమునకు బతి ద్రవ్యవంతుఁడు. ద్రవ్యము, అన్నము; ద్రవ్యవంతుడు అన్నపతి. అతడే పరమాత్మయైన విష్ణువు.

"అహమన్నమ్; అహమన్నాదః;
అన్నవానన్నాదో భవతి; మహాన్ భవతి"

అనెడి శ్రుతులే పైవిషయమునకుఁ జెందునని తెలియుచున్నది. పరికింపగా "అన్నము, అన్నాదుడు, అన్నవంతుడు, అన్నపతి" అనెడి నాల్గునామములును శ్రుతిప్రయాణముచే శివకేశవులకు, ఇరువురకును జెందునని తెలియుచున్నది.

ఇందు "అ+న్+న్+అ+ప్+అ+త్+ఇ" అని ఎనిమిదక్షరములు కలవు. ఇవి "అష్టాచక్రానవద్వారా" అను శ్రుతిలో జెప్పిన అష్టచక్రములను అష్టదిక్కులను సూచించును. ఇందలి అకారత్రయము త్రిమూర్త్యాత్మకము. ఇకారము విష్ణుబీజము కాన తురీయపురుషునిసూచించును ఇందలి నకారద్వయము సావిత్రీబీజము. కాన బైనామము సావిత్ర్యుపాసకులకు ముఖ్యము. వారు సావిత్రీదేవికరుణకుబాత్రులై, వాస్తుదైవత్యమైన తకార

మును, పర్జన్యబీజమైన పకారమునుగల పైనామమును జపించి, జలాధారము లైన వాపీకూపతటాకాదులనేకాక, పెద్ద పెద్ద ఆనకట్టలను (Projects) జలాధారములను (Tanks) క్రొత్తపద్ధతిలో వాస్తు శాస్త్రరీత్యా నిర్మింపగలవార లగుదురు. అంతేకాదు, శుద్ధస్ఫటికతేజస్కులై పాపపరిహారకులునుగాగలరు.

—: పంచమయజుస్సు :—

'నమో హరికేశాయోపవీతినే పుష్టానాంపతయే నమః''

*అర్థము:—*

హరికేశాయ = నల్లనిజుత్తుగల (పండనిజుత్తుగల) ఉపవీతినే = మంగళ ప్రయోజనమైన యజ్ఞోపవీతముగల; రుద్రాయనమః = రుద్రునకు నమస్కారము. పుష్టానాం = పరిపూర్ణగుణులైనపురుషులకు, పతయే = స్వామియైన రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక.

*తాత్పర్యము:-*

సా. భా:- పరమేశ్వరుని జుత్తునకు పండుటన్నది యెన్నడునులేదు. అదియెల్లపుడును నల్లనాయుండును. అతడు సుమంగళుడు కాన మంగళార్థము యజ్ఞోపవీతమును సదాధరించును. అతడు సుగుణసంపూర్ణులైన పురుషులకు ప్రభువైయుండెను. అట్టి రుద్రునకు నమస్సులు, సమర్పించుచున్నాను.

*(13) వ నామము:- "నమో హరికేశాయ''*

*శివ:-*

శి. భా. భా:- పరమేశ్వరుని కేశములు సదానీలములే. అతని జుత్తునకు,వాడుట (తెల్లబడుట) యెన్నడునులేదు. "వ్యోమకేశో భవో భీమః" అను

నమరసూక్తిచే వ్యోమమువలె అనగా ఆకాశమువలె అతనికేశములు నల్లగా నున్నట్లుతెలియుచున్నది ఆకాశము శూన్యము. దూరమునుండి చూచునపుడు నల్లగాఁ గానవచ్చును. అట్టియాకాశమువలె ఆతనికేశములు నల్లగానుండునన్న మాట. అందుచే శివుడు నీలకేశుఁడని తెలియుచున్నది.

అంతేకాదు హరి అనగా ఎఱుపుతోఁగూడిన నలుపురంగు దీనినే కపిల వర్ణమందురు. అట్టిరంగుగలకేశములు కలవాఁడు కాన శివుఁడు హరికేశుఁ డాయెను. శివుడు నిత్యయౌవనుఁడను విషయమును ఆతని హరికేశములు తెలియఁజేయును. శివునికేశములు సైతముహరులే అనగాఁ బాపమును బరి హరించునవే. అందుచేతనే పరమపావనయైనగంగ ఆతనికేశములలో బంధింప బడినది. అంతేకాదు. హరియనగా జంద్రుఁడు, కేశములందు (జటాజూట మందు) గలవాఁడు హరికేశుఁడు; అనగాఁ జంద్రశేఖరుఁడన్నమాట. పైవిధ మున శివునకు హరికేశనామముచెందును.

విష్ణు:-

"కంశిరోంబునోః" అను నమరసూక్తిచే "క"శబ్దమునకు "నీరు" అని యర్థముకలదని తెలియుచున్నది. "క+ఈశుఁడు = "కేశుడు" అనగా జలము నకు బ్రభువు అధిదేవతవరుణుఁడు. ఆవరుణుఁడు, హరియే, విష్ణువేకావున, "కేశుఁడైనహరి = హరికేశుడని విష్ణుపరముగా జెప్పవచ్చును.

*"చక్షోస్సూర్యో అజాయత; ముఖాదింద్రశ్చాగ్నిశ్చ; ప్రాణాద్వాయురజాయత"*

అను శ్రుతులచే విష్ణువు దేహభాగములనుండియే ఇంద్రాగ్నిసూర్యవాయువులు ప్రభవించినట్లుతెలియుచున్నది. కానవారందఱికిని బ్రభువు విష్ణువేయని తెలియు చున్నది. అందుచే "హరి+క+ఈశుఁడు" అని పదమును విభజించి,హరి =

సూర్యునకు, క = వాయువునకు, తదన్తర్లీనుడైన అగ్నికిని, ఈశుఁడు = ప్రభువు విష్ణువు అని చెప్పవచ్చును. అపుడు హరికేశపదము విష్ణునామము అగును.

"నమోవృక్షేభ్యోహరికేశేభ్యః" అనుచోట హరికేశపదమునకు బీజాక్షర పరముగా అర్థము వ్రాయఁబడెను.

## (14) వ. నామము;- "నమఉపవీతినే"

*శివ:-*

భ. భా. భా:- యజ్ఞోపవీతముగల అనగా మంగళాచారుఁడైన శివునకు నమస్కారము. ఇట ఉపవీతము మంగళాచారములకు జిహ్నము. పరమేశ్వరుడు మంళాచార్యుడు కావుననే ప్రత్యేకముగా అయర్థమున శివుడు అను నామము, ఆతనికివాటిల్లెను.

ఉపవీతమునందుఁగల బదుముడులు, పంచాగ్నులకును, పంచభూతములకును ఉపలక్షకములు అయగ్నులకును అభూతములకును ప్రభువు రుద్రుఁడు. ఒక్కొక్కముడిలో తొమ్మిదేసిదారములుండును. అవి శరీరమునఁ గల నవద్వారములకు ఉపలక్షకములు నవద్వారావరణమే, శరీరము. దానితో జీవచైతన్యమును సంధించు ముడియేబ్రహముడి. అదిపరమాత్మకు ఉపలక్షకము. కావున ఉపవీతము జీవపరమాత్మలసమిష్టిరూపము. అట్టియుపవీతము కలవాడు ఉపవీతి. అనగాదాని కధిదేవతయే శివుడు. అందుచే ఉపవీతి పదము శివనామమాయెను.

విష్ణుః-

"పవిత్రంమంగళంపరమ్" అను విష్ణుసహస్రసూక్తిలో జెప్పిన "మంగళంపరమ్" అనుపదియును, మంగళాచారుఁడను నర్థముగల ఉపవీతి పదమును సమానాభిప్రాయముగలవే

శ్లో॥ "అశుభాని నిరాచష్టేతనోతిశుభసన్తతిం।
స్మృతిమాత్రేణయత్పుంసాం బ్రహ్మతన్మంగళంవిదుః"

అను విష్ణుపురాణవచనముచే అశుభములను నొలగించి శుభములను విష్ణువు చేకూర్చుననియు, అందుచే మంగళరూపుడై, సర్వోత్కృష్టుఁడుగానున్న కారణమున అతనికి "మంగళంపరమ్" అను నామము చెల్లుననియును దెలియును. అభావమునే ఉపవీతిపదము తెలియఁజేయును. కావున ఉపవీతినామము విష్ణువునకు జెల్లునని చెప్పవచ్చును.

ఉపవీతధారణము (జంధెముదాల్చుట) సజ్జనకర్మాచరణమే. దానినాచరించుకారణముచేతనే "ఊర్ధ్వగస్సత్పథాచారః" అను విష్ణుసహస్రసూక్తిలో "సత్పథాచార"నామము విష్ణుపరముగాగలదు. "ఉపవీతి, సత్పచారః" అను రెండును రమారమిగా సమానార్ధకములే. కాన ఉపవీతినామః విష్ణువునకు జెల్లునని చెప్పవచ్చును.

శ్లో॥ "ఓంకారః ప్రథమస్తంతుః ద్వితీయోఽగ్నిస్తథైవచ।
తృతీయోభగదైవత్యశ్చతుర్థస్సోమదైవతః
పంచమః పితృదైవత్యః షష్ఠశ్చైవప్రజాపతిః।
సప్తమోవిష్ణుదైవత్యః ధర్మశ్చాష్టమఏవచ
నవమస్సర్వదైవత్య ఇత్యేతేనవతంతవః। "

అనెడి స్మృతిముక్తాఫలోక్తదేవలసూక్తిచే ఉపవీతమందలి తొమ్మిదిపోగులకుఁగల దేవతామహిమతెలియుచున్నది. నవతంతువులందలి నవదేవతలును శివ

విష్ణుతేజస్కులే. నవతంతువులను శివకేశవులిరువురును అధిష్ఠించియుందురు. నవతంతువులనువరునగా (1) ఓంకారము (2) అగ్ని (3) భగుడు (4) సోముడు (5) పితరులు (6) ప్రజాపతి (7) విష్ణువు (8) ధర్ముడు (9)సర్వదేవతలును ఆశ్రయించియుందురు వీరుశివకేశవస్వరూపులేకాన ఉపవీతినామము శివకేశవులకు సరిగా వర్తించునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:—*

ఇందు "ఉ+వ్+అ+వ్+ఈ+త్+ఇ+న్" అని యెనిమిదక్షరములుగలవు. ఇవి "భిన్నాప్రకృతిరష్టధా" అను గీతాసూక్తిలో జెప్పిన అష్టప్రకృతులకు ఉపలక్షకములు. పర్జన్యదేవతాకమైన వకారము. ముందున వాయుదేవతాకమైన ఉకారముతోడను, వెనుకను సర్వదేవతాకమైన అకారముతోడను గూడియున్నది అట్టివర్ణములతోగూడిన పైనామమును జపించువారు, వాయుగుండములు, అతివృష్ట్యనావృష్టులు మున్నగు బాధలను దొలగించి, లోకమును రక్షింపగలవారలగుదురు. పైకార్యములాచరించిన కారణమున రాజులును వారికి వశులగుదురు. సర్వార్థముల సిద్ధినొసంగగలరు బొల్లి, కాలిమ, రక్తపుపోటు మున్నగురోగములను నివారింపగల వారలగుదురు. వరుణదేవతాకమైన వకారము, మాయాశక్తిబీజమైన ఈకారముతో గూడియున్నకారణమున నైనామము జపించువారు శుద్ధస్వచ్ఛమును, రోగనాశకమునగు జలములభించుతావులను గనుగొని వాపీకూపతటాకాది నిర్మాణ కర్తలు కాగలరు. విష్ణుబీజమైన ఇకారముతోడను, సావిత్రీదేవతాకమైన నకారముతోడను వాస్తుదైవత్యమైన తకారముకూడియుండుటచే నైవర్ణములు గల నామమును జపించువారు శాక్తేయులై శక్తిప్రభావముచే నూతన గృహయంత్రాది నిర్మాతలై పాపనాశకులై సర్వజయప్రదులగుదురు.

*(15) వ. నామము: "పుష్టానాంపతయేనమః"*

*శివ:-*

భ. భా. భా:- పుష్టులకుఁబతియైన శివునకు నమస్కారము. (1) వాక్పుష్టి (2) జ్ఞానపుష్టి (3) శరీరేంద్రియపుష్టి (4) గృహక్షేత్రపుష్టి (5) ధనధాన్యపుష్టి (6) ప్రజాపుష్టి (7) పశుపుష్టి (8) గ్రామపుష్టి (9) ధర్మపుష్టి (10) అణిమాదిపుష్టి యని పుష్టులు పదివిధములు.

వాక్పుష్టియనగా విద్యావిషయికమైన పుష్టి. ఒకప్పుడు విద్యలన్నియును బ్రకృతిలోనంతరించగాఁ బరమశివుడు దక్షిణామూర్తియై వృద్ధ శిష్యులైన మునులకు విద్యలనొసంగి విద్యలను విద్యావంతులను గాపాడినాడు. కావుననే "నిధయేసర్వవిద్యానామ్". అని సకలవిద్యలకును నిధిపరమశివుఁడను ప్రశస్తి వాడిల్లినది. దీనిచే వాక్పుష్టినొసంగి పాలించినవాఁడు మహాదేవుఁడని తేటతెల్ల మగుచున్నది.

*శ్లో॥ "సకలమునిజనానాంజ్ఞానదాతారమారాత్"*

అను సూక్తిచే సకలమునులకును, తద్వారాలోకులెల్లరకును జ్ఞానదాతయై మహాశివుఁడు జ్ఞానపుష్టిపాలకుఁడైనట్లు స్పష్టపడుచున్నది,

పరమశివుఁడు సూర్యస్వరూపుఁడై ఆరోగ్యదాతయై సకలజీవులను రక్షించెను. "సూర్యోనోదివస్పాత్" అను ఋక్కులలో దివమునుండి సూర్యుఁడు కిరణప్రసారమొనర్చి, మయూరకవికివలె, సకలస్పష్టికిని శరీరేంద్రియపుష్టి నొసంగిపాలించినట్లు వివరింపఁబడెను. కావున శరీరేంద్రియ పుష్టిపాలకుఁడు సూర్యరూపశివుఁడేయని తెలియుచున్నది.

"క్షేత్రజ్ఞపతినావయగ్ంహితే నేవజయామసి,
గామశ్వంపోషయిత్వానసో మృడాతీదృశే"

అను శ్రుతిని బరిశీలించినచో మహాశివుఁడు క్షేత్రజ్ఞుఁడై గృహక్షేత్రపుష్టిని, ధన ధాన్యపుష్టిని, ప్రజాపుష్టిని, పశుపుష్టిని, గ్రామపుష్టిని ఒసంగి, పాలించినట్లు తెలియుచున్నది. బ్రహ్మతాను సృషించిన కన్యను దాను ప్రేమించగాఁ దప్పని తలంచి, అతని శిక్షింప శివుఁడేగగా, బ్రహ్మమృగరూపధారియై పఱుగు లెత్తెనట. అమృగమును శివుఁడుచేతఁ దాల్చెనట. దానినీనాడు చిత్రములలో మనము చూచుచున్నాము. అమృగమే, మృగశీర్షానక్షత్రమని జ్యోతిష్కులు చెప్పుదురు. ఇట్లు అధర్మమును అరికట్టిధర్మమును శివుఁడు కాపాడెను. కావున ధర్మపుష్టిపాలకుఁడు పరమ శివుఁడని చెప్పవచ్చును.

అణిమ, గరిమమున్నగు అష్టసిద్ధులును బరమశివునివే అవియేసృష్టిలో మహాత్ములకు సంక్రమించినవి. అందుచే అణిమాది పుష్టిపాలకుఁడు పరమ శివుఁడే యని తెలియుచున్నది. అందుచే "పుష్టానాంపతిః" అను నామము శివునకుఁ జెల్లునని చెప్పవచ్చును.

విష్ణు :-

"వాక్పతిశ్చషుష్టతిః" అను శ్రుతిలో శివునివలె విష్ణువును వాక్పతియై నట్లు తెలియుచున్నది.

"అధారంసర్వవిద్యానాంహయగ్రీవముపాస్మహే"

అను సూక్తిచే విష్ణువే హయగ్రీవుఁడై, సర్వవిద్యాధారుడును, విద్యాదాతయునై వాక్పుష్టిపాలకుఁడైనట్లును "జ్ఞానానందమయందేవమ్" అను దానిచే జ్ఞాన పుష్టిపాలకుఁడైనట్లును తెలియుచున్నది.

అహల్యాదేవిచరిత్రచే విష్ణువే శరీరేంద్రియపుష్టిపాలకుఁడైనట్లు తెలియు చున్నది.

"క్షితీశః గోపతిః ధనేశ్వరః ప్రజాపతిః ధర్మాధ్యక్షః, ధర్మః, ధర్మ గుప్" మున్నగు విష్ణుసహస్రనామములను బరిశీలించినచో విష్ణువే, గృహ క్షేత్ర ధనధాన్య ప్రజాపశుగ్రామ ధర్మరూపములైన పుష్టులను బాలించు వాఁడని స్పష్టపడుచున్నది.

"అణుఃబృహత్" అను విష్ణుసహస్రనామములను బరిశీలించినచో అణి మాది పుష్టిపాలకుఁడు విష్ణువేయని తెలియుచున్నది. కుచేలునకు ధనధాన్య పశుగృహాదులను ఒసంగి రక్షించినవాఁడు విష్ణువేకదా!

"రామోవిగ్రహవాన్‌ధర్మః" అను సూక్తిచే విష్ణువేధర్ముడై ధర్మపాల కుఁడైనట్లు తెలియుచున్నది.

"తుష్టఃపుష్టశ్శుభేక్షణః" అను సహస్రసూక్తిలోఁగల "పుష్టః" అను విష్ణునామము పుష్టానాంపతయే" అను నామకనామమును ఒకటియేకదా! కావున "పుష్టానాంపతయేనమః" అను నామము శివకేశవులు ఇరువురికిని సమానముగనే చెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "ప్+ఉ+ష్+ట్+అ+ప్+అ+త్+ఇ" అని తొమ్మిది యక్షరములుకలవు. ఇవి నవావరణములను, నవబ్రహ్మలను, శరీరమందలి నవద్వారములను సూచించును.

పర్జన్యదేవతాకమైన పకారము, వాయుదేవతాకమైన ఉకారముతోఁ గూడియున్నకారణమున నైనామము నుపాసించువారు ప్రాణాయామప్రక్రి

యలో వాయువుయొక్క ఒత్తిడిచేఁ బర్జన్యాధిదైవమైన మూర్ధమునకు (శిరస్సునకు) కుండలినీ శక్తినిజేర్చి అటనున్న సహస్రారమునఁ బరమాత్మను దర్శించి, బ్రహ్మాత్వముపొందఁగలరనియు బ్రతత్వభావముచే వాయుగుండ ప్రమాదములను దొలగించి, సకాలవర్షములను గురిపించి, వృద్ధిసిద్ధులను బొందఁగలరని తెలియుచున్నది.

సూర్యదేవతాకములైన షకారటకారములు సర్వదేవతాకమైన "అ"కారముతోఁగూడియున్నకారణమున బైనామము నుపాసించువారు ఆరోగ్యసంపన్నులై ప్రకృతిలోనిజీవులకు ఆరోగ్యముచేకూర్చుగలవారలగుదురని తెలియుచున్నది.

పర్జన్యదేవతాకమైన "ప"కారము సర్వదేవతాకమైన "అ"కారముతోడను, వాస్తుదేవతాకమైన "త"కారము విష్ణుదేవతాకమైన "ఇ"కారముతోడనుగూడియున్నవి. అందుచే బైనామము నుపాసించువారు పెద్దపెద్ద ప్రోజక్టులను నిర్మింపఁగల జ్ఞానమునొంది, వర్షపాతముచే లభించిననీటిని, నిల్వచేయింపఁగలవారై జలమును తద్ద్వారా పంటలను అమితముగా లోకమున కందింపఁగలవారలగుదురు. పైనామము నుపాసించువారు, మహావైద్యులును రసాయనికశాస్త్రవేత్తలునై రోగనివారణౌషధనిర్మాతలు కాఁగలరని తెలియుచున్నది.

—: షష్ఠయజుస్సు :—

"నమోభవస్యహేత్యై జగతాంపతయేనమః"

అర్థము:—

... భవస్య = సంసారమునకు, హేత్యై = ఆయుధమైన (సంసారభేదకుఁడైన) రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక; జగతాం = లోకము

లకు, పతయే = పాలకుఁడైన రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక.

**తాత్పర్యము:-**

సా. భా:- వృక్షములను గుఠారములు ఖండించును. శత్రువులను సమరమున ఆయుధములు ఖండించును. అటులనే రుద్రుఁడు జీవుల సంసారమును భేదించి, వారికి జననమరణభీతిలేకుండఁజేయును. అందుచే శివుఁడు భవహేతి (సంసారచ్ఛేదకుడాయెను. అతఁడే పదునాల్గు భువనములను బాలించు మహానుభావుఁడు. కావున భక్తులాతనికి నమస్కారములను సమర్పించుచున్నారు.

## (16) వ. నామము:- "భవహేతి"

*శివ:-*

భ. భా. భా:- భవము అనగా సంసారము హేతిఅనగా ఆయుధము. శివుఁడు సంసారమునకు హేతివంటివాఁడు. అనగా సంసారచ్ఛేదకుఁడని యర్థము కాంతాకనకాదులతోనిండినదే, సంసారము. అట్టికాంతాకనకపూర్ణ సంసారమునందు ఆసక్తిలేనివాడు పరమశివుఁడొక్కడే. బ్రహ్మదేవుడు కాంతా కనకములకుఁజెందునట్లు, ద్వివిధములగుభ్రమలను సృష్టించినాడు. అట్టి భ్రమలు పరమ శివునకులేవు కావుననే, త్రిపురసుందరి (పార్వతి) వామ భాగముననున్నను అతఁడు అనాసక్తుఁడే అష్టైశ్వర్యములున్నను వానిని ఒరులకు ఇచ్చుచున్నాడేకాని, తాననుభవింపక శ్మశానమున నివసించుచున్నాడు. కావున శివుడు సంసారానాసక్తుఁడై తనను అర్థించుభక్తులకు సంసారచ్ఛేదనమొనర్చి, సంసారానాసక్తులఁ గావించుచున్నాడు. అది సహజమేకదా! ధనవంతుఁడు అర్థికి ధనమిచ్చును. భూములుకలవాఁడు యాచకునకు భూమి నొసంగును.



శ్లో॥ భూనాయకంవాధననాయకంవాభజన్
భవంవాధనమేతిలోకే"

అను నార్యోక్తి పైవిషయమునే ప్రకటించుచున్నది.

అంతేకాదు. భవమనగా జన్మము. శివుఁడు అద్యన్తరహితుఁడు. కాన తననువేడుభక్తులకు భవహేతియై జన్మరాహిత్యముచేకూర్చును.

భవస్య హేత్యై = సంసారనిమిత్తకహింసాస్వభావమునకు అని యు, భాస్కరాచార్యులవారర్థమొసంగిరి. శివుఁడు హింసాస్వభావుఁడెట్లందురేని పరికింపుడు. ప్రతిప్రాణికిని వానిపూర్వజన్మకర్మఫలమునననుసరించి, వానికి జననము ప్రాప్తించును. అందాతనిచే శివుఁడు కర్మఫలమనుభవింపఁజేసి హింసించును. అట్లు హింసననుభవించుటచేఁ బ్రాణికిఁగలకర్మరాశి క్షీణించిప్రాణి తరించును. అట్లు కావించుటచే శివుడు హింసాత్మకుఁడాయెనని చెప్పవచ్చును. అందుచే "భవహేతి" యను నామము శివునకుఁ జెందును.

విష్ణు:-

భవమనగా సంసారము. జననమరణప్రాప్తియే సంసారమని "సనత్సుజాతీయమున జెప్పబడెను. విష్ణువు భక్తుఁడైన గజేంద్రుని, మొసలివలన జావకుండగాపాడెనుగదా! భక్తుడైన ధ్రువునితపంబునకుమెచ్చి, ఆతనిని జననమరణరూపసంసారవిదూరునిగావించెనుగదా! కావున విష్ణువు భవహేతి, సంసారచ్ఛేదకుడాయెను. శివుడువలె విష్ణువును భక్తులకు భవచ్ఛేదము (జన్మచ్ఛేదము) గావించిముక్తినొసంగినవాడే. పూర్వజన్మకర్మఫలముగాఁ బ్రాప్తించిన సంసారమున జిక్కిన జీవులను దుష్టమార్గవర్తనులైనపుడు వారిని శిక్షించి హింసించి, బయము కల్గించువాడైనను భయనాశకుడును అగుచున్నాడు. కావుననే విష్ణుసహస్రమున "భయకృత్ బయనాశనః" అను నామములు విష్ణు

పరములుగా నున్నవి. భవహేతి, భయకృత్" అను రెండు నామములును తుల్యార్థకములే.

విష్ణుసహస్రనామములలో గల "హరి" అనుపదమునకు సమూలముగా సంసారమును హరించువాడను నర్థము శ్రీ శంకరులవారిచే జెప్పబడెను కావున హరియన్నను, భవహేతియన్నను ఒక్కటే. విష్ణువు భవహేతికావుననే శబరిమున్నగు భక్తుల సంసారమును ఛేదించిముక్తుల గావించినాడు. అందుచే భవహేతినామము విష్ణువునకును జెందుననియే చెప్పవచ్చును.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "బ్+అ+వ్+అ+హ్+ఏ+త్+ఇ" అని ఎనిమిదక్షరములుగలవు. అవి అష్టప్రకృతులను అష్టాంగములను సూచించును.

భార్గవపదమునకు శుక్రుడు, శివుడు, పరశురాముడను నర్థములుకలవు భార్గవబీజమైన "భకారము" సర్వదేవతాకమైన అకారముతో గూడియున్నది అందుచే నీనామము నుపాసించువారు అహంకారగర్వహీనులై, జ్ఞానసంపన్నులై లోకమునకు నూతనమార్గమును జూపువిద్యలను ప్రదర్శింపగలరు. నీతిశాస్త్రవేత్తలుకాగలరు. వరుణదేవతాకమైన వకారము అకారముతోగూడియున్నకారణమున నీనామము నుపాసించువారలు జలాకరమైన సముద్రమునగల వింతలను బరిశోధించుశక్తిని సంపాదించుకొనగలరు.

శివబీజమైన హకారము వీరభద్రబీజమైన ఏకారముతోగూడియుండుటచే నీనామము నుపాసించువారు నిరంకుశపరిపాలకులుకాగలరు. వాస్తుబీజమైన తకారము విష్ణుబీజమైన ఇకారముతోగూడియుండుటచే నీనామము నుపాసించువారు వాస్తుశాస్త్ర విజ్ఞానసంపన్నులై నూతనయంత్రనిర్మాతలుకాగలరు. సర్వరోగనివారకవైద్యశేఖరులుకాగలరు.

(17) వ. నామము:- "జగతాంపతయేనమః"

శివ:-

భ. భ. భా:- జగతాం = పృధివ్యాదిలోకములకు, పతయే = స్వామియైన శివునకు, నమః = నమస్కారము. అతల, వితల, సుతల, రసాతల, పాతాళాదులైన అధోలోకములువేడు, భూర్లోక, భువర్లోక, సువర్లోకాదులు ఊర్ధ్వలోకములువేడు మొత్తము పదునాల్గు భువనంబులుకలవు.

"స్థావరోహ్యథజంగమః" అను శ్రుతిలో జెప్పినట్లు పదునాల్గులోకములును స్థావరములైన పర్వతాదులతోడను, జంగమములైన పశుపక్ష్యాదులతోడనునిండియున్నవి. వీటికన్నిటికిని భగవంతుడే ప్రభువు. ప్రాణముగలవి, ప్రాణములేనివియునగు వస్తుజాతమును బుట్టించి, పెంచి, నశింపజేయువాడు పరమాత్మయే. అతడే జనన మరణాత్మకమైన సంసారమున సృష్టికర్త ప్రాణులను సృష్టింపగావారికర్మలననుసరించివానిని భేదింపజేయుచున్నాడు. విన్నులను రక్షించుచున్నాడు ఈపనులన్నియును శివునిచే జరుగుచున్నవి. కావున శివుడు జగత్పతి నామమున బఱగుచున్నాడు.

విష్ణు:-

పరికింపగా శివుడు సంహారకర్త. విష్ణువు రక్షణకర్త. కావుననే నారాయణుడు బ్రహ్మాదులను భిన్నులుకాగా రక్షించినాడు. అందుచే శివుడువలె విష్ణువును జగత్పతియే.

"లోకనాథోమాధవో భక్తవత్సలః" అను విష్ణుసహస్రసూక్తిలో, లోకనాధపదము విష్ణుపరముగా బ్రయోగింపబడెను,

"గచ్ఛతీతిజగత్, గమ్యతఇతిజగత్" అను వ్యుత్పత్తులచే స్థావరజంగమరూపమున నడచుచునది, పరమాత్మనుజేరునది, ముక్తినిబొందింప

బడునది జగత్తు అయెనని తెలియుచున్నది. "లోక్యత ఇతి లోకః" అను వ్యుత్పత్తిచే స్థావరజంగమరూపమున జూడబడునది లోకము అని తెలియుచున్నది. కావున లోకము, జగత్తు అననొకటియే. పతి, నాథుడు అననొకటియే అందుచేతనే "జగత్తు, లోకము" అను రెండుపదములును సమానార్థకములైనవి.

జగత్తుచే, లోకముచే యాచింపఁబడువాఁడును, జగత్తులకు లోకములకు నియమనము అశాసనము, శాసనము చేయువాఁడునుగానఁ బరమాత్మ, జగత్పతి, లోకనాథుఁడును ఐనాడు. ఒకే పరమాత్మ, శివుఁడు, విష్ణువు అను భిన్నదృష్టులకు భిన్నులుగానున్నట్లున్నను ఇరువురును ఒకటియే. కావున జగత్పతి, లోకనాథుఁడు అనునామములు శివకేశవులకు సమానముగనే వర్తించునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "జ్+అ+గ్+అ+త్+ప్+అ+త్+ఇ" అని తొమ్మిది యక్షరములు కలవు. ఇవి నవగ్రహములకును, శరీరస్థనవద్వారములకును చిహ్నములు. ఇంద్రబీజమైన జకారమును గణపతిబీజమైన గకారమును సర్వదేవతాకమగు అకారముతోఁగూడియున్నవి. పైమూడు వర్ణములును రక్తవర్ణములే. అందుచేఁ బైనామము నుపాసించువారలు, రక్తబలముకలవారైనిర్విఘ్నముగా బాహ్యాభ్యన్తరశత్రువులను జయింపఁగలవారగుదురు. వీనితో వాస్తుదేవతాకమైన తకారముకూడియున్న కారణమున యుపాసకులు మహాభవననిర్మాతలేకాక, మహాభవనాధిపతులునుగాఁగలరు. పర్జన్యదేవతాకమైన పకారము అకారముతోడను, వాస్తుబీజమైన తకారము విష్ణుదేవతాకమైన ఇకారముతోడనుగూడియున్న కారణమున, ఈనామము నుపాసించువారలు తటాకాదులు నిండునట్లు వర్షముకురింపఁగలవారలగుదురు.

సూచన:-

(1) ఓం (2) స్వాహా, (3) స్వధా (4) వషట్ (5) నమః అను నైదును పంచబ్రహ్మలకు నామములు. పంచబ్రహ్మలనగాఁ బంచవేదపురుషు లన్నమాట. "నమోహిరణ్యబాహవే" అనునది మొదలైన పంచమంత్రములతోఁ బంచబ్రహ్మలను బృథక్ వర్ణులుగాఁ బ్రతిపాదించి, పిమ్మట పంచ బ్రహ్మాత్మకుఁడు రుద్రుఁడనియు, అందుచేతనే పంచవక్త్రుఁడు ఐదుమోములు కలవాఁడాయెననియు అతఁడే జీవకోటికిఁగల సంసారమును ఛేదించువాఁడని యును ఈ యజుర్మంత్రములో నిరూపింపఁబడెను.

—: సప్తమయజుస్సు :—

"నమోరుద్రాయాఽఽతతావినే క్షేత్రాణాంపతయేనమః"

అర్థము:-

ఆతత + అవినే = విస్తరింపఁబడినధనుస్సుతో రక్షించునట్టి రుద్రాయ = రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక; క్షేత్రాణాం = శరీరములకో, (లేక) పుణ్యక్షేత్రములకో, పతయే = పాలకుఁడైన రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక.

తాత్పర్యము:-

సా. భా:- పరమశివుఁడు తన ధనుస్సైనపినాకమును బాగుగా విస్తరింపఁజేసి, దానితో సకలలోకములను రక్షించుచున్నాడు. అతడే చేతనా చేతనముల శరీరములను పుణ్యక్షేత్రములను పాలించుచున్నాడు. కావున అట్టి రుద్రునకు భక్తులు నమస్సులు అర్పించుచున్నారు.

## (18) వ. నామము:- "రుద్రాయనమః"

శివ+విష్ణు:-

ఈ రుద్రనామవిశేషములు ఇంతకుమున్ను వివరింపఁబడినవి.

## (19) వ. నామము:- "ఆతతావినేనమః"

శివ:-

భ. భా. భా:- ఇట "ఆతత+అవినే" అని పదవిభాగముచేయవలెను ఆతతము అనగా విస్తరింపఁబడిన ధనుస్సు అని యర్థము. ధనస్సును విస్తరించుటయనగా, ధనుస్సునఁద్రాడు బిగించి, శరముసంధించి, రక్షించుటకు సిద్ధముగానుంచుటయని యర్థము.

"అవ = రక్షణే" అను ధాతువునుండియేర్పడిన "అవినే" అను పదమునకు రక్షించువాఁడనియర్థము శివుని ధనుస్సుమేరువు. దానిలో సమస్త ధనములునుగలవు. కాన ఆతఁడు తన ధనుర్మహిమచే లోకములకు, సమస్త వస్తుజాతముచేకూర్చి, రక్షించునని తెలియుచున్నది.

"జ్యాసావిత్రీధనురోంకారః" అను సూక్తిచే ఓంకారమే శివధనుస్సు అని తెలియుచున్నది. ఓంకారము త్రిమూర్తిస్వరూపము; సూర్యస్వరూపమును గాన, శివుఁడు తన ధనుస్సుతో దుష్టశక్తులను సంహరించియు, జీవులకు ఆరోగ్యముచేకూర్చియు రక్షించుచున్నాడని తెలియుచున్నది. శివధనుస్సునందలి త్రాడుసావిత్రీదేవి. ఆమెజ్ఞానదాత్రి. కాన శివుడు సావిత్రీ దేవిదయను జీవులపైఁ బ్రసరింపఁజేసి, వారికి జ్ఞానము చేకూర్చుచున్నాడని తెలియుచున్నది.

శివుని శరము సోమస్వరూపము. సోముఁడనగా చంద్రుఁడు ఓష ధీశుఁడు. అన్నప్రదాత. కాన అతనిచే జీవులకు ఓషధులను ఆహారమును జేకూర్చి, శివుఁడు రక్షించుచున్నాడని తెలియుచున్నది. అంతేకాదు. శివుఁడు సంహారకర్త. కావున భూతప్రేతపిశాచరాక్షసబాధలను దొలగించుచు రక్షించు చున్నాడని తెలియుచున్నది. అందుచే శివునకు "ఆతతావినే" అను నామము సార్థకమని తెలియుచున్నది.

## విష్ణు:-

"ఆతతావినే" అను నామమందలి భావము "సహస్రజిదనన్తజిత్" అను విష్ణుసహస్రనామములందలి భావమును ఒకటియే. విష్ణువు, వేలకొలది రాక్షసులను మత్స్యాద్యవతారములు దాల్చి, సంహరించి, జీవులను రక్షించి నాడు. తనయనన్తశక్తిని యుద్ధములందుఁ బ్రదర్శించి, వ్యతిరేకశక్తులను సంహరించి, విష్ణువు జీవులను రక్షించినాడు. ఈనాడును ఆ విష్ణువు యొక్క అనన్తశక్తియే అణ్వస్త్రాదులందుఁజేరి, సమరములందు శత్రువులను సంహరించుచున్నది.

"జితామిత్రః ప్రమోదనః" అను దానిలోని "జితామిత్రః" అను విష్ణు నామమును బరిశీలించనగో విష్ణువుజీవకోటికిఁగల అన్తశ్శత్రువులను గామ క్రోధాదులను, బాహ్యశత్రువులైన రావణాదులను సంహరించి, జగములను రక్షించెనని తెలియుచున్నవి.

"ఆతతావీ" అను నామమును "సహస్రజిత్, అనన్తజిత్, జితామిత్రః" అను విష్ణుసహస్రనామములను సమానార్థకములే, సమానభావములే కావున "ఆతతావి" పదము విష్ణువునకుఁజెల్లును. శివునిచేతియందలి ఆతతమైన ధనువు "అజగవము," విష్ణువుచేతియందలి ఆతతమైన ధనువు "శార్ఙ్గము", శ్రీరామావతారమందలి "కోదండము"ను ఏకరూపములే; శత్రుసంహారకములే; జగద్రక్షకములే. కావున "ఆతతావినే" అను నామము శివకేశవులకు ఇరువురికిని సమానముగనే వర్తించునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:—*

ఇందు "అ+త్+అ+త్+ఆ+వ్+ఇ+న్ అని ఎనిమిదక్షరములు కలవు. ఇవి అష్టశక్తులకు, అష్టదిక్కులకును జిహ్నములు. ఇందుఁ బరాశక్తి బీజములైన అకారములురెండును, సర్వదేవతాకమైన ఆకారమును శక్తి దేవతాకమైన ఈకారమును, సావిత్రీదేవతాకమగు సకారమునుగలవు. ఇవి ప్రకృతిపురుషులైన లక్ష్మీనారాయణుల చిహ్నములు. అందుచే ఈనామము నుపాసించువారు, బలవంతులును, సంపన్నులునుగాఁ గలరు. సర్వరక్షకులుగా గలరు. వానితో వాస్తుదేవతాకములైన తకారములురెండును, వరుణదేవతాకమైన వకారమొకటియునుగూడియున్నవి అందుచే వీని నుపాసించువారు దేవాలయ తటాకాది నిర్మాతలైరోగనాశకులు కాఁగలరని తెలియుచున్నది.

## (20) వ. నామము: "క్షేత్రాణాంపతయేనమః"

శివ:-

క్షేత్రములనగా శరీరములు. వానికిఁ బతి, రక్షకుడును బరమశివుఁడని యర్థము. శివుడైశ్వర్యప్రదుఁడు; కాని శరీరరక్షకుఁడెట్లగునని ప్రశ్నింతురేమో పరికింపుడు. మార్కండేయుఁడు అల్పాయుష్కుఁడైనకారణమున యమధర్మ రాజు వాని ప్రాణములుగొనిపోవరాగా, దనభక్తుఁడైన అతనిని శివుడు కాపాడియమునిబ్రారద్రోలెను. అతనిని చిరంజీవునిగావించెననుకథ సర్వవిది తమేకదా! పరమశివుఁడేకదా మార్కండేయుని ప్రాణములునిల్పి, శరీరమును రక్షించినవాఁడు. అట్లే తన్నుగొల్చు జీవుల శరీరములను బరమశివుడు రక్షించుచుండును. అంతేకాదు. చేతనాచేతనముల శరీరములన్నియును ఆకా శాది పంచభూతములచే నేర్పడినవేకదా! అందునను జీవులదేహములు నిల్చు టకు వాయ్వగ్ని జలములు ప్రధానములని అందఱు నెఱుగుదురు.

పంచభూతములను శివుని యష్టమూర్తులలోనివే "అగ్నిర్వాయుశ్చ సూర్యశ్చ" అను శ్రుతిలోజెప్పిన సూర్యాగ్నివాయువులు శివుని ప్రధాన రూపములని తెలియుచున్నది. సూర్యుడు జలవర్షకుడు పైమువ్వురి ప్రభా వముచేతనే జీవకోటి శరీరములు రక్షితములై నిల్చుచున్నవి. ఈ విషయము, ప్రథమానువాకమంత్రములందు వివరింపఁబడియేయున్నది.

"క్షేత్రస్యపతినావయగ్ంహితేనేవజయామసి"

అను మంత్రమునక్షేత్రపతి పరమశివుఁడని పేర్కొనఁబడెను. అంతేకాదు. "అవిముక్తాది" పుణ్యక్షేత్రములను బాలించుప్రభువుపరమశివుడే. అవిముక్త మనగాఁ గాశీక్షేత్రము; అమరనాథము పశుపతిక్షేత్రము, మున్నగుక్షేత్రము లందు, మహాదేవుడు, మృల్లింగము, తేజోలింగము, జలలింగము మున్నగు రూపములతో నుండి, ఆయాక్షేత్రములను, బాలించుచుండెను.

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాథంచ శ్రీశైలే మల్లికార్జునం,
ఉజ్జయిన్యాంమహాకాళం, ఓంకారమమరేశ్వరం,
ప్రజ్వల్యాంవైద్యనాథంచ, ఢాకిన్యాంభీమశంకరం,
సేతబంధేతురామేశం, త్ర్యంబకంగౌతమీతటే,
హిమాలయేతుకేదారం, నాగేశందారుకావనే,
వారాణస్యాంతువిశ్వేశం, ఘృష్ణేశంతుశివాలయే॥"

అను శ్లోకములను బరిశీలించినచో సౌరాష్ట్రమున సోమనాథుడు, శ్రీశైలమున మల్లికార్జునుడు, ఉజ్జయినిలో మహాకాళుడు, అని ఒక్కొక్కక్షేత్రమున ఒక్కొక్కనామమున శివుడు లింగస్వరూపుడైయున్నట్లు తెలియుచున్నది.

భీమేశ్వరుడు, విశ్వేరుడు, విరూపాక్షుడు, మల్లికార్జునుడు, రామేశ్వరుడు అను లింగములు జ్యోతిర్లింగములు, (తేజోలింగములు) అని తెలియుచున్నది. శ్రీకాళహస్తీశ్వరుడు, కళింగుడును వాయులింగములని తెలియుచున్నది. చిదంబరమున ఆకాశలింగము హిమాలయమున జలలింగమునుగల వందురు. ఇట్లు పంచభూతములకుఁ జెందినలింగములుకలవని తెలియుచున్నది చున్నది. కావున శివుడు క్షేత్రపతియాయెను.

అంతేకాదు. "క్షి = నివాసగత్యోః" అను ధాతువు నుండి క్షేత్రపద మేర్పడెను. "క్షీయత ఇతిక్షేత్రం" అను వ్యుత్పత్తిచే నశించుదానికి క్షేత్రమని పేరు. శరీరము నశించునదికాన దానికిక్షేత్రమనిపేరువచ్చెను. క్షేత్రపతి = శరీరరక్షకుడను నర్థమును వివరించితిని.

శ్లో॥ "క్షేత్రంకళత్రే కేదారే, సిద్ధిస్థానశరీరయోః
క్షేత్రంగణితశాస్త్రేచ"

అను ప్రతాపనిఘంటువుననుసరించి, క్షేత్రపదమునకు "కళత్రము, కేదారము సిద్ధ స్థానము, శరీరము, క్షేత్రము, గణితశాస్త్రము" అని ఐదు అర్థములు

కలవు. వానిలో శరీరము, పుణ్యక్షేత్రము, అను నర్థములకుఁ జెందిన విషయము వివరింపఁబడెను. మిగిలిన యర్థములగుఱించి, పరిశీలించెదముగాక.

క్షేత్రముఅనగా, కళత్రము (భార్య) అను నర్థముకలదు. పరమేశ్వరుఁడు పురుషుఁడు. భర్త. అతనికళత్రము ప్రకృతి. అది భూమ్యాదుల ననుసరించి, ఎనిమిదివిధములుగాగలదు. వానికిఁబతి = ప్రభువు పరమశివుఁడని తెలిసికొనవలసియున్నది.

కేదారముఅనగా "పొలము" భూమి. "భూమిర్మాతాదితిర్నో భ్రాతా" అను శ్రుతి ననుసరించి, భూమియే (కేదారమే) అదితి. అమెయేప్రకృతి. కాన క్షేత్రపతి యనగా కేదారపతి, పురుషుఁడైన పరమశివుఁడని చెప్పవచ్చును.

క్షేత్రమనగా సిదిస్థానము. అదిముక్తిస్థానము. అదియే సహస్రారము. దానికిఁ బతిపురుషుఁడైన పరమశివుడే. కాన క్షేత్రపతి శివుఁడాయెను.

క్షేత్రమనగా గణితశాస్త్రము. దానికి మూలము జ్యోతిషము. అది సూర్యచంద్రనక్షత్రగమనము ననుసరించి, యేర్పడినదికదా! ఆ సూర్యచంద్ర నక్షత్రములు శివుని రూపాన్తరములు కాన క్షేత్రపతి శివుఁడాయెను.

విష్ణుః-

క్షేత్రపతి = శరీరపతి శివుఁడేకాదు. విష్ణువును అగును. ఎట్లన? క్షేత్రజ్ఞోఽక్షరఏవచ" అను విష్ణుసహస్రసూక్తిచే క్షేత్రజ్ఞుడు విష్ణువు అని తెలియుచున్నది. "ఇదంశరీరంకౌంతేయక్షేత్రమిత్యభిధీయతే" అను గీతాసూక్తిచే శరీరమునకు క్షేత్రమనుసంజ్ఞకలదని తెలియుచున్నది. క్షేత్రమనగాఁ బ్రకృతి మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తఏవచ" అను గీతాసూక్తిచేఁ తెలియు క్షేత్రముప్రకృతియేయనునది "భూమిరాపోఽనలో వాయుః" అను గీతా సూక్తిచేఁదెలియుచున్నది,

అష్టవిధప్రకృతియు క్షేత్రమును (శరీరమును) ఒకటేయనువిషయము పైసూక్తులచే స్పష్టపడుచున్నది. అట్టిక్షేత్రమును ఆధిష్ఠించి, దానికిఁ బతియై లోకమును సూర్యుడువలెఁ బ్రకాశింపఁజేయువాఁడు శివుఁడేకాదు; విష్ణువుకూడ అను విషయము

శ్లో॥ 'యథాప్రకాశయత్యేకః కృత్స్నంలోకమిమంరవిః।
క్షేత్రంక్షేత్రీ తథాకృత్స్నంప్రకాశయతి భారత"

అను గీతాసూక్తిచేఁ దెలియుచున్నది. ఈ విషయమును కృష్ణభగవానుఁడు చెప్పెను. కావున క్షేత్రపతి = శరీరపతి విష్ణువు అనియుఁ దెలియుచున్నది.

ఇక "క్షేత్రపతి = పుణ్యక్షేత్రపతి" శివుడువలె విష్ణువునుఅగును. ఎట్లన శివక్షేత్రములకుఁ బతిశివుఁడైనట్లు, "సింహాచలము, తిరుపతి, ఒడ్డి" మున్నగు విష్ణుక్షేత్రములకుఁ బ్రభువు విష్ణువు. కావున క్షేత్రపతి నామము విష్ణువునకుఁ జెల్లునని తెలియుచున్నది.

శివుఁడు మార్కండేయాదులకు బ్రాణములనొసంగి, శరీరరక్షకుఁడైనట్లు విష్ణువును బ్రహ్లాదాదులగాపాడినకారణమున శరీరరక్షకుడాయెనని తెలియుచున్నది. ఇంతేకాదు. క్షేత్రపతి = భూమిపతియు విష్ణువును అగును విష్ణువు భూమి భార్యగానున్నపుడేకదా నరకాసురుఁడు పుత్రుడుగా జన్మించెను.

ఇంతేకాదు. శివకేశవులిరువురును బరమాత్మయొక్కరూపాన్తరులే. ఇద్దఱును క్షేత్రమైన సిద్ధిస్థానమున సహస్రారమునున్నవారే. కావునక్షేత్రపతులైరి. విష్ణుతేజోంశసంపన్నులైన సూర్యచంద్రాదులే గణితశాస్త్రమునకు మూలకందమైనవారు. అందుచే క్షేత్రపతి = గణితశాస్త్రపతి విష్ణువును అయెను. కావున క్షేత్రపతినామము విష్ణువునకుఁజెల్లును.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "క్+ష్+ఏ+త్+ర్+ం+ప్+అ+త్+ఇ" అని పద
క్షరములుగలవు. ఇవి జ్ఞానేంద్రియకర్మేంద్రియ మనోబుద్ధులకుఁ జిహ్నములు
ఇందు వీరభద్రబీజమైన "ఏకారముతోఁ బ్రాజాపత్యబీజమైన కకారమును,
సూర్యబీజమైనష కారమునుగూడియుండుటచేఁ బైమంత్రము నుపాసించువారు
పరబ్రహ్మసాక్షాత్కారముపొందగలరు. ఉపాసకులు కామెలరోగమును
బోగొట్టుకొనఁగలరు.

వాస్తుదైవత్యమైన తకారము, వహ్నిదైవత్యమైన రేఫమును, అకార
ముతోగూడిన కారణమునఁ బైనామము నుపాసించువారు విద్యుత్కర్మాగార
స్థాపకులు, నూతన విద్యుచ్ఛక్తిని బైటఁబెట్టఁగలవారలునగుదురు.

పర్జన్యదేవతాకమైన "పకారము", వాస్తుదైవత్యమైన "తకారమును,"
సర్వదేవతాకమైన "అకారము"తోడను, విష్ణుదేవతాకమైన "ఇకారము
తోడనుగూడినకారణమున కృత్రిమవర్షదాయకమైన మేఘములను నిర్మింపఁ
గలవారలగుదురు. పైనామమున రెండుతకారములున్న కారణమునఁ
బైనామము నుపాసించువారు, వాస్తుశాస్త్రజ్ఞులు, (పలురకములకుఁజెందిన
ఇంజనీర్లు) కాఁగలరు.

—: అష్టమయజుస్సు :—

*"నమస్సూతాయాహంత్యాయవనానాంపతయేనమః"*

*అర్థము:-*

సూతాయ = సారథియైనట్టియు, అహంత్యాయ = శత్రువులకు సంహా
రింపనశక్యమైన రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుఁగాక; వనా

నాం = అరణ్యములకు, పతయే = పాలకుఁడైన రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుఁగాక;

**తాత్పర్యము:-**

సా. భా:- పరమేశ్వరుఁడు జగద్యంత్రమనెడి రథమును నడుపుటకు సారథిగానుండెను. అతనిని శత్రువులెవ్వరును సంహరింపఁజాలరు. అతఁడరణ్యములనెల్లఁ బాలించుచు, జగద్రక్షకుఁడగుచున్నాడు, అందుచే అతనిని భక్తులు నమస్కరించుచున్నారు.

## (21) వ. నామము: "నమస్సూతాయ"

*శివ:-*

శి. భా. భా:- ప్రజాపతియైన పరమాత్మ, పుష్కరపర్ణమునుండి, (బంగారుతామరాకుపైనుండి) "ఇదగ్ంసృజేయమ్" ఈబ్రహ్మాండమును సృష్టింతుననితలంచెను. బ్రహ్మాండసృష్టిరథమునడుపుటవంటిది. రథయాత్రను సారథివలెఁ బరమాత్మ జగద్రథయాత్రసాగింపమొదలిడెను రథము, నడుపుటలో సారధి, నియన్తగానుండును. అటులనే, జగద్రథము, నడుపుటలోఁ బరమేశ్వరుఁడునియన్త అయెనన్నమాట అతఁడు సర్వస్వతంత్రుఁడు. అతనికి వేరొక నియామకుఁడుండడు. ఈనాటి నియన్తృత్వము అతనినుండిలోకమునకు లభించినదన్నమాట. జగద్యంత్రము ఒకతనువు. (శరీరము) అదిరథము వంటిది. దానిని బరమేశ్వరుఁడు సారథివలెనడుపుచున్నాడన్నచో అతడుని యన్తయెట్లగును? అతనిపై రథికుఁడైనయజమాని ఇంకొండుండునుగదా! అది యెట్లుపొసగును?

*"ఆత్మానంరథినంవిద్ధిశరీరంరథమేవతు।*
*బుద్ధింతుసారథింవిద్ధి"*

అను కఠవల్లిశ్రుతి ననుసరించి, పరమాత్మరథికుఁడును, బుద్ధిసారథియునగును గదా! అంటిరేని, పరికింపుడు.

నిజమునకుఁ బరమాత్మరథికుఁడేఅయినను సృష్టిలోనాతడు మాయా సంబంధమొందిన హిరణ్య గర్భునిగా నుండును. అపుడు పరమాత్మకులోబడి సృష్టిజపుపుసారథియగును. హిరణ్య గర్భుఁడే సృష్టిప్రకాశకుఁడైనసూర్యుఁడు. అతడే స్థూలశరీరమున బుద్ధిగానుండును. కాన శ్రుతివిషయములకు రెంటికిని విరోధము వాటిల్లదు అందుచేతనే పరమేశ్వరుడు నిరపనయైన సారథియై జగద్యంత్రమును స్వతంత్రముగా నడుపుచుండెను. కావున శివునకు "సూతుడ"ను నామము సార్థకమాయెను.

అంతేకాదు. "షుఙ్ = ప్రేరణే" అను ధాతువునుండియేర్పడిన సూత పదమునకు "సువత్యశ్వాన్" అను వ్యుత్పత్తిచే అశ్వమునుదోలువాడని యర్థమువచ్చును పరమశివుడే సూర్యరూపుఁడై తన యశ్వమును, కిరణములను, జగదుద్భోధకై, ప్రేరేపించుచున్నాడని చెప్పవచ్చును. శివరూపముతో నున్నపుడు తనయశ్వములను (తనయనుచరులైన) ప్రమథగణములను జగద్రక్షణకై ప్రేరేపించుననియుఁ జెప్పవచ్చును. పరమేశ్వరుఁడు అండాండ పిండాండబ్రహ్మాండములనెడి యశ్వములను, జీవకోటియనెడి యశ్వములను, ఇంద్రియములనెడి యశ్వములను సక్రమమార్గమునఁ గర్మాచరణకై ప్రేరేపించుననియుఁ జెప్పవచ్చును. పైకారణములచే శివునకు సూతుఁడనునామము సార్థకమగును.

*ఇంకొక విశేషమేమన?*

సూతపదమునకు యుగాదిలోఁ బురాణవక్తయనియు అర్థముకలదు. (1) సర్గము, (2) ప్రతిసర్గము, (3) వంశము, (4) మన్వంతరము (5) వంశానుచరితము అను నైదును బురాణముయొక్క లక్షణములు సర్గము అనగా సృష్టి. ప్రతిసర్గము అనగా ఉపసృష్టి. వంశమనగాఁ జేతనాచేతన వస్తువులచరిత్ర. మన్వంతరములనగాయుగానుసారముగా బ్రహ్మాండమును నియమించునట్టివి. వంశానుచరితమనగాఁ బిపీలికాది బ్రహ్మపర్యంతముగలసృష్టి.

వానిని జక్కగా వివరించిచెప్పువక్తయే సూతుడు. పరమేశ్వరుఁడే సూతుఁడుగా బురాణవక్తగానుండి, 36 పురాణములచరిత్రను ప్రపంచమునకుఁ దెలియజేసె నన్నమాట. పురాణములచరిత్రలో సకలప్రపంచమందలి సకలభాషలవారి చరిత్రయు సూక్ష్మరూపమునఁగలదు. అట్టిచరిత్రను సర్వాంతర్యామియైన శివుఁడు సూతుఁడై పదునాల్గులోకములకును దెలియఁజెప్పెను. కావున శివు నకు సూతనామము సార్థకమాయెను.

పురాణవక్త అను దానియందలి పురాణపదమునకుఁ బ్రాచీనమనియు నర్థముకలదు. అపుడు పురాణమును, బ్రాచీనసృష్టిని లేక పురాణపురుషులను గూర్చి, చెప్పువాదు పురాణవక్తయగును. శివుడు సూతుఁడై శౌనకాది ఋషు లకు సృష్టినిగూర్చియు, బురాణపురుషులైన శివకేశవాదుల యొక్కయు బురాణయైన ఆదిశక్తియొక్కయు చరిత్రలను లోకమునకు జక్కగాఁ దెలియజెప్పెను. కాన శివునకు సూతుడనునామము సార్థకమాయెను.

*వేరొకవిశేషమేమన?*

సూతపదమునకు అభిషుతసోమాత్మకుడనియు నర్థముకలదు. సోముఁడు ఓషధీశుడైన చంద్రుడు. అతడు లోకములకు ఓషధులమూలమున ఆహారమును సమర్పించును. ఆహారసమర్పణానుకూలముగా ఓషధులను సమర్పించవలసి నదిగా సోముడు శివునిచే అభిషుతుడాయెను; అనగా నియమింపబడెను. అంతే కాదు. సోముడు శిరోభూషణమైన పుష్పముగానుండి గరళమువలన గల్గిన వేడిమిని దొలగించి, శివునకు జల్లదనము చేకూర్చెను. తద్ద్వారాలోకమునకు జల్లదనము చేకూర్చుచున్నాడు. కావున శివుడు అభిషుతసోమాత్మకుడై సూతు డని సార్థకనాముఁడాయెను.

విష్ణుః-

సూతుఁడనునామము శివునకువలె విష్ణువునకును జెల్లును.-ఏమన? "సూతపదమునకు సారథి అనగా నియన్త అను నర్థముకలదు.

"సువత్యశ్వానితిసూతః" అనగా అశ్వములను గమనమునఁ బ్రేరేపించువాఁడని యర్థము.

"సారయత్యశ్వానితి సారథి" అనగాగుఱ్ఱములను నడిపించువాఁడని యర్థము.

"నియచ్ఛత్యశ్వానితినియన్తా" అనగాగమనమున అశ్వములను నియమించువాడని అర్థము.

పైవ్యుత్పత్తులననుసరించి "సూతుఁడు, సారథి, నియన్త" అను మూడును సమానార్థకములేయని తెలియుచున్నది.

"నియన్తానియమోయమః" అను విష్ణుసహస్రసూక్తిచే విష్ణువునకు "నియన్త" అను నామము కలదని తెలియుచున్నది.

"మండలాంతరగతం హిరణ్మయం" అను సూక్తిచే శివుఁడువలె విష్ణువును సూర్యస్వరూపుఁడేయనియు, అతడు జగత్తును మేల్కొల్పుటకై, తన యశ్వములను గిరణములను నియమించుచున్నాడని తెలియుచున్నది. అంతేకాదు. జగద్రథమును నడిపించుటచేతను, జీవులను స్వకృత్యములందు నియమించుటచేతను, విష్ణువునకు సూతుడునునామము నియన్త అను నర్థమున సార్థకమేయని తెలియుచున్నది.

అంతేకాదు. సూతుడనగా బురాణవక్తయును విష్ణువగును. ఎట్లన? పురాణమైన అతిప్రాచీనమైన, బ్రహ్మమయమైన వేదవాక్కును వాగ్మియై వక్తయై విష్ణువు ప్రసరింపజేయుచున్నాడు. కావుననే సూతుడు అను నర్థమును దెల్పువాగ్మియను నామము విష్ణుపరముగా "సుభుజోదుర్ధరోవాగ్మీ" అని విష్ణుసహస్రమున బేర్కొనబడెను.

అంతేకాదు. సూతుడు అభిషుతసోమాత్మకుడు, అను నర్థముచెప్పినను ఆ నామము విష్ణువునకును జెల్లును. ఎట్లన? విష్ణువుసోమాత్మకుడై అభ్యను జ్ఞానమొందెను. కావుననే ప్రజలకవసరమగునాహారము నోసంగు ఔషధము లను బోషించుచున్నాడు. అందుచేతనే విష్ణుసహస్రమున "సోమపోఽమృత పస్సోమః" అను సూక్తిలో సోమపదము విష్ణుపరముగా బేర్కొనబడెను. అంతె కాదు. భారతయుద్ధసమయమున అర్జునకు సారథిగానుండి, విష్ణువుగీతను బోధించి, లోకమునకు జ్ఞానమార్గమును జూపెను. కావున "సూతుడు" అను నామము విష్ణువునకుజెల్లును.

ఇందు "స్+ఊ+త్+అ" అని నాల్గు అక్షరములుగలవు. అవి అంతఃకరణచతుష్టయమైన "మనోబుద్ధిచిత్తాహంకారములకు చిహ్నములు. శక్తిబీజమైనసకారము, భూమి దైవత్యమైన "ఊ"కారముతోగూడియుండుటచే నైనామము, శక్తిప్రభావసూచకమై శాక్తేయులకుపాసనార్హమైయున్నది. దాని నుపాసించువారు, భూసారమును, భూమిలోనిఖనిజములను బైటపెట్టి ఇనుప డింపజేయగలవారలగుదురు. అంతేకాదు. అకారముతోగూడిన "త"కారము వాస్తుబీజమైన కారణమున దానినుపాసించువారు, వాస్తుశాస్త్రజ్ఞులై ఖనిజ పరిశోధకులుకాగలరు.

## (22) వ నామము:- "నమోఽహన్త్యాయ"

**శివ:-**

భ. భా. భా:- అహన్తవ్యాయ, ఆత్మజ్యోతిషే మహాశక్తిత్వేన నహన్యతే అను వ్యుత్పత్తిననుసరించి, మహాశక్తిగల ఆత్మజ్యోతి, అనగా బరమాత్మ తేజస్సు, అహన్త్యము అనగా క్షీణింపజేయుటకుగాని, తగ్గించుటకుగాని శక్యముకానిది, అని తెలియుచున్నది. అట్టితేజస్సే తైత్తిరీయమునజెప్పిన సువర్ణ జ్యోతి అదియేపరమాత్మస్వరూపము. అవిషయమే

"తేజస్తేజస్వినామహమ్" తేజస్సుగలవానిలో దివ్యతేజస్సునేనని గీతలో భగవంతునిచే జెప్పబడినది అదియే సూర్యస్వరూపుడగురుద్రునితేజస్సు

"జ్యోతిషాంరవిరంశుమాన్" అను గీతాసూక్తిలో జ్యోతిస్సులలో రవిగానున్న విభూతిని, నేననిభగవంతుడుచెప్పెను ఆ రవియే (సూర్యుడే) అహన్త వ్యుడైనరుద్రుడు. అందుచేతనే రుద్రరూపసూర్యజ్యోతి అహన్తవ్యముఆయెను. దానినెవరునుజేరలేరు. చూడలేరు. నశింపజేయలేరు.

జ్యోతిశ్శబ్దమునకు నక్షత్రము అని అర్థము మహాశక్తికల్గిన, నశింప జేయలేని తేజస్సుగలనక్షత్రము చంద్రుడు. "నక్షత్రాణామహంశశీ" అను గీతాసూక్తిలో చంద్రుడును భగవంతుని విభూతిగా బేర్కొనబడెను.

*"తే అస్మైసర్వేకశ్యపాజ్జ్యోతిర్భరన్తే।*
*తాన్ సోమః కశ్యపాదధినిర్ధమతి"*

అను అరుణశ్రుతిచే గశ్యపుడను, సూర్యునితేజస్సే చంద్రునిలోనున్నట్లు తెలియుచున్నది, భగవంతుడైన రుద్రునితేజస్సు దుర్భరముకావుననే, కుమార

స్వామి జననసందర్భమున దానిని, అగ్ని, గంగమున్నగువారుభరించిరి. పైకారణములచే రుద్రుఁడు, అహన్తవ్యము అనగా నశింపఁజేయశక్యముకాని దివ్యతేజస్సుకలవాఁడును, దివ్యతేజస్స్వరూపుఁడునని తెలియుచున్నది.

శ్లో॥ "అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవచ"

అను గీతాసూక్తిలోఁ బరమాత్మ ఛేదింపశక్యముకానివాఁడు, దహింప అశక్యుఁడు, పీడింపనశక్యుఁడు, శోషింపనశ్యఁడని చెప్పఁబడినది. కావున రుద్రునకు "అహన్త్యు"ఁ డనునామము సార్థకమే. అందుచేతచే "తస్యభాసా సర్వమిదంవిభాతి" అను శ్రుతిలో మహాశక్తిగల పరమేశ్వరతేజస్సుచేతనే సమస్తము ప్రకాశించుచున్నదని చెప్ప బడెను.

"అహన్త్యుఁడు = నిర్హాసితోపసర్గుఁడు; అహన్త = విశ్వుఁడు పరమ శివుఁడు. అదేమన? నిర్హాసితము = మిక్కిలితక్కువైనది, మిక్కిలితక్కువగాఁ జేయఁబడినది ఉపసర్గము = నిరోధము; అని పైపదములకు అర్థముకలదు. పరమశివునకు అన్యులనిరోధము ఏమియునులేదు, అతఁడందఱిని, నిరోధింపఁ గలడు. అతఁడు సృష్టిలోవిశ్వమైయున్నాఁడు. విశ్వరూపుఁడైన అతనిని ఎవ్వరును నిరోధింపఁజాలరు. అతడు అధివక్త. కావున శివుఁడు నిర్హాసితోపసర్గుఁ డాయెను. కాన అహన్త్యుఁడాయెను.

అంతేకాదు. అహన్తపదమునకు "అహమేవసర్వమితిభావః, అహన్తా; తత్రభవః" అనియునర్థముకలదు. "అహమేవ = అహంశబ్దవాచ్యుఁడైన పరమాత్మయే, సమస్తబ్రహ్మాండమై, అందు అతఁడు సంహారకర్తయైన రుద్రుడుగా నుండెను. అందుచే రుద్రునకు "అహన్త్యుఁ"డను నామము సార్థకమాయెను.

విష్ణు:-

పరికింపగా శివకేశవులిరువురును సువర్ణజ్యోతిస్వరూపులే. ఇరువురును బరమాత్మతేజోంశజులే. "నందిర్జ్యోతిర్గణేశ్వరః" అను విష్ణుసహస్రనామసూక్తిలో, అహస్సనామార్థబోధకమైన జ్యోతిర్గణేశ్వరపదము విష్ణుపరముగాఁ బ్రయోగింపఁబడెను. సూర్యచంద్రనక్షత్రాగ్నులు జ్యోతిర్గణమునఁ జేరినవారే. "తమేవభాన్తమనుభాతిసర్వమ్" అను శ్రుతిలోఁ జెప్పఁబడిన తచ్ఛబ్దవాచ్యుఁడు పరమాత్మ. అతని వికారములే శివకేశవసూర్యాగ్నిచంద్రనక్షత్రములు. వీరి తేజస్సుముమ్మాటికిని అహస్స్యమే. నశింపఁజేయశక్యముకానిదే. అప్పరమాత్మయైన విష్ణువుభాసను (తేజస్సును) అనుసరించియే సూర్యచంద్రాగ్నినక్షత్రములు మున్నగువారుప్రకాశించుచున్నారు. అందునముఖ్యముగా ఆదిత్యతేజస్సు విష్ణుతేజస్సే అను విషయము "యదాదిత్యగతంతేజఃతత్తేజో విద్ధి మామకమ్" అను గీతాసూక్తిలో నిరూపింపఁబడెను. అట్టి సూర్యరూప విష్ణు తేజస్సును ఎవరైనఁ జూడఁగలరా? నశింపఁజేయఁగలరా? లేదే! కావుననే విష్ణువునకు అహస్స్యనామముసార్థకము.

అంతేకాదు. విష్ణువు అహస్స్యుఁడు; నిగ్రహసితోపసర్గుఁడుకూడా! ఎట్లన? శివునకువలె విష్ణువునకును ఉపసర్గము (నిరోధము)లేదు. కావుననే తనను జంపవచ్చిన హిరణ్యకశిపుని హృదయములోఁదాను బ్రవేశించి, వానికిఁ గానరాక తర్వాతవానినే సంహరించెను. గజేంద్రాదిభక్తుల ఉపసర్గలు (కష్టములు) విష్ణువుచే నిగ్రహసితములు (తొలగింపఁబడినవి) ఆయెను. అతనికే కష్టములునులేవు. అతనిని ఎవ్వరును నశింపఁజేయలేరు. కావుననే పైయర్థమును దెల్పుదుర్మర్షణపదము "ఃశోదుర్మర్షణః" అను విష్ణుసహస్రనామసూక్తిలో విష్ణుపరముగాఁ బ్రయోగింపఁబడెను.

అంతేకాదు అహస్స్యపదమునకు "అహమేవసర్వమ్" నేనేసమస్తమును అనుభవమొందినవాఁడను; అనియర్థముచెప్పినను నైనామము విష్ణువునకుఁ

జెల్లును. ఎట్లన? "అహంసర్వస్యప్రభవోమత్తస్సర్వంప్రవర్తతే" అను గీతా సూక్తిలోఁదానే సర్వమునకు మూలమనియును, అతనినుండే సర్వము ప్రవర్తించుచున్నదనియును గృష్ణభగవానుఁడు అర్జుననకెఱిగించెను.

"సర్వశ్శర్వశ్శివస్థాణుః" అను విష్ణుసహస్రసూక్తిలో సత్తుగాఅసత్తుగానున్న సమస్తమును, బుట్టుటకు, ఉండుటకు, నశించుటకును విష్ణువేమూలకారణము ఆతఁడే "సర్వముసేననెడి జ్ఞానముకలవాఁడని అర్థమును దెలియుజేయు సర్వ పదము విష్ణుపరముగాఁ బ్రయోగింపఁబడెను. పైకారణములచే అహన్యపదము శివునకువలె విష్ణువునకును సార్థకమేయని తెలియుచున్నది.

***బీజాక్షరసంపుటి:-***

ఇందు "అ+హ్+అ+న్+త్+య్+అ" అని యేడక్షరములు గలవు. ఇవి సప్తవాయుమండలములకును, జ్ఞానేంద్రియములతోడి మనోబుద్ధు లకును ఉపలక్షణములు. ఇందలి మూఁడకారములును త్రిమూర్తులను దెలియ జేయుచు, ఉపాసకులకు, నూతనవస్తువులకు జెందిన సృష్టిస్థితిలయములను జేయఁగల శక్తులను జేకూర్చును. రక్తలోపముచేఁగాని, రక్తముచెడుటచేఁగాని కల్గురోగములను దొలగించుకొను శక్తిఉపాసకులకు లభించును. సావిత్రీ బీజమైన "నకారమును", వాస్తుదైవత్యమైన "తకారమును", వాయుబీజమైన "యకారమును" సర్వదేవతాకమైన "అకారము"తోగూడియుండుటచే, ఉపా సకులు శాక్తేయులునుయోగులునై నూతనవస్తునిర్మాణమును గనుగొనఁగల వారలగుదురు. శివబీజమైన "హకారము" ఇందున్నకారణమున ఉపాసకులు శైవులై శుభదాయకులు కాగలరు.

***(23) వ. నామము: "వనానాంపతయేనమః"***

***శివ:- శి.బా.భా. :-***

రుద్రుఁడు వివిక్తములైన (మనుష్యసంచారములేని) అరణ్యములకుఁ బతి. అరణ్యములందుఁ, గ్రూరజంతువులు, మహావృక్షములు, మహౌషధులు,

గనులు పర్వతములు, నదులు, మహర్షులు, వటులునుండును. వానికెల్ల శివుఁడే ప్రభువు. అతనిదయవలననే అవిచ్ఛిన్నమైన అటవికసంపద యధికమగును దేశమభివృద్ధిపొందును అడవులందు శివుఁడు దవాగ్నిరూపమునసుండి, క్రూరజంతువులను నశింపఁజేసి, లోకమునుగాపాడును. అటవికులైన రాక్షసులను సంహరించి, మహర్షులను, వారియజ్ఞములను గాపాడును. కావున రుద్రునకే మొదటి హవిర్భాగమందును. రుద్రుఁడులేని యజ్ఞములు యజ్ఞములేకావు రుద్రహీనముగాఁ జేయఁదలంచుటచేతనే, దక్షప్రజాపతి యజ్ఞము ధ్వంసమాయెను. ఇట్లువనపాలకుఁడగు శివుడు వనములకుఁ బతియాయెను. అంతేకాదు.

శ్మశానములకుఁ బ్రభువురుద్రుడే శ్మశానములు వివిక్తములు. నిర్జనములు. భూతప్రేతాది నివాసములు. వానికిఁ బ్రభువురుద్రుఁడే. కావుననే భూతనాథుఁడను నామముకూడ రుద్రునకువాటిల్లెను. అంతేకాదు. "వన షణ = సంభక్తౌ" అను ధాతువునుండియేర్పడిన వనపదమునకు జనులచే నాశ్రయింపఁబడునదని యర్థము క్రూరజంతునివాసమైన వనము జనాశ్రితమెట్లని శంకింపనక్కఱలేదు. వనములేకదా ప్రాణులకవసరమగు వస్తువులనొసంగునవి వనములు వృక్షసాంద్రములైనపుడే సకాలవర్షపాతముజరుగును జనులకాహారములభించును. రుద్రుఁడు పర్జన్యస్వరూపుఁడై వనములందధికముగా వర్షముకురిపించి, ఒంటి పట్టినిభూములకుఁ దరలింపఁజేసి, భూములసారవంతములఁగావించి సస్యపూర్ణములఁగావించి, జనులకాహారమొసంగుచున్నాడు. కావునరుద్రునకు "వనపతి"నామము సార్థకమాయెను.

ఇంకొకవిశేషమేమనఁ? వనము అను పదమునకు "వనేసలిలకాననే" అను నమరసూక్తిచే నీరు అను నర్థముకలదు వనము (జలము) ఆద్యప్రకృతి

శ్లో॥ "అపరేయమితస్త్వన్యాం ప్రకృతింవిద్ధిమేపరామ్"

అను గీతాసూక్తిలోఁ జెప్పఁబడిన అపరాప్రకృతిజలమే అదియే ద్వితీయసృష్టిలో గంగభవానియై, పార్వతీదేవికక్కయైనది. ఈ విషయము వాల్మీకిరామాయ

ణము ననుగలదు. గంగారూపజలమునకుఁ బతియైనకారణమున రుద్రునకు వనపతినామము సార్థకమాయెను.

ఇంతేకాదు. వనపదమునకుఁ బుష్పమనియు నర్థముకలదు. వనములను (బుష్పములను) దివారాత్రములందు వికసింపఁజేసి, వానికి బ్రభువులైన సూర్యచంద్రులు శివస్వరూపులే. కావున వనపతి (పుష్పపతి) శివుఁడాయెను.

విష్ణు:-

శివుఁడువలె విష్ణువును పవిత్రములైన వనములకుఁబతియే. ఎట్లన?

విష్ణువు సర్వవ్యాపకుఁడు కావున అటవికవస్తువులందుఁదాను అణురూపముననుండి, వానిని రక్షించియు, వృద్ధిచేసియు వనపతియగుచున్నాడు. విష్ణువు, నరనారాయణరూపధారియై బదరీవనములందు, నివసించి, సర్వులను రక్షించినట్లు పురాణములవలనఁ తెలియుచున్నది. విష్ణువు రామావతారమునఁ బితృవాక్యపరిపాలనకై, కొంతకాలము అరణ్యములందుండి, రాక్షసులను సంహరించి, మునులను గాపాడినాడు. అరణ్యవాసకాలమున భార్యను అపహరించిన రావణుని సంహరించి, లోకములను రక్షించినాడు. కావున విష్ణువు వనపతియైనాడు.

అంతేకాదు. ఆదిత్యరూపముననుండి వనములందుఁగల చెట్లుపైకిరణములను బ్రసరింపఁజేసి, వనములనుబెంచి, తేమనుగ్రహించి, వర్షముకురిపించుచున్నాడు. సస్యవృద్ధిచేయుచున్నాడు. లోకములను గాపాడుచున్నాడు. కాన విష్ణువు వనపతియాయెను. అందుచే జనులాతనిఁబూజించి, వనములను ఆశ్రయించుచున్నారు.

వనపదమునకు జలము అని అర్థము చెప్పినను మూలప్రకృతియైన జలము గంగారూపమున అతనిపాదములనుండిపుట్టుటచే విష్ణువు, అపాంనిధి, జలనిధియైనాడు. కావున విష్ణుసహస్రనామమున "అపాంనిధిరధిష్ఠానమ్" అను సూక్తిలో అపాంనిధియనునామము విష్ణుపరముగాఁ జెప్పఁబడెను.

"విష్ణుపాదోద్భవాగంగా" అను సూక్తి పైవిషయమునకుఁ బ్రమాణము కావున విష్ణువనపతియాయెను.

వనపదమునకు సమూహమని యర్థముకలదు. వనములనగా అంభస్సులు. అవియేదేవపితృమనుష్యాసుర సమూహములు.

*"తానివా ఏతానిచత్వార్యంభాంసి, దేవమనుష్యాఃపితరోఽసురాః"*

అను శ్రుతియే పైవిషయమునకుఁ బ్రమాణము. అట్టివనములకు, నిధియును, పతియును విష్ణువే. కావున "అంభోనిధిరనన్తాత్మా" అను సహస్రనామసూక్తిలో, అంభోనిధినామము విష్ణుపరముగా బేర్కొనబడెను. అంభోనిధియే అంభఃపతి అతఁడే వనపతి. "అంభోనిధి, వనపతి" యను నామములు సమానార్థకములు కావున వనపతి యనునామము విష్ణువునకుఁజెల్లును.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "వ్+అ+న్+అ+ప్+అ+త్+ఇ" అని యెనిమిది యక్షరములుగలవు. ఇవి యెనిమిదగ్నులకును, శరీరమందలి యష్టచక్రములకును, ఉపలక్షణములు. ఇందలి మూఁడకారములును త్రిమూర్తులను సూచించును. ఇవిపరమాత్మబీజములు. నకారము సావిత్రీబీజము. ప్రకృతిపురుషసూచకములైన యక్షరములు వరుణదేవతాకమగు వకారము తోడను వాసుదేవతాకమైన తకారముతోడనుగూడియున్నవి. కావునఁ బైనామము నుపాసించువారు వరుణాధీనమైన జలమును బరిశోధించి, అందలివింతలను శక్తులనుబైటపెట్టి, అందుసంచరించునౌకాదులను నిర్మింపఁ గలవారలగుదురు జలపరిశోధనచేయఁగలవైజ్ఞానికులునుగాఁగలరు.

## —: నవమయజుస్సు :—

"నమోరోహితాయస్థపతయేవృక్షాణాంపతయేనమః"

అర్థము:-

రోహితాయ = లోహితవర్ణుఁడైనట్టియు, స్థపతయే = ప్రముఖ్యమైనట్టి రుద్రునకు, నమః = నమస్కారము. వృక్షాణాం = చెట్లకు, పతయే = పాలకుఁడైన రుద్రునకు, నమః = నమస్కారము, అస్తు = అగుఁగాక.

తాత్పర్యము:-

నా. భాష్యము:- రుద్రుఁడు సూర్యుఁడుకాన అతఁడు ఉదయసమయమున ఎఱ్ఱగానుండును కాన లోహితవర్ణుఁడై రోహితుఁడాయెను. అతఁడే సమస్తమునకును ప్రభువు. అతఁడే సూర్యచంద్రరూపుఁడై, వృక్షములు మున్నగువానినిబెంచి, పెద్దవిగాఁజేసి, పాలించును. కాన అతనికి భక్తులు నమస్కరించుచున్నారు.

(24) వ నామము:- "నమోరోహితాయ"

శివ:-

భ. భా. భాష్యము:- మహాశివుఁడు "అసౌయస్తామ్రో అరుణఉతబభ్రుః" అను శ్రుతిలోఁజెప్పినట్లు అరుణవర్ణుఁడైన సూర్యుఁడై ఉదయకాలమున లోహితవర్ణుఁడైకానవచ్చును. జీవులను జాగ్రదవస్థలోనుంచి, కాపాడును. కావున శివుఁడురోహితుఁడాయెను.

ఇంతేకాదు. కొందఱు పెద్దలుచెప్పినట్లు "రో"శబ్దము వాచకరూపము, "రో + హితుఁడు = రోహితుఁడు. అపుడు "రో"శబ్దము ప్రకృతి పురుషులను, వారిమహిమలను దెలియజేయుచు, వాచకముపదముఅగును. పరమాత్మ మహిమను, సృష్టిరహస్యములను వచించు వాచకములు వేదములు. అవి పరమాత్మాంశులైన శివకేశవులమహిమను దెలియఁజేయును. అట్టివాచకములైన వేదములకును, వేదములేర్పడుటకు మూలకారణమైనట్టియు, చతుర్విధవాగ్రూపిణియుఁ, త్రిగుణాత్మకయునగు ప్రకృతికినిహితుఁడై వానిలో ఆవేదములలోఁ బ్రకృతిచేనిహితుఁడైన, ప్రకటితుఁడైన కారణమునఁ బరమాత్మాంశుఁడైన శివునకు రోహితుఁడను నామమేర్పడెను.

అంతేకాదు. రో + హితుఁడు = రోహితుఁడను నపుడు, రోశబ్దమునకు వాచకులు అనగాఁ బరమాత్మమహిమనెఱిగిన జ్ఞానులనియు నర్థముకలదు. జ్ఞానులు నిత్యము నిష్కాములై, యోగము, తపస్సు, ధ్యానము, కర్మ, భక్తి మున్నగుమార్గములలోఁ బరమాత్మనే తలంచుచునుందురు. కాన వారికి శివుడు హితుఁడై మోక్షమునొసంగును. అందుచే శివునకు రోహితుఁడనునామము సార్థకమాయెను.

విష్ణు:-

"విక్షరోరోహితోమార్గః" అను విష్ణుసహస్ర సూక్తిలో రోహితనామము విష్ణుపరముగాఁగలదు పరమాత్మయైన విష్ణువుస్వచ్ఛందముగా రోహిత వర్ణము గల మూర్తినిబొందెను ఆయెఱ్ఱనిమూర్తియే ఉదయకాలపు సూర్యుఁడు. సూర్యమండలమునరోహితమూర్తియై యున్నవాఁడు నారాయణుడు (విష్ణువు.) అతనిని భక్తులు నిత్యము ధ్యానింతురు. ఆ విషయము

శ్లో॥ "ధ్యేయస్సదాసవితృమండలమధ్యవర్తీనారాయణః"
అను సూక్తిలో స్పష్టముగాఁ జెప్పఁబడెను.

ఇంతేకాదు,భగవంతుఁడువిష్ణువు వేదములనపహరించిన సోమకాసురుని సంహరించుటకు మత్స్యావతారుఁడాయెను. అపుడు తాను రోహితమను పేరు గల మత్స్యముయొక్క మూర్తిని స్వీకరించెను. అందుచే విష్ణువు రోహితు డాయెను. "రో + హితుడు" అని పదమును విభజించినపుడు, రో శబ్దమునకు వాచకములు (శబ్దములు) అనియర్థము. శబ్దరూపములు, వేదములు. వానిలో భగవన్మహిమయేగలదు. వాచకములగు వేదములందు నిహితుఁడు (ఉంచఁ బడినవాడు) పరమాత్మ. అతడే విష్ణువు. అందుచే రో = వాచకములైన వేద ములకు, హితుఁడు = వానిలోనుండివానికి బతియైనవాఁడు విష్ణువు. కావుననే

"వాచస్పతిరుదారధీః"

అను సహస్ర సూక్తిలో వాచస్పతి పదము విష్ణుపరముగా ప్రయో గింపబడెను. రోహితుడు, వాచస్పతి అను పదములు సమానార్థకములన్నమాట అందుచే రోహితుడు అను నామము విష్ణువునకు జెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటిః-*

ఇందు "ర్ + ఓ + హ్ + ఇ + త్ + అ"అని ఆరక్షరములుకలవు. అవి షడృతువులకును, మనస్సుతోడి జ్ఞానేంద్రియములకును జిహ్వములు. ఇందు రేఫము అగ్నిబీజము. ఓకారము ఈశ్వరబీజము. హకారము శివ బీజము ఇకారము విష్ణుబీజము. తకారము వాస్తుబీజము, అకారము బ్రహ్మ బీజము.

పై యారు వర్ణములు పురుషబీజములే. కాన, నీనామము నుపాసించు వాడు మూర్తిత్రియాభిన్నుడును, అగ్నిస్వరూపుఁడునగు పరమాత్మనుపాసించు జ్ఞానియై లౌకిక ప్రక్రియలో వాస్తు శాస్త్రజ్ఞుడై దేవాలయాది నిర్మాత కాగలడు. సర్వతంత్రస్వతంత్రుఁడును, ధ్రువుడువలె శాశ్వతుఁడును గాగలడని తెలియు చున్నది. అగ్నిదయచే దీర్ఘాయుష్మంతుఁడై, సత్కార్యకర్తయైయుండగలడు.

## (25) వ నామము:- "స్థపతయేనమః"

శివ:-భ.భా.భా.:-

"స్థపతియనగాఁ బ్రభువు. అనగాఁ బ్రకృష్టుడుగాజన్మించి, సర్వసమర్థుఁడైనవాఁడనియు, నిరంకుశుఁడనియు నర్థమున శివుఁడు స్థపతియాయెను.

"ష్ఠా = గతినివృత్తౌ" అను ధాతువునుండియేర్పడిన "స్థ" అనుపదమునకు స్థిరముగానుండువాఁడనియర్థము, "పద్ = గతౌ" అను ధాతువునుండి యేర్పడిన పతిపదమునకు సర్వులచేఁ బొందఁబడువాఁడు; సమస్తమును బొందువాఁడనియునర్థము.

స్థ + పతి = స్థపతి = అనగా సర్వకాలములందునుండి, సమస్తప్రకృతిని చైతన్యరూపమునఁబొంది, ముక్తులచేఁ బొందఁబడు పరమాత్మయనియర్థము అతఁడే సూర్యాగ్నివాయుస్వరూపుఁడైన శివుఁడనియర్థము. అందుచేఁ బరమశివుఁడే, సమస్తమును సూర్యరూపమున, అగ్నిరూపమున, వాయురూపమున రక్షించుచుఁ బ్రభువై స్థపతియాయెను.

అంతేకాదు. స్థపతిపదమునకు ఖాండికుఁడు అనియునర్థముకలదు. ఖాండికుఁడనగా శిల్పి, లేక రథకారుఁడు, అని యర్థములుకలవు. ఖండము అనగా భాగము. పూర్ణవస్తువైన అఖండమును "మట్టి, కఱ్ఱ, లోహము మున్నగువానిని ఖండములుగాఁజేసి, వానితో విచిత్రరూపముల నిర్మించి, వానికి అఖండత్వమును చైతన్యమును జేకూర్చి, అందుఁబరబ్రహ్మను సాక్షాత్కరింపఁజేయువాడే ఖాండికుఁడు. అతఁడేశిల్పి శిల్పికాశక్తికలదు. అదియేశివాంశ. "శీల = ఉపధారణే అనుధాతువునుండియేర్పడిన "శిల్ప"పదమునకు అభ్యసించుట అనియర్థము. ఖండమునకు అఖండత్వమును జేకూర్చుటయే శిల్పము. అదియే అభ్యాసము. అదికలవాడుశిల్పి. శిల్పి మృత్ఖండములతో, దారు

ఖండములతో, లోహఖండములతో విగ్రహముల నిర్మించి, అందు దైవమును ప్రతిష్ఠింపఁజేయును. జీవులను దైవజ్ఞులుగాఁజేయును. అదియే జ్ఞానియొక్క లక్షణము. జ్ఞానికిని బరమాత్మకును భేదములేదని పెద్దలుచెప్పుదురు. మృద్దారులోహములందుఁ బరమాత్మతేజస్సుకలదని వేదములందుఁగలదు. శిల్పులలో ఒకతెగకుఁజెందినవారే, రథములను నిర్మించురథకారులు. వీరునుజ్ఞానులేఁ పరికింపగాఁ బరమాత్మ, ఖాండికుడే; శిల్పియే; రథికుఁడే. ఎట్లన? అఖండయు. బరమాత్మాభిన్నయునగు శక్తిని బ్రకృతిని, తననుండి వేరుజేసి, ఖండముగాఁ జేసి, దానిసాయమున బ్రహ్మాదిఖండములను విభజించి, వానిలోఁ దనయంశను జైతన్యమును బ్రవేశపెట్టి, చైతన్యవంతములనుగావించిన పరమాత్మ ఖాండికుఁడేకదా! పరమాత్మ అనంతసృష్టియనెడి శిల్పముగావించుటచే శిల్పియే కదా! జీవులకు శరీరములనెడి రథములను నిర్మించి, యొసగుటచేఁ, బరమాత్మ రథకారుఁడేకదా! అట్టి స్థపతి, ఖాండికుఁడు, శిల్పి, రథకారుఁడు పరమశివుఁడే కానఆతనికి స్థపతి యనునామము వాటిల్లెను, అతని నామముతోడనే స్థాపత్య వేదము వెలసినది. గృహాదులను నిర్మించువారును శిల్పులే. కాన వారికి స్థపతులను నామమేర్పడెను.

"స్థాపయతీతి స్థపతిః" అను నర్థము చెప్పినను ప్రకృతిలో బ్రహ్మాండాదులను స్థాపించియుంచిన పరమాత్మ పరమశివుఁడేయనితెలియును. అంతేకాదు.

"తిష్ఠన్త్యస్మిన్నర్థా ఇతి స్థః, స్థశ్చాసౌ పతిశ్చ స్థపతిః"

అనియువ్యుత్పత్తికలదు. దానిచే పిపీలికాదిబ్రహ్మపర్యంతముగల జీవులును, జీవములేని వస్తువులును బరమాత్మయందే కలవు. వానిలోఁ దానేకలడు కాన సర్వమునకును బతియాయెను

"అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్స్థితః"

అను శ్రుతిలో శివుఁడే నారాయణుఁడై బ్రహ్మాండమునకు బైటను, బ్రహ్మాండము లోపలను గలఁడని చెప్పఁబడెను. ఈ విషయమునే నాచనసోమన్నయను కవిశేఖరుఁడు

"లోపల వెలుపల, వెలుపలలోపలగానుండు సకల లోకంబులకున్" అను పద్యమున బేర్కొనెను. పైకారణములచే బరమాత్మయైన పరమశివునకు "స్థపతి" యను నామము చేకూరెను.
ఇంకొక విశేషమేమన?

"స్థాతాచ సర్వత్ర పాతాచ సర్వస్య"

అనువ్యుత్పత్తిననుసరించి చూచినచో (బరమాత్మయైన శివుడు "ఇందుగలడందు లేడని సందేహమువలదు, సర్వోపగతుండు" అంతట నున్నాడనియు, అతడే సమస్తమును మార్కండేయాదులను "పాతా = రక్షించువాడనియును" దెలియుచున్నది. కాన శంకరుడాయెను. అందుచే శివునకు "స్థపతి"యను నామము సార్థకమాయెను.

విష్ణు:-

స్థపతి = ప్రభువు అనునర్థమున (బైనామము శివునకువలె విష్ణువునకు జెల్లును. ఏమన?

"ప్రభవః ప్రభురీశ్వరః, కామః కామప్రదః ప్రభుః"

అను విష్ణుసహస్రసూక్తులలో (బ్రభుపదము విష్ణుపరముగా గలదు. సర్వక్రియలందును సామర్థ్యాతిశయముకలవాడును ప్రభువనగునని చెప్పితిరేని శివకేశవులిరువురును అణిమాసామర్థ్యము, స్థితియునుగల ప్రభువులేయగుదురు. పైయర్థములందు "స్థపతి, ప్రభువు" అను పదములు సమానార్థకములేయగును. కాన స్థపతి పదము ప్రభువు అను నర్థమున విష్ణుపరమునగును.

శివకేశవులొక్కటే కాన శివుడు వలె విష్ణువును సూర్యాగ్ని వాయు స్వరూపుడై సర్వమును సంరక్షించువాడే. విష్ణువు కూడ సర్వకాలములందును సర్వవస్తువులందును 'స్థ' = చైతన్యరూపమున నుండి, పతి = సకలమునకును

ప్రభువైనవాఁడే. కాన విష్ణువు స్థపతియాయెను. పైయర్థమున "స్థపతిః, సర్వాసునిలయః, లోకస్వామీ" అను పదములు మూఁడును సమానార్థకములే.

"సర్వాసు నిలయః" అను పదమునకు వాయురూపుఁడై విష్ణువు సర్వప్రాణుల అసువులకును, ప్రాణములకును నిలయుఁడై వారిని దనలో లీనము చేసికొని వారికిబతియై యుండెననియర్థము. లోకస్వామి పదమునకు సకలజనులకును, లోకములకును ప్రభువని యర్థము. కావునఁ ప్రభువు అను నర్థమున స్థపతి పదము విష్ణువునకుఁజెల్లును.

అంతేకాదు, "విశ్వమూర్తిర్మహామూర్తిః" అను సహస్రసూక్తిచే విష్ణువు విశ్వమే మూర్తిగా ఆకారముగా గలవాడై 'స్థ' = స్థిరుడై సకలజీవులచే ఁబతిగా బొందబడుచు విశ్వమును బొందుచున్నాడని తెలియుచున్నది. కాన "స్థ+పతి" విష్ణువాయెను.

విష్ణువు బ్రహ్మమూర్తియై అఖండమైన ప్రకృతిని ఖండములుగా ఁబదునాల్గు భువనములుగా, అనన్తకోటి జీవరాసులుగాఁ ప్రకృతిసాయమునసే నిర్మించుచున్నాడు. కాన విష్ణువు ఖాండికుఁడాయెను.

అంతేకాదు, విష్ణువు అనన్తకోటి జీవులకు అనన్తకోటి శరీరములనెడి రథములను బ్రహ్మసాయమున నిర్మించుచున్నాడు. కాన విష్ణువు స్థపతి = రథకారుడాయెను. "శరీరం రథమేవతు" అను శ్రుతిచే జీవుల శరీరములు పరమాత్మయైన విష్ణువునకు రథములని తెలియుచున్నది.

అంతేకాదు, పురుషకర్మ పౌరుషము. అది పరమాత్మయైన విష్ణువు యొక్క అంశ. అది యాయాజాతులననుసరించి, అనేకవిధములుగా నుండును మృద్దారులోహాది వస్తునిర్మాతలలోఁగల పౌరుషము విష్ణుశక్తియే. "శబ్దఃఖే పౌరుషంనృషు" అను గీతాసూక్తిలో పౌరుషము పరమాత్మాంశమని చెప్పఁబడెను. కావున మృద్దారులోహాదులతో వస్తువుల నిర్మించు శిల్పులు గృహాది నిర్మాతలును విష్ణుశక్తి సంపన్నులేయన్నమాట,

"తిష్ఠన్త్యస్మిన్నర్థాఇతిస్థః" అని వ్యుత్పత్తిచెప్పినచోఁ బరమాత్మయైన విష్ణువు కుక్షిలోనే సమస్తప్రపంచముకలదనితెలియును. అతఁడే సమస్తము నకును బతికాన విష్ణువు స్థ+పతిఅయెను. ఈ విషయమే "పదునాలుగు భువనంబులు కుదురుగ నీకుక్షిలోన" అను కృష్ణశతకపద్యమునఁ బేర్కొనఁ బడెనని తెలియుచున్నది. "మత్స్సర్వాణిభూతానిమయి సర్వంప్రతిష్ఠితమ్" అను గీతాసూక్తిలోఁ బైవిషయమే ప్రస్ఫుటముగాఁగలదు.

"స్థాతాచసర్వత్ర। పాతాచసర్వస్య = స్థపతిః" అని చెప్పినను స్థపతి పదము విష్ణుపరమగును. ఎట్లన? "ఇందుఁగలఁడందులేడని సందేహమువలదు చక్రిసర్వోపగతుండు" విష్ణువంతటనుగలడు; కావున ఆతనికి "విష్ణుఃసర్వ వ్యాపకుఁడు" అనునామమేర్పడెను. అతఁడే సర్వులనుపాతా = రక్షించెడి వాడు". జాతిలోనికవ్వను గాపాడువాఁడు నాతఁడే. ఈవిషయమే "పూర్ణః పూరయితా" అను విష్ణుసహస్రసూక్తిలోని "పూర్ణ" పదముచేతను 'గతిర్భర్తా' అను సూక్తిలోని గతిభర్తృ పదములచేతను "గోప్తా" అనుపదముచేతను జెప్పఁబడుచున్నది. అవి విష్ణునామములే. హిరణ్యకశిపుడు పగులగొట్టిన స్తంభముననున్నవాఁడు విష్ణువేకదా. ఉత్తరాగర్భస్థశిశువును బరీక్షిత్తును గాపాడినవాడు విష్ణువేకదా! కాన విష్ణువునకు స్థపతినామము చక్కగాఁజెల్లును.

***బీజాక్షరసంపుటి:-***

ఇందు "స్+థ్+అ+ప్+అ+త్+ఇ" అని ఏడక్షరములుకలవు. అవి సప్తధాతువులను, సప్తవాయుమండలములను సూచించును. ఇందు శక్తి బీజమైన "సకారము"ను, ధర్మబీజమైన "థకారము"ను సర్వదేవతాకమైన "అకారము"తోఁగూడియుండుటచేఁ బైనామము నుపాసించువారు శాక్తేయులై శక్తిమహిమచే సంఘమునుద్ధరించి, ధర్మరక్షకులుకాఁగలరు. పర్జన్యబీజమైన "పకారము" "అకారము"తోడను, వాస్తుదేవతాకారమైన తకారముఇకారము తోడనుగూడియుండుటచేఁ బైనామము నుపాసించువారు విష్ణుశక్తినందమ్మువై

కృత్రిమ వర్షపాతములకు మూలమైన యంత్రములను గనుగొనువారును, నిర్మించువారునై, ప్రపంచమునకు జలసమృద్ధిని జేకూర్పఁగలవారలగుదురు. రక్తపుఁపోటు, శ్యామలయనువాతరోగముల నిర్మూలింపఁగలవారలగుదురు.

## (26) వ. నామము: "వృక్షాణాంపతయేనమః"

*శివ + విష్ణు:-*

పిపీలికాది బ్రహ్మపర్యంతముగల జీవులను బ్రహ్మాండమునందునేలలో గల అచేతనములును వృక్షములనబడును. అవన్నియును బరమాత్మాంశజులైన బ్రహ్మవిష్ణుమహేశ్వరులలో బ్రహ్మచే సృష్టింపబడి, విష్ణువుచే సన్మార్గమున స్థాపింపఁబడి, మహాప్రళయమున శివునిచే సంహరించబడుచున్నవి, కావున వృక్షములకుఁ బతులు శివ కేశవు లిరువురును అగుచున్నారు. కావున వృక్షపతి నామము వారిరువురికినీ వర్తించును. దీనికిఁ జెందిన విషయము ఇంతకుమున్న రెండవయజస్సున వివరింపఁ బడెను.

### —: దశమయజుస్సు :—

### "నమో మంత్రిణే వాణిజాయ కక్షాణాం పతయేనమః"

*అర్థము :-*

మంత్రిణే = రాజసభలో మంత్రాలోచనకు శలుఁడైనట్టియు, వాణిజాయ = మంత్రి రూపమున వణిజులకు (వర్తకులకు) స్వామియైనట్టి, రుద్రాయ = రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుఁగాక; కక్షాణాం = వనమునందలి గుల్మలతాదులకు పతయే = పాలకుఁడైన రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక.

తాత్పర్యము:-

సా.భా. — పరమశివుఁడు రాజసభలలో మంత్రిగానుండి, పరిపాలనా విషయములు పర్యాలోచనచేయుటలో (గుశలుఁడై యుండెను. అతడే వణిజులందఱికిని ప్రభువై ప్రజాజీవనమును జక్కగా నడుపుచుండెను. అతడే వనములందలి చెట్లు, లతలు, గుల్మములు(పొదలు) మున్నగువానికిఁ బాలకుడై యుండెను. అతనిని భక్తులు నమస్కరించుచున్నారు.

27వ నామము - శివ:- భ.భా.భా. :-

‹నమో మంత్రిణే› ‹మన = జ్ఞానే› ‹మన్యతఇతిమంత్రః›

అను వ్యుత్పత్తిననుసరించి,లోకక్షేమంకరముగాఁదలచబడు విషయము కలది మంత్రమని తెలియుచున్నది. పై విధమున (దలంచువాడే మంత్రి. అతడు రాజసభలో లోకక్షేమంకర విషయములను ఆలోచించుటలో (గుశలుడై యుండును. ఇట మహాదేవుడు మంత్రిగానున్నట్లు చెప్పబడెను.మహాశివుఁడేమి? మంత్రిగానుండుటేమి? అని శంకింతురేని పరికింపుడు—

‹రాజా ప్రభౌనృపేచందే యక్షే క్షత్రియశక్రయోః›

అను నిఘంటు సూక్తిననుసరించి, రాజ శబ్దమునకు ఇంద్రుడని యర్థము కలదు. రాజసభలో (ఇంద్రసభలో) మంత్రాలోచన నిపుణుఁడైయున్న వాఁడు బృహస్పతి. "బృహతాం = వేదమంత్రాణాంపతిః" అను వ్యుత్పత్తి ననుసరించి వేదములకు (బతియైనవాడు బృహస్పతియని తెలియుచున్నది. రాజైన ఇంద్రుఁడు, ఆతనిచెంత మంత్రిగానున్న బృహస్పతి, ఇరువురును లోకక్షేమంకరులే. పరమాత్మయొక్క అంశజులే.

‹కృతాన్నః పాహ్యేనసోయత్కించానృతమూదిమ।
ఇంద్రాగ్నీమిత్రావరుణౌసోమోధాతాబృహస్పతిః›

అను స్వాధ్యాయ శ్రుతిచే లోకులను బాపములనుండి ఉద్ధరించువారిలో సమా నులు ఇంద్ర బృహస్పత్యాదులు; అని తెలియుచున్నది.

"బృహస్పతిశ్చమ ఇంద్రశ్చమే"
సమస్తిర్ధ్యాయచ "సహస్రాక్షాయ మీఢుషే"

అను శ్రుతులచే ఇంద్రుఁడు బృహస్పతియును, శివస్వరూపులేయని తెలియుచున్నది పరమాత్మ ఒక్కొక్క దేవతారూపముదాల్చి ఒక్కొక్కక్రియ నాచరించుచున్నాడు. కాని పరికింపగా ఈ దేవతలందఱును ఏకాకారులేకదా కాన మహాదేవుఁడు బృహస్పతి రూపుడై రాజైన ఇంద్రునిసభలో మంత్రిగా నుండెను. అందుచే శివునకు మంత్రియను నామమేర్పడెను.

"మన = జ్ఞానే" అను ధాతువునుండి యేర్పడిన మంత్ర శబ్దమునకు జ్ఞానము అనియర్థము. అట్టి జ్ఞానమునొసంగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరరుద్ర సదాశివులకు "మంత్రి" యను సంజ్ఞ కలదు. వారు పంచభూతములందుఁ దమశక్తులైన శబ్ద, స్పర్శ, రూప, రసగంధములను అణురూపముగ నిమిడ్చిరి. అవియే పంచతన్మాత్రలు. అవి శివునిలోఁ గలవు. శివస్వరూపు లైనవారు సృష్టిస్థితిలయ తిరోధానావిర్భావములనెడి పంచకృత్యములు చేయుచున్నారు. అవన్నియును శివుని కృత్యములే. కాన శివునకు మంత్రియనునామము సార్థకమాయెను. అంతేకాదు.

రహస్య ప్రకాశములైన గుప్తముగా భాషింపదగిన ఉపనిషత్తులను మంత్రములందురు. వానియందుఁ బ్రతి పాదింపఁబడిన మహిమ కలవాడై ఉపనిషద్విద్యయైన బ్రహ్మవిద్యను లోకమున వెదఁజల్లిన వాఁడగుటచే శివునకు, మంత్రియను నామమేర్పడెను. సప్తకోటి మహామంత్రములు ఆత్మగా గలవాఁడగుటచేతను "మంత్రములకు, మంత్రప్రకటితలకు అభేదము" అను న్యాయముచేతను మహాదేవుఁడు మంత్రినామకుఁడాయెను.

విష్ణుః-

మహావిష్ణువు బృహస్పతి రూపుఁడై తనరూపాంతరుఁడైన ఇంద్రునకు త్రిలోకపాలన వ్యవహారమునఁ జక్కని యాలోచనల నెఱిగించుచు మంత్రిగా నుండెను అమహాశివుడు జగద్రక్షణ క్రియలో విష్ణువాయెను. పరికింపగా శివ కేశవులొక్కటియే వారు కావించు కృత్యములు, లౌకికాకారములును భిన్నము లునుగా గానవచ్చుటచే వారిరువురును విభిన్నులనెడి భ్రమయేర్పడినది. అంత మాత్రాన వారు భిన్నులుకారు కానవిష్ణువే ప్రభువుగానున్నను ఇంద్రరూపుఁడు బృహస్పతి రూపుఁడు నాయెను. వేద స్వరూపుఁడైన పరమాత్మ, మంత్రిత్వ కార్య నిర్వహణలో బృహస్పతియాయెను ఆ విష్ణువే కృష్ణావతారమున అర్జును నకు సచివుఁడైనట్లు మంత్రియైనట్లు

"శక్తోఽపిసాచి వ్యమివాస్యకుర్వన్"

అను సూక్తిచే వ్యక్తమగుచున్నది. కావున విష్ణువునకు మంత్రినామము సార్థకమే

"బుద్ధస్స్రష్టాక్షరోమంత్రః"

అను విష్ణుసహస్రసూక్తిచే విష్ణువునకు "మంత్రః" అనునామమున్నట్లు తెలియుచున్నది.

"తత్ తద్వతోర భేదః"

అను న్యాయముచే మంత్ర మంత్రవన్తులకు భేదము లేదని తెలియు చున్నది. కాన వేదమంత్ర ప్రకాశితుఁడైన విష్ణువునకు "మంత్రి" యను నామము సార్థకమేయగును.

బ్రహ్మ విష్ణు మహేశ్వర రుద్ర సదా శివులనెడి యైదుగురును శివ స్వరూపులేకాదు విష్ణుస్వరూపులుకూడ. శివవిష్ణువులొక్కటేకాన విష్ణు సహస్ర

మున "శివ రుద్రేశ్వరాది" శివనామములు విష్ణుపరములుగాఁ గలవు. కాన పైన పేర్కొనిన పంచదేవతలకుఁ గల మంత్రనామముచే విష్ణువు చెప్పబడు చున్నాడు. "మంత్రము, మంత్రి" అను పదములు అభిన్నార్థకములే. కాన మంత్రియనునామము విష్ణువునకు సరిపడును. మంత్రములైన ఉపనిషత్తులందు శివకేశవ స్వరూపుఁడైన పరమాత్మయొక్క మహిమయే ప్రతిపాదింపఁబడినది సప్తకోటి మహామంత్రములును వేదములే; విష్ణుస్వరూపములే. కావుననేమంత్రి పదమువలె, వేదము సైతము విష్ణుపరముగాగలదని

"వేదో వేద విదవ్యంగః"

అను సహస్రసూక్తిచే తెలియుచున్నది కావున "మంత్రి"యనునామము విష్ణువునకు వర్తించునని చెప్పవచ్చును.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "మ్+అ+న్+త్+ర్+ఇ" అని ఆరక్షరములు కలవు అవి షడృతువులను, షడింద్రియములను సూచించును. సావిత్రీ బీజమైన సకారమును, వాస్తుబీజమైన తకారమును, అగ్నిబీజమైన రేఫమును విష్ణు బీజమైన "ఇకారము"లోఁ గూడియున్నవి. దీనినుపాసించువారు యోగాగ్నిలో లీనులై కుండలిని యైన సావిత్రిని షట్చక్రమార్గమున నడిపించి, సహస్రారమునఁగలపరమాత్మయైన విష్ణువుతో చేర్చి తన్మూలమున లబ్ధమైన ప్రజ్ఞాబలముచే వాస్తుశాస్త్రసమ్మతముగాఁ బెక్కు యంత్రములను, కట్టడములను నిర్మింప అనుకూలములైన మార్గములను లోకమునకు జూపఁగలరు. నూతన వస్తువులను సృష్టించగలరు

పై వానితో మదనబీజమైన "మకారము"ను సర్వ దేవతాకమైన అకారమును గూడియుండుటచేఁ దాము బ్రహ్మానందానుభవ సుఖమును బొందుటయేగాక, సామాన్య జీవకోటికి లౌకికానందమును సైతము చేకూర్పగలరు

(28) వ నామము :- శివః-భ.ఖా.ఖా.:-

"నమోవాణిజాయ" వణ = ప్రాపణే

అను ధాతువునుండి యేర్పడిన "వణిక్" పదమునకు వస్తువులను దేశాంతరములకుఁ జేర్చువాఁడని యర్థము. ఇట వస్తువులుచేతనా చేతనరూపమున అనన్తములై యున్నవి. వానినెల్లఁ దనలోనుండి బైటపెట్టి, జీవులయవసరమునకై వర్తకుని వలె లోకాంతరములకుఁ జేర్చుచున్నాడు. అది యంతయు సృష్టివిచిత్రము. కుబేరుఁడు వణిజులకు మూల పురుషుఁడు. అతఁడు మహాశివునకు బరమ మిత్రుడు. కుబేరుఁడును బరమాత్మయొక్క అంశమే భక్తులకు ఐశ్వర్యమొసంగుటకై పరమ శివుఁడు సాక్షాత్తుగా వణిగ్రూపధారి(కుబేరుఁడు) ఆయెను ఇది పురాణ ప్రసిద్ధము.

వణిక్కే, వణిజుఁడే (వర్తకుడే) వాణిజుఁడు జనపదమందలి (దేశమందలి) జనులవ్యవహారములను వారికవసరమగు వస్తువులను దేశమందలి పలుతావులనుండి సంపాదించి, ఒకచోటజేర్చి వారికొసగుచుండును. అటులనే పరమ శివుఁడు సూర్య రూపుఁడై సర్వ జంతువుల కర్మలను ప్రత్యక్షముగాఁ జూచుచు వారి కర్మ ఫలము లను ఆ జంతువులకుఁ జేకూర్చును. అందుచేఁ బరమ శివుఁడు వాణిజుడాయెను. అంతేకాదు.

"పణ = వ్యవహారే, స్తుతౌచ" అను ధాతువునుండి యేర్పడిన "వాణి" శబ్దమునకు ధ్వని రూపమునఁ బలుకఁ బడునదని యర్థము వాణి అనగావాక్కు అది శబ్దగుణకమైన ఆకాశము యొక్కయు, వాయువు యొక్కయు రూపాన్తరము వాయ్వాకాశములు శివస్వరూపములే. అందుచే భగవన్మహిమకు వాచకమైనవాక్కునందు, జః = జన్మించినవాడై,వాచ్యుడై (చెప్పఁదగినవాఁడై స్తుత్యుడై) యుండువాఁడు పరమశివుడు అతఁడే దక్షిణామూర్తియై వాచ్యములైన సకల విద్యలను, మునుల కొసంగెను. వాచ్య వాచకములు శివ స్వరూపములు కావున శివునకు వాణీజుడను నామమేర్పడెను

విష్ణుః-

శివుఁడు వలె విష్ణువును దనలోఁగల పదునాల్గు భువనంబులను పాలీడు తన నోటిలోఁగల ఉమ్మ్నను దారముగాఁబైటఁబెట్టినట్లు బ్రహ్మాండమంతటను జేర్చినాడు. కావున విష్ణువు వణిక్కాయెను. అ విష్ణువే లౌకిక వ్యవహారము లను వర్తకుఁడు వలె సాక్షాత్తుగా సూర్యరూపుడై చూచుచు "అవ్యయః పురుష స్సాక్షీ" అను విష్ణు సహస్రసూక్తిలోఁ జెప్పినట్లు సాక్షి యాయెను, అతఁడే "క్షేమకృచ్ఛివః" అను సూక్తిలో చెప్పినట్లు లోక క్షేమం కరుఁడై వణిజుఁడై లోకులకు ధన మొసంగుచు "వసుప్రదోవాసుదేవః" అను సూక్తిలోఁ జెప్పి నట్లు వసుప్రదుఁడాయెనుఁ వణిజుఁడు ధనము కూడఁబెట్టి, ధనేశ్వరుఁడైలోకుల యవసరములకు ధనమొసంగుట చూచుచున్నాముకదా! ఆటులనే విష్ణువు ధనా ధ్యక్ష ధనేశ్వర నామకుఁడై తనపత్నియైన లక్ష్మీదేవిద్వారా లోకులకు ధనము చేర్చుచున్నాడు వస్తువులను జేర్చుచున్నాడు. తన భక్తుడైనకుచేలునకు అక్షయ సంపదలను, భక్తురాలైన ద్రౌపదికిఁ గౌరవసభలో వస్త్రాపహరణసమయమున అక్షయ వస్త్రములనుఒసగుట, చదువరులకుఁ దెలిసినవిషయమేకదా! కావున విష్ణువు వాణిజ నామకుఁడాయెను. అంతేకాదు.

"వాణి + జః" అని వ్యుత్పత్తి చెప్పినను వాణులనుండి అనగా వేద వాక్కులనుండి శివకేశవ రూపుఁడైన పరమాత్మయే జన్మించినాడు. అనగా వేదవాక్కులచే వేద్యుడుతెలిసికొనదగిన వాఁడగుచున్నాడు. చెప్పబడుచున్నాడు

"వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః
సర్వేవేదా యత్పదమామనన్తి"

అను శ్రుతులను బరిశీలించినచో అహంశబ్ద వాచ్యుఁడైనశివుఁడే కానిండు విష్ణువే కానిండు, సర్వవేదములచేఁ దెలిసికొనఁ బడుచున్నాడనియును, సర్వ వేదములును శివ విష్ణు పదములనే ఉద్ఘోషించుచున్నవనియును దెలియు చున్నది.

వాణి = వాచకములైన వేదవాక్కులచే, జః = పాచ్యాది రూపమున జన్మించినవాఁడు విష్ణువు కావుననే అతఁడు "మనోజవస్తీర్థకరః" అను విష్ణు సహస్ర సూక్తిలో జెప్పినట్లు తీర్థకరుఁడు అనగా హయగ్రీవరూపమున వచ్చి వాచ్యములను సకల విద్యలనొసంగిన వాఁడాయెను. ఈవిషయమునే కాళిదాస మహాకవి

*"వాగర్థావివసంపృక్తౌ"*

అను శ్లోకమున వాగర్థములు ప్రకృతి పురుషులే యనియు, వారే సకల విద్యాదాతలనియును సూచించినాడు. కావున విష్ణువునకు "వాణీజుడు" అను నామము సార్థకమాయెను.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "వ్+అ+ణ్+ఇ+జ్+అ" అని అక్షరములు కలవు అవి షడింద్రియములనుఁ షట్కృత్తికలను సూచించును వరుణబీజమైన 'వ' కారము పరాశక్తి బీజమైన అకారము తోడను, నంది బీజమైన 'ణ' కారము విష్ణుబీజమైన ఇకారము తోడను. ఇంద్రబీజమైన 'జ' కారము సర్వ దేవతాక మైన 'అ' కారముతోడను, గూడియుండుటచేఁ బైనామము నుపాసించువారు పరాశక్తిదయచే జలోదరాది రోగములను రూపుమాపగలరు జలప్రయాణము లను అనాయాసముగాఁ జేయఁగలరు, జన్తు ప్రమాదములనుండి లోకమును గాపాడగలరు. అనేకవిధ జంతువులను ప్రదర్శనశాలలో నుంచి, పెంప గలరు. పశురోగములనునిర్మూలింపగలరు. శత్రునాశనమొనర్చిమహాధికారము లలోనుండి విజయమందఁగలరు.

**29వ నామము - శివః- ఖ.ఖా.ఖా. :-**

*"కషాణాం పతయేనమః" "కష్యంత ఇతి = కషః,*

*కష = హింసాయాం"*

అను ధాతువునుండి యేర్పడిన కక్ష పదమునకు హింసించునవి హింసా స్థానమైనవనియు నర్థములుకలవు. గిరినదీగహ్వర, గుల్మాదులకును, బావము నకును, అడవికిని 'కక్ష' అను నామము కలదు. కక్ష పదవాచ్యములైన గిరినదీగహ్వరాదులకన్నిటికిని స్వామి అనగాఁ బ్రభువు పరమేశ్వరుడే పరమ శివుఁడు పర్వత రాజములైన హిమాలయమునకును కైలాసమునకును బ్రభువై యున్నాడు. ఎట్లన? హిమాలయమాతనికి అత్తవారియిల్లు. అందుండి యాతఁడు తపంబొనరించినాడు. కైలాసము శివుని నివాసము. మేరువు అతని దివ్య తేజస్స్వంపన్నము. మొత్తముపైని సర్వపర్వతములును బరమశివుని విభూతు లైన సద్వస్తువులతో వృక్షాదులతోనిండినవే. కావున మహాశివుడు గిరీశుఁడైనాడు నదులన్నియును గంగానదీజలసంపూర్ణములే. నదులకు గంగ అధిదేవత.

"ఆపోవా ఇదంగ్ంసర్వం విశ్వాభూతాన్యాపః"

అను శ్రుతిలోఁ జెప్పినట్లు సమస్తమును మూలప్రకృతియైన జలమయమే అట్టి జలమునదులన్నింటనుగలదు. మూలప్రకృతియైన జలమునకుఁ బ్రభువు పర మేశ్వరుఁడే. కావున కక్షపతినామకుఁడైనాడు.

గుల్మములన్నియును ఓషధులే. వానికిఁ జంద్రరూపమున మహాదేవుఁడు ప్రభువాయెను. అంతేకాదు. కక్షలైన గిరిగహ్వరనదీగుల్మాదులలో నున్న సకలవస్తువులకును బ్రభువుకావునఁ బరమశివుఁడు పశుపతినామకుఁడాయెను. వానియందలి జంతువులనన్నింటిని దానేరక్షించుచుండెను. కావున రుద్రుఁడు కక్షపతియాయెను

గహనదేశములు అనగా అరణ్యప్రాంతములును భాషాగహనములైన ధర్మాధర్మములును "కక్ష" నామముకలవే. వానికన్నింటికిని బ్రభువు పరమ శివుఁడే.

"యోరుద్రో అగ్నౌ, యో అప్సు య ఓషధీషు, యోరుద్రో
విశ్వాభువనావివేశతస్మైరుద్రాయనమో౽అస్తు"

అను మంత్రమును బరిశీలించితిమేని, రుద్రుఁడు అగ్నియందును, జలమందును ఓషధులందును, సకలప్రాణులందును, సకలభువనములందును గలడు. వాని కాతఁడే ప్రభువని తెలియుచున్నది. కావుననే రుద్రునకు "కక్షాణాంపతయే" అను నామముసార్థకమాయెను. అందుచేతనే అతఁడు తన నామమును స్మరించువారిపాపములైన కక్షలను నశింపఁజేయుచు రక్షించుచున్నాడు. కక్ష పతినామకుఁడైనాడు.

**విష్ణు:-**

శివుఁడు శ్రీశైలాదిపర్వతములందు అధివసించి, వానికిఁ బతియైనట్లు, విష్ణువును భద్రగిరి, శేషశైలము, మున్నగుపర్వతములపైనివసించి, వాని కన్నిటికిని అధిపతియైనాడు.

"పర్వతానాంహిమాలయః, మేరుశ్శిఖరిణామహమ్" అనుగీతాసూక్తులలోఁజెప్పినట్లు, విష్ణువు విభూతిమేరుహిమాలయములందుఁగలడు. తద్ద్వారా అన్నిపర్వతములందును అతఁడుగలడు. కాన విష్ణువుకక్షలకు = పర్వతములకు బతియాయెను. బదరికాద్యరణ్యములందును విష్ణువు, నరనారాయణాదిరూపములతో నివసించి, వానికిఁ బతియాయెను.

గుల్మములన్నియును ఓషధులే. వానికన్నిటికిఁ జంద్రరూపమునఁ బ్రభువై విష్ణువు వానినుద్ధరించుచుఁ బ్రపంచమును రక్షించుచున్నట్లు "ఓషధయస్సంవదన్తేసోమేనసహరాజ్ఞా" అను మంత్రమువలనఁదెలియుచున్నది. చంద్రుఁడు విష్ణుస్వరూపుఁడు, విష్ణువిభూతియునాయెనను విషయము "నక్షత్రాణామహంశశీ" అను గీతాసూక్తిచేఁ దెలియుచున్నది.

కక్షములకు = గహనములకు అనగా అరణ్యములకు విష్ణువు పతికావుననే "వికర్తాగహనోగుహః" అను విష్ణుసహస్రసూక్తిలో గహనపదము విష్ణునామముగాగలదు గిరినదీగహ్వరాదులలో నివసించుప్రాణులకు రక్షకుడై

విష్ణువు "కక్షపతి" యనునామముదాల్చెను. కావుననే "పీనహాకక్షణః" అను సహస్రసూక్తిలో రక్షణపదము విష్ణుపరముగాగలదు.

అంతేకాదు. "కక్షాణాం = పాపానాంనాశకత్వేనపతిః" అను వ్యుత్పత్తి ననుసరించిచూచినను, శివుడు, విష్ణువుకూడ ప్రాణులపాపములను నశింప జేయుచున్నవారే.

శ్లో॥ "పక్షోపవాసాత్ యత్ పాపంపురుషస్యప్రణశ్యతి।
ప్రాణాయామశతేనైవ తత్పాపంనశ్యతే నృణాం।
ప్రాణాయామసహస్రేణయత్ పాపంనశ్యతే నృణాం।
క్షణమాత్రేణతత్పాపంహరేర్ధ్యానాత్ ప్రణశ్యతి॥"

అనెడి వృద్ధశాతాతపవచనమును బరిశీలించితిమేని పదునైదు దినములుచేయు నుపవాసముకంటెను వేయిప్రాణాయామములకంటెను, క్షణకాలముచేయు హరిధ్యానము సకలపాపములను నశింపజేయునని తెలియుచున్నది.

శివకేశవులిరువురును కీర్తనపూజన ధ్యానస్మరణాదులచే జీవులయొక్క కక్షలను = పాపములను నశింపజేయుచున్నట్లు తెలియుచున్నది.

అంతేకాదు. "కక్షాణాం = భాషాగహనములైన ధర్మాధర్మములకు, శివుడువలె విష్ణువునుబతియే. కావుననే విష్ణుసహస్రమున "క్షితీశఃపాపనాశనః; ధర్మాధ్యక్షః కృతాకృతిః అను సూక్తిలలో "పాపనాశనుడు, ధర్మాధ్యక్షుడు" అను నామములు విష్ణుపరములుగానున్నవి. పైకారణములచే "కక్షాణాంపతిః" అను నామము శివునకువలె విష్ణువునకును సార్థకముగా జెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "క్ + అ + క్ + ష్ + అ + ప్ + అ + త్ + ఇ" అని తొమ్మి దక్షరములుకలవు. ఇవినవబ్రహ్మలను, శరీరమందలి నవద్వారములను సూచించును.

ఇందు మూడకారములుగలవు. అవి బ్రహ్మ విష్ణు మహేశ్వరులను దెలియజేయును. అవి విష్ణుదేవతాకమైన ఇకారముతోగూడియుండుటచే అకార త్రయబోధితులైన త్రిమూర్తులును సర్వవ్యాపకులేయనితెలియును. పైవర్ణములు గల ఈనామము నుపాసించువారు, రక్తపుపోటుశ్యామల, యనురోగములను రూపుమాపి, సమస్తమునువశమొనర్చుకొని, సర్వులను రక్షింపగలరు. ప్రజా పతి దేవతాకములైన "కకారములు" రెండును, వృష్టికరములు. అవి పర్జన్య దేవతాకమైన "పకారము"తోడను, వాస్తుదేవతాకమైన "తకారముతోడను గూడియున్నవి. అందుచే నీనామము నుపాసించువారు, సకాలవర్షములను, కృత్రిమవర్షములను, సస్యానుకూలముగాగురిపించి, జగత్తునకు ఆహారసమృద్ధిని జేకూర్పగలరు. అనావృష్టి అతివృష్టియను ప్రమాదములను దొలగింప గలరు. జలప్రయాణానుకూలమైన నావలను నిర్మింపగలరు; అనితెలియు చున్నది.

—: ఏకాదశయజుస్సు :—

*"నమోభువన్తయేవారివస్కృతాయౌషధీనాంపతయేనమః"*

*అర్థము :-*

భువన్తయే = భూమినివిస్తరింపజేయు, రుద్రాయ = రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక; వారివస్కృతాయ = ధనమునుజేకూర్చు

నట్టియు, లేక, సేవచేయుభక్తులకు జెందినట్టి, రుద్రాయ = రుద్రునకు నమోఽస్తు = నమస్కారమగుగాక; ఓషధీనాంపతయే = ఓషధులకు ప్రభువగు రుద్రాయ = రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక.

*తాత్పర్యము:-*

సా. భాష్యము. భగవంతుడైన పరమశివుడు, సాలీడు తననోటిలోని ఉమ్మితో పెద్దపట్టుఅల్లినట్లు తనలోనున్నపంచభూతములను (ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి) బైటపెట్టి, తనలో నున్నప్రకృతియొక్క సాయమున బదునాల్గు భువనములను, నిర్మించి, భూమిని (అధారశక్తిని) విస్తరింపజేయుచున్నాడు. తాను సృష్టించిన జీవకోటికి అధారమైన ధనమును అనేకవిధవస్తుస్వరూపమున దయారుచేయుచున్నాడు. అతడే సకలౌషధముల కును సోమరూపమున ప్రభువైయున్నాడు. కావున అట్టి రుద్రునకు నమస్కారము.

*30వ నామము - "నమోభువన్తయే"*

*శివ:-*

భ. భా. భా - "భువంతనోతీతిభువన్తిః" అను వ్యుత్పత్తి ననుసరించి భగవంతుడైన పరమశివుడు భూమిని విస్తరింపజేయుచున్నాడని తెలియు చున్నది, భూమి, శబ్దస్పర్శరూపరసగంధములనెడి ఐదుగుణములతో నిండి యుండుటచే ఆకాశాదులకంటె విస్తృతముగా నుండనేయున్నది. మరల విస్తరింపజేయుటేమి? అని ప్రశ్నింపవచ్చును. సృష్టికర్తబ్రహ్మకాగా, శివుడు విస్తరింపజేయుటేమి? అనియు ప్రశ్నింపవచ్చును. సమాధానమేమన?

బ్రహ్మవిష్ణువులు సృష్టిస్థితికార్యములాచరించుచుండగా శివుడు ప్రకృతి నంతటినిలయముచేయుచున్నాడు. బాగుచేయుటకష్టముకాని పాడుచేయుట

సులభమే అనవచ్చును. అంతటితో మహాశివుని కార్యమాగిపోలేదు. కారణ మేమనగ? శివుడు అష్టమూర్తి. అనగా పంచభూతములు, సూర్యచంద్రులు, సోమయాజి, అనునెనమండుగురును శివుని మూర్తులే. వానితో భూమిని విస్తరింపజేయుచున్నాడు. ఎట్లన?

"మంచాఃక్రోశంతి" మంచములేడ్చుచున్నవి. ప్రాణములేని మంచము లేడ్చుటేమిటి? అనగా లక్షణావృత్తిచే, మంచములనాశ్రయించియున్నవాండ్లులేడ్చుచున్నవని యర్థము. అటులనే భూమిని విస్తరింపఁజేయుట, యనగా భూమి నాధారముగాఁ జేసికొనియున్న చేతనాచేతనవస్తుజాతమునంతను విస్తరింపజేయుచున్నాడన్నమాట. ప్రాణముగలవి, ప్రాణములేనివి, అన్నియును శివుని అష్టమూర్తులైన ఆకాశాదులచే నిర్మింపఁబడినవే. అన్నింటిని అనేక విధముల మహాదేవుడు విస్తరింపజేయుచున్నాడు. నిరవకాశమైన ఆకాశమును సావకాశముగాజేసి, అందు పదునాల్గుభువనంబులను స్థాపించినాడాతడు. అందుగల వాయువును ప్రాణాపానవ్యానోదానసమానములనితొల్త పంచవిధములుగా నేర్పఱచి, వానితో భూమినినింపినాడు.

"అగ్నిశ్చజాతవేదాశ్చ................విసర్పేవాష్టమోఽగ్నీనామ్" అనెడి అరుణమంత్రములో జెప్పినట్లు" అగ్ని,జాతవేదుడు,సహోజుడు, అజిరాప్రభువు, వైశ్వానరుడు, నర్యాపసుడు, పంక్తిరాధసుడు, విసర్పి అను భేదములతో అగ్నిని ఎనిమిది విధములుగానేర్పఱచి, వానితో భూమిని ప్రజ్వలింపజేయుచున్నాడు.

చతుష్టయ్య అపోగృహ్ణాతి। చత్వారివా అపాగ్ంరూపాణి। మేఘో విద్యుత్, స్తనయిత్నుర్వృష్టిః" అనెడి అరుణమంత్రములో జెప్పినట్లు, తనలో నుండి బైటపడిన జలభూతమును దొల్త "మేఘము, విద్యుత్తు, స్తనయిత్నువు, వృష్టి," అని నాల్గువిధములుగావేఱుచేసి, వానితోభూమిని నింపుచున్నాడు. పిమ్మట భూమిని పదునాల్గు భువనములుగా, నవఖండములుగా, సప్తద్వీపము

లుగా విస్తరింపజేసినాడు. ఇట్టి భూవిస్తరణమునకుఁ గారణము మహాశివుడే. కావున ఆతడు భువన్తినామధారియాయెను.

ఇంతేకాదు. కుండలు తయారగుటకు మట్టి ఉపాదాన కారణము, అనగా ప్రధానకారణమైనట్లు, మహాశివుడే హిరణ్యగర్భుడై భూశబ్దవాచ్యమైన విశ్వ మంతయు నేర్పడుటకు ప్రధానకారణమైయున్నాడు.

"అహంకృత్స్నస్యజగతఃప్రభవఃప్రళయస్తథా" అను గీతాసూక్తిలో నేనే ఈసకలజగత్తునకును మూలకారణమును, నాశకారణమైయున్నానని భగవానుడు చెప్పియున్నాడు. కావున మహాశివుడు విశ్వమునకు పాదాన కారణమై "భువన్తి" నామధేయుడైయునాడు.

"సర్వదాసర్వత్ర భవతీతివాభువన్తిః" అనువ్యుత్పత్తిననుసరించి, మహాదేవుడు సర్వకాలములందును అంతటనున్నాడని తెలియుచున్నది. అల్పాయుష్కుడైన మార్కండేయుడు శివలింగమును గౌగలించుకొని అన్తకాలమున యముడు, తనను గొనిపోరాగా, శివుని ప్రార్థింపగా, శివలింగమునుండి శివుడావిర్భవించి, యమునిదొలగించి ఆతనినిగాపాడెను. సిరియాళుడు అను భక్తపుత్రుడు మూర్ఛపోగా, గురువు ఆతని దేహమునకు భస్మమును బూయగా దెలివొందెను. అట్టి సమయమున భస్మమందే శివుడుండి భక్తులను గాపాడినట్లు తెలియుచున్నది. ఈరెండుకథలను బైపయమునకు దార్ఘ్యాణములు. అష్ట మూర్తులలోనొకటైన భూమియొక్కరూపమును దాల్చి, మహాశివుడు తృణ గుల్మౌషధి వృక్షాదులకు అధారముగానుండి, భూమిని విస్తరింపజేయుచున్నాడు

"మమయోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భందధామ్యహం" అను గీతా సూక్తిలో బరమాత్మయొక్కయోని మహద్బ్రహ్మయనియు, అందుతాను గుషిస్థ జంతువులను నిల్పిదాల్చుచున్నాననియును గృష్ణభగవానుడు చెప్పియున్నాడు. ఆ మహద్బ్రహ్మయేభూమి. అది శివుని రూపాన్తరము అందు దృణగుల్మాదులు గలవు. కావుని శివుడు భువన్తి నామధారియాయెను

విష్ణు:-

(1) "పాదోఽస్యవిశ్వాభూతాని, త్రిపాదస్యామృతందివి.................
పాదోఽస్యేహాభవత్పునః। తతోవిష్వఙ్వ్యక్రామత్। సాశనానశనే అభి"

(2) "అజాయమానోబహుధావిజాయతే"

అను శ్రుతులను బరిశీలించినచోఁ బరమాత్మయొక్క నాల్గుపాదములలో నొక పాదము బ్రహ్మాండముగా, నానాభూతములుగా, చేతనాచేతనప్రపంచముగా వెలసినట్లును, జన్మరహితుడైన పరమాత్మ అందు బహురూపములుదాల్చి జన్మించినట్లును, దెలియుచున్నది. దీనిచే మహాశివునివలె మహావిష్ణువుకూడ భూమిగా, బ్రహ్మాండముగా మారి దానిని విస్తరింపజేసినట్లు తెలియుచున్నది. కావున విష్ణువుభూవన్తినామధేయముకలవాడాయెను. "భూతావాసోవాసుదేవః" "కరణంకారణంకర్తా" "విశ్వంవిష్ణుః" మున్నగువిష్ణుసహస్రనామములను బరిశీలించినచో సమస్తప్రపంచమునకును, విష్ణువు ఉపాదానకారణమై భూనిర్మాణకర్తయైనట్లు తెలియుచున్నది. వామనావతారకథను, హిరణ్యాక్ష కథను, బరిశీలించినచో విష్ణువు భూమికుపాదానకారణమనియును, భూమితో నిండిన సకలవిశ్వమును అతనియందుగలదనియును ఋజువగుచున్నది కాన విష్ణువు "భువన్తి" నామకుడాయెను.

"స్థవిష్ఠోభూః","లోకాధిష్ఠానమద్భుతః" అను విష్ణుసహస్రసూక్తులందలి భూః, "లోకాధిష్ఠానమ్" అను నామములు, భువన్తినామమునకు బర్యాయ పదములనియును అందుచే భువన్తినామము విష్ణువునకు జెల్లుననియును దెలియుచున్నది. విష్ణువులోకాధిష్ఠానమనగా తృణగుల్మాది వస్తువులకు ఆధారమైనభూమి రూపముగానున్న వాడనియును దెలియుచున్నది

"పద్భ్యాంభూమిర్దిశశ్శ్రోత్రాత్"

అను శ్రుతిలో సకలవస్తువులకాధారమైన భూమి విష్ణుపాదమునుండి పుట్టి నట్లు తెలియుచున్నది అందుచే శివకేశవులొకటేయనియును, వారిరువురును "భువన్తి" నామకులేయనియును దెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "భ్+ఊ+వ్+అ+న్+త్+ఇ" అని యేడక్షరములుకలవు ఇవి దితిగర్భఖండములనుండి పుట్టిన సప్తవాయువులను సూచించును. ఇందు భృగదేవతాకమైన "భకారము" వాయుదేవతాకమైన ఊకారముతోగూడి యుండుటచే బైనామము నుపాసించువారు రాజనీతి ధురంధరులై శత్రుంజయులై రాజాధిరాజులను వశపఱచుకొనగలరు. ఇంతేకాదు. శుక్రదయచే ప్రాప్తించిన ప్రతిభతో, విజ్ఞానశాస్త్రవేత్తలై అందువాయుభేదములను వానిశక్తిని గ్రహించి, తద్ద్వారాశత్రువిషాగ్నివిషకీటకాది ప్రమాదములను దొలగించగలవారలగుదురు.

వరుణదేవతాకమైన "వకారము" సర్వదేవతాకమైన "అ"కారముతో గూడియుండుటచే బైనామము నుపాసించువారు, జలశక్తులను జలవిద్యుచ్ఛక్తులను దెలిసికొని వానిని వశపఱచుకొని, శంకరశిష్యులైన పద్మపాదులవలె కాలినడకతో జలప్రయాణముచేయగలరు. గొప్పవైద్యులై శరీరమున నీరు చేరుట. ఒడలుబ్బుట, జలోదరమమున్నగురోగములు ప్రాప్తించినను, వానిని దొలగించి రోగనాశనకరులుకాగలరు.

సావిత్రీదేవతాకమైన నకారమును, వాస్తుదేవతాకమైన తకారమును, విష్ణుదేవతాకమైన ఇకారముతోగూడియుండుటచే బైనామము నుపాసించువారు మహోపాసకులై సకలజనులపాములను నశింపజేయగలవారలగుదురు.

## *31 వ నామము ;- "నమోవారివస్కృతాయ"*

*శివ:-*

భ. భా. భా:- వరివమును అనగా ధనమునొసగువాడు, ధనమును భక్తులకు జేకూర్చువాడును వారివస్కృతుడగును. అతడు పరమశివుడే.

ఐశ్వర్యమీశ్వరాదిచ్ఛేత్" అను సూక్తిచే ఈశ్వరుడే ఐశ్వర్యము నొసగునని తెలియజేయుచున్నది. ధనకాముకులు శివునుపాసించి, శివాలయములను ప్రతి దినము దర్శింతురు. వరివము (ధనము) జీవులనుజేతదాల్చి పోషించును.

"యస్యాస్తివిత్తంసనరఃకులీనః సపండితః" అను సూక్తిధనముచేతనే మానవులకు సంఘగౌరవమును,జ్ఞానమునులభించునని తెలియఁజేయుచున్నది. అట్టి ధనమొసంగువాడు శివుడు. జ్ఞానము, తపస్సు, బంగారము, వెండి, గృహము, పశువులు, భూములు మున్నగునవన్నియును వరివశ్శబ్ద వాచ్యములే. ధనములే. వీనినన్నింటినొసంగువాడు పరమేశ్వరుడే కాన అతనికి "వారివస్కృత" నామము సార్ధకమాయెను. ఇంతేకాదు వరివమును (ధనమును) ఆర్జించుధనికులకు రాజులకుసాయమొనర్చువాడై పరమశివుడు వారికి సంబంధించినవాడైయుండును.

"అష్టాభిశ్చసురేంద్రాణాం మాత్రాభిర్నిర్మితోనృపః" అను సూక్తిచే నృపాలురిలో అష్టదిక్పతుల అంశలునుండునని తెలియుచున్నది. అష్టదిక్పతులలో జేరిన ఇంద్రుడు, అగ్ని, వాయువు, వరుణుడు, ఈశానుడు, అనునైదుగురును శివస్వరూపులే. కుబేరుడు శివుని స్నేహితుడు. కావునరాజ్యపాలకులైన రాజులతో శివునకు సంబంధముకలదని తెలియుచున్నది రాజేతరులైన ధనవంతులందఱును శివానుగ్రహసంపాదకులే శివసంబంధులే. లేకున్నచో ధనమార్జింపలేరు. కావున శివునకు వారివస్కృతనామము సార్ధకమే, యని తెలియుచున్నది.

అంతేకాదు. వరివము అనగా బరిచర్య. పరమశివునకు బరిచర్యను (సేవను) జేసినవారుభక్తులు. వారికి సంబంధించి, వారిపై శివుడువాత్సల్యముతోనుండును. వ్యాఘ్రాసురగజాసురులనెడిభక్తులు పరిచర్య చేసిన కారణమున, వారిపై వాత్సల్యమొంది, వారి చర్మములను వస్త్రములుగా

నిత్యము ధరించుచున్నాడు. భక్తవత్సలుడుకావుననే మార్కండేయుని గాపాడినాడు. తనకన్నులనూడబెఱికి, శివునకుగన్నులుగానమర్చి, పరిచర్య చేసినతిన్నడను భక్తునిపట్లవత్సలుడై ప్రత్యక్షమై శివుడాతనికి సాయుజ్యముక్తి నొసగినాడు. కావున మహాదేవుడు భక్తవత్సలుడై వారివస్కృతనామమును సార్థకముచేసెను.

ఇంకొకవిశేషమేమన? బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్వురను సృష్టి కార్యమున బ్రహ్మాండప్రవిష్టుడైన పరమాత్మయొక్క రూపాన్తరులే. వారు ముగ్వురునేక రూపులేయైనను సృష్ట్యాదిభిన్నకార్య ప్రవర్తకులై భిన్నరూపులుగా భావింపబడుచున్నారు. సృష్టికిఁబూర్వము ప్రజాపతియైన పరమాత్మ జల రూపప్రకృతిపై బుష్కరపర్ణమున (బంగారుతామరాకుపై) నున్నట్లు

"ఆపోవాఇదమాసన్ సలిలమేవ।
సప్రజాపతిరేకఃపుష్కరపర్ణే సమభవత్॥"

అను శ్రుతివలనదెలియుచున్నది. ఆ ప్రజాపతియే మహాశివుడు. కావున "వారిణి = జలే, వాసోయస్యతస్మై" అను వ్యుత్పత్తిచే మహాశివుడు విష్ణు రూపమునను, వరుణరూపమునను ఉన్నట్లు తెలియుచున్నది. అందుచే వారి వస్కృతుడనునామము శివునకు జెందియున్నది.

విష్ణు:-

"వారివస్కృత" నామము శివునకువలె విష్ణువునకును జెల్లును. ఎట్లన? శివుడువలె విష్ణువును తన నాశ్రయించిన, తన భక్తుడైన కుచేలాదు లకు ధనమొసంగి రక్షించినాడు. "వసుదోవసుః" "వసుప్రదోవాసుదేవః" అను విష్ణుసహస్రసూక్తులలో, ధనమొసంగువాడు కావుననే విష్ణుపరముగా "వసుదుడు, వసుప్రదుడు" అను నామములు పేర్కొనఁబడెను. ధనము

నొసగువాడను నర్థముగల "వారివస్కృత నామము "వసుదుడు, వసుప్రదు డ"ను నామములును సమానార్థకములే. ఐహికమైన ధనముతోపాటు పార లౌకికమైన మోక్షధనమును సైతము శివునివలె విష్ణువుకూడ భక్తులకు జేకూర్చును. కావున "వారివస్కృత" నామము విష్ణువునకును జెల్లును.

అంతేకాదు. "వారివస్కృతుడు = ధనమార్జించువారికి సాయపడుచు, సంబంధించియున్నవాడు" శివుడేకాదు, విష్ణువుకూడ సంబంధించియున్నవాడే.

"నావిష్ణుః పృథివీపతిః" అను సూక్తిచే విష్ణువుయొక్క అంశలేనివాడు రాజుకానేరడనితెలియుచున్నది.

"బాహూ రాజన్యః కృతః" అను శ్రుతిచే విష్ణువుబాహువులనుండిపుట్టుట చేతనే రాజులకు జగత్పాలనశక్తిలభించినదని తెలియుచున్నది. కావున ధన మార్జించు రాజులకు సంబంధించినవాడు విష్ణువు అని తెలియుచున్నది. విష్ణు పత్నియైన లక్ష్మీదేవినారాధించుటచేతనే మానవులు ధనవంతులగుచున్నారు. లక్ష్మీదేవికి "మా" అను నామముకలదు. "మా = లక్ష్మికి ధవుడు = భర్త, మాధవుడు, లక్ష్మినారాధించి, ధనవంతులైన వారికందఱికి లక్ష్మీదేవి మూల మున విష్ణుసంబంధముకలదు. కావున "వారివస్కృత" నామము విష్ణువునకును జెల్లుననితెలియుచున్నది.

అంతేకాదు "వారివస్కృతుడు = వారివమును బరిచర్యను జేయుభక్తుల పట్ల, వత్సలుడు" అను నర్థముచెప్పినను నీనామము విష్ణువునకును జెల్లును. ప్రహ్లాదాది భక్తులను ద్రౌపదిమున్నగు భక్తురాండ్రనుగాపాడుటచే విష్ణువు భక్తవత్సలుడని తెలియుచున్నది. "మాధవో భక్తవత్సలః" అను విష్ణుసహస్ర సూక్తిచే భక్తవత్సలుడను నామము విష్ణువునకుగలదని తెలియుచున్నది. "భక్తవత్సలుడు, వారివస్కృతుడు" అను రెండునామములును సమా నార్థకములే. అందుచే, విష్ణువుకూడ "వారివస్కృతనామధేయుడే యని తెలియుచున్నది.

ఇంకొకవిషయమేమన? "వారిణి = జలే, కృతో వాసో యేనసః" అను వ్యుత్పత్తి చెప్పినను వారివస్కృతనామము విష్ణువునకుజెల్లును-ఎట్లన?

*"భూః పాదౌ యస్య నాభిర్వియదసురనిలశ్చంద్రసూర్యౌ చ నేత్రే*
*కర్ణావాశాశ్శిరో ద్యౌర్ముఖమపి దహనో యస్య వాసోఽయమబ్ధిః"*

అను శ్లోకార్థమును బరిశీలించినచో, విష్ణువు జలపూర్ణమైన అబ్ధిలో నివసించినట్లు తెలియుచున్నది. బాలముకుందరూపుడై విష్ణువు, కరారవిందముతో బదారవిందమును బట్టుకొని, ముఖారవిందమున నిడుకొని జలధిలో దేలియాడు వటపత్రమున శయనించినట్లు

*"కరారవిందేన పదారవిందం ముఖారవిందే వినివేశయంతం*
*వటస్య పత్రస్య పుటే శయానం బాలం ముకుందం మనసా స్మరామి"*

అను శ్లోకముచేఁ దెలియుచున్నది.

"మహోదధిశయోఽన్తకః" అను విష్ణుసహస్రసూక్తిచే విష్ణువు మహాసముద్రశాయియైన కారణమున "మహోదధిశయుడు" అను నామమును ధరించినట్లుతెలియుచున్నది. ఆ విష్ణువే, వరుణుడై జలపతియైనాడు కావుననే

"యాదసాంపతిరప్పతిః" అను నమరసూక్తిలో అపాం = నీళ్ళకు, పతిః = ప్రభువు వరుణుడని చెప్పఁబడెను.

"మిత్రోఽసి వరుణోఽసి" అను శ్రుతియుః నీవిషయమునే వ్యక్తము చేయుచున్నది. వారివస్కృతుడు, మహోదధిశయుడు," అను రెండు నామములును సమానార్థకములే; కానఁ బైకారణములచే విష్ణువునకు "వారివస్కృత" నామము సార్థకమాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "వ్+అ+ర్+ఇ+వ్+అ+స్+క్+ఋ+త్+అ" అని పదునొకండక్షరములు కలవు. ఇవి శరీరమందలి ఏకాదశద్వారములకును, ఏకాదశవాయువులకును జిహ్వములు. పరాశక్తిబీజమైన "అకారమువరుణ బీజమైన "వ"కారముతో గూడియుండుటచే బైనామము నుపాసించువారు శక్త్యారాధనచే, అపారప్రతిభాసంపన్నులై, జలప్రయాణశక్తిని, సంపాదింప గలరు. జలమందలిరోగనివారకవస్తువులను గ్రహించి, "శ్విత్రము" (తెల్ల మచ్చలు) మున్నగురోగములను నివారింపగల వైద్యశిఖామణులు కాగలరు.

విష్ణుబీజమైన "ఇకారముతో" గూడిన రేఫము వహ్నిబీజమగుటచే బైనామము నుపాసించువారు సకలవస్తువులందునుగల అగ్నియెట్టిదో, దాని ప్రభావమెట్టిదో తెలిసికొని, శ్యామలాదిరోగములనుండియు, (చర్మమునల్లనగు రోగము) అగ్నిప్రమాదములనుండియు రక్షింపగలవారలగుదురు. బ్రహ్మ ప్రజాపతిబీజములైన "ఋకార, కకారములతో" గూడినట్టియు, శక్తిబీజమును, అగు "సకార"మిందున్నకారణమున బైనామము నుపాసించువారు, సృష్టి విచిత్రములనెఱింగి, పిత్రగ్రహబాధలను, రక్తప్రసారలోపప్రమాదములను (బ్లడ్ప్రజర్) దొలగించి, విచిత్రవస్తువులను సృష్టించి, నకాలవర్షములు కురి పించగలవారలగుదురు.

సకలదేవతాకమైన "అకారముతో" గూడినట్టియు, వాస్తుదేవతాకమైన "తకారము" పైశక్తులు సంపాదించుటకు దోహదమొసంగును.

### *32 వ నామము:- "ఓషధీనాం పతయే నమః"*

*శివ:-*

భ. భ. భా:- "ఉష = దాహే, డుధాఞ్ = ధారణపోషణయోః" అను ధాతువులనుండి "ఓషధి" అను పదమేర్పడెను. "ఓషాన్తం, పాకాంతం, ధీయన్తఇతిఓషదయః" అను వ్యుత్పత్తిననుసరించి, ఓషధులైన తృణవృక్షలతా దులు ఓషధులనబడుచున్నవి.

"ఓషధ్యః ఫలపాకాంతాః" అను నమరసూక్తియు బైవిషయమునే వ్యక్తము

చేయుచున్నది. ఓషధులు గ్రామములందును, అరణ్యములందునుగలవు.

"ఓ = దాహోధీయతే అత్రేతిఓషాః" అను వ్యుత్పత్తిచే తృణలతాదు లన్నియును బీజరూపముననే, నేలలో నుడుపబడి, నేలలోని శీతోష్ణములచే దాహమొంది, ఉబ్బిమొలకెత్తును. పిమ్మట వ్రేళ్ళు, ఆకులు మున్నగువానిద్వారా నేలలోని శీతోష్ణములను, జలమును, ఆహారములైన లవణాదులను, బైట నున్నవాయువు, తేమ, వేడిమిమున్నగువానినిస్వీకరించి, పెరిగిపెద్దవగును. ఇది ఓషక్రియచేజరుగును. పిమ్మట తాము స్వీకరించిన శీతోష్ణజలాదులను ధరించి, పోషణనొంది, తమయందుఁగల పూవులు, కాయలు, పండ్లు మున్నగు వానిచే సకలజీవకోటికిని పోషణనొసంగిపోషించుచున్నవి. అది ధారణక్రియచే జరుగుచున్నది. కావుననే తృణాదులకు "ఓష + ధి" అను నామము సార్థకమాయెను

పరమాత్మ భూతాత్మయై ఓషధులను పుట్టించెను. అను విషయము
"యథాకాశస్థితో నిత్యంవాయుస్సర్వత్రగోమహాన్।
తథాసర్వాణిభూతానిమత్‌స్థానీత్యుపధారయ"
"మయాధ్యక్షేణప్రకృతి స్సూయతేసచరాచరమ్"
"పితాహమస్యజగతోమాతాధాతాపితామహః"

మున్నగు గీతాసూక్తులచే తెలియుచున్నది. ఎట్లన? ఆకాశమందలి వాయువు సర్వత్రవ్యాపించి, మహత్తాయెను. అటులనే తనలో నున్నభూతములను, చేతనాచేతన వస్తువులను బైటపెట్టి, పరమాత్మ ఆ వస్తువులరూపముచే,దాల్చి మహత్తాయెను అధ్యక్షుడైన పరమాత్మసాయమునొందియే, ప్రకృతి చరాచర ప్రపంచమును, గనుచున్నది. వ్యక్తముచేయుచున్నది. కావున గానవచ్చు, ఈ సకల జగత్తునకును బరమాత్మయే, తల్లియు, తండ్రియు, పోషకుడును, పితా మహుడునై, యుండెనని తెలియుచున్నది. కావున బరమాత్మసృష్టికర్తయైన బ్రహ్మయై, అండాండపిండాండ బ్రహ్మాండములను, సకలవస్తువులనుసృష్టించి భూతాత్మగానుండెను. అతడేసోమాత్మకుడై, చంద్రరూపుడైఁ గ్రామములందును గల ఓషధులనెల్ల బెంచి ఓషధీశుడాయెను.

"ఓషధయస్సంవదన్తేసోమేనసహరాజ్ఞా" అను శ్రుతిచే సోముడైన చంద్రునిచే సకలౌషధులును విరాజిల్లుచు పెరుగుచున్నవని తెలియుచున్నది. ఆ సోముడు శివుని అష్టమూర్తులలో నొకడు. అతడే భూతాత్మ. భూతాత్మపదమునకు బ్రహ్మ, శివుడు అని రెండర్థములుగలవు. శివుడే సృష్టికార్యమున బ్రహ్మగానుండెను. అతడే చంద్రరూపుడై ఓషధులను పెంచుచున్నాడు. కావున శివునకు "ఓషధిపతి" యనునామము సార్థకము అయెను.

విష్ణు:-

శివుడువలె విష్ణువును ఓషధిపతియగును. ఎట్లన? శివకేశవులిరువురును పరబ్రహ్మయొక్క రూపాన్తరులే. ఇద్దఱును భూతాత్మలే. "భూతాత్మా పరమాత్మాచ" అను విష్ణుసహస్రసూక్తిలో విష్ణువునకు భూతాత్మయను నామము కలదు. చరాచరములందంతటను శివుడువలె విష్ణువును ఆత్మగానున్నవాడే. "ఏష ఆత్మాంతర్యామ్యమృతః" అను శ్రుతి అమృతుడైన పరమాత్మ సర్వాంతర్యామిగానున్నట్లు తెల్పుచున్నది

"పశూగ్ంస్తాగ్ంశ్చక్రే వాయవ్యాన్।
ఆరణ్యాన్ గ్రామ్యాశ్చయే"

అను శ్రుతిగ్రామ్యారణ్యపశువులను (ఓషధులను) విష్ణువు సృష్టించినట్లు చెప్పుచున్నది. శ్రుతులలో శివవిష్ణుభేదము సగుణమునసేకాని, నిర్గుణమున నున్నట్లు ఎచ్చటను గోచరింపదు వేదమంత్రములన్నియును శివ విష్ణు సామాన్యములే. కావున శివునివలె సర్వాంతర్యామియైన విష్ణువుకూడ బ్రహ్మస్వరూపుడైచేతనాచేతనములను సృష్టించి, సోమస్వరూపుడై (చంద్రరూపుడై) వానిని పెంచుచు, పోషించుచు, వానికి ప్రభువుగానున్నవాడే. కావుననే "సోమపోఽమృతపస్సోమః" అనెడి విష్ణుసహస్రసూక్తిలో, సోముడను నామము విష్ణుపరముగాగలదు సోముడు (చంద్రుడు) విష్ణువుమనస్సునుండి

ఉద్భవించినట్లు "చంద్రమామనసోజాతః" అను శ్రుతిచెప్పుచున్నది. విష్ణువు, ఘాతాత్మగానుండి, గ్రామ్యములును అరణ్యములునగు ఓషధులను సృష్టించి, సోమాత్మకుడై వానిని రక్షించుచు పోషించుచు ఓషధిపతియగుచున్నాడు.

"పుష్ణామిచౌషధీస్సర్వాః సోమోభూత్వారసాత్మకః"

అను సూక్తిపైవిషయమునకు దార్ఢ్యాణము. కాన విష్ణువు ఓషధిపతియాయెను.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "ఓ+ష్+అ+ధ్+ఇ+ప్+అ+త్+ఇ" అని తొమ్మిదక్షరములుకలవు. ఇవి శరీరమందలి నవనాడులను, సూచించును. ఈశ్వర బీజమైన ఓకారము విష్ణుబీజమైన ఇకారము, బ్రహ్మబీజమైన అకారమును ఇందుగలవు ఇవి సర్వాధిష్ఠానదైవతములైన త్రిమూర్తుల స్వరూపములు. వానితో గూడిన పైనామము నుపాసించువారు, తేజః పరిపూర్ణులై సర్వులకును సర్వఫలములనొసంగి, వశపఱచుకొని రక్షింపగలవారలగుదురు.

ద్వాదశాత్మకమైన (సూర్యబీజమైన) షకారము సర్వదేవతాకమైన అకారముతోగూడియుండుటచే పైనామము నుపాసించువారు సూర్యగోళ సంచారులును ఆరోగ్యప్రదాతలును అగుదురు. సర్వసిద్ధులను జీవులకు జేకూర్పగలరు.

ధనద (కుబేర) బీజమైన ధకారము విష్ణుబీజముతోగూడియుండుటచే ఈనామము నుపాసించువారు భూగర్భపరిశోధకులై సువర్ణాదిలోహపుగనులను, రత్నాదులను ఎచటగలవోతెలిసికొని వ్యక్తముచేసిప్రపంచమునకు సకల ధనములను జేకూర్పగలవారలగుదురు. పర్జన్య దేవతాకమైన పకారము, మకారముతోగూడియుండుటచే పైనామము నుపాసించువారు జలధాతువులు గలతావులను గనుకొని, జలమును నిల్వజేయగల ఆనకట్టలను నిర్మింపగల వారలగుదురు.

:— ద్వాదశయజుస్సు :—

"నమఉచ్చైర్ఘోషాయాక్రందయతే పత్తీనాంపతయేనమః"

**అర్థము :-**

యుద్ధకాలే = యుద్ధసమయమున, ఉచ్చైర్ఘోషాయ = మహోన్నతధ్వని గల, శివునకు, నమః = నమస్కారము. ఆక్రందయతే = శత్రువులనేడిపించు రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక. పత్తీనాం = పాదచారులైన యోధులకు, పతయే = పాలకుడైన రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక.

**తాత్పర్యము:-**

సా. భాష్యము:- పరమేశ్వరుడు పంచమహాభూత స్వరూపుడు. పంచభూతములలో మొదటిది ఆకాశము. అది శబ్దగుణకము. ఆకాశస్వరూపుడైన మహాదేవుడు యుద్ధకాలమున శత్రువులగుండెలు పగులునట్లు పెద్దధ్వని చేయును. దానినే మహాట్టహాసమందురు. ఆధ్వని విన్నతోడనే శత్రువులు మిక్కిలిగావిలపింతురు. అపుడువారిబంధుమిత్రులును గొప్పగావిలపింతురు. అట్టి సమరసమయమున తనపక్షమునం బాదచారులైన యోధులను శివుడు శత్రువులబారినుండి సంరక్షించుచుండును. అట్టి మహాదేవుని, భక్తులు నిత్యము నమస్కరింతురు.

**33 వ నామము:- "నమఉచ్చైర్ఘోషాయ"**

**శివ:-**

భ. భా. భా:- ఘోషమనగారోదనము. జీవులచేగర్మఫలమనుభవింపజేసి, గొప్పగా పీడిపించినకారణమున రుద్రుడు ఉచ్చైర్ఘోషుడాయెను,

ఘోషమనగా ధ్వని యనియర్థము. శివుడు యుద్ధకాలమున మహాట్టహాసరూపమగు ధ్వనిగావించి, శత్రువులైన రక్కసులకు భీతిగావించి, సంహరించినాడు. అందుచే ఉచ్చైర్ఘోషుడాయెను.

"నమస్సోమాయచరుద్రాయచ" మున్నగు శ్రుతులలో అత్యుచ్ఛ్రితము లను మహోన్నతార్థములుగగుపదములు శివపరముగాఁగలవు. వానిని బిగ్గరగానుచ్చరించి, కైలాసపర్వతముక్రింద నణవబడిన రావణుడు ఘోషించుచు, "జటాటవీగలత్ జ్వలత్" అనెడి స్తోత్రముతో శివునిగొని యాడెను. అందుచే శివుడు ఉచ్చైర్ఘోషుడాయెను.

అంతేకాదు. ఉచ్చైర్ఘోషములుగట్టిగాధ్వనించునవి మేఘములు. అవి "ధూమజ్యోతిస్సలిలమరుతాం సన్నిపాతఃక్వమేఘః" అని కాళిదాసకవిమేఘ సందేశ శ్లోకమున జెప్పినట్లు జలవాయ్వగ్నిధూమములతో జేయబడెను. వానిలో మొదటి మూడును మహాదేవుని యష్టమూర్తులలో జేరినవే. అందుచే వర్షమొసగు మేఘుడును శివస్వరూపుడే; అను విషయము—

"సహస్రాక్షాయమీఢుషే" అను శ్రుతిలో 'మీఢుషే' అనుపదముచే జెప్పబడెను. కావున మేఘరూపుడైన శివుడు ఉచ్చైర్ఘోషనాముకుడాయెను.

'ఘోష' శబ్దమునకు స్తోత్రములని యర్థము. శివ మహిమ్నాది స్తోత్రములు పరమశివునకు జెందినవి పెక్కులుగలవు. అవి శివమహిమను ప్రదర్శించును. ఋగ్వేదఋక్కులు (మంత్రములు) కూడ శివమహిమను దెలియజేయును. అవియును ఋగ్వేదమంత్రరూప స్తోత్రములే. అవన్నియును ఉన్నతములే. కావున వానిచే స్తుతింపబడు మహాశివుడు ఉచ్చైర్ఘోషనామకుడాయెను

విష్ణుః-

విష్ణువు తన భక్తులచే గజేంద్రాదులచే వారి కర్మఫలమనుభవింపజేయుటకై మకరాదులచే వారికి బాధకల్గించి, వారి నిష్కల్మషభక్తిని బరీక్షించు

టకై "రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!" అని యేడిపించినాడు. కాన విష్ణువు ఉచ్చైర్ఘోష నామకుడాయెను. శత్రువులైన రాక్షసులను హిరణ్యకశిపాదులను సంహరించు సందర్భమున భయంకర గర్జనరూపమున మహాధ్వని గావించెను. కావుననే విష్ణువు "పుష్కరాక్షో మహాస్వనః" అను విష్ణుసహస్ర సూక్తిలో మహాస్వనుడను నామమున గొనియాడ బడెను.

అంతేకాదు, వేదరూపమైన శోభనఘోషమును మేఘగంభీరధ్వనిని ఉన్నతముగాఁగావించుటచే "సుఘోషస్సుఖదస్సుహృత్" అను సహస్ర సూక్తిలో విష్ణువు "సుఘోష"డను నామమున పేర్కొనబడెను. సుఘోషుడు, మహాస్వనుడు, ఉచ్చైర్ఘోషడను మూడునామములును సమానార్థకములే. కావున విష్ణువు ఉచ్చైర్ఘోషనామకుడాయెను.

"నారాయణాయవిద్మహే వాసుదేవాయధీమహి।
తన్నో విష్ణుః ప్రచోదయాత్।"
"వజ్రనఖాయవిద్మహే తీక్ష్ణదంష్ట్రాయధీమహి।
తన్నో నారసింహః ప్రచోదయాత్"

మున్నగు శ్రుతులు అత్యుచ్ఛ్రితములైన ఘోషములతో విష్ణుమహిమను వాక్రుచ్చెను. కావున విష్ణువు ఉచ్చైర్ఘోషనామకుడాయెను.

వేదమంత్రములన్నియును విష్ణుమహిమను వెల్లడిచేయు ఉచ్చైర్ఘోషములే. మహోన్నతస్తోత్రములే. వేదమంత్రములు త్రిగుణాత్మకములు. శివకేశవాభేదముగానే వారిగుణములను స్తోత్రముచేయుచున్నవి. గుణసంకీర్తనము విష్ణుస్వరూపము. స్తుతిక్రియవిష్ణువే కావుననే "స్తోత్రంస్తుతిస్తోతారణప్రియః "అను విష్ణుసహస్రసూక్తిలోని స్తోత్రంస్తుతి" "అనువదములు విష్ణుపరములుగాఁగలవు. కావున విష్ణు" ఉచ్చైర్ఘోషనామకుడాయెను. విష్ణుమహిమ్నాదిస్తోత్రములెన్నియోవిష్ణుపరములుగాగలవుకదా!

ఉచ్చైర్ఘోషములు మహాధ్వనిచేయు మేఘములు అన్నియును విష్ణు స్వరూపములే. కావుననే

"పర్జన్యఃపావనోఽనిలః" అను సహస్రనామశ్లోకములో మేఘార్థకమైన పర్జన్యశబ్దము విష్ణునామముగాఁబేర్కొనబడెను. విష్ణువుమేఘస్వరూపమున జీవులతాపత్రయమును హరించుటకేవర్షించును. సర్వకామములను జలరూపమున వర్షించును. అందుచే విష్ణువునకు "ఉచ్చైర్ఘోష"నామము సార్థకమాయెను.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "ఉ+చ్+చ్+ఐ+ర్+ఘ్+ఓ+ష్+అ" అని తొమ్మిదక్షరములుకలవు. అవినవబ్రహ్మలను, నవావరణలను సూచించును. వాయుబీజమైన "ఉకారము"ముందునను వాగ్బీజమైన "ఐకారము" వెనుకను గల చకారద్వయము చండరుద్రబీజము. దానినుపాసించువారు పరాపశ్యంతీ వాక్కులద్వారాప్రాణాయామప్రక్రియలో గుండలినీశక్తిను త్తేజింపజేసి "మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము ఆజ్ఞ," అనెడిషట్చక్రములనుదాటించి, సహస్రారమునగల రుద్రరూపపరమాత్మనుజేర్చి, ధ్యానించి, మహానందము అనుభవింతురు. అంతేకాదు. వాక్స్థానమైన కంఠప్రదేశమునను, వాయుకోశమైన హృదయమునందును ఊపిరితిత్తులందును సంభవించురోగములను, హృదయముపెద్దదగుట, గుండెలోనీరుచేరుట, పుట్టవ్రణమగుట, క్షయ, మున్నగువానిని, ప్రాణాయామప్రక్రియచే స్వయముగా, నిర్మూలించుకొనుటయేకాక, పరులకును ప్రాణాయామప్రక్రియ, ధ్యానము, జపముచేయుటను అలవఱచి, వారిరోగములను సైతముతొలగింపగలరు. ఉపాసకులు జ్ఞానసిద్ధినొంది ఆధ్యాత్మికశక్తిచే స్థూలసూక్ష్మకారణరూపశరీరములను దొలగించుకొని, ముక్తులగుదురు.

ఈశ్వరబీజమైన "ఓకారము"తోఁగూడిన రేఫము, షకారమును వరుసగా వహ్నిభైరవబీజములు. ఆట్టి వర్ణములుగలనామముల నుపాసించువారు అగ్నిప్రమాదములను, భూతప్రేతపిశాచాదిపీడలను, అగ్నిమాంద్యాదిరోగములను దొలగించి, శత్రుంజయులై జంతుకోటికి, సర్వఫలముల నొసంగఁగలరు.

ద్వాదశాత్మకమైన షకారము సర్వదేవతాకమైన అకారముతోఁగూడి యున్నది. అందుచేఁ బైనామము నుపాసించువారు సూర్యోపాసకులై మనోబుద్ధులు, జ్ఞానకర్మేంద్రియములనెడి పండ్రెండింటికిని వాటిల్లిన రోగములను జపశక్తిచేదొలగింపఁగలరు. అంతేకాదు. సూర్యకిరణసంపాదితశక్తితో రోగములను నివారింపఁగలవారలగుదురు.

### *34 వ నామము:- "నమఆక్రందయతే"*

*శివ:-*

భ. భ. భా:- మహాశివుడు బాహ్యాభ్యంతరశత్రువులచే పీడింపఁబడిన వాడు కాన "ఆక్రందయితా" అను నామముతో విలసిల్లెను. బాహ్యాభ్యన్తర యుద్ధములందు శత్రువులనడంచుటకుఁ బిలుచువాడు కావున శివుడు "ఆక్రందయిత" అయెను. మహాదేవుడు జీవిత యుద్ధములందు ధర్మమునాశ్రయించు వారికి ధర్మస్వరూపుడై విజయములను జేకూర్చుటచే "ఆక్రందయితృ నామముకలవాడాయెను.

*విష్ణు:-*

శివుడువలె విష్ణువును సంహారకాలమున శత్రువులకు శోకదాతయే (పీడింపువాడే) కావున విషువునకు రుద్రనామమువాటిల్లెను. రుద్రుడు, ఆక్రందయిత, అను రెండును సమానార్థకములే. కావున విష్ణువునకు ఆక్రందయితృనామముచెల్లును. అందుచేతనే "రుద్రోబహుశిరాబభ్రుః" అను విష్ణుసహస్రసూక్తిలో రుద్రనామము విష్ణుపరముగాగలదు.

అంతేకాదు. జీవితయుద్ధమున ప్రాణవాయురూపకుడై చేష్టకల్గించుచు జీవులను జీవితయుద్ధమునకు ఆహ్వానించును. కావున విష్ణువునకు

"న్యాయోనేతాసమీరణః" అను సహస్రసూక్తిలో సమీరణనామము సంధింపఁబడెను. శత్రువులను దపింపజేయుచు ఏడిపించువాడు కావున "శత్రుజిచ్ఛత్రుతాపనః" అను సహస్రసూక్తిలో "శత్రుతాపన" పదము విష్ణుపరముగా ప్రయోగింపబడెను. పరికింపగా "సమీరణుడు, శత్రుతాపనుడు, అక్రందయిత" అనుమూడు నామములును సమానార్థకములే కావున విష్ణువునకు అక్రందయితృనామము చెల్లును.

యుద్ధములందు "జయకారి" యనునర్థముచెప్పినచో, "వినయోజయః" అను సూక్తిలోగల "జయుడు" అనునామమును, "అక్రందయిత" అను నామమును సమానార్థకములై విష్ణువునకుజెల్లును.

*బీజాక్షరసంపుటి:-*

పైనామమున "అ+క్+ర్+అ+న్+ద్+అ+య్+అ+త్+ఋ" అని పదునొకండు అక్షరములుకలవు. అవి శరీరమందలి ఏకాదశ ద్వారములను, ఏకాదశరుద్రులను సూచించును.

పరాశక్తిబీజమైన అకారమును సర్వదేవతాకమైన అకారమును ముందు వెనుకల గలట్టియు ప్రాజాపత్యమైన కకారముతోఁగూడినరేఫము వహ్ని బీజము ఇందుగలదు. అందుచే బైనామము నుపాసించువారు ప్రాణులవాత రోగములను శక్తిసహితపురుష నుపాసింపఁజేసి దొలగించఁగలరు. అమృత వృష్టికురిపించగలరు.

దుర్గాబీజమైనదకారమును, సావిత్రీబీజమైన నకారమును సర్వదేవతాక మైన అకారముతో గూడియుండుటచే నైనామము నుపాసించువారు సావిత్రీ దుర్గోపాసకులై పాపనాశనులై సర్వత్రవిజయముపొంది సర్వసిద్ధినొందఁగలరు. నీలిమపాండువు అనెడిరోగములను దొలగించుకొని పరులరోగములను సైతము దొలగించఁగలరు. వాస్తుబీజమైన తకారమును, వాయుబీజమైన యకారమును సర్వదేవబీజమైన అకారముతోఁగూడయుండుటచేఁ నైనామము నుపాసించు వారు యంత్రనిర్మాతలు, హృద్రోగనివారకులును భూతప్రేతపిశాచబాధా నివారకులునుగాఁగలరు.

*35 వ నామము;- "పత్తీనాంపతయేనమః"*

*శివ:-*

భ. భ. భా:- పాదచారులైనయోధులకు "పత్తి" అను సంజ్ఞకలదు. అట్టియోధులకు మహాదేవుడు ప్రభువు. అతడు ప్రపంచలయముచేయుసమయ మున ప్రమధగణములను పాదచారులఁగావించి, వారికిఁ బతియైయుండును.

*"ఏకోరథోగజశ్చైకో నరాఃపంచపదాతయః*
*త్రయశ్చతురగాస్తత్ జ్ఞైఃపత్తిరిత్యభిధీయతే"*

అను నార్యోక్తిననుసరించి, ఒకరథము, ఒకయేనుగు, ఐదుగురుపాదచారు లైన యోధులు, మూడుగుఱ్ఱములునుగల దళమునకు "పత్తి" యను పేరు కలదు. అట్టిపత్తులకు బరమశివుడు ప్రభువు కావున ఆతనికి "పత్తీనాంపతిః" యను నామమేర్పడెను.

"శరీరంరథమేవతు" అను శ్రుతిచే బరమాత్మయైన శివుడు రథికుడుగా నుండినట్లు తెలియజెప్పబడెను.

"రమతేఅత్రేతిరథః" అను వ్యుత్పత్తిచేఁ బరమశివుడు రథికుడైనను జీవులలోఁజేరినపుడు జీవాత్మయై రమించుచున్నాడు. అదియే ప్రపంచనాటక నటనమన్నమాట. రథికుడైన శివుడు "పతత్యరీన్ప్రతీతి = పత్తిః" అను వ్యుత్పత్తిచే శత్రువులైనరాక్షసులపైఁ బడుపత్తులైన ప్రమథులకుఁ బతియై వారికిఁగల మనోబుద్ధ్యహంకారములనెడి మూడు గుఱ్ఱములను బఱువులెత్తించుచున్నాడు

"నయన్తిసర్వంస్వవశమితినరాః" అను వ్యుత్పత్తిచే సకల ప్రపంచమును వశపరచుకొనెడినరులైన పంచజ్ఞానేంద్రియములనే ప్రమథులకు బంచ పదాతులగావించివారిచేఁ బ్రమథులకు జయముచేకూర్చుచున్నాడు.

"గజతి = మాద్యతీతిగజః" అనువ్యుత్పత్తిననుసరించి, జయమందిన ప్రమథగణమునే గజముగాగావించి ప్రమత్తమొనర్చుచున్నాడు. ఇవ్విధమున బదాతులైన ప్రమథులలో స్వశక్తినిజేర్చి పత్తుకిఁబ్రభువై ఇంద్రరూపుడైముల్లోకములను జయించి, తనవశమొనర్చుకొనినాడు. అందుచే శివునకు "పత్తీనాం పతిః" అను నామము సార్థకమాయెను.

విష్ణుః-

శివునివలె విష్ణువును "పత్తులకుఁబదాతులకుఁ బ్రభువై త్రిలోకములను జయించెను. పత్తిప్రభువైన విష్ణువుయొక్క విభూతికుమారస్వామిలోఁగలదు. కావున కుమారస్వామిసేనానియై ముల్లోకములను జయించికాపాడెను.

"సేనానీనామహంస్కందః" అను గీతాసూక్తిలో సేనానులలో నేను స్కందుడను (కుమారస్వామిని) అని భగవానుడుచెప్పెను. పైయర్థమున "జయుడు" అను నామము విష్ణుసహస్రసూక్తిలో "వినయోజయః" అను దానిలో గలదు.

పతిప్రభువై విష్ణువు త్రిలోకవిజేతయై త్రిలోకేశుడాయెను. కావున విష్ణుపరముగా విష్ణుసహస్రమున

"త్రిలోకాత్మా త్రిలోకేశః" అను దానిలో త్రిలోకేశపదముగలదు. "పద్ల" = గతౌ" అనుధాతువునుండి యేర్పడిన పత్తిపదమునకు జీవత్వ మందిన జీవుడనియర్థము. అట్టిపత్తులకు జీవులకు విష్ణువేపతి. కావుననే అతనికి నారమునకు = జీవసమూహమునకు, అయనుడు = స్థానము అగుటచే నారాయణనామమువాడాయెను. పరికింపగా నైయర్థమున = పత్తిపతి, నారాయణుడు అను నామములు సమానార్థకములని తెలియుచున్నది అందుచే "పత్తీనాం పతిః" అను నామము విష్ణువునకు జెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "ప్+అ+త్+త్+ఇ+ప్+అ+త్+ఇ" అని తొమ్మిదక్షరములుకలవు. ఇవి నవావరణములకు చిహ్నములు. ఇందు సర్వదేవతాకమైన అకారముతోగూడిన పకారము పర్జన్యబీజము రెండుసార్లు ప్రయోగింపబడెను. విష్ణుబీజమైన ఇకారముతోఁగూడిన "త"కారమువాస్తుబీజము, మూడుసార్లుప్రయోగింపబడెను. కావునఁ నైనామము నుపాసించువారు వాస్తుశాస్త్రజ్ఞులై (ఇంజనీర్సు)జలమును నిల్వజేయగలప్రోజక్టులను నాగార్జునసాగరము వంటివానిని నిర్మించఁగలవారై జలదాతలై అహారసమృద్ధినిజేకూర్చఁగలవారలగుదురు. శరీరమున నీరుచేరుటవంటిరోగములకు నివారకులై వృద్ధిసిద్ధులను జేకూర్చగలవారలగుదురని తెలియుచున్నది.

*—: త్రయోదశయజుస్సు :—*

*"నమఃకృత్స్నవీతాయధావతే సత్వానాంపతయేనమః"*

*అర్థము :-*

కృత్స్నవీతాయ = చుట్టును ఆవరింపబడిన సకల సైన్యముగల రుద్రునకు, నమః = నమస్కారము; ధావతే = పరుగులిడుచున్న శత్రుసైన్యముల

వెనుకనేగు రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక; సత్వనాం = సాత్త్వి కులై శరణాగతులైన వారికి, పతయే = పాలకుడైన రుద్రునకు, నమోఽస్తు = నమస్కారమగుగాక.

*తాత్పర్యము:-*

సా. భా:- పరమశివుడు సకల శత్రుసైన్యములను చుట్టుముట్టడించి, యుండును. పఱుగులిడుచున్న శత్రుసైన్యముల వెనుక పఱుగులిడుచుండును. ప్రణతులగువరగును వారినాతడు విడువడు స్వపరపక్షములయందుఁగాని శత్రుమిత్రపక్షములందుఁగాని ఎవరుతనను శరణువేడినను వారిని తప్పక కాపాడును. అట్టిశివునకు నమస్కారము.

*36 వ నామము:- "నమఃకృత్స్నవీతాయ"*

*శివ:-*

వ. భా. భా:- త్రిపురాసురాదిరాక్షసులు దేవకోటిలోఁజేరిన శివునకును శత్రువులే. వారిసైన్యములను బరమశివుడు సంపూర్ణముగా జుట్టునుముట్టడించి యడంచును. జితేంద్రియుడైనతాను దనను వేడుభక్తులను ఆవరించి, వారిలో నున్నకామక్రోధాదిశత్రువులను సైతమువాయ్వగ్నిస్వరూపుడై వారిలోనుండి అడంచును అందుచే ఆతనికి "కృత్స్నవీతనామము సార్థకమాయెను.

మహాదేవుడు సహజముగా దిగంబరుడేయైనను భక్తులకు దర్శనమిచ్చు నపుడును, దేవసభకేగినపుడును, హవిర్భాగమునకేగునపుడును, దన శరీర మును సంపూర్ణముగా భస్మముతోడను, వ్యాఘ్రగజాసుర చర్మములతోడను ఆచ్ఛాదించుకొనియుండును. అందుచేఁ గృత్స్నవీతుడాయెననియుఁ జెప్ప వచ్చును.

"వీ = గతివ్యాప్తిప్రజననకాంత్యసనఖాదనేషు" అను నర్థములుగల "వీ"ధాతువునుండియేర్పడిన "వీత" శబ్దమునకును, "ఆచ్ఛాదించుట, పొందుట, వ్యాపించుట, జనింపజేయుట, ప్రకాశించుట, ఉండుట, భక్షించుట అనియేడర్థములుకలవు. అందుచే ప్రళయకాలమున సమస్త జగత్తును లయకారకుడగుటచే భక్షించును.

"తస్మై ఉపసంహర్త్రే మహాగ్రాసాయవైనమోనమః" అను అథర్వశిరో మంత్రమునందు మహాశివుడు జగదుపసంహారసమయమున సకల జగత్తును మహాగ్రాసముగా (మహాహారముగా) జేసికొనుననికలదు. ఈ మంత్రము పై యర్థమునకు ప్రమాణమైయున్నది.

సంపూర్ణజగత్తును మహాశివుడే బ్రహ్మస్వరూపుడైసృష్టించి, విష్ణుస్వరూపుడై అవరించి, సూర్యస్వరూపుడై ప్రకాశింపజేసి, అన్తకాలమునఁ దానేభక్షించుచున్నాడు. కాన కృత్స్నవీతనామము శివునకు సార్థకమాయెను. "నసన్నచాసచ్ఛివఃకేవలమ్" అనునార్యోక్తిచే మహాదేవుడు సత్తునుగాక, అసత్తునుగాక, సకల జగంబులును నశించునపుడు తానే స్వయముగా గృత్స్నాత్ముడై మిగిలియుండును. కావున అతనికి "కృత్స్నవీతనామము సార్థకమాయెను.

విష్ణుః-

విష్ణువు మత్స్యాద్యవతారములుదాల్చి, సోమకాదిరాక్షసులసైన్యములఁ జుట్టుముట్టడించి, వారిని సమూలముగా సంహరించెను అంబరీషాదిభక్తుల హృదయాలలోనుండి, వారిలోనిరాగద్వేషాదులనడించి, వారినిగాపాడెను. ఈయర్థముననే "విశ్రుతాత్మాసురారిహా" అను విష్ణుసహస్రసూక్తిలో "సురారిహా" అను నామము ప్రయోగింపబడెను.

"శత్రుజిత్ శత్రుతాపనః" అనుసూక్తిలోని "శత్రుతాపన" పదము సైతము బాహ్యాభ్యంతర శత్రుసంహారముచేయుటచేతనే విష్ణుపరముగాం జేర్కొనఁబడెను.

విష్ణువు శివుడువలె దిగంబరుడుకాడు; ఎల్లపుడును అతని శరీరము కనకాంబరముతో అచ్ఛాదింపఁబడియేయుండును. కౌస్తుభశోభతో అచ్ఛాదింప బడియేయుండును. ఈ విషయమే

"మేఘశ్యామం పీతకౌశేయవాసం।
శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగమ్"

అను శ్లోకమున బ్రకటింపబడెను. కావున విష్ణువునకు "గృత్స్నపీతు" డను నామము సార్ధకమాయెను.

"పీత"శబ్దమునకు "పొందుట, వ్యాపించుట, ప్రకాశించుట" అను నర్థములుగలవు. "ఆకాశవత్ సర్వగతశ్చనిత్యః" అను శ్రుతిలో బరమాత్మ ఆకాశమువలె అంతటను వ్యాపించి, యుండుననికలదు. అందుచేతనే విష్ణువు అను నామమేర్పడెను. పరమాత్మరూపాంతరుడైన విష్ణువునకుజెందినట్లు "స్వాపనస్స్వవశోవ్యాపీ" అను సహస్రసూక్తిలో "వ్యాపీ" అను నామము కలదు. "తేజస్తేజస్వినామహమ్" అనుగీతాసూక్తిలో భగవంతుని విభూతి, తేజోవంతులలో తేజస్సుగానుండుననికలదు.

"స్వయంజ్యోతిః" "జ్యోతిషాంజ్యోతిః" అనుశ్రుతులలో భగవంతుడైన విష్ణువు సూర్యాగ్నిస్వరూపుడై స్వయంప్రకాశమానుడై బాహ్యాభ్యంతర ప్రకాశకుడైయున్నట్లు చెప్పబడెను. కావుననే

"మహాశక్తిర్ మహాద్యుతిః" "భ్రాజిష్ణుర్ భోజనమ్"

"ప్రకాశాత్మాప్రతాపనః"

అను సహస్రసూక్తులలో "కృత్స్నవీతుడు = సంపూర్ణమైనతేజస్సుకలవాడు" అను నర్థమునుదెలియజేయు "మహాద్యుతి, భ్రాజిష్ణువు, ప్రకాశాత్మా" అను నామములు విష్ణుపరముగా బ్రయోగింపబడెను కావున విష్ణువునకు "కృత్స్న వీతుడు" అను నామము సార్థకమాయెను.

వీతశబ్దమునకు భక్షించువాడనియర్థముకలదు విష్ణువు మహాప్రళయమున సర్వమును భక్షించును, నశింపజేయును; అనగ దనిలోనికిఁ దీసి కొనును. అందుచే

ఆ యర్థములందు "భోజనంభోక్తా" "మహోదధిశయోఽన్తకః" అను సహస్రసూక్తులలో విష్ణుపరముగా "భోక్తా, అన్తకుడు" అను నామములుగలవు కావున విష్ణువు కృత్స్నవీతనామకుడాయెను. అందుచే "కృత్స్నవీత" నామము శివకేశవులిరువురకును సమానముగాఁజెల్లును.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "క్+ఋ+త్+స్+న్+అ+వ్+ఈ+త్+అ" అని పదక్షరములుకలవు. ఇవి దశదిక్కులకును, దశేంద్రియములకును చిహ్నములు.

కకారఋకారములు వరుసగా బ్రజాపతి బ్రహ్మదైవత్యములు వీనితోఁ గూడిన పైనామము నుపాసించువారికి బ్రహ్మసాక్షాత్కారముజరుగును. జీవపరమాత్మలతారతమ్యము దృగ్గోచరమగును. వారుగ్రహబాధలు తొలగించి, సకాలవర్షములు కురిపించఁగలవారలగుదురు.

వాస్తుబీజమైన తకారమును, శక్తిబీజమైన సకారమును, సావిత్రీబీజమైన నకారమును సర్వదేవతాకమైన అకారముతోగూడియున్నవి. కావునఁ బైనామము నుపాసించువారు శాక్తేయులై బాహ్యప్రజ్ఞప్రదర్శించుటకు, వీలగు కృత్యములనొనర్చి యంత్రనిర్మాతలుకాఁగలరు వారుణబీజమైన వకారము, పరాశక్తిబీజమైన ఈకారముతోగూడియుండుటచే బైనామము నుపాసించువారు సముద్రజలపరిశోధకులును, జలోదరాదిరోగనివారకులునుగాగలరు. వాస్తుబీజమైన తకారము అకారముతో గూడియుండుటచే బైనామము నుపాసించువారు సర్వజయప్రదులు కాగలరు.

**37 వ నామము:- శివ:- "నమోధావతే"**

భ. భా. భా:- పరమశివుడు, సూర్యచంద్రాగ్నీంద్ర వర్ణన్యాదిరూప ముల అంతటను ఆవరించియుండి, తనకు తనరూపములకును వ్యతిరేకముగా నున్న సైన్యములనెదిరించి, అడచి, లోకములగాపాడుటకై ఆసైన్యముల వెంటవేగముగాపోగుచుండెను. అట్టి రుద్రునకు నమస్కారము. ఇటచేతనాచేతన ముల రెంటిని సైన్యముగా జెప్పవచ్చు. లోకమునవేగముగాఁ బోవువానిలో మొదటిదిగాలి. రెండవదిమనస్సు ఆరెండును శివస్వరూపములే. అరెండింటి రూపమున శివుడువడిగాఁ బోవుచుండును. అంతేకాదు. శివుడు ఉబ్బులింగడు. "మహాదేవ! శంభో!" అనిస్మరించినమాత్రాన తనభక్తులకు శీఘ్రముగాఁ బ్రసన్నుడై, వరములొసగికాపాడును. భక్తులపాతకములను శోధించి, తొల గించును. మహాపాతకములొనర్చుటచే సంభవించురోగములను "కుష్ఠు, తెల్ల మచ్చలు, జలోదరము" మున్నగువానిని దొలగింప సూర్యాదిరూపములతోఁ బ్రసన్నుడై అతివేగముగానేగి భక్తులనుగాపాడును. మయూరుడను మహాకవి సూర్యశతకమువ్రాసి సూర్యరూపరుద్రుని దయనొంది, రోగవిముక్తుడాయెను. ప్రళయాంతమున బూర్ణరూపమున మిగిలియుండువాడును మహాశివుడే అందుచే బరమశివునకు "ధావన్" అను నామము, సార్థకమాయెను. కావున అతనికి భక్తులు నమస్కారములు సమర్పించుచున్నారు.

**విష్ణు:-**

"ధావ్ృ = గతిశుద్ధ్యోః" అను ధాతువునుండియేర్పడిన "ధావతే" అను పదమునకు శీఘ్రముగాఁబోవువాడనియర్థము. శీఘ్రముగాఁబోవుటయనగా వడిగా అంతటను వ్యాపించుటయనియర్థము. విష్ణు = అంతటను వ్యాపించు వాడని యర్థము ఈ యర్థమున "ధావతే, విష్ణవే" అను పదములురెండును సమానములే. కావున "ధావన్" అను నామము శివునకువలె విష్ణువునకును జెల్లును భక్తరక్షణకార్యమున విష్ణువునకున్నంతటి గమనవేగము వేరొకినిలేదు. గజేంద్రుని రక్షణమే ఇందులకు దార్కాణము.

"అలవైకుంఠపురంబులో నగరిలో"

"సిరికింజెప్పడు శంఖచక్రయుగమున్ జేదోయిసంధింపడు"

అను పోతన్నగారిపద్యములను ఒరించితిమేని విష్ణువుయొక్క శీఘ్రగమనము అందఱికిని దెలియును

"మనసోజవీయః" అను శ్రుతిలో చెప్పినట్లు విష్ణువు మనోజవుడు కావుననే "ధావతే" అను నామార్థమునుదెల్పు "వేగవాన్" అను నామము విష్ణుపరముగా "వేగవానమితాశనః" అను విష్ణుసహస్రనూక్తిలోఁ జేర్కొనఁ బడెను.

"ధావతే = శీఘ్రం ప్రసీదతే" శీఘ్రముగాఁ బ్రసన్నుడగుచున్నాడని యర్థముచెప్పినను విష్ణువునకుఁజెల్లును. ఎట్లన? శిశుపాలుడుమున్నగు అపకారులకును మోక్షప్రదుడై విష్ణుసోఘైన అనుగ్రహముకలవాడై యుండెను కావుననే

"సుప్రసాదః ప్రసన్నాత్మా" అను రెండునామములను విష్ణుపరముగా సహస్రనామములలో జేర్కొనబడెను. "ధావతే = భక్తపాతకాన్ శోధయతే" భక్తులపాపములఁశోధించి, తొలగించి, పాపనాశనుడై కాపాడువాడని యర్థము చెప్పినను నైనామము విష్ణువునకుఁజెల్లును. కావుననే విష్ణుసహస్రమున "మాధవోభక్తవత్సలః" "క్షితీశఃపాపనాశనః" భక్తవత్సలుడు, పాపనాశనుడు అను నామములు విష్ణుపరముగా జేర్కొనబడెను. "భక్తవత్సలః" పాపనాశనః, ధావన్ అను నామములు సమానార్థకములే. కావుననే "ధావతే" అను నామముగల విష్ణువునకు భక్తులు నమస్కారములు సమర్పించుచున్నారు.

బీజాక్షరసంపుటి:-

ఇందు "ధ్ + అ + వ్ + అ + న్" అని ఐదక్షరములు కలవు. అవి పంచప్రకృతులను, పంచేంద్రియములను సూచించును. ధనదబీజమైన ధకారము పరాశక్తిబీజమైన అకారముతోఁ గూడియున్న కారణమునఁ బైమంత్రము నుపాసించువాడు శాక్తేయుడై జ్ఞానధనము నార్జించుకొని, సర్వాకర్షకుడై ఐహికకాములకు, ధనమును జేకూర్చును.

వారుణబీజమైన వకారమును, సావిత్రీబీజమైన నకారమును, సర్వదేవతాకమైన అకారముతోఁ గూడియుండుటచేఁ బైనామము నుపాసించువారు, పాపపరిహారకులై పాపసంభవరోగములను బోగొట్టుకొందురు. పరుల పాపములను రోగములను సైతము పోగొట్టఁగలరు. అంతేకాదు. పైనామము నుపాసించువారు పాపభేదములను, తన్మూలకములైన రోగభేదములను గ్రహించి రోగనివారకౌషధములను నూతనముగా గ్రహింపగలరు.

38 వ నామము:- "సత్త్వానాంపతయే నమః"

శివ:-

భా. భ. భా:- సత్త్వములనగా శరణాగతులు. వారిని గాపాడి వారికి బరమశివుడు పతియాయెను. శరణాగతరక్షకులైన శిబిచక్రవర్తి మున్నగువారిలో శివాంశయుండును. సత్త్వమనగా ప్రకృతి. అదియే ఆదిశక్తి. ఆదిశివవినిర్గత యగుటచే ఆమెకు ప్రభువై శివుడు సత్త్వపతియైనాడు. అంతేకాదు. సత్త్వములనగా ప్రాణులు. వానికన్నిటికిని ప్రభువు పరమశివుడే. కావుననే అతనికిఁ బశుపతి యనునామము వాటిల్లెను, సత్త్వమనగా బలము. ఆదిశివతేజోంశమగుటచే బల నామము శివునకుఁ జెల్లెను. బలము ఆధేయము. బలవంతుడాధారము. ఆధారా

ధేయములకు అభేదము కావున బలుడనునామము శివునకు ఏర్పడెను. "బలాయనమః, బలప్రమథనాయనమః" అను శ్రుతిలోని "బల"పదము శివపరము. బలమునకును ప్రభువు పరమేశ్వరుడే. అందుచే "బలుడు, సత్వానాంపతి" అను రెండును సమానార్థకములై శివునకుఁజెల్లును.

**విష్ణు:-**

పరమాత్మశ్రీరాముడై తనను శరణువేడిన విభీషణుని గాపాడెను. ఇట్లెందరినో శరణార్థులను విష్ణువుకాపాడెను. అందుచే విష్ణువునకు "సత్వానాంపతి" అను నామముకలైను

సత్వమయెనప్రకృతి శివుని చెంతపార్వతియైయున్నట్లు, విష్ణువుచెంతను లక్ష్మియైయుండెను. అందుచే సత్వపతినామము విష్ణువునకునుగల్గెను.

"గభస్తినేమిస్సత్వస్థః" అను విష్ణుసహస్రసూక్తిలో విష్ణువు సత్వగుణముతో సర్వప్రాణులనధిష్ఠించియున్నట్లు, చెప్పెను. సత్వస్థపదము, సత్వపతి పదమును సమానార్థకములే. "సత్వవాన్‌సాత్వికః" అను సూక్తిలో సత్వము శౌర్యవీర్యాది గుణములుకల్గియుండుటచే "సత్వవాన్" అను పదము విష్ణుపరముగా ప్రయోగింపబడెను. "సత్వవాన్, సత్వపతిః" అను పదములు సమానార్థకములు.

"బలంబలవతామస్మి" అను గీతాసూక్తిచే బలవంతులలోనిబలము విష్ణుస్వరూపమైనట్లు చెప్పబడెను. పైవిషయములను బరిశీలించినచో "సత్వానాంపతిః" అను నామము విష్ణువునకు సార్థకమేయని తెలియుచున్నది.

***బీజాక్షరసంపుటి:-***

"సత్వన్+పతిః" అను నామమున "స్+అ+త్+వ్+అ+న్+ప్+అ+త్+ఇ" అని పదక్షరములుకలవు. అవి దశదిశలకు ఉపలక్షకములు. దశేంద్రియ సూచకములు. ఇందు సర్వదేవతాకములైన అకారములు

మూడును, విష్ణుదేవతాకమైన ఇకారమునుగలవు. అపిశక్తిబీజమైన సకారముతో డను, వాస్తుబీజములైన తకారముతోడను, వరుణబీజమైన వకారముకోడను, పర్జన్యబీజమైన పకారముతోడనుగూడియున్నవి.

శక్తిసహితులైన త్రిమూర్తులును, వాస్తువరుణపర్జన్యరూపధారులై, పైనామము నుపాసించువారికి చక్కనిజ్ఞానమునొసగుచు, వారికి జలము కుఱి పించుయంత్రములను, జలప్రయాణసాధనయంత్రములను నిర్మించుశక్తిని ఒసంగుదురు. దీనినుపాసించువారు వైద్యశక్తిసంపన్నులై చర్మములపై విచిత్ర వర్ణములతో నేర్పడురోగముల నివారించి, సర్వత్రవిజయము పొందఁగలరు.

ఈ యనువాకమునఁగల మంత్రములను జపించి, అతికష్టముగాఁ గాలముగడిపి, చరుభోజియై ఎనిమిదివేలు జపముచేయవలెను. జపించునంత కాలమున శివాలయమునఁ బ్రతిసంధ్యాసమయమునను బదునొకండుసార్లుప్రదక్షిణముచేయవలెను. జపసమాప్తియైనపిమ్మట దేవునారాధించి, దైవసన్నిధిని బదునొకండుగురు విప్రులకు భోజనముపెట్టినపిమ్మట (పునశ్చరణము(జప వ్రతము) పూర్తియగును. ఇట్లుజపించినవారికోరికలెల్లనెఱవేరును.

యుద్ధముసమీపించగా మహాదేవునిపై మాంజిష్ఠవస్త్రమును(ఎఱ్ఱనిబట్టను) ఉంచి, స్వయముగా శుద్ధుడై కుడిచేతిబొటనవ్రేలుదైవముపైనిడి ఈ యను వాకమందలి మంత్రములు పఠించుచు, ఎనిమిదివేలు జపమును ఐదుదినములు చేయవలెను. అదిపూర్తిఅగుసరికి శత్రురాజు తనచోటునుండివెడలిపోవును. పలాశము, అశ్వత్థము, వైకంకతము అపామార్గము అను సమిధులను తేనె తోడను, నేతితోడనుదడిపి, పదివేలుహోమముచేసినచో ఆ శత్రురాజు వశ మగును. క్రమముగా జనులెల్లరును వశమగుదురు. వానిని వశమొనర్తురు.

రాజ్యకాంక్షియైనరాజు, తెల్లకలువ, సౌగంధికము, నల్లకలువ, అను వానినితేనెలోముంచి, పదివేలుహోమముచేయవలెను. తోడనే అతడు రాజ్యలక్ష్మినిపొందును. శ్రీకాముడుపదివేలుతామరపూవులను హోమముచేసినచో శ్రీమంతుడగును.

మేధాశక్తికోరువాడు మోదుగుపూవులను కపిలగోవునేతితోదడిపి, పదివేలుహోమముచేసినచో మేధావంతుడగును, శత్రుజయముకోరువారు పదునొకండువేలు జపముచేసిరేని శత్రువిజేతలుకాగలరు. ప్రతిదినము 108 సార్లు కాని 28 సార్లుకాని యావజ్జీవము ప్రదక్షిణముచేయువాడు ఇహ లోకమున సుఖియైయుండి అంతకాలమున కైలాసముపొందును.

పైపదమూడుమంత్రములను జపింపలేనివాడును, జపార్హతలేనివాడును ఈ క్రిందిధ్యానశ్లోకమును జపించినచో పైమంత్రములవలనలభించుఫలమును పొందగలడు.

ధ్యానశ్లోకము:-

*"ముక్తాలంకృతసర్వాంగమిందుగంగాధరంహరం।*
*ధ్యాయేత్కల్పతరోర్మూలే పవమానీసంసహోమయా॥"*

తాత్పర్యము:-

భగవంతుడైన పరమేశ్వరుడు పార్వతీదేవితోగూడి కల్పవృక్షముదగ్గ కూర్చుండెను. అతడు శిరస్సున చంద్రుని గంగనుధరించియుండెను. అతడు అంగములనెల్లమంచిముత్యములతో అలంకరించుకొనియుండెను. అతడు జీవుల పాపములను హరించును. అందుచే మహాదేవుని నిత్యముధ్యానించవలెను.

ఈశ్లోకమున 13 మంత్రములను సూచించుచు 13 పదములుగలవు వచన రూపమంత్రములనే యజుస్సులందురు. పైయజుస్సులను సూచించు బీజాక్షరములుకూడ ఈశ్లోకమునగలవు. జీవులపాపములను హరించుటలో శివకేశవులు ఇరువురును సమానులే. హరి, హరపదములు రెండును సమానార్థకములే కావున "హర" పదము శివకేశవులకు ఇరువురకును జెల్లును. పైశ్లోకము పైమంత్రములకు బదులుగా జపింపదగియున్నదని తెలియుచున్నది.

శ్రీ భట్టభాస్కరవిరచిత యజుర్వేదభాష్యమున రుద్రప్రశ్నమున ద్వితీయానువాకము సమాప్తము.



## -: తృతీయానువాకము :-

### —: ప్రథమయజుస్సు :—

ద్వితీయానువాకమున నామాద్యన్తములందు నమోవాచకముకల యజుస్సులుకొన్నిచెప్పబడినవి. అటులనే ఉభయతో నమస్కారములైన 12 యజుస్సులు తృతీయానువాకమున జెప్పబడుచున్నవి.

### -: ప్రథమ యజుస్సు :-

*"నమస్సహమానాయనివ్యాధిన ఆవ్యాధినీనాంపతయేనమః"*

***అర్థము:-***

సహమానాయ = విరోధులను అభిభవించు (పరాభవించు) రుద్రునకు, నమః = నమస్కారము. నివ్యాధినే = మిక్కిలి విరోధులను బాధించు రుద్రునకు నమః = నమస్కారము. ఆవ్యాధినీనాం = అంతటను సంపూర్ణముగా బాధించు శూరసేనలకు, పతయే = పాలకుడైన రుద్రునకు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక.

***తాత్పర్యము:-***

సా. భాష్యము:- విరోధులు బాహ్యులు, అభ్యన్తరులు, సమీపవర్తులు, దూరదేశవర్తులు, అని పలురకములుగాఁగలరు. వారిలో బాహ్యశత్రువులగు రాక్షసులుమున్నగువారిని రావణాదులను, మహాదేవుడు గర్వభంగమొనర్చి పరాభవించును. ప్రతిజీవులను శరీరాంతర్గతులై పీడించుకామక్రోధాదులను అడంచి, తనభక్తులను శివుడుకాపాడును. భక్తిహీనులై దేశమంతటను వ్యాపించి, వేదమతవిరుద్ధముగ సంచరించువారిని శిక్షించి, లోకములను ఆ

పరమశివుడు పాలించును. కావున ఆతనికి నమస్కారములను భక్తులు సమర్పించుచున్నారు.

### 39 వ నామము:- "నమస్సహమానాయ"

**శివ:-**

భ. భా. భా:- ఈనామముతో ఆరంభమగు ఈ యనువాకమునకు మహాదేవుడు ఋషి. బృహతీఛందస్సున ఇదికలదు. దీనికి దేవతయును మహాదేవుడే. ఇంతకుముందున్న అనువాకమున ద్రవ్యవిషయికమైన ఆధిపత్యము శివునకుగలదని చెప్పబడెను. ఈయనువాకమున క్రియావిషయికమగు అధిపత్యముకూడ శివునకుగలదని చెప్పబడుచున్నది మహాదేవుడు తనకంటె భిన్నమగు సమస్తమును దన అదుపులో నుంచుకొని ఎదురుతిరుగువారని పరిభవించును. కొందఱుభక్తులు అపరాధములుచేసినచో వారిని సన్మార్గమునకు మరల్చి, క్షమించును. అనగా శిక్షణశక్తితోఁబాటు రక్షణశక్తియును బరమేశ్వరునకు గలదన్నమాట. కావున శివునకు "సహమానుడు" అను నామముచెల్లును.

**విష్ణు:-**

"సహిష్ణుర్గదాదిజః" అను విష్ణుసహస్ర సూక్తిలో విష్ణువునకు "సహిష్ణు" డనునామముకలదు. హిరణ్యాక్షుడను రక్కసుడు తన ప్రభావముచే భూమిని చాపగాజుట్టి పీడించుచుండగా విష్ణువు వరాహావతారుడై చాపచుట్టగానున్నభూమినివిప్పి, ముట్టెతోవానిని సంహరించెను. అట్లే పెక్కురు దానవులను, వారుచేయుపనులు. జరుగనీయక వారిని పరాభవించెను. "హేతుర్దామోదరస్సహః" అను సహస్రసూక్తిచే, సర్వులను దిరస్కరించుచు లొంగిన వారిని క్షమించెడివాడు. కావున విష్ణువునకు "సహః" అనునామమేర్పడెను. పరికింపగా "సహః, సహమానః" అనుమూడును సమానార్థకములే. కావున,విష్ణువునకును "సహమానుడు" అనునామముచెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "స్+అ+హ్+అ+మ్+అ+న్+అ" అని యెనిమిదక్షరములుకలవు. అవి శివుని అష్టమూర్తులను అష్టాంగములను సూచించును. ఇందు శక్తిబీజమైన సకారము, సర్వదేవతాకమైన అకారముతో గూడియున్నది. రెండును రక్తవర్ణములే. కావున బైనామము నుపాసించువారు, రక్తలోపము, రక్తప్రకోపము, రక్తపుబోటు, ఎఱ్ఱపుప్పులు మున్నగునవి శరీరమున ఏర్పడినపుడు వానిని దొలగించి, రక్షించి, జీవులకు స్థితికల్పింపగలవారలగుదురు. రక్తవర్ణములైన గ్రహములగోళములను, బరిశీలింపగలవారలగుదురు. సార సత్వబీజమైన సకారము త్రిమూర్త్యాత్మకమైన అకారముతోగూడియుండుటచే బైనామము నుపాసించువారు సకల విద్యాపారంగతులుకాగలరు. శివబీజమైన హకారము మదనబీజమైన మకారమును వరుసగా అకారాకారములతోగూడియుండుటచే బైనామము నుపాసించువారు, నిష్కాములై శాక్తేయులై ఇంద్రియ విజేతలుకాఁగలరు. ఐశ్వర్యవంతులై సర్వసుఖములననుభవింపఁగలరు. శివ స్వరూపుడైన సూర్యునిలోఁగల విచిత్రవర్ణకిరణముల శక్తులను సంగ్రహింపఁగలవారలగుదురు. మృత్యుంజయులగుదురు.

## *40 వ నామము:- "నమోనివ్యాధినే"*

*శివ:-*

భ. భా. భా:- 'మిక్కుటముగా తనను ద్వేషించు శత్రువులను సంహరించుటచేతను, వీరభద్రుడై దక్షుని శిక్షించుటచేతను, కన్నకూతునుగామించు బ్రహ్మను, మహాత్ముడనని విఱ్ఱవీగుయముని మిక్కిలిగా శిక్షించుటచేతను, శివునకు "నివ్యాధీ" అను నామమేర్పడెను.

*విష్ణు:-*

శివకేశవులు సమానతేజస్సంపన్నులు. శివుడువలె విష్ణువుకూడ దుర్జనులను శిశుపాలాదులను హింసించెనుగాన జనార్ధనుడను నామము సార్థకమై

నట్లు "విష్వక్సేనోజనార్దనః" అను సహస్రసూక్తిచే తెలియుచున్నది. "దండో దమయితాదమః" అను సహస్రసూక్తిలోఁ గలదండుడను నామము, దుష్టులైన కంసాదులను తాడించి, సంహరించినవాడగుటచే విష్ణుపరము సార్థకమాయెను "దండోదమయితాస్మి" అను గీతవాచనము పై విషయమునే బలపఱచు చున్నది. పరికింపగా "నివ్యాధీ,జనార్దనఃదండః" అనునవి సమానార్థకములై విష్ణువునకు "నివ్యాధీ" అను నామముచెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "న్+ఇ+వ్+య్+అ+ధ్+ఇ+న్" అని ఎనిమిదక్షరములుకలవు. అవి అష్టచక్రములకుఅష్టప్రకృతులకును చిహ్నములు. ఆద్యంతములందుగల నకారము సావిత్రీబీజము వకారము వరుణబీజము యకారము వాయుబీజము. ధకారము ధర్మబీజము. అవిశక్తిబీజమైన అకారముతోడను, విష్ణుబీజమైన ఇకారముతోడనుగూడియున్నవి. అందుచే బైనామము నుపాసించువారు ప్రాణాయామశక్తిసంపన్నులై శక్త్యుపాసకులై తమకుగలశక్తి సామర్థ్యములచే నుడిగుండములేర్పడు పద్ధతిని,వానిని నిర్మూలించువిధమును, జలపరిశోధననుగావించి, నూతనయంత్రనిర్మాతలై జలోదరాదివ్యాధి నివారకులై లోకోపకారకులుకాఁగలరు

*41 వ నామము:- "అవ్యాధినీనాంపతయేనమః"*

*శివ:-*

భ. భా. భాః- పదునాల్గుభువనంబులందును, ఎచటనున్న శత్రువులనైనను, శూరులైనసేనలు, యోధులునగు ప్రమథగణములు శివశాసనమున శిక్షించితీరును. అట్టి శూరసేనలకును మహాదేవుడే పాలకుడైయుండెను దక్షాధ్వరధ్వంసనసమయమున మహాదేవుని అంశావతారుడైన వీరభద్రుడు తన ప్రమథగణములచే ఎదురుగానున్ననులేకున్నను శత్రువులను తాడింప

జేసెను. ఆ శూరసేనలే ప్రమథగణములు. వారికి పాలకుడగుటచే శివునకు అవ్యాధినీ పతి అను నామము సార్థకమాయెను.

*విష్ణు:-*

"అగ్రణీర్గ్రామణీః" "న్యాయోనేతానమీరణః" "శౌరిస్సూరజనేశ్వరః" అను విష్ణుసహస్రనామోక్తులలో "గ్రామణీః, నేతా, శూరజనేశ్వరః" అనునామములు విష్ణుపరముగాఁ బ్రయోగింపబడినవి వానిని పరిశీలించినచో విష్ణువునకును, రాక్షసులను సంహరించుసేనలు గలవానియు, వారేగరుడాదులును, శ్రీరామావతారమందలి వానరులనియును, వారికి ప్రభువు విష్ణువనియును దెలియుచున్నది. సుగ్రీవాదివానరులు శూరులైన జనులు, వారికిఁ బ్రభువగు శ్రీరామచంద్రుడు విష్ణువేకదా! విష్ణుసేనలోని వానరులు అవ్యాధినులు అనగా రక్కసులను బాగుగాబాధించినవారు. కావున వారికి ప్రభువును శ్రీరామచంద్ర రూపుడునగు విష్ణువునకు అవ్యాధిని పతినామము సార్థకమే. పరికింపగా "అవ్యాధినీపతి, గ్రామణీ, శూరజనేశ్వరుడు, నేత" అను పదములు సమానార్థకములే కావున విష్ణువు అవ్యాధినీపతి నామకుడాయెను.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "అ+వ్+య్+అ+ద్+ఇ+న్+ఈ+ప్+అ+త్+ఇ" అని పండ్రెండు అక్షరములుకలవు. అవి మనోబుద్ధులతోడి ఇంద్రియములకును ద్వాదశమాసములకును వానికధిపతులైన ద్వాదశాదిత్యులకును జిహ్వాములు. ఇందుపరాశక్తి బీజమైన ఆకారద్వయము, త్రిమూర్త్యాత్మకమైన అకారమును గలవు అటులనే విష్ణుబీజములైన ఇకారములురెండును, మాయాశక్తిబీజమైన ఈకారమునుగలవు. అకారత్రిపుటి శివాశివులకలయికను, ఇకారత్రిపుటి లక్ష్మీనారాయణులకలయికను దెలియజేయును. అందుచే నైనామము శివకేశవాభేదమును శక్తిత్రయాభేదమును దెల్పుచు ఉపాసకులైన భక్తులకుఁ బర

మోపాస్యమైయున్నది. ఇందలి వకారయకారములువరుసగా వరుణవాయు బీజములైయున్నవి. తకార థకారములువరుసగా వాస్తుధనదబీజములైయున్నవి వకారము వర్ణన్యబీజము. వీనినడుమనున్న నకారము వేదమాతయైన సావిత్రీ దేవియొక్కబీజము. ఇదిపైన జెప్పానినదేవతలకు అధ్యక్షురాలై ఉపాసకులైన భక్తులకు శక్తిసహితపురుషని సాక్షాత్కరింపజేయుచుఁ బ్రాణశక్తిని, జలస్తంభన శక్తిని, వాస్తుశాస్త్రోక్తభవననిర్మాణశక్తిని జేకూర్చుచు, లోకమున సకాల వర్షములగురిపించుచు, ప్రపంచమునకు వాయుప్రమాదములవాటిల్లనీయక రక్షించును భక్తులకుగల సకలరోగములను దొలగించి, వారినిగాపాడును. చక్కని ఆధ్యాత్మికభౌతిక విజ్ఞానములను జేకూర్చును; అని తెలియుచున్నది.

—: ద్వితీయయజుస్సు :—

"నమఃకకుభాయనిషంగిణేస్తేనానాంపతయేనమః"

*అర్థము:-*

కకుభాయ = కకుభసదృశమైన అనగా అర్జున వృక్షమువలె ప్రధానుడైనట్టియు, నిషంగిణే = ఖడ్గముచేతగల శివునకు, నమః = నమస్కారము. స్తేనానాం = గుప్తచోరులకు, పతయే = పాలకుడైన శివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:- పరమేశ్వరుడు సకల ప్రపంచమునను ప్రధానుడు అతడు దుష్టసంహారమునకై ఖడ్గమునుచేతఁదాల్చెను. గుప్తముగానున్న చోరులను, జీవులను పెడదారపట్టించిచోరులవలెబీడించు ఇంద్రియములను అడఁచి, పాలించుచుండెను అట్టిమహాదేవునకు నమస్కారము రుద్రుడు విలాసముగా లోకకల్యాణమునకైనటునివలె అయావేషములుదాల్చి, అయాజీవులపై ద్వేషమువహించును. పరమేశ్వరుడు సర్వజగదాత్మకుడు. కావున ఎవరెచ్చటను ఎట్లువర్తింతురో తానును అచ్చటను ఆ రూపముతోడనే వర్తించును.

కావుననే గుప్తచోరులకు పాలకుడుగానుండెను. రుద్రునకుగల సర్వాత్మత్వము ఈమంత్రములందు జెప్పబడుచుండెను. పరికింపగా రుద్రుడు చోరాదుల శరీరములందు జీవరూపముగను ఈశ్వరరూపముగను ద్వివిధముగానుండును స్తేనాదులందు శివుడు జీవరూపమునగలడనునది వాచ్యార్థము. ఈశ్వర రూపముననుండి పాలించుచున్నాడనునది లక్ష్యార్థము. మహాదేవుడు లక్ష్యార్థముచే గోచరించు శివరూపమున శిష్టులపాపములను బరిహరించి, వారికి బురుషార్థమైన మోక్షమునొసంగుచున్నాడు. ఇట్లు వాచ్యార్థలక్ష్యార్థములను బోధించులౌకికశబ్దములువేదమంత్రములందునుగలవు. శాఖాగ్రచంద్రన్యాయముచే నైయర్థములుగోచరించును. ఎట్లన? చెట్టుకొమ్మచివరను జంద్రుడుండును ఆకాశమునగవాయుండును. చెట్టుకొమ్మచివరకు దిన్నగానున్న ఆకాశమున జంద్రుడుకానవచ్చును; అను నదియేలక్ష్యార్థము. అదివాచ్యార్థబాధచేగల్గును, అటులనే పైమంత్రమునందుగల వాచకశబ్దముగు స్తేనపతి "పదముచే, లక్ష్యార్థము అనగా "సర్వేశ్వరుడై శివుడుగూఢచోరులను బాలించును" అనునది గోచరించును. పై విషయమునుబట్టి, శివుడు జీవుల హృదయముననుండి, వారిని సన్మార్గప్రవర్తకులగావించి, రక్షించునని తెలియుచున్నది.

### 42 వ నామము:- "నమః కకుభాయ"

*శివ:-*

వ భా. భా:- కకుభమనగా ప్రధానుడు. పరమేశ్వరుడు. పంచభూతములు సూర్యచంద్రులు, సోమయాజి అను ఎనిమిదియును మహేశ్వరుని మూర్తులే. పైయెనిమిదింటిలో పంచభూతములు సూర్యచంద్రులును సృష్టికంతటికిని ప్రధానులు. వానితో సంబంధములేని వస్తువులు పదునాల్గుభువనంబులందును ఎప్పుడునులేవు. కావున శివుడు తన రూపములతో జేతనాచేతనములందుగలడనుట నిర్వివాదముకదా! అందుచే శివుడు ప్రధానుడై

రకుభనామధారియాయెను. కకుద్మమనగా వీణాదండముయొక్క శిఖరభాగము. ఆడనప్తస్వరములనొసంగుతంతువులతో బంధింపబడియుండును. అదిలేనిచో వీణాతంతువులు (తీగెలు) నిరాధారములగును. అపుడు వీణనాదహీనమగును. వాయిద్యములలోఁ బ్రధానమువీణ. "వీణావణవలాసితమ్" అని అరుణమంత్ర మున వీణనుగూర్చికలదు. వీణకంతటికిని ప్రధానమువాని శిఖరభాగము. ఆటులనే మహేశ్వరుడు జీవతంతువులకు అధారభూతుడై ప్రధానుడాయెను. అందుచే వానికి "కకుభ"మనునామమువాటిల్లెను. అంతేకాదు. "కకుదిభాతీతి కకుభః" అనివ్యాకరణమున బృషోదరాదిగణమునజేరి సాధువైనకకుభపదము నకు ఎద్దుమూపురమునగూప్పుండువాడని యర్థముకలదు మహాదేవుని వాహ నము వృషభము; కావున నాతనికి కకుభనామమువాటిల్లెనని చెప్పవచ్చును. జీవులలోగల అజ్ఞానమునకు చిహ్నము వృషభము. దానినడంచి, జీవులకు జ్ఞానమునొసగువాడు కావున శివుడు సకలదేవతలలో కకుభుడు అనగా ఉచ్ఛ్రి తుడు (పెద్దవాడు)వాయెను. అందుచే ఆతనికి కకుభనామము సార్థకమాయెను,

విష్ణుః—

కకుభపదమునకు బ్రధానుడు అను నర్థమును జెప్పినపుడు "ప్రధాన పురుషేశ్వరః" అను విష్ణుసహస్రనామసూక్తిలో బ్రధానపదము విష్ణుపరముగా బ్రయోగింపబడుటచే బ్రధానార్థముగలకకుభపదము విష్ణువునకుఁ జెల్లునని తెలియుచున్నది. కకుభుడు, ప్రధాన పురుషేశ్వరుడు అను రెండుపదములును సమానార్థకములే, కావున అధికుడురును. శివుని యంశలగు అష్టవిధ ప్రకృతు లును అంతటనువ్యాపించినవి. విష్ణువును సర్వవ్యాపకుడే. కావున శివకేశవు లిరువురును సృష్టిరక్షణక్రియలాచరించువారు అగుటచే బ్రధానులే యన వచ్చును. వీణాతంతువులకు కకుభము (వీణాదండము) ప్రధానమైనట్లు పదునాల్గు భువనములను దనకుక్షిలోదాల్చి, వానికాధారుడగుటచే విష్ణువు సర్వప్రధానుడాయెను.

"పాదోఽస్యవిశ్వాభూతాని" అను శ్రుతిని బరిశీలించినచో విష్ణుపాదమే విశ్వభూతములుగామారెనని తెలియుచున్నది. కావున జీవులకు విష్ణువు కకుభుడు ప్రధానుడాయెను. అంతేకాదు. కకుభపదమునకు ఉచ్ఛ్రితుడు = ఉన్నతుడు అని యర్థముచెప్పినచో "వామనఃప్రాంశుః" అనెడి సహస్రసూక్తిలో జెప్పిన ప్రాంశుపదమును, కకుభపదమును సమానార్థకములే యగును కావున కకుభనామము విష్ణువునకు జెల్లును. "ద్విధాబద్ధో వృషభో రోరవీతి" అను శ్రుతిలో జెప్పిన వృషభము అగ్నిస్వరూపము విష్ణువే కావున "కకుభస్సన్ భాతీతి = కకుభః" అని వ్యుత్పత్తిచెప్పి కకుభనామము విష్ణువునకుజెల్లునని చెప్పవలసియున్నది. ఇట్లు ఏయర్థమును బరిశోధించినను కకుభనామము విష్ణువునకును జెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు ల్ + అ + క్ + ఉ + భ్ + అ" అని ఆరక్షరములుకలవు. షడింద్రియములకును అవి షడృతువులకును జిహ్నములు. ఇందలి అకారద్వయము సర్వదైవత్యమగుటచే శివకేశవాభేదమును దెలియఁజేయును. శివకేశవులు తమశక్తిని వాయువుద్వారా సకలప్రాణులలోఁ బ్రవేశపెట్టి సృష్టిస్థితుల గావించుచు కకారముచే సూచింపబడిన ప్రాజాపత్యమును బ్రదర్శించుచున్నారు. వారే జీవులలో వాయురూపులైయుండి, భృగ్వంశమునవారికి సకల విద్యలను జేకూర్చుచున్నారు. ఈవిషయము భకారముచే అభివ్యక్తమగుచున్నది. పైనామము నుపాసించువారు సకలరాజనీతిజ్ఞులై ప్రజాపతిత్వమును బొందగలరని తెలియుచున్నది.

*43 వ నామము:- "నమోనిషంగిణే"*

*శివ:-*

భ. భా. భా:- నిషంగము అనగా ఖడ్గము, చేతగలవాడు కాన నిషంగయైన మహాదేవుడు శిష్టరక్షణార్థము దుష్టశిక్షణమొనర్చచేత ఖడ్గముదాల్చెను. సృష్టిస్థితిలయకార్యములలో లయమొనర్చుట శివునికృత్యము అందుచే ఖడ్గ

ప్రహారకుశలుడైన శివుడు నిషంగమునుచేతఁ దాల్చినిషంగినామకుడాయెను. నిషంగము త్రిశూలమునకుఁ జిహ్నము. మనోవాక్కాయకర్మలందు దుష్టులై స్థూలసూక్ష్మకారణశరీరములతో దుష్కార్యమునాచరించువారెల్లరును దుష్టులే. అట్టివారిని జీల్చిచెండాడుటకు అనువైనసాధనము నిషంగము = ఖడ్గము. కాన మహాదేవుడు నిషంగినామకుడాయెను.

విష్ణు:-

విష్ణువు ఖడ్గముపేరునందకము. అదియును నిషంగమే. దానినిజేత దాల్చిదుష్టులను సంహరించుటచే అతనికి నిషంగనామమువాటిల్లెను "నిషంగీ నందకీ" అను రెండుపదములును పర్యాయపదములే. "శంఖభృన్నందకీ చక్రీ" అను విష్ణుసహస్రనామసూక్తిలోని "నందకీ" అనుపదము విష్ణుపరముగా గలదు. "నందకీ" అను నామమువలె "నిషంగీ" అను నామముకూడ విష్ణువునకుఁజెల్లును.

బీజాక్షరసంపుటి:-

ఇందు "న్+ఇ+ష్+అ+మ్+గ్+ఈ" అని యేడక్షరములు కలవు అవి సప్తధాతువులను సూచించును. సప్తమేఘమండలములను జెదరగొట్టు "వరాహాది సప్తవాయువులకును జిహ్నములు. విష్ణుబీజమైన ఇకారము, సావిత్రీబీజమైన నకారముతోగూడియుండుటచేఁ బైనామము నుపాసించువారికి పాపనాశకశక్తియును, రక్షకరశక్తియును లభించుననితెలియుచున్నది. సర్వ దేవతాకమైన అకారము ద్వాదశాత్మబీజమైన షకారముతోగూడియుండుటచేఁ బైనామము సూర్యోపాసకులకు అనన్తశక్తినిజేకూర్చును. అందుచే వారుకర్మేంద్రియ జ్ఞానేంద్రియ మనోబుద్ధులకు వాటిల్లురోగములను నశింపఁజేసి సర్వార్థ సిద్ధి చేకూర్పగలవారలగుదురు. మదనబీజమైన మకారమును, గణపతిబీజమైన గకారమును మాయాశక్తిబీజమైన ఈకారముతోఁ గూడియుండుటచేఁ బైనామము గణపత్యుపాసకులకు జాలశ్రేష్ఠమైనదని తెలియుచున్నది.

సైనామము నుపాసించువారు మానవసంఘమునకు నాయకులై సర్వ కార్యములందును జయమునొందగలరు. మొత్తముపైని ఈనామము శాక్తేయు లకుఁ జాలముఖ్యమైనదని తెలియుచున్నది.

## 44 వ నామము:- "సేనాన్యాంపతయేనమః"

శివ:-

వ. శా. భా:- తమశరీరమును గానరానీయక మఱుగుపడుచు, పరుల ధనము నపహరించువారు స్తేనులువారు సువర్ణాదిధనమును, పశుధనమును, బంటచేలను సైతము అపహరింతురు. వారిలో గుప్తముగా (రహస్యముగా) నుండి మారువేషముననుండి విద్యాదులను అపహరించువారు గుప్తచోరులు. కర్ణుడు బ్రాహ్మణవేషమునవచ్చి పరశురామునిచెంతఁజేరి, ధనుర్విద్యాదులను గ్రహించెను అట్టి గుప్తచోరులను శిక్షించుటకు గుర్వాదులబుద్ధిలో జ్ఞానరూపముననుండి వారివిషయమును గ్రహింపజేసి, శివుడు శిక్షించును. మహాదేవుడు పరశురామునిలో బుద్ధిరూపమునుండి పరశురామునిచే శపింపజేసి కర్ణుని శిక్షించెను అట్టి గుప్తచోరులను శిక్షించి, వారిపాపమును బరిహరించి, వారికి ముక్తినిజేర్చి శివుడు స్తేనపతియాయెను. "పద్ల = గౌతా" అను దాతువునుండి యేర్పడిన పతిశబ్దమునకుఁ జేర్చువాడనియు అర్థము చెప్పవచ్చును. దొంగ లైనను ఒకప్పుడు వారు తనకు భక్తులైనచో ఆశ్రితవత్సలుడైనకారణమున మహాశివుడు వారిపాపములను దొలగించి, రక్షించి, వారికి పతి = స్వామి యగుచున్నాడు కావున శివునకు స్తేనపతియనునామము సార్థకమాయెను.

విష్ణు:-

భగవంతుడైన విష్ణువు అనన్తరూపుడు; బృహద్రూపుడు. కావుననే "అనంతరూపోఽనన్తశ్రీః" "నైకరూపోబృహద్రూపః" అను నామములు విష్ణు సహస్రనామములలోఁ జేర్కొనబడెను. అతని అనన్తరూపములలో స్తేనపతి

రూపము ఒకటియని చెప్పవచ్చును. "నిర్జరనిగళస్యస్తసువర్ణసూత్రపరిహర్తకు దానవలోకభర్తకున్" అను పోతన్నగారిసూక్తినిబట్టి దేవతాస్త్రీల సువర్ణ మంగళసూత్రములను అపహరించినగుప్తచోరుడు బలిచక్రవర్తియని చెప్ప వచ్చును. అయినను మంగళాధ్వరవిధానవిహర్తయై. యజ్ఞస్వరూపుడగు విష్ణు వును ఆరాధించెను. కావున విష్ణువు ఆతనిని తుదముట్టించక వామనరూపమున విచ్చేసి, పాతాళమునకడంచి, రక్షించెను. వానికిఁ బతియాయెను. అందుచే విష్ణువుకూడ "సేనానాంపతి" అను నామమునకు అర్హుడాయెను.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "స్ + త్ + ఏ + న్ + అ + వ్ + ఆ + త్ + ఇ" అని తొమ్మి దక్షరములుకలవు. ఇవి శరీరమందలి నవద్వారములకును, నవావరణలకును చిహ్నములు. ఇందలి ఆకారేకారములు బ్రహ్మవిష్ణుమహేశ్వరబీజములు, వీర భద్రబీజమైన ఏకారము, శక్తిబీజమైన సకారముతోడను, వాస్తుబీజమైన తకారముతోడనుగూడియున్నది. అందుచేఁ బైయక్షరములుగలనామము నుపా సించువారు దుష్టసంహారకములైన మారణాయుధములను సృష్టించి, దుష్టు లను జయించి, సర్వత్రవిజయమును, సర్వార్థసిద్ధినిబొందగలవారలగుదురు. శక్తిసహితశివోపాసకులై వాస్తుశాస్త్రసమ్మతమగు భవనములను నిర్మింపగలరు, సర్వదేవతాకమైన అకారము, సావిత్రీబీజమైస సకాకముతోడను, పర్జన్య బీజమైన వకారముతోడనుగూడియున్నకారణమునఁ బైనామము నుపాసించు వారు కృత్రిమవర్షము కురిపించగలవారలై సస్యసమృద్ధిచేకూర్పగలవార లగుదురు. విష్ణుబీజమైన ఇకారము వాస్తుబీజమైన తకారముతోఁ గూడియున్న కారణమునఁ బైనామము నుపాసించువారు నూతనయంత్ర నిర్మాతలై జగద్రక్షకరులు కాగలరు.

## —: తృతీయయజుస్సు :—

"నమోనిషంగిణఇషుధిమతే తస్కరాణాంపతయేనమః"

అర్థము:-

నిషంగిణే = ధనుస్సునసంధించుటకు జేతబాణముకల్గినట్టియును, ఇషుధిమతే = పృష్ఠభాగమున గట్టబడిన అమ్ములపొదిగల్గినశివునకు, నమః = నమస్కారము తస్కరాణాం = ప్రకటచోరులకు, పతయే = పాలకుడైన శివునకు, నమః = నమస్కారమగుగాక.

తాత్పర్యము:-

సా భా:- శివుని ధనుస్సుమేరువు పర్వతమనికొందఱును, ఓంకారమనికొందఱును జెప్పుచున్నారు. అందు సంధింపబడినబాణముసోముడనికొందఱును, విష్ణువనికొందఱునుజెప్పుచున్నారు. అతని అమ్ములపొది మహాసముద్రము. ఇట్లుచెప్పిన విచిత్రముగానుండును. కాని పరికింపగా జిత్రమేమియునులేదు. కారణమేమన? శివుడు సమష్టిజీవచైతన్యము అతని స్వరూపము బ్రహ్మాండము. మేరువుపర్వతము బంగారుమయము. మహాలక్ష్మియొక్క ప్రతిరూపము. అదిధనువైనపుడు, ఆమెచెంతనుండదగినవాడు ఆమెభర్తయైన విష్ణువేనకావలెను. లేదా ఆమెసోదరుడైన చంద్రుడైన గావలెనుగదా? వారిరువురినివాసము జలమయమైన సముద్రమే. కావున బరమేశ్వరుడు అంపపొది రూపమైన సముద్రమును, బాణరూపమైన విష్ణువును జగద్రక్షణకై తనచెంతనుంచుకొన్నవాడన్నమాట. అతని స్వరూపమైన బ్రహ్మాండమునగల ప్రకటచోరులను బట్టిబంధించి, శిక్షించి, సన్మార్గముననుంచి, వారికి బాలకుడైయుండెను. అట్టిపరమేశ్వరునకు నమస్కారము.

**45 వ నామము:- "నిషంగిణే నమః"**

**శివ:-**

భ. భా. భా:- మహాదేవుడు భక్తులపట్ల మిక్కిలి ఆసక్తికలవాడు కావుననే, మార్కండేయాదులను దలంచినదే తడవుగారక్షించినాడు. అంతేకాదు. ని+సంగినే = భక్తులతో మిక్కిలిగాఁ గలిసియుండువాడు మహాదేవుడు. కావుననే అతడు గజాసురవ్యాఘ్రాసురుల చర్మములను కట్టుబట్టగా అంగవస్త్రముగా నొనర్చుకొనియున్నవాడు. విష్ణువవలె స్వశల్యపరీక్ష చేయక అనగా గఠినముగా బరీక్షింపకయే వరములనొసంగును. అందుచే శివునకు "నిషంగీ" అను నామము సార్థకమాయెను.

**విష్ణు:-**

విష్ణువుకూడ శివుడువలె భక్తులపట్ల సంగము = సక్తి = ప్రేమకలవాడు. కావుననే చేతులందు శత్రువులను సంహరించుటకు వివిధాయుధములనుదాల్చి, సర్వప్రహరణాయుధుడను నామము సార్థకముచేసికొనినాడు. అమితాసక్తి చే భక్తరక్షణార్థము అమిత్రులను శత్రువులను శిశుపాలాదులను సంహరించి, ఆప్తులను ఆనందపఱచినాడు. అందుచేతనే ప్రమోదనుడనునామము ఆతనికి వాటిల్లెను. భక్తులగు కుచేలాదులందు సక్తి = వాత్సల్యముకలవాడు కావుననే విష్ణువునకు భక్తవత్సలుడనునామము సార్థకమాయెను. ఏకైకార్థములందు "నిషంగీ, సర్వప్రహరణాయుధః, భక్తవత్సలః", అను నామములు సమానాభిప్రాయముకలవే కావున విష్ణువునకును 'నిషంగి' అను నామము సార్థకమాయెననిచెప్పవచ్చును.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "న్+ఇ+స్+అ+జ్+గ్+ఈ" అని ఏడక్షరములు కలవు ఇవి సప్తధాతువులకును సప్తవాయుమండలములకు జిహ్వములు. ఇందు సావిత్రీ బీజమైన నకారమును, శక్తిబీజమైన సకారమును, మాయాశక్తిబీజమైన ఈకారమునుగలవు. అవి ఇచ్ఛాక్రియాజ్ఞానశక్తులకు ప్రతిబింబములు. అవి వరుసగా విష్ణుబీజమైన ఇకారముతోడను, సకలదేవతాకమైన అకారముతోడను, గణపతిబీజమైన గకారముతోడను, గూడియున్నవి. కావున నైనామము శక్తిపూజాతత్పరులకు బరమోపాస్యము. ఇందుకాలబీజమైన జకారమునుగలదు. అది సకలదేవతలును కాలస్వరూపులుగా నున్నారను విషయమును సూచించును. దీనినుపాసించువారు మహావిద్యాసంపన్నులై, సకలసృష్టిరహస్యములనెఱిగి, లోకమునకెఱుకపఱచి, సర్వత్ర విజయమందగలరు.

*46 వ నామము:- "ఇషుధిమతే నమః"*

*శివః-*

భ. భా. భా:- ఇష్యతి = గచ్ఛతీతిఇషుః, సధీయతేఽస్మిన్నితి ఇషుధిః, సయస్యాస్తి, సఇషుధిమాన్, తస్మైనమః. అనువ్యుత్పత్తిననుసరించి, ఇషుధిమాన్ = అమ్ములపొదికలవాడు భగవంతుడు శివుడని తెలియుచున్నది. మహాదేవుడు త్రిపురాసురాది రాక్షససంహారసమయమున బాణపుపంచిని తన పృష్ఠభాగమునగట్టుకొనియుండును. కాన ఇషుధిమంతుడాయెను. అంతేకాదు. మహాదేవుని బాణాలసంచి మహాసముద్రము అందుగల బాణముసోముడే(చంద్రుడే) కానిండు. విష్ణువేకానిండు. ఎవరైననేమి? వారిరువురిలో చంద్రుని జన్మస్థలము సముద్రము. విష్ణువు నివాసము సముద్రము. జలధిశాయనుడు, అనునామము విష్ణువునకుగలదుకదా! సకల సృష్టికిని నివాసమైనజలముకలది సముద్రము. అది శివునకు అమ్ములపొదిగాగలదు. ఇషువునకును, సోమునకును, విష్ణువు

నకును సర్వవ్యాపకత్వరూపగమనముకలదు. కావున ఇషుపదముచే బైమువ్వురును బోధింపబడుచున్నారన్నమాట. వారినివాసము ఇషుధి. అదికలవాడు పరమేశ్వరుడుకాన అతనికి "ఇషుధిమాన్" అను నామము సార్థకమాయెను.

**విష్ణు:-**

విష్ణువు జీవులకు వారికర్మలననుసరించి భయంకరుడును, వారికర్మలను నశింపజేయుటచే భయనాశనుడును అగుచున్నాడు. తనభక్తులయొక్క భయమునుదొలగించుటవారిశత్రువులను నశింపఁజేసి వారికిసుఖముచేకూర్చుటకై తన పృష్ఠభాగమున అంపపొదినిదాల్చును. శ్రీరామావతారమునను, అర్జునరూపనరావతారమునను శత్రునాశనమునకును, భక్తమిత్రరక్షణకును విష్ణువు ఇషుధిని (బాణపుపంచిని) గల్గియున్నాడు. కాన శివునకువలె విష్ణువునకును ఇషుధిమంతుడనునామము, సార్థకమేయగును.

**బీజాక్షరసంపుటి:-**

ఇందు "ఇ + ష్ + ఉ + ధ్ + ఇ + మ్ + అ + న్" అని యెనిమిదక్షరములుకలవు. అవి అష్టాంగములకును అష్ట (8) సూర్యమండలములకు చిహ్నములు. ద్వాదశాత్మబీజమైన షకారము, ముందున విష్ణుబీజమైన ఇకారముతోడను, వెనుకనువాయుబీజమైన ఉకారముతోడను గూడియున్నందున, బైనామము నుపాసించువారు వాయుధారణశక్తిచేతను, కృత్రిమవాయువషోయమ్ముచేతను, సర్వవ్యాపకుడైన సూర్యభగవానుని మండలమందలి కాంతిపుంజములనుగ్రహించి, వానియందలి విద్యుచ్ఛక్తిచేతను, నానావర్ణములుకలకిరణప్రసారముచేతను, పలువిధములైనరోగములను రూపుమాపఁగలరు. చంద్రమండలముమున్నగుగోళాంతరములకు యాత్రసాగించఁగలరు. ధనదబీజమైన ధకారము విష్ణుబీజమైన ఇకారముతోఁ గూడియుండుటచే, బైనామము నుపాసించువారు భూమిలోఁగలధనరాసులను వెలిబుచ్చఁగలరు. మదనబీజ

మైన మకారము పరాశక్తిబీజమైన అకారముతోడను, సావిత్రీబీజమైన నకారముతోడనుగూడియుండుటచేఁ బైనామము నుపాసించువారు శక్త్యుపాసకులై ప్రజాభీష్టములను దీర్చగలవారలగుదురు.

*47 వ నామము:- "తస్కరాణాంపతయేనమః"*

*శివః-*

భ. భా. భా:- తస్కరులకు అనగా ప్రకటచోరులకు పాలకుడైన శివునకు నమస్కారము. చోరులలో ముఖ్యముగా గుప్తచోరులు, ప్రకటచోరులని రెండువిధములుగాఁగలరు. గుప్తచోరులనుగూర్చి పైమంత్రమునజెప్పబడెను. ఇందు ప్రకటచోరులనుగూర్చి చెప్పఁదొడగెను. ఈచోరులు చెట్లలోను జంతువులలోను, పక్షులందును, మనుష్యులందునుగూడగలరు. నేలలోనుండి వేరునాశ్రయించి, చెట్లను బాధచేయునవి గుప్తచోరులు. జంతువులకును, పక్షులకును ఆహారాదులద్వారా, కానరాక, లోనఁజేరిహానిచేయునవి గుప్తచోరులు. అటులనేకంటికిగానరాని అణురూపమున దాగియుండి మానవులను బాధచేయువారుగుప్తచోరులు. చెద,చీడ,ఫంగస్ మొదలగు క్రిముల రూపమున ప్రకటముగానుండి చెట్లను పక్షులను జంతువులను బాధచేయునవి ప్రకటచోరులు. అటులనే మిత్రులవలె బంధువులవలె గానవచ్చుచు, నధులసొత్తును అపహరించువారు ప్రకటచోరులు. అంతేకాదు, ధనాదులలోనుండి ప్రత్యక్షముగా సార్థవాహుల ధనాదుల నపహరించువారును ప్రకటచోరులే. వారిలో (జెడు బుద్ధులను రేకెత్తించి, తద్ద్వారా శిక్షలను కష్టములను అనుభవింపజేసి, పశ్చాత్తప్తుల గావించి, సన్మార్గమునకు మరల్చి, పాలించువాడు పరమేశ్వరుడే. వృక్షాదులకు జెందిన ప్రకటచోరులను గుప్తచోరులను వాయ్వగ్ని జలాదులరూపమున నుండి శిక్షించి, రక్షించువాడును పరమేశ్వరుడే. కావున పరమశివునకు తస్కరపతియను నామము సార్థకమాయెను.

విషః-

"అశ్వత్థస్సర్వవృక్షాణాం స్థావరాణాం హిమాలయః; అనన్తశ్చాస్మి నాగానాం; మృగాణాంచమృగేంద్రోఽహం, వైనతేయశ్చ పక్షిణాం; ఝషాణాంమకరశ్చాస్మి" మున్నగుగీతాసూక్తులచే భగవంతుడు స్థావరజంగమములలో ఆయారూపములతోనున్నట్లు తెలియుచున్నది. జంతుపక్షిక్రిమి కీటాకాదులలో భగవంతుడు మంచిచెడ్డరూపములతోనున్నట్లు తెలియుచున్నది మంచి చెడ్డవస్తువులన్నింటిలోను భగవంతుడు ప్రకటచోరులను సైతము పీడాకరులుగాఁ బ్రవేశపెట్టి, వారిని పాలించుచు వానిలోనిచెడ్డనుదొలగించి, వాని ద్వారాలోకములకు మేలుచేకూర్చుచున్నాడు. ఆయారూపములన్నియు భగవంతుడైన విష్ణువునకుజెందినవే. ఆయారూపములనుండి, లోకములకు స్వస్తి = శుభమును జేకూర్చుటచేతనే విష్ణువునకుగల "స్వస్తికృత్" అను నామము సార్థకమగుచున్నది. మకరసింహాదులు, శిశుపాలాదులును బ్రకటచోరులేకదా! వారినిదొలుతపాలించి, పెద్దజేసి తర్వాత శిక్షించినాడు. కావున విష్ణువునకు "తస్కరపతి" నామము సార్థకమగునని తెలియుచున్నది.

బీజాక్షరసంపుటి:-

ఇందు "త్+అ+స్+క్+అ+ర్+అ+ప్+అ+త్+ఇ" అని పదునొండు అక్షరములుకలవు. ఇవి ఏకాదశరుద్రులకు ఏకాదశ శరీరద్వారములకును ఉపలక్షకములు. ఇందలి తకారద్వయమును వాస్తుబీజములు. సకారము శక్తిబీజము; కకారము - ప్రజాపతిబీజము. రేఫము వహ్నిబీజము పకారము పర్జన్యబీజము. అవి సర్వదేవతా బీజమైన అకారచతుష్టయము తోడను, విష్ణుబీజమైన ఇకారముతోడను గూడియున్నవి. కావునఁ బైనామము నుపాసించువారు, శక్తిపురుషుల ప్రభావము తమపైనుండుటచే విద్యుచ్ఛక్తితోనడుపఁబడు యంత్రములనిర్మించి, సకాల వర్షములు కురిపించి, పలువిధములైన ఆహారపదార్థములను ఉత్పత్తిచేసి, సకలజీవుల ఆరోగ్యములను బెంపొందించియు, వారికి నిలుకడచేకూర్పగలవారలును, సకల రోగనివారకులునుగాఁగలరు.

—: చతుర్థయజుస్సు :—

"నమో వంచతే పరివంచతే స్తాయూనాం పతయే నమః"

**అర్థము:-**

వంచతే = యజమానికి అప్తుడై, అతనిక్రయవిక్రయాదివ్యవహారములందు మెలగుచు, ఎప్పటనైనను, ఏమాత్రమైనను అతని ద్రవ్యమును అపహరించుటయనెడి వంచనమొనరించువాని స్వరూపముతో నుండు శివునకు, నమః = నమస్కారము. యజమానియొక్క వ్యవహారములన్నింటియందును బాగుగా మోసగించుటయే పరివంచనము. పరివంచతే = పైనజెప్పినట్లు యజమానిని బాగుగా మోసగించు శివునకు, నమః = నమస్కారము. స్తాయూనాం = రాత్రియందో పగటియందో అన్యులకు తెలియనీయక యజమానిసొత్తు నపహరించువారికి, పతయే = పాలకుడైన శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భాష్యము:- ప్రపంచమంతయు పరమేశ్వరునిస్వరూపమే. అందుగల మంచిచెడ్డవస్తువులన్నియును శివమయములే. సుజనదుర్జనులందఱును పరమేశ్వరునిస్వరూపులే. అందులో, గొందఱు తమ యజమానిచెంత ఆప్తుల వలె ఉందురు. వారి క్రయవిక్రయాది వ్యవహారములందు మెలగుచు, వారి ద్రవ్యమును స్వార్థపరులై కొంచెమైనను అపహరింతురు. కొందఱు అన్ని వ్యవహారములందును వారికి బాగుగా మోసముచేయనెంచి, యథార్థమును గప్పిపుచ్చెదరు. ఇంచుకంత మోసగించువారికి వంచతులనియు బాగుగా మోసగించువారికి పరివంచతులనియు, నామములు గలవు. వారందఱును శివస్వరూపులేయనుటకు గారణము భగవంతుని సర్వాంతర్యామిత్వమే. అంతేకాదు. పైనజెప్పిన గుప్తచోరులు రెండు విధములుగా గలరు. వారిలో మొదటితెగకు జెందినవారు స్తేనులనబడుదురు. - వారు

దూరమునుండివచ్చి ఎవ్వరికిని దెలియకుండగనే మెలగుచురాత్రియందు. గవాటాదులను బగులగొట్టి, ద్రవ్యాదులను అవహరింతురు రెండవతెగకు జెందినవారు స్వకీయులే యజమానికిఁజెందిన ఆప్తబంధువులే. ఆప్తమిత్రులే. అట్టుండి రాత్రియందో పగటియందో అన్యులకు దెలియనీయక యజమాని సంపదను అపహరింతురు. వీరినే స్తాయువులందురు. ఈ స్తేనులు స్తాయువులు అనబడువారు మనుష్యులందేకాదు. జంతువృక్షపక్ష్యాదులందును ఉందురు. వారందఱికిని, మహాదేవుడుపాలకుడుగానుండి, వారిచెడుగుణములను తృద్ధి చేసి, వారికర్మఫలములను అనుభవింపజేసి, కష్టాలపాలుచేసి, పిమ్మట వారిని శుభాశుభకర్మహీనులఁగావించి, కాపాడును. వారిని సైతము తన భక్తులుగా నుంచును. అట్టివారే పురాణాదులలో గోచరించురాక్షసులు, దానవులు, జరాసంధాదులు; గుణనిధి, నిగమశర్మవంటివారును వారికిని గొంతకాలము నకు ముక్తినొసగును. కావుననే శివనామములలో "వంచతుడు పరివంచతుడు స్తాయుపతి" అను నామములు శివపరములుగా జేర్కొనబడినవి. అట్టి మహా దేవునకు నమస్కారము.

*48 వ నామము:- "నమోవంచతే"*

*శివ:-*

భ. భా. భా:- శివకేశవులిరువురును విరాట్పురుషుని రూపాన్తరులే అందుచే విష్ణువవలె శివుడును సర్వవ్యాపకుడే. "వంచతి = గచ్ఛతీతివంచన్" అను వ్యుత్పత్తి ననుసరించి మహాదేవుడు సర్వవ్యాపకుడు అని తెలియును కావుననే అతనికి "వంచన్" అను నామమేర్పడెను. అంతేకాదు. వంచ్ ధాతువునకు విప్రలంభము అనగా ఎడబాటు అను నర్థముకలదు. అందుచే బరమేశ్వరుడు సకలజీవులను వారికర్మఫలానుభవానంతరమున ఆయాకర్మల నుండియు దుష్టశక్తులనుండియు, వేరుచేసి రక్షించును. కావున అతనికి "వంచన్" అను నామము సార్థకమే. అందుచేతనే భక్తులాతనికి "వంచ తేనమః" అనుచు నమస్కరింతురు.

విష్ణుః-

వంచతే — గమనశీలునకు సర్వవ్యాపకునకు నమస్కారము అను నర్థమున విష్ణువునకును "వంచన్" అను నామము సార్థకమేయగును. ఈ యర్థముననే "విశ్వంవిష్ణుః" అను విష్ణుసహస్రసూక్తిలో విష్ణు పదము ప్రయోగింపబడెను. "సహిష్ణుర్గతిసత్తమః" అను సూక్తిలో గతిసత్తమపదము ఈ యర్థముననే విష్ణుపరముగాఁ ప్రయోగింపబడెను. అంతేకాదు. జీవులను వారి వారికర్మలనుండి వేరువేయువాడు అనునర్థముననైతము "వంచన్" అను నామము విష్ణువునకుఁ జెల్లును. వాణిజ్యముచేయు మానవులు భక్తులైనను జన ద్రవ్యాపహారకులైనకారణమున (తూకముమున్నగువానిలో) వంచకులే. అట్టివంచకులైన జీవులను వారివారి కర్మఫలము. అనుభవింపజేయుటకై ప్రవర్తింపజేయువాడు కావున భగవానుడైన విష్ణువునకు "వంచన్" అనునామము చెల్లును.

బీజాక్షరసంపుటి:-

ఇందు "వ్+అ+మ్+చ్+అ+న్" అని ఆరుఅక్షరములుకలవు. అవి షడృతువులను, షట్కృత్తికలను సూచించును. ఇందువరుణబీజమైన వకారమును, మదనబీజమైన మకారమును, సర్వదేవతాబీజమైన అకారముతో గూడియుండుటచే పైనామము నుపాసించువారు సముద్రాదిజల విజ్ఞానము కలవారై, వానికిజెందిన పరిశోధనము, చమురుగనులు, మంచినీరు, విద్యుచ్ఛక్తి మున్నగువానిని సముద్రజలమునుండి వెలిదీయుపద్ధతిని ఎఱుగగల వారగుదురు. చండరుద్రబీజమైన చకారమును, సాంద్రశ్రీబీజమైన నకారమును అకారముతో గూడియున్నకారణమున పైనామమును యోగపద్ధతి నుపాసించి, సకలపాపపరిహారకులై తాముచేయు కార్యములందు విఘ్ననివారకులు కాగలరు.

*49 వ నామము:- "పరివంచతే నమః"*

*శివ:-*

భ. భా. భా:- మహాదేవుడు కర్మఫలానుకూలముగా, సకల జీవుల కును, సర్వత్ర విప్రలంబమును (ఎడబాటును జేకూర్చుచు, దానుమాత్రము ఎవ్వరిచేతను బాధింపబడకయేయుండును. అందుచే ఆతనికి "పరివంచన్" అను నామము సార్థకమేయగును.

*విష్ణు:-*

"అసంఖ్యేయోఽప్రమేయాత్మా" అను విష్ణుసహస్రసూక్తిచే విష్ణుమహిమ, ఆతని శక్తియును, వీరికినిప్రమేయములు (ఊహింపశక్యములు) కావు. కావుననే పరమాత్మ శివకేశవస్వరూపుడై వారిశక్తులను సకలచరాచరములందును ప్రవేశపెట్టినాడు. అందుచేతనే విష్ణువుకూడ సర్వవ్యాపకుడై చేతనాచేతన వస్తువులనెల్ల విడదీసి, వానికిని విప్రలంభమును గల్గించుచున్నాడు. అంతే కాదు. విష్ణువు, తనవంచన పరివంచనములచే ద్వివిధగుప్తచోరులను శిష్టులుగా మార్చుచు "విశిష్టశ్శిష్టకృత్" అను సహస్రసూక్తిలో జెప్పిన "శిష్టకృత్" అను నామమును సార్థకముచేసికొనుచున్నాడు. పై కారణములచే శివునకువలె విష్ణువునకును "పరివంచన్" అను నామము సార్థకమేఅగును.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "ప్ + అ + ర్ + ఇ + వ్ + అ + మ్ + చ్ + అ + న్" అని పద క్షరములుకలవు. ఇవి దశదిశలను, జ్ఞానకర్మేంద్రియ దశకమును సూచించును. పర్జన్యదేవతాకమైన పకారము సర్వదేవతాకమైన అకారముతో గూడియుండుటచేతను, అగ్నిబీజమైన రేఫము విష్ణుదేవతాకమైన ఇకారముతో



గూడియుండుటచేతను, ఈనామము నుపాసించువారు కృత్రిమమేఘనిర్మా ణము గావించుశక్తిని, విద్యుచ్ఛక్తి జనకములగు యంత్రముల నిర్మించుశక్తిని సంపాదించగలవారలగుదురు. మారణమంత్రనిర్మాతలునుగాగలరు మదన బీజమైనమకారమును, చండరుద్రబీజమైన చకారమును, సావిత్రీబీజమైన నకారమును అకారార్ణముతోఁగూడియున్న కారణమునఁ బైనామము నుపాసించు వారు శక్త్యుపాసకులై ప్రజలకోరికలు తీర్చగలవారలును, దుష్టశక్తులను నిర్మూలింపఁగలవారలును అగుదురని తెలియుచున్నది.

## *50 వ నామము:- "స్తాయూనాంపతయేనమః"*

*శివ:-*

భ. భా. భా:- కపటవేషమునసంచరించి, వస్త్రాదులను అపహరించు వారిని, కపటసాధువేషముననున్నవారిని "స్తాయువులు" అందురు. "ఉతస్త్యే నం వస్త్రమథినంతాయమ్" అనునార్యోక్తియే పైవిషయమునకు ప్రమాణము. "స్తై = వేష్టనే" అను ధాతువునుండి "స్తాయువు" అను పదమేర్పడెను. ఈస్తాయువులు మానవులందువలె జంతుపక్షివృక్షాదులందును, శరీరస్థ జీవకణములందును, గలవు. వీనివలన సకలజీవులకును నష్టముకలుగును. వీనివలన గష్ట నష్టములు కలుగుట బట్టియే మానవులు జాగరూకులుగా దైవ భక్తులుగా నుండుటయును సంభవించుచున్నది తన్మూల మునసత్కార్యముల నాచరించుచు, తమ కర్మలను క్షీణింపజేసికొనుచు, ముక్తులగుటకు ప్రయత్నించుచున్నారు. కావుననే పరమేశ్వరుడు స్తాయువులను వృద్ధిచేసి, "స్తాయుపతి" నామకుడగుచున్నాడు.

*విష్ణు:-*

"నైకాత్మానైకకర్మకృత్" అను విష్ణుసహస్రసూక్తిచే పరమాత్మ అనేక విధములగు ఆత్మలుకలవాడై అనేక విధకర్మలను ఆచరించుచున్నాడు. కావు ననే విష్ణువునకు "నైకాత్మ, నైకకర్మకృత్" అను నామములేర్పడెను. అయా

యాత్మలలో స్థాయురూపమగునాత్మయొకటి. ఆవిధముగను బరమాత్మ సంచ రించుచు ఆయాకృత్యములను ఆచరించుచున్నాడన్నమాట. పరమాత్మయగు విష్ణువునకు "శరభః" అను నామమున్నట్లు "అతులశ్శరభోభీమః" అను సహస్రసూక్తిచే దెలియుచున్నది. శరములు అనగా శీర్ణములగు (నష్టములగు) శరీరములు. వానియందు బరమాత్మ ప్రత్యగాత్మగా భాసించుచు స్థాయువు లను బాలించుచు, పతియాయెను. కావుననే విష్ణువునకును "స్థాయుపతి" నామము చెల్లునని చెప్పవచ్చును.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "స్+త్+అ+య్+ఉ+ప్+అ+త్+ఇ" అని తొమ్మిది అక్షరములుకలవు. ఇవి నవబ్రహ్మలను శరీరస్థ నవద్వారములకును జిహ్వ ములు. శక్తిబీజమైన సకారమును, వాస్తుదైవత్యమైన తకారమును, జలరూప పరాశక్తిబీజమైన అకారముతోడను, గూడియున్నకారణమున నైనామము నుపాసించువారు శాక్తేయులై, జలమున బయనించునౌకాదులను నిర్మింపగల వారగుదురు. యకారమును, ఉకారమును వాయుబీజములు. అకారము త్రిమూర్తిస్వరూపుడైన సూర్యునిబీజము. ఇకారము విష్ణుదేవతాకము. పైవర్ణింటితోడను, వాస్తుబీజమైన తకారమును పర్జన్యబీజమైన పకారమును గూడియున్నవి. కావున నైనామము నుపాసించువారు పలువిధములైన వాయు వులనుగనుగొని, వానిసహాయమున కృత్రిమమేఘములనిర్మించి, సకాలవర్షము కురిపించగలవారును, సూర్యకిరణలబ్ధమైన విద్యుచ్ఛక్తితోడ నడుపబడు యంత్రములను నిర్మింపగలవారలుకాగలరు. అంతేకాదు. సూర్యకిరణప్రభావ ముచే పలువిధములైన వాతరోగములను నిర్మూలింపగలవారునుకాగలరు.

**—: పంచమయజుస్సు :—**

*"నమోనిచేరవే పరిచరాయారణ్యానాంపతయేనమః"*

**అర్థము:-**

నిచేరవే = నిరన్తరము సంచారమే శీలముగా గలవాడును, పరిచ

రాయ = బజారువీధియున్నగుచోట్ల సంచరించునట్టి శివునకు, నమః = నమస్కారము. అరణ్యానాం = నిరంతరము అరణ్యముననుండు వారికి, పతయే = ప్రభువైనట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:- సర్వాంతరామియైన పరమాత్మ సజ్జనులందును, దుర్జనులందుగూడ ఉండును. కావున అతడు సదాస్వామిగృహమందేయుండి, ఎపుడాతనిసొత్తు అపహరింతునాయను తలంపుతోనుండును. వాడు సదాస్వామి గృహమందే సంచరించును. ఇట్టి దుర్బుద్ధి, మనుష్యులందువలె మార్జాల సృగాలాది జంతువులందును, క్రిమికీటకాదులందున్ను ఉండును. అట్లునిచేరు రూపమునగల పరమశివుని భక్తులు ప్రమాదనివృత్తికై నమస్కరింతురు. మరికొందఱుమానవులు బజారువీధులు, రాజవీధులు మనుష్యసంచారము బహూళముగానుండు వీధులు మున్నగుచోట్ల దొంగబుద్ధితో బాగుగా దిరుగుచుందురు. ఇట్లు పరిచర రూపముననుండు శివుని నమస్కరింతురు. కొందఱు మానవులు నిత్యము అరణ్యములందేయుండి, త్రోవబోవు వారి ద్రవ్యమును అపహరించి, బాధించు తలంపున ఉందురు. అట్లు అరణ్యవాసులైన వారికిని బరమశివుడే ప్రభువు. అయ్యరణ్యవాసులనుండి ప్రమాదములు సంభవింపకుండుటకును, అట్టిదుర్బుద్ధులు తమకు బ్రాప్తించకుండుటకును, బరమశివుని భక్తులు నమస్కరింతురు.

"యజ్ఞోవైవిష్ణుః" అను శ్రుతిచే యజ్ఞము శివకేశవాత్మకమని తెలియుచున్నది. అట్టి యజ్ఞమును దేవశత్రువులైన అసురులు పాడుచేయయత్నింతురు పైమంత్రములలో జెప్పిన తస్కరులు, వంచకులు, పరివంచకులు, స్తాయువులు నిచేరులు, పరిచరులు, అరణ్యులు మున్నగువారందఱును అసురశక్తి సంపన్నులే. వారందఱిలోను శివకేశవాంశలు తేజోరూపమునగలవు వారందఱివి

శిక్షించువారలు శివకేశవులే. తత్, తద్వతులకు భేదములేదు కావున వారిని శివకేశవరూపులుగా పేర్కొనినారు. వారినుండి రక్షణనొందుటకు భక్తులెల్ల రను తస్కరాదిరూపధారులైన శివకేశవులను ప్రార్థించుట, తమయజ్ఞములను గాపాడుకొనుట యుక్తమేకదా!

## 51 వ నామము:- "నమోనిచేరవే"

*శివ:-*

భ. భా. భా;- నితరాం = మిక్కిలిగా చరణశీలుడైనవాడు నిచేరువు అగును. అనగా బరమశివుడు తనయష్టమూర్తులలోనివగు పంచభూతముల రూపమున నిత్యము అంతటను సంచరించును. కాన అతనికి "నిచేరువు" అను నామము సార్థకమాయెను.

*విష్ణు;-*

"నితరాంచరణశీలుడునిచేరువు" అను నర్థమును సూచించు "చలః" అను నామము "అచలశ్చలః" అను విష్ణుసహస్రసూక్తిలోగలదు. విష్ణువు వాయురూపమున అంతటను సంచరించును. అంతేకాదు. "సూర్యోనోదివ స్పాతు, వాతోఅంతరిక్షాత్; అగ్నిర్నఃపార్థివేభ్యః" అను సౌరమంత్రమున జెప్పినట్లు విష్ణువు సూర్యరూపమున దివమునందును, వాయురూపమున అంత రిక్షమునను, అగ్నిరూపమున బృథివియందును జరించును. కావున విష్ణువు నకు "నిచేరువు" అను నామము సార్థకమాయెను.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "న్+ఇ+చ్+ఏ+ర్+ఉః" అని ఆరక్షరములు కలవు, ఇవి షడృతువులను, షడింద్రియములను సూచించును. చకారము చండరుద్ర

బీజము; ఏకారము వీరభద్రబీజము. రేఫము అగ్నిబీజము. ఉకారము, వాయు బీజము. ఈయక్షరములు సావిత్రీబీజమైన నకారముతోడను, విష్ణుబీజమైన ఇకారముతోడను సంబంధము కల్గియున్నవి. అందుచే యీనామము నుపా సించువారు భయంకరాగ్నిని వెదజల్లునట్టియు, ప్రమాదకర విషవాయువు లను విసర్జించునట్టియు, మారణాయుధములను సృష్టించి, శక్తినంతటను ప్రస రింపఁజేయగలవారును, శత్రునాశనకరులును అగుదురు. అంతేకాదు విష క్రిములచే శరీరములందు ఉద్భవించువ్యాధులను, వృక్షాదులందు ఉద్భవించు వ్యాధులను, పైన పేర్కొన్నశక్తులతో నూతనౌషధములను దయారుచేసి, నిర్మూలింపగలవారలగుదురని తెలియుచున్నది.

## 52 వ నామము:- "నమః పరిచరాయ"

శివ:-

భ. భా. భా:- పరమేశ్వరుడు, సూర్యచంద్రరూపములతో అంతటను సంచరించుచు బ్రహ్మాండమును ప్రకాశింపజేయును. అంతేకాదు. సూర్యచంద్ర రూపాన్తరములైన మనోబుద్ధులుగా సకలజీవుల శరీరములందుండి, వారిని ప్రకాశింపజేయును. కావున మహాదేవునకు "పరిచరుడు" అను నామము సార్థకమాయెను.

విష్ణు:-

"ప్రాణనిలయఃప్రాణభృత్ ప్రాణజీవనః" అను విష్ణుసహస్రసూక్తిలో గల ప్రాణనిలయపదమును, "ప్రాణ+ని+లయః" అని విభజించి, సకల ప్రాణులందు నులీనుడై, నితరాం = మిక్కిలి, వారని, లయః = నశింపజేయు వాడు, అను నర్థమును, జెప్పినచో విష్ణువు హిరణ్యకశిపుడు మున్నగుదుష్టుల దేహములందు ప్రాణరూపమున ప్రవేశించి, వారికిగానరాకయే, వారిని నశింప జేసినాడని తెలియుచున్నది. విష్ణువు అగ్నిరూపమున బ్రహ్మాండమంతటను

జరించుచుండును. వాయురూపమున విహరించుచుండును. వారిలో నున్న దుష్ట శక్తులను సంహరించి, ప్రాణవాయురూపమున మెలగుచు, ఆ జీవులను బోషించును. ఇట్లు విష్ణువు పరిచరుడగుటచేతనే సహస్రసూక్తులలో జెప్పిన (1) ప్రాణనిలయుడు, (2) ప్రాణభృత్తు (3) ప్రాణజీవనుడు; అను నామములను సార్థకముచేసికొనుచున్నాడు. "నప్రాణేననాపానేన మర్త్యోజీవతికశ్చన; ఇతరేణతుజీవన్తి" అను మంత్రమునజెప్పినట్లు విష్ణువు పరిచరనామకుడై ప్రాణాగ్నివాయురూపములతో మెలగుచు జీవులకు జీవమునొసంగి, సహస్ర సూక్తిలో జెప్పిన ప్రాణద నామమును సార్థకముచేసికొనుచున్నాడు. కావుననే ఆశ్వద్ధామయొక్క అస్త్రప్రమాదమునుండి తప్పించి, ఉత్తరాగర్భస్థుడైన పరీక్షిన్మహారాజును బ్రతికించినాడు. అంతేకాదు విష్ణువు సూర్యచంద్రరూపుడై పరిచరనామకుడై సమస్తమును ప్రకాశింపజేయుటచేతనే "శిపివిష్టఃప్రకాశనః" అను విష్ణుసహస్రసూక్తిలో జెప్పిన "ప్రకాశన" నామమును సార్థకముచేసికొనుచున్నాడు. అందుచే "పరిచర" నామము విష్ణువునకును జెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "ప్+అ+ర్+ఇ+చ్+అ+ర్+అ" అని యెనిమిదక్షరములుగలవు. ఇవి అష్టసూర్యమండలములకును, శరీరమందలి అష్టచక్రములకును చిహ్నములు. ఇందు పర్జన్యదేవతాకమైన పకారమును, అగ్నిదేవతాకమైన రేఫద్వయమును, పానినడుమను చండరుద్రబీజమైన చకారమునుగలవు అవి విష్ణుదేవతాకమైన ఇకారముతోడను సర్వదేవతాకమైన అకారత్రయముతోడను, గూడియున్నవి. పర్జన్యాగ్నులును సకలదేవతలును రుద్రస్వరూపులేయనియును, వారిద్వారారుద్రుడు బ్రహ్మాండమును సృష్టించి పెంచుచున్నాడనియును తెలియుచున్నది. రుద్రదేవస్వరూపమైన ఆయ్యగ్నియే సకల జీవ

లందును స్థలజలప్రపంచములందును నానారూపములతోనుండి వాని శరీర ములనెడి పర్జన్యములను పెంచిపోషించుచున్నట్లు తెలియుచున్నది.

*53 వ నామము;- "అరణ్యానాంపతయేనమః"*

*శివ;-*

భ. భా. భా:- పరమశివుడు అయామార్గచారులను ద్రవ్యాపహారక చోరుల రూపముననుండి వారియొక్క యన్యాయార్జిత విత్తముల నపహరించి, శిక్షించుచున్నాడు. ఆతడే గ్రామనగరారణ్యములందును వృక్షాదులందును సముద్రమందునుండి, ఆయాజీవులను శిక్షించుచున్నాడు. అంతేకాదు. అరణ్యములలోనుండు సకలమునులకును పాలకుడుగానున్నాడు. కావుననే ఆతనికి అరణ్యపతినామము సార్థకమగుచున్నది.

*విష్ణు:-*

వనమందుండు పక్షులు, జంతువులు, వృక్షములు, పర్వతములు, నదులు, మున్నగువానిలో భగవంతుడైన విష్ణువుకలడు. వానిలోగొన్నింటిలో ముఖ్యమైన విభూతికలదు. విభూతికలవస్తువులన్నియును ఆయాజాతులకు ప్రభువులుగానున్నవి. ఈ విషయము భగవద్గీతయందలి విభూతియోగము నందలి శ్లోకములచే స్పష్టమగుచున్నది. ఎట్లన?

"మృగాణాంచమృగేంద్రోఽహంవైనతేయశ్చపక్షిణాం।
అనన్తశ్చాస్మినాగానాంమేరుశ్శిఖరిణామహం। అశ్వత్థస్సర్వవృక్షాణామ్"

మున్నగుశ్లోకములందుజెప్పిన మృగపక్షిపర్వతాదులన్నియును అరణ్యములే. వానికి పతి శ్రీమహావిష్ణువు. కావున ఆతనికి "అరణ్యపతి" యను నామము సార్థకమాయెను.

బీజాక్షరసంపుటి:-

ఇందు "ఆ+క్+అ+ణ్+య్+అ+ప్+అ+త్+ఇ" అని పదక్షరములుకలవు. ఇవి దశదిక్కులను, దశేంద్రియములను సూచించును. ఇందు అగ్నిబీజమైన రేఫము ముందువెనుకలను ఆకారాకారములతోగూడి యుండుటచే శక్తిపురుషులిరువురును అగ్నిస్వరూపులేయనియును, అట్టినామము నుపాసించువారు అగ్నిశక్తినుపయోగించి, శత్రుసంహారకులుకాగలరనియును దెలియుచున్నది. నందిబీజమైన ణకారమును వాయుబీజమైన యకారమును సర్వదేవతాకమైన అకారముతోగూడియున్నకారణమున యీనామము నుపాసించువారు జంతువులందేర్పడిన వాతరోగములను నిర్మూలింపగల పశు వైద్యులుకాగలరని తెలియుచున్నది. పర్జన్యబీజమైన పకారమును వాస్తుబీజ మైన తకారమును, బ్రహ్మావిష్ణుబీజములైన అకారేకారములతోగూడియుండు టచే యంత్రసహాయమున జలమును, అంతటను వ్యాపింతజేయగలవిజ్ఞాన శాస్త్రజ్ఞులు కాగలరని తెలియుచున్నది.

—: షష్ఠయజుస్సు :—

"నమస్సృకావిభ్యోజిఘాగ్ంసద్భ్యోముష్ణతాంపతయేనమః"

అర్థము:-

సృకం = వజ్రమునుబోలిన స్వశరీరమును అవన్తి = రక్షించువారు సృకావినులు. సృకావిభ్యః = వజ్రమువంటి తనశరీరమును రక్షించువారికి, నమః = నమస్కారము. జిఘాంసద్భ్యః = ప్రాణులను జంపగోరువారికి, నమః = నమస్కారము. ముష్ణతాం = కృషికులై స్వామిధాన్యమును అప హరించువారికి, పతయే = పశుపతిశివునకు. నమః = నమస్కారమగుగాక.

తాత్పర్యము:-

సా. భా:- ప్రతిమానవునకును స్వశరీరరక్షణము. ముఖ్యము. శరీరము పాంచభౌతికము. పంచభూతములును శివస్వరూపములు. కావున దన శరీరమును వజ్రమువలె దృఢముకావించుకొని, రక్షించువారిని సృకావినులు అందురు. వారిలో శివుడుకలడు. కావున సృకావినులకు నమస్కారము సమర్పించవలెను. భయకారియు, భయనాశనుడును భగవంతుడేకదా! కావున ప్రాణులను సంహరింపదలంచు జిఘాంసన్తులు శివస్వరూపులు వారికి నమస్కారము. కృషికులు అనగా వ్యవసాయముచేయువారు అన్నదాతలు. వారును శివస్వరూపులే. వారిద్వారా దేవుడు జీవులకు భయముగొల్పును. కావున కొందఱు కృషికులు తమ యజమానుల ధాన్యములను అపహరించువారై ముష్ణంతులు అగుదురు. వారికిని పాలకుడు భగవంతుడే. అందుచే ముష్ణతాంపతియైన శివునకు నమస్కారములు సమర్పించబడెను.

## 54 వ నామము:- "నమస్సృకావిభ్యః"

శివ:-

భ భా భా:- వజ్రార్థకమైన సృకపదముచే ఆయుధమాత్రము సూచింపబడుచున్నది. సృకశబ్దమునకు "గాలి, బాణము, వజ్రము, తెల్ల కలువ," అను నర్థములుకలవు. వానిలో మొదటిదగువాయువు శివస్వరూపము. దానినంతటను ప్రసరింపజేసి దానితో లోకములను రక్షించుచున్నాడు. కావున శివునకు సృకావినామము సార్థకమేయగును. అంతేకాదు. శివునిచేతియందలి బాణము నారాయణ స్వరూపము. దానితో లోకములను రక్షించువాడు కావున సృకావియాయెను. సృకమును దెల్లకలువను వికసింపజేసి రక్షించువాడు సృకావి అనగా చంద్రుడు. ఆతడును శివస్వరూపుడే. కావున

మహాశివుడు సృకావియాయెను. సృకము అనగా వజ్రాయుధము. తత్సదృశమే త్రిశూలము అదికలవాడు కావున శివుడు సృకావియాయెను. శివానుచరు లందఱును సృకావులే. వారిలో శివాంశకలదు. అందుచే సృకావులు నమస్క రింపబడుచున్నారు. సృకాదులైన అనగా వజ్రాయుధముమున్నగు ఆయుధము లెల్ల దుష్టసంహారకములే. వానిని రక్షించుదేవతలలో శివాంశకలదు. కావున సృకావులు నమస్కరింపబడుచున్నారు. సృకము వంటి ఆయుధవిశేషములను నిర్మించుటలో నిపుణులను సృకాద్యస్త్రజీవులును శివాంశసంపన్నులే. కావున వారును నమస్కరింపబడుచున్నారు.

విష్ణు:-

సృకము = వజ్రముకలవాడు సృకావి; అనగా ఇంద్రుడు. "ఆయుధానామహంవజ్రం, దేవానామస్మివాసవః" అను గీతాసూక్తులచే వజ్రము నందును, ఇంద్రునందును విష్ణువిభూతికలదు; అని తెలియుచున్నది ఇంద్రుడు వజ్రముచేతదాల్చి, త్రిలోకములను రక్షించుచున్నాడు. కావున ఇంద్రుడు సృకావి అయెను. గీతాసూక్తిచే ఇంద్రునిలో విష్ణుతేజస్సుకలదు; అని తెలియు చున్నది. విష్ణువు ఇంద్రరూపుడై తన వజ్రాయుధముచే త్రిలోకములను గాపాడుచున్నాడు. కావుననే "ఇంద్రకర్మామహాకర్మా" అను విష్ణుసహస్ర సూక్తిలో ఇంద్రకర్మపదము విష్ణుపరముగా చేర్కొనబడెను. అందుచే విష్ణువు నకు సృకావినామము సార్థకమాయెను.

*బీజాక్షరసంపుటి:-*

"స్ + ఋ + క్ + అ + వ్ + ఇ + న్" అని ఇందు ఏడక్షరములుకలవు. ఇవి సప్తమాతృకలను, సప్తమేఘమండలములను, సప్తవాయుమండలములను సూచించును. శక్తిబీజమైన సకారము బ్రహ్మబీజమైన ఋకారముతోగూడి యున్నది. కావున బైనామము నుపాసించువారు పితృగ్రహముచే జీవులలో

ఏర్పడు పసుపురంగుజబ్బును, (కామెలను) నివారించియు, రక్తపుపోటు జబ్బును నివారించియును జీవులకు ఆరోగ్యస్థితినిచేకూర్చఁగలరు. ప్రజాపతి బీజమైన కకారము, పరాశక్తిబీజమైన అకారముగూడి యుండుటచే బైనామము నుపాసించువారు సకాల వర్షములు కురిపించి, జీవులను సస్యములనుగాపాడ గలరు. వరుణబీజమైన వకారమునకును, సావిత్రీ బీజమైన నకారమును నడుమను విష్ణుబీజమైన ఇకారముకలదు. కావున బైనామము నుపాసించువారు నీటిలోగల విద్యుచ్ఛక్తిని, నూనెగనులను రత్నరాసులను బైటపెట్టి లోకములను రక్షించగల వారలగుదురు.

## 55 వ నామము:- "నమోజిఘాంసద్భ్యః"

శివ:-

భ. భా. భా:- సంహరింపదలంచుమనుష్యవిశేషులను జిఘాంసన్తులు అందురు. శివుడు సంహారకరుడు. అతడు తన సంహారశక్తిని అణుశక్తిని పశు పక్షికీటకాదులందును, మనుష్యులందును ప్రవేశపెట్టి వానిలోగల దుష్ట శక్తులను నశింపజేసి లోకములనురక్షించును. అందుచే శివునకు "జిఘాంసన్" అను నామము సార్థకమగును.

విష్ణు:-

శివుడువలె విష్ణువుకూడ చోరాద్యనేకరూపములతో సంచరించుచు దుష్టులను ధ్వంసముచేయును. కావుననే అతనికి "వీరహా" అను నామము కల్గెను. మానవులుచేయు దుష్కృత్యములను, దుష్కృత్యములుచేయువారిని సంహరించును. కావుననే విష్ణువునకు "దుష్కృతిహా" అను నామముకల్గెను. ఆయారూపములతో దుష్టమానవులను జీల్చిచెండాడును. కావున "విదారణః" అను నామముకల్గెను. పరికింపగా "జిఘాంసన్" అను నామమునకు" వీరహా, దుష్కృతిహా, విదారణః" అనునవి పర్యాయపదములగును. ఈ నామముతే

"వీరహామాధవోమధుః" "ఉత్తారణోదుష్కృతిహా" "వీరబాహుర్విదారణః" అను విష్ణు సహస్రసూక్తులలో వరుసగా చేర్కొనబడెను. అందుచే "జిఘాంసన్" అను నామము విష్ణువునకును జెల్లునని తెలియుచున్నది.

ఇందు "జ్+ఇ+ఘ్+అ+మ్+స్+అ+న్" అని యెనిమిదక్షరములుకలవు. ఇవి అష్టదిక్కులకు, అష్టశక్తులకును జిహ్వాములు. వానిలో ఇంద్రబీజమైన జకారము, విష్ణుబీజమైన ఇకారముతోగూడియుండుటచే నైనామము నుపాసించువారికి జఠిపాలనాచాతుర్యముచేకూరును. రక్తశ్యామల వర్ణరోగములుతొలగును, భైరవబీజమైన ఘకారమును మదనబీజమైన మకారమును శక్తిబీజమైన అకారముతోగూడియుండుటచే నైనామము నుపాసించువారు, నిష్కాములై బాహ్యాభ్యన్తరశత్రునాశకులై సర్వత్రజయముపొందుదురు. శక్తిబీజమైన సకారము విష్ణుబీజమైన అకారముతోడను, సావిత్రీబీజమైన నకారముతోడను గూడియుండుటచే నైనామము నుపాసించువారు నూతన వస్తునిర్మాతలై తమ ప్రజ్ఞను సర్వత్రవ్యాపింపజేయఁగలరు. మృత్యుంజయశక్తిని సంపాదించఁగలరు.

*56 వ నామము;- "ముష్ణతాంపతయేనమః"*

*శివ;-*

భ. భా. భా:- అవినీతి మార్గమున అధికలాభము నార్జించువారిని శిక్షించుటకై ధనికులధనమును అపహరించుచోరులలోజేరి ధనమపహరింపజేసి మహాశివుడు భయంకరుడగును. ధనాపహారకులకు పాలకుడైయుండును. ముష్ణంతులకు జోరులకు నాయకుడైన శివునకు "ముష్ణతాంపతి" నామము సార్థకమాయెను.

*విష్ణుః-*

"భయకృత్ భయనాశనః" అను విష్ణుసహస్రసూక్తిలో "భయకృత్" అను నామము విష్ణువునకుగలదు. ధనాపహారకులై భయముగొల్పుచోరులను ముష్ణంతులందురు. వారిలోజేరి ధనాద్యపహరణమునవారిని ప్రోత్సహించుటలో విష్ణువుకూడ శివుడంతటివాడే. కావున విష్ణువునకును "ముష్ణతాంపతి" యను నామము సార్థకమేయగును.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "మ్+ఉ+ష్+ణ్+అ+త్+ప్+అ+త్+ఇ" అని పదక్షరములుకలవు. ఇవి దశేంద్రియములను, దశదిక్కులను సూచించును. ఇందు వాయుబీజమైన ఉకారముతో మదనబీజమైన మకారముకూడియుండుటచే బైనామము నుపాసించువారు ప్రాణాయామపరులై యోగాభ్యాసముచే కామగమనాదిశక్తులను సంపాదించి, గోళాన్తరయాత్రసాగించి, నూతనవస్తుపరిశోధనచే సర్వత్రజయముపొందుదురు, లౌకికములైన ఔషధములక్కరలేకయే; ప్రాణాయామముచే సకలవాతరోగములను దొలగించుకొనగలరు. సూర్యబీజమైన షకారమును, నందిబీజమైన ణకారమును సర్వదేవతాబీజమైన అకారముతోగూడియుండుటచే బైనామము నుపాసించువారు సప్తవిధములైన సూర్యకిరణములందలి విద్యుచ్ఛక్తులనుగ్రహించి, సకలరోగనివారకులు కాగలరు. విద్యుచ్ఛక్తిచే సకల యంత్రములను నడుపగలవారలును, రక్తరోగనివారకులును గాగలరు, తకారద్వయము పర్జన్యదేవతాకమైన పకారముతోడను, సర్వదేవతాబీజమైన అకారముతోడను, విష్ణుబీజమైన ఇకారముతోడను గూడియుండుటచే బైనామము నుపాసించువారు కృత్రిమవర్షము కురిపించుయంత్రములను సృష్టించి, సర్వత్రవ్యాపింపజేసి, దేశాభివృద్ధి చేయగలవారలగుదురు.

## —: సప్తమయజుస్సు :—

"నమోఽసిమద్భ్యో నక్తంచరద్భ్యః ప్రకృంతానాంపతయేనమః"

**అర్థము:-**

అసిమద్భ్యః = ఖడ్గముగలచోరులకు, నమః = నమస్కారము. నక్తంచ రద్భ్యః = రాత్రిసంచరించువారై వీథులలో బోవువారిని బీడించుచోరులకు, నమః = నమస్కారము ఈయుభయవిధులైనచోరులును శివస్వరూపులే కాన వారికి నమస్కారము. ప్రకృంతానాం = కుత్తుకలు కత్తిరించి అపహరించు వారికి, పతయే = ప్రభువైన శివునకు నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:- అసిని = ఖడ్గమునుచేతదాల్చికొందఱుచోరులు ప్రజలను బీడింతురు. మఱికొందఱు రాత్రియందు సంచరించుచు, వీథులందు, వెడలు ప్రాణులను బాధింతురు. కొందఱు ప్రజలను సంహరించి, వారివస్తువులను అపహరింతురు. వారినే ప్రకృంతులందురు. వారికి ప్రభువు పరమేశ్వరుడు మహాదేవుడు పైనజెప్పినచోరులవలననుండి ప్రజలను రక్షించును. అట్టి పర మేశ్వరునకు నమస్కారము.

57 వ నామము:- "నమోఽసిమద్భ్యః"

శివః-

భ. భా. భా:- "అసు = క్షేపణే" అను ధాతువునుండియేర్పడిన "అసి" పదమునకు విసర్జింపబడినదియని యర్థముకలదు. విసర్జింపబడునవెల్ల అసి

పదవాచ్యములేయైనను ఖడ్గమనునర్థమునందు అసిపదమురూఢమైనది. యౌగికార్థముననుసరించిచూచినచో చేతనాచేతనవస్తువులన్నియును "సచ్చత్యచ్చాభవత్" అను శ్రుతిలోజెప్పిన పంచభూతములును బరమేశ్వరునిచే బ్రహ్మాండమున జిమ్మబడినవే. అవన్నియును అసిపదవాచ్యములే యగును. అవన్నియును దనలోనుండుటచే బరమేశ్వరుడు అసిమంతుడగును. అంతేకాదు, అసివలె = ఖడ్గమువలె త్రిశూలమును జిమ్మబడును. అసియొక్క రూపాన్తరమే త్రిశూలము. అది కలవాడగుటచే శివుడు అసిమత్పదవాచ్యుడగును. శివుని వలె ఆతని యనుచరులును అసిమంతులే యగుదురు. కాన వారికి నమస్కారము సమర్పింపబడెను. పైకారణములచే బరమేశ్వరునకు "అసిమాన్" అనునామము సార్థకమేయగును.

*విష్ణు:-*

పరశురామావతారమున విష్ణుహస్తమునగల పరశువును (గండ్రగొడ్డలియును), బలరామావతారమున చేతగల హలమును (నాగలియును) ఖడ్గమువలె జిమ్మబడునవే. అవన్నియును అసి పదముచే జెప్పదగినవే యగును. అవి కలవాడుకావున విష్ణువునకు "ఖండపరశువు, హలాయుధుడు" అను నామములు వాటిల్లినట్లు "సుధన్వాఖండపరశుః", "వనమాలీహలాయుధః" అను విష్ణుసహస్ర సూక్తులచే దెలియుచున్నది. "సర్వశస్త్రభృతాంవరః", "సర్వప్రహరణాయుధః" అను నామములును ఇట్టివే. అసిమంతుడు, ఖండపరశువు, హలాయుధుడు అను మూడు నామములును పర్యాయపదములే యగును. కావున "అసిమాన్" అను నామము విష్ణువునకు జెల్లును.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "అ+స్+ఇ+మ్+అ+న్" అని ఆరక్షరములుకలవు. అవి షడ్భూతపుటకు, శరీరమండలి షట్చక్రములకును జిహ్నములు. ఇందు

సకారాకారనకారములు మూడును శక్తిబీజములే. అందు నకారము సావిత్రి బీజము. పైమూడును సర్వజయప్రదమును మదనబీజమైన మకారముతోడను విష్ణుబీజములైన అకారేకారములతోడను గూడియున్నవి. అందుచే పైనామమును జపించువారు యుద్ధకాంక్షులై నూతనాయుధనిర్మాతలై శత్రువిజేతలుకాగలరు. ముఖ్యముగా ఈనామము శాక్తేయులైనక్షత్రియులకు ఉపాస్యమైనది. పైనామమును జపించినచో రక్తప్రసరణమునకుఁ జెందినరోగములను నిర్మూలింపగలవారలును అందులకుఁదగిన ఔషధములను దయారుచేయఁగల వారలునై రక్తపుఁబోటునకు జెందిన రోగములను బూర్ణముగా నిర్మూలింప గలరు.

*58 వ నామము:-* *"నమోనక్తంచరద్భ్యః"*

*శివ:-*

ఛ. భా. భా:- నక్తంచరులనగా రాత్రియందు సంచరించునట్టియు, రుద్రానుచరులునైయుండు భూతగణములు. వానిలో శివశక్తియుండును అందుచే రుద్రానుచరులు రాత్రించరులైన రక్కసులను జీవులను హింసించు వ్యాఘ్రాదులను, చోరులనుబట్టి హింసింతురు. శివభక్తులను గాపాడుదురు. దుర్గ, చండిక, కాళికాదేవి మున్నగుశక్తులును రుద్రునననుసరించి రాత్రియందు సంచరించును. అవిరాజులను రాజులకోటలను రక్షించుచుండును. రుద్రానుచరులలో రుద్రశక్తియుండుటచే వారు శివస్వరూపులేయన్నమాట. అందుచే భక్తులు వారికినమస్కారములు సమర్పింతురు. పైవారిలో శివశక్తి కలదు కాన శివునకు "నక్తంచరన్" అను నామముకల్గెను.

*విష్ణు:-*

నక్తంచరులనగా రాత్రియందు సంచరించు (కానవచ్చు) చంద్రుడు నక్షత్రములు, గ్రహములు మున్నగువారు వానిలో సూర్యరూపుడైన విష్ణువు యొక్క తేజస్సుకలదు. అందుచే నక్షత్రములును చంద్రుడును, గ్రహములును

రాత్రిసంచారులై (రాత్రికానవచ్చువారై, వెలుగునొసంగిలోకములను గాపాడు చున్నారు. సముద్రమునందును ఎడారులందును బయనించువారికి మార్గమును కాలమునుఎఱిగించుచు గాపాడుచున్నారు. "నక్షత్రాణామహంశశీ" అను గీతా సూక్తిచే నక్తంచరుడైన చంద్రునిలో విష్ణువిభూతికలదని తెలియుచున్నది. మృగ ములును, సర్పములును రాత్రియందెక్కువగా సంచరించును, మృగములకు రాజుమృగేంద్రుడు, సింహము. సర్పములకు రాజు వాసుకి. సింహమునందును వాసుకియందును విష్ణువిభూతికలదని "మృగాణాంచమృగేంద్రోఽహమ్. సర్పాణామస్మివాసుకిః" అను గీతాసూక్తులచే దెలియుచున్నది. తద్రూపమున విష్ణువు నక్తంచరుడగుచున్నాడు. "శిశిరః శర్వరీకరః" అను విష్ణుసహస్ర సూక్తిలోగల శర్వరీకరనామముచే విష్ణువునక్తంచరుడై రాత్రికాలమును ఏర్ప ఱచుచున్నాడని తెలియుచున్నది. కావున "నక్తంచరన్" అను నామము విష్ణువునకును జెందునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "న్+అ+క్+త్+అ+మ్+చ్+అ+ర్+అ+న్" అని పదునొకండు అక్షరములుకలవు. ఇవి ఏకాదశరుద్రులను, ఏకాదశేంద్రి యములను సూచించును. ఇందుగల నాల్గు అకారములును సర్వదైవత్యము లగుటచే "విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృత, తురీయ, నామములుగల పరమాత్మ స్వరూపములను సూచించును. ఇందు సావిత్రీబీజమైన నకారమును వాస్తుబీజమైన తకారమును, మదనబీజమైన మకారమును, చంద్రరుద్రబీజ మైన చకారమును, అగ్నిబీజమైన రేఫమును అకారముతోడనే గూడియున్నవి. అందుచే నీనామము నుపాసించువారు ప్రజలజీవితమునకు ఉపయోగపడు యంత్రములను, సంహారకరసాధనములను విద్యుచ్ఛక్తిసహాయమున నిర్మించ గలవారుకాగలరని తెలియుచున్నది. సకాలవర్షములను గురిపించగలవార లగుదురనియు దెలియుచున్నది రక్తలోపవ్యాధులను, శ్విత్రవ్యాధులను, అగ్ని ప్రకోపవ్యాధులను దొలగింపఁగలవారలగుదురనియుఁ దెలియుచున్నది.

*519 వ నామము:-* *"ప్రకృంతానాంపతయేనమః"*

*శివ:-*

భ. భా. భా:- బ్రహ్మగావించినసృష్టిలో సజ్జనులును దుర్జనులును గలరు. తప్పుమార్గమున విద్యబోధించువారును, తలకుమించినపనినిజేయ బూని తప్పుమార్గమునజేయువారును, అన్యాయమార్గమున బ్రజలనుబీడించి, మార్జించువారును దుర్జనులేయగుదురు. అట్టివారు నగరముఽందున్నను గ్రామములందున్నను, అరణ్యమందున్నను శిక్షార్హులే కదా! కావున అట్టివారిని శిక్షించుటకే అరణ్యమున క్రూరజంతువులు, కొండదొంగలునుంచబడెం. నగరగ్రామాదులందుండువారిని శిక్షించుటకే దొంగలును హంతకులునుగలరు. ఇట్లు శిక్షించి, హింసించువారిలోగల బలము భగవంతుని అంశయేయనువిషయము "బలంబలవతాంచాహమ్" అను గీతా సూక్తివలన తెలియుచున్నది. బలవంతులలోగలబలము దైవీశక్తియేయన్నమాట. కావున పరమశివుడు రాత్రిసంచారులైన ప్రాణులను సంహరించి వారి ధనాదులను గైకొను ప్రకృంతులకు ప్రభువై పరమశివుడుకలడు. అందుచేతనే ప్రకృంతపతియైన పరమశివుని భక్తులు నమస్కరించుచున్నారు. అతనికి ప్రకృంతపతినామము సార్థకమగుచున్నది.

*విష్ణు:-*

పరమాత్మచే నిర్మితమగు జగత్తునకు అంతముచేయువాడు శివుడేకాదు. విష్ణువుకూడ అపనిచేయును. కావుననే "మహాశృంగః కృతాంతకృత్" అను సహస్రసూక్తిలో విష్ణుపరముగా "కృతాంతకృత్" అను నామము చెప్ప బడెను. "అర్ద = పీడాయామ్" అను ధాతువునుండికూడ అర్దన పదము ఏర్పడి నది. అందుచే జనార్ధనపదము తప్పుచేయుజనులను బీడించు విష్ణువునకు జెందియున్నది కావుననే "విష్వక్సేనోజనార్ధనః" అను సహస్రసూక్తిలో జనార్దనపదము విష్ణుపరముగా బేర్కొనబడెను తప్పుపనులుచేసి, దుర్జనులైన

రావణాదులను బలిచక్రవర్తిని విష్ణువు అపంచినాదుకదా! రాక్షసాదిదుర్జను లనుబట్టి సంహరించువారిని ప్రక్రృంతులందురు. అట్టివారికి పతిమహావిష్ణువు. కావున విష్ణువునకును ప్రక్రృంతపతి నామము సార్థకమగును. పరికింపగా "కృతాంతకృత్, జనార్దనః, ప్రక్రృంతపతిః" అను నామములు సమానార్థక ములే యనితెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

"ప్ + ర్ + అ + క్ + ఋ + న్ + త్ + అ + ప్ + అ + త్ + ఇ" అని ఇందు పండ్రెండు అక్షరములుకలవు. అవి ద్వాదశాదిత్యులకును బుద్ధితోడి ఏకాదశేంద్రియములకును జిహ్వములు. ఇందు సర్వదేవతాకమైన అకారము, పర్జన్యబీజమైన పకారముతోడను, అగ్నిబీజమైన రేఫముతోడను గూడియుండు టచేఁ బైనామము నుపాసించువారు సూర్యజలములనుండి యుత్పన్నమైన విద్యుత్సాయమున జలప్రకోపముచే, వాతప్రకోపముచేతనుగల్గిన శారీరిక వ్యాధులను దొలగింపఁగలవారుకాగలరు. ప్రకృతిలో నేర్పడిన జలప్రమా దములను వాయుప్రమాదములను అగ్నిప్రమాదములను నివారించుశక్తులను కనిపెట్టగలవారలగుదురు. బ్రహ్మదైవత్యమైన ఋకారము ప్రజాపతిబీజమైన కకారముతోగూడియుండుటచేఁ బైనామము నుపాసించువారు బ్రహ్మజ్ఞానుత్తై క్రొత్తవిషయములను బైటపెట్టఁగలవారలగుదురు. సావిత్రీ బీజమైన నకారమును, వాస్తుబీజమైన తకారమును, విష్ణుదైవత్యమైన అకారముతో గూడియుండుటచే ఉపాసకులు నూతనయంత్రనిర్మాతలు కాగలరు. పకారమకారముతోడను, తకారము ఇకారముతోడనుగూడియుండుటచే బైనామము నుపాసించువారు జలప్రేషక యంత్రనిర్మాతలును సంపదారోగ్య వృద్ధికరులునుగాగలరు.

## —: అష్టమయజుస్సు :—

"నమఉష్ణీషిణే గిరిచరాయ కులుంచానాంపతయేనమః"

**అర్థము:-**

ఉష్ణీషిణే = శిరస్సునుగాపాడు తలపాగగల్గినట్టియును, గిరిచరాయ = పర్వతమున సంచరించు శివునకు, నమః = నమస్కారము కులుంచానాం = భూమిని అపహరించువారికి, పతయే = ప్రభువగు పరమశివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:- గ్రామమందలిజనులు వర్షాతపాది బాధలుపోగొట్టుకొను టకుఁదలపై పాగాలను ధరించెదరు. జీవులకు వారికర్మఫలమునకు అనుకూల ముగా భయముగొల్పుటకై, పరమశివుడు గ్రామజనులవలె తలపాగలనుధరించు చోరులరూపముదాల్చి, జనులమధ్యను సంచరించును. అందుచే ఉష్ణీషియ గును. మరొకప్పుడు కాష్ఠాదులను సంపాదించుటకై కొండలపై సంచరించు జనులవస్త్రాదులను అపహరించుటకు తన్మూలమునవారికి బుద్ధిచెప్పుటకును, పరమశివుడు కొండదొంగలరూపముదాల్చి కొండలపై సంచరించును అతడే మఱొకసమయమున జీవులకుగల, కు = భూమినీ, గృహక్షేత్రాదులను అప హరించువారికి ప్రభువైయుండును. అట్టి మహాదేవునకు నమస్కారము.

*60 వ నామము:- "నమఉష్ణీషిణే"*

*శివ:-*

భ. భా. భా:- ఉష్ణీషమనగా శీతాతపాదులనుండి శిరస్సును రక్షించు తలపాగ. ఒక్కొక్క దేవతకొక్కటి తలపాగగాఁగలదు. శివుని తలపాగ జటాజూటము. అది కేశములమొత్తముచే ఏర్పడినది. శివుని తలపైఁగల కేశములు వ్యోమమయములు = ఆకాశరూపములు. వ్యోమమనగా ఆకాశము. అయ్యాకాశమునుండియే వాయ్వాదిభూతములుపుట్టినవి. ఆకాశములేనిదే ఏమియును సంచరింపఁజాలవు. సకల చరాచరములకును ఆధారము ఆకాశమే. దానిని తలపాగగాదాల్చి లోకములను రక్షించువాడు పరమశివుడే. కావున అతనికి "ఉష్ణీషి" యను నామము సార్థకమాయెను.

ఉష్ణీషమనగా గిరీటము. అదికలవాడు ఉష్ణీషి ఉష్ణీషియన్నను కిరీటియన్ననుఒక్కటే. "అనన్తరూపోఽనన్తశ్రీః" అను విష్ణుసహస్ర సూక్తిలో జెప్పిన అనన్తరూపనామము విష్ణువునకుఁ బెక్కురూపములున్నట్లు చెప్పుచున్నది. విష్ణువునకుఁగల అనన్తరూపములలోఁ గిరీటిరూపము ఒకటియైయున్నది. అక్కిరీటియే నరనారాయణావతారమందలి నరుడు = అర్జునుడు. అర్జునుడుగానున్నపుడు విష్ణువునకు గిరీటినామముకలదు. రామరావణ యుద్ధమున ఇంద్రుడు పంపిన కిరీటమును = ఉష్ణీషమునుదాల్చియే, శ్రీరామచంద్రుడు యుద్ధముచేసినాడు. కావున విష్ణువునకు "ఉష్ణీషిన్" అనునామము సార్థకమగునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "ఉ + ష్ + ణ్ + ఈ + ష్ + ఇ + న్" అని ఏడక్షరములు కలవు. ఇవి యేడువాయుమండలములకును సప్తశీర్షమౌక్తికము జిహ్వాములు. ఇందు సూర్యబీజమైన షకారమును, నందిబీజమైన ణకారమును, ముందు

వెనుకలను వాయుబీజమైన ఉకారముతోడను, మాయాశక్తిబీజమైన ఈకారము తోడనుగూడియున్నవి. అందుచే నీనామము నుపాసించువారు శక్తిమహిమచే మహావైద్యులై పశువులకును = జీవులకును వాతిల్లువాతజబ్బులను బొల్లిజబ్బును నివారింపగలవారలగుదురు. సూర్యసావిత్రీబీజములైన షకారనకారములు విష్ణుబీజమైన ఇకారముతోఁగూడియుండుటచే సూర్యతేజస్సంపన్నులై సూర్యకిరణములందలి తేజశ్శక్తిని సంపాదించువారై నానావిధవ్యాధి నివారకులుకాగలరు.

## 61 వ నామము:- "నమోగిరిచరాయ"

*శివ:-*

భ. భా. భా:- గిరియందు = కైలాసమునందును, హిమాలయమునందును సంచరించుపరమశివునకు నమస్కారము. శివునకు నిలయము కైలాసగిరి. శివునితపోనిలయము హిమవంతము. కావున బరమశివుడు పైరెండు పర్వతములందును సంచరించును. అంతేకాదు. గిరి = అనగా వాక్కునందు, ప్రణవమునందును సంచరించువాడై ప్రణవస్వరూపుడుగానున్నవాడు పరమశివుడు. అందుచే ఆతనికి గిరిచరనామము సార్థకమాయెను.

*విష్ణు:-*

వెంకటేశ్వరుడు, శ్రీరాముడు మున్నగురూపములతో భద్రగిరి, శేషగిరి సింహాగిరి, మున్నగు పర్వతములందు మహావిష్ణువు సంచరించుచు, నివసించియున్నాడు. అంతేకాదు. పవిత్రమైన యజ్ఞముచేయుచోటు గిరిగా ఉన్నత స్థానముగా జెప్పబడెను. యజ్ఞస్వరూపుడైన విష్ణువు ఉన్నతస్థానమైనగిరిని యజ్ఞవేదికను అవరించియుండునుగదా! అంతేకాదు. గిరియందు = వేదవాక్కునందు బేర్కొనబడుచు సంచరించువాడు కాన మహావిష్ణువు గిరిచరుడాయెను. అందుచేతనే ఆతని ఆత్మ అమేయము. కావున అమేయాత్ముడుగా విష్ణుసహస్ర

సూక్తిలో చెప్పఁబడినాడు. కావున విష్ణువునకు గిరిచరనామము సార్థకమే యగును.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "గ్ + ఇ + ర్ + ఇ + చ్ + అ + ర్ + అ" అని ఎనిమిదక్షరములు కలవు. ఇవి అష్టసూర్యమండలములకును, శరీరమందలి అష్టచక్రములకును జిహ్వాములు. ఇందు గణపతిబీజమైన గకారము విష్ణుబీజమైన ఇకారముతో గూడియుండుటచే, అగ్నిబీజమైన రేఫము ఇకారముతో గూడియుండుటచేతను, ఈనామము నుపాసించువారు జంతువృక్షలోహాగ్నులకు జెందిన విజ్ఞానశాస్త్రమును సకల విద్యలను క్షణముగా అభ్యసించిన విద్వాంసులు కాగలరు. చండరుద్రబీజమైన చకారమును, అగ్నిబీజమైన రేఫమును సర్వదేవతాకమైన అకారముతో గూడియున్నకారణమున ఈనామము నుపాసించువారు భూతప్రేతపిశాచాది బాధలను దొలగింపఁగల వైద్యులుకాఁగలరు.

*62 వ నామము:- "కులుంచానాంపతయేనమః"*

*శివ:-*

భ. భా. భా.- సకలజీవస్వరూపుడును సకల జీవశాసకుడునగు పరమేశ్వరుడు సకలరాజులభూములను, గృహక్షేత్రాదులను అపహరించు దొంగలకు ప్రభువై ఆయాజీవులకు కర్మఫలానుకూలముగా కష్టములను జేకూర్చి, వారిపుణ్యపాపఫలములను వారిచే అనుభవింపఁ జేయువాడగును. విచిత్ర వ్యసనములను ఉత్పాదించి, జీవులధారణపోషణలకు అనుకూలములగు ధనములను అపహరించువారికిఁ ప్రభువై శిక్షించువాడగును. దుష్టకులములను, దేశధ్వంసకగణములను దొలగించువారికి నాయకుడై రక్షకుడగును. కావున బరమశివునకు "కులుంచపతి" నామము సార్థకమగును.

విష్ణుః-

"లుంచ = అపనయనే" అను ధాతువునకు దొలగించుట అని యర్థము కలదు. కు = కత్సితమైనది; చెడ్డది; చెడుగు అని యర్థము కు + లుంచులు = చెడుగును దొలగించువారు; సత్ప్రవర్తకులన్నమాట. అట్టికులుంచులకు = సత్ప్రవర్తకులైన సజ్జనులకు పతి, కులుంచపతి = అనగా సజ్జనులకు ప్రభువు అన్నమాట. విష్ణువు సజ్జనులకు ప్రభువై. చెడుగును లోకమున దొలగించి, ధర్మమును స్థాపించును. కావున కులుంచపతి యనునామము విష్ణువునకు సార్థకమాయెను. చెడుగును దొలగించు ఇంద్రాదులకు ప్రభువై విష్ణువు హిరణ్యాక్షాదులను సంహరించి సజ్జనపతియైనాడుకదా! ధర్మకృత్ = ధర్మమును జేయించువాడు; కాన విష్ణువునకు ధర్మకృత్ అను నామము సార్థకమైనట్లు "ధర్మకృత్ధర్మీ" అను విష్ణుసహస్రసూక్తివలన దెలియుచున్నది. పరికింపగా "కులుంచపతి, ధర్మకృత్" అను నామములు సార్థకములేయని తెలియుచున్నది. నైకాత్మానైకకర్మకృత్" అను విష్ణుసహస్రసూక్తిలో జెప్పినట్లు విష్ణువు లోకములందు ఎన్నోసత్కర్మలనుజేసి, చేయించుచున్నాడు అని తెలియుచున్నది. కావున విష్ణువు కులుంచపతి నామకుడనుట సార్థకమే యగుచున్నది. కులుంచనమునకే = సత్కార్యప్రవర్తనకే విష్ణువు దశావతారములు ధరించి, రావణాదులను సంహరించినాడని తెలియుచున్నది. అందుచే విష్ణువు కులుంచపతియాయెను.

బీజాక్షరసంపుటి:-

ఇందు "క్ + ఉ + ల్ + ఉ + మ్ + చ్ + అ + ప్ + అ + త్ + ఇ" అని పదునొకండు అక్షరములుకలవు. అవి ఏకాదశరుద్రులకును, ఏకాదశేంద్రియములకును చిహ్నములు. ఇందు సర్వదేవతాకములైన అకారములురెండును, వాయుదేవతాకములైన ఉకారములురెండును, విష్ణుదేవతాకమైన ఇకారమును

గలవు. కాన( బైనామము నుపాసించువారు ప్రాణాయామపరులై సకలదేవతా శక్తులను సంపాదించుకొని, తమప్రతిభను దేశమందంతటను వ్యాపింపజేసి కొని, రక్తవాతరోగములను దొలగించువారలై సర్వులను రక్షింపగలవారలగు దురు. వాయుదేవతాకమైన ఉకారముతో ప్రాజాపత్యమైన కకారముకూడి యుండుటచే( బైనామము నుపాంచువారు జలసేచనయంత్రనిర్మాతలై వృష్టి కారకులుకా(గలరు. పృథివీబీజమైన లకారము, మదనబీజమైన మకారమును ఉకారముతోగూడియుండుటచే( బైనామము నుపాసించువారు ప్రాణశక్తి సహాయమున భూప్రవిష్టులై అందలి అమూల్యవస్తువులను లోహాదులను బైట పెట్టి ప్రజలకోర్కెలను దీర్చ(గలవారలగుదురు. చండరుద్రబీజమైన చకారము అకారముతోగూడియుండుటచే బైనామము నుపాసించువారు శక్తిశివులను ఇరువురను ఆరాధించి, దుష్టశక్తులను దుష్టవ్యాధులను నిర్మూలించి సర్వ వశీకరులుకాగలరు. పర్జన్యబీజమైన పకారము అకారముతోడను వాస్తుబీజ మైన తకారము ఇకారముతోడను గూడియుండుటచే, బైనామము నుపాసించు వారు పదార్థ విజ్ఞానశాస్త్రవిమర్శకులును జలోదరాదివ్యాధినివారకులును కా(గలరనితెలియుచున్నది.

—: నవమయజుస్సు :—

"నమఇషుమద్భ్యోధన్వావిభ్యశ్చవో నమః"

అర్థము:-

ఇషుమద్భ్యః = బాణములుగల్గినట్టి మీకు, నమః = నమస్కారము. ధన్వావిభశ్చ = ధనుస్సులుగల్గినట్టి, వః = మీకు, నమః = నమస్కారము.

తాత్పర్యము:-

సా. భా:- నేరములుచేసిన రోషపాదులను భయపెట్టుచున్న, చేతు లందు బాణములు దాల్చినవారిలో మహాదేవుడుకలడు. అక్షీణమష్టులను

శిక్షించుటకు ధనుస్సులుదాల్చిన వారిలోను మహాదేవుడు కలడు. బాణధారులును, ధనుర్ధరులునగువారిరూపముననుండి, మహాశివుడు భయంకరుడై సన్మార్గవర్తుల భయమును నశింపజేయువాడునైయుండెను అట్టి మహాదేవుని నిత్యము భక్తులు నమస్కరించుచుందురు.

*63, 64 నామములు;- "నమఇషుమద్భ్యోధన్వావిభ్యశ్చ"*

*శివ + విష్ణు:-*

భ. భా. భా:- ఇంతకుముందున్నమంత్రములందు "వః" అను యుష్మచ్ఛబ్దములేదు. ఇది మొదలు కొన్ని మంత్రములందు యుష్మచ్ఛబ్దము కలదు. ఇంతకుముందున్న మంత్రములందు దఅచుగా ఆయా వస్తువులకు ప్రభువగు రుద్రునకు నమస్కారములు సమర్పింపబడెను. ఇది మొదలు ప్రతినామమునందును ఆయావస్తువులతోగూడి ప్రత్యక్షమైన శివునకు నమస్కారములు సమర్పింపబడుచుండెను. రుద్రాంశసంభూతులను నమస్కరింపఁబడుచున్నారు. ఈ రెండు విశేషణములతో మంత్రవ్యాకమును భేదించుటకు ఈమంత్రములందు రెండు నమస్కారములు ప్రయోగింపబడినవి

శివకేశవులిరువురును ఇషుమంతులే. అనగా భక్తుల శత్రువులను, దుష్టులను, రాక్షసాదులను భయపెట్టుటకు చేతబాణములను, బాణస్థానీయములైన త్రిశూలమును చక్రమును గదాఖడ్గములను ధరించియుండిరి. అంతేకాదు. వారిలో శివుడు పినాకనామక ధనుస్సును, విష్ణువు శార్ఙ్గనామకధనుస్సును దాల్చియుండిరి. కాన వారికిరువురికిని, "ఇషుమంతుడు, ధన్వావి అను నామములు సార్థకములైయున్నవి." "సర్వప్రహరణాయుధుడు" అను విష్ణు సహస్రనామము "ఇషుమంతుడ''ను దానికిఁ బర్యాయపదమును, "ధనుర్ధరో ధనుర్వేదః" అను దానియందలి ధనుర్ధరనామము "ధన్వావీ" అను దానికిని బర్యాయపదమునైయున్నవి కావున "ఇషుమంతుడు, ధన్వావి" యనునామము లచే శివకేశవులు ఇరువురును జెప్పఁబడి నమస్కరింపఁబడుచున్నారు.

*బీజాక్షరసంపుటి:-*

*63 వ నామము:-* *"ఇషుమాన్"*

అను నామమున "ఇ+ష్+ఉ+మ్+అ+న్" అని ఆరు అక్షరములుకలవు అవి షడృతువులను, షడింద్రియములను సూచించును. ఇందు పరాశక్తిబీజమైన, అకారముతోబాటు, విష్ణుబీజమైన ఇకారము, వాయుబీజమైన ఉకారమునుగలవు. వానినడుమను సూర్యబీజమైన షకారమును, మదనబీజమైన మకారమును, సావిత్రీబీజమైన నకారమునుగలవు. పైనామము నుపాసించువారు ప్రాణాయామపరులును, శాక్తేయులును, సూర్యోపాసకులును, సావిత్ర్యుపాసకులునుకాఁగలరు. అందుచే వారు, ప్రజాజీవితమున కవసరమగు పంటలను పండించఁగలవారలును, విజ్ఞానశాస్త్రవేత్తలును ప్రాణవాయూత్పత్తికారకులును, వాతరోగనివారకులును, పంద్రెండు విధములగు పుట్టువ్రణములను రూపుమాపఁగలవారలును కాఁగలరని తెలియుచున్నది.

*64 వ నామము:-*

"ధన్వావీ" అను నామమున "ధ్+అ+న్+వ్+అ+వ్+ఈ" అని ఏడక్షరములుకలవు. ఇవి సప్తధాతువులకును, సప్తఋతువులకును చిహ్నములు. ఇందు సర్వదేవతాకమైన అకారమును పరాశక్తిబీజమైన అకారమును మాయాశక్తిబీజమైన ఈకారమునుగలవు. ఇవి శక్తియొక్క అనగా ప్రకృతియొక్క ప్రాధాన్యమును దెలియఁజేసి, పైనామము నుపాసించువారికి సమస్తమును వశముగావించును. ధనబీజమైన ధకారమును, సావిత్రీబీజమైన నకారమును, వరుణబీజమైన వకారద్వయమునుగలవు. వీనితోఁగూడిన పైనామము నుపాసించువారికి ధనమార్జించుక్రొత్తమార్గములును, జలమున అనగా సముద్రమునగల ధనరాసులను బైటపెట్టు శక్తియును లభించును అంతేకాదు భూసిక్షిప్తములైన ధనములను గనులను సముద్రమును బరిశోధించునపుడు ప్రాప్తించురోగములను నిర్మూలించు శక్తియును లభించును.

## —: దశమయజుస్సు :—

"నమఆతన్వానేభ్యః ప్రతిదధానేభ్యశ్చవోనమః"

**అర్థము:-**

తన్వానేభ్యః = ధనుస్సునత్రాటిని ఆరోపించు, వః = మీకు, నమః = నమస్కారము; ప్రతిదధానేభ్యశ్చ = ధనుస్సున బాణమును సంధించు వః = మీకు, నమః = నమస్కారము,

**తాత్పర్యము:-**

సా. భా:- తను = విస్తారే; తను = శ్రద్ధోపకరణయోః; డుధాఞ్ = ధారణపోషణయోః. తనోతి = నిశ్చయించు, వ్యాపించు, కప్పు, పుట్టించు. ప్రతిదదాతి = ఇచ్చు, పట్టుకొను, కలిగియుండు; అని పైధాతువులకు అర్థములు గలవు. పరమశివుడు యజ్ఞవిఘ్నకారులగు రక్కసులను శిక్షించుటకును, సంహరించుటకును ధనుస్సునత్రాటిని సంధించును. అంతేకాదు. ధనుస్సున బాణములను సైతము సంధించి, విడిచి, రక్కసులను బెదరగొట్టియో, సంహరించియోయజ్ఞములను, సత్కార్యములను గాపాడిచేయించును. అందుచే యజ్ఞ రక్షకరూపముననున్న మహాదేవుని భక్తులు నమస్కరించుచున్నారు.

### 65 వ నామము:- శివ:- "నమఆతన్వానేభ్యః"

భ. భా. భా:- ప్రకృతిలోఁ జేతనాచేతనములను సృష్టించుటకు ప్రకృతియైన పరాశక్తికిఁ దోడ్పడుటకై, పరమశివుడు పంచభూతాదుల రూపమున విస్తరించుచున్నాడు. అగ్నివాయు సూర్యస్వరూపుడై అంతటను వ్యాపించుచున్నాడు. యజ్ఞవిధ్వంసకుల సంహరించుటకై మేరురూపధనుస్సున ఆదిశేష రూపమైన త్రాటిని ఆరోపించుచున్నాడు. త్రిపురాసుర సంహారమునకును ఇట్లే గావించెను. జగద్రక్షకులైన వీరులందు తన యంశమును బ్రవేశపెట్టి వారిచే సైతము వింటిత్రాటినిఁ గట్టించుచున్నాడు. కావున శివునకు "ఆతన్వాను"డను నామము సార్థకమాయెను.

విష్ణుః-

తను ధాతువునకు శ్రద్ధోపకరణములను నర్థముకలదుకదా! దాని ననుసరించి, సర్వప్రాణులందును బుద్ధ్యాత్ములుగానుండి విష్ణువు సత్కార్యాచరణకై శ్రద్ధచేకూర్చుచున్నాడు. కావున అతడు అతన్వాననామకుడాయెను. సర్వప్రాణులకుఁ బ్రియమొనర్చుచు అతడు ప్రీతిని చేకూర్చుచున్నాడు. అందు చేతనే విష్ణువునకు "ప్రియకృత్ప్రీతివర్ధనః" అను నామములేర్పడెను. తను ధాతువునకు వ్యాపించుట అను నర్థముకలదు. దానిననుసరించి, విష్ణువు సర్వకార్యవ్యాప్తికలవాడై సకలప్రాణులకును ప్రీతినిజేకూర్చుచున్నాడని తెలియుచున్నది. "ఆకాశవత్సర్వగతశ్చనిత్యః" అను శ్రుతిచే ఆకాశమువలె సర్వవ్యాపకుడైన విష్ణువునకు అతన్వానుడను నామము సార్థకమైనట్లు తెలియుచున్నది. సర్వప్రాణులను బ్రహ్మరూపముననుండి పుట్టించువాడు, కావున, విష్ణువు అతన్వాన నామకుడాయెననియును జెప్పవచ్చును.

బీజాక్షరసంపుటి:-

ఇందు "అ+త్+అ+న్+వ్+అ+న్+అ" అని ఎనిమిదక్షరములుకలవు. ఇవి అష్ట ప్రకృతులకును అష్టపత్రములకును జిహ్వాములు. ఇందు వాస్తుబీజమైన తకారమును సావిత్రీబీజమైన నకారమును వరుణబీజమైన వకారమును సర్వదేవతాబీజమైన అకారద్వయముతోడను పరాశక్తిబీజమైన ఆకారద్వయముతోడను గూడియుండుటచే పైనామము నుపాసించువాడు జలతరణయంత్రములను, జలస్థవస్తుపరిశోధక యంత్రములను జేకూర్చువాడు కాఁగలడనియును, పాపనాశకుడును, రోగనాశకుడునుగాఁగలడనియును దెలియుచున్నది. తను = విస్తారే, వ్యాప్తౌ, అచ్ఛాదనే ప్రజననే అను నర్థములచేఁ పైవిషయము తెలియుచున్నది.

66 వ నామము:- "ప్రతిదధానేభ్యశ్చవోనమః"

శివ:-

భ. భా. భా:- దుష్టసంహారసందర్భమున మహాదేవుడు వింటిత్రాటితో బిగింపఁబడిన ధనుస్సున శరములను సంధించెను. తన యంశతోనిండిన రాజులచేతను వీరులచేతను వారివారి ధనుస్సులందు బాణములను సంధింపఁ జేసెను. అందుచే భక్తులు శివునకేకాక, శివాంశ సంపన్నులకును చేతులు మోడ్చి, నమస్కరించుచున్నారు. ప్రతిపూర్వకమైన ద ధా న ప ద ము "డుధాఞ్ = ధారణే" అను ధాతువునుండియేర్పడినది. ధాఞ్ ధాతువునకు, ధారణము, పోషణము ఇచ్చుట, పట్టుకొనుట, కలిగియుండుట అను నర్థములు కలవు. ఈయర్థములను బరిశీలించినచో మహాదేవుడు తనలో జీవులను ధరించియేకాక, అగ్నివాయు సూర్యచంద్రరూపములనుండి తన రక్షణలోఁ గల జీవులకు ఓజోగుణమును, ప్రాణశక్తిని, తేజస్సును, ఆహారమును ఒసంగి పోషించుచున్నాడని తెలియుచున్నది. అందుచే మహాశివునకు ప్రతిదధాన నామము సార్థకమగుచున్నది.

విష్ణు:-

శివుడువలె విష్ణువును దుష్టసంహారమునకై ధనుస్సున బాణములను సంధించెను. "బలంబలవతామస్మి" అను గీతాసూక్తిలో జెప్పినట్లు ధనుర్ధరులైన వీరులలో విష్ణ్వంశమైన బలముకలదు. వారు దుష్టశక్తిసంహారమునకై ధనుస్సులందు బాణములను సంధింతురు. కాన విష్ణువునకు ప్రతిదధాన నామము సార్థకమేయగును. "స్వధృతః స్వాస్థ్యః" అను విష్ణు సహస్రసూక్తిలోని "స్వధృత" నామమును బరిశీలించినచో విష్ణువు తనమహిమగల భూమ్యగ్న్యాదులచేధరింపబడినట్లు తెలియుచున్నది. "సభగవాన్ కస్మిన్ ప్రతిష్ఠితఇతి, స్వేమహిమ్ని" అనుశ్రుతిచే పైవిషయమే ప్రకటింపఁ బడుచున్నది. కావున "ప్రతిదధానుడు, స్వధృతుడు" అను నామములు సమా

నార్థకములని తెలియుచున్నది. "విధాతాకృతలక్షణః; అనాదినిధనోధాతా" అను సహస్రసూక్తులందలి, "విధాతా, ధాతా" అను నామములకును, ప్రతిద ధానుడనునామమునకును ధరించువాడనియు, ధరింపబడువాడనియును అర్థ ములుకలవు. భగవంతుడైన విష్ణువు సర్వభూతములను, శేషదిగ్గజభూధరము లను విశేషముగా ధరించుటయేకాక, అనంతాదిరూపములతో విశ్వమంతటిని ధరించుచున్నాడు, శ్రీకృష్ణావతారమున ఆతడు గోవర్ధన పర్వతమును తన చిటికినవ్రేలితో ధరించెనుగదా! కావున విధాత, ధాత, ప్రతిదధానుడు అను నామములు సమానార్థకములనియును అందుచే ప్రతిదధాననామము విష్ణువు నకుఁ జెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "ప్+ర్+ఉ+త్+ఇ+ద్+అ+ధ్+అ+న్+అ" అని పదునొకండు అక్షరములుకలవు. అవి ఏకాదశరుద్రులకును, శరీరమందలి ఏకాదశ ద్వారములకును చిహ్నములు. ఇందు సర్వదేవతాబీజములైన మూడ కారములును పరాశక్తిబీజమైన అకారమును, విష్ణుబీజమైన ఇకారమునుగలవు. అవి పర్జన్యబీజమైన పకారముతోడను, అగ్నిబీజమైన రేఫముతోడను, వాస్తు బీజమైన తకారముతోడను, దుర్గాబీజమైన దకారముతోడను, ధనదబీజమైన ధకారముతోడను, సావిత్రీబీజమైన నకారముతోడను గూడియున్నవి. అందుచేఁ బైనామము నుపాసించువారు, విద్యుచ్ఛక్తినిబోలిన అణుశక్తిని, విష వాయువులుగల ఆయుధములను జలశక్తిని సంపన్నములైన ఆయుధములను సృష్టింపఁగలవారలగుదురు. అంతేకాదు. తదుపాసనాబలముచే బైయాయుధములచేఁ గల్గుప్రమాదములను, నివారింపఁగల వారలును, యంత్ర నిర్మాణాపసరమగు ధనమార్జింపగలవారలును, మారణాయుధప్రయోగముచే వాటిల్లు వ్యాధులను నిర్మూలింపఁగలవారలను అగుదురనితెలియుచున్నది.

—; ఏకాదశయజుస్సు ;—

"నమఆయచ్ఛద్భ్యో విసృజద్భ్యశ్చవోనమః"

**అర్థము;-**

ఆయచ్ఛద్భ్యః = వింటిత్రాటిని ఆకర్షించునట్టి, వః = మీకు, నమః = నమస్కారము. విసృజద్భ్యశ్చ = ధనుస్సునుండి బాణములను విడుచునట్టి, వః = మీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము;-**

సా. భా:- మహాదేవా! ఓంకారరూపమగు నీధనుస్సునుండి సావిత్రీ రూపమగు త్రాటిని నీవు ఆకర్షించుచున్నావు. పౌరాణికకథచే నీధనుస్సు మేరువనియు, ఆదిశేషుడు నీవింటిత్రాడనియును దెలియుచున్నది ఇందలి యంతరార్థమేమన? మేరువు ఐహికజీవనమునకు అనుకూలమగు ధనమునకు నిలయము. ఆదిశేషుడు విద్యలకు నిలయము. నీవు విద్యలను జీవులకు అంద జేయుటకై సకల విద్యాస్వరూపమైన శేషుని ఆకర్షించుచున్నావన్నమాట. కావున నీకును, నీయంశముకల జీవులకును నమస్కారము. నీధనుస్సు నందలి బాణము శ్రీమన్నారాయణ స్వరూపము. దానిని విడిచి, నీవు త్రిపు రాసురుని వధించి, ముల్లోకములను రక్షించితివికదా! అట్లే నీయంశముకల రాజులు దుష్టసంహారమునకై బాణములను విడుచుచున్నారు కావున నీకును, నీతోబాటు జీవులకును నీభక్తులు నమస్కరించుచున్నారు.

*67 వ నామము:-* *శివ:-* *"నమఆయచ్ఛద్భ్యః"*

భ. బా. భా:- మహాదేవ! దుష్టసంహారము, శిష్టరక్షణమేకదా! నీకృత్యములు. అందులకై నీవు ధనుస్సున బాణములను సంధించి ఆకర్షించు చున్నావు. పరికింపగా నీ ధనుర్బాణములు సామాన్యములుకావు నీధనుస్సు

ప్రణవమైన ఓంకారము. దానికి గట్టినత్రాడు సావిత్రీదేవి. అందలి బాణము సోముడు సర్వులకు నుపాస్యమైనది ప్రణవము అది బ్రహ్మస్వరూపము. అందుకుండలినీశక్తిరూపమైన సావిత్రీదేవి త్రాడుగా సంధింపబడి, ఆమె తన గుణములైన సత్త్వరజస్తమస్సులతో సృష్టిగావించి, అందుగల చేతనాచేతనము లనన్నింటిని తనతేజస్సుతో, నిండిన చంద్రునిచేఁ బోషింపఁజేయుచున్నది. ఆ చంద్రుడు శివుని ధనుస్సునందలి బాణము. కాన అతడు శివునిచే ఆకృష్టుడై అతని అజ్ఞానుసారము జీవులను బోషించుచు, అచేతనములను సారవంతములుగా జేయుచున్నాడు. అంతటి ఘనకార్యము శివాధీనమగుట చేతనే శివునకు "ఆయచ్ఛన్" అను నామము సార్థకమాయెను.

విష్ణుః-

ఆఙ్ పూర్వకమగు "దా" ధాతువునకు ఆకర్షణము అనగా పరిగ్రహణము అను నర్థముకలదు. భగవంతుడైన విష్ణువు శరణార్థులచే ఆకర్షింపబడుచున్నాడు. అనగా గ్రహింపబడుచున్నాడు. తానునేరుగా జీవులను ఆకర్షించుచున్నాడు. భక్తులు సమర్పించువానిని గ్రహించుచున్నాడు. భక్తులొసంగు వస్త్రపుష్పాదులకు అలరి, స్వీకంచి, వారి ఇంద్రియాశ్వములను త్రాడువంటి తన యనుగ్రహముతో బంధించి గ్రహించుచున్నాడు. వారిని నియుక్తచే తస్కులఁగావించుచున్నాడు. కావుననే విష్ణువునకును "ఆయచ్ఛన్" అను నామము సార్థకమైయెల్లును. పైవిషయమే "పరమేష్ఠీ పరిగ్రహః" "సంకర్షణోఽచ్యుతః" "ప్రగ్రహోనిగ్రహః" అను విష్ణుసహస్రసూక్తులలో గల," పరిగ్రహః, సంకర్షణః, ప్రగ్రహః" అను నామములచే వ్యక్తమగుచున్నది. పరికింపగా పైనామములును, "ఆయచ్ఛన్" అను నామమును సమానార్థకములేయని తెలియుచున్నది. కావున "ఆయచ్ఛన్" అను నామము విష్ణువునకును సార్థకమగుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "అ+య్+అ+చ్+ఛ్+అ+త్" అని యేడక్షరములు కలవు ఇవి సప్తమాతృకలకు, జ్ఞానేంద్రియములతోడి మనోబుద్ధులకును జిహ్వాములు. ఇందు శక్తికి జెందిన బీజములు ఆకారఛకారములు అవి చండరుద్రబీజమైన చకారముతోడను, వాస్తుబీజమైన తకారముతోడను, వాయుబీజమైన యకారముతోడను గూడియున్నవి. పైనామము శాక్తేయులకు బరమోపాస్యము పైనామము నుపాసించువారు క్షుద్రదేవతలను దొలగింపఁ గలవారును, ప్రాణాయామప్రక్రియచే వాతరోగనివారకులునుగాఁగలరు. నూతనాస్త్ర నిర్మాతలై శత్రునాశకులుకాఁగలరు; అని తెలియుచున్నది.

*68 వ నామము:- శివ:- "విసృజద్భ్యశ్చవో నమః"*

భ. ఖా. బా:- పరమశివుడు దేవాదులను, జంతువులను వృక్షములను బీడించుదుష్టజీవకోటిని సంహరింపను, తన ధనుస్సునుండి, శరములను, జిమ్ముచున్నాడు. దేవాదులను రక్షించుచున్నాడు. అనాడు త్రిపురాసురుడు లోకములను బీడించుచుండగా వానిని సంహరించుటకై నారాయణాస్త్రమును విడిచినాడు. లోకాలను రక్షించినాడు. చేతనాచేతనములను బోషింప శరముగానున్న చంద్రుని లోకమున విరాజిల్ల విడిచినాడు. అతని భక్తులైన అర్జునాదులుకూడ దుష్టసంహారమునకై బాణములు విడిచినారు. కావుననే శివునకును, శివాంశసంపన్నులైన జీవులకును, "విసృజన్" అను నామము సార్థకమాయెను.

*విష్ణు:-*

"జ్యోతిషాం రవిరంశుమాన్" "ధేనూనామస్మి కామధుక్" అను గీతాసూక్తులనుబట్టి, విష్ణువు సూర్యరూపుడును కామధేను రూపుడునై యున్నట్లు తెలియుచున్నది. "నిగృహ్ణామ్యుత్సృజామిచ" అను గీతాసూక్తిననుసరించి

చూచినచో విష్ణువే తాపేలుతనయవయవములనువలె సర్వమును దనలోనికి గ్రహించుచు విడుచుచున్నాడని తెలియుచున్నది. ప్రళయమున గ్రహించుచు సృష్టిసమయమున విడుచుచున్నాడన్నమాట. విష్ణువు సూర్యరూపమున నేల మీదితేమను గ్రహించి, పర్జన్యరూపమున (మేఘరూపమున) నీటిని విడుచు చున్నాడన్నమాట అనగా సర్వకామవర్షకుడన్నమాట. వాయురూపమున ప్రాణాదివాయువులను విడుచుచున్నాడన్నమాట. అందుచేతనే "పర్జన్యః పావనోఽనిలః" అను విష్ణుసహస్రసూక్తిలో విష్ణుపరముగా పర్జన్యుడు, అనిలుడు" అను నామములు పేర్కొనఁబడినవి. పైనామములందలి విషయమే ఇందు "విసృజత్" అను పదముచేఁ జెప్పఁబడెను. కావున "విసృజత్" అను నామము విష్ణువునకును జెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "వ్ + ఇ + స్ + ఋ + జ్ + అ + త్" అని యేడక్షరములు కలవు ఇవి సప్తధాతువులకును సప్తమేఘమండలములకును జిహ్వాములు. ఇందు బ్రహ్మవిష్ణుమహేశ్వరబీజములైన ఋకారేకారాకారములుకలవు. వానితో వరుణబీజమైన వకారమును, శక్తిబీజమైన సకారమును, ఇంద్రబీజమైన జకారమును, సావిత్రీబీజమైన తకారమును, గూడియున్నవి. అందుచే పైనామము నుపాసించువారు సర్వమును వశమొనర్చుకొని, సమస్తమును, రక్షింపగలవారును, శత్రునాశకులును, పాపనాశకులును, రోగనాశకులునై సమస్తమును స్థిరముగానుంచఁ గలవారలగుదురు.

## —: ద్వాదశయజుస్సు :—

"నమోఽస్యద్భ్యో విధ్యద్భ్యశ్చవో నమః"

**అర్థము:-**

అస్యద్భ్యః = లక్ష్యమువరకును బాణమును విడుచునట్టియును, విధ్య ద్భ్యశ్చ = లక్ష్యమునందు బాణమును ప్రవేశపెట్టునట్టి, వః = మీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:- పరమేశ్వరుడు యజ్ఞరక్షకుడు కాన, యజ్ఞధ్వంసకులను గురిచూచి, బాణములను జిమ్మి, వారిని దొలగించును. యజ్ఞమును ధ్వంసము చేయఁదలపెట్టిరేని వారిదేహములందు బాణములను జొనిపి, గాయపఱచి, వారిని దొలగించియు రక్షించును. కావున బరమేశ్వరునకును, వానికృత్యముల నాచరించువారికిని నమస్కారములను భక్తులు సమర్పింతురు

**69 వ నామము:-** **శివ:-** "నమోఽస్యద్భ్యః"

ప. భా. భా.- "అసు = క్షేపణే" అను ధాతువునుండియేర్పడినఅస్యత్ అను పదమునకుఁ జిమ్ముట అని అర్థము. పరికింపగా సకల కార్యకర్తయును బరమేశ్వరుడే. అతడు భూతప్రేతపిశాచరాక్షసబాధ తొలగించి, భక్తులను రక్షించుటకు వారిపై బాణములను చిమ్ముచున్నాడు. వారిని దూరముగా తొల గించుచున్నాడు కావునఁ బరమేశ్వరునకును, అతని యంశగల జీవులకును "అస్యత్" అను నామము వాటిల్లెను

*విష్ణు:-*

భగవంతుడు విష్ణువు శ్రీరాముడై జన్మించి విశ్వామిత్రయాగసంరక్షణ సందర్భమున తాటకపైని, మారీచ సుబాహులపైని బాణములను విమ్మెను. కాన అతనికి "అస్యత్" అను నామము సార్థకమేయగును.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "అ+స్+య్+అ+త్" అని యైదక్షరములుకలవు. అవి పంచభూతములకును, పంచేంద్రియములకును వలక్షకములు ఇందుశక్తిబీజమైన సకారమును, వాయుబీజమైన యకారమును, వాస్తుబీజమైన తకారమును అకారముతోగూడియున్నవి. కావున నీనామము నుపాసించువారు వాయు సహాయమున అరుగునట్టియు శక్తిసహితములైన వాయవ్యాస్త్రములను నిర్మించి, స్థలజలవాయుమార్గములందు శత్రువులను బఱుగెత్తించిఓడించి, జయముచేకూర్పగలవారలగుదురని తెలియుచున్నది. బాష్పవాయువృష్టివిషవాయువు మున్నగు వానితోగూడిన యంత్రములను అణుశక్తి సంపన్నములను నిర్మింపగల వారలగుదురు. వాతరక్తరోగనివారకులునుగా గలరని తెలియుచున్నది.

## *70 నామము:- శివ:- "నమోవిధ్యద్భ్యః"*

భ. భా. భా:- మహాశివుడు స్వయముగా అంధకాది రాక్షసులను బాణములతోగొట్టి సంహరించినాడు. సూర్యేంద్రాది రూపధారియై జంభాసురాదులనుగొట్టి సంహరించినాడు. ఈనాడును విజ్ఞానులైన యోధుల రూపములను దాల్చియు శత్రువులను తాడించుచున్నాడు. కావున బరమేశ్వరునకు "విధ్యత్" అను నామము సార్థకమాయెను.

*విష్ణు:-*

భగవంతుడు మహావిష్ణు స్వరూపుడై దశావతారములనుదాల్చి, హిరణ్యాక్ష హిరణ్యకశిపులను రావణాదులను శరములతోతాడించి, సంహరించెను కావున విష్ణువునకును "విధ్యత్" అను నామము చెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి;-*

ఇందు "వ్+ఇ+ధ్+య్+అ+న్" అని ఆరక్షరములుకలవు. ఇవి షడ్ర్తువులకును షడింద్రియములకును జిహ్నములు ఇందు వరుణబీజమైన వకారమును ధనదబీజమైన ధకారమును, వాయుబీజమైన యకారమును సావిత్రీబీజమైన నకారమునుగలవు, అవి సర్వదేవతాబీజమైన అకారముతోడను గూడియున్నవి. అందుచేఁ బైనామము నుపాసించువారు ధారణపోషణశక్తులు గలవాయుయంత్రములను, వారుణయంత్రములను, జలయంత్రములను, సూర్యతేజస్సంపన్నములైన అగ్నియంత్రములను నిర్మించి, స్థలజలాకాశము లందలి శత్రువులను, విషక్రిములను, నిర్మూలింపఁగలవారలగుదురు. వాయు ప్రకోపమువలనను జలప్రకోపమువలనను అగ్నిప్రకోపమువలనను,శరీరమున నంభవించురోగములను నిర్మూలించి, ప్రాణులకు ఓజశ్శక్తిని, పోషణశక్తిని, జేకూర్పగలవారలగుదురనియు, మహాయోగులు కాగలరనియు, జలస్తంభన వాయుస్తంభనాదిశక్తులు కలవారలునగుదురనియుఁ దెలియుచున్నది.

---

*ఈ యనువాకమున ఐదమూడవ యజుస్సునుండి 17 వ యజుస్సువరకునుగల మంత్రములయర్థము సుస్పష్టమగుటచే రుద్రభాష్యమున సాయనాచార్యకృతవేదార్థ ప్రకాశభాష్యము. సంపూర్ణము.*

---

*—; త్రయోదశయజుస్సు ;—*

*"నమఆసీనేభ్యశ్శయానేభ్యశ్చవోనమః"*

*అర్థము:-*

ఆసీనేభ్యః = కూర్చుండునట్టియును, శయానేభ్యశ్చ = నిద్రించునట్టి, వః = మీకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

మహాదేవునిశక్తిజీవులలో గలదు. కావుననే సకలజీవులును అసనశుద్ధిగల్గి స్థిరముగాఁ గూర్చుండఁ గల్గుచున్నవి. సుఖముగా నిశ్చింతగా నిద్రింపగల్గు చున్నవి. అట్టి జీవరూపరుద్రులకు నమస్కారము.

## *71 వ నామము:- శివ- "నమఆసీనేభ్యః"*

భ. భా. భా:- "ఆస = ఉపవేశనే" అను ధాతువునకు, కూర్చుండుట నివసించుట, నిశ్శబ్దముగానుండుట, దారిచూపుట, అను నర్థములుకలవు. భగవంతుడైన పరమాత్మ శబ్దస్పర్శరూపరసగంధహీనుడు అందుచే అతడు ఒకచోట నిశ్శబ్దముగానేయుండును. అతడే ఒకజ్యోతి. అతని రూపములే బ్రహ్మ విష్ణు శివాత్మకములు అందులో శివుడుగా ప్రకృతిలోనున్నపుడు వటవిటపి సమీపమున నిశ్శబ్దముగా నివసించియుండెను అతనిచెంత జ్ఞానార్థులైన మును లెల్లరును నిశ్శబ్దముగానేయుండిరి. అతడే దక్షిణామూర్తి కావున అతనికిని అతని చుట్టునుగలవారికిని "ఆసీనులు" అను నామమేర్పడెను. అతనికి నమస్కారము.

*విష్ణు-*

విష్ణువు ప్రకృష్టమైన తన మహిమయందును, జీవులహృదయాకాశము నందును స్థిరముగానుండి వారికి స్థిరమార్గమును దనప్రవర్తనచేఁ జూపును. కావున విష్ణువు పరమేష్ఠియైనాడు. పరికింపగా పరమేష్ఠి, ఆసీనుడు అను నామములు రెండును సమానార్థకములే. అందుచే విష్ణువునకును ఆసీనుడను నామము సార్థకమాయెను.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "ఆ+స్+ఈ+న్+అ" అని ఐదక్షరములుకలవు. అవి పంచభూతములకును, పంచకర్మేంద్రియములకును చిహ్నములు. అందుఁ బరాశక్తిబీజమైన అకారమును, మాయాశక్తిబీజమైన ఈకారమును సకల

దేవతాబీజమైన అకారమునుగలవు. వానితో శక్తిబీజమైన సకారమును సావిత్రీబీజమైన నకారమును గూడియున్నవి. కావున ఈ నామము శాక్తేయులకు బరమోపాస్యము. దీనినుపాసించిన వారికి బంచభూతములను ఇంద్రియములను ఆకర్షించుశక్తియు, వశీకరించు శక్తియును స్థితిస్థాపకశక్తియును, పాపనాశకశక్తియును లభించును. కాన వారు పంచభూతవశీకరణ యంత్రములను సృష్టించఁగల వారలగుదురు. మృత్యుంజయులగుదురు.

**72 వ నామము;- శివ- "శయానేభ్యశ్చవో నమః"**

భ. భా. భాః- పార్వతీపతియైనశివుడు తపస్సుచేయునపుడు హిమగిరిపై శయనించువాడు. కావుననే ఆతనికి గిరిశుడను నామమువచ్చెను. ఆతడే ఆత్మావలోకన తత్పరుడై హిమాలయమున యోగనిద్రలోనుండెడివాడు అట్లుండుటచే ఆతనికి శయానుడను నామమువాటిల్లెను. ఆతని యంశకల జీవులు జీవనయాత్రలో రాత్రియందు శయనించును కాన వారికిని శయానులను నామమువాటిల్లెను. అని ద్రావస్థచెట్లయందునుగలదు. వానియందును శివాంశకలదు. కావున శయానులైన దేవతావృక్షములకును నమస్సులు సమర్పింపఁబడును.

విష్ణు-

విష్ణువు బాలముకుందుడైనపుడు వటపత్రమున శయనించినాడు, కావుననే "వటస్యపత్రస్యపుటేశయానమ్" అని విష్ణువును భక్తులు ప్రార్థించిరి. శ్రీరామావతారము లంకామార్గమును అన్వేషించుచు, విష్ణువు భూమిపై శయనించినాడు. కావుననే భూశయుడు "అను నామమువచ్చినట్లు "భూశయో భూషణోభూతిః" అను విష్ణుసహస్రసూక్తిచేఁ దెలియుచున్నది. కు = భూమి. దానిచుట్టు నావరించియుండుటచే, జలమునకు "కువల" మనిపేరుకలైను. కువలమున ఆదిశేషునిపై శయనించువాడు కావున శేషశాయియైన విష్ణువునకు "కువలేశయుడు" అను నామము వాటిల్లినట్లు "కుముదఃకువలేశయః" అను విష్ణుసహస్రసూక్తిచే దెలియుచున్నది. అందుచే విష్ణువునకును "శయానుడు" అను నామము వాటిల్లెను.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "శ్+అ+య్+అ+న్+అ" అని ఆరక్షరములుకలవు. అవి షడ్రుతువులకును, మనసుతోడి ఆరింద్రియములకును జిహ్వాములు. ఇందు సర్వదేవతాబీజమైన అకారద్వయమును, పరాశక్తిబీజమైన అకారమునుగలవు. వానితో లక్ష్మీబీజమైన శకారమును, వాయుబీజమైన యకారమును, సావిత్రీ బీజమైన నకారమునుగూడియున్నవి. కావున౯ బైనామము నుపాసించువారు ప్రాణాయామప్రక్రియలో శక్తిపురుషులను ధ్యానించి, ధనలక్ష్మినపారముగా ఆర్జించగలరు. సావిత్రి నారాధించి, భూతాదులను దొలగించి, పాపనాశకులు కాగలరు.

*—; చతుర్దశయజుస్సు ;—*

*"నమస్స్వపద్భ్యశ్చ జాగ్రద్భ్యశ్చవోనమ.*

*అర్థము:-*

స్వపద్భ్యః = నిద్రించునట్టి, వః = మీకు నమః = నమస్కారము,
జాగ్రద్భ్యశ్చ = మేల్కొనియుండునట్టి, వః = మీకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము-*

భగవంతుడైన పరమశివుడు జీవరూపమున నున్నపుడు, నిద్రించుట, జాగరూకతతోనుండుట, అనుపనులుచేయును. జ్ఞానిరూపమున నున్నపుడు యోగనిద్రలోనుండును. సంయమిరూపమున నున్నపుడు రాత్రిమేల్కొంచి యుండును పరికింపగా బరమేశ్వరుని యుచ్ఛ్వాస నిశ్వాసముతే జీవులు గావించు నానాకృత్యములని తెలియుచున్నది.

## 73 74నామములు:- "నమస్స్వపద్భ్యో, నమోజాగ్రద్భ్యః"

శివ:-

భ. శా. భా:- "స్వప్" ధాతువునకు నిద్రించుట, అవలంబించుట, ఆశ్రయించుట, విశ్రమించుట, యనునర్థములుకలవు. ఆధాతువునుండి యేర్పడిన నామవాచకమే "స్వపత్" అను పదము, పరమాత్మ అంశజీవులలో నుండుటచే వారిచే అతడు సకల కార్యములనుజేయించును. అవన్నియును అతనికృత్యములే. అనగా అతని ప్రేరణచే అతనియొక్క ప్రకృతి జీవుల సృష్టించి, వారిచే జేయించిన కృత్యములే అన్నమాట. జీవులకు కర్తృత్యము కాని; కర్మలు కాని ప్రభువు సృష్టించలేదు. అవన్నియును స్వభావమగు ప్రకృతిచే జరుగు కార్యములే; అను విషయము "నకర్తృత్వంనకర్మాణి లోకస్యసృజతిప్రభుః;" "ప్రకృతేఃక్రియమాణానిగుణైఃకర్మాణిసర్వశః" అను గీతాసూక్తులచేఁ దెలియుచున్నది. కావున జీవరూపమవలంబించి, నిద్రించువాడును జీవులకాశ్రయుడును బరమేశ్వరుడే. అందుచే అతనికి "స్వపన్" అను నామము ఏర్పడెను.

అట్లే "జాగృ" ధాతువునకు మేల్కొను, అప్రమత్తుడైయుండు, ఆసక్తుడైయుండు, అను నర్థములుకలవు దానినుండియేర్పడిన శబ్దమే "జాగ్రత్" అను నది పైన జెప్పినపనులు భగవంతుడు అంతర్లీనుడై జీవులచే జేయించుచున్నట్లు "స్వప్నేజాగ్రతివాయఏషపురుషోమాయాపరిభ్రామితః" అనెడి దక్షిణామూర్తిస్తోత్రవాక్యముచే దెలియుచున్నది. కావున మహాదేవునకును, అతని వశములోనున్న జీవులకును "జాగ్రత్" అను నామము వాడబడెను.

విష్ణు:-

"యథాశివమయోవిష్ణురేవం విష్ణుమయశ్శివః।
యదాన్తరంనపశ్యామితదామేస్వస్తిరాయుషి"

అను సంధ్యావందనసూక్తిచే శివకేశవులకు భేదములేదనియు, శివకేశవాభేద బుద్ధికలవారికి "స్వస్తి" = మేలు, కల్గుననియుఁ దెలియుచున్నది కావున శివ

కేశవులిరువురును పరమేశ్వర శబ్దవాచ్యులగుచున్నారు. వారిరువురియంశ ముతో జన్మించినవారే జీవులు అంతేకాదు. చేతనాచేతనములన్నియును వారి యంశకలవే. వారుచేయుకృత్యములన్నియును శివకేశవకృత్యములే, "ఉత్తిష్ఠోత్తిష్ఠ కౌంతేయ ఉత్తిష్ఠగరుడధ్వజ!" "కౌసల్యాసుప్రజారామ ..........ఉత్తిష్ఠ నరశార్దూల!" మున్నగు మునివాక్యములచే ఆయాయవతారములందు విష్ణువు జీవరూపుడై "నిద్రించినవాడే; మేల్కాంచినవాడే;" అని తెలియుచున్నది. "నైకాత్మానైకకర్మకృత్" "స్వాపనస్స్వవశోవ్యాపీ" నైకరూపోబృహద్రూపః "మున్నగు విష్ణుసహస్ర సూక్తులను పరిశీలించినచో విష్ణువు జీవుడై, బహూరూపుడై, స్వాపనుడై, జీవులకృత్యములనెల్లదానేచేయుచు, చేయించుచున్నట్లు తెలియుచున్నది. అందుచే విష్ణువునకును "స్వపన్, జాగ్రత్" అను నామములు వాటిల్లెనని తెలియుచున్నది.

***బీజాక్షరసంపుటి:-***

"స్వపన్" అను నామమున "స్+వ్+అ+ప్+అ+న్" అని ఆర క్షరములుకలవు. అవి శరీరమందలి షట్చక్రములకును షడృతువులకును జిహ్నములు. ఇందు సర్వదేవబీజమైన అకారద్వయముతో శక్తిబీజమైన సకారమును, వరుణబీజమైన వకారమును, సావిత్రీబీజమైన నకారమునుగూడి యున్నవి. పైనామమును జపించువారు శక్తిపురుషులప్రభావముపొంది, జల యంత్రములను నిర్మింపఁ గలవారలగుదురు. సకల రోగకారణములైనపాపము లను బరిహరించి జలోదరాదిరోగనివారకులును గాగలరని తెలియుచున్నది.

"జాగ్రత్" అను నామమున "జ్+అ+గ్+ర్+అ+త్" అని అరక్షరములుకలవు. అవి షడావరణములకును, షట్చక్రములకును జిహ్నములు ఇందు సర్వదేవబీజమైన అకారమును, పరాశక్తిబీజమైన అకారమును గలవు. వానితో ఇంద్రబీజమైన జకారమును, గణపతిబీజమైన గకారమును, అగ్నిబీజమైన రేఫమును, వాస్తుబీజమైన తకారమునుగూడియున్నవి. పైనామ మును జపించువారు అగ్నిమాంద్యాదిరోగనివారకులగుటయేకాక, నిర్విఘ్న ముగా శత్రుహస్తలై మహోన్నతాధికారమును జేపట్టి, సర్వత్రవిజయము

పొందఁగలవారలగుదురనియును, శత్రువిజయమునకు అవసరమగు పరికరము లను నిర్మించఁ గలవారలగుదురనియును దెలియుచున్నది.

## —: పంచదశయజుస్సు :—

"నమస్తిష్ఠద్భ్యో ధావద్భ్యశ్చవో నమః"

**అర్థము:-**

తిష్ఠద్భ్యః = నిశ్చలముగానుండునట్టి, వః = మీకు, నమః = నమస్కారము. ధావద్భ్యశ్చ = పఱుగెత్తునట్టియును, వః = మీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

పరమేశ్వరులైన శివకేశవులు తమయంశలతో జీవులను సృష్టింపించి, నిలుకడగానుండుట, పఱుగెత్తుటమున్నగు జీవనకృత్యములను ఆచరించుచున్నారు. కానవారికి నమస్కారము

**75, 76. వ నామములు:- "నమస్తిష్ఠద్భ్యః "ధావద్భ్యశ్చ"**

**శివ+విష్ణు:-**

భ. భా. భా:- "ష్ఠా" ధాతువునకు, నిలువబడు, ఉండు, నివసించు, మిగిలియుండు లోనభద్రముగానుంచు, అను నర్థములుకలవు. పరమేశ్వరుడు భగీరధుని తపస్సునకుమెచ్చి, గంగను శిరస్సున దాల్చుటకు స్థిరముగా నిలుచుండెను అటులనే విష్ణువు శ్రీకృష్ణావతారమున గోసంరక్షణార్థము గోవర్ధనపర్వతమును గొడుగుగాఁజేసి, చిటికినవ్రేలఁదాల్చి, స్థిరముగా నిలుచుండెను. శివకేశవులిరువురును జీవులదేహములందు, "అహంవైశ్వానరో భూత్వాప్రాణినాందేహమాశ్రితః" అను గీతాసూక్తిలో జెప్పినట్లు వైశ్వానర రూపమునగలరు. ప్రళయాంతమున వీరు ఇరువురును నాశరహితులు కాన జ్యోతీరూపమున మిగిలియుందురు. పైకారణములచే శివకేశవులు ఇరువురకును "తిష్ఠన్" అను నామము సార్థకమే అగును.

"ధావ్" ధాతువునకు, పఱుగెత్తు, పరిశుభ్రముచేయు, ప్రకాశింప జేయు," మున్నగునర్థములుకలవు. శివకేశవులు ఇరువురును భక్తరక్షణము నకై పఱుగులెత్తువారే. ఇరువురును తమనుస్మరించుకారణమున, సర్వమును దమకు సమర్పించుకారణమున అగమాదికర్మలను నశింపజేసి, జీవులను పరి శుభ్రముచేసినవారే. సూర్యచంద్రరూపముల ఇరువురును బ్రహ్మాండమును బ్రకాశింపజేయువారే. కావున ఇరువురకును "ధావత్" అను నామము సార్థ కమేయగును. "అనీశఃశాశ్వతస్థిరః" అను విష్ణుసహస్ర సూక్తిలో బేర్కొనిన "శాశ్వత స్థిరుడు" అనునదియును "తిష్ఠత్" అను నామమును సమానార్థ కమేయని తెలియుచున్నది. అందుచే "తిష్ఠత్, ధావత్" అను నామముల శివకేశవులు నమస్కరింపబడుచున్నారు.

*బీజాక్షరసంపుటి:-*

"తిష్ఠన్" అను నామమున "త్+ఇ+ష్+ఠ్+అ+న్" అని ఆర్ధ క్షరములుకలవు. ఇవి షట్చక్రములకును, షడృతువులకును ఉపలక్షకములు ఇందు వాస్తుబీజమైన తకారము విష్ణుబీజమైన ఇకారముతోడను, శక్తిబీజమైన షకారమును, ధర్మబీజమైన ఠకారమును సావిత్రీబీజమైన నకారమును అకా రముతోడను గూడియున్నవి. అందుచే బైనామము నుపాసించువారు యోగ ధర్మము ననుసరించి, కుండలినీ శక్త్యుపాసకులై దూరశ్రవణశక్తిసహితులై స్థిరముగానుండగలరు. దూరశ్రవణయంత్రనిర్మాతలుకాగలరు. సర్వత్ర విజయవంతులగుదురు.

"ధావన్" అను నామమునందు "ధ్+అ+వ్+అ+న్" అని ఐదు క్షరములుకలవు. ఇవి పంచభూతములకును పంచకోశములకును వలక్షక ములు. ప్రకృతి పురుషబీజములైన అకారాకారములతో ధనదబీజమైన ధకార మును, వరుణబీజమైన వకారమును, సావిత్రీబీజమైన నకారమునుగూడి

యున్నవి. అందుచే నైనామము నుపాసించువారు జలోదరాదిరోగనాశకులై, ఆరోగ్యసంపన్నులై దూరముగానేగఁగలుగు శక్తిని సంపాదించగలరు, దానితోఁబాటు ధనమార్జించి దూరగమన యంత్రనిర్మాతలును, రోగనివారక యంత్రనిర్మాతలును కాగలరని తెలియుచున్నది.

—: షోడశయజుస్సు :—

"నమస్సభాభ్యస్సభాపతిభ్యశ్చవో నమః"

**అర్థము:-**

సభాభ్యః = సంఘముగానున్నవారికి, నమః = నమస్కారము. సభాపతిభ్యశ్చ = సంఘముగానున్నవారికి ప్రభువులగు, వః = మీకు నమః = నమస్కారము. (లేక) సభాపతిభ్యః = స్థానపతులైన, వః = మీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

"సంఘేశక్తిఃకలౌయుగే" కలియుగమునందు సంఘమునకే శక్తికలదని పెద్దలుచెప్పిరి. ఈ యుగమునందేకాదు. ఏయుగమునందైనను సంఘముగానున్న చేతనములకును, అచేతనములకును శక్తికలదని పురాణాదుల వలన దెలియుచున్నది. క్షీరసముద్రమథనమున చైతన్యముగలదేవరాక్షస సంఘములేకదా! అమూల్యములైన చింతామణ్యాదులను సంపాదించినవి. ప్రాణములేని తృణములు త్రాడుగానేర్పడి, మదపుటేనుగును బంధింపలేదా! సంఘముగానున్న వస్తువులందుగల యాశక్తినే దైవీశక్తియందురు. ఆదైవీశక్తి శివశక్తికావచ్చును; విష్ణుశక్తికావచ్చును. ఆశక్తిజీవులందుగలదు కాన

కేవలశివునకు, సంఘముగానున్నజీవులకును నమస్కారములు సమర్పింప వలెను. అట్టిసంఘములకు ప్రభువులైన వారిలో దైవీశక్తి అధికముగానుండును అందుచే సంఘస్వాములను సైతము నమస్కరించుచున్నారు.

## 77, 78 నామములు:- "నమస్సభాభ్యస్సభాపతిభ్యశ్చ"

### శివ+విష్ణు:-

స. భా భా:- సభలలో దేవసభయైన సుధర్మచాలగొప్పది. అందు శివుడు ఇంద్రరూపమునను, విష్ణువు ఉపేంద్రుడు రూపముననుండి, దేవ మనుష్యాదిసంఘములనుగాపాడుచున్నారు. "స+భా" అని పదములను విభ జించివరిశీలించితిమేని, భా=శివవిష్ణుతేజస్సులతో, స=కూడియే, సభలును, అందలి దేవాదులునుందురు. శివ విష్ణుతేజస్స్వరూపులే సూర్యచంద్రులు. వారి తేజస్సులతోఁ బదునాల్గుభువనంబులునిండియున్నవి. శివకేశవులే ప్రకృ తిలో ప్రాణాదివాయురూపమునను, పంచభూతములరూపమునను గలరు. "జ్యోతిషాంరవిరంశుమాన్" "నక్షత్రాణామహంశశీ" "రసోఽహమప్సు కౌంతేయప్రభాస్మిశశిసూర్యయోః ప్రణవస్సర్వవేదేషుశబ్దః ఖేపౌరుషంనృషు" అను గీతాసూక్తులచే శివకేశవులే సూర్యచంద్రులుగ, సూర్యచంద్రతేజస్సు లుగా, జలములందు రసముగా, వేదములందుఁ బ్రణముగా, ఆకాశమున శబ్ద ముగా, మానవులందుఁ బౌరుషముగానున్నట్లు, తెలియుచున్నది ఇవన్నియును సభలే. వానిలో సంఘీభవించియే శివకేశవశక్తులుకలవు. సకలమును దైవశక్తు లతోనిండినవే. అట్టి సభలకు బతులునువారే. ఈనాటి సాంఘిక ప్రభుత్వము నందును వైజ్ఞానిక వస్తువులందును దైవికపురి శక్తులే ఆయారూపములతో నున్నవి. కావున సభాపతులుకూడ శివకేశవులే. కానవారికి, "సభాపతి" అను నామములు సార్థకములైయున్నవి. అందుచేతనే ఈనాడు పెద్దలు ఉపన్య సించునపుడు "సభాయైనమః, సభాపతిభ్యోనమః" అని నమస్కరింతురు. కావున దైరెండునామములును శివకేశవులను సమానముగానే తెలియఁజేయును

*బీజాక్షరసంపుటి:-*

"సభా" అను నామమున "స్+ఆ+భ్+ఆ" అని, చతురగ్నిసూచకముగా నాల్గు అక్షరములు కలవు. ఇందు ఐరావత క్షిత క్షిబీజములైన ఆకారపకారములతో సర్వదేవబీజమగు అకారమును, భార్గవబీజమైన భకారమును గూడి యున్నవి. కాన యీనామము నుపాసించువారు శాక్తాద్వైతులగుదురు, దుష్టసత్వ సంహారకములైన ఆయుధనిర్మాతలును, దుష్టరోగనివారకులునుగా గలరు.

"సభావతి" అను నామమందలి వర్ణములతోబాటు "ప్+అ+త్+ఇ" అని మరినాల్గు వర్ణములును గలవు. ఇవి అష్టవిధప్రకృతులను అష్టచక్రములను సూచించును. ఈనామమును ఉపాసించువారు శాక్తాద్వైతులు అగుటచే దుష్ట శత్రుసంహారకవారుణాస్త్రస్రష్టలును, నీటినుండి పరమాణుశక్తులను సంగ్రహింపగలవారలును జలప్రేషకయంత్రనిర్మాతలునుగాఁగలరని తెలియుచున్నది.

—: సప్తదశయజుస్సు :—

*"నమో అశ్వేభ్యో ఽశ్వపతిభ్యశ్చవో నమః"*

*అర్థము:-*

అశ్వేభ్యః = అశ్వప్రగహములకు, నమః = నమస్కారము. నవిద్యతే స్వంధనం యేషాంతే అస్వాః; శనయోరభేదాత్ తఏవ అశ్వాః "అను వ్యుత్పత్తి ననుసరించి, అశ్వేభ్యః = తనదగుధనములేనివారికిని, నమః = నమస్కారము నవిద్యతే శ్వస్తనం ధనం యేషాంతే అశ్వాః" అను వ్యుత్పత్తిచే అశ్వేభ్యః = పిరినుండియు, ఏమియును గ్రహింపకుండుటచే, రేపటికపనరమగు ధనము

లేనివారికిని, నమః = నమస్కారము. అశ్వపతిభ్యశ్చవః = అశ్వాధ్యక్షాత్ము లును, మహాశ్రీగలవారునగు మీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

*79 వ నామము:- శివ- "నమోఅశ్వేభ్యః"*

భ. శా. భా:- శ్వ = రేపటికి న = లేనిదేదో దానికే అశ్వమనిపేరు. అనగాఅశాశ్వతమైనదన్నమాట. శాశ్వతము పరబ్రహ్మము. అశాశ్వతము అష్ట విధమైన ప్రకృతి. చేతనాచేతనమై అందుగలసృష్టియంతయును అశాశ్వతమే అన్నమాట. అందుచే దానికి అశ్వమనిపేరు. సృష్టిలోగల వస్తువులన్నియును అశ్వములే; అనగా అశ్వవిగ్రహములే. అశాశ్వత శరీరములే అన్నమాట. వాని యందును శివాంశగలదు కాన వానికిని శివునకువలె నమస్కారములు అర్పింపబడుచున్నవి. తనద గు ధనములేనివారిని సైతము అశ్వులు అందురు. నాదియనెడి అహంకారముతోఁగూడిన అజ్ఞానమనెడి ధనములేనివారు జ్ఞానులు వానియందును శివాంశకలదు. కాన వారికిని నమస్కారములు, అర్పింపఁ బడుచుండెను. నాదియను ధనమునుసంపాదింపలేనివి పశుపక్ష్యాదులు. కావున అవియును అశ్వములాయెను. వానియందును శివాంశయుండుటచే అవియును నమస్కరింపబడుచున్నవి. తనది అను ధనములేనివారు దరిద్రులు. వారి యందును శివాంశకలదు. అశ్వులు అనగా రేపటికవసరమగు ధనమును ఏకి నుండియును విధముగనుకూడబెట్టనివారు అనియర్థము. అనగా వారు నిత్యము సంతుష్టులన్నమాట. ఆనాటికి ఉన్నదానితో తృప్తిచెందువారన్నమాట సన్న్యాసులన్నమాట. వారియందును శివాంశకలదు. అందుచే శివాంశకల వన్నియును నమస్కరింపబడుచున్నవి.

*80 వ నామము:- శివ:- "నమోఽశ్వపతిభ్యశ్చ"*

భ. శా. భా:- అశ్వపతులనగా అశ్వాధ్యక్షాత్ములు. మహాశ్రీగలవారు. వారందఱును మహాదేవుని అనుచరులే. మహాదేవుని లీలావిగ్రహవిశేషులే.

కారణమేమన? "ఐశ్వర్యమీశ్వరాదిచ్ఛేత్" అను పెద్దలమాటచొప్పున ఐశ్వర్య మొసంగువాడు ఈశ్వరుడేయని తెలియుచున్నది. ఆతని యంశకలవారే అశ్వాధ్యక్షాత్మ్ములు, మహాధనవంతులునగుదురు. అశ్వమైన = అశాశ్వతమైన అష్టవిధప్రకృతికిని పతిపరమేశ్వరుడే. కావున అశ్వపతని నమస్కరించు చున్నారు. పైకారణములచే, అశ్వుడు, అశ్వపతి" అను నామములురెండును శివునకుసార్థకములగుచున్నవి. అశ్వములనగా సూర్యకిరణములు. అశ్వాకారముగా ప్రసరించుటచే, వానికి అశ్వములని పేరువచ్చెను. సూర్యుడు శివస్వరూపుడే. ఆ కిరణములు శివునివే అన్నమాట. "తత్, తద్వతోరభేదః" అను నియమముచే అశ్వములైన కిరణములకును, అశ్వపతికినిభేదములేదు, కావున "అశ్వుడు, అశ్వపతి" యను నామములు సూర్యస్వరూపుడైన శివునికిజెందును.

## *79, 80* నామములు;- "అశ్వా = వ్యాప్తౌ"

**విష్ణుః-**

అను ధాతువునుండి అశ్వపదమేర్పడెను. అందుచే అశ్వపదమునకు గమనముచే సర్వవ్యాపకుడని తెలియుచున్నది "విష్ణురాదిత్యః" అను శ్రుతి వచనముచే అశ్వుడైన సూర్యుడు విష్ణువని తెలియుచున్నది. విష్ణువు సూర్య స్వరూపుడై సమస్తమును తనగమనముచే వ్యాపించియేయున్నాడు. కావున సూర్యుడు అశ్వుడాయెను. ఆతడే విష్ణువని తెలియుచున్నది. "పద్ల"ధాతువు నుండియేర్పడిన 'పతిశబ్దమునకు సర్వమునుజెంది, సర్వమునకు ఒకటియైన వాడని తెలియుచున్నది. కావున సూర్యుడుఅశ్వుడును, అశ్వుడైనపతియగుటచే అశ్వపతియునాయెను ఆసూర్యుడు విష్ణువేకదా! కావున విష్ణువునకు "అశ్వుడు, అశ్వపతి" అను నామములు సార్థకములేయగును. "వ్యాపీ, వ్యాప్తః" అను విష్ణుసహస్రనామములును అశ్వపదమును సమానార్థకములే. "సర్వేశ్వరుడు" అను విష్ణుసహస్రనామము అశ్వపతి యనునామమునకు సమానార్థకమే యగును. అందుచే "అశ్వుడు, అశ్వపతి" యనునామములు విష్ణువునకు జెలునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

"అశ్వ" అను పదమునందు "అ+శ్+వ్+అ" అని నాల్గక్షరములుకలవు. ఇవి చతురగ్నులకును మనోబుద్ధి చిత్తాహంకారములకును జిహ్వాములు. ఇందు సర్వదేవబీజమైన అకారద్వయముతో లక్ష్మీబీజమైన శకారమును, వరుణబీజమైన వకారమునుగూడియుండుటచేఁ బైనామము నుపాసించువారు జలోదరాది రోగనివారకులగుటయేకాక, జలముపై శీఘ్రముగా బయనించుయంత్రములను నిర్మింపఁగలవారలగుదురు.

"అశ్వవతి" యను నామమునందు అ+శ్+వ్+అ+వ్+అ+త్+ఇ" అని యెనిమిదక్షరములుకలవు. ఇవి అష్టసూర్యమండలములకు, అష్టచక్రములకును జిహ్వాములు. ఇందు సర్వదేవతాకమైన అకారములు మూడును విష్ణుదేవతామైన ఇకారమునుగలవు. వానితో లక్ష్మీబీజమైన శకారమును, వరుణబీజమైన వకారమును, పర్జన్య బీజమైన వకారమును, వాస్తుబీజమైన తకారమునుగూడియున్నవి. అందుచేఁ బైనామము నుపాసించువారు సముద్రవర్తకమునొనర్చువారై సంపన్నులై సకలరోగనివారకులునైయుండగలరు. అంతేకాక వాస్తుశాస్త్రజ్ఞులై (ఇంజనీర్లై జలయంత్రనిర్మాతలునుగాఁగలరని తెలియుచున్నది.

*జపహోమాదిక్రమము:-*

పై యనువాకమందలి 17 మంత్రములను సంపూర్ణముగా 5 వేలు పొ॥న జపమొనర్చినచో పురశ్చరణసిద్ధులుకాఁగలరు. జనపదములందు వ్యాధులుసంభవించునపుడు రాజు శాంతినిజేయింపవలెను. సిద్ధులైన బ్రాహ్మణులు 11 గురిచే ఈశ్వరాలయమున జపముచేయింపవలెను 5 గురు జప

మును, 5 గురుహోమమును జేయవలెను. ఒకడు తిరులతోనమస్కరించునప్పు ‌డెల్లహోమముచేయవలెను. నూరువేలు జపమొనర్చినచో దేశమందలి వ్యాధులు నశించును. వాహనములైన జంతువులకు రోగమువాటిల్లినపుడు తెలకపిండితో గలిపిన అప్పాలతో హోమముచేయవలెను. ఇట్లు 11 వేలహోమముచేసి నచో వాహనములకు వాటిల్లినసామాన్యవ్యాధినశించును వాహనేతరములకు వాటిల్లినవ్యాధితొలగుటకు వాహనశాలలో ఉత్తరేణిపుల్లలతోబాటు తండులము లను ఆజ్యమునుగలిపి, 8 వేలు హోమముచేయవలెను అపుడు వానివ్యాధి నశించును ప్రధానులకు వాటిల్లిన వ్యాధితొలగుటకు, శుద్ధతండులములను నేతితోదడిపి, శివాలయమున 100 వేలు హోమముచేయవలెను. అమాత్యులకు వాటిల్లిన వ్యాధితొలగుటకు ఉత్తరేణిపుల్లలతో ప్రత్యేకముగా 8వేలు హోమము చేయవలెను. అపుడు వారి వ్యాధినశించును. రాజులకుగల్గిన వ్యాధులు తొలగు టకు ఈక్రిందిజెప్పిన విధులుచేయవలెను. మంత్రసిద్ధినందిన 21 బ్రాహ్మణు లచే ఈక్రిందిపనులుచేయించవలెను. పైనజెప్పిన విప్రులలో ఒకడు బ్రహ్మగా నుండవలెను. రాజప్రమాణమైన అగ్నికుండమునొనర్చి, అందుసుద్దిచంద్రు కఱ్ఱలను మధించగావచ్చిన అగ్నినిబ్రతిష్ఠించి, మిగిలిన విప్రులు జంటగా నేర్పడి హోమము చేయవలెను. పిన్మెట బియ్యము, నూలు, చామధాన్యము, నివ్వరిధాన్యము, ఉత్తరేణిపుల్లలు, దూర్వాలు, తామరపూవుటకింజల్కములు, పరిశుద్ధాన్నము, ఆజ్యము అను వస్తువులను ఆవునేతితోగలిపి, హోమము చేయవలెను. అయ్యగ్నికుండమునకు దక్షిణపువైపునందు, పడమరభాగమున, జలపూర్ణమైన కలశను బ్రతిష్ఠించి, బ్రహ్మగానున్నయాతడు జపముచేయ వలెను. ఆహూతినిసప్తనాడి కాంతముగా నిరంతరముచేయవలెను. ఇట్లు అమా వాస్యతో మొదలిడి, అమావాస్యాంతము హోమముచేయవలెను రాజునకుఁ గల్గినరాజరోగనివారణార్థము ఆహోమకాలమున ఉదయము మొదలు అస్త మయమువరకును హోమముచేయవలెను. నాడికాహోమమునను ప్రతిదినము ప్రతిపురుషునకును అర్ధనిష్కమును అనగా ఏబదిబంగారునాణెములను దక్షి ణగా నొసంగవలెను. దివాహోమమున దానికి రెట్టింపు దక్షిణను ఒసంగ

వలెను ఆచార్యునకు దానికి రెండురెట్లు దక్షిణ నొసంగవలెను. రాజు ఉపయోగించు ద్రవ్యముపై కలశోదకమును జల్లవలెను. ఇట్లు చేసినచో రాజ రోగమునశించును. రాజరోగనివారణకు వేఱొక ఉపాయమునుగలదు. ఏమనగా రాజరోగనివారణకు నిత్యముచెప్పు అనువాకముతో, నూలునేయికలిపిన తెల్ల బియ్యముతో 8 వేల ఆహుతులను సమర్పించవలెను. పైనజెప్పిన విధమునఁ జేసినచో రాజు నిత్యము నీరోగుడగును. దీర్ఘాయుష్కుడగును. ఇతరులకు రోగము వాటిల్లినపుడు ఈయనువాకముతోడనే ప్రతి నమస్కారము చేయుచు నేతితోడను తేనెతోడను దడిపిన నూవులను బియ్యమును యవ ధాన్యమును 8 వేలు హోమముచేయవలెను. అట్లుచేసినచో వారి వ్యాధి నశించును. ఈయనువాకముతోఁజేయు అభిచారిక హోమములను దేవజల ధ్వంసమునకై రావణాది రాక్షసులుచేసినట్లు పురాణములవలనఁ దెలియు చున్నది. శ్రీ వాల్మీకిరామాయణమున రావణానురుడు శ్రీరామలక్ష్మణుల నాశమునకై, నికుంభిలాహోమముచేసినట్లు యుద్ధకాండమునఁ గలదు శత్రు నాశనమునకై దుర్యోధనాదిరాజులును ఈయాభిచారికహోమముచేసినట్లు మహాభారతమునగలదు. పైయనువాక మంత్రములయర్థముగల ఈక్రింది శ్లోకములను మహాదేవుని ధ్యానించి జపము చేయుట చాలమంచిది.

1. శ్లో॥ రూపయౌవనసంపన్నా మూర్తైవవనదేవతా।
పుష్పితాశోకపున్నాగ సహకారశిఖాపమః॥
సప్తవింశతినక్షత్రో మయూరకృతశేఖరః॥

2. శ్లో॥ అకలంకశరచ్చంద్ర పూర్ణబింబసమాననః
ప్రాంతేబద్ధకపర్దాంతో వసానశ్చర్మకోమలం॥

3. శ్లో॥ సవ్యాపసవ్యవిధృత కృతమాలావిభూషితః
పరాకదంబపుంజేన నాభిదేశప్రలంబినా॥

4. శ్లో॥ ఆజంఘప్రేక్షణీయేన ప్రేక్షణీయోఽపిశత్రుభిః
శోభాస్పృశ్యచారుసర్వాంగీవర్ణాలంకారభూషితా॥

5. శ్లో॥ ఆదర్శమూర్తిశ్శోభానాంవన్యానామివనిర్మలా।
తస్యాహస్తేనసర్వత్వాశరమేకంచనిర్మలమ్॥

6. శ్లో॥ ద్వితీయమంసమాలంబ్య శిష్టంవామేనబాహునా।
సుగంధిపుష్పస్తబకమాఘ్రాయాఘ్రాయపాణినా॥

7. శ్లో॥ వీజ్యమానో మందమందం నవపల్లవశాఖయా।
సమావృతో బాలకైశ్చశ్వభిశ్చాపిమనోహరైః॥

8. శ్లో॥ గచ్ఛద్భిరగ్రతోదృష్టైర్యాతవ్యోజగతాంగురుః।
ఏవంభూతో మహాతేజాఃకిరాతవపురీశ్వరః॥

**తాత్పర్యములు-**

మహాదేవుని నివాసము ఒక వనము. అదియే ప్రకృతి. ఆమెమూర్తీభవించిన వనదేవత. అమె, రూపయౌవనములతోనిండియున్నది. ఆమహాదేవుడు, పుష్పించిన అశోకపున్నాగవృక్షములను గున్నమామిడిచెట్లను సామ్యముగాగలవాడు ఇరువదియేనునక్షత్రములను ఆతని శేఖరమున బూలవలెగలవు. ("పంచవింశతినక్షత్రః" అను పాఠాంతరమున పూర్వాషాఢాపూర్వాభాద్రానక్షత్రములు తక్కువగును.) ఆతని శేఖరము మయూరాకారమున నున్నది. అతని ముఖము కళంకములేని శరత్కాలచంద్రుని పూర్ణబింబమువలెనున్నది. ప్రాంతమునందు జటాజూటాంతమును బంధించినాడు. కోమలమైన వ్యాఘ్రాసురగజాసురచర్మములను వస్త్రములుగాఁదాల్చి, భక్తులగు అయ్యసురులనాదరించినాడు. కుడియెడమచేతులందు రుద్రాక్షపూసలదండలను పూలదండలుగా అలంకరించు కొనినాడు. జలధారవలె తిన్నగా వ్రేలాడు కడిమి పూలదండను బొడ్డువరకును వ్రేలాడగట్టుకొనినాడు. కాలిపిక్కల వరకును వ్రేలాడు పూలదండలతో జూడసొంపుగానున్నాడు. శత్రువులును ఆతని చక్కదనమును గన్నులారఁగాంచుచున్నారు.

ఆ మహాదేవుని భార్య సౌందర్యముతో తులతూగు సర్వావయవములు కలది. ఆమె వనమందలి పత్రపుష్పాద్యలంకారములతో అలంకరింపబడి యున్నది. వనమందలి వస్తువులశోభకు ఆదర్శమైన ఆకారముకల్గియున్నట్లు ఆమె అతినిర్మలముగానున్నది. తనభర్తయైన మహాదేవుడు తనకొసంగిన ధనుస్సును నిర్మలమైన బాణమును ఆమెచేతఁదాల్చెను. ఆమె తనవామబాహువును బరమేశ్వరుని యంసమున ఆనుకొని యుండెను. ఆమ్మహామాతసుగంధము గల పూలగుత్తినిచేత దాల్చి దానిసువాసనను బాగుగాఁ బీల్చుచుండెను. ఆమె తనచేతితో మెల్లమెల్లగా మహాదేవుని వీచుచుండెను. మహాశివుడు క్రొంజిగుళ్ళతోనిండిన శాఖతో జక్కగా ఆవరింపబడియుండెను. బాలకులును మనోహరమైనకుక్కలుతో అతనికి ముందుగానడచుచుండిరి. వారు ఆమహాత్ముని యాశ్రయముచే బలవంతులై గర్వముతో నిండియుండిరి. సకల జగంబులకు అతడు గురువును దండ్రియునై వారిచే ధ్యానింపబడుచుండెను. ఇవ్విధముగానున్న మహేశ్వరుడు మహాతేజస్కుడై, కిరాత దేహము దాల్చియుండెను.

పైనున్న మంత్రముల యర్థముతోనిండియున్న ఈ శ్లోకములను మంత్రములకు మారుగా భక్తులు జపించుట మంచిది. పైమంత్రముల యర్థముగల ఈశ్లోకములకును మంత్రములకునుగల సంబంధమును బరికింతుముగాక

ఈతృతీయానువాకమునగల పదునేడు మంత్రములను సూచించును ఈశ్లోకములందు బదునేడుపాదములుకలవు. పరమేశ్వరునకుఁగల క్రియాధిపత్యము వీనిలో బ్రదర్శింపబడుచున్నది. పరమశివుని క్రియలలో మొట్టమొదటిదగు సృష్టిక్రియను ఆతనిప్రేరణచే అతని ప్రకృతియే (శక్తియే) గావించుచున్నది. ఆమెయే ఆదిశక్తియగు మూలప్రకృతి. సకల వస్తువులందును గల సత్త్వరజస్తమోగుణములు ఆమెవే. పదునాల్గు భువనంబులుగల బ్రహ్మాండముయొక్క నిర్మాణమున ఆమెకండగానున్న బ్రహ్మావిష్ణుమహేశ్వరులు ఆ మహాదేవుని యాశయముతోనున్నవారే. అప్పరాశక్తి అంశతోనున్నవారే

లక్ష్మీసరస్వతీ పార్వతులు అమ్మాలశక్తిరూపాన్తరమే మొదటి ధ్యానశ్లోకమున వనదేవతగాపేర్కొనబడినది. భక్తుల శుభాశుభకర్మలను ఆమె తన రూపముతో సహించుచున్నది. అదియే మంత్రమందలి "సహమాన" నామమున పేర్కొనబడెను.

శ్రీ భట్టభాస్కరవిరచితయజుర్వేద భాష్యమున రుద్రప్రశ్నమున తృతీయానువాకము సమాప్తము.





## -: చతుర్థానువాకము :-

తృతీయానువాకమున ఉభయతో నమస్కారములుగల యజుస్సులు చెప్పబడినవి. అటులనే ఈయనువాకమునందునను, ముందువెనుకల నమస్కారములుగల యజుస్సులుకొన్ని చెప్పబడుచున్నవి.

### —: ప్రథమయజుస్సు :—

"నమఆవ్యాధినీభ్యోవివధ్యన్తీభ్యశ్చవోనమః"

*అర్థము:-*

ఆవ్యాధినీభ్యః = సంపూర్ణముగా వేధించుటకు (పీడించుటకు) సమర్థులైన స్త్రీలకు, నమః = నమస్కారము. వివిధ్యన్తీభ్యశ్చ = విశేషముగా పీడించుటకు సమర్థులైన స్త్రీలగు, వః = మీకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భాష్యము:- సకలవస్తువులందేకాదు; సకల ప్రాణులందును శివ శక్తికలదు. ఆప్రాణులలో జీవులను పీడించునవికొన్ని. జీవులకు జీవన యాత్రలో సాయపడునవికొన్ని జీవులుచేయుకర్మల ననుసరించి,

వారినికొన్ని పీడించును. అపీడించువానిలోగొన్ని స్త్రీ మూర్తులు. ఆస్త్రీలుశివాజ్ఞచేతనే ప్రజలను బీడింతురు. కావున వారికిని నమస్కారములు సమర్పింపబడుచున్నవని గ్రహించవలసియున్నది. అందుచేతనే భక్తులు, అవ్యాధినులు, వివ్యాధినులునగు స్త్రీలను నమస్కరించుచున్నారు.

*81 వ నామము:- శివ:- "నమఆవ్యాధినీభ్యః"*

భ. భా భా:- ఆనెడి ఈయనువాకమునకు దుర్వాసుడు ఋషి. ఉష్ణిక్కుఛందస్సు. శంభుడు దేవత జీవులకుజెందినక్రియలకు, గుణములకు, ద్రవ్యములకునుజెందిన విషయములకు శివుడే అధిపతి; అను విషయము ఇందు జెప్పబడును. ఈయనువాకమందలి మంత్రములన్నియును ప్రత్యక్షకృతములే శివాంశయున్నకారణమున జీవులసంఘములు నమస్కరింపబడుచున్నవి.

సంహారకర్త శివుడు; కావున అతడు కర్మఫలానుకూలముగా జీవులను తన సేనకుజెందిన ఆయావిశేషజాతులచే బదునాల్గు భువనములలో ఎచ్చట నున్నను సర్వకాలములందును బాధింపజేయును. చితుకకొట్టించును. అట్టి బాధలుతొలగుటకై ప్రతిప్రాణియును అవ్యాధులైన సేనలను నమస్కరించును.

*82 వ నామము:- శివ- "వివిధ్యన్తీభ్యశ్చవోనమః"*

భ. భా. భా:- శివప్రేరణచే శివునిసేనలు ప్రాణులను బహువిధముల బాధించును. అందుచే వివిధ్యన్తులైనసేనలును నమస్కరింపబడు చున్నవి. బాహ్యజగత్తులోనున్న ఈశివసేనలే జీవుల అంతరజగంబున (శరీరములో) కామక్రోధాదిరూపముననుండి పీడించుచున్నవి.

*81, 82. నామములు:-*

*విష్ణు:-*

శివశక్తులవలె విష్ణుశక్తులును సేనలుగానుండి పాపులను శిక్షించును. విష్ణువిశిష్టయైనకట్టి విష్ణుభక్తుడైన అంబరీషుని బీడించు దుర్వాసునిపై జిమ్మ

బడి, శిక్షించి వానిగర్వమడంచినదికదా! అటులనే భక్తులైన ధ్రువకుచేలాదుల మనస్స్థైర్యము పరిశీలించుటకు విష్ణుప్రేరితలైన శక్తులు అభక్తులకు భయము గొల్పినవికదా! అందుచేతనే ప్రజలు అవ్యాధినులు, వివిధ్యన్తులైన విష్ణు శక్తులను నమస్కరింతురు.

*బీజాక్షరసంపుటి:-*

"అవ్యాధినీ" అను నామమునందు "అ+వ్+య్+అ+ధ్+ఇ+న్+ఈ" అని ఎనిమిదక్షరములుకలవు. ఇవి అష్టదిక్కులకును అష్టచక్ర ములకును జిహ్వములు. ఇందు వాయుబీజమైన యకారమును, వారుణబీజ మైన వకారమును ధనదబీజమైన ధకారమును శక్తిబీజమైన అకారద్వయము తోడను, ఈకారనకారములతోడను గూడియుండుటచే, ఈనామము నుపాసించు వారు శాక్తేయులై భూతవైద్యులై భూతపిశాచాదిబాధలను జలోదరవాతరోగాదు లను బోగొట్టగలవారలగుదురు. ధనవంతులై వాయుయంత్రములను జల యంత్రములను నిర్మించగలవారలగుదురని తెలియుచున్నది.

## 82 వ నామము-

"వివిధ్యన్తీ" అను నామమునందు "వ్+ఇ+వ్+ఇ+ధ్+య్+అ+న్+త్+ఈ" అని పదక్షరములుకలవు. ఇవి దశేంద్రియములకును దశదిక్కులకును జీహ్వములు. ఇదియును పైనామమునే పోలియుండుటచే, పైనామము నుపాసించువారికిలభించుశక్తులే ఈనామము నుపాసించువారికిని లభించునని తెలియుచున్నది.

## —; ద్వితీయయజుసు ;—

"నమఉగణాభ్యస్తృగ్ంహతీభ్యశ్చవోనమః''

**అర్థము:-**

ఉగణాభ్యః = ఉత్కృష్టగుణరూపలైన సప్తమాతృకలు మున్నగు స్త్రీలకు, నమః = నమస్కారము. తృంహతీభ్యశ్చ = పరులను హింసించుటకు సమర్థలైన దుర్గమున్నగు భయంకరదేవతలకును, నమః = నమస్కారము

**తాత్పర్యము:-**

సా. భా:- శివునిచెంతనుండి పార్వతీదేవికి బరిచర్యచేయుస్త్రీలుకలరు వారినే సప్తమాతృకలందురు. వారికి ఉగణలనిపేరు. వారిలో శివశక్తికలదు. కావున వారిని భక్తులు నమస్కరింతురు. మహాదేవునిచెంతను పార్వతీదేవి అవతారములైన దుర్గాదిదేవతలుందురు. వారుచూడ భయంకరులు. వారు దుర్మార్గులైన రాక్షసాదులను హింసింప సమర్థలు. వారియందును శివశక్తి కలదు. కాన వారికిని భక్తులు నమస్కృతులు సమర్పింతురు.

**838 వ నామము- శివ:- "నమఉగణాభ్యః"**

భ భా. భా: పరమశివునిసేనాముఖమున ప్రమథగణములుకలవు. అవికాక ఉత్కృష్టగణములుకల సప్తమాతృకలునుగలరు వారు (1) బ్రహ్మి (2) మహేశ్వరి (3) కౌమారి (4) వైష్ణవి, (5) వారాహి (6) ఇంద్రాణి (7) చాముండి అను నామమునగలరు. వారు నేరముచేసిన జీవులను శిక్షింతురు. అందుచే వారిని భక్తులు నమస్కరింతురు. వారినే ఉగణలందురు.

*84 నామము:- శివ:- "తృంహతీభ్యశ్చవో నమః"*

భ. భా. బా:- "తృహూ = హింసాయామ్" అను ధాతువునుండి ఏర్ప డిన తృంహతీశబ్దమునకు హింసించువారని యర్థము. వారేదుర్గాదిదేవతలు. వారు పూర్వజన్మకర్మలననుసరించి, జీవులకు కఫవాత పిత్తవ్రణాదిరోగము లను, ధననాశాదినష్టములను, రాజదండనాదిశిక్షలను, ఒసంగుదురు. అట్టి హింసలను బోగొట్టుకొనుటకే భక్తులు దుర్గాస్తోత్రాదులను బఠించుచు, దుర్గా పూజాదులను ఆచరించి, వారికి నమస్కరించెదరు.

*83, 84 నామములు:- "సర్వదృక్ సింహః"*

*విష్ణు:-*

అను విష్ణు సహస్రసూక్తిలోని సింహనామమును బరిశీలించినచో విష్ణువుకూడ కర్మఫలాను సారముగా జీవులను హింసించును. కావున సింహ నామకుడాయెను ఆ సింహశక్తియే "వారాహీవైష్ణవీ, ఇంద్రాణీ" అను భేదములతోనుండి పాపజీవులను శిక్షించును. ఆ విష్ణుశక్తికలదేవతలకే "ఆవ్యాధినీ, వివిధ్యన్తీ, ఉగణ, తృంహతీ" అను నామములుకలవు. అందుచే భక్తులు పైనామములతో విష్ణుశక్తులను సైతము నమస్కరింతురు. పైవిధ మున భయముకల్గించువాడగుటచేతనే విష్ణువునకు "భయకృత్" అను నామము విష్ణుసహస్రమున బేర్కొనబడెను. ఈనామము సైతము పైనామముల యర్థ మునే వెల్లడిచేయుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

"నమఉగణాభ్యః" ఈనామమునందు "ఉ+గ్+అ+ణ్+ఆ" అని ఐదక్షరాలుకలవు. ఇవి పంచభూతములకును, పంచకోశములకును ఉపలక్షక

ములు. ఈ నామమున గణపతిబీజమైన గకారమును, నందిబీజమైన ణకార మును, వాయువరాశక్తి సర్వదేవతాబీజాక్షరములతోఁ గూడియుండుటచే దీని నుపాసించువారు పశుజాతికివాటిల్లు వాతాదిరోగములను బరిహరింపగల వారలును గణనాయకులనుగాఁగలరని తెలియుచున్నది.

"తృంహతీ" అను నామమున "త్ + ఋ + మ్ + హ్ + అ + త్ + ఈ" అని ఏడక్షరములుకలవు. ఇవిసప్తవాయుమండలములకు జిహ్వములు. ఈ నామము నుపాసించువారు దేవాలయములను విలాసభవనములను పాఠశాలలను నిర్మింపగలవారలగుదురు. గ్రహబాధలను దొలగింపగల వారలగుదురు.

—: తృతీయయజుస్సు :—

"నమోగృత్సేభ్యోగృత్సపతిభ్యశ్చవోనమః"

అర్థము:

గృత్సేభ్యః = విషయాసక్తులకు, నమః = నమస్కారము. గృత్సపతి = విషయాసక్తులను రక్షించునట్టి, వః = మీకు, నమః = నమస్కారము

తాత్పర్యము:

సా. భా:- లౌకికజీవనమునందు సైతము సంహారకర్తలలో శివాంశ యుండును. అట్టివారిలోజేరినవారే విషయాసక్తులు. వీరు శరీరసుఖము కోరుదురు. ఆస్తులను కుటుంబములను నాశనముచేసికొందురు. అట్టిపరిస్థితి రాకుండుటకై శివాంశతోగూడియుండు విషయాసక్తులను, వారినిరక్షించువారిని

నమస్కరించి, భక్తులు తమకట్టివి చేకూరకుండ కాపాడుదురు.

## 83, 84 నామములు:- "నమోగృత్సే భ్యోగృత్స పతిభ్యః"

*శివ:-*

బ. భా. భా:- లోకవ్యవహారములను దెలిసికొని జ్ఞాపకముంచుకొను టను మేధయందురు. అదికలవారు మేధావులు. వారినే గృత్సులు అందురు. వారియందుఁ బరమేశ్వరాంశయుండును. వారుమంచిబుద్ధిమంతులై జీవింతురు. వారికిఁ బతులైన వారిని గృత్సపతులందురు. ఈనాడు నూతన విషయములను గనుగొనినవారిని, విజ్ఞానశాస్త్రవేత్తలు మొన్నగువారిని గృత్సులు, గృత్సపతులు అందురు. వారు శివశక్తిసంపన్నులుకాన నమస్కరింపబడుచున్నారు.

*విష్ణు:-*

గృత్సులు అనగా ధర్మార్థకామమోక్షములను అభిలషించువారు. వారికే "కామీ" అనిపేరు. వారికోర్కెలను దీర్చినవారికి, పాలకులుగానున్న వారికి "కామపాలులు" అనిపేరు వారే గృత్సపతులు. "కామీ, కామపాలః" అను విష్ణుసహస్రనామములును, "గృత్సః, గృత్సపతిః" అను నమకనామము లను సమానార్థకములే. కావున నీరెండునామములును, విష్ణువునకుఁ జెల్లు నని తెలియుచున్నది

*బీజాక్షరసంపుటి:-*

"గృత్స" అను నామమున "గ్ + ఋ + త్ + స్ + అ" అని ఐదు అక్షరములుకలవు. ఇవి పంచాగ్నులకు, పంచప్రాణములకును జిహ్నములు. దీనినుపాసించువారు బ్రహ్మజ్ఞానులును, వాస్తుశాస్త్రజ్ఞులునై, గణపత్యారాధ నచే, ప్రారబ్ధకార్యములను నిర్విఘ్నముగా ఆచరింపగలరు. రక్తప్రసరణ

లోపము రక్తలోపము, మున్నగు వ్యాధులను నివారింపగలవారగుదురు. గృత్సపతినామమున "ప్+అ+త్+ఇ" మఱినాల్గక్షరములతో కలిసి తొమ్మిది అక్షరములుకలవు. ఇవి నవావరణములకును శరీర నవద్వారముల కును జిహ్వములు ఈనామము నుపాసించువారు శరీరభాగములందు నీరు చేరుటచే గల్గురోగములను నివారింపగలరు. జలవర్షకయంత్రనిర్మాతలు కాగలరు.

—; చతుర్థయజుస్సు ;—

'నమో వ్రాతేభ్యో వ్రాతపతిభ్యశ్చవో నమః'

**అర్థము:-**

వ్రాతేభ్యః = నానాజాతులసంఘములకు, నమః = నమస్కారము; వ్రాతపతిభ్యః = సంఘాధిపతులైన, వః = మీకు నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:- నానావస్తుజాతమునందును శివాంశకలదు. అందుచే వస్తు సంఘములకును ఆయావస్తుసంఘాధిపతులకును భక్తులు నమస్కారములు సమర్పింతురు.

*87, 88 నామములు;- శివ;-*

భ. భా. భా:- నియతమైనవృత్తిలేని నానాజాతులవారిసంఘములకు వ్రాతములనిపేరు. తమ శరీరమును అమ్ముకొని జీవించువేశ్యలను, శరీర కష్టముతో బ్రతుకువారిసంఘములను, ఇతరములను సంహరించుచు జీవించు వారి సంఘములను అనగా మాంసవిక్రేతలు, వ్యాధులుమున్నగువారిని "వ్రాతలు" అందురు వానియందును శివాంశయుండును; కాన వానిని నమస్కరింతురు. అంతేకాదు. వారినిగాపాడువారిసంఘములను వ్రాతపతులందరు. వారియందును శివాంశకలదు; కాన వ్రాతపతులను నమస్కరింతును.

*విష్ణు:-*

"వృత్ = వర్తనే" అను ధాతువునుండి వ్రాతపదముపుట్టెను; ఆధాతువునకు ఆవరించుట, గ్రహించుట, అభిలషించుట, ఇష్టపడుట, పంచుట విభజించుట, మున్నగు నర్థములుకలవు. సకలజీవులందును వ్యాపించియుండుట చేతను, బ్రహ్మాండబాహ్యాభ్యన్తరములను ఆవరించియుండుటచేతను, భక్తులైన ముక్తులను దనలోనికిగ్రహించుటచేతను, దేవరాక్షసులకు అమృతమును బంచుటచేతను, సకలవస్తువులను చేతనాచేతనములుగ విభజించుటచేతను, విష్ణువునకు, వ్రాత, వ్రాతపతి అను నామములు వర్తించుచున్నవి. విష్ణుసహస్ర మందలి "అనంతరూపుడు, సంవృతుడు, కృష్ణుడు, నైకకర్మకృత్తు, వశి గ్రహుడు, విష్ణువు, వ్యాపీ," అను నామములు పైనామములయర్థమునే వ్యక్తముచేయుచున్నవి. కాన విష్ణువునకు "వ్రాత, వ్రాతపతి" అను నామ ములు చెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

"వ్రాత" అనునామమున" "వ్+ర్+అ+త్+అ" అని ఐదక్షర ములుకలవు "వ్రాతపతి" నామమున "ప్+అ+త్+ఇ" అను మరి నాల్గు అక్షరములతోబాటు తొమ్మిది అక్షరములుకలవు ఇవి పంచవృత్తులకును, పంచకోశములకును, నవావరణలకును, శరీరనవద్వారములకును జిహ్వములు పైనామముల నుపాసించువారు, జలప్రకోపము, అగ్నిమాంద్యము, మున్నగు రోగములకు నిలయములైన శరీరయంత్రములకువాటిల్లిన రోగములను బోగొట్ట గలవారలగుదురు. అంతేకాదు. కృత్రిమవర్షమునొసంగుయంత్రములను, జలప్రవాహకయంత్రములను, నిర్మింపగలవారలగుదురు.

## —: పంచమయజుస్సు :—

"నమోగణేభ్యోగణపతిభ్యశ్చవోనమః"

**అర్థము:-**

గణేభ్యః = దేవానుచరగణములకు, నమః = నమస్కారము. గణపతిభ్యశ్చ = దేవానుచరగణప్రభువులైన, వః = మీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:- యజ్ఞయాగాదులకుజెందిన దేవగణములెన్నియోకలవు. వానికి ఎందఱో దేవులు ఇంద్రాదులు అధిపతులుగాగలరు. ఆగణములందును దైవాంశకలదు. కానవారికి నమస్కారము.

**89, 90. నామములు:- "నమోగణేభ్యో, గణపతిభ్యశ్చ"**

**శివ-**

భ. భా. బా:- మహాదేవుని అనుచరులు ప్రమధాదులు ఎందఱో కలరు. అష్టభూతగణములెన్నియోకలవు. ప్రమథాదులులకు నందికేశ్వరుడు పతి(ప్రభువు.) భూతములైన అకాశాదులకు పతిపరమేశ్వరుడే ఆగణములును గణపతులను శివస్వరూపులే కాన వారునమస్కరింపబడుచున్నారు. "గణానాంత్వాగణపతిగ్ంహవామహే" అను మంత్రమును అనుసరించిచూచినచో దేవగణములకుఁ బ్రభువు పార్వతీపుత్రుడే వినాయకుడేయని తెలియుచున్నది. ఆతడును శివప్రభావసంపన్నుడేకాన ఆతడును నమస్కరింపఁబడుచున్నాడు.

**విష్ణు:-**

"గణ్"ధాతువునుండి పుట్టిన గణశబ్దమునకు లెక్కించువారు, లెక్కింపబడువారని యర్థము గౌరవముచూపుట అను నర్థముకూడకలదు పరమేశ్వరుడైన విష్ణువు గణకులైన భక్తులచే పురుషోత్తముడుగా లెక్కింపబడునపుడు

గణకులైన భక్తులు ఆశ్రయులు గణింపబడు విష్ణువు ఆశ్రయము. "ఆశ్రయాశ్రయిణోరభేదః" అను న్యాయముచే గణకులైన భక్తులకును, గణపతియైన విష్ణువునకును భేదములేదు. కావున, "గణగణపతులు" ఇరువురును నమస్కరింపబడుచున్నారు. జ్యోతిర్గణముకూడా "తమేవభాన్తమను భాతిసర్వమ్" అను శ్రుతిలో జెప్పినట్లు పరమాత్మయైన విష్ణువు ననుసరించిప్రకాశించును. కావున అవియును ప్రధానగణములే వానికి ప్రభువు కావున, విష్ణువు "జ్యోతిర్గణేశ్వరః" అని స్తుతింపబడుచున్నాడు. ఈ విష్ణుసహస్రనామమును, ఇందలి గణపతి నామమును సమానార్థకములే. పైరెండు నామములచేఁ దెలియఁజేయబడు విష్ణువును విష్ణుభక్తులును, నమస్కరింపఁబడుచున్నారు

*బీజాక్షరసంపుటి:-*

ఇట గణశబ్దమున "గ్ + అ + ణ్ + అ" అని నాల్గు అక్షరములు కలవు. ఇవి నాల్గుపురుషార్థములకును, అంతఃకరణచతుష్టయమునకును చిహ్నములు. "గణపతి" నామమున "ప్ + అ + త్ + ఇ" అని మఱినాల్గు అక్షరములు అధికముగాగలవు. ఆయెనిమిదక్షరములు, అష్టప్రకృతులకును, అష్టచక్రములకును చిహ్నములు.

ఇందుగల గణపతి నందిబీజములును పర్జన్యబీజమును అకారేకారములతోగూడియున్నవి. పైరెండు నామములనుపాసించువారు సర్వకార్యముల నిర్విఘ్నముగానొనర్చి, సర్వత్రసిద్ధిపొందగలరు. సకల జీవులకవసరమగు జలమొసంగుయంత్రనిర్మాతలుకాఁగలరు. సర్వకాలములందును అవసరానుకూలముగా వర్షముకురిపించగలవారలై సర్వకార్యములందును వృద్ధిసిద్ధులను బొంచగలరని తెలియుచున్నది.

-: షష్ఠయజుస్సు :-

"నమోవిదూపేభ్యోవిశ్వరూపేభ్యశ్చవోనమః"

**అర్థము:-**

విరూపేభ్యః = వికృతరూపులైన నగ్నముండాదులకు, నమః = నమస్కారము. విశ్వరూపేభ్యశ్చ = తురంగగజవక్త్రాదినానారూపములను దాల్చు భృత్యులును అగు, వః = మీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:- పరమాత్మనుండివేర్పడిన శక్తియే ప్రకృతి. దానిరూపాన్తరమే 14 లోకముల సమష్టిరూపము. అందుగల జంతుజాలమున శివశక్తి కలదు ఆ జంతుజాలమున విరూపులు, అనగా వికృతరూపులైన, నగ్నముండాదులు కలరు. అంతేకాదు విశ్వరూపులైన తురంగగజవక్త్రాది నానావిధరూపధారులు కలరు. వారికందరికిని నమస్కారము.

## 91, 92. నామములు "నమోవిరూపేభ్యః, విశ్వరూపేభ్యశ్చ"

**శివ:-**

భ భా. భా:- శివశక్తియైన ప్రకృతి అష్టవిధములగలదు. (1) భూమి (2) నీరు, (3) గాలి, (4) అగ్ని, (5) ఆకాశము, (6) మనస్సు (7) బుద్ధి, (8) అహంకారము అనునవి ప్రకృతిభేదములు. నగ్నులు (వస్త్రహీనులు) ముండులు (బోడిగుండువారు) వికలాంగులు సొట్ట, మూగమున్నగువారు, అతిరిక్తాంగులు (బూర, గూడ, మున్నగురూపముగలవారును విరూపులు. వీరు ప్రకృతి వికారములే. అంతేకాదు. విశ్వరూపులు అనగా స్వేచ్ఛగా సంచరించు గజసింహవ్యాఘ్రాదులును పైనజెప్పిన ప్రకృతిచే ఏర్పడినవే. వీనియందు శివశక్తికలదు కాన నమస్కరింపబడుచున్నవి.

**విష్ణు:-**

"మమయోనిర్మహద్బ్రహ్మ" అను గీతా సూక్తిచేమహావిష్ణువు యోనియే ప్రకృతియని తెలియుచున్నది. అదియే పరాప్రకృతిగా అపరాప్రకృతిగాఁ గలదు. దానియొక్క రూపాన్తరములే పంచభూతములు.

“ప్రభాస్మి శశిసూర్యయోః” “జ్యోతిషాం రవిరంశుమాన్” “నక్షత్రాణా మహం శశీ” అను గీతాసూక్తులచే మహావిష్ణువు విభూతి” సూర్యచంద్రులలోఁ గలదు; వారిలో నున్న ప్రభయు (కాంతియును) విష్ణువిభూతియే; అని తెలియుచున్నది. కావున అట్టి ప్రకృతిలోఁ గల జంతుజాలము పైనఁజెప్పిన విష్ణుప్రభ లోపించినపుడును, పంచభూతములపాళ్ళు లోపించినపుడును విరూపమగును. అట్టి విరూపులేనగ్నముండాదులు. విష్ణువు సింహవ్యాఘ్రాదివిరూపధారియై ప్రకృతిలోఁ గలడు. కావున విశ్వరూపుడాయెను. “అనన్తరూపోఽనన్తశ్రీః” “విశ్వమూర్తిర్మహామూర్తిః” అను సహస్రసూక్తులందుగల “అనన్తరూపుడు, విశ్వమూర్తి” అను నామములును నమకమందలి, “విరూపవిశ్వరూప” నామములును సమానార్థకములే. కావున నీనామములు విష్ణువునకు జెల్లును. అందుచే అతడు పైనామములచే నమస్కరింపబడుచున్నాడు.

విరూపనామమున “వ్ + ఇ + ర్ + ఊ + ప్ + అ” అని ఆరక్షరములు కలవు. అవి షడింద్రియములకును, షడృతువులకును చిహ్నములు. ఇందున్న అచ్చులు శివవిష్ణువులను ప్రకృతియైనభూమిని సూచించు బీజములు. అందుచే ఈనామము శక్తిసహిత విష్ణుస్వరూపము ఇది సర్వమతములవారికిని ఉపాస్యమై రక్తపుఁబోటు, శ్యామలమున్నగు రోగములను నిర్మూలించుశక్తినొసంగును ఇందలి హల్లులు వరుణాగ్నిపర్జన్యబీజములు ఇవి పైయచ్చులతోఁగూడియున్న కారణమున పైనామము నుపాసించువారికి, బొల్లి, జలోదరము, అగ్నిమాంద్యము మున్నగు రోగములను నిర్మూలించు శక్తినొసంగును అంతేకాదు. పైనామోపాసనము జలప్రేషకయంత్రములను, అగ్నిప్రేషకాయుధములను నిర్మించుశక్తి నొసంగును. భూమిలో జలాగ్నిలోహతైలములుగల తావులను గనుగొనుశక్తిని, వానిని వెలిబుచ్చుయంత్రనిర్మాణశక్తిని ఉపాసకులకు నొసఁగును.

విశ్వరూపనామమున "వ్+ఇ+శ్+ప్+అ+ర్+ఊ+ప్+అ" అని తొమ్మిదక్షరములుకలవు. ఇవి నవబ్రహ్మలకును, శరీరస్థ నవద్వారములకును చిహ్నములు. పైనామము నుపాసించువారు అనుకూలవాతాతప వర్షములుకల్పించి, సస్యాదిసర్వసమృద్ధిని జేకూర్చగలరు; లక్ష్మీబీజమైన శవర్ణ ప్రభావముచే అనన్తసంపదలను జేకూర్పఁగలవారలగుదురు.

—: సప్తమయజుస్సు :—

"నమోమహద్భ్యః క్షుల్లకేభ్యశ్చవోనమః"

**అర్థము:-**

మహద్భ్యః = అణిమాద్యష్టైశ్వర్యములతోగూడినవారికిని, నమః = నమస్కారము. క్షుల్లకేభ్యశ్చ = అష్టైశ్వర్యములులేని, వః = మీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము-**

అణిమాద్యష్టైశ్వర్యములుకలవాడు మహాదేవుడు. అతడు మహాత్ము లందఱను, హీనులందఱను దనయందను వారికర్మఫలమునకు అనుకూలముగా నుంచును. అందుచే భక్తులు ఈశ్వరునికివలె అష్టైశ్వర్యములుకలవారికిని, లేనివారికిని, సమానముగనే నమస్కారములను సమర్పించెదరు.

**93 వ నామము:- శివ:- "నమోమహద్భ్యః"**

భ భా భాః- లోకమున మహత్వము జ్ఞానముచేగాని, ఆకారముచే గాని ప్రభావముచేగాని యేర్పడను. "సత్యం జ్ఞానమనన్తంబ్రహ్మ" ఆ..

శ్రుతిచే జ్ఞానము బ్రహ్మస్వరూపమని తెలియుచున్నది. అది శివ విష్ణుస్వరూపము అటులనే అకారము సాత్త్విక రాజస తామస భేదముతోనుండును. అందుచే అదియును శివవిష్ణుస్వరూపమే "ఉత్సాహఃపౌరుషంశక్తిః" అను సూక్తిచే ఉత్సాహపౌరుషశక్తులు శివవిష్ణుతేజోంశములేయనితెలియును. వాని రూపాన్తరమే ప్రభావము జ్ఞానాకారప్రభావములచే గల్గిన మహత్త్వముగలవారు శివ స్వరూపులేయని తెలియుచున్నది.

"సార్కేందుగ్రహనక్షత్రాం ద్యాం కుర్యా ర్యే మహీతలే।
ప్రాప్యాష్టగుణమైశ్వర్యం యేన యాంతి సువిస్మయం।
యేషాంవిస్మయతేనిత్యంకర్మభిర్భగవాన్‌శివః

అను సూక్తిచే మహాశివుడు సూర్యచంద్రగ్రహనక్షత్రములతోగూడినట్లు ఆకాశమును మహీమండలమునగావించెను. ఆతనివలననే ప్రాణులు అష్టైశ్వర్యమును బొంది విస్మయమొందుచున్నవి. భగవంతుడైన శివుడు యజ్ఞయాగాదికర్మలచే నిత్యము విస్మయముగావించుచున్నాడు; అని తెలియుచున్నది సూర్యాదులచేతను, అష్టైశ్వర్యములచేతను, కర్మలచేతనుగల్గిన మహత్త్వము శివస్వరూపము. అదిగలవారు శివస్వరూపులే కాన నమస్కరింపబడుచున్నారు.

విష్ణు:-

"గుణభృత్‌నిర్గుణోమహాన్" అను విష్ణుసహస్రసూక్తి విష్ణువునకు "మహాను" అను నామముకలదని తెలియుచున్నది.

"అసంగోఽస్పర్శశ్చమహాన్‌శుచిః" అను ఆపస్తంబ సూక్తిచే శబ్దాదిగుణ రహితుడును, సూక్ష్మస్వరూపుడును, నిత్యశుద్ధుడునగుటచే విష్ణువునకు "మహాన్" అను నామమేర్పడినట్లుతెలియుచున్నది.

బీజాక్షరసంపుటి:-

"మహాన్" అను నామమున "మ్ + అ + హ్ + అ + న్" అని ఐదక్షరములుకలవు. అవి పంచభూతములకును, పంచకోశములకును బీజములు.

ఇందు శివసావిత్రీమదనబీజములైన హకారనకారమకారములు, అకారాకారము లతోఁగూడియుండుటచే పైనామము నుపాసించువారు శాక్తాద్వైతులును, జితేంద్రియులును అగుదురు. పంచభూతములవశమొనర్చుకొని, సర్వత్ర విజయములుకాగలరని తెలియుచున్నది.

## 94 వ నామము- శివ:- "నమః క్షుల్లకేభ్యః"

భ. భా. భా:- క్షుద్రమైన జ్ఞానము, ఆకారము, ప్రభావమునుగల వారు క్షుల్లకులు. మంచిచెడ్డవస్తువులన్నింటను దైవాంశకలదు; కాన మహా జ్ఞానులందువలె అల్పజ్ఞానులందును, మహాకారులందువలె నీచాకారులందును, మహాప్రభావముకలవారియందువలె నీచమైనప్రభావముకల వారియందును భగవంతుడుండును. కావున క్షుల్లకులను నమస్కరింపబడుచున్నారు. అట్లే కూటయుద్ధమునసల్పి, చెల్లాచెదురు చేయువారియందును దైవాంశయుండును. అందుచే వారును నమస్కరింపఁబడుదురు.

## విష్ణు-

"ఉద్భవః క్షోభణో దేవః" అను విష్ణుసహస్రసూక్తిచే సృష్టికాలమునఁ బ్రకృతియందును బురుషునియందును బ్రవేశించి, గుణవైషమ్యముకల్గించి, మహావిష్ణువు క్షోభకల్గించును. కావున విష్ణువు క్షోభణుడాయెను. క్షోభణక్షుల్లక శబ్దములు సమానార్థకములు కావున క్షుల్లకనామము విష్ణువునకుఁజెల్లును. సృష్టిలోగల ఉచ్చనీచవస్తువులన్నియుఁ బ్రకృతి పురుషులకు పయోగపడును. కావున వినాశకద్రవ్యములందును విష్ణుశక్తియుండును. విష్ణుశక్తిలేని వస్తు జాలమేలేదు. కావున విష్ణువును క్షుల్లకనామకుడేయగును. ఈనాడుక్షుల్లకము లైన ఆయుధములశక్తిని వృద్ధిచేయుటకే విజ్ఞానశాస్త్రవేత్తలు విష్ణుజ్ఞానము నుపయోగించుచున్నారు. భయకృత్ భయనాశనకృత్యములు రెండును విష్ణువు గావించునవే. కావున విష్ణువునకును క్షుల్లకనామము సరిపడును.

*బీజాక్షరసంపుటి:-*

క్షుల్లకనామమున "క్+ష్+ఉ+ల్+ల్+అ+క్+అ" అని యెని మిదక్షరములుకలవు. ఇవి అష్టప్రకృతులకు, శరీరమందలి అష్టచక్రముల కును జిహ్నములు. విద్యాతత్త్వమైన క్షకారము వాయుబీజమైన ఉకారముతోఁ గూడియున్నకారణమున నీనామము నుపాసించువారు యోగవిద్యతోబాటు సకల విద్యలనభ్యసించినవారై రాజవశీకరులు అగుదురు. పృథివీబీజమైన లకారద్వయమును ప్రజాపతిబీజమైన కకారమును, సర్వదేవతాకమైన అకారముతోఁగూడియుండుటచేఁ నీనామము నుపాసించువారు గుండలినీ శక్తి యోగవిద్యావేత్తలై శత్రుస్తంబనము మున్నగు కార్యములు ఘనకార్యములు చేయువారును, సకాల వృష్టినిరోధకదుష్టశక్తులను దొలగించి, సస్యాను కూలముగ వర్షముకురిపించఁ గలవారలునుగాఁగలరని తెలియుచున్నది.

## —: అష్టమయజుస్సు :—

*"నమోరథిభ్యోఽరథేభ్యశ్చవోనమః"*

*అర్థము:-*

రథిభ్యః = శరీరరథము నధిష్ఠించిన పరమాత్మకును, రథులైన(రథము గల) యోధులకును, జీవులకును నమః = నమస్కారము. అరథేభ్యః = రథములేని సామాన్యజీవులకును, శరీరరథములేని అప్రాణులున్నగు, వః = మీకును; నమః = నమస్కారము.

*తాత్పర్యము-*

సా. భా:- పరమాత్మ తన సృష్టిలోఁగల జీవులలో ప్రాణరూపముననూ అగ్నిరూపముననుండుటచే శరీరమేరథముగాఁగలవాడాయెను. అంతేకాదు.

శరీరరథముగల సకలప్రాణులును బరమాత్మరూపములే. రథికులైన యోధులును దైవస్వరూపులే రథములేని అనగా ప్రాణరహితములైన అచేతనములును సామాన్యమానవులును శివస్వరూపులే. అందుచే రథమునధిష్ఠించినట్టియును రథహీనులునగు సర్వులును భక్తులచే నమస్కరింపఁబడుచున్నారు.

## *95, 96. నామములు:- "నమోరథిభ్యః, అరథేభ్యః"*

*శివ-*

భ. భా. భా:- శివాజ్ఞచేఁ బ్రకృతి మూలానసృష్టి జరిగినది. అందు శివుడుచేతనాచేతన వస్తువులందంతటనుగలడు త్రిపురాసురసంహారకర్తయైన శివుడు రధారూఢుడైనట్లు సంహారకర్తలైనయోధులును రథారూఢులగుదురు. అందుచే భక్తులు రథికులనుసైతము తమను బాదింపవలదని నమస్కరింతురు. అరధులు (రధహీనులైన) సామాన్యయోధులందును శివశక్తియుండును. కావున వారికిని నమస్కారము.

*విష్ణు:-*

"శత్రుజిత్, రణప్రియః" అను విష్ణుసహస్రనామములను బరిశీలించినచో విష్ణువురథియై రణప్రియుడై శత్రువులనుజయించినట్లు తెలియును. కావున విష్ణువుకూడ శివునువలె రథినామకుడాయెనని తెలియుచున్నది. విష్ణువు ఇందుగలడు; అందులేడనవీలులేదు. సర్వాంతర్యామి. అందుచే సకలజీవుల శరీరములనెడి రథమునను ఆరూఢుడైయున్నాడని తెలియుచున్నది. "అమూర్తిః, అమూర్తిమాన్" అను విష్ణుసహస్రనామములను బరిశీలించినచో విష్ణువు రూపరహితుడనియును, రథము అనగా శరీరములేనివాడు కాన అరధుడనియును దెలియుచున్నది. "రథీ, అరథః"అను నామములు విష్ణువునకును సార్థకములే యని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

"రథి" అను నామమున "ర్+అ+ధ్+ఈ" అని నాల్గుఅక్షరములు కలవు అవి ధర్మార్థకామమోక్షములకును, మనోబుద్ధిచిత్తాహంకారములకును చిహ్నములు. ఇందు అగ్నిబీజమైన రేఫమును ధర్మబీజమైన ధకారమును బాలాబీజమగు ఈకారముతోడను, సకలదేవబీజమగు అకారముతోడను గూడి యుండుటచేఁ బైనామము నుపాసించువారు సకలవస్తుజాతమందుండు అగ్నులను, (1) సత్యము, (2) సావిత్రము, (3) నాచికేతము, (4) చాతుర్హోత్రము, (5) వైశ్వసృజము, (6) ఉపానువాక్యము, (7) అరుణకేతుకము, అనెడి పేర్లుగల అగ్నులను ఆరాధించువారై సంవత్సరమును, సూర్యుని, పరబ్రహ్మను ప్రత్యక్షమొనర్చుకొనువారై, తొలగినప్రాణములను, శరీరమును సంపాదించువారై, సకలలోకముల సంచరింపఁగలవారై పరబ్రహ్మతో తాదాత్మ్యమును అందినవారై ధర్మసంస్థాపకులై లోకరక్షకులుకాఁగరని తెలియుచున్నది. పంచభూతములకును చిహ్నములగు పంచాక్షరములుగల "అరథ" అను నామమును ఉపాసించువారు పైనపేర్కొన్న ఘనతగలవారే యగుదురని తెలియుచున్నది.

...: *నవమయజుస్సు* :...

*"నమోరథేభ్యోరథపతిభ్యశ్చవోనమః"*

*అర్థము:-*

రథేభ్యః = రథరూపులకు, నమః = నమస్కారము. రథపతిభ్యశ్చ = రథములకు ప్రభువులైనట్టియు, వః = మీకు, నమః = నమస్కారము. ఇందలి బహువచనము భిన్నత్వమున ఏకత్వమును సూచించును.

*తాత్పర్యము:-*

సా. భా:- ప్రాణముగలచేతనములందును భగవంతుడు పరమశివుడు కలడు. కావున అచేతనములైన రథములును, చేతనములైన రథపతులును శివస్వరూపులే అగుటచే నమస్కరింపఁబడుచున్నారు.

*97,98.* నామములు "నమోరథేభ్యః, రథపతిభ్యశ్చ" శివః-

భ. భా. భా:- "ఆధారాధేయములకు అభేదము" అను న్యాయముచే ఆధారమగురథమునకును, ఆధేయుడగు పరమశివునకును భేదములేదు. రథము నందుండుటచే మహాదేవుడు అధేయుడుఆయెను అందుచేఁబరశివుని రథములు నమస్కరింపబడుచున్నవి, పరమశివునిరథము రథజాతికిని పరమశివుడు రథపతులకును ఉపలక్షకులు కావున మంత్రమున "రథేభ్యః రథపతిభ్యః" అని బహువచనము ఏర్పడెను.

"హయాంశ్చచతురోవేదాన్ సర్వదేవమయంరథమ్"
అను మహాభారతవచనముచే, సర్వదేవమయమగు మహాదేవుని రథమునకు నాల్గువేదములు అశ్వములుగాఁ గలవని తెలియుచున్నది.

"అర్కాబ్జనేమిర్వేదాశ్వస్త్రయస్త్రింశన్ మరున్మయః। పురారేఃకల్పితో దేవైస్సరథోబ్రహ్మాసారథిః॥" అనుభవిష్యత్పురాణవచనముసైతము, దేవకల్పితమైన మహాదేవుని రథమునకు సూర్యచంద్రులు చక్రములుగా, వేదములశ్వములుగానున్నట్లు తెలియుచున్నది. రథావయవములును శివస్వరూపములే అగుటచే నమస్కరింపబడుచున్నవి. రథపతులు సంహారకర్తలు కాన శివస్వరూపులై నమస్కరింపఁబడుచున్నారు.

**విష్ణు:-** తమపైఁగూర్చుండువారిని ఆనందపఱచునది కాన రథమున కానామము సార్థకము రథమువలె అశ్వములును తమపైగూర్చుండువారిని ఆనందపఱచుచుభారమునుమోయును. కావునవానికి "ధుర్యములు" అను నామమువాటిలెను. రథములు అశ్వములు మున్నగునవన్నియును రథాంగములే. వానిలో "ధుర్యః" అను పదము విష్ణువునకు నామముగానున్నట్లు "స్కందస్స్కందధరోధుర్యః" అను విష్ణుసహస్రసూక్తిచేఁ దెలియుచున్నది. కావున ధుర్యపదమువలె రథపదమును విష్ణువునకు సార్థకనామమేఅగును. విష్ణువు తనపై ఆధారపడియున్న గజేంద్రాదులను రక్షించి ఆనందపఱచి నాడుకదా! కావున రథనామము శివకేశవులకు సమానముగనేవర్తించును. రథపతియనగా దనపైఆధారపడినవారిని, రక్షించి, ఆనందపఱచి, వారికి ప్రభువుగానున్నవాడని యర్థము. దానిననుసరించి విష్ణువు రథపతి నామకుడని తెలిసికొనవలెను. అందుచేతనే రథపతీ! అనివిష్ణువునుఁనమస్కరించుచున్నారు.

**బీజాక్షరసంపుటి:-**

"నమోరథేభ్యః" "రథ" అను నామమున "ర్+అ+థ్+అ" అని నాల్గక్షరములుకలవు. ఇవి చతురగ్నులకును అంతఃకరణచతుష్టయమునకును జిహ్వాములు. ఇందు అగ్నిబీజమైన రేఫము సంహారకరము. ధకారము జయప్రదమైన ధర్మబీజము. అవి అకారముతోగూడియున్నవి. అందుచే నైనామము నుపాసించువారు అగ్న్యారాధనగల యజ్ఞములనాచరించి, హోమములుచేసి అపారశక్తినార్జించి, శత్రుసంహారకులై జయశీలురై లోకమున ధర్మమును స్థాపించఁగలరు. అంతేకాదు. అగ్నినివారకములు, అగ్న్యుత్పాదకములు, అగ్నిప్రేషకములునగు ఆయుధములను, యంత్రములనుత్పాదించి, దేశవినాశక శత్రువులను సంహరించి, ధర్మమును స్థాపించఁగలరు.

"నమోరథపతిభ్యః" రథపతినామమున "ర్+అ+థ్+అ+ప్+అ+త్+ఇ" అని ఎనిమిదక్షరములుకలవు. ఇవి అష్టాగ్నులను, అష్టచక్రములను సూచించును. ఈ నామము నుపాసించువారు పైనామోపాసనచే బ్రాప్తించిన శక్తులతో సామాన్యయంత్రనిర్మాణశక్తిని, జలప్రేషకయంత్రశక్తిని, మేఘయాననిర్మాణశక్తినిఁ బొందగలరు; అని తెలియుచున్నది.

—: దశమయజుస్సు :—

"నమస్సేనాభ్యస్సేనానిభ్యశ్చవోనమః"

**అర్థము;**

సేనాభ్యః = రథగజతురగపదాతిరూపసేనలకు నమః = నమస్కారము; సేనానిభ్యశ్చ = సేనానాయకులైనట్టి వః = మీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:- రథగజతురగపదాతిరూపసేనలు శత్రుసంహారకములు. సేనానాయకులును శత్రుసంహారకులే. సంహరించువస్తువులందును జీవులందును లయకర్తయైన శివునితేజస్సుండును. కాన వానికి నమస్కారము.

***99, 100. నామములు:- నమస్సేనాభ్యః, సేనానిభ్యశ్చ***

***శివ:-***

భ భా. భా:- పరమాత్మ తనలోనుండి బైటపడిన తన శక్తికి(జెందిన సత్వరజస్తమోగుణములను, అగుణములు కలత్రిమూర్తుల తేజస్సుతోనింపి యున్నాడు. వానిలో(గొన్ని జగన్నిర్మాణకములు. కొన్నిజగద్రక్షకములు. కొన్నిజగన్నాశకములునగుచున్నవి. త్రిమూర్తులలో శివుడు నారాయణుడువలె అంతటను ఆవరించియున్నాడు ఆతడు సేనలరూపమునంది, యుద్ధక్రీడలను గావించుచున్నాడు. అంతేకాదు సేనానాయకులరూపముననుండియు ఆసేనలను ప్రపంచమంతటను నడిపించి, సంహారక్రీడలనొనర్చుచున్నాడు. అందుచే సేనలను సేనానులను నమస్కరించుచున్నారు. అట్టి శివశక్తియే ప్రమథగణములనెడి సైన్యమునందును అట్టి సైన్యమున కధిపతియైన నందీశ్వరునందునుగలదు. దేవసేనకంతటికిని నాయకుడైన తనపుత్రుడు కుమారస్వామియందు శివుడు తనశక్తిని ప్రవేశపెట్టినాడు తారకాసురిని సంహరింపజేసినాడు. కావున ప్రమథగణరూప సేనలకును, సేనానులైన నందీశ్వరునకును, కుమారస్వామికిని నమస్సులు సమర్పింప(బడుచున్నవి.

**విష్ణు-**

శౌర్యధైర్యాది సమృద్ధియే విభూతి. అట్టి విభూతిగల చేతనాచేతనవస్తుజాతమంతయును బరమాత్మయైన విష్ణువుయొక్క స్వరూపమే అను విషయము

"యద్యద్విభూతిమత్ సత్వం శ్రీమదూర్జితమేవవా।
తత్తదేవావగచ్ఛత్వంమమతేజోంశసంభవమ్॥

అను గీతాసూక్తిచేదెలియుచున్నది. నావిభూతిగల చేతనాచేతనమంతయును సిరిసంపదలు, కళాకాంతులనుగలదై గొప్పతనముచెందియున్నది. అదంతయును నాతేజస్సునుండి సంభవించినదేయని యెఱుగుము; అని శ్రీకృష్ణభగవానుడుచెప్పినాడు పైమంత్రమునజెప్పినసేన, సేనానాయకులును శౌర్యధైర్యాదిరూపవిభూతికలవారే. అందు విష్ణువుకలడు. కావున సేనానామము విష్ణువునకుజెందును. అట్టి సేనలలో ప్రధానమైన దేవసేనను నడిపించు కుమారస్వామి విష్ణువిభూతికలవాడే. "సేనానీనామహంస్కందః" అను గీతాసూక్తిలో, సేనానాయకులలో ప్రధానుడైన స్కందుడు కుమారస్వామినేనే అని భగవంతుడు శ్రీకృష్ణుడుచెప్పినాడు. అందుచే సేనానినామము సైతము విష్ణువునకుఁ జెందునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

"నమస్సేనాభ్యః సేనానిభ్యశ్చ" "సేనా" అను నామమున "స్+ఏ+న్+ఆ" అని నాల్గుఅక్షరములుకలవు. ఇవి అంతకరణచతుష్టయమునకును, చతురగ్నులకును చిహ్నములు. "సేనానీ" అను నామమున "స్+ఏ+న్+ఆ+న్+ఈ" అని ఆరక్షరములుకలవు ఇవి షడృతువులకును షడింద్రియములకును ఉపలక్షకములు. ఈ రెండునామముల మొత్తమున "ఆకారేకారములు" శక్తిబీజములు ఏకారము వీరభద్రబీజము. ఇవి శక్తిపురుషుల సహస్థ్యుపాసనకుఁ జెందినవి. శాక్తేయుల జపంబునకుఁ ప్రధాననామములు. వానితోగూడిన సకారనకారములు వరుసగా సావిత్రీ శక్తిబీజములు. ఈ రెండునామములందును శక్తిబీజములే ఎక్కుగాగలవు. కావున వీనినుపాసించువారు శాక్తేయులై పాపపరిహారకులును స్థితికరులునై, సర్వమును వశపఱచుకొని సామాన్యులకువాటిల్లుమానసికరోగములను బోగొట్టఁగలవారలగుదురు. జ్ఞానులగుదురు. నూతనవస్తువులను సృష్టించఁగలవారలగుదురు. మానవసంఘమును సన్మార్గమున నడిపించఁ గలవారలగుదురు.

## —: ఏకాదశయజుస్సు :—

"నమఃక్షత్తృభ్యఃసంగ్రహీతృభ్యశ్చవోనమః"

**అర్థము:-**

క్షత్తృభ్యః = రథశిక్షకులును, సంగ్రహీతృభ్యశ్చ = రథములను గ్రహించుసారథులునగు, వః = మీకు, నమోనమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:- యజ్ఞరూపరథమును శరీరరూప రథమును నడిపించువాడు పరమాత్మయే. కాన ఆతనికి "క్షత్తా" అను నామమువాటిల్లెను. యజ్ఞ శరీరములరూపమున గలరథమును నడిపించువాడును బరమాత్మయే. కావున బరమాత్మను బరమాత్మరూపమహాదేవుని భక్తులు నమస్కరించెదరు.

## 101,102. నామములు "నమఃక్షత్తృభ్యః, సంగ్రహీతృభ్యః"

**శివ:-**

భ. భా. భా:- "క్షద" ధాతువునుండు యేర్పడిన క్షత్తృ పదమునకు హింసించువాడని యర్థముకలదు. హింసించువాడు సంహారకర్త పరమశివుడు ఆతడు నేకరూపముల హింసించును. అతడే సారథిరూపముననుండి రథములకు శిక్షారూప హింసనొసంగును. కావున ఆతనికి "క్షత్తా" అను నామమేర్పడెను. ఆ పరమశివుడే సన్మార్గమున నుంచుటకై రథములను సంగ్రహించును. కావున సంగ్రహీతృ నామధారియాయెను. అందుచే క్షత్తృ సంగ్రహీతృ నామకుడైన పరమేశ్వరునకునమస్కారములు సమర్పింపఁబడును.

**విష్ణుః-**

షదధాతువునకు గత్యర్థముకలదు. కావున దానినుండియేర్పడిన షత్త్ర నామమునకు సర్వవ్యాపకుడని యర్థము. షత్త్రా, అనగా అంతటను వ్యాపించు వాడని యర్థము. "షత్త్రా, విష్ణుః" అను రెండునుసమానార్థకములే. అందుచే షత్త్రనామము విష్ణువునకుఁజెల్లును. విష్ణువు సమస్తమును దనలోనికి సంగ్ర హించును. కావున "అతీంద్రస్సంగ్రహస్సర్గః" అను విష్ణుసహస్రనామమున సంగ్రహనామము విష్ణుపరముగా బేర్కొనఁబడెను. సంగ్రహసంగ్రహీత్రనామ ములు రెండును సమానార్థకములే. ఒకే గ్రహధాతువునుండియేర్పడిన పద ములే. కావున సంగ్రహీత్రనామము విష్ణువునకుజెల్లునని తెలియుచున్నది.

**బీజాక్షరసంపుటి:-**

షత్త్రనామమున "క్+ష్+అ+త్+ఋ" అని ఐదక్షరములుకలవు ఇవి పంచాగ్నులను, పంచప్రాణములను సూచించును. ప్రాజాపత్యబీజమైన కకారమును ద్వాదశాత్మబీజమైన షకారమును పరాశక్తిబీజమైన అకారము తోడను, వాస్తుబీజమైన తకారము బ్రహ్మదైవత్యమైన ఋకారముతోడను గూడియుండుటచేఁ బైనామమును సౌరశాక్తేయమతములవారుపాసించి, బ్రహ్మ జ్ఞానసంపన్నులు అగుదురని తెలియుచున్నది. పైనామము నుపాసించువారు పీతగ్రహవినాశకులై, కామెలరోగమును గ్రహబాధలను దొలగింప సమర్థు లగుదురని తెలియుచున్నది. సూర్యమండలగమనోపయుక్తయంత్రనిర్మాత లును, వృష్టికురిపించగలవారలునగుదురని తెలియుచున్నది.

సంగ్రహీత్రనామమున "స్+అ+మ్+గ్+ర్+అ+హ్+ఈ+ త్+ఋ" అని పదక్షరములుకలవు. అవి దశదిక్కులకును దశేంద్రియముల కును జిహ్వములు. శక్తిమదనబీజములైన సకారమకారములు సర్వదేవతాక మైన అకారముతోడను, గణపతివహ్నిబీజములైన గకారరేఫములు అకారము

తోడను, శివబీజమైనహకారము మాయాబీజమైన ఈకారముతోడను వాస్తు బీజమైన తకారము బ్రహ్మబీజమైన ఋకారముతోడను గూడియుండుటచే వైనామము నుపాసించువారు శైవ్యలుశాక్తేయులు, గాణాపత్యులును అగుదురు. అగ్నిమాపక యంత్రనిర్మాతలను సేనానాయకులునై ప్రజలకోరికలను నిర్విఘ్నముగా నెరవేర్పగలవారలును రక్తదోషనివారకములు, రక్తవృద్ధిదాయకములునగు ఔషధములను జేకూర్పగలవారలగుదురు.

## —: ద్వాదశయజుస్సు :—

"నమస్తక్షభ్యోరథకారేభ్యశ్చవోనమ-"

**అర్థము:-**

తక్షభ్యః = దేవాధిష్ఠానులైన శిల్పివిశేషులకు, నమః = నమస్కారము. రథకారేభ్యశ్చ = చక్కగారథములను నిర్మించు శిల్పులునగు, వః = మీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:- అష్టాదశవిద్యలను, 64 కళలును దైవాంశసంపన్నములు. వానియందు దైవమహిమకలదు. అందునను కళలుదేవుని సౌందర్యమును, నిరూపించును. వానిలో ప్రధానము శిల్పము. శిల్పమును నిర్మించువారిలో శిల్పులు ముఖ్యులు. "పౌరుషంనృణామ్" అను గీతాసూక్తిలో పౌరుషము దైవస్వరూపమనిచెప్పబడెను. అట్టిస్వరూపనిర్మాతలైన శిల్పులకును, రథకారులకును దైవదృష్టితో నమస్సులుసమర్పించుచున్నారు.

*103, 104. నామములు:- "నమస్తక్షభ్యో రథకారేభ్యః"*

*శివ:-*

భ భా. భా:- సృష్టిలోగల సమస్తమును మహేశ్వర విభూతికలదియే అందుత్తమవస్తువులలో అధికముగాను, తక్కువ వస్తువులలో తక్కువగాను మహాదేవుని విభూతి కలదు. కాన సర్వమును దైవముగా భావింపబడి నమస్కరింపదగినదే. ఈమంత్రమునఁ బేర్కొనఁబడిన తక్షులు శిల్పులు. రథకారులు విశ్వకర్మలు. వీరిలో విభూతికలదు. కావుననే వారు అనగా తక్షులు దైవతేజస్సుకల శిల్పకళనుద్ధరించిరి. విశ్వకర్మలు రథాదులను లోహదారు శిలాదులతో దైవతేజస్సుగల రథాదులను సృష్టించుచున్నారు. అందుచే తక్షులును, రథకారులును శివునిగా భావింపబడి నమస్కరింపబడుచున్నారు. "తక్షూ = తనూకరణే" అను ధాతువునుండియేర్పడిన "తక్షన్" అను దానికి శిలాదులను సూక్ష్మీకరించి, దివ్యతేజస్సును అందు జొనుపుటయనియర్థము. అది శివశక్తియే. రముధాతువునుండియేర్పడిన రథపదమునకు ఆనందకరమగు క్రీడ అని యర్థము. అట్టివినోదకరవస్తువులు రథాదులు. వానినిసృష్టించి, ఆనందపఱచుటశివాంశయే. అందుచే రథకారనామకుడైన శివునకు నమస్కారము.

విష్ణు-

తక్షపదమునకు గరుడుడు అనియునర్థముకలదు. అతడు విష్ణువునకు వాహనము. అతడు బ్రహ్మస్వరూపుడు "తత్ తద్వతోరభేదః" అనున్యాయముచే వాహనమైన తక్షునకును అధికలవిష్ణువునకును భేదములేదన్నమాట. అంతేకాదు "తక్ష, త్వష్టా" అను రెండుపదములును ఒకేధాతువునుండి పుట్టినవి. సమానార్థకములుకూడ. విష్ణువు ప్రజాపతిరూపమునందుండి సంహారసమయమున సర్వభూతములను సూక్ష్మీకరించును. కావున త్వష్టఅయెను. "విశ్వకర్మామనుస్త్వష్టా" అను విష్ణుసహస్రనామసూక్తిలో "త్వష్టా" అను పదము

విష్ణునామముగా పేర్కొనబడెను. కావున త్వష్టా" అను పదమునకు సమానార్థకమైన "తక్షా" అనుపదమును విష్ణునామమై విష్ణువును బోధించు నన్నమాట.

"రథము అనగా ఆనందము. విష్ణువు చేతనాచేతన వస్తుజాతమునకు శరీరరూపరథమును ఆనందనిలయముగా నిర్మించి, రథకారుడు = ఆనందకరుడగుచున్నాడు. "అనన్తరూపోఽనన్తశ్రీః" అను సహస్రసూక్తిలో జెప్పిన అనన్తరూపములలో రథకారరూపమొకటియైయున్నది. కావున రథకారనామము విష్ణువునకు జెల్లునని తెలియుచున్నది. ఈవిషయమే "ఆత్మానంరథినం విద్ధి శరీరంరథమేవతు" అనుమంత్రమునఁజెప్పబడెను. "రథీ, రథకారుడు" అనునవి సమానార్థకములే.

*బీజాక్షరసంపుటి;-*

"తక్షన్" అను పదమున "త్+అ+క్+ష్+అ+న్" అని ఆరక్షరములుకలవు. ఇవి షడృతువులకును, షడింద్రియములకును ఉపలక్షకములు. ఈనామము నుపాసించువారు వర్షకారకులైన సూర్యప్రజాపతుల శక్తులను సంపాదించి, అకాలవర్షములను గురిపించఁగలరు. ఋష్యశృంగాదులలోఁ బైదేవతలశక్తులుకలవు. కావున వారువచ్చుప్రాంతమున వర్షములు కురిసెడివి. ఇంతేకాదు. పైనామము నుపాసించువారు జలప్రేషకయంత్రముల నిర్మించి వానినుండి వింతశక్తులను జనింపజేయఁగలరు.

రథకారనామమున "ర్+అ+థ్+అ+క్+అ+ర్+అ" అని యెనిమిదక్షరములుకలవు. అవి అష్టప్రకృతులకుఁ జిహ్నములు. రేఫద్వయమును అకారమునుగలవు. అవి అగ్నిశక్తిబీజములు. వానితో బ్రాజాపత్యబీజమును, ధర్మబీజమైన థకారమునుగూడియున్నవి. అందుచేఁ బైనామము నుపాసించువారుశక్తి ప్రభావముచే వివిధాగ్నిశక్తులను సంపాదించి, అగ్న్యుత్పాదకయంత్రాయుధముల నిర్మించి, దుష్టశక్తులను సంహరించి, ధర్మమును స్థాపించగలరు. జయము సంపాదించగలరు.

—: త్రయోదశయజుస్సు :—

"నమఃకులాలేభ్యఃకర్మారేభ్యశ్చవోనమః"

**అర్థము:-**

కులాలేభ్యః = కుంభకారులకు (కుమ్మరులకు, నమః = నమస్కారము. కర్మారేభ్యశ్చ = లోహకారులగు, వః = మీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము-**

సా. భా:- త్రిమూర్త్యాత్మకుడగు పరమాత్మయొక్క విభూతి సర్వత్ర కలదు. కావున కులాలస్వరూపుడును, లోహకారస్వరూపుడునగు పరమేశ్వరు నకు నమస్కారములు సమర్పింపఁబడుచున్నవి.

**105, 106. నామములు- "నమఃకులాలేభ్యః, కర్మారేభ్యశ్చ"**

**శివ:-**

భ. భా. భా:- మహాశివుని సంహారశక్తి కుంభకారులలోను, లోహ కారులందును గలదు. భూమియందలి మట్టిని కుండలు మున్నగు వస్తువులకై మర్దించువాడు కులాలుడు. కర్మారమనగా వెదురు. దానిచే సూచింపబడు లోహ ములు కూడ కర్మారములే. వానివస్తువులను తయారుచేయువారు కర్మారులు. వారే లోహకారులు. కులాలులు అనగా కుమ్మరులు మట్టివస్తువులతో ధన మార్జించి జీవింతురు. కర్మారులు కత్తి, బంగారు, వెండి, రాగి, ఇనుము, ఇత్తడి మున్నగు లోహములతో జీవితావసరవస్తువులను నిర్మించి ధనమార్జించు కొని జీవింతురు. శివశక్తి సంపన్నులగుటచే కులాలులను, కర్మారులను నమస్కరింపఁబడుచున్నారు.

**విష్ణు-**

మహావిష్ణువు హిరణ్యాక్షునివధించుటకై భూమిని మర్దించెను. లక్షణా శక్తిచే భూమిపైగల రాజులు కుశబ్దముచే సూచింపబడుదురు. ఆ రాజులను

బరశురామావతారమువాల్చి, విష్ణువు 21 సార్లు మర్దించెను. కు = భూమిని లడతి = మర్దించుచున్నాడు అను వ్యుత్పత్తిచే కులాలశబ్దము విష్ణువునకు నామముగా జెల్లును. కుందరః = భూమిని మర్దించువాడు; కుం = భూమిని, ద్యతి = ఖండించువాడు కుందుడు. "కుముదః కుందరః కుందః" అను విష్ణు సహస్రసూక్తియందలి, కుంధరకుంద నామములును కులాలనామమును సమానార్థకములే కావున కులాలనామము విష్ణువునకును జెల్లును.

కర్మ = యజ్ఞకర్మను, ఇయర్తి = పొందువాడు కావున విష్ణువు కర్మారుడు అయెను. విశ్వమందలి లోహములను బోలు కర్మలుకలవాడు కావున విష్ణువునకును లోహాదికర్మకారులకువలె విశ్వకర్మనామముచెల్లును. అటులనే కర్మారనామమును లోహకారునకువలె విష్ణువునకునుజెల్లును. "నైకాత్మానైక కర్మకృత్" అను విష్ణుసహస్రసూక్తిలోఁ జెప్పినట్లు విష్ణువెన్నియోకర్మలను ఆచరించెను. అందుచే కర్మారనామము విష్ణువునకుఁ జెల్లును.

***బీజాక్షరసంపుటి:-***

కులాలనామమున "క్ + ఉ + ల్ + అ + ల్ + అ" అని ఆరక్షరములు కలవు. ఇవి షడృతువులకును, షడింద్రియములకును జిహ్వాములు. ఇందు వశీకరణాకర్షణశక్తులను దెల్పు అకారాకారములతోడను వాయుబీజమైన ఉకారముతోడను కకారలకారములుకూడియున్నవి. కకారము ప్రాజాపత్యము లకారము పృథివీబీజము. అందుచే బైనామము నుపాసించువారు శక్తివాయు ప్రభావములు సంపాదించుకొనినవారై యోగులగుటయేకాక, సకాలమున వర్షముకురిపించఁగలవారలై భూమిని సస్యసమృద్ధముగావించి, ప్రభువులను ప్రజలను వశపఱచుకొనఁ గలవారలగుదు.

కర్మారనామమున "క్ + అ + ర్ + మ్ + అ + ర్ + అ" అని ఏడక్షరములుకలవు. ఇవి సప్తాగ్నులకును సప్తధాతువులకు ఉపలక్షకములు పైనామమున అకారాకారములకు దోడువహ్నిబీజమైన రేఫద్వయమును,మదన

బీజమైన మకారమునుగలవు. పైనామము నుపాసించువారు అగ్న్యుపాసకులై దేశమునవాటిల్లు నీచకామముఁను ప్రమాదకరరోగబీజములను సంహరించి దేశక్షేమంకరులు కాఁగలరు. రోగనివారక వైద్యులుకాఁగలరు. మహారోగ నివారకౌషధ్రస్టలు కాఁగలరని తెలియుచున్నది.

—: చతుర్దశయజుస్సు :—

"నమఃపుంజిష్టేభ్యోనిషాదేభ్యశ్చవోనమః"

**అర్థము:-**

పుంజిష్టేభ్యః = పక్షిపుంజములను సంహరించువారికి, నమః = నమస్కారము; నిషాదేభ్యశ్చ = మత్స్యఘాతుకులైనట్టియు, వః = మీకు నమః = నమస్కారము.

**తాత్పర్యము-**

"బలంబలవతాంచాహమ్" అను గీతాసూక్తిచే బలవంతులబలము భగవంతుని అంశయనితెలియుచున్నది. భగవంతుడు సంహరించువారిలో బలము రూపమునయున్నవాడు. కావున పక్షులను సంహరించునట్టియు మత్స్యములను నశింపజేయునట్టివారికి నమస్సులు సమర్పింపబడుచున్నవి.

## 107, 108. నామములు- "నమఃపుంజిష్ఠేభ్యః, నిషాదేభ్యశ్చ"

**శివ:-**

శి.భ.భా.:— శివుడు సృష్టిలోనున్న చేతనాచేతనములందంతటను గలడు. ముఖ్యముగా సంహారకరుడైన కారణమున అతడు సంఘముగానుండు

పక్షులను బరివేష్టించి బాధించువారిలోను, మత్స్యఘాతుకులందును బలరూప మునను న్నాడు. "బలాయనమః, బలప్రమథనాయనమః" అను శ్రుతిలో జెప్పినట్లు బలవంతుడైవ పుంజిష్టలరూపమునను నిషాదులరూపమునను గల శివుని నమస్కరించుచున్నారు. పుంజిష్టులనగా పక్షిగణసంహారకులు, నిషాదులనగా మత్స్యఘాతుకులు. వీరందఱును శివస్వరూపులే. కావున వారికి నమస్కారము.

విష్ణు-

"ష్టై = వేష్టనే" అను ధాతువునుండి యేర్పడిన "ష్ఠ" అను పదమునకు "చుట్టుట" అని యర్థము. "పుంజి" అను పదమునకు అంగుష్ఠాదిప్రమాణము అని యర్థము పైరెండు పదములును గలియగానేర్పడిన "పుంజి+ష్ఠ" అను పదమునకు అంగుష్ఠాదిప్రమాణమును జుట్టి బ్రహ్మాండమునగల పురుషుడని యర్థము; అతడు శివుడని కొందఱును, కేశవుడని కొందఱును అందురు, అతడు శివకేశవస్వరూపుడనుటయథార్థము "అంగుష్ఠమాత్రః పురుషోజ్యోతిరివాధూమకః" అను శ్రుతియేదీనికి ప్రమాణము. ఈ విషయమే "ప్రమాణంబీజమవ్యయమ్" అను విష్ణుసహస్రసూక్తిచే సూచింపబడినది కావున పుంజిష్ఠపదము విష్ణువునకుజెల్లునని తెలియుచున్నది.

"నిషాద"పదము నిపూర్వకషద్లధాతువునుండి యేర్పడినది. "షద్ల = విశరణగత్యవసాదనేషు" అను దానిచేషద్లధాతువునకు గత్యర్థముకలదని తెలియుచున్నది. ని = నితరాం = మిక్కిలి, సీదన్తి = ప్రాణులు తన యందుండును; తననుజేరును; అనువ్యుత్పత్తిచే పరమాత్మయైన విష్ణువునందు జీవులన్నియును జేరియుండునని తెలియుచున్నది. కావున విష్ణువు నిషాదుడైనాడు "నిష్ఠాశాంతిఃపరాయణమ్" అను సహస్రసూక్తియందలి "నిష్ఠా" అను నామమునకును జీవులు తనయందుండుననియే యర్థము. అందుచే, నిషాద నిష్ఠాపదములు సమానార్థకములై విష్ణువును బోధించుచున్నవని తెలియుచున్నది. నాదబ్రహ్మయైన విష్ణువునందు సర్వములన్నియునుండును. కావున విష్ణువునకు నిషాదనామము ఏర్పడెననియును జెప్పవచ్చును.

బీజాక్షరసంపుటి:-

పుంజిష్ఠనామమున "ప్+ఉ+న్+జ్+ఇ+ష్+ఠ్+అ" అని ఎనిమిదక్షరములు కలవు. అవి అష్టప్రకృతులకును, అష్టచక్రములకును జిహ్వాములు. వాయుబీజమైన ఉకారముతో వర్ణన్యబీజమైన పకారమును, విష్ణుబీజమైన ఇకారముతో సావిత్రీబీజమైన నకారమును ఇంద్రబీజమైన జకారమును చంద్రబీజమైన ఠకారమును, సూర్యబీజమైన షకారమును అకారముతోడను గూడియుండుటచేఁ బైనామము నుపాసించువారు ఇళాపింగళానాడులద్వారా ప్రాణాయామముగావించి, వాతరోగములను, జలోదరాదిరోగములను, మెదడునకును ఊపిరితిత్తులకును జెందినరోగములను నివారింపగలవారలగుదురు. జలవాయుప్రేషకయంత్రములను సృష్టింపగలవారలగుదురు.

నిషాదనామమున "న్+ఇ+ష్+అ+ద్+అ" అని ఆరక్షరములు కలవు అవి షడింద్రియములకును, షడ్రుతువులకును జిహ్వాములు. ఇందుశక్తి బీజములధికముగానుండుటచే బైనామము నుపాసించువారు శక్త్యుపాసకులై యుద్ధవిజేతలును ఘాతవైద్యులును కాగలరనియును, "శ్యామల, బొల్లి, కుష్ఠు, పాండువు" అను రోగములను నివారింపగలవారలగుదురని తెలియుచున్నది.

—: పంచదశయజుస్సు :—

"నమఇషుకృద్భ్యోధన్వకృద్భ్యశ్చవోనమః"

అర్థము:-

ఇషుకృద్భ్యః = చక్కని శరములను జేయునట్టి, వః = మీకు, నమః = నమస్కారము. ధన్వకృద్భ్యశ్చ = చక్కనిధనస్సులను జేయునట్టి, వః = మీకు నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:- పరమాత్మసాధువులందును, అసాధువులందును, వృత్తివిధ్యాసంపన్నులందున్నుగలడు. కావున శరములు, ధనుస్సులు మున్నగు వానిని దయారుచేయుయంత్రకారులందునుగలడు. కానవారికి నమస్కారము.

## 109, 110. నామములు-"నమఇషుకృద్భ్యః, ధన్వకృద్భ్యశ్చ"

**శివ:-**

శ భా. భా:- సంహారకరుడై క్రమశిక్షణలోనుంచు శివునియొక్క శక్తిసకల ప్రాణులందేకాక ప్రాణములేని వస్తువులందును, బలరూపమునను తేజోరూపమునను, దహనశక్తిరూపమునను గలదు. అందుచే శివుడు "బలాయ నమః, బలప్రమథనాయనమః" అనికొనియాడఁబడి నమస్కరింపఁబడినాడు. కావున దుష్టులను సంహరించు సాధనములైన శరములందున్ను, ధనుస్సులందును, వానిని నిర్మించుయంత్రకారులందును బరమశివుడుకలడు. కావున శరధనుష్కారక్షులు నమస్కరింపఁబడుచున్నారు. అందుచే శివునకు, ఇషుకృత్, ధన్వకృత్'' అను నామములు చెల్లును.

**విష్ణు-**

"ఇష = గతౌ" అను ధాతువునుండియేర్పడిన ఇషుపదమునకు విష్ణుపదమునకువలె సర్వగమనుడు, సర్వవ్యాపకుడనియు నర్థములుకలవు. బలరూపమున శివుడువలె తేజోరూపమున విష్ణువు ఇషువై, కృత్ = జగద్రక్షణ కరుడు అగుచున్నాడు. కావున "ఇషుకృత్" అను నామము విష్ణువునకు ఏర్పడెను. అంతేకాదు.

"ధన్వకృత్" అను నామముకూడ విష్ణువునకు జెల్లును. "ధన్వ = మరణే" అను ధాతువునుండియేర్పడిన ధన్వపదమునకు నాశము అనియర్థము

కలదు. దుష్టులైన రాక్షసులకు ధన్వను = నాశమునుజేకూర్చువాడు కావున విష్ణువు ధన్వకృత్‌నామకుడు అయినాడు. "ధన = ధాన్యే, ప్రార్థనాయాంచ "అనుధాతువునుండియేర్పడిన ధన్వపదమునకు ప్రార్థింపబడువాడు అని యర్థముకలదు. గజేంద్రాదులచే ధన్వ = ప్రార్థింపబడినవాడై, కృత్ = రక్షణక్రియనొనర్చినవాడు; కావున విష్ణువు ధన్వకృత్‌నామకుడాయెను.

*బీజాక్షరసంపుటి:-*

"ఇషుకృత్" అను నామమున "ఇ + ష్ + ఉ + క్ + ఋ + త్" అని ఆరక్షరములుకలవు. ఇవి షడృతువులకు, షడింద్రియములకును జిహ్వములు విష్ణుబీజమైన ఇకారమును, సూర్యబీజమైన షకారమును, వాయుబీజమైన ఉకారమును వరుసగాగలవు పైనామము నుపాసించువారు వాయ్వగ్నుల శక్తులతో సూర్యమండలముచేరగలవారలగుదురు. పృథివ్యన్తరిక్షస్వర్గయానులుకాగలరు. అంతేకాదు. బ్రహ్మప్రజాపతిబీజములు కకారఋకారములు వాస్తుబీజమైన తకారముతోగూడియుండుటచే పైనామము నుపాసించువారు వాయ్వగ్నిసూర్యశక్తులతో పితగ్రహజనితరోగనివారకయంత్రనిర్మాతలు కాగలరనితెలియుచున్నది.

"ధన్వకృత్" అనునామమున "ద్ + అ + న్ + వ్ + అ + క్ + ఋ + త్" అని యెనిమిదక్షరములుకలవు. ఇవి అష్టదిశలకును శరీరమందలి అష్ట చక్రములకును జిహ్వములు. పైనామము నుపాసించువారు పలురకాల రోగములను నివారించువారును వృష్టికారకజలప్రేషక యంత్రనిర్మాతలును కాగలరని తెలియుచున్నది.

*—: షోడశయజుస్సు :—*

*"నమోమృగయుభ్యశ్శ్వనిభ్యశ్చవో నమః"*

*అర్థము:-*

మృగయుభ్యః = మృగములను జంపెడివ్యాధులకు, నమః = నమస్కా

రము. శ్వనిభ్యశ్చ = కుక్కలమెడలయందుగట్టబడిన పాశములనుదాల్చు, వః = మీకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:- పరమేశ్వరుడు నానావిధజాతుల మూర్తులరూపమున నుండును. అందుచే. వేటగాండ్రరూపమునను, కుక్కలను వెంచెడి యజమానులరూపముననుండు పరమేశ్వరుని భక్తులు నమస్కరించుచున్నారు.

***111, 112.* నామములు:- "నమోమృగయుభ్యః శ్వనిభ్యశ్చ".**

**శివ:-**

భ. భా. భా:- పరమేశ్వరుడు క్రూరజంతువులబారినుండి రక్షించు వ్యాధులరూపముననుండును. అంతేకాదు. మృగ = జంతువులను, యు = సక్రమమార్గమునకుజేర్చువానిరూపమునఉండును. తనకన్నకూతును బరిణయ మాడిన బ్రహ్మ, మహాదేవునివలన భీతుడై లేడిరూపముదాల్చిపఱుగెత్తునపుడు శివుడు వ్యాధునిరూపముదాల్చెను. భక్తుడైన అర్జునుని శక్తిపరీక్షింపఁదలచి పందిని దఱుముచున్న వ్యాధునిరూపముదాల్చెను. అందుచే శివునకు మృగయుడు అనునామముసార్థకమాయెను.

అనసూయకొసగినవరముననుసరించి పరమ శివుడు ఆమెకు పుత్రుడుగా బుట్టినపుడు దత్తాత్రేయునిరూపముదాల్చెను. అపుడు వేదములు శ్వానరూపము దాల్చెను. ఆసమయమునశ్వానములకు బరమశివుడు నేత = నాయకుడుఅయెను అందుచే బరమశివునకు శ్వనినామముసార్థకమాయెను.

**విష్ణు:-**

మృగము = జంతువగు ఏనుగు. విష్ణువు తన భక్తుడైన మృగమును గజేంద్రుని రక్షించి, యు = దానికిముక్తినిజేకూర్చెను. అంతేకాదు. మృగులు = యోగతపోజ్ఞానాదిమార్గములఁదనను అన్వేషించువారు, వారికి, యు = ముక్తినిజేర్చువాడు విష్ణువు. కావున విష్ణువునకు మృగయునామము సార్థకమాయెను.

"టు ఓశ్వి = గతివృద్ధ్యోః" అను ధాతువునుండియేర్పడిన "శ్వ" పదమునకు, శ్వయతి = గచ్ఛతి అను నర్థముకలదు కాన చేతనాచేతనవస్తువులను జేరు విష్ణువును "శ్వ" అనవచ్చును. "ని = నేత, శ్వాచఅసౌనిశ్చశ్వనిః" అనగా అంతటను వ్యాపించునాయకుడు అనియర్థము. కావున శ్వనినామము విష్ణువునకు జెందునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

మృగయునామమున "మ్ + ఋ + గ్ + అ + య్ + ఉ" అని ఆరక్షరములుకలవు. ఇవి షడృతువులకును షట్చక్రములకును జిహ్వాములు. వాయుబీజములైన యకారోకారములు రెండుకలవు. అందుచే ఈనామము నుపాసించువారు ప్రాణాయామపరులై పచ్చకామెర్లు, నీలిమ, రక్తదోషరోగములు, శ్యామల, మున్నగురోగములను, పీడాపిశాచాదిబాధలను దొలగింపఁగలవారలగుదురు వాయుయానయంత్రనిర్మాతలుకాఁగలరు.

"శ్వని"నామమున "శ్ + వ్ + అ + న్ + ఇ" అని యైదక్షరములు కలవు. ఇవి పంచభూతములకును, పంచేంద్రియములకును జిహ్వాములు. పైనామము నుపాసించువారు లక్ష్మీసంపన్నులై జలయంత్రనిర్మాతలై జలమునందుగల శక్తులను వస్తువులను బైటపెట్టగలవారలగుదురని తెలియుచున్నది.

—: సప్తదశయజుస్సు :—

*"నమశ్శ్వభ్యశ్శ్వపతిభ్యశ్చవో నమః"*

*అర్థము:-*

శ్వభ్యః = శ్వానరూపధారులకును, నమః = నమస్కారము. శ్వపతిభ్యశ్చ = శునకస్వాములైన వః = మీకు, నమః = నమస్కారము.

తాత్పర్యము-

సా. భా:- పరమాత్మ సమస్త ప్రపంచమునను గలడు. కావున యజమానియందును, విశ్వాసము కలవై, చోరాదులకు భయము గొల్పునవై రక్షించు శునకములందును అతని విభూతి కలదు. శ్వపతులై దుష్టజంతుగ్రాహకములగు శ్వానములకు స్వాములై దుష్టజంతుసంహారకులైనవారియందు అతని విభూతి కలదు. కాన శ్వానములును శ్వానపతులును నమస్కరింపబడుచున్నారు.

*113, 114.* నామములు- *"నమః శ్వభ్యః, శ్వపతిభ్యశ్చ"*

*శివ:-*

భ. భా. భా:- బ్రహ్మాండమంతటను ఆవరించిన విభూతిగల పరమశివుడు ఒకప్పుడు భైరవమూర్తియై కలడు. ఆ భైరవుడే శ్వానము శ్వానరూపమున నుండి రక్షించు కారణమున శ్వానామధారిమాయెను. శ్వపతులు క్షేత్రపాలకులు. కావున మహాదేవుడు శ్వపతిరూపముననుండి రక్షించుచు శ్వపతి నామధారియై నమస్కరింపబడుచున్నాడు.

విష్ణు:-

"శ్వయతి = గచ్ఛతి" అను క్రియనుండి నిష్పన్నమైన శ్వశబ్దమునకు సర్వవ్యాపకుడని యర్థము. అందుచే శ్వపదము విష్ణుపదముతో సమానార్థకమై విష్ణునామమాయెను. "శ్వాచ అసౌపతిశ్చ = శ్వపతిః" అని విశేషణోభయపద కర్మధారయముగా జెప్పినచో శ్వయైన = సర్వవ్యాపకుడైన, పతి = ప్రభువు మహావిష్ణువు. అందుచే శ్వపతినామము విష్ణువునకు జెల్లును. అందుచే శ్వపతియైన విష్ణువునకు నమస్కారము.

*బీజాక్షరసంపుటి:-*

"శ్వా" అను నామమున "శ్+వ్+అ" అని మూడక్షరములుకలవు అవి త్రికాలములకు త్రిశరీరములకు చిహ్నములు. లక్ష్మీబీజమైన శవర్ణము, వరుణబీజమైన వకారమును పరాశక్తిబీజమైన ఆకారముతో గూడియుండుటచే పైనామము నుపాసించువారు లక్ష్మ్యుపాసకులు. వారులోకమునవాటిల్లు జలోదరాదిరోగములకునివారకులై, సకాలవర్షముకురిపించగలవారై లోకులకు లక్ష్మినిజేకూర్పగలరనితెలియుచున్నది.

శ్వపతినామమున "శ్+వ్+అ+ప్+అ+త్+ఇ" అని ఏడక్షరములుకలవు. అవి సప్తవాయుమండలములను, సప్తధాతువులను సూచించును. పైనామము నుపాసించువారు కృత్రిమమేఘములను సృష్టించి, కృత్రిమవర్షము కురిపించగలవారై, జలప్రళయనివారకులై, నూత్నయంత్ర నిర్మాతలు కాగలరనితెలియుచున్నది.

సా. భా:- ప్రథమానువాకమున ప్రత్యక్షపరోక్షమార్గములలో మహాదేవుని మహిమప్రదర్శింపబడినది ద్వితీయానువాకమున లీలార్థముద్దేవతామూర్తియైన మహాదేవుడు ప్రధానముగాస్తుతింపబడెను. తృతీయానువాకమున రజోమూర్తియైన మహాదేవుడు ప్రధానముగాస్తుతింపబడెను. ఈచతుర్థానువాకమున నానాజాతిమూర్తియైన మహాదేవుడు ప్రధానముగా స్తుతింపబడెను.

భ. భా. భా.- ఈయనువాకమునకుజెందిన పురశ్చరణమిందుజెప్పబడుచున్నది. 12 రాత్రులు పూర్ణముగా కృచ్ఛ్రవ్రతము ఆచరించి 9 వేలు జపముచేయవలెను. పిమ్మట శివాలయమున 8 వేల ప్రదక్షిణములుచేయుచు నిరంతరము జపముచేయవలెను. అప్పటితో పురశ్చరణము పూర్తియగును. దినములలెక్కచూడక యథాభిమతము జపముచేయవచ్చును రాజయక్ష్మగల

మానవుడు సిద్ధినొందిన ద్విజునకు వరుణయిచ్చి, శాంతిచేయవలెను. ఇట్లు వరుణపొందిన విప్రుడు యజమాని యింటనొకభాగమున అగ్న్యారాధనకు బాహూమాత్రకుండమును నిర్మింపవలెను. అగ్నికుండమునకు ఎదురుగా వేదికను నిర్మింపవలెను ఆవేదికపైని తొమ్మిది జలపూర్ణఘటములను ఉంచవలెను. అఘటములకు దారముచుట్టవలెను. ఈయనువాకముచెప్పుచు మహాదేవుని అందు ప్రతిష్ఠించవలెను. ఆవాహనము ఒనర్చిన పిమ్మటగంధాదులతో బూజింపవలెను. పిమ్మట గంధము, కర్పూరము, పుష్పము, తామరసధూపము, ఉశీరాదులతోడి దశాంగము, నేతిదీపమును, సమర్పించవలెను. ఇట్లు తనను ఆరాధించుకొని, తత్త్వమునారాధించి, పదునొకండుదినములు దీక్షచేయవలెను. ప్రారంభదినమున మంత్రపుష్పాంతమాచరించి, ఈయనువాకముతో బదునొకండుసార్లు ప్రతినమస్కారములు సమర్పించి నేతితోహోమమొనర్చి, ఆమహాదేవుని సన్నిధిని ఇరువదియొక్కవేలు జపముచేయవలెను. అపుడదిమొదలు దీక్షపూర్తియగువరకును అగ్నినిసంరక్షింపవలెను. పిమ్మటను ఆమఱునాడు నిత్యకార్యమాచరించి, నేతిలోను తేనెలోను తడిపినతిలలను, లాజలను (పేలాలను) ధూర్వాలను, బియ్యమును, యవలను ఈయనువాకముతోబదునొకండుసార్లు హోమముచేయవలెను. ఇట్లు మూడుదినములు ప్రతిదినము మధువుతోను నేతితోను హోమముచేయవలెను.

పిమ్మట సప్తమాష్టమదినములలో అశ్వత్థాపామార్గసమిధలతో హోమము పూర్వమువలెనేచేయవలెను. తర్వాతనొకదినము ఉదయమునుండి అస్తమయమువరకును నిత్యకర్మలకు అవిరోధముగా అవశ్యకముగా నిరన్తరము అనువాకమును జపింపవలెను. పిమ్మటను, నవమదినమున నేతితోడను, తేనెతోడను హోమముచేయవలెను. దశమదినమున ఉదయాస్తమయములందు జపముచేయవలెను. పిమ్మట సమాప్తిదినమున (11 వ దినమున) ప్రతినమస్కారమునందును ఈయనువాకముచెప్పుచు ఎనిమిదివేలకమలములతో మహాదేవుని ఆరాధింపవలెను పిమ్మటగౌరినారాధించి, బ్రాహ్మణులచే వ్యాధి

నిర్మోచనమగుగాక యని యాశీస్సుపొందవలెను. దానముచేయుసమయమున రాజు 8 వేలో, నాల్గువేలో, 8 వందలో బంగారునాణెములను దక్షిణగా నొసంగవలెను. ఇతరులు (రాజులుకానివారు) 8 వందలో, 4 వందలో, ఇరువదియైదో బంగారునాణెములను యథాశక్తి దక్షిణగా నొసంగవలెను. ఇట్లు ఒక్కొబ్రాహ్మణునకు ప్రత్యేకముగా దానముచేయవలెను పిమ్మట జపహోమాది కర్మలకు తగినట్లు దక్షిణనొసంగవలెను. ప్రతిదినము ఒకనాణెముదక్షిణగా నొసంగవలెను. పిమ్మట సమస్తమునకును దక్షిణగా ధేనువును ఈయవలెను.

ఇట్లు ఈవ్రతమును సమాప్తిచేసి దేవుని విసర్జింపవలెను. దేవాలయాది కర్తకు ఈక్రింది విధానమును జెప్పిచేయించవలెను. ఏమన?

ఘటజలముతో నిత్యముదేవునికి స్నానము చేయింపవలెను. ప్రోక్షణ చేయవలెను. ఈవిధముగాజేసినచో రాజయక్ష్మనశించును. శంభుప్రసాదము వలననే దీర్ఘాయువులభించును. ఈయనువాకముతోడనే మేహశాంతియు జేయింపవచ్చును మేహవ్యాధిగలవాడు అగ్నిలోతేనెతోబాటు నేతితో ప్రతి నమస్కారమునందును తొమ్మిదివేల అహుతులను హోమముచేయవలెను. ఇట్లుచేసినచో మేహరోగమునశించును. ఇతరములైన కుష్ఠాదిరోగములు తొలగుటకును 100 వేలసార్లు ఈయనువాకముతో జపముచేయవలెను. దాని మూలమున వ్యాధులు నశించును. జ్వరాదిరోగములు ఏకకాలమున సంభ వించినచో సమర్థుడైన బ్రాహ్మణునిచే జపాదులను జేయింపవలెను. ఆబ్రాహ్మ ణుడు నాభిమాత్రజలముననో ప్రవాహముననోనిలిచి, 8 వేలరక్తకమలములను ప్రతినమస్కారమునను చిమ్మవలెను. శేషముతో భృంగిరిటిపూజచేయదగి యున్నది ఇట్లుచేసినచో మహాజ్వరమునశించును మహాశివుడు ఘోరస్వరూ పుడు కావున ఆతనిపూజావిధానాదులను జరిపించుటకు విద్వాంసుడైన విప్రుడే గురువుగానుండవలెను. వేరువిధముగా జరిగినచో కలహము సంభవించును. ఏలోపమువాటిల్లకుండ పైన జెప్పిన జపహోమాదులు జరుగవలెనుగదా! పిమ్మట పైఅనువాకమంత్రముల యర్థముగల ఈక్రింది శ్లోకముతో ధ్యానము చేయవలెను.

శ్లో॥ భస్మోద్ధూళితసర్వాంగం జటామండలమండితం।
ధ్యాయేత్ త్ర్యక్షం వృషారూఢం గణేశ్వరయుతహరమ్॥

తాత్పర్యము:-

త్రిలోచనుడై శివుడు భస్మమువలన ధూళిల్లు సర్వాంగములు కల్గి యుండెను. అతడు జటామండలముతో అలంకరింపబడి, వృషభారూఢుడై గణేశ్వరయుతుడైయుండెను. అట్టిహరుని ధ్యానింపవలెను.

విద్యారణ్యాభాష్యమును, భట్టభాస్కరభాష్యమునుగల

శ్రీ రుద్రప్రశ్నమునచతుర్థానువాకము సమాప్తము.



## శ్రీ రుద్రాభిషేకమాహాత్మ్యము

### -: పంచమానువాకము :-

—: ప్రథమయజుస్సు :—

చతుర్థానువాకమున ఉభయతోనమస్కారములుగల మంత్రములుకలవు.
పంచమానువాకమునుండి నవమాంతానువాకములందుగల
మంత్రములు నమస్కారాదులైకలవు.

*మంత్రము- "నమోభవాయచరుద్రాయచ"*

**అర్థము:-**

భవాయ = ప్రాణులయుత్పత్తికిమూలకారణమైన, రుద్రాయ = జీవుల రోదనమునకు గారణమైనట్టియు, దుఃఖమును ద్రవింపజేయునట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:- ప్రాణులయుత్పత్తికి మహాదేవుడే మూలకారణము. అతడే జీవులను ఏడిపించును. జీవులదుఃఖమును ద్రవింపజేయును. జీవోత్పత్తికి మూలకారణమగు శక్తిమహాదేవుని శరీరమునుండియేవేరైనది. అట్టిజీవులకు కర్మానుసారముగా దుఃఖములగల్గించి, యేడిపించునాతడును రుద్రుడేయని తెలియుచున్నది.

*115 నామము:- శివ:- "నమోభవాయ"*

భ. భా. భా:- "నమోభవాయ" అను దానితోడను, నమోజ్యేష్ఠాయ" అను దానితోడను, ఆరంభమగు అను వాకములకు భగవంతుడైన శంభుడే

ఋషియును, దేవతయునైయున్నాడు. మహావిరాట్టుఛందస్సు. ఇట్టు ఈతను వాకములతో మహాదేవునకు విశ్వాధిపత్యము ప్రతిపాదింపబడెను. తర్వాత అష్టమూర్తియనుఅధిష్ఠానభేదముతో మహాదేవుడు స్తుతింపబడుచున్నాడు. ఉభయతో నమస్కారములుగల మంత్రములైన పిమ్మట, అవియందు మాత్రమే నమస్కారముగల మంత్రములు చెప్పబడుచున్నవి.

సర్వత్రఎల్లపుడును ఉన్నకారణమున శివునకు భవుడను నామము కల్గెను. భవుడనగా ఎల్లపుడు ఉన్నవాడు; శాశ్వతుడు అనియు అర్థముకలదు. ఎల్లపుడును బ్రహ్మాండము అంతయు తనలోనేకలదని భావించువాడును, సర్వులచే తమహృదయములందు భావింపబడువాడునగుటచే, శివునకు "భవుడు" అను నామముకల్గెననియును జెప్పవచ్చును. సాలీడునోటిలోనే దారముగా మారు ఉమ్ముకలదు. పట్టుఅల్లునపుడు అదియేదారముగా బైటపడును. మఱల అదియేమ్రింగబడును. అటులనే బ్రహ్మాండము సృష్టిస్థితిలయములందు మహాశివునిలోనుండియే మార్పుచెందును. కావున శివుడు భవనామకుడాయెను. శివుని అష్టమూర్తులలో భవుడు జలములకు అధిష్ఠాత. సూర్యునకు రుద్రుడు అధిష్ఠాత.

### *116 నామము "నమోరుద్రాయ"*

రుద్రుడు అను నామమునకు శివపరముగాను, విష్ణుపరముగాను అర్థము ఇంతకుముందు వ్యాఖ్యానింపబడెను. బీజాక్షరపరమగు అర్థమును వివరింపబడెను.

విష్ణు-

"అపాంనిధిరధిష్ఠానమ్" అను విష్ణుసహస్రసూక్తిచే సకల భూతములకు సూర్యాదులకును విష్ణువు అధిష్ఠాత. రుద్రుడున[illegible]శ్వతః కృష్ణః" అను విష్ణుసహస్రసూక్తిచే స[illegible]కాలములందున్నవాడు[illegible]



శాశ్వతుడైనట్లు తెలియుచున్నది. భవుడు అనగా శాశ్వతుడు. పరిశీలింపగా "భవుడు, శాశ్వతుడు" అను రెండునామములను సమానార్థకములేయని తెలియుచున్నది. అందుచేశాశ్వతనామమువలె భవనామమును విష్ణువునకు జెల్లునని తెలియుచున్నది "ప్రభవః ప్రభుః" అను విష్ణుసహస్రనామోక్తిలోని "ప్రభవుడు" అను నామముకూడ పైయర్థమునే బోధించునని తెలిసికొనవలసి యున్నది.

"భవ" అనునామమున "భ్ + అ + వ్ + అ" అనినాల్గు అక్షరములు కలవు. ఇవి నాల్గుయుగములకును, అంతఃకరణచతుష్టయమునకును జిహ్వ్ములు. భకారము శివశుక్రులకుజెందినబీజము. వకారమువారుణబీజము. ఈరెండును అకారాకారములతోగూడియున్నవి అందుచే ఈనామము నుపాసించువారు, జలప్రకోపరోగములను, భూతాదిబాధలను నివారించువారును రాజనీతివిశారదులును, కాగలరు. జలప్రయాణసాధననిర్మాతలుకాగలరు. శ్విత్రమును బొల్లిజబ్బును రక్తరోగములను నివారింపగలవారలగుదురని తెలియుచున్నది

## —: ద్వితీయయజుస్సు :—

"నమశ్శర్వాయచపశుపతయేచ"

**అర్థము:-**

శర్వాయచ = పాపనాశకునకును, పశుపతయేచ = అజ్ఞానుక్తైన పురుషులను పాలించువారికిని, నమః = నమస్కారము.

**తాత్పర్యము-**

సా. భా:- ప్రళయకాలమున సృష్టినంతటినివలె సామాన్యకాలములందు సకలజీవులపాపములను నాశనముచేయువాడు పరమేశ్వరుడే జ్ఞానహీనులై తప్పుమార్గమునందు సంచరించుప్రజలను సన్మార్గమునకుమరల్చి, పాలించువాడును బరమేశ్వరుడేయని తెలియుచున్నది.

## *117, 118.* నామములు- "నమశ్శర్వాయ, పశుపతయేచ"

అగ్నికి అధిష్ఠాతయై పరమేశ్వరుడు ప్రళయకాలమునందు సర్వమును హింసించును. నశింపజేయును. ప్రళయేతరకాలములందు చేతనాచేతనవస్తుజాలమందలిలోపమును, దోషమును బరిహరించువాడును ఆపరమేశ్వరుడే. భూమికి అధిష్ఠాతయై శివుడు భూమిపైగల సకలపశువులను, అనగా జీవులను, లోపములు తొలగించియు, ఆరోగ్యముచేకూర్చియు, శక్తినొసంగియు రక్షించును. అందుచే బరమశివునకు, శర్వుడు పశుపతినామములుచెల్లును.

**విష్ణు-**

"శౄ=హింసాయామ్" అను ధాతువునుండి శర్వపదమేర్పడెను. దుష్టులైన రాక్షసులను, గజేంద్రాదిభక్తులను బీడించుమకరాదులను హింసించినవాడు కావున విష్ణువునకును శర్వనామముచెల్లును. "సర్వేద్రృక్ సింహః" అను విష్ణుసహస్రసూక్తిలోగల విష్ణుపరమైన సింహపదమునకు హింసించువాడనియే యర్థము. పైశర్వనామము, సింహనామమును సమానార్థకములే కావున శర్వపదమునకు విష్ణువు అనియు అర్థము, చెప్పవచ్చును.

**సూచన-**

పశుపతినామమునకు విష్ణుపరమగు అర్థము 34 వ నామమున ఇంతకుమున్దు వివరింపబడెను. బీజాక్షరపరమగు అర్థము కూడ ఇంతకుబూర్వమే వివరింపబడెను

*బీజాక్షరసంపుటి;-*

శర్వనామమున "శ్+అ+ర్+వ్+అ" అని ఐదక్షరములుకలవు. ఇవి పంచభూతములకును, పంచకోశములకును జిహ్వములు. లక్ష్మీబీజమైన శవర్ణమును అగ్నివరుణబీజములైన రేఫవకారములును సర్వదేవతాకమగు అకారముతోగూడియున్నవి. అందుచే నీనామము నుపాసించువారు జలయంత్రాగ్నిమాపకయంత్రనిర్మాతలు అగుటయేకాక విమానౌకాయాత్రల ద్వారావాణిజ్యము నెఱపి, ధనమార్జించి, లక్ష్మీసంపన్నులుకాగలరనియును, జలాగ్నిరోగనివారకులుకాగలరనియును తెలియుచున్నది.

## —: తృతీయయజుస్సు :—

*మంత్రము- "నమోనీలగ్రీవాయచశితికంఠాయచ"*

**అర్థము;-**

నీలగ్రీవాయ = కాలకూటవిషధారణముచే నీలమైన కంఠభాగముకల వాడును, శితికంఠాయచ = మిగిలిన కంఠప్రదేశమున శ్వేతవర్ణముకలవాడు నగు శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము;-**

సా. భా:- పరమశివుడు లోకరక్షణకై క్షీరసముద్రమథనమున ఉద్భవించిన కాలకూటవిషమును, కంఠముననిడుకొనెను: అందుచే వానికంఠమున కొంతభాగము నల్లగాను, మిగిలినభాగము తెల్లగాను ఉండెను. అందుచే ఆతనిని నీలకంఠుడు శితికంఠుడు అనియును గొనియాడి నమస్కరింతురు.

**119, 120. నామములు:- "నమఃనీలగ్రీవాయ, శితికంఠాయ"**

**శివ:-**

భ. భా. భా:- నీలగ్రీవనామార్థము ఇంతకుమున్నే వివరింపబడెను. "శితీధవళమేచకౌ" అను నిఘంటుసూక్తిచే శితి పదమునకు తెల్లని అనియర్థము కలదు. కంఠమున గరళములేనిభాగము తెల్లగానుండును. అట్టి తెల్లనికంఠ భాగముకలవాడు కావున శివుడు శితికంఠనామధారియాయెను. భగవంతుడైన శివుని కంఠమున సహస్రతమభాగముమాత్రమే విషానలముచే నల్లనిదాయెను. "యథాంబికాపతయే ఉమాపతయే పశుపతయేనమోనమః" అను సూక్తిలో అదరార్థము మొదటిరెండును పార్వతీపతియను నర్థమునందే ప్రయోగింప బడెను. అటులనే ఈయజుస్సులో నీలగ్రీవశితికంఠనామములు సమానార్థకము లుగా ఆదరముకొఱకు జెప్పబడెననియు జెప్పవచ్చును.

శ్లో॥ *సత్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ।*
*ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవచ॥*

అను గీతాసూక్తిచే సత్త్వప్రధానమైన శుక్లవర్ణము జ్ఞానమును తమఃప్రధాన మైన నీలవర్ణము ప్రమాదమోహాజ్ఞానములను ఒసగునని తెలియుచున్నది. శుక్ల నీలవర్ణమిశ్రితమైన కంఠముగల పరమశివుడు తనను ధ్యానించుభక్తులకు ప్రమాదమోహాజ్ఞానములను తొలగించి జ్ఞానమునొసంగునని తెలియుచున్నది. అందుచే నీరెండు శివనామములును ఒకచోటప్రయోగింపబడెను.

**విష్ణు-**

"కణ = శబ్దే" అను ధాతువునుండియేర్పడిన కంఠశబ్దమునకు జీవు లచే బల్కించువాడు అనియర్థము చెప్పవచ్చును "కఠి = శోకే" అను ధాతువు నుండియేర్పడిన కంఠశబ్దమునకు దుర్మార్గులనేడిపించువాడని యర్థము చెప్ప వచ్చును. "శి = శోధనే" అను ధాతువునుండియేర్పడిన శితిపదమునకు సకల

వస్తువులందుండుటచే బరిశోధింపబడువాడని యర్థము చెప్పవచ్చును. "శితిశ్చాసౌ కంఠశ్చ = శితికంఠః" అని విశేషణోభయపదకర్మధారయ సమాసము చేసి, ఈపదమునకు విష్ణుపరముగా అర్థము చెప్పవచ్చును. ఇందుగలడందు లేడనవీలులేదు సర్వగతుడైన విష్ణువు సర్వులచేతను పరిశోధింపబడును. కావున విష్ణువు శితినామకుడాయెను. నేరములు చేయురాక్షసాదులను శోకింప జేయువాడు కావున విష్ణువు కంఠ నామకుడాయెను. "శితి + కంఠ అని రెండును గలియగానేర్పడిన శితి కంఠపదము పైవిధముగా విష్ణువునకు జెల్లునని తెలియుచున్నది, సర్వులచే జూడబడు విష్ణువునకు "సర్వదృక్" అను నామము ఏర్పడెను "సర్వదృక్" అను విష్ణుసహస్రనామమును "శితి" అను నామమును సమానార్థకములు. "విశోధనుడు" అను విష్ణుసహస్రనామము "శితి" నామముకూడ సమానార్థకములే. విశేషముగా "గజేంద్రుడు" మున్నగు భక్త జీవులచే శోకింపజేయువాడు అను నర్థముకల "విశోకుడు" అనుసహస్ర నామమును కంఠ నామమును సమానార్థకములే కావున శితికంఠనామముచే విష్ణువు చెప్పబడునని తెలియుచున్నది.

—: చతుర్థయజుస్సు :—

"నమః కపర్దినే చ వ్యుప్తకేశాయ చ"

*అర్థము:-*

కపర్దినేచ = జటాజూటముకలవానికిని, వ్యుప్తముండితకేశునకును (జుత్తులేనివానికిని) నమః = నమస్కారము. పాశుపతాదివేషధారియగుటచే శివుడు కపర్దిఆయెను యతులు, సన్యాసులు మున్నగు వేషధారులుగానుండుటచే మహాదేవుడు జుత్తులేక వ్యుప్తకేశుడాయెను.

*తాత్పర్యము-*

సా భా:- మహాదేవుడు పశుపతి. అందుచే పాశుపతాదులవేషము దాల్చి జటాధారియై కపర్దినామకుడాయెను. యతులు, సన్యాసులు మున్నగు

వారిలో శివాంశకలదు. యత్యాదుఃవేషముదాల్చుటచే జుత్తులేనివాడై శివుడు వ్యుప్తకేశుడాయెను.

## *121 నామము- శివ:- "నమఃకపర్దినే"*

భ. భా. భా:- జలస్వరూపిణియగుగంగ వ్యక్తముగానున్నచో ప్రవాహప్లావితయై, ప్రపంచమును బ్రహ్మాండమును నశింపజేయును. అందుచే మహాదేవుడు గంగాసహితమైన శిరస్సును జటలతో బూరించి, ప్రపంచమును రక్షించెను. కావున కపర్దినామకుడాయెను.

**విష్ణు-**

క + పర్ది = "మారుతేవేధసిబ్రధ్నే" అను అమరకోశసూక్తిచే, క = సూర్యుడు అని తెలియుచున్నది. విష్ణువు, క = సూర్యరూపముతో పర్ది = జగంబులను బూరించుచు, పాలించుచున్నాడు. కావున విష్ణువు కపర్దినామకుడాయెను. అందుచేతనే, రవి, సూర్యుడు అను నామములును విష్ణుపరములై యున్నవి.

*బీజాక్షరసంపుటి:-*

కపర్దినామమునకు బీజాక్షరపదముగా అర్థము ఇంతకు మున్ను వివరింపబడెను.

## *122 నామము- శివ:- "నమోవ్యుప్తకేశాయ"*

భ. భా. భా:- యజ్ఞయాగాదులనాచరించు యజమానులు వ్యుప్తకేశులు అనగా ముండితకేశులైయుందురు. వారు శివస్వరూపులు. కావున వ్యుప్తకేశుడు

శివుడాయెను. అంతేకాదు. వ్యుప్తమైన = వికీర్ణమైన బ్రహ్మాండమున జెదిరిన, క = అనగా జలమునకు, జలరూపిణియైన శక్తికి, ఈశుడైయున్నవాడు పరమ శివుడు. కావున ఆతనికి వ్యుప్తకేశనామముసార్ధకమాయెను.

విష్ణు:—

వ్యుప్త = అంతటను జెదిరిన (సంచరించిన) క = సూర్యునకు, ఈశుడు = ప్రభువు; కావున విష్ణువు వ్యుప్తకేశుడాయెను. "తస్యభాసాసర్వ మిదంవిభాతి" అను శ్రుతివలన మహావిష్ణువుయొక్కతేజస్సుచే సూర్యచంద్రాగ్నులు సమస్తబ్రహ్మాండమును బ్రకాశింపజేయుచున్నారని తెలియుచున్నది. అందుచే విష్ణువు వ్యుప్తుడైన సూర్యునకు ప్రభువై వ్యుప్తకేశనామకుడైనట్లు తెలియుచున్నది.

—: పంచమయజుస్సు :—

"నమస్సహస్రాక్షాయచశతధన్వనేచ"

అర్థము:

సహస్రాక్షాయ = ఇంద్రవేషముచే సహస్రాక్షములు కలవాడును, శతధన్వనేచ = సహస్ర భుజములుగల అవతారముచాల్చుటచే వందలకొలది ధనుస్సులు కలవాడునగుశివునకు, నమః = నమస్కారము.

తాత్పర్యము:-

సా. భా:- "సహస్రాక్షయమీఢుషే" అను మంత్రమున శివుడుఇంద్ర స్వరూపుడని చెప్పబడెను. అందుచే శివుడు వేలకొలది కన్నులుకలవాడై త్రిలోకవ్యవహారములు బరిశీలించుచున్నాడు. "సహస్రాక్షస్సహస్రపాత్"

అను పురుషసూక్తమంత్రమున బరమాత్మకువేలకొలది పాదములున్నట్లు చెప్ప బడెను. అందుచే బాదములవలె గరములును గరములచేవాల్చబడు ధనుస్సు లును వేలకొలదిగా బరమాత్మకుగలవన్నమాట. వానితో దుష్టసంహారమొనర్చి శిష్టులను రక్షించుపరమాత్మయే పరమశివుడు. కావున మహాదేవుడు శత ధన్వ అయెను.

## *123 నామము- శివ- "నమస్సహస్రాక్షాయ"*

భ. భా. భా:- సహస్రాక్షనామమునకు ఇంతకుముందు శివ విష్ణు బీజాక్షరసంపుటులకుజెందిన యర్థములు మూడును వ్రాయబడెను.

## *124 నామము:- శివ:- "నమఃశతధన్వనే"*

భ. భా. భా:- "పురుషఏవేదగ్ంసర్వమ్" అనుశ్రుతిచే సర్వజీవులును విరాట్ పురుషులేయని తెలియుచున్నది. సకలజీవులలో గలమహాశివుడు, బహు రూపుడై బహుధనుస్సులుకలవాడును బహ్వాయుధములుకలవాడునై శతధన్వ నామకుడాయెను.

"ధన = ధాన్యేప్రార్థనాయామ్" అను ధాతువునుండి ధన్వపదమేర్ప డెను. శతపదము అసంఖ్యాకజీవకోటిని దెలియజేయును. అందుచే బరమాత్మ యైన విష్ణువు వందలకొలదిగాగల జీవులచే, దేవతలచే ధన్వా = రక్షింపవలసి నదిగా ప్రార్థింపబడుచున్నాడు. కావున విష్ణువు శతధన్వనామకుడాయెను. "సుధన్వాఖండపరశుః" అనుస్మృతిలోని సుధన్వపదమును శతధన్వపద మునుసమానార్థకములేయని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

"శతధన్వన్" అను నామమున "శ్+అ+త్+అ+ధ్+అ+న్+వ్+అ+న్" అని పదక్షరములుకలవు. ఇవి దశదిక్కులకును, దశేంద్రియములకును జిహ్వాములు. లక్ష్మీబీజమైన శవర్ణమును, ధనదబీజమైన ధకారమును, వాస్తుబీజమైన తకారమును సావిత్రీబీజమైన నకారమును అకారత్రయముతో గూడియున్నవి. పైనామము నుపాసించువారు సావిత్ర్యుపాసకులును లక్ష్మ్యుపాసకులునై, ధనాగారముల నిర్మింపగలవారలగుదురు. దానధర్మపరులై పాపనాశకులుకాగలరు. అని తెలియుచున్నది.

-: షష్ఠయజుస్సు :-

"నమోగిరిశాయచశిపివిష్టాయచ"

*అర్థము:-*

గిరిశాయచ = కైలాసముననుండువాడును, శయనించువాడును, శిపివిష్టాయచ = విష్ణువును దనహృదయమున ధరించువాడునగు శివునకు నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:. మహాశివుడు కైలాసముననివసించి అందే శయనించును. "శివస్యహృదయంవిష్ణుః విష్ణోశ్చహృదయగ్ంశివః అను మంత్రమున జెప్పినట్లు శివుడు తన హృదయమున విష్ణువును నిల్పిధ్యానించును. "విష్ణుశ్శిపివిష్టః" అను శ్రుతిచే విష్ణువునకు శిపివిష్టనామమున్నట్లు తెలియుచున్నది.

125 నామము:- శివ + విష్ణు:-

బీజాక్షరసంపుటి:-

"గిరిశాయ" అను పదముయొక్క అర్థము ఇంతకుమున్ను శివ విష్ణు బీజాక్షరసంపుటి పరముగా వివరింపబడెను.

126 నామము- శివ:- "నమశ్శిపివిష్టాయ"

భ. భా. భా:- దేవదారువనప్రదేశములందు పార్వతీసహితుడై పరమేశ్వరుడు ప్రవేశించుటచే శిపివిష్టుడాయెను.

శ్లో॥ శైత్యాచ్ఛయనయోగాద్వాశీతి (శి + ఇతి) వారిప్రచక్షతే।
తత్పానాద్రక్షణాద్వాపి శిపయోరశ్మయోమతాః॥
తేషుప్రవిష్టస్సవితా శిపివిష్టస్తదోచ్యతే॥

అను స్కందపురాణవచనముచే శివుడు సూర్యరూపుడై చల్లగానుండు నీటిని లోననిముడ్చుకొని లోకరక్షణమొనర్చుకిరణములలో బ్రవేశించియుండుటచే శిపివిష్టనామకుడైనట్లు తెలియుచున్నది. "యజ్ఞోవైవిష్ణుః పశవఃశిపిః" అను శ్రుతిచే సర్వప్రాణులందును శివుడు అంతర్యామిగా బ్రవేశించియున్నట్లు, వానిచే సేవింపబడినట్లును తెలియుచున్నది

శ్లో॥ ఆత్మానఃపశవఃప్రోక్తాః సర్వేసంసారవర్తినః।
తేషాంపతిత్వాత్ విశ్వేశోభవఃపశుపతిస్స్మృతః॥

అను స్కందపురాణవచనముచే పశువులను (జీవులను) శిపులందురనియును, సంసారవర్తనులైన శిపులందు = జీవులందు బ్రవేశించి, వారిచే సేవింపబడిన కారణమున శివునకు శిపివిష్టుడు పశుపతి అను నామము ఏర్పడినట్లు తెలియుచున్నది.

విష్ణుః—

"శిపివిష్టఃప్రకాశనః" అను విష్ణుసహస్రసూక్తిలో విష్ణుపరముగా శిపివిష్టపదముకలదు. "యజ్ఞోవైవిష్ణుఃపశవశ్శిపిః" అనుసూక్తిచే యజ్ఞపశువులందు విష్ణువు యజ్ఞరూపమున ప్రవేశించియుండుటచే శిపివిష్టనామకుడాయెను "శి+పి" అనువర్ణములలో శైత్యమును బట్టియు, భగవంతునకు శయనమగుటచేతను, "శి" అనువర్ణమునకు జలము అను నర్థమేర్పడెను. పి= అనగాపాలనముచేయుట. జలపాన పాలనక్రియలుగలవగుచే రశ్మలకు= కిరణములకు "శిపి" అను నామమేర్పడెను. శిపులందు=కిరణములందు ప్రవేశించుటచే విష్ణువునకు శిపివిష్టనామముకల్గెను. "శిపివిష్టస్తుదుశ్చర్మఖల్వాటహరిశంకరాః" అను నానార్థసంగ్రహసూక్తిచే శిపివిష్టపదమునకు విష్ణువు అనునర్థమున్నట్లు తెలియుచున్నది. విష్ణువు సూర్యరూపుడై శిపులతో= కిరణములతో, అంతటను, విష్టుడు=వ్యాపించియున్నవాడు కావున విష్ణువునకు శిపివిష్టనామము ఏర్పడెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "శ్+ఇ+ప్+ఇ+వ్+ఇ+స్+ట్+అ" అని తొమ్మిది అక్షరములుకలవు అవి నవగ్రహములకును, నవద్వారములకును జిహ్వాములు ఇందు, శ, స, అనునవి శక్తిబీజములు. ఇకారత్రయము విష్ణుబీజము. శక్తిసహితపురుషుడుకలడు; కాన ఈనామము శాక్తేయులకు ప్రధానోపాస్యము పకారము పర్జన్యబీజము. వకారము వరుణబీజము. ఉకారము భానుబీజము. ఇవి పైవర్ణములతోగూడియున్నవి. కావున నైనామము నుపాసించువారు సకాలవర్షములు కురిపించి పంటలుపండించి, దేశమును లక్ష్మీసంపన్నముచేయగలరని తెలియుచున్నది. రక్తశుద్ధిగావించు ఔషధములను జేకూర్చిరోగనాశకులు కాగరని తెలియుచున్నది.

## -: సప్తయజుస్సు :-

"నమోమీఢుష్టమాయచేషుమతేచ"

**అర్థము:-**

మీఢుష్టమాయ = మేఘరూపమున మిక్కిలి వర్షము కురిపించువాడును, ఇషుమతేచ = బాణములుకలవాడునగు, శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము;-**

సా. భా:- "సహస్రాక్షాయమీఢుషే," "యాతే హేతిర్మీఢుష్టమ" అను మంత్రములందు మహాదేవుడు, మేఘరూపుడైయున్నట్లుచెప్పబడెను. పరమ శివునిరూపములలో మేఘమొకటి. అందుచే శివుడు సస్యానుకూలవర్షము సమృద్ధిగాకురిపించి రక్షించుచున్నాడు. ఆతడు బాణములను జేతదాల్చివర్షము నకు అంతరాయముకల్గించు వ్యతిరేకశక్తులను లోకపీడాకరులగు దుష్టులను సంహరించి రక్షించుచున్నాడు. కాన ఆతడు నమస్కరింపబడుచున్నాడు.

### 127 నామము- శివ- "నమోమీఢుష్టమాయ"

భ భా. భా.- ధూమము, అగ్ని, జలము, వాయువు అను నాల్గును గలియగా మేఘమువేర్పడును. అందువాయ్వగ్నిజలములు మహాదేవుని మూర్తులు మహాదేవుడు దుష్టసంహారకుడైనను జగత్సృష్టి తనశక్తిమాయచే నేర్పడుటచే జగద్రక్షణము తన కర్తవ్యమే. కావున జగజ్జీవులపోషణకై ఆహా రము అవసరము అట్టి ఆహారముచేకూర్చుటకై సస్యసమృద్ధియేర్పడుటకై అత్యంతమువర్షించును. కావున శివుడు మీఢుష్టనామకుడాయెను. అంతేకాదు. వాయురూపమున ప్రాణశక్తి నొసంగియును, అగ్నిరూపమున జీర్ణశక్తి నొసంగియును రక్షించును. అందుచే బరమశివునకు "మీఢుష్టమ" నామము సార్థకమాయెను.

విష్ణు-

మహావిష్ణువుకూడ మేఘరూపుడై శివునిచేగల్గిన తాపత్రయమును జల సేచనముచే బోగొట్టుచున్నాడు. సర్వకామవర్షకుడు అగుచున్నాడు. అందు చేతనే "పర్జన్యఃపావనోఽనిలః" అను విష్ణుసహస్రసూక్తిలో పర్జన్యనామమున గొనియాడబడినాడు. పైన చెప్పానినపర్జన్యపదమును మీఢుష్టమపదమును సమానార్థకములే కావున మీఢుష్టనామము విష్ణువునకు సార్థకమాయెను

బీజాక్షరసంపుటి:-

ఇందు మ్+ఈ+ఢ్+ఉ+ష్+ట్+అ+మ్+అ" అని తొమ్మిది అక్షరములుకలవు. ఇవి నవావరణలకును, నవద్వారములకును జిహ్నములు మాయాశక్తిబీజమైన ఈకారము, మదనబీజమైన మకారముతోగూడియుండు టచే ఈ నామము నుపాసించువారు సర్వకామదులు అగుదురని తెలియు చున్నది. వాయుబీజమైన ఉకారముతో మరుత్‌బీజమైన థకారముకూడియున్న కారణమున ఈనామము నుపాసించువారు ప్రాణాయామపరులై జీవులకుఁ బ్రాణశక్తినొసంగి మృత్యువినాశకులుకాగలరని తెలియుచున్నది. శక్తిబీజమైన నకారమును సూర్యబీజమైన ఉకారమును అకారముతోగూడియున్న కారణ మునఁ బైనామము నుపాసించువారు ఆరోగ్యప్రదులై రక్తశుద్ధినొసంగి సుఖా వహులగుదురని తెలియుచున్నది

128 నామము- "నమఇషుమతే"

"ఇషుమాన్" అను నామముయొక్క అర్థము శివవిష్ణు బీజాక్షరపర ముగా మూడర్థములు ఇంతకుమున్నే వివరింపబడెను.

—: అష్టమయజుస్సు :—

"నమోహ్రస్వాయచవామనాయచ"

**అర్థము:-**

హ్రస్వాయచ = అల్పప్రమాణుడగుటచే హ్రస్వముగానున్నట్టియును, వాయనాయచ = ప్రేళ్లమున్నగు అవయవముల సంకోచమువలన వామనుడుగా నున్నట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము-**

సా. భా:- "అణోరణీయాన్ మహతోమహీయాన్ అను శ్రుతిచే పర మాత్మ అణువుకంటె అణువును, మహత్తుకంటె మహత్తునైయున్నాడు. అని తెలియచున్నది. అపరమాత్మయే హ్రస్వుడైన మహాదేవుడు మహాప్రళయమున అంగుళ్యాద్యవయవములుగల బ్రహ్మాండమును "కూర్మోంగానీవసర్వశః"అను సూక్తిలోజెప్పినట్లు తనలోనికి దీసికొని ముడుచుకొన్నట్లుండును. అందుచే మహాదేవుడు వామనుడుగానుండును. అట్టిపరాత్పరుని అందఱును నమస్క రింతురు.

**129 నామము- శివ:- "నమోహ్రస్వాయ"**

భ. భా. భా:- "హ్రస = శబ్దే (నవ్వబడువాడు)" అను ధాతువు నుండిహ్రస్వశబ్దమేర్పడెను పరమశివుడు వికటనేత్రుడు, సర్పభూషణుడు, దిగంబరుడు, వృషభవాహనుడునైయుండుటచే లోకులాతనినిగూర్చినవ్వెదరు. కాన శివుడు హ్రస్వుడాయెను. హ్రసధాతువునకు ధ్వనిచేయువాడనియు నర్థము కలదు. మహాదేవుడు రాక్షససంహారసమయమున హూంకారమును పెద్దధ్వని చేయును. "హుంకారేణేవధనుషా" అని కాళిదాసుచెప్పినట్లు హుంకారధ్వనియే శివునకు ధనుస్సుగానున్నట్లు తెలియుచున్నది. అందుచే మహాదేవుడు హ్రస్వ నామకుడాయెను. హ్రస = హ్రాసే = కొంచెమైయుండువాడు. అను నర్థము ననుసరించిచూచినచో "అణోరణీయాన్" అను శ్రుతిలోజెప్పినట్లు పరమ శివుడు హ్రస్వుడు = అణువైయున్నట్లుతెలియుచున్నది. అందుచేతనే సర్వమును భస్మముచేయు శక్తి కలవాడాతడాయెను. అతని అగ్నినేత్రమండలి శక్తియే ఈనాటి అణ్వాయుధములలోఁ గలదు. పైకారణములచే శివుడు హ్రస్వనామకుడాయెననియుఁ జెప్పవచ్చును.

విష్ణుః—

హ్రస్వుడు = కొంచెమైయుండువాడు; కృశించినవాడు విష్ణువు హిరణ్యాకశిపునిచేద దుమఁబడినప్పుడు కృశుడై వానిశరీరముననే దూరియుండెను. అణువైయుండెను. "ఏషోఽణు రాత్మా" అను శ్రుతిలో ఈ విషయమే చెప్పఁబడెను. "అణుర్బృహత్ కృశస్థూలః" అను విష్ణుసహస్రనామస్తుతిలో ఈహ్రస్వార్థముననే అణుకృశనామములు విష్ణుపరముగాఁ జెప్పబడెను. అందుచే హ్రస్వనామము విష్ణువునకుఁ జెల్లుననితెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

హ్రస్వనామమున "హ్ + ర్ + అ + స్ + వ్ + అ" అని అక్షరములు కలవు. ఇవి షడృతువులను షడింద్రియములను సూచించును. ఈనామము శాక్తేయులకు పరమోపాస్యము శక్తిశివులప్రభావముకల జలముయొక్కయు, అగ్నియొక్కయు భేదములు విజ్ఞానశాస్త్రమున ఎన్నిగలవో వాటన్నిటితో నిర్మింపబడు ఔషధములను యంత్రములను దయారుచేయుశక్తియును, జలాగ్నిసంచారశక్తియును, సర్వరోగనివారకశక్తియును ఈనామము నుపాసించువారికి లభించునని తెలియుచున్నది

## *130 నామము:- శివ:- "నమో వామనాయచ"*

భ. భా. భా:- వామత్వం = కుటిలత్వం అస్యాస్తీతి = వామనః అను వ్యుత్పత్తిననుసరించి మహాదేవుని ఆకారము కుటిలముగానుండునని చెప్పవలసియున్నది. సహజముగా శివుడు సుందరుడైనను మూడవకంటిచేఁ గుటిలత్వము ఆతనిలో ఏర్పడెను. "వము = ఉద్గిరణే" అను ధాతువునుండి వామనపదముఏర్పడెనని చెప్పునపుడు మహాశివుడు తనలోనున్నశక్తులను పంచభూతములుగాను, సూర్యాచంద్రమసులుగాను, అగ్నిగాను పర్జన్యునిగాను బైటికివిడిచెను. అందుచే శివునకు వామనుడు అను నామము ఏర్పడెను.

విష్ణు-

"వా = గతిగంధనయోః" అను ధాతువునుండి వామనపదము ఏర్పడెను. వాయతే = గమ్యతే; పొందఁబడువాడు; అనగా విష్ణువు సర్వవ్యాపి అగుటచే అందఱిచేపొందబడును. అతని విభూతులు స్థావరజంగమములు అన్నింటనుగలవుకదా! అతడు బలిచక్రవర్తిని అడంచునపుడు వామనుడై వచ్చెను. అతడే యోగులచే తాపసులచే ప్రాణాయామప్రక్రియలో హృన్మధ్యమునఁ జూడఁబడుచున్నాడు.

"ఊర్ధ్వంప్రాణమున్నయత్యపానంప్రత్యగస్యతి।
మధ్యేవామనమాసీనం విశ్వేదేవాఉపాసతే॥"

అను మంత్రములో జెప్పినట్లు హృదయమధ్యమున విష్ణువు వామనుడుగా గోచరించును. "వామఃపుంసిహరే" అను నిఘంటూక్తిచే వామనుడు అనగా విష్ణువు అని తెలియుచున్నది. "ఉపేంద్రోవామనఃప్రాంశుః" అను విష్ణుసహస్రసూక్తిలో వామనపదము విష్ణునామముగాఁ జెప్పఁబడెను; అని తెలియుచున్నది. కావున వామనుడు అను నామము విష్ణునామమాయెను.

బీజాక్షరసంపుటి:-

వామననామమున "వ్ + అ + మ్ + అ + న్ + అ" అని అక్షరములు కలవు. ఇవి షడ్రుతువులకును, షట్చక్రములకును చిహ్నములు. ఈనామము సావిత్రిప్రధానమైనది దీనినుపాసించువారు జలోదరాది రోగనివారకులును, పాపనాశకులునై సర్వజయప్రదులు కాఁగలరని తెలియుచున్నది.

—: నవమయజుస్సు :—

"నమోబృహతేచవర్షీయసేచ"

అర్థము:-

బృహతేచ = అకారముచే ప్రౌఢుడైనట్టియును, వర్షీయసేచ = గుణములచే సమృద్ధుడైనట్టి శివునకు, నమః = నమస్కారము.

తాత్పర్యము:-

సా. భా:- సూర్యచంద్రాగ్నివాయుజలాదులన్నియును బరమేశ్వరుని రూపములేయగుటచే అతని అకారము ప్రౌఢము. అందుచే నాతడు బృహన్నామకుడైనాడు. "అహింసాసమతాతుష్టిః" అను గీతాసూక్తిలోఁ జెప్పిన దైవీసంపద, అతనిలో సమృద్ధిగాఁగలదు. సత్త్వరజస్తమోగుణములు మాయా సహితుడగునపుడు ఆతనిలో సమృద్ధిగాఁగలవు. కావునఁ బరమేశ్వరుడు వర్షీయసనామకుడైనాడు. అందుచే అతనికి నమస్కారము.

## 131 నామము- శివ:- "నమోబృహతేచ"

భ భా. భా:- పరమేశ్వరుడు అణువులలో అణువేకాక సూర్యాద్యాకారములచే జాలగొప్పవాడు. కావుననే "మహతోమహీయాన్" మహత్తులలో బృహత్తులలో గొప్పవాడుగానుండును. ఆతనిలోఁగలశక్తియే జలరూపమునఁ బైటబడినది అదియేఆదిశక్తి అమెనుండిఏర్పడినవే వేదములు. వానికి ప్రభువు పరమేశ్వరుడే. "తత్, తద్వతులకు భేదములేదు" అనున్యాయముచే వేద మంత్రములకుఁగలనామము బృహత్ అనునది పరమేశ్వరుని నామముగాఁ జెప్పఁబడెను.

విష్ణు—

"అణుర్బృహత్కృశస్థూలః" అనువిష్ణుసహస్రసూక్తిచే బృహత్ అను నామము శివునకువలె విష్ణువునకునుగలదని తెలియుచున్నది. "బృహ = వృద్ధౌ" అనుధాతువునుండియేర్పడిన బృహత్పదమునకు వృద్ధినొందువాడని యర్థముకలదు. . అణువుగా, వామనుడుగానున్న విష్ణువు సర్వవ్యాపకుడు కావున అవసరమునుబట్టి పొడవరియై వృద్ధినొందును. కావుననే "ఇంతింతై వటుడింతయై" అనిపోతన్నగారుచెప్పినట్లు చూచుచుండగనే బృహద్రూపుడై

మూడుపాదవిన్యాసములచే బ్రహ్మాండము నాక్రమించి 'బలిచక్రవర్తిని పాతాళమునకు అదంచినాడు. ఈవిషయమే త్రిపాదూర్ధ్వము దైత్పురుషః" అను పురుషసూక్తమంత్రమున సూచింపఁబడెను కావుననే బృహత్ అను నామము విష్ణువునకుఁ జెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

"బృహత్" అను నామమున "బ్+ఋ+హ్+అ+త్" అని ఐదక్షరములుకలవు. ఇవి పంచభూతములకు, పంచకోశములకును జీహ్మాములు. త్రిమూర్తిబీజమైన బకారమును శివబీజమైన హకారమును వాస్తుబీజమైన తకారమును బ్రహ్మబీజమైన ఋకారముతోడను సర్వబీజమైన అకారముతోడనుగూడియున్నవి. కాన యీనామము నుపాసించువారు యంత్రసహాయమున నూతనవస్తువులను సృష్టించి, రక్షించి, సంహరింపఁగలవారలగుదురు. విద్యావంతులును అగుదురు. సకల జీవులకును అర్థసిద్ధిచేకూర్పఁగలవారలగుదురు.

## *132 నామము:- శివ:- "నమోవర్షీయసేచ"*

భ. భా. భా:- "పరమేశ్వరుడు గుణసమృద్ధికలవాడును సృష్టికి, మొదటివాడును అగుటచే ఆకారవృద్ధుడును, దక్షిణామూర్తిరూపమున విద్యలనొసంగుటచే జ్ఞానవృద్ధుడును అయెను. అందుచేఁ బరమశివునకు వర్షీయాన్ అను నామము సార్థకమగును. వ్యాకరణమునవృద్ధశబ్దమునకు వర్షాదేశము వచ్చుటచే నైయర్థమునొసంగుచున్నది. ఆకారవృద్ధుడును జ్ఞానవృద్ధుడునై శక్తిసహితుడై శివుడు లోకమునకు పిత(తండ్రి) అగుచున్నాడు. మహాకవికాళిదాసువ్రాసిన

*శ్లో॥ వాగర్థావివసంపృక్తౌవాగర్థప్రతిపత్తయేః*
*జగతఃపితరౌవందేపార్వతీపరమేశ్వరౌ॥*

అను శ్లోకమున ఈవిషయమేకలదు. పరమేశ్వరుడు అర్థము. పార్వతీదేవి వాక్కు. వాగర్థములవలె పార్వతీ పరమేశ్వరులు అవినాభావసంబంధము కలవారై లోకులకు శబ్దార్థజ్ఞానముల నొసంగిపితరులగుచున్నారు. "పార్వతీ పరమేశ్వరౌ" అను పదవిభాగముచేసి పరిశీలించితిమేని, పార్వతీపతివలె, రమేశ్వరుడైన (లక్ష్మీపతియైన) విష్ణువుకూడ జ్ఞానదాతయై లోకపితయగుచున్నాడని తెలియును.

*విష్ణు:—*

పైకారణములచే "వర్షీయాన్" అను నామము పరమశివునకువలె విష్ణువునకును చెల్లును ఎట్లన? "అత్యంతవృద్ధోవర్షీయాన్" అను వ్యుత్పత్తిచే వర్షీయాన్ అను పదమునకు ఆకారవృద్ధుడు, జ్ఞానవృద్ధుడు, గుణసమృద్ధుడు అను నర్థములు చెప్పవచ్చును. శివునువలె విష్ణువుకూడ పురాతన స్వరూపుడు కావుననే "మహర్ధిర్ ఋద్ధోవృద్ధాత్మా" అను విష్ణుసహస్రసూక్తిలో ఆకారవృద్ధుడను నర్థమున వృద్ధాత్మపదము విష్ణుపరముగా ప్రయోగింపబడెను. కావున "వృద్ధాత్మా, వర్షీయాన్" అను రెండుపదములును సమానార్థకములే యని తెలియుచున్నది. జ్ఞానవృద్ధుడను నర్థమున విష్ణుపరముగాగల ఋద్ధపదమును, వర్షీయాన్ అను పదమును సమానార్థకములే. శివకేశవులు ఇరువురును త్రిగుణసమృద్ధులేయగుటచే "గుణభృన్నిర్గుణః" అను విష్ణుసహస్రసూక్తిలోఁగల "గుణభృత్" అను పదమును వర్షీయాన్ అను పదమును సమానార్థకములేయని తెలియుచున్నది. కావున శివకేశవులు ఇరువురును "వర్షీయాన్" అను నామముగలవారలగుచున్నారు.

*బీజాక్షరసంపుటి—*

"వర్షీయాన్" అను నామమున వ్+అ+ర్+ష్+ఈ+య్+అ+న్" అని ఎనిమిదక్షరములుగలవు. ఇవి అష్టసూర్యమండలములను, శరీరమందలి అష్టచక్రములను సూచించును. ఇందు వరుణబీజమును జలసూచకము

నగు వకారమును, అగ్నిబీజమైన రేఫమును, వాయుబీజమైన యకారమును గలవు. ఇవి సూర్యబీజమైన షకారముతోడను, శక్తిబీజమైన సకారముతోడను, మాయాశక్తిబీజమైన ఈకారముతోడను, సర్వదేవతాబీజమైన అకారముతోడను గూడియున్నవి. ఇది శాక్తేయులకును రోగనివారకవైద్యులకును ఉపాస్యము. దీనిని జపించువారు ప్రాణాయామపరులై జలాగ్నివాయుస్తంభవిద్యలను శక్తి దయతో సంపాదించి, సూర్యమండలమున బైమూడుభూతములకలయికచే నేర్పడిన శక్తినార్జించి, జలాగ్నివాయుప్రకోపజనితరోగనివారకులు అగుదురు. జలాగ్నివాయుశక్త్యుత్పాదకయంత్రములను నిర్మించుశక్తిగలవారై సూర్యమండలయాత్రసాగింపగలవారలు అగుదురని తెలియుచున్నది.

—: దశమయజుస్సు :—

"నమోవృద్ధాయచసంవృధ్వనేచ"

**అర్థము:-**

వృద్ధాయ = వయసుచే అధికుడైనట్టియును, సంవృధ్వనేచ = బాగుగా శ్రుతులచే వృద్ధిపొందునట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము-**

సా. భా:- సృష్ట్యారంభముననుండి సృష్టికి గారణుడైనకారణమునఁ బరమేశ్వరుడు వయోవృద్ధుడాయెను. అందుచే అతనిని బురాణపురుషుడందురు. శ్రుతులందు అతని మహిమయేకలదు. అందుచే శ్రుతులనాలకించిపరమేశ్వరుడు వృద్ధిపొందును. సంవృధ్వుడుఅగును. అతనిని అందుఖును నమస్కరింతురు.

### 133 నామము- శివ:- “నమోవృద్ధాయచ”

భ. భా. భా:- జగత్తులకు పితరులు పార్వతీపరమేశ్వరులు. అందుచే వారువయోవృద్ధులన్నమాట. కావున శివుడు వృద్ధనామకుడాయెను. “వృద్ధిం గతః = వృద్ధః” అను వ్యుత్పత్తిచే వృద్ధిపొందినవాడని తెలియును. పరమేశ్వరుడు జ్ఞానధర్మవృద్ధుడు కావున దక్షిణామూర్తియై ఋషులకు జ్ఞానధర్మాది విద్యలను బోధించెను. "వృద్ధాశ్శిష్యాగురుర్యువా" అను ప్రసిద్ధిపొందెను. తానుగురువు శిష్యులు వృద్ధతాపసులునుకాగా రాక్షసప్రమాదముచే తొలగిన విద్యలను మఱలవారికొసంగెను అందుచే వృద్ధనామకుడాయెను.

### విష్ణు—

"వృధు = వృద్ధౌ" అను ధాతువునుండి వృద్ధపదమేర్పడెను. వర్ధత ఇతివృద్ధః = వర్ధిల్లువాడు. కాన వృద్ధుడాయెను. వామనావతారమున వడుగై వచ్చి, మూడుఅడుగులనేల స్వీకరించునపుడు చూచుచుండగనే ఆకాశమంత వృద్ధిపొందెను. వృద్ధిపొందుటయే ఆత్మగా స్వభావముగాగలవాడు కావుననే వృద్ధాత్మ అను నామము విష్ణుసహస్రమున విష్ణుబోధకమైకలదు “వృద్ధాత్మా, వృద్ధః” అను రెండును సమానార్థకములే. కావున వృద్ధనామము విష్ణువునకు జెల్లును అనితెలియుచున్నది.

### బీజాక్షరసంపుటి:-

"వృద్ధ" అను నామమున “వ్ + ఋ + ద్ + ధ్ + అ” అని ఐదక్షరములుకలవు ఇవి పంచేంద్రియములకును పంచభూతములకును చిహ్నములు ఇందు బ్రహ్మబీజమైన ఋకారముతో వరుణబీజమైన వకారముగూడియున్నది. అందుచే ఈనామము నుపాసించువారు పితృగ్రహప్రభావముచే, రక్తము క్షీణించిసంభవించిన జలోదరాదిరోగములను నివారించగలవారలగుదురు. దుర్గాబీజమైన దకారము, ధనదబీజమైన ధకారమును అకారవిశిష్టములై పైవర్ణములతోగూడియున్నవి. అందుచే దుర్గోపాసకులు పైనామము నుపా

సించి పలువిధములైనధననిక్షేపములుకల తావుఁను గనుగొనుటయేకాక జల
మందలి ధనరాసులను యంత్రసహాయమున గనుగొనిదేశమును ధనవంత
ముగా వేయగలవారలగుదురని తెలియుచున్నది.

## 134 నామము- శివ;- "నమఃసంవృధ్వనేచ"

భ.భా.భా. — సమ్యక్ = బాగుగావృద్ధుడైనవాడు సంవృధ్వియగును పార్వతీ
పరమేశ్వరులు ఆదిదంపతులు అగుటచే బరమేశ్వరుడు సంవృధ్వనుడాయెను.
శివుడు ఉబ్బులింగడు. ఆతడు భక్తులస్తుతులచే నిత్యమును వర్ధమానుడై వారి
కోర్కెలనుదీర్చును. మార్కండేయుడుమున్నగు ఉత్తమభక్తుఁవలె మధ్యమ
భక్తులైన కార్తవీర్యార్జునాదులు గావించు స్తుతుఁచే సైతము శివుడుప్పొంగి వర్ధ
మానుడై వారికోర్కెలను నెరవేర్చెను. "వర్ధంతుత్వానుష్టుతయః" అను
శ్రుతిచే బైవిషయముతెలియుచున్నది భక్తులకు ఆయురారోగ్యైశ్వర్యాదుల
నొసంగివృద్ధిపొందించును. కావున శివుడు సంవృధ్వనామకుడు అయెననియు
జెప్పవచ్చును.

### విష్ణు-

విష్ణువు సమ్యక్ శ్రుతివర్ధితుడు కాన సంవృధ్వి అగును సాగరమందు
తరంగములవలె శ్రుతులు అనగా వేదమంత్రములు విష్ణుమహిమను వెద
జల్లుచువానియందే అణగియుండును. కావుననే "వివిక్తశ్శ్రుతిసాగరః" అను
విష్ణుసహస్రసూక్తిలో శ్రుతిసాగరనామము విష్ణుపరముగా పైయర్ధమునందే
ప్రయోగింపఁబడెను. అదియును సంవృధ్వనామమును సమానార్ధకములే స్తుతి
వర్ధితుడై గజేంద్రాదిభక్తులను విష్ణువు కాపాడివృద్ధిచేసెను కావున విష్ణువు
సంవృధ్వఅయెను. "మాధవోభక్తవత్సలః" అను విష్ణుసహస్రసూక్తియందలి
భక్తవత్సల పదమును, సంవృద్వనామమును సమానార్ధకములే. అందుచే
సంవృద్వ నామము విష్ణువునకు చెల్లును.

*బీజాక్షరసంపుటి:-*

"సంవృధ్వన్" అను నామమున "స్+అ+మ్+వ్+ఋ+ధ్+వ్+అ+న్" అని తొమ్మిదక్షరములుకలవు. ఇవి శరీరమందలి నవద్వారములను, నవావరణలను సూచించును. ఈనామమున ఆద్యన్తములందు శక్తి సావిత్రీబీజాక్షరములును, మధ్యను బ్రహ్మబీజమైన ఋకారమునుగలవు. ఈనామము నుపాసించువారు శాక్తాద్వైతులై శక్తిప్రభావముచే అణిమాద్యష్ట శక్తుల ను సముపార్జించుకొనఁగలరు. జీవనాధారమైన ధనమునార్జించువారును రోగనాశకులును, సర్వజయప్రదులు గాఁగలరని తెలియుచున్నది.

*-: ఏకాదశయజుస్సు :-*

*"నమో అగ్రియాయచ ప్రథమాయచ"*

*అర్థము:-*

అగ్రియాయ = జగదుత్పత్తికిఁ బూర్వమున్నట్టియును, ప్రథమాయచ = సభలో ముఖ్యుడునగు పరమశివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:— మహాదేవుడు శక్తిసహితుడై జగదుత్పత్తికిఁ బూర్వమునందే కలడు. జగంబులను బ్రహ్మయై సృష్టించినాడు. శ్రీకాళిదాసమహాకవి "జగతఃపితరౌవందే" అని తనరఘువంశకావ్యారంభమునగోనియాడినాడు. దేవసభలోనేకాదు. వైకుంఠాదిలోకసభలన్నింటిలోను ముఖ్యుడు. కావున బ్రహ్మదులుగానెన్ని అతనిని నమస్కరించుచున్నారు.

## 135 నామము:- శివ:- "నమోఽగ్రియాయచ"

భ. భా. భా:- "సతోవా ఇదమగ్రఆసీత్" "స ప్రజాపతిరేకః పుష్కర పర్ణేసమభవత్" అను శ్రుతులచే బరమాత్మ, సృష్టిగావింప, రక్షింప, సంహరింప దనశక్తులతో శివునిదొల్త ఆవిర్భవింపజేసెను. కావున మహాదేవుడు అగ్రేభవుడు; మొట్టమొదటివాడాయెను. అతడే ప్రజాపతి. మహాదేవుని స్వరూపములే పంచభూతములు. వానినుండియే సృష్టియేర్పడెను. కావున శివుడు అగ్రియుడాయెను.

విష్ణు:—

"అగి = గతౌ" అను ధాతువునుండియేర్పడిన అగ్ర, అగ్రియపదములు సర్వవ్యాపకుడైన విష్ణువు తొల్త జన్మించెనని తెల్పుచున్నవి. "యోదేవానాం ప్రథమం పురస్తాత్" అను శ్రుతిచే పరాత్పరుడే ప్రథమమున ఆవిర్భవించినట్లును అతడే రక్షణక్రియలో విష్ణువాయెననియును దెలియుచున్నది. "హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే" అను శ్రుతిచే విష్ణువు హిరణ్యగర్భుడై తొల్త జన్మించినట్లు తెలియుచున్నది. అగ్రియుడు అను నర్థమునే అగ్రజపదము తెల్పును. కావుననే "నైకజోఽగ్రజః" అను విష్ణుసహస్రసూక్తిలో అగ్రజ పదము విష్ణుపరముగాఁ బేర్కొనబడినది. పైరెండుపదములును సమానార్థకములే కావున అగ్రియనామము విష్ణువునకు జెల్లునని తెలియుచున్నది.

అగ్రియనామమున "అ + గ్ + ర్ + ఇ + య్ + అ" అనిఆరక్షరములు కలవు. అవి షడృతువులను, షడింద్రియములను సూచించును. ఇందు గణపతిబీజమైన గకారమును, వహ్నిబీజమైనరేఫమును, వాయుబీజమైన యకారమును అకారేకారములతోగూడియున్నవి. కానఁ బైనామము నుపాసించువారు నాయకులును, వాయ్వగ్నిప్రేషకయంత్రనిర్మాతలునై పలువిధములగు రోగములను దొలఁగించి లోకమును రక్షింపగలవారలు అగుదురని తెలియుచున్నది.

### 136 నామము- శివ- "నమః ప్రథ మాయచ"

భ. భా. భాః- యజ్ఞయాగాదులలో శివుడే ప్రధానుడు. అందుచే నిరీశ్వరమైన యజ్ఞమే ఎచ్చటనులేదు. మానవులుచేయు కర్మలలో ఈశ్వరుడు లేని కర్మలేలేవు. కావున శివుడు ప్రథముడు = ప్రధానుడు. ప్రథధాతువు నుండియేర్పడిన ప్రథమపదమునకు వ్యాపించువాడనియును అర్థముకలదు. శివుడు సూర్యచంద్రాగ్ని వాయ్వాదిరూపముల అంతటను వ్యాపించియున్నాడు. అందుచే శివుడు ప్రథమ నామకుడాయెను.

విష్ణు:—

"ప్రథ = ప్రఖ్యానే" అను ధాతువునుండి యేర్పడిన, ప్రథమ ప్రథిత పదములు రెండును ప్రసిద్ధుడను నర్థమున సమానములే. విష్ణువు రక్షణ క్రియలోఁ బ్రసిద్ధుడు. కావుననే "అచ్యుతః ప్రథితప్రాణః" అను విష్ణుసహస్ర సూక్తిలో ప్రథితపదము విష్ణుపరముగా గలదు. అందుచే ప్రథితపదమువలె ప్రథమపదమును విష్ణువాచకమగును.

**బీజాక్షరసంపుటి:-**

ప్రథమః అను నామముయొక్క అర్థము ఇంతకుమున్నే బీజాక్షర సంపుటి పరముగా వివరింపబడెను.

### —; 12. వ. యజుస్సు ;—

### "నమఆశవేచాజిరాయచ"

**అర్థము:-**

ఆశవేచ = అంతటను వ్యాపించునట్టియు, అజిరాయ = గమనకుశలుడైనట్టి శివునకు, నమః = నమస్కారము.

తాత్పర్యము:-

సా. భా.- పరమశివుడు "భూమి, నీరు, గాలి, అగ్ని, ఆకాశము, సూర్యుడు, మేఘము" అను రూపములతో అంతటను వ్యాపించినాడు, ఎవటి కైనను వాయురూపుడై ఏగుటచే గమనకుశలుడైయున్నాడు కావున ఆ మహా దేవునకు నమస్కారము.

## 137 నామము:- శివ:- "నమఆశవేచ"

భ. భా. భా:- పరమశివుడు వాయుస్వరూపుడు. కావున శీఘ్రవ్యాపియై అన్నింటనుండి ప్రాణశక్తినొసంగి సకల జీవులను రక్షించును. చంద్రరూపుడై ఆశువులను, అనగా ధాన్యములను వృద్ధిచేసి జీవులను పోషించుచున్నాడు. పైకారణములచే శివుడు ఆశునామకుడాయెను.

విష్ణు:—

"అశూ = వ్యాప్తౌ" అనుధాతువునుండి ఆశుపదము ఏర్పడెను. ఆశువు అనగా సర్వవ్యాపకుడు. "నక్షత్రాణామహంశశీ;" "జ్యోతిషాంరవిరంశు మాన్;" "వసూనాంపావకశ్చాస్మి" అనుగీతాసూక్తులలో జెప్పినట్లు విష్ణువు సూర్యచంద్రాగ్నిస్వరూపుడై అంతటను వ్యాపించియున్నాడు. ఆశువు, విష్ణుడు అను నామములు రెండును సమానార్థకములే. కావున విష్ణువు ఆశునామకు డాయెనని తెలియుచున్నది.

బీజాక్షరసంపుటి:-

ఆశువు అను నామమున "అ+శ్+ఉ" అని మూడక్షరములు కలవు. అవి స్థూలసూక్ష్మకారణశరీరములను, భూతభవిష్యద్వర్తమానకాలము లను సూచించును. ఇందు వ్యోమాభమును లక్ష్మీబీజమునగు శవర్ణము, పరా శక్తిబీజమైన అకారముతోడను, వాయుబీజమైన ఉకారముతోడనుగూడి యున్నవి. కావున ప్రాణాయామపరులైన యోగులు శాక్తేయులై ఆకాశగమ

నాదిశక్తులను సంపాదింపఁగలరనియును, ధనవంతులగుదురనియును, సకల మును వశముగావించుకొనువారును అగుదురని తెలియుచున్నది.

## *138 నామము- శివ:— "నమోఽజిరాయచ"*

భ. భా భా:- అజ = గతిక్షేపణయోః అను ధాతువునుండి యేర్పడిన అజిరపదమునకు వాయువు అనియును అర్థముకలదు. శివునిరూపములలో వాయువుఒకటికలదు. కావున మహాదేవుడు వాయురూపుడై గమనకుశలుడు అగుటచే అజిరనామకుడాయెనని తెలియుచున్నది.

*విష్ణు-*

గత్యర్థకమైన అజిరపదమునకు వ్యాపకుడని యర్థముకలదు. విష్ణువు అనగా వ్యాపకుడు. అందుచే విష్ణుపదమును అజిరపదమును సమానార్థకము లైనవి. కావున విష్ణువు అజిరనామకుడాయెను. "సర్వోపగతుండు విష్ణువు" అని ప్రహ్లాదుడుపలుకగా, పగులగొట్టబడిన స్తంభమున హిరణ్యకశిపునకు గాన వచ్చి వానిని చీల్చిచండాడినవాడు, ఈయజిరుడేయనితెలిసికొనవలసియున్నది.

*బీజాక్షరసంపుటి-*

అజిరపదమున "అ + జ్ + ఇ + ర్ + అ" అని ఐదక్షరములుకలవు. ఇవి పంచభూతములను, జ్ఞానేంద్రియపంచకమును సూచించును. దీని నుపా సించువారు పిడుగులను బడనీయకయు అగ్నిప్రేషకములగు అణ్వస్త్రములను జల్లార్చియుప్రపంచవిజేతలై లోకరక్షకులుకాగలరు. అగ్నిమాంద్యము అగ్ని ప్రకోపము మున్నగు వ్యాధులను దొలగించి, ఇంద్రవస్థానమైన మూర్ధను రక్షింప గలవారలగుదురు.

## —; 13. వ. యజుస్సు ;—

## "నమశ్శీఘ్రియాయచశీభ్యాయచ"

*అర్థము:-*

శీఘ్రియాయచ = శీఘ్రముగాబోవువాడును, శీభ్యాయచ = ఉదకప్రవాహమున నున్నట్టి శివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:— మహాశివుడు వాయ్వగ్ని మనోరూపుడుఅగుటచే బ్రహ్మాండమున శీఘ్రముగాఁబోవును వ్యాపించును. ఉదకప్రవాహమున శీతలరూపుడును, అగ్నిరూపుడునైయుండును. కాన అతనికి నమస్సులు అర్పింపబడుచున్నవి.

## *139 నామము- శివ- "నమశ్శీఘ్రియాయచ"*

భ. భా. భా:— శీఘ్రముగాబ్రవహించుజలములందుండువాడు కావున శివుడు శీఘ్రియుడాయెను. జలము శివశక్తియైనప్రకృతి. దానియందుగల బంగారు తామరాకుపై శివుడు ప్రజాపతి రూపముననుండెను. ఈవిషయము "అపోవాఇదమాసన్ సలిలమేవ, సప్రజాపతిరేకఃపుష్కరపర్ణే సమభవత్" అనెడి అరుణమంత్రమునఁ జెప్పఁబడెను. అందుచే శివుడు శీఘ్రియనామకుడాయెను.

విష్ణు:-

'శీఘ్ర = వ్యాప్తౌ" అను ధాతువునుండి శీఘ్రపదమేర్పడెను. వాయువువలె జలమును ప్రకృతిలో శీఘ్రముగావ్యాపించును. అందుచే శీఘ్రపదమునకు జలమనియర్థము చెప్పవచ్చును. ఈయర్థము యోగశక్తిచేలభించును గానయౌగికము. శ్రీమహావిష్ణువు శీఘ్రమునందు (జలమునందు) శేషశాయియై యుండి అంతటను వ్యాపించుటచే శీఘ్రియనామకుడాయెను. శీఘ్రియపదమునకు, శివుడు, విష్ణువు అను రెండర్థములును నిఘంటువునందుఁగలవు. "ఆకాశవత్సర్వగతశ్చనిత్యః" అను శ్రుతిలోఁజెప్పినట్లు విష్ణువు సర్వవ్యాపి కావున "స్థావరస్స్థాణుర్వ్యాపీ" అను విష్ణుసహస్రసూక్తిలో "వ్యాపి" అను నామము విష్ణుపరముగాఁగలదు. "శీఘ్రియః,వ్యాపీ" అను రెండును సమానార్థకములే. అందుచే విష్ణువు శీఘ్రియనామకుడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి-*

"శ్రీఘ్రియ" అను నామమునందు "శ్ + ఈ + ఘ్ + ర్ + ఇ + య్ + అ" అని ఏడక్షరములుకలవు. ఇవి ధాతువులను సప్తగ్రహములను సూచించును. ఇందుఁగల శకారేకారములు లక్ష్మీమాయాశక్తిబీజములు. ఘకారేకారములు భైరవవిష్ణుబీజములు. రేఫయకారములు అగ్నివాయుబీజములు. వీటన్నింటిపైని సర్వదేవతాబీజమైన అకారముకలదు. అందుచే పైనామము సకల మతస్థులకును ఉపాస్యము. ఉపాసకులు ప్రాణాయామప్రక్రియచేకుండలినీరూపాగ్ని ఉత్థాపనచేసి షట్చక్రములందును లక్ష్మీనారాయణులను, శక్తి శివులను ధ్యానించి, లక్ష్మీసంపన్నులును, శత్రుసంహారకులును కాగలరు. శరీరమందలి ఏషక్రిములను, అరిషడ్వర్గమును సంహరించి, ఆరోగ్యవంతులును, సర్వవిజేతలునుగాగలరు. వాయ్వగ్నిప్రేషకయంత్రనిర్మాతలై సర్వవిజేతలుగాగలరని తెలియుచున్నది.

## 140 నామము:- *శివ:- "నమశ్శీఘ్ర్యాయచ"*

భ. భా. భా:— వేగముగా ప్రవహించుజలములందు ఉద్భవించుశక్తికి శీఘ్ర్య మనునామముగలదు శీఘ్రముగా ప్రవహించుజలమున, అగ్ని, వాయువు జనించును. అవి శివుని అష్టమూర్తులలోఁ జేరినవే. అవి సృష్టిస్థితిలయములు మూడింటికిని హేతువులే. అందుచే "శీఘ్ర్య" అను నామము శివునకు జెందినది. ప్రాణదాతయు ప్రాణహరుడును శివుడేయని దీనివలనఁ దెలియుచున్నది.

*విష్ణు-*

శీఘ్ర్యము అనగా ఉదకప్రవాహామునఁగలది; అని యర్థము. ఉదకమున శిశిరము తాపత్రయమును జల్లార్చు చల్లదనమును, రసము అనగా రుచియును గలవు. భగవంతుడు విష్ణువు తాపత్రయమును జల్లార్చును గాన శిశిరనామకుడాయెనని "శిశిరశ్శర్వరీకరః" అను విష్ణువు సహస్రసూక్తిచేఁ దెలియుచున్నది.

"రసోఽహమప్సుకౌంతేయ" అను గీతాసూక్తిచే జలమున విష్ణువు రసరూప మున నున్నట్లు తెలియుచున్నది. పైన చేర్కొనిన "శిశిరము, రసము" అను నవి శీభ్యపదార్థములే; కాన విష్ణువు శీభ్యనామకుడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

"శీభ్య" అను నామమున "శ్ + ఈ + భ్ + య్ + అ" అని ఐదక్షర ములుకలవు. ఇవి పంచభూతములకు పంచకోశములకును చిహ్నములు. శకా రేకారములు లక్ష్మీశక్తిబీజములు. భకారము భృగుబీజము. ఇవి వాయుబీజమైన యకారముతోడను, సర్వదేవబీజమైన అకారముతోడనుగూడియున్నవి. ఈ నామమును యోగమార్గమున ఉపాసించి, విద్యాధనములను రెండింటిని సంపాదించి, సర్వార్థసిద్ధినందఁగలరు. వాణిజ్యాభివృద్ధిగావించి దేశమును ధన సమృద్ధముచేయఁగలరని తెలియుచున్నది.

## —: 14. వ. యజుస్సు :—

"నమఊర్మ్యాయచావస్వన్యాయచ"

*అర్థము:-*

ఊర్మ్యాయచ = తరంగములతోగూడియున్నట్టియు, అవస్వన్యాయచ = ధ్వనిరహితమైన స్థిరమైనజలమున ఉన్నట్టియును, శివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:— ఊర్మ్మలు అనగా తరంగములు. వానియందుండునది, వానితో గూడినదియును ఊర్మ్యముఅగును. జలవికారములైన తరంగములు ప్రకృతికి జెందినవే. కావున శివుడు ఊర్మ్మలతోగూడియుండును. అంతేకాదు. అవస్వ నము అనగా ధ్వనిరహితమై స్థిరమైనజలమునందును శివశక్తియుండును. అందుచే శివుడు, ఊర్మ్యుడు, అవస్వన్యుడును అయెను.

### 141 నామము- శివ;- "నమఊర్మ్యాయచ"

భ. భా. భా:— జలము శివశక్తియైన ప్రకృతి. జలవికారములు ఊర్మలు; అనగా తరంగములు. వానియందు శీఘ్రగమనమును శబ్దమును ఉండును. శీఘ్రగమనమువాయుధర్మము. శబ్దము ఆకాశధర్మము. శివుడు వాయ్వాకాశ రూపుడు. కావున అతడు ఊర్మలందుండి, శీఘ్రగమనుడై శబ్దముచేయును. అందుచే శివునకు ఊర్మ్యుడు అను నామము ఏర్పడెను.

**విష్ణు-**

ఋచ్ఛతి = గచ్ఛతీతిఊర్మిః ఊర్మిపదము "ఋ = గతౌ" అను ధాతువు నుండియేర్పడెను. ఊర్మిశీఘ్రగతికలదు. "గతిర్భర్తాప్రభుస్సాక్షీ" అను గీతా సూక్తిచే భగవంతుడు గతినామకుడని తెలియుచున్నది ఊర్మ్యుడు = అనగాగతి యందుండువాడు; గతికలవాడు. "గతిః, ఊర్మ్యః" అను రెండును సమా నార్థకములే. అనన్తరూపుడైన విష్ణువు ఊర్మ్యుడు అయియున్నాడు.

**బీజాక్షరసంపుటి;-**

"ఊర్మ్య" అను నామమున "ఊ + ర్ + మ్ + య్ + అ" అని ఐదక్షరములు కలవు. ఇవి పంచభూతములను, పంచాగ్నులను, పంచ ప్రాణములను సూచించును. అగ్నిబీజమైన రేఫమును, మదనబీజమైన మకార మును, వాయుబీజమైన యకారమును, తమముందువెనుకలలో భూమి బీజ మైన ఊకారముతోడను, సర్వదేవతాబీజమగు అకారముతోడనుగూడియున్నవి ప్రతిప్రాణికిని భౌతికములును శారీరికములునగుకోరికలుండును. అవి భూవా య్వగ్నులవలననే తీరవలెను. కావునఁ బైనామము నుపాసించువారు ప్రాణా యామప్రక్రియచే సిద్ధులైకోరికలనందిలోకకాంక్షలను దీర్చగలరు. అంతేకాక వాయ్వగ్నిసహాయమున భూమిలో గలగనులనుగనుగొని, యంత్రసహాయమున సకలవస్తువులను వెలిదీయఁగలవారలగుదురనియును, శరీరమందలి వాయ్వగ్ని రోగములను నివారింపగలవారలును, వాని నివారణకుఁదగు ఔషధములను ఉత్పత్తిచేయఁగలవారలును అగుదురని తెలియుచున్నది.

## 142 నామము- శివ:- "నమోఽవస్వన్యాయచ"

భ. భా. భా:— "అపార్థోఽవ శబ్దః" అను నియమముచే అవపదమునకు (అపగతము) తొలగినది అను నర్థముకలదని తెలియుచున్నది. అవస్వనము నిశ్శబ్దము అని యర్థము. "స్థిరముదకమవస్వనమ్" అను నార్యోక్తిచే స్థిరమైన ఉదకమును అవస్వనము అందురని తెలియుచున్నది. అనగా నిలుకడగా నున్ననీరు నిశ్శబ్దమన్నమాట. అవస్వనమందు = నిలుకడగా నిశ్శబ్దముగా నున్ననీటిలో నున్నది = అవస్వన్యమగును. స్థిరోదకమున పుష్కరపర్ణమున నున్నవాడు ప్రజాపతి అని "సప్రజాపతి రేకఃపుష్కరపర్ణేసమభవత్" అనెడి అరుణమంత్రముచే తెలియుచున్నది. ఆప్రజాపతియే రుద్రుడు. కావున రుద్రుడు అవస్వన్యనామకుడాయెను.

విష్ణు:- "రసోఽహమప్సుకౌంతేయ" అను గీతాసూక్తిచే జలమందలి రసము విష్ణువని తెలియుచున్నది. అవస్వనమున = స్థిరోదకమున విష్ణువు రసరూపమున గలడన్నమాట. స్థిరజలము సముద్రము. అదియే అవస్వనము. అందు అది శేషునిపై పవళించియుండువాడు విష్ణువే. కావున "సరసామస్మిసాగరః" అను గీతాసూక్తిలో జెప్పిన సాగరుడు భగవంతుడు విష్ణువేయని తెలియుచున్నది. అందుచే అవస్వన్యనామము విష్ణువునకుఁ జెందునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

"అవస్వన్యనామమున" "అ+వ్+అ+స్+వ్+అ+న్+య్+అ" అని తొమ్మిది అక్షరములుకలవు. ఇవి నవబ్రహ్మలను, నవావరణలను, శరీరమందలి నవద్వారములను సూచించును ఇందు సర్వదేవబీజములైన అకారములు నాల్గుగలవు. వరుణబీజములైన వకారములు రెండును, శక్తి బీజమైన సకారమును, సావిత్రీబీజమైన నకారమును, వాయుబీజమైన యకారమును, అకార చతుష్టయముతోఁగూడియున్నవి. పైనామము నుపాసించువారు శాస్త్రీయులను ప్రాణాయామపరులునై జలోదరాదిరోగములను భూతపిశాచాది బాధలను వాతరోగములను దొలగింపగలవారలగుదురు. అంతేకాదు. భూమిలో నున్నరత్నాదులను, జలముననున్నతైలలోహాదులను గనుగొనువారలగుదురు. జలవాయుపథసంచారకయంత్రములను సృష్టింపగలవారలగుదురనియును దెలియుచున్నది.

## —; 15. వ. యజుస్సు ;—

"నమస్స్రోతస్యాయచద్వీప్యాయచ"

**అర్థము:-**

స్రోతస్యాయచ = ప్రవాహమునను న్నట్టియును, ద్వీప్యాయచ = జల మధ్యస్థములైన ద్వీపములందున్నట్టి, శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— సృష్టియంతయును బరమేశ్వరునిశక్తియగు జలరూప ప్రకృతి నుండేయేర్పడినది. అందుచే అతడు జలప్రవాహమునందున్నాడు. జలమధ్య మున ద్వీపములుకలవు. వానియందును బరమశివుడు చరాచరవస్తురూపమున నున్నాడు. కాన అతడు నమస్కరింపబడుచున్నాడు.

**143 నామము- శివ:— "నమస్స్రోతస్యాయచ"**

భ భా. భా:— స్రోతస్సు అనగా జలప్రవాహము. అందు అగ్నియుండును అదిస్రోతస్యమగును. అయ్యగ్నిశివస్వరూపముకావున శివుడు స్రోతస్య నామకుడాయెను.

విష్ణు:—

"సృ = గతౌ" అను ధాతువునుండి స్రోతస్సు అను పదమేర్పడెను. సర్వాంతర్యామియైన కారణమున విష్ణువుస్రోతోనామకుడుఅగును. స్రోత స్సుననున్నవాడు స్రోతస్యుడు. స్రోతస్సునఁగల మకరము విష్ణువు విభూతి విష్ణువు మకరరూపుడై స్రోతస్సుననుండును. కావున స్రోతస్యనామకుడు అగును. "ఝుషాణాంమకరశ్చాస్మి" అను గీతాసూక్తి అందులకు ప్రమాణము కూర్మము (తాబేలు) కూడ స్రోతస్యమేఅగును. విష్ణువుకూర్మరూపుడై స్రోత స్సుననున్నాడు; అనుటకు "అన్తరతః కూర్మంభూతగ్ం సర్పన్తమ్" అనెడి అరుణమంత్రము ప్రమాణము. అందుచే విష్ణువునకు స్రోతస్యనామము చెల్లును.

*బీజాక్షరసంపుటి:-*

స్రోతస్యనామమున "స్+త్+ఓ+త్+అ+స్+య్+అ" అని యెనిమిదక్షరములుకలవు. ఇవి అష్టదిక్కులకును, అష్టసూర్యమండలముల కును శరీరమందలి అష్టచక్రములకును చిహ్నములు. ఇందు శక్తిబీజమైన సకారమునకును, శివబీజమైన ఓకారమునకును నడుమను అగ్నిబీజమైన రేఫము కలదు. ఇది శక్తిపురుషులు ఇరువురును అగ్నిస్వరూపులనితెల్పుచు, ఈనామము నుపాసించువారికి అష్టసిద్ధులనొసంగును. బాహ్యాభ్యన్తరశత్రువులనుదొలగించి, జీవునకుస్థితినిజేకూర్చును. పైమూడక్షరములలోను వాస్తుబీజమైన తకార మును వాయుబీజమైన యకారమునుగూడియున్నవి. వానిపైని సర్వదేవబీజ మగు అకారముకలదు. అందుచే దీనినుపాసించువారికి అగ్న్యుత్పాదకములును, అగ్నినివారకములునగు యంత్రములను నిర్మించుశక్తిలభించునని తెలియు చున్నది.

## *144 నామము:- శివ:- "నమోద్వీప్యాయచ"*

భ. భా. భా:— రెండు ప్రక్కలను నీరుగల ఉన్నతస్థలమును ద్వీపమందురు అందుండువాడు కావున శివునకు ద్వీప్యుడు అను నామముకల్గెను పద్మకోశ ప్రతీకాశమును అధోముఖమునగు హృదయము ఉన్నతభూమి, అదియేద్వీపము దానికిరుప్రక్కలనుగల, మూలాధారాది షట్చక్రములు జలమయములు, అట్టి యున్నత ద్వీపమైన హృదయముననున్నవాడు పరమశివుడు. ఆతడే నారము నకు జలరాశికినిలయమైన నారాయణుడు. అందుచే మహాదేవుడు ద్వీప్య నామకుడాయెను.

విష్ణువు: —

"అప్ల = గతౌ" అను ధాతువునుండియేర్పడిన, అప్ పదమునకు అంతటను అవరించియున్నవాడనియర్థము. ఆ విష్ణువుముఖ్యముగా బ్రహ్మాండము నకు బైటబరమాత్ముడుగను, బ్రహ్మాండములోన విరాట్ రూపుడుగను గలడు.

ద్వి = ద్వివిధముగా విరాట్ పరమాత్మలరూపమున, అపః = అంతటనున్న వాడు కావున ద్వీపుడు విష్ణువు. ఆతడే ద్వీపమైన బ్రహ్మాండమున చరాచర రూపమునఁగలడు. కాన ద్వీప్యనామకుడాయెను. "అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణ స్థిత:" అను మంత్రము ఈయర్థమునే తెలియజేయు చున్నది. కాన విష్ణువు ద్వీప్యనామకుడాయెనని తెలియుచున్నది.

***బీజాక్షరసంపుటి:-***

"ద్వీప్య" అను నామమున "ద్+వ్+ఈ+ప్+య్+అ" అని అరక్షరములుకలవు. అవి షడృతువులకును, షడింద్రియములకును జిహ్నా ములు. ఈనామము నుపాసించువారు శాక్తేయులై సర్వసిద్ధులనందగలరు. అంతేకాదు. జలోదరము, శ్వాసరోగము, వాతపీడనము, మూత్రబంధము మున్నగురోగములను నివారింపగలవారలగుదురని తెలియుచున్నది.

విద్యారణ్యభాష్యమును, భట్టభాస్కరభాష్యమునుగల
రుద్రప్రశ్నమున పంచమానువాకము సమాప్తము.



# -: షష్ఠానువాకము :-

## -: ప్రథమయజుస్సు :-

"నమోజ్యేష్ఠాయచకనిష్ఠాయచ"

**అర్థము:-**

జ్యేష్ఠాయచ = విద్య, ఐశ్వర్యమున్నగువానిచే జ్యేష్ఠుడైనట్టియును, కనిష్ఠాయచ = విద్యాదులతో శూన్యుడైనట్టియు మహాదేవునకు నమః = నమస్కారము.

**తాత్పర్యము-**

సా. భా:— దక్షిణామూర్తిరూపమున విద్యాదాతయును, శివరూపమున శుభములను, ఈశ్వరరూపమున ఐశ్వర్యము నొసంగు మహాదేవునిలో ఎన్నియోశక్తులుకలవు. కావున శివుడందరికంటెను జ్యేష్ఠుడాయెను. మహా రూపముతోబాటు అణురూపముతోడనుండుటచే బరమశివునిలో జ్యేష్ఠత్వ కనిష్ఠత్వములురెండునుగలవు. అతనికి ఉత్తమాధములు ఇరువురును సమానులే అతనిలోఁగల కనిష్ఠత్వమే అణుస్వరూపము. అయ్యణుశక్తిలో సకలోత్పాదకనాశకశక్తులురెండునుగలవు. కావున అతనిరూపములు రెండును నమస్కారార్హములే.

పంచమానువాకమునందువలె ఈయనువాకమునందును అన్యతరనమస్కారముగల యజుస్సులేకలవు.

### 145 నామము- శివ:— "నమోజ్యేష్ఠాయచ"

భ. భా భా:— "జగతఃపితరౌవందేపార్వతీపరమేశ్వరౌ" అని కాళిదాస మహాకవి చెప్పినట్లు జగంబులకు బార్వతీపరమేశ్వరులు తల్లిదండ్రులగుటచే

వారే వృద్ధతములని తెలియుచున్నది. అందుచే మహాదేవుడు జ్యేష్ఠుడనగా వృద్ధుడని తెలియుచున్నది యజ్ఞయాగాదులలో ప్రధానముగా బూజింపఁబడు దైవము పరమశివుడే కాన ప్రశస్యతముడాయెను. అందుచే అతనికి జ్యేష్ఠుడను నామముచెల్లును. అతనికి నమస్కారము.

*విష్ణు-*

"ప్రాణోవావజ్యేష్ఠశ్చశ్రేష్ఠశ్చ" అను శ్రుతిలో విష్ణువు సర్వకారణుడైన కారణమున జ్యేష్ఠుడును, సర్వశ్రేష్ఠుడైనకారణమున శ్రేష్ఠుడు నగుచున్నట్లు తెలియుచున్నది. జ్యేష్ఠశ్శ్రేష్ఠః ప్రజాపతిః" అను విష్ణుసహస్రసూక్తిలో వృద్ధుడును ప్రశస్యతముడునగుటచే విష్ణువునకు జ్యేష్ఠనామము పేర్కొనఁబడెను. అతనికి నమస్కారము.

*బీజాక్షరసంపుటి-*

"జ్యేష్ఠ" అను నామమున "జ్ + య్ + ఏ + ష్ + ఠ్ + అ" అని ఆరక్షరములుకలవు. ఇవి షడృతువులను, షట్చక్రములను సూచించును. ఇంద్రబీజమైన జకారమును, వాయుబీజమైన యకారమును, వీరభద్రబీజమైన ఏకారముతోడను, సూర్యచంద్రబీజమైన షకారఠకారములు సర్వదేవబీజమగు నకారముతోడనుగూడియున్నవి. అందుచే ఈనామమును ఇళాపింగళానాడుల ద్వారావాయుప్రేరణముచేసి, యోగులై అష్టసిద్ధులనంది భూతప్రేతాదులను లౌకికులైన బాహ్యశత్రువులను జయించి, లోకమునకు నిత్యకల్యాణము చేకూర్పగలవారలగుదురు. సూర్యచంద్రగోళగమనార్థయంత్రనిర్మాతలు కాఁగలరు. వాతరక్తకాలేయదోషజనితరోగపరిహారకులును గాగలరని తెలియుచున్నది.

**146 నామము:- శివ:- "నమఃకనిష్ఠాయచ"**

భ. భా. భా:— పరమశివుడు యువకబాలరూపములతో బాటు అతిసూక్ష్మరూపుడునై కనిష్ఠనామధారియైలోకకల్యాణకరుడు అగుచున్నాడు. యువకుడైన

కుమారస్వామిరూపముదాల్చి తారకాసుర సంహర్తయాయెను. బాలుడైన దక్షిణామూర్తి రూపముదాల్చి సకలవిద్యాదాతఆయెను. స్వల్పమైన అణురూపము దాల్చి సర్వశక్తులను లోకమునకు జేకూర్చును. అందుచే కనిష్ఠనామము శివునకు సార్థకమాయెను.

*విష్ణు:—*

విష్ణువు బాలకృష్ణరూపముననుండి గోవర్ధనధారియైగోవులను జీవులను గాపాడెను. యువకుడైన శ్రీరామునిరూపముదాల్చి రావణాదిరాక్షససంహారియై లోకమునుగాపాడెను. స్వల్పమైన అణురూపముదాల్చి హిరణ్యకశిపుని దేహమునదూరియు, సముద్రమునదూరియు దుష్టశక్తులను జెండాడికాపాడెను. కావున విష్ణువునకు కనిష్ఠనామముసార్థకమాయెను. జ్యేష్ఠుడైన బలరాముని కంటె శ్రీకృష్ణుడు కనిషుడేకదా!. కౌంతేయులందును కనిష్ఠుడేకదా! కావు విష్ణువు కనిష్ఠనామకుడేయనవచ్చును.

*బీజాక్షరసంపుటి:-*

"కనిష్ఠ" అను నామమున "క్+అ+న్+ఇ+ష్+ఠ్+అ" అని ఏడక్షరములుకలవు. ఇవి సప్తవాయుమండలములను శరీరమందలి సప్తధాతువులను సూచించును. ప్రజాపతిబీజమైన కకారము అకారముతోడను సావిత్రీబీజమైన నకారము ఇకారముతోడను, సూర్యచంద్రబీజములైన షకార ఠకారములు అకారముతోడనుగూడియున్నవి. అందుచే ఉపాసకులు సూర్య చంద్రప్రజాపతుల నుపాసించి, సావిత్రీకటాక్ష లబ్ధమహిములై సకాలవర్షములను కురిపింపగలరు. ఇళాపింగళానాడులందు సావిత్రీరూపకుండలి నుపాసించి, అమృతవృష్టికారకులుకాగలరు. కృత్రిమవర్షదాయకయంత్రములను సృష్టింపగలరని తెలియుచున్నది.

*—: ద్వితీయయజుస్సు :—*

*"నమః పూర్వజాయచాపరజాయచ"*

అర్థము:-

పూర్వజాయచ = జగదాదిని హిరణ్యగర్భరూపమునజన్మించినట్టియును, అపజరజాయచ = జగదవసానసమయమున అగ్న్యాదిరూపమున జన్మించినట్టి మహాదేవునకు, నమః = నమస్కారము.

తాత్పర్యము:-

సా. భా.— పరమాత్మజగత్సృష్టిగావించినపుడు అన్నింటికంటెమొదటను హిరణ్యగర్భరూపమున అవతరించెను. జగంబులునశించుసమయమున కాలాగ్నిమన్నగువానిరూపమున జన్మించెను. అప్పరమాత్మయేమహాదేవుడు. అతడే, హిరణ్యగర్భకాలాగ్న్యాదిరూపముననుండెను. అందుచే పరమశివుడు పూర్వజుడు, అపరజుడు అను నామముల స్తుతింపబడి నమస్కరింపబడెను.

## 147 నామము- శివ- "నమఃపూర్వజాయచ"

భ. భా. భా:— పరమాత్మరూపముననున్న మహాదేవుడు సృష్టికి బూర్వము ననే ఉండెను. కాని అతని రూపముఅదృశ్యము "అజాతఇత్యేవంకశ్చిద్భీరుః ప్రపద్యతే" అను సూక్తిచే మహాదేవునకు జన్మలేదనియేతెలియుచున్నది. కాని సృష్టిచేయగాంక్షించి, సర్వప్రాణులకంటెముందుగాఁ దనమాయయైనశక్తిని తననుండివిడిచెను. అమెసృష్టిచేయించెను. అట్టిశక్తికిని, శక్తిమంతుడైన శివునకును భేదములేదు. కావున అమ్మహాదేవుడు పూర్వజుడుగా భావింపబడి నమస్కరింపబడుటచే అనామమేర్పడెను.

విష్ణు:-

"పూర్వ = పూరణే" అను ధాతువునుండి ఏర్పడిన పూర్వపదమునకు బ్రహ్మాండమంతటినిఁ బూరించువాడనియర్థము. పూర్వుడైజన్మించువాడుకాన పూర్వజుడాయెను, "పురుషఏవేదగ్ంసర్వమ్" అను శ్రుతిలోజెప్పినట్లు సకల మును బూరించువాడై, సర్వముతానై విరాట్‌రూపమున జన్మించెను అతడే

తూర్పున అదిత్యరూపమున జన్మించెను. అందుచే విష్ణువునకుఁ బూర్వజ నామమేర్పడెనని తెలియుచున్నది,

***బీజాక్షరసంపుటి:-***

పూర్వజనామమున "ప్+ఊ+ర్+వ్+అ+జ్+అ" అని యేడ క్షరములుకలవు ఇవి సప్తవాయుమండలములను సప్తధాతువులను సూచించును పర్జన్యబీజమైన పకారమును భూమిబీజమైన ఊకారమును, అగ్నివరుణేంద్ర దేవబీజములతోగూడియున్నవి. అందుచే నీనామము నుపాసించువారు పర కాయప్రవేశాదిశక్తులను సంపాదించుకొనుటయేకాక భూమియందలి సకలవస్తు జాలమును జలమందలివస్తుజాతమును అగ్నిప్రేషకయంత్రములను సృష్టించు వారైవానిసాయమున వెలిబుచ్చగలవారలు అగుదురని తెలియుచున్నది.

## *148 నామము- శివ:- "నమఃఅపరజాయచ"*

భ. భా. భాః— మహాశివుడు సృష్ట్యనంతరకాలమందునను సకల వస్తురూప మున జన్మించువాడై కానవచ్చును. "త్రిపాదూర్ధ్వముదైత్పురుషః" అను శ్రుతిలోజెప్పినట్లు మూడుపాదములతో విరాజిల్లుపరమాత్మయై సర్వప్రాణుల కంటె ఊర్ధ్వముగాసైతముజన్మించెను. అందుచే శివునకు "అపరజుడు" అను నామమేర్పడెనని తెలియుచున్నది.

విష్ణుః—

"నవిద్యతేవరోయస్మాత్స అపరస్సన్జాయతే" అను వ్యుత్పత్తినను సరించి, పరమాత్మయైన విష్ణువుకంటెబరుడులేడనితెలియుచున్నది. అందుచే పురుషోత్తమనామధారియై అపరయైన పడమటిదిక్కునందు సకలప్రాణులకును ప్రాణములనొసంగువాయువురూపమున జన్మించెను; ఈ విషయము

అథారుణః కేతుః పశ్చాదుపాదధాత్।
ఏవాహివాయోఇతి; తతోవాయురుదతిష్ఠత్॥

అను అరుణశ్రుతిచే దెలియుచున్నది. కావున విష్ణువు, అపరజనామకుడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి;-*

"అపరజ" అను నామమున "అ+ప్+అ+ర్+అ+జ్+అ" అని ఏడక్షరములుకలవు. ఇవి సప్తవాయుమండలములకును, మనోబుద్ధులతోడి పంచజ్ఞానేంద్రియములకును జిహ్వాములు. ఇందలి నాల్గు అకారములును విరాట్ హిరణ్యగర్భఅవ్యాకృతతురీయపురుషులకు జెందినవి. పర్జన్యాగ్నీంద్రబీజములు వీనితోగూడియున్నవి. అందుచే నైనామము నుపాసించువారు తమ శరీరపర్జన్యమును అగ్నిప్రధానముచేసి ఆయువును, సర్వశత్రువినాశమును జేకూర్పఁగలవారలగుదురని తెలియుచున్నది.

## —:తృతీయయజుస్సు:—

"నమోమధ్యమాయచాపగల్భాయచ"

*అర్థము:-*

మధ్యమాయ = మధ్యకాలమున దేవతిర్యగాది రూపమున జన్మించినట్టియును, అపగల్భాయచ = ప్రరూఢములుకాని ఇంద్రియములుకలవాడునగు పరమశివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:— "పాదోఽస్యవిశ్వాభూతాని" అను శ్రుతిలోఁజెప్పినట్లు అప్పరమాత్మయొక్క నాల్గువపాదము విశ్వభూతముల రూపమునఁ బరిణ

మించెను. అతడు సృష్ట్యనంతరమున, మధ్యకాలమున సకలదేవతల రూపము నను పశుపక్ష్యాదిరూపమునను ప్రాదుర్భవించెను. అతడే ఇంద్రియపటుత్వము అధికముగాలేని బాలురరూపమునను ప్రాదుర్భవించెను. అట్టి పరమేశ్వరుని అఖిలజీవులును నమస్కరించుచున్నారు.

## 149 నామము- శివ:- "నమోమధ్యమాయ"

భ. భా. భా:— దివ్యతేజస్స్వరూపుడైన పరమేశ్వరుడు మధ్యమకాలమున సకల చేతనాచేతనవస్తుస్వరూపుడై లోకరక్షకుడు, లోకశిక్షకుడు, లోకనాశకుడును అయెను. అతడే హిమవత్ వింధ్యపర్వతమధ్యభాగమైన కాశీ నగరమున విశ్వేశ్వరుడైయుండి మధ్యనామకుడైయుండెను. పరమశివుడు నాద స్వరూపుడు. నాదములలో క్రౌంచభాషితమైన మధ్యమస్వరస్వరూపుడై సకల జనానందకరుడాయెను. అందుచే మహాదేవునకు మధ్యమనామమేర్పడెను.

విష్ణువు:—

శ్లో॥ తద్వదేవోత్థితో వాయురురః కంఠసమాహితః।
నాభిప్రాప్తో మహానాదో మధ్యస్థత్వాచ్చమధ్యమః॥

అను సూక్తిలో చెప్పినట్లు కంఠమునకును నాభికిని మధ్యనుండి వాయువు వెడలునపుడు మహానాదమేర్పడునుదానికి మధ్యమనిపేరు. ఆమహానాదమే ప్రణవము. ఓంకారము. అదివిష్ణుస్వరూపము. కావున విష్ణువు మధ్యమ నామకుడాయెను. "అహమాదిశ్చ మధ్యంచ" అను గీతాసూక్తిలో చెప్పినట్లు విష్ణువు భూతములయొక్క ఆదిమధ్యాన్తస్వరూపుడు; కావున మధ్యమనామకు డాయెను. అంతేకాదు. "పాండవానాంధనంజయః" అను గీతాసూక్తిలో చెప్పినట్లు పాండవమధ్యముడైన అర్జునుడు విష్ణుస్వరూపుడు. నరనారాయణు లలో నరుడు కావున విష్ణువు మధ్యమనామకుడై నమస్కరింపబడుచుండెను.

*బీజాక్షరసంపుటి:-*

మధ్యమనామమున "మ్+అ+ధ్+య్+అ+మ్+అ" అని యేడక్షరములుకలవు. ఇవి సప్తవాయుమండలములకును సప్తనాడులకును జిహ్వాములు. ఇందలి మకారమునాదచిహ్నము. పైనామము నుపాసించువారు మధురనాదమునుధరించి, బైటికి ప్రసరింపఁజేయువాయువుగలనాదయంత్రములను వీణాదులనుసృజించి, సర్వానందదాయకులుకాగలరని తెలియుచున్నది. భూమియందును జలమునందునుగల ధనరాసులను ప్రాణవాయుశక్తితోఁ బైటపెట్టగలవారలగుదురు; అనియునుదెలియుచున్నది.

## 150 నామము;- శివ:- "నమోఽపగల్భాయచ"

భ. భా. భా:— మహాశివుడు, బాలోన్మత్తపిశాచాది రూపములనెన్నింటినో దాల్చి తనచేనిర్మింపఁజేయబడిన జగంబుననేమెలగెను అతడెవ్వరినిధర్షింపక అప్రగల్భుడై ముక్కుమూసికొని తపంబొనరించుచుండెను. అతడే అపగల్భుడైన అనగా బాలుడైన దక్షిణామూర్తిరూపంబుననుండి సకల విద్యాదాతయాయెను. అందుచే అతనికి అపగల్భనామమేర్పడెను.

విష్ణు:—

అపగల్భుడనగా బాలుడు. అత్యంతశిశువు. విష్ణువు బాలకృష్ణుడై వ్రేపల్లెలోపెరిగినపుడు అతనిశక్తి అపగల్భము = అస్పష్టము. అందుచేతనే, పూతన, శకటాసురుడు, మున్నగువారు అతనినిజేరి అతనిచేతనే క్రీడారూపమున సంహరింపబడిరి. బాలపదమునకు గ్రహణధారణపటువు అనియునర్థము కలదు. బాలుడుగానున్న శ్రీకృష్ణుడు గోపాలురిచేఁ బ్రార్థింపఁబడి గోవర్ధనగిరి నెత్తిరక్షించినాడు, అపగల్భుడు = శూరుడుకానివాడు అనియునర్థముకలదు. కృష్ణావతారమున విష్ణువుశూరుడుగానుండకయేపాండవులనుగాపాడి, దుష్టులను శిక్షింపజేసినాడు. కావున అతనికి అపగల్భనామముసార్థకమేఅయెను.

*బీజాక్షరసంపుటి:-*

"అపగల్భ" అను నామమున "అ+ప్+అ+గ్+అ+ల్+భ్+అ" అని యెనిమిదక్షరములుకలవు ఇవి అష్టప్రకృతులకును, శరీరమందలి అష్టచక్రములకును జిహ్నములు పైనామము నుపాసించువారు పృధివీతత్వమైన లకారమును, భార్గవబీజమైన భకారమును ప్రధానముచేసికొని, చతుర్విధ పురుషులనుధ్యానించి సకలసేనాగణాధిపత్యమునువహింపఁగలరు. కృత్రిమ మేఘములనుసృష్టించి, అకాలమందును వర్షముకురిపించగలరు.

-: చతుర్థయజుస్సు :-

"నమోజఘన్యాయచ, బుధ్నియాయచ"

*అర్థము;-*

జఘన్యాయచ = గవాదులపశ్చాద్భాగమున వత్సాదిరూపముననున్నట్టి యును, బుధ్నియాయచ = వృక్షాదులమూలమున శాఖాదులరూపముననున్నట్టి శివునకు, నమః = నమస్కారము

*తాత్పర్యము;-*

సా. భా:— తనమాయయైనప్రకృతి, గోవు, పృధివి, జలము మున్నగు రూపములతోనుండగా బరమేశ్వరుడు ఆ ప్రకృతి వెనుకనేవత్స, గంధము, రసమున్నగురూపములతోనుండెను. ఆప్రకృతియే వృక్షాదులరూపములను దాల్చగా, తానుశాఖాదులరూపముననుండి వానిఫలములను లోకమునకు అందించుచుండెను. అందుచే బరమేశ్వరుని అందఱును నమస్కరించు చున్నారు.

*151 నామము;- శివ:- "నమోజఘన్యాయ"*

భ. భా. భా:— జఘనమనగా కటియొక్క (మొలత్రాడుగలప్రదేశముయొక్క) పశ్చాద్భాగము (వెనుకభాగము) అది బలమునకుస్థానము. అందున్నవాడు మహేశ్వరుడు అతడు బలస్థానమైనమస్కరింపబడుచున్నాడు. "బలాయనమః, బలప్రమథనాయనమః" అను శ్రుతిలోఁ బరమేశ్వరుడు బలముగా పేర్కొన బడెను. ఆ బలమే జఘన్యము. కావున బరమేశ్వరుడు జఘన్యనామమునఁ బేర్కొనబడి స్తుతింపఁబడుచున్నాడు.

విష్ణు: —

జఘన్యము (బలము) విష్ణువుయొక్క విభూతి "బలంబలవతాంబాహమ్ అను గీతాసూక్తిలో విష్ణువు బలముగాఁ బేర్కొనఁబడెను. అంతేకాదు. జఘనము అనగా సేనానివేశము. అందుండువాడు సేనాని. సేనానిలో విష్ణువిభూతి కలదు. కావుననే "సేనానీనాం అహంస్కందః" అను గీతాసూక్తిలో సేనానులలో స్కందుడు విష్ణువుగా జెప్పబడెను. అందుచే జఘన్యనామము విష్ణువునకు జెందునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

జఘన్యనామమున "జ్+అ+ఘ్+అ+న్+య్+అ" అని ఏడక్షరములుకలవు. అవి సప్తవాయుమండలములకును సప్తధాతువులకును బీజములు. అందు ఇంద్రభైరవబీజములైన జకారఘకారములు అకారనకారయకారములతో గూడియున్నవి. అందుచేఁ బైనామము నుపాసించువారు ప్రాణాయామప్రక్రియచే సావిత్రీసాక్షాత్కారముపొంది, ఇంద్రభైరవశక్తులు, సంపాదించుకొని బాహ్యాభ్యన్తరశత్రుసంహారకులై, శత్రుసంహారకమారణాస్త్రద్రష్టలు కాగలరని తెలియుచున్నాది.

## 152 నామము- శివ:— "నమోబుధ్నియాయచ"

భ. భా. భా:— బుధ్నము అనగా మూలము. ప్రధానకారణము. సృష్టికి మూలకారణము పరమశివునిమాయ. బుధ్నముతో గూడినవాడు బుధ్నియుడు. అందుచేఁ బరమశివుడు బుధ్నియనామకుడై నమస్కరింపఁబడుచున్నాడు.

విష్ణు:—

బుధధాతువునుండియేర్పడిన బుధ్నియపదమునకుఁ దెలిసికొనదగిన వాడని యర్థము. శివుడువలె విష్ణువుకూడ సృష్టికిమూలమైనవాడుగా, మూల ముననున్నవాడుగా దెలిసికొనబడుటచే బుధ్నియనామము విష్ణువునకుజెందునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

బుధ్నియనామమున "బ్+ఉ+ధ్+న్+ఇ+య్+అ" అని యేడ క్షరములుకలవు. ఇవి మేఘ, వాయు, చంద్ర, నక్షత్ర, గ్రహసూర్య, ధ్రువ మండలములనెడి ఏడుమండలములను, మనోబుద్ధులతోడి జ్ఞానేంద్రియములను సూచించును. ఇందు వాయుబీజములు ఉకారయకారములురెండుకలవు. అవి త్రిమూర్తిబీజమైన బకారముతోడను, సావిత్రీ ధనదబీజములతోడనుగూడి యున్నవి. అందుచేఁ బైనామము నుపాసించువారు వాయుప్రేషకయంత్రముల నిర్మించి, వానిసాయమున భూనిక్షిప్తధనరాసులను వెలిబుచ్చఁగలవారలగుదు రని తెలియుచున్నది.

### -: పంచమయజుస్సు :-

"నమస్సోభ్యాయచ ప్రతిసర్యాయచ"

అర్థము:-

సోభ్యాయచ = పుణ్యపాపములతో గూడియున్నవాడును, ప్రతిసర్యాయచ = రక్షాబంధమునకు అర్హమైయున్నట్టి శివునకు, నమః = నమస్కారము.

తాత్పర్యము-

సా. భా:— "పుణ్యేనపుణ్యలోకంజయతి పాపేనపాపముభాభ్యామేవ మనుష్యలోకమ్" అని అథర్వణికులు చెప్పుసూక్తిచే, పుణ్యముచేఁ బుణ్యలోకమును, పాపముచేఁ బాపలోకమును, పుణ్యపాపములచే మనుష్యలోకమును, జీవుడుపొందునని తెలియుచున్నది. మహాశివుడు జీవరూపముననున్నపుడు పుణ్యపాపములు రెండింటితోఁ గూడియుండునని తెలియుచున్నది. వివాహాది శుభకార్యములందు హస్తమున ధరింపబడు రక్షాబంధమురూపముగలవాడై, శివుడు దానికర్హుడైయుండునని తెలియుచున్నది. అందుచే మహాదేవుని నమస్కరించుచున్నారు.

## 153 నామము- శివ:- "నమస్సోభ్యాయచ"

భ. భా. భా:— "పుణ్యపాపములతోఁగూడిన మనుష్యలోకమున మహాశివుడు చేతనాచేతనరూపముననుండుటచే సోభ్యుడాయెను. అంతేకాదు. "సాల్వస్సోభమధిష్ఠాయ" అను మహాభారతవచనముచే సోభము అనగా గంధర్వనగరమని తెలియుచున్నది. సోభము అన్నినగరములకును ఉపలక్షణము. అఖిలనగరములందును మహాదేవుడు చేతనాచేతనరూపమునగలడు. కావున సోభ్యనామకుడాయెను. ఇంకొకవిశేషమేమన? శీతోష్ణములతోగూడిన లోకములందు సూర్యాచంద్రాది రూపమునను; సుఖదుఃఖములు, జననమరణములు మున్నగు జంటలతోగూడిన జీవులందు ప్రాణరూపమునను ఉన్నకారణమున మహాదేవుడు సోభ్యనామకుడాయెననియుఁ జెప్పవచ్చును.

*విష్ణుః-*

ఉభ్ ధాతువునుండి ఏర్పడిన ఉభ్యపదమునకు బంధింపదగినది, నింపదగినదనియు అర్థములుకలవు. "అన్తర్బహిశ్చతత్సర్వంవ్యాప్యనారాయణస్థితః" అను శ్రుతిలో జెప్పినట్లు బ్రహ్మాండమునకుబైటను, దానిలోపలను విష్ణువు, విష్ణుతేజస్సును ఆవరించియున్నవి; అని తెలియుచున్నది, బ్రహ్మాండమున గర్మపాశముతో బంధింపదగినవి జీవులు. నింపదగినది విష్ణుతేజస్సు. అట్టి తేజస్సుతోగూడిన సౌభ్యుడువిష్ణువు. బంధ్యములైన జీవులతోఁగూడిన సౌభ్యుడు నారాయణుడు. అందుచే విష్ణువుకూడసౌభ్యనామకుడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

సౌభ్యనామమున "స్+ఓ+భ్+య్+అ" అని ఐదక్షరములు కలవు. అవి పంచభూతములకును, అన్నమయాదిపంచకోశములకును జిహ్నములు. శక్తిపరమేశ్వరబీజములు సకారౌకారములు. అవి భార్గవవాయుసర్వదేవబీజములతోగూడియున్నవి. అందుచేఁ బైనామమును యోగాభ్యాసమున ఉపాసించిధ్యానించినవారు సర్వవిద్యలను, సర్వార్థసిద్ధినిఁ బొందగలరని తెలియుచున్నది.

## *154 నామము- శివః- "నమఃప్రతిసర్యాయచ"*

భ. బా. బా:— వివాహాదికార్యములందు మొదటుహస్తమున బంధింపబడిన, ధరింపబడిన రక్షాబంధరూపముననుండి, నిర్విఘ్నముగా గార్యములనెరవేర్చి రక్షించువాడుకావున శివుడు ప్రతిసర్యనామకుడాయెను. అంతేకాదు. "తిర్యగూర్ధ్వమధశ్చాయీ" అను శ్రుతిలోఁజెప్పినట్లు తిర్యక్కుగాఁ బ్రతికూలముగా తేజోరూపమున బ్రసరించియున్నవాడు; అగుటచే సైతము ప్రతిసర్యనామము శివునకు ఏర్పడెనని తెలియుచున్నది.

విష్ణు:—

"ప్రభాస్మిశశిసూర్యయోః" అను గీతాసూక్తిలో జెప్పినట్లు విష్ణువు సూర్యచంద్రతేజస్స్వరూపుడై బ్రహ్మాండమున తిర్యగూర్ధ్వములుగా సంచరింపదగినవాడైయుండుటచే ప్రతిసర్యనామకుడాయునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి-*

ప్రతిసర్యనామమున "ప్+ర్+అ+త్+ఇ+స్+అ+ర్+య్+అ" అని పదక్షరములుకలవు. అవి దశదిక్కులకును, దశేంద్రియములకు జిహ్వములు, ఇందు వర్జన్యబీజమైన పకారము, వాయ్వగ్నిశక్తివాస్తు విష్ణుదేవబీజములతోగూడియున్నకారణమున బైనామము నుపాసించువారు శక్తిపురుషులనారాధించి, కృత్రిమమేఘములసృష్టించి, కృత్రిమవర్షముకురిపించి, దేశమును సస్యశ్యామలముచేయగలరు. అంతేకాదు. ఆత్మశక్తిచే సహజవర్షములను సైతము కురిపించగలరు. వాయ్వగ్నిప్రేషక యంత్రనిర్మాతలు కాగలరని తెలియుచున్నది.

## -; 6. వ. యజుస్సు ;-

## "నమోయామ్యాయక్షేమ్యాయచ"

*అర్థము:-*

యామ్యాయచ = యమలోకమున బాపులను, శిక్షించు వానిరూపమున జన్మించినట్టియును, క్షేమాయచ = మోక్షమున కర్హుడైయున్నట్టిశివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:— పరమేశ్వరుడుయమలోకమున బాపశిక్షకరూపమున జన్మించి యామ్యుడాయెను. అతడే జీవరూపత్యాగమనెడి క్షేమమును మోక్షమును బొందనర్హుడైక్షేమ్యుడాయెను.

### 155 నామము:- శివ:- "నమోయామ్యాయచ"

భ. భా. భా:- యమమనగా అంతకాలము అట్టి ప్రళయకాలమున సర్వమును సంహరించుటకు రుద్రరూపముననున్నవాడు మహాదేవుడు. అతడే సకలజీవుల ప్రాణములను, దనలోనికిగైకొనుటకై ప్రవర్తించును. ఆతడే యమపురమున సకల జీవులను శిక్షించుటకు యమరూపమున నుండును. అందుచే శివునకు యామ్యనామమువాఱిల్లెను.

**విష్ణు-**

యమపురమున సకల జీవనియామకుడుగానున్నవాడుయముడే. అతడే యామ్యుడు. అమ్మహావిష్ణువు బ్రహ్మాండాంతర్గతుడై పరోపద్రవాదులను, ఉప శమింపఁజేయుటచే యమనామకుడాయెను. "ధృతాత్మానియమోయమః" అను విష్ణుసహస్రసూక్తిలో, బేర్కొన్నయమపదమును, ఇందలి యామ్యపదమును, సమానార్థకములే కాన యామ్యుడన్ననామము విష్ణువునకుజెల్లును.

**బీజాక్షరసంపుటి—**

యామ్యనామమున "య్+అ+మ్+య్+అ" అని ఐదక్షరములు కలవు. అవివేదోక్తపంచఋతువులకును బంచప్రాణములకును జిహ్నములు. ఆరవఋతువు ఐదవఋతువునఁజేరుటచే వేదమున ఋతువులు ఐదుగా జెప్పబడెను. ఇందువాయుబీజమైన యకారద్వయము శక్తిపురుషబీజములతోఁ గూడియున్నవి. వానిమధ్యను మదనబీజమైన మకారముకలదు. పైనామ మును బ్రాణాయామమున శక్తిపురుషాభేదముగా నుపాసించి, మన్మథప్రేరిత కామమునుపీడి జ్ఞానులగుదురు. భూతవైద్యులై భూతప్రేతపిశాచాదులను దొలగించి, జీవులను రక్షింపఁగలరని తెలియుచున్నది.

### 156 నామము- శివ- "నమఃక్షేమ్యాయచ"

భ. భా. భా. క్షేమపదమునకు, రక్షణము, మోక్షము, గుపిస్థానము, అను నర్థములుకలవు. పరమేశ్వరుడు పంచభూతస్వరూపుడై రక్షాస్థానముననుండి,

జీవులను రక్షించును. కర్మఫలానుభవానంతరమున మోక్షస్థానముననుండి, జీవులకుమోక్షమునొసంగును. గుప్తిస్థానమైన ఏకాంతస్థలముననున్నవాడును అప్పరమేశ్వరుడే. కావున శివుడు క్షేమ్యనామకుడాయెనని తెలియుచున్నది.

విష్ణు:—

క్షేమమున రక్షాస్థానముననుండి మహావిష్ణువు సత్త్వగుణమాశ్రయించి జగత్త్రయమును రక్షించును. కాన "వీరహారక్షణః" అను సహస్రసూక్తిలోఁ గల రక్షణపదముచే విష్ణువుస్తుతింపఁబడెను. క్షేమ్యరక్షణనామములురెండును సమానార్థకములే. మోక్షస్థానమైన క్షేమమునుండి భక్తులైన జీవులకు ముక్తి నొసంగి, ముకుందనామకుడాయెను. "ముకుందోఽమితవిక్రమః అను సూక్తిలో గల ముకుందనామమున, క్షేమ్యనామమును, సమానార్థకములే. హృదయాకాశరూపమైన గుప్తిస్థానమున క్షేమముననున్నవాఁడగుటచే విష్ణువు గుహ్యోగభీరః" అను సహస్రసూక్తిలో గుహ్యనామమున స్తుతింపబడెను. గుహ్యక్షేమ్యనామములు రెండును సమానార్థకములే. పైకారణములచే క్షేమ్య నామము విష్ణువునకును జెల్లునని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి*-

క్షేమ్యనామమున "క్ + ష్ + ఏ + మ్ + య్ + అ" అను నామమున ఆరక్షరములుకలవు. అవి షడృతువులకును షడింద్రియములకును జిహ్వ ములు. ఇందలిమొదటిమూడువర్ణములును వరుసగా ప్రజాపతిసూర్య వీర భద్రబీజములు. వానితో మదనవాయు సర్వదేవబీజములుకూడియున్నవి. పైనామము నుపాసించువారు ప్రాణాయామమున సూర్యాదులను ధ్యానించి, సకలలౌకికకాంక్షలను బొందినవారై రక్తదోషముచేనేర్పడిన కామెర్లమున్నగు రోగములను దొలగించు నౌషధములనుగనుగొని రోగనివారకులుగాగలరు. సూర్యునికిరణజన్యశక్తుల నొంది సకలరోగనివారకులుకాగలరు. భూతాదులను దొలగించి, ప్రజలను రక్షింపగలరని తెలియుచున్నది.

## -: 7. వ. యజుస్సు :-

"నమఉర్వర్యాయచ ఖల్యాయచ"

**అర్థము:-**

ఉర్వర్యాయచ = సర్వసస్యముల తో నిండిన భూమిలో ధాన్యాదివిశేష రూపముననున్నట్టియును ఖల్యాయచ = మేడి, నక్కనాగలిరూపమున భూమిని దున్ని అందలిసారమును వెలిబుచ్చునట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— సర్వసస్యములను ఫలింజేసి, జీవకోటినిఁ బోషించుటకు భూమిపై గల సస్యములందు బరమేశ్వరుడు ధాన్యాదిరూపముననున్నవాడు. అతడే సస్యసమృద్ధినిజేకూర్చుటకు మేడి, నక్క, నాగలిమున్నగు వ్యవసాయపు బరికరములరూపమునంది, భూమిలోనున్నసారమును వెలిబుచ్చుచున్నాడు. అట్టి మహనీయునకు నమస్కారము.

### 157 నామము- శివ- "నమఉర్వర్యాయచ"

భ. భా. భా:— "భూమిర్మాతాదితిర్నః" అనెడి స్వాధ్యాయమంత్రము భూమియే చేతనాచేతనములను రక్షించుమాతయని తెలియుచున్నది. శక్తి సహితుడైనశివుడు సర్వసస్యసంపూర్ణమైన భూమిలో ధాన్యాది రూపమున నున్నాడు. ధాన్యాదులే అన్నము. అన్నమేపరబ్రహ్మము దానిచే జీవులు జనించుచున్నారన్నవిషయము "అన్నంబ్రహ్మేతివ్యజానాత్, అన్నాద్ధ్యేవఖల్విమాని భూతానిజాయన్తే "అనుతైత్తరీయశ్రుతివలన తెలియుచున్నది. అందుచే శివుడు ఊర్వర్యనామకుడు (ఉర్విలోనున్నవాడు) అయెనని తెలియుచున్నది.

విష్ణు-

ఉర్వరయందు భూమియందుగలది ఊర్వార్యము. "ఉర్వ = హింసాయామ్" అను ధాతువునుండిఏర్పడిన ఉర్వారపదమునకు జీవులయాకలిని బోగొట్టునదియని అర్థము. అనగా బరమాత్మ భూమిలోగల సస్యములందు అన్న రూపముననుండి జీవులను రక్షించును. కాన ఉర్వార్యము, అనగా అన్నమని తెలియుచున్నది అన్నము విష్ణువే కాన "అన్నమన్నాదఏవచ" అను విష్ణు సహస్రసూక్తిలో అన్నపదము విష్ణునామముగా ప్రయోగింపబడెను. భూగర్భ మందున్నది అన్నముకూడఅగును. భూగర్భము విష్ణువే, కాన "హిరణ్యగర్భో భూగర్భః" అను సహస్రసూక్తిలో భూగర్భపదము విష్ణునామముగానున్నది. పరీకింపగా "ఉర్వార్యము, అన్నము. భూగర్భము" అను మూడును సమానార్థకములేయని తెలియుచున్నది. అందుచే విష్ణువు ఉర్వార్యనామకుడేయని చెప్పవచ్చును.

ఉర్వార్యనామమున "ఉ+ర్+వ్+అ+ర్+య్+అ" అని యేడక్షరములుకలవు. అవి సప్తవాయుమండలములకును,మనోబుద్ధిలతోడివంచేంద్రియములకును జిహ్వములు. ఇందలి ఉకారయకారములు వాయుబీజములు, రేఫద్వయము అగ్నిబీజము. వకారమువరుణబీజము. అవి అకారద్వయముతోఁ గూడియున్నవి. పైనామము నుపాసించువాడు ప్రణవోపాసకుడు. అతడు అగ్ని వరుణవాయుశక్తులతోఁ గూడిన మారణాస్త్రములను ఔషధములను సృజించి, సకల రోగములతోబాటు సకలశత్రువులను సంహరింపజేయగలవాడుకాగలడని తెలియుచున్నది.

*158 నామము- శివ:— "నమఃఖల్యాయచ"*

భ. భా. భా:—సస్యముఁను శోధనచేయుస్థానమును ఖలము అందురు, అందుగలవాడు ఖల్యుడు. అనగా సస్యశోధనభవుడు శివుడు అనితెలియు

చున్నది. "ఖలతి = చలతి" అను ధాతువునుండిపుట్టినపదముఖలము. చలించెడి చేతనాచేతనవస్తువులందు బరమేశ్వరుడువాయురూపమునను, ఆఋశక్తి రూపమునను ఉండును. కాన శివుడు ఖల్యనామకుడాయెను.

**విష్ణు:—**

"సూర్యోనోదివస్పాతువాతో అంతరిక్షాత్, అగ్నిర్నఃపార్థివేభ్యః" అను సౌరమంత్రముచే ఖలమైన భూమిలో విష్ణువు అగ్నిరూపముననున్నవాడని తెలియుచున్నది. ఖం = ఆకాశమును, లాతి = గ్రహించువాడు, ఖలుడు; అనగాద్యుమణియైన సూర్యుడు. ఆసూర్యునిలో "ప్రభాస్మిశశిసూర్యయోః" అను గీతాసూక్తిలోc జెప్పినట్లు కాంతిరూపమునన్నువాడు ఖల్యుడు. అనగా బరమాత్మయైన విష్ణువు అని తెలియుచున్నది. అందుచే విష్ణువు ఖల్యనామకు డాయెనని తెలియుచున్నది.

**బీజాక్షరసంపుటి:-**

ఖల్యనామమున "ఖ్+అ+ల్+య్+అ" అని యైదక్షరములు కలవు. అవి పంచాగ్నులకును, పంచకోశములకును జిహ్నములు పైనామము నుపాసించువాడు మూలాధారమున బృధివీతత్త్వమును బ్రాణాయామక్రియలో నుపాసించి, గంగాబీజమైన ఖకారముచేతెలియు, జలరూపప్రకృతిని సాక్షాత్క రించుకొనగలడు. పాపములను బోగొట్టుకొనగలడు. యోగశక్తిచే వాయు భేదములను వశబఱచుకొని వాయుశక్తిచే బృధివియందును, జలమునందును, గల సకల వస్తుజాతమును బైటపెట్టగలవారలగుదురని తెలియుచున్నది.

-: 8. వ. యజుస్సు :-

"నమశ్శ్లోక్యాయచావసాన్యాయచ"

**అర్థము:-**

శ్లోకములనగా వేదమంత్రములు. శ్లోక్యాయచ = వేదమంత్రములచేఁ దెలియదగుమహిమగలవాఁడై, వానిలోనున్నట్టియును, అవసాన్యాయచ = వేదాన్తములైన ఉపనిషత్తులచే నిరూపింపదగుతత్త్వముకలవాడు కాన వానిలో నున్నట్టిశివునకు నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— వేదమనగా బరమాత్మ. వేదమంత్రములు అప్పరమాత్మమహిమను బ్రతిపాదించును. అవి ఋగ్వేదమున శ్లోకరూపములను, యజుర్వేదమున యజుస్సులుగా అనగా వచనముల రూపమునను, సామవేదమున గానముతోగూడియు, అథర్వణవేదమున విజ్ఞానశాస్త్రముతోగూడియును గలవు. అటులనే అవసానములు వేదాన్తములైన ఉపనిషత్తులుకూడఁ బరమాత్మ మహిమనే ప్రతిపాదించును.

## 159 నామము- శివ:- "నమఃశ్లోక్యాయచ"

భ. భా. భా:— శ్లోకృ = సంఘాతే" అను ధాతువునుండి యేర్పడిన శ్లోక పదమునకు పాదబద్ధమైన అక్షరసమూహమువలె చేతనాచేతనబద్ధమైన బ్రహ్మాండమనియు అర్థముకలదు. అట్టిబ్రహ్మాండమున పంచభూతముల స్వరూపముతోడను, సూర్యచంద్రులస్వరూపముతోడను ఉన్నవాడగుటచే శివునకు శ్లోక్యనామమేర్పడెను. వేదస్వరూపుడు కాన శ్లోకములైన వేదమంత్రములందుఁ బరమేశ్వరుని మహిమకలదు అందుచేఁ బరమేశ్వరుడు శ్లోక్యనామకుడాయెను.

విషః—

"ఐశ్వర్యస్యసమగ్రస్యధర్మస్యయశసఃశ్రియః" అను సూక్తిచే శ్లోకము అనగా యశస్సుభగవద్విభూతియనితెలియుచున్నది. తస్యనామ మహద్యశః"

అను శ్రుతిచే మహద్యశోనామకుడై అందు భగవంతుడు, విష్ణువు కూడని తెలియుచున్నది. "శ్లోక్యతే = స్తుతింపబడుచున్నాడు" అని యర్థము చెప్పినపుడు పరమాత్మయైన విష్ణువుకూడ శ్లోక్యనామకుడేయనితెలియుచున్నది. "స్తుతస్స్తోతారణప్రియః" అను సహస్ర సూక్తిలోగల స్తుతుడు అనునదియును శ్లోక్యుడు అను నదియును సమానార్థకములేకాన శ్లోక్యనామము విష్ణువునకుం జెల్లునని తెలియుచున్నది

*బీజాక్షరసంపుటి:-*

శ్లోక్యనామమున "శ్ + ల్ + ఓ + క్ + య్ + అ" అని ఆరక్షరములు కలవు. అవి షడృతువులకును, షడింద్రియములకును చిహ్నములు. లక్ష్మీ బీజమైన శకారమును పృథివీబీజమైన లకారమును, ఈశ్వరబీజమైన ఓకారముతోడను, ప్రజాపతి బీజమైన కకారము, వాయుబీజమైన యకారమును, సర్వదేవబీజమైన అకారముతోడనుగూడియున్నవి అందుచే ఉపాసకులు ప్రాణాయామక్రియలోం బృథివీచక్రమున శక్తిసహిత శివుని ధ్యానించి పృథివియందలి సకల సంపదలను జేకూర్పగలరు. వర్షము కురిపించి పంటలు పండించగలరు. మూలవ్యాధి పాండువు మున్నగురోగములను నివారింపగలరు; అని తెలియుచున్నది.

## *160వ. నామము:- శివ:- "నమఅవసాన్యాయచ"*

భ. భా. భా:— "సర్వార్థములనుపసంహరించు ప్రళయకాలమున మహాదేవుడు ఏకాదశరుద్రరూపముననుండును. అందుచే అతడు వేదాన్తవేద్యుడై అవసాన్యనామకుడాయెనని తెలియుచున్నది.

విష్ణు:—

తనభక్తులైన గజేంద్రాదులయొక్క జీవితావసానసమయమునం బ్రత్యక్షమై, అక్కాలముననుండి వారిని రక్షించును. కాన విష్ణువు అవసాన్యనామకడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి*—

అవసాన్యనామమున "అ+వ్+అ+స్+అ+న్+య్+అ" అని యెనిమిదక్షరములుకలవు అవి అష్టప్రకృతులకును, షట్చక్రములతోగూడిన ఇళాపింగళానాడులకును జిహ్వాములు. ఇందలి సకారనకారములు శక్తిసావిత్రీ బీజములు. అకారముపరాశక్తిబీజము. మూడుశక్తిబీజములకును మూడు పురుషబీజమైన అకారములుకలవు. యీ శక్తిపురషత్రయము వరుణబీజమైన వకారముచే జలప్రకృతికిఁ జెందినవిగా సూచింపఁబడెను. పైదేవతలను యకారముచే సూచింపబడిన ప్రాణాయామక్రియలో ధ్యానించి, ఉపాసించి, ఉపాసకులు సర్వశక్తిసంపన్నులై కలుషజలవాయువులచేఁ గల్గినరోగములను నశింపఁజేయఁగలవారును జలవాయుసంచారయంత్రనిర్మాతలునుగాగలరని తెలియుచున్నది.

-: *నవమయజుస్సు* :-

*"నమోవన్యాయచకక్ష్యాయచ"*

***అర్థము:-***

వన్యాయచ = వృక్షాదిరూపముననున్నట్టియును, కక్ష్యాయచ = లతాది రూపముననున్నట్టియు శివునకు, నమః = నమస్కారము.

***తాత్పర్యము;-***

సా. భా:— చేతనాచేతనరూపముననుండు పరమశివుడు వనమునందు వృక్షాదిరూపమునను, లతాదిరూపముననుండెను. అందుచే అతనికి నమస్కారము.

***161** నామము;- శివ:- "నమోవన్యాయచ"*

భ. భా భా:— దేవమానవరాక్షసాదిభేదముతోడను, స్త్రీపుంనపుంసక భేదముతోడను, వృక్షాదులలో, పెక్కుతెగలుకలవు. వానిలోగల బలము,

రుచి, రసము, తేజస్సు, మున్నగునవి శివశక్తులే. అందుచే మహాదేవుడు వనమున వృక్షాదిరూపముననుండి, వన్యనామకుడై నమస్కరింపఁబడుచుండెను. "వన" అను ధాతువునకు పూజించు, జయించు, ప్రార్థించు, మున్నగు నర్థములుకలవు. అట్టి వనధాతువునుండియేర్పడిన వన్యపదమునకుఁ బూజింపఁదగినవాడు, ప్రార్థింపఁదగినవాడని యర్థములుకలవు. అందుచేఁ బరమేశ్వరుడు ఐశ్వర్యకాములచే ఈశ్వరరూపముననను ఆ రో గ్య కా ము ల చే ఆదిత్యరూపముననను బూజనీయుడు, ప్రార్థనీయుడునై వన్యనామకుడాయెనని తెలియుచున్నది.

విష్ణు: —

వనితుం = పూజితుం, ప్రార్థయితుం యోగ్యఃవన్యః ఈవన్యపదముచే మహావిష్ణువుజెప్పబడును. ఎట్లన? విష్ణువు వృక్షములలో అశ్వత్థరూపముననను, మృగములలో సింహరూపముననను, పక్షులలోగరుడరూపముననుండి వన్యుడు పూజ్యుడాయెను. "అశ్వత్థస్సర్వవృక్షాణామ్;" మృగాణాంచమృగేంద్రోఽహమ్ వైనతేయశ్చపక్షిణామ్" అను గీతాసూక్తులచే నైవిషయము, సూచింపఁబడెను. వనమునందు = జలమునందు వరుణరూపముననను, మకరరూపముననను, సాగరరూపముననుండి మహావిష్ణువు వన్యుడగుచున్నాడు. "వరుణోయాదసామహమ్; ఝషాణాంమకరశ్చాస్మి; సరసామస్మిసాగరః" అను గీతాసూక్తులచే నైవిషయము తెలియుచున్నది. విష్ణువు శంకరాదిత్యసూర్యరూపములనుండి వన్యనామకుడగుచున్నాడని (పూజ్యుడగుచున్నాడని) తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

వన్యనామమున "వ్ + అ + న్ + య్ + అ" అని ఐదక్షరములుకలవు అవి పంచాగ్నులకును, పంచేంద్రియములకును చిహ్నములు. ఇందలి వకార నకారయకారములు వరుణవాయుసావిత్రీబీజములై శివవిష్ణుబీజమగు అకార ద్వయముతోగూడియున్నవి. పైనామము నుపాసించువారు పైదేవతల

సాక్షాత్కారమంది, జలోదరము, బొల్లికాలిమ, తెల్లమచ్చలు, మున్నగురోగము లను భూతప్రేతాదిభయమును బోగొట్టగలవారలగుదురని తెలియుచున్నది. అంతేకాదు. వాయుజలయానప్రేషకయంత్రనిర్మాతలును గాగలరని తెలియుచున్నది.

## *162 నామము- శివ:- "నమఃకక్ష్యాయచ"*

భ. భా. భా:— పరమేశ్వరుడు, కక్ష్యరూపమున అనగా లతాదిరూపమున నుండి, జీవులభక్తిభావమును ఇనుమడింపజేయుటకుఁ బుష్పాదులనొసంగుచున్నాడు. అందుచే కక్ష్యనామకుడాయెను "కష – హింసాయామ్" అను ధాతువునుండి కక్ష్యపదమేర్పడుటచే దుష్టులను రాక్షసులను హింసింప శివుడు అర్హుడైయుండెను. అక్కారణముచే సైతము మహాదేవుడు కక్ష్యనామకుడాయెననియుఁ జెప్పవచ్చును

*విష్ణు:-*

భగవంతుడైన విష్ణువు తనయవతారములను దానుగాపాడుకొనుచు లోకములనుగాపాడెను. అందులకై తానుసంజీవనీమున్నగుకక్షల (లతల) రూపమునుదాల్చి, వానిలోదనజ్యోతిస్సునుంచెను. శ్రీరామావతారమున యుద్ధమున హనుమంతునిచేఁ దేబడినసంజీవనీలతచే జీవింపబడుటయే అందులకు దార్కాణము, కావున విష్ణువు కక్ష్యనామకుడాయెను.

*బీజాక్షరసంపుటి-*

కక్ష్యనామమున "క్+అ+క్+ష్+య్+అ" అని ఆరక్షరములు కలవు. అవి షడృతువులకును, షడింద్రియములకును జిహ్వములు. ఇందు సూర్యబీజమైన షకారము కకారయకారాకారములతోఁగూడియున్నకారణమున నైనామము నుపాసించువారు ప్రాణాయామశక్తిచే యోగధారణమున సూర్య భగవానునిజూడగలవారలును సూర్యమండలగాములునుగాగలరని తెలియుచున్నది. అంతేకాదు వాయుశక్తిసహితములును సూర్యగోళ గమనార్హములు నగు యంత్రములను నిర్మింపఁగలవారలు అగుదురని తెలియుచున్నది.

-: దశమయజుస్సు :-

"నమశ్శ్రవాయచ ప్రతిశ్రవాయచ"

**అర్థము:-**

శ్రవాయచ = శబ్దస్వరూపుడును, ప్రతిశ్రవాయచ = ప్రతిధ్వనిరూపుడు నగు శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— నాదబ్రహ్మ స్వరూపుడగుటచే బరమాత్మ శబ్దస్వరూపుడును బ్రతిధ్వనిరూవుడునై నమస్కరింపబడుచున్నాడు.

**163 నామము- శివ:- "నమః శ్రవాయచ"**

శ. భా. భా:— శ్రూయత ఇతి శ్రవః అను వ్యుత్పత్తిచే మహాదేవుడు శబ్దాత్మకుడై సుప్రసిద్ధుడై శ్రవనామకుడాయెనని తెలియుచున్నది. శృణోతీతి శ్రవః అను వ్యుత్పత్తిచే సూర్యచంద్ర వాయురూపములతో అంతటనుండు. అంతటను జరించును. వినును. కావున శివుడు, శ్రవనామకుడాయెనని చెప్పవచ్చును.

**విష్ణు:-**

గమనార్థక శ్రుధాతువునుండి శ్రవశబ్దమేర్పడుటచే ధ్వనివలె విష్ణువు సర్వగమనుడై సర్వవ్యాపకుడైనకారణమున శ్రవశబ్దవాచ్యుడాయెను. "శృణోతీతి శ్రవః" అను వ్యుత్పత్తిచే భక్తులస్తోత్రార్తనాదములనాలకించుననియు, అందుచే శ్రవశబ్దవాచ్యుడాయెననియుజెప్పవచ్చును. అంతేకాదు వేదశబ్ద స్వరూపుడుకాన శ్రవనామకుడాయెననియుఁ దెలియుచున్నది. "సుఘోషస్సుఖదస్సుహృత్" అను విష్ణుసహస్రమందలి సుఘోషనామమును శ్రవనామమును సమానార్థకములే కాన విష్ణువు శ్రవనామకుడని చెప్పవచ్చును.

**బీజాక్షరసంపుటి-**

శ్రవనామమున "శ్ + ర్ + అ + వ్ + అ" అని ఐదక్షరములుకలవు అవి పంచప్రాణములకును, పంచకోశములకును చిహ్నములు. లక్ష్మీబీజమైన

శకారమును అగ్నిబీజమైన రేఫమును, వరుణబీజమైన వకారమును అకార ద్వయముతో గూడియున్నవి. పైనామమును యోగమార్గమున నుపాసించు వారు జలాగ్నిరోగములను దొలగించి, శరీరమునకు బ్రహ్మవర్చస్సును జేకూర్పగలరనియును, అగ్న్యుత్పాదక యంత్రములను, జలస్థఘనరాశిప్రేషక యంత్రములను సృష్టించి, సకల సంపత్సంపన్నులుకాగలరని తెలియు చున్నది.

### 164 నామము:- శివ:- "నమః ప్రతిశ్రవాయచ"

భ. భా. భా:— శివుడు ప్రతిధ్వనిస్వరూపుడును, ప్రతివచనస్వరూపుడు నగుటచే ప్రతిశ్రవనామకుడాయెను.

*విష్ణు:—*

విష్ణువు సకలవస్తుసంచారికావున సకల వస్తువులందలి ప్రతిధ్వని ఆత నిదే. అందుచే విష్ణువు ప్రతిశ్రవనామకుడాయెను.

*బీజాక్షరసంపుటి:-*

ప్రతిశ్రవనామమున "ప్ + ర్ + అ + త్ + ఇ + శ్ + ర్ + అ + వ్ + అ" అని పదక్షరములుకలవు. అవి దశదిక్కులకును దశేంద్రియములకును జిహ్నములు. పైనామము నుపాసించువారు వాస్తు శాస్త్రజ్ఞులై, మేఘాగ్ని జలోత్పాదకయంత్రనిర్మాతలును సకల సంపత్సంధాయకులును గాఁగలరని తెలియుచున్నది.

### -: 11. వ. యజుస్సు :-

"నమఆశుషేణాయచాశురథాయచ"

**అర్థము:-**

ఆశుషేణాయ = వేగముగాబోవు సేనకలిగినట్టియును, ఆశురథాయచ = వేగముగాబోవురథముకలిగినట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— "తస్యాగ్నిరనీకమాసీత్" అను శ్రుతిచే అగ్ని శివునిసేనయని తెలియుచున్నది. వాయువులో అగ్నికలదు. కాన వాయువుతోఁబాటు అగ్నిరూప శివసేనయును అతిశీఘ్రముగా బ్రహ్మాండమునఁ బ్రసరించునని తెలియుచున్నది "క్షోణీరథో హరిశరః" అను సూక్తిచే శివునిరథము భూమియనితెలియుచున్నది. భూమితనచుట్టుతాను దిరుగుచు, సూర్యునిచుట్టును దిరుగును. కాన శివుని రథము అతిశీఘ్రముగాబోవునని తెలియుచున్నది అట్టిసేనయును రథమును గల శివునకు నమస్కారము.

## 165 నామము- శివ:— "నమఆశుషేణాయచ"

భ. ఖా. భా:— పరమేశ్వరుడు పంచభూతస్వరూపుడేకాదు. సూర్యచంద్ర స్వరూపుడుకూడ. అందుచే అతడు తనసేనయైన అగ్నివలె దానును సూర్య స్వరూపుడై అంతటను ఆశువే = వ్యాపించియుండువాడే; కాన ఆశుషేణ నామకుడాయెను

**విష్ణు-**

ఇనేనసహవర్తత ఇతి సేనః; అశ్నుతఇతిఆశుః; ఆశుశ్చాసౌసేనశ్చ ఆశు షేణః" అని వ్యుత్పత్తిచెప్పి, విశేషణోభయపదకర్మధారయసమాసముచేయ వచ్చును. అందుచే విష్ణువు, ఆశువు = సర్వవ్యాపకుడును, "చంద్రసూర్యౌచ నేత్రే" అను సూక్తిచే ఇనరూప (సూర్యరూప) నేత్రముతోగూడియుండు

వాడునుగాన "అశుషేణ" నామకుడాయెనని తెలియుచున్నది. అవర్తనో నివృత్తాత్మా" అను విష్ణుసహస్రసూక్తిలో అవర్తనపదము విష్ణునామముగాఁగలదు. "అ = సమన్తాత్ వర్తత ఇతి అవర్తనః" అను వ్యుత్పత్తిచే అంతటను వేగముగా ప్రవర్తించువాడు అని చెప్పవచ్చును. అపుడు "అశుషేణుడు, అవర్తనుడు" అను రెండును సమానార్థకములగును. అందుచే విష్ణువు అశుషేణనామకుడన వచ్చును.

*బీజాక్షరసంపుటి:-*

అశుషేణనామమున "అ+శ్+ఉ+ష్+ఏ+ణ్+అ" అని ఏడక్షరములుకలవు. అవి సప్తసూర్యమండలములను శరీరస్థ సప్తధాతువులను సూచించును. ఇందులక్ష్మీపరాశక్తి బీజములైన అకారశకారములు వాయు బీజమైన ఉకారముతోఁగూడియున్నవి. సూర్యబీజమైన షకారము, వీరభద్ర బీజమైన ఏకారము, నందిబీజమైన ణకారమును అకారముతోఁగూడియున్నవి. అందుచేఁ బైనామము నుపాసించువారు సూర్యోపాసకులై, శక్త్యారాధనచే సర్వశక్తిసంపన్నులై, వాయుసహాయమున సూర్యమండలగాములు కాగలరనియును, సూర్యగోళగాములైన యంత్రములను నిర్మింపఁగలవారలునుగాఁగలరని తెలియుచున్నవి. సూర్యవిద్యాదశాత్మలనుపాసించి, సూర్యకిరణముల నుండి ద్వాదశశక్తులను సంగ్రహించి, సకల రోగనివారకులు కాగలరని తెలియుచున్నది.

## 166 నామము- శివ- "నమఆశురథాయచ"

భ భా. భా:— శివుని రథము పృథివి. అది బ్రహ్మాండమంతటను వ్యాపించియున్నది. అది అతిశీఘ్రముగా అంతటను సంచరించును. పృథివీతత్త్వములేనట్టి, చేతనాచేతన వస్తువులేలేవు. అందుచే మహాదేవుడు ఆశురథనామకుడాయెను. పరమశివుని రథము = అనగా పంచభూతాత్మకశరీరము, ఆశువు = బ్రహ్మాండమంతటను వ్యాపించును. కావున శివుడు ఆశురథనామకుడాయెను.

విష్ణు:- "పాదోఽస్యేహాభవత్పునః" అను శ్రుతిచే భగవంతునినాల్గుపాదములలో ఒకటి బ్రహ్మాండరూపముననున్నట్లుతెలియుచున్నది. రథపదమునకు బావమనియునర్థముకలదు. ఆ రథమే, విష్ణువుయొక్క నాల్గవపాదము. అది బ్రహ్మాండరూపమున ఆశువుఅనగా అంతటను వ్యాపించినది. కావున విష్ణువు ఆశు థనామకుడాయెను.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "అ+శ్+ఉ+ర్+అ+ధ్+అ" అని ఏడక్షరములుకలవు. అవి సప్తవాయుమండలములను, సప్తేంద్రియములను సూచించును. పైనామము నుపాసించువాడు అగ్న్యుపాసకుడై వాయగ్నులసాయమున ధన లక్ష్మిని జీవులకు జేకూర్చుచు బ్రహ్మాండమున, ధకారముచేఁ దెలియుధర్మ మును స్థాపించును. అని తెలియుచున్నది.

## -; 12. వ. యజుస్సు ;-

## "నమశ్శూరాయచావభిందతే"

***అర్థము:-***

శూరాయచ = యుద్ధమున ధైర్యముకలవాడును, అవభిందతేచ = శత్రువులను సంహరించువాడునగు శివునకు, నమః = నమస్కారము.

***తాత్పర్యము;-***

సా. భా:— మహాదేవుడు యుద్ధమున మహాధైర్యశాలి. త్రిపురాసురాది శత్రు సంహారకుడు కావున శివునకు నమస్కారము.

## *167 నామము- శివ:— "నమఃశూరాయచ"*

భ. భా. భా:— మహాదేవుడు సంహారకర్త. యుద్ధమొనధీరుడై త్రిపురాసు రాది రాక్షసులను సంహరించినాడు. "ధృతిఃక్షమా" అను గీతాసూక్తిచే ధైర్యము భగవంతుని విభూతియని తెలియుచున్నది. "భయకృత్ భయనాశనః" అను సూక్తిలో జెప్పినట్లు భగవంతుడే భయకారకుడు. అతడు పరమశివుడే. కావున శివుడు శూరనామకుడాయెను.

విష్ణు: ధైర్యవంతులలో అగ్రేసరుడు శ్రీరామచంద్రుడు. అతడు విష్ణువేయను విషయము "రామశ్శస్త్రభృతా మహమ్" అను గీతాసూక్తిచేఁ దెలియుచున్నది "శూరశ్శౌరిః" "శూరశ్శౌరిజనేశ్వరః" అను విష్ణుసహస్రసూక్తులలో శూర పదము విష్ణుపరముగాఁగలదు అందుచే శివుడువలె విష్ణువుకూడ శూరనామ కుడేయనితెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి—*

శూరనామమున "శ్ + ఊ + ర్ + అ" అని నాల్గక్షరములుకలవు. అవి దవాగ్నిమున్నగు చతుర్విధాగ్నులకును అంతఃకరణచతుష్టయమునకును (మనోబుద్ధిచిత్తాహంకారములకు) జిహ్వాములు భూమిదైవత్యమైన ఊకారముతో లక్ష్మీబీజమును, అకారముతో అగ్నిబీజమునుగూడియున్నవి. అందుచే ఉపాసకుడు మూలాధారచక్రమైన భూమియందు అగ్నిరూపిణిగాఁలక్ష్మినుపాసించి, సకలసంపదలను బొందుననియును, అగ్నిసహాయమున భూమిలోని సకలసంపదలను గనుగొనఁగలవాడునుగాఁగలడని తెలియుచున్నది.

*168 వ. నామము:- శివ:- "నమోఅవభిందతేచ"*

భ. భా. భా:— మహాదేవుడు తన భక్తుడైన మార్కండేయుని ప్రాణములు గొంపోవద్వేషించిన యముని అప్రయత్నముగనే ఆటనుండి భేదించితొలఁగించినాడు. అటులనే తన భక్తులను ద్వేషించువారినెల్ల భేదించును. అంతేకాదు. బ్రహ్మాండమును ధరించురక్షించు ధర్మమును ద్వేషించినవారినెల్ల భేదించును. అందుచే శివునకు "అవభిందన్" అను నామముసార్థకమాయెను.

విష్ణువు:—

మహావిష్ణువుకూడ తన భక్తులైన ప్రహ్లాదాదులను ద్వేషించుహిరణ్యకశిప్వాదులనెల్లభేదించినాడు. ధర్మమును ధ్వంసముచేయురావణాదులను భేదించినవాడు. కావున విష్ణువు "అవభిందన్" అను నామముకలవాడాయెను.

*బీజాక్షరసంపుటి:-*

ఇందు "అ + వ్ + అ + భ్ + ఇ + న్ + ద్ + అ + న్" అని తొమ్మిది అక్షరములుకలవు. అవి నవబ్రహ్మలకును నవద్వారములకును జిహ్వాములు.

పైనామము నుపాసించువారు జలోదరాదిరోగములను, బుద్ధికిజెందిన రోగములను, శ్యామలాదిచర్మరోగములను నివారించుశక్తిని పాపనివారకశక్తిని భృగు దూర్గా సావిత్రీ జపములచే సంపాదించగలరని తెలియుచున్నది.

## -: 13. వ. యజుస్సు :-

"నమోవర్మిణేచవరూధినేచ"

**అర్థము;-**

వర్మిణేచ = కవచముకల్గినట్టియును, వరూథినేచ = గృహముకలవాడు నగు శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము;-**

సా. భా:— మహాశివుడు జీవస్వరూపుడు కాన యోధరూపముననున్నపుడు కవచముకల్గియుండెను. నివాసార్థములైన గృహములను గల్గియుండెను. అట్టి మహాదేవునకు నమస్కారము.

## 169 వ. నామము- శివ;- "నమోవర్మిణేచ"

భ. భా. భా:— వృణోతిశరీరమితివర్మ" అను వ్యుత్పత్తిచే శరీరమును రక్షించుటకు ఆవరించియుండు కవచమును "వర్మ" అందురు. సకల జీవులను రక్షించుటకు పాంచభౌతికమైన శరీరము వర్మవలెనుండును. "ఉద్ధరేదాత్మనాత్మానమ్" అను గీతాసూక్తిలోఁ జెప్పినట్లు జీవస్వరూపుడైన శివుడు తననుదాను రక్షించుకొనుటకు తన రూపాన్తరములైన పంచభూతములతో నేర్పడిన శరీరమును వర్మగాగల్గియుండెను. తన దేహముతో జీవుడు తన నుద్ధరించుకొనవలెనుగదా! కావున మహాదేవుడు వర్మినామకుడాయెనని తెలియుచున్నది.

విష్ణు:—

శరీరరథమును రక్షించునది విష్ణుశక్తి. అదియే జీవులకు వరూథము కవచము. "వృఞ్" ధాతువునకు ప్రార్థించుటయను నర్థముకలదు. కావున వర్మయనగా ప్రార్థనమనితెలియుచున్నది దైవనిమిత్తకృతప్రార్థనయే వర్మ. భగవంతుడు విష్ణువు జీవలను రక్షింపవారొనరించు ప్రార్థన మనెడి వర్మ కల్గియుండెను. కాన విష్ణువు వర్మినామకుడాయెనని తెలియుచున్నది.

***బీజాక్షరసంపుటి:-***

"వర్మి" అను నామమున "వ్+అ+ర్+మ్+ఇ+న్" అని అర క్షరములుకలవు. అవి షడృతువులను, షట్చక్రములను సూచించును. పైనామము నుపాసించువారు రేఫముచేఁదెలియు అగ్నియొక్క శక్తినార్జించు కొని సకల విధాగ్నికాంతులతో జలోదరాద్యఖిలరోగనిర్మూలకౌషధములను, యంత్రములను తయారుచేయగలరు జీవులకు సర్వజయప్రదులుకాగలరు. జలాగ్నిప్రేషకాయుధములను సృష్టించగలవారలగుదురని తెలియుచున్నది.

## *170 వ. నామము:- శివ:- "నమోవరూథినేచ"*

భ. భా. భా:— జీవులదేహములు వరూథములు. గృహములు. జీవులలో నున్నకారణమున, మహాదేవుడు సకల జీవులదేహములనెడి వరూథములను, గృహములను కల్గియుండెను. "బుద్ధింతుసారథింవిద్ధి, మనఃప్రగ్రహమేవచ" అను శ్రుతిలోఁజెప్పినట్లు బుద్ధియనెడిసారథియొక్క గుప్తిస్థానము, అనగా బద్మ కోశప్రతీకాశమైన హృదయముకల్గియుండెను. పైకారణములచే మహాశివుడు వరూధినామకుడాయెనని తెలియుచున్నది.

విష్ణు-

జీవుల శరీరరథమును రక్షించునది విష్ణుశక్తి. అదియే కవచము. అది కలవాడు కాన విష్ణువు వరూథినామకుడాయెను. అంతేకాదు. జీవుల శరీర రథమునందుండు జ్యోతిర్విష్ణుస్వరూపము. అదికలవాడు కాన విష్ణువు వరూధి నామకుడాయెను.

*బీజాక్షరసంపుటి:-*

"వరూథీ" అను నామమున "వ్+అ+ర్+ఊ+థ్+ఈ" అని ఆరక్షరములుకలవు. అవి షడింద్రియములను షడ్ఋతువులను సూచించును. పైనామము నుపాసించువారు ఊకార సూచితమగు భూమిస్థానమునను వకార సూచిత జలస్థానమునను, రేఫసూచితమగు అగ్నిస్థానమునను ధర్మస్వరూప మైనమాయాశక్తిని ధ్యానించి, సకల శక్తులను సముపార్జించుకొనఁగలరు. జలాగ్నిగ్రాహకయంత్రభూమిలోఁగల సకల వస్తువులను జలమందలి వస్తు సమూహమును గనుగొని జీవులనుద్ధరించి ధర్మప్రతిష్ఠ చేయగలరని తెలియుచున్నది.

## 14. వ. యజుస్సు

## "నమోబిల్మినేచకవచినేచ"

*అర్థము:-*

బిల్మినేచ = బిలము (రంధ్రము) ఉపమానముగాగలదియును, యుద్ధమున శిరోరక్షకమునగు కిరీటముకలవాడును, కవచినేచ = శరీరక్షకమైన కవచముకలవాడునగు శివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా: — జీవస్వరూపుడైనకారణమున శివుడు యోధరూపుడునైయుండెను. యోధుడైనపుడు యుద్ధమున శిరోరక్షకమగు కిరీటము అవసరము. అందుచే శివుడు బిలోపేతమైన కిరీటమును, శరీరక్షకమైన కవచమును కల్గియుండెను

### 171 వ. నామము:- శివ:- "నమోబిల్మినేచ"

భ. భా. భా:— యోధరూపముననున్నపుడు శివుడు బిలముగల శిరోరక్షకము (కిరీటము) కల్గియుండెను. అందుచే బిల్మినామకుడాయెను.

విష్ణు- "స్తుతిస్స్తోతారణప్రియః" అను విష్ణుసహస్రసూక్తిలో విష్ణువు రణప్రియుడుగాఁ బేర్కొనఁబడెను. రణప్రియునకు యుద్ధరంగమున శిరస్త్రాణము (కిరీటము) ఉండవలెనుగదా! అందుచే విష్ణువుకూడ బిలముగల శిరస్త్రాణము కల్గి బిల్మినామకుడాయెను.

*బీజాక్షరసంపుటి*—

"బిల్మిన్" అను నామమున "బ్ + ఇ + ల్ + మ్ + ఇ + న్" అని ఆరక్షరములు కలవు. అవి షడృతువులకును, షట్చక్రములకును జిహ్వములు. ఇందు త్రిమూర్తిబీజమైన బకారమును, పృథివీబీజమైన లకారమును, మదనబీజమైన మకారమును, సావిత్రీబీజమగు నకారమును, ఇకారద్వయముతోఁగూడి యున్నవి. పై నామమును పృధివీచక్రమున నుపాసించి, సావిత్రీదేవితోబాటు త్రిమూర్తులను ధ్యానించువారు శాక్తేయులు వారు తమతపశ్శక్తిచే భూమిలో గల వస్తుజాతమును గనుకొని, వానితో రక్షకయంత్రములను, సంహారకర యంత్రములను సృష్టించి, శత్రువులనుండి రక్షించి, జీవులకవసరమగు కాంక్షలను దీర్పగలవారలగుదురని తెలియుచున్నది. పృధివిపై సకల సస్యములను ఫలింపజేసి, ప్రజలను సకల కామపరిపూర్ణులను గావింపఁగలరని తెలియు చున్నది.

## *172 నామము;- శివ:- "నమఃకవచినేచ"*

భ. భా. బా:— యోధరూపుడగు శివుడు పాంచభౌతికమైన అంగరక్షకల్గి తన శరీరమును బోలె సకల జీవులను రక్షించువాడు. కాన శివుడు "కవచి" నామకుడాయెను. ఆతడు వాయుసూర్యస్వరూపుడు. క = వాయుసూర్యులకు జెందిన, వచస్సులు = శక్తిసూచక వచనములు స్తోత్రవచనములును గల్గి యుండెను. కాన శివుడు "కవచి" నామకుడాయెనని తెలియుచున్నది.

*విష్ణు:*—

"వంచు = విప్రలంభే" అను ధాతువునుండి వచః పదమేర్పడెను. "కాన్ = బాణాన్‌వంచయతీతి కవచిః" అను వ్యుత్పత్తిచే విష్ణువు నారాయణాస్త్ర స్వరూపుడును, సుదర్శనచక్రస్వరూపుడునై శత్రు ప్రయుక్తబాణములనెల్ల వంచించి, భక్తకోటిని, లోకములను రక్షించుచుండెను. అందుచే విష్ణువు "కవచి" నామకుడాయెనని చెప్పవచ్చును.

**బీజాక్షరసంపుటి:-**

"కవచిన్" అను నామమున "క్+అ+వ్+అ+చ్+ఇ+న్" అని యేడక్షరములుకలవు అవి సప్తవాయుమండలములను, మనోబుద్ధులతోడి పంచేంద్రియములను సూచించును. పైనామము నుపాసించువాడు ప్రజాపతి వలె వృష్టికరుడును, వరుణపురుషుడువలె రోగనాశకుడును, రుద్రరూపుడై శత్రుసంహారకుడును అగునని తెలియుచున్నది. వర్షముకురిపించుయంత్రములను, జలయంత్రములను, మారణాయుధములను సృష్టించఁగలవాడునగునని తెలియుచున్నది

## -: 15. వ. యజుస్సు :-

"నమశ్శ్రుతాయచశ్రుతసేనాయచ"

**అర్థము:-**

శ్రుతాయ = వేదప్రసిద్ధుడైనట్టియును, శ్రుతసేనాయచ = నిగ్రహము లందు (శత్రువులనెదిరించుటయందు) ప్రసిద్ధమైన సేనకలవాడునగు శివునకు నమః = నమస్కారము

**తాత్పర్యము:-**

సా. భా:— శివకేశవులు అభిన్నులు. వారిరువురిమహిమయువేదములందు ప్రసిద్ధమైయున్నవి. శివుని సైన్యము, సేనానాయకుడైన నందికేశ్వరుని అధ్వర్యమునగల ప్రమథగణము అది శత్రువులనెదిరించుటలో సుప్రసిద్ధమైయున్నది. అందుచే మహాదేవుడు శ్రుతసేనుడాయెను. ఆతనికి నమస్కారము.

**173 వ. నామము- శివ:- "నమఃశ్రుతాయచ"**

భ భా. భా:— "ఓంనమస్సోమాయచ," ఈశ్వరస్సర్వవిద్యానామ్ మున్నగు శ్రుతులందు మహాదేవుడు వర్ణితుడై ప్రసిద్ధుడైయున్నాడు.

"విశ్వస్యాధిపతిః, విశ్వస్యాధిష్ఠాతా, విశ్వాకారస్త్వమ్" మున్నగువేదమంత్రములు, మహాదేవుని, విశ్వాధిపతియనియును, విశ్వాధిష్ఠాతయనియును, విశ్వాకారుడనియునుగొనియాడుచున్నవి. కావున శివుడు శ్రుతనామధేయుడాయెను.

**విష్ణు:-**

"సర్వేవేదాయత్పదమామనన్తి, వేదాహమేతంపురుషంమహాన్తమ్" సకలవేదములును మహావిష్ణువునే రక్షణస్థానముగా వివరించుచున్నవి. అతడే మహాత్ముడైన పురుషుడనిపేర్కొనినవి. పైశ్రుతులలో మహావిష్ణువే ప్రసిద్ధుడుగాఁ బేర్కొనఁబడినాడు. "వివిక్తశ్శ్రుతిసాగరః" అను విష్ణుసహస్రసూక్తిచే శ్రుతులనెడి నదులన్నియును విష్ణువునందేకలవనిచెప్పబడెను. "వేదోవేదవిదవ్యంగః" అనుసూక్తి విష్ణువునేవేదముగా వేదవేత్తగాజెప్పెను. పరికింపగా సహస్రసూక్తిలోని వేదపదమును, ఇందలి శ్రుతపదమును సమానార్థకములే కావున విష్ణువు శ్రుతుడను నామధేయముకలవాడాయెను.

***బీజాక్షరసంపుటి-***

శ్రుతపదమునందు "శ్ + ర్ + ఉ + త్ + అ" అని ఐదక్షరములు కలవు. అవి పంచభూతములను బంచప్రాణవాయువులను సూచించును. ఉకారముచేఁ దెలియువాయువు, రేఫముచే దెలియుఅగ్నియును, శవర్ణముచే దెలియు మహాలక్ష్మియొక్క ఆదిశక్తియొక్కరూపములే. ఆమెయొక్కవికారమే తకారముచే దెలియువాస్తువిషయిక బ్రహ్మాండమనితెలియుచున్నది. పైనామమును పాసించువారు ఆదిశక్తిప్రసాదముచే వాయ్వగ్నిభేదములను వాయ్వగ్నుల నుత్పాదించుయంత్రములను నిర్మింపగలవారై సకలరోగసంహారకులుకాగలరని తెలియుచున్నది.

## 174 నామము- శివ:— "నమశ్శ్రుతసేనాయచ"

భ. భా. భా:— సకలలోకసేనలందును దేవసేనగొప్పది. దానికి నాయకుడు మహాశివునికుమారుడగు కుమారస్వామియే కావున శివసేన శ్రుతము = సుప్రసిద్ధము మహాదేవుడు త్రిపురాసురుని, ఇంద్రరూపుడై వృత్రాసురుని, కుమారస్వరూపుడైతారకాసురుని సంహరించుటచే అతనిసేన శ్రుతమై యున్నది. సకల సంహారకమలైన ఆయుధములును, వానినుపయోగించు సేనయు , శివుని రూపములైన పంచభూతములచే వినిర్మితములే. కాన శివుడు శ్రుతసేననామకుడాయెను.

విష్ణు:—

భేదనార్థకమైన శృధాతువునుండియు, గమనార్థకమైన శ్రుధాతువు నుండియును శ్రుతపదమేర్పడెను. ఇనునితో = సూర్యునితోగూడినది, సేనయగును. విష్ణుసహస్రమందలి సూర్యపదము విష్ణునామముకాన, అగ్నిగోళమైన ఇనునితో = సూర్యునితో, విష్ణువుతోగూడినది సేనయగును. అది సర్వవ్యాపకమై దుష్టశక్తులనెల్లఛేదించినది. విష్ణుసేన హిరణ్యకశిపుని, రావణాది రాక్షసులను సంహరించి, బ్రహ్మాండమునుగాపాడెను. కావున విష్ణువు శ్రుతసేననామకుడాయెను.

***బీజాక్షరసంపుటి:-***

శ్రుతసేననామమున "శ్+ర్+ఉ+త్+అ+స్+ఏ+న్+అ" అని తొమ్మిదియక్షరములుకలవు. అవి నవబ్రహ్మలకును, నవద్వారములకును చిహ్నములు. "శ్రు" అనుదానిలో లక్ష్మీనారాయణబీజములును, "సే" అను దానిలో శక్తిశివులబీజములునుగలవు. కావున ఇది శివకేశవాభేదవాదులకు అత్యంతోపాస్యమైననామము. పైనామము నుపాసించువారు బాహ్యాభ్యంతరశత్రువినాశకులును, జలాగ్న్యుత్పాదకయంత్రనిర్మాతలును, జలోదరాగ్నిప్రకోపాదిరోగపరిహారకులునుగాగలరని తెలియుచున్నది.

భ. భా. భా:— పైరెండు అనువాకములమంత్రములను ద్విరాత్రదీక్ష వహించి, జపించవలెను. చరుభోజియై నిరంతరము జపించవలెను. పదు నొకండుదినములు పునశ్చరణచేసినచో గృతకృత్యుడగును. ఈరెండు అను వాకములమంత్రములు పఠించుచు ఒకనెల దినములు ప్రతినమస్కారమునను శ్వేతపద్మములను లింగోపరిభాగమున పదునొకండుసార్లు పూజించవలెను. అట్లుచేసినచో రాజ్యశ్రీ వృద్ధిపొందును. దేవుడైన దక్షిణామూర్తి సన్నిధాన మున పదునొకండుగురు బ్రాహ్మణులకు భోజనముపెట్టవలెను. రాజుగారి జన్మదినమున రాజాగ్నియందో, మథింపబడిన అగ్నియందో ఇరువదియొక్క వేయిరావిసమిధలను నేతితో వడిపి హోమముచేయవలెను. పదునొకండువేలు దూర్వాలను సమర్పించవలెను. అట్లుచేసినచో రాజుగారియొక్క విజయా యుర్దాయములు వృద్ధియగును. విజయముకొఱకు ఈరెండు అనువాకములను ప్రతిమాసమునను లక్షసార్లు జపించవలెను. రాజులకు సంగ్రామము సమీ పించునపుడు పైమంత్రములను వేయిసార్లు జపించినచో రాజుల ఆయుధము లెల్లను దేజోవంతములగును. తద్ద్వారా విజయముచేకూరును ప్రతినమస్కార మందును లక్షజిల్లెడు సమిధలను ఆదిత్యునుద్దేశించి, హోమముచేసినచో ఎచటనున్నశత్రుసేనలు అచ్చటనే స్తంభించిపోవును. ఇదియే శత్రుసేనా స్తంభనవిద్య. రాజునకు సేనకును అవసరమగు సకలభోజ్యవస్తుజాతమును ఈమంత్రములతో అభిమంత్రించినచో అవి అన్నియును అమృతములగును. శత్రుదేశనష్టకరములగు వనుఁన్నింటిని వరాహాది మాంసహోమజపాదులచే ఆనాడు ఆచరించెడివారు

పైరెండు అనువాకమంత్రములతో జపహోమాదులనాచరించు విప్రు లకు రాజులు సువర్ణరజతగోభూమివస్త్రాదులను దక్షిణలుగానొసంగవలెను. వంధ్యలకు (గొడ్డువారికి) కారణాంతరములచే బుత్రులులేనివారికిని బుత్రసంతా నముకల్గుటకు గొన్నినియమములుకలవు. అవేవన? అత్తిచెట్టు సమిధలను పెరుగులో తేనెలో నేతిలోఁదడిపి పైనామముల నుచ్చరించుచు ఇరువదియొక్క

వేలుహోమముచేయవలెను. జలపూర్ణముగను, క్రొత్తబట్టలతో, తంతువులతో జుట్టబడిన కలశలతో నీళ్లుతెచ్చి, అభిషేకముచేయవలెను. ఎనిమిదివేల జప మొనరించి, ఈమంత్రములతో మహాదేవునికి అభిషేకముచేయవలెను. ఎని మిదివేలసార్లు ప్రదక్షిణముచేయవలెను. ఈమంత్రములతో పిష్టపిండమును అభిమంత్రించి, భుజింపజేయవలెను. నదీప్రవాహముననిల్చి వదునొంకదు సార్లు చొప్పున జపించుచు శమీపత్రములతో సహాజపించిలెక్కించవలెను. పైప్రయోగములచే బరిశుద్ధులైనవారికి, రుద్రసమానుడైన పుత్రుడు జన్మించును ముప్పదియెనిమిదివత్సరములు ప్రాయముగల వనితకును, నలుబదియెనిమిది వత్సరములు ప్రాయముగల పురుషునకును, పైనచెప్పబడిన విధుల నొనరించినచో బుత్రుడుకల్గును. వంశోద్ధారకుడుగా జన్మించిన ఆబాలుని హస్తమున శివభక్తిసూచకశూలముద్రలు, రేఖలునుండును.

ఈమంత్రములతో ఘృతపాయసమును ఎనిమిదివేలు హోమము చేయ వలెను. అవ్విధమునజేసినవాడు అన్యజన్మలో విప్రుడై జన్మించును. ఈమంత్రములతో ఒకసూత్రమును అభిమంత్రించి గర్భిణీస్త్రీహస్తమునకు గట్టినచో గర్భస్రావముకాని గర్భనాశముకానిసంభవింపవు. కుమారగ్రహాది బాధలున్నవారికి ఈమంత్రములతో భస్మధూపరక్షగావించి, రాత్రిశిఖను బంధించినచో కుమారగ్రహభయము సంభవింపదు.

ధ్యానము:

*శ్లో॥ గౌరీకరాంబుజన్యస్తస్వర్ణశైలశరాసనం।*
*ఇషుహస్తం రథారూఢం నరనారీతనుంస్మరేత్॥*

తాత్పర్యము:-

నరనారీతనుడనగా స్త్రీపురుషాత్మకశరీరుడు. అర్ధనారీశ్వరుడన్నమాట అయ్యవతారమున పార్వతీదేవికరకమలములందు కనకశైలధనువును, నారా యణశరంబునుగలవు ఆతడు భూరథము నధిష్ఠించియుండెను. అట్టి మహా దేవుని స్మరింపవలెను.

—: షష్ఠానువాకము సమాప్తము :—

## -: సప్తమానువాకము :-

ఇందు అన్యతర నమస్కారములుగలయజుస్సులుండును. మహాదేవునకు విశ్వాధిపత్యమును ప్రతిపాదించి, మహాదేవ! శంభో! అని ఉద్ఘోషించవలెను.

### -: ప్రథమయజుస్సు :-

"నమోదుంధుభ్యాయచాహనన్యాయచ"

**అర్థము:-**

దుందుభ్యాయచ = భేరీనుండి బయల్వెడలిన శబ్దము స్వరూపముగాగలవాడును, ఆహనన్యాయచ = దుందుభిని ప్రయోగించుదండముతో మొత్తుటచే వెడలిననాదము రూపముగాగలవాడును, వంశదండోద్భవుడునగు శివునకు నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— ఓంకారము త్రిమూర్తిస్వరూపము దానినాదముకూడ త్రిమూర్తిస్వరూపమే. అందుదుందుభినాదము శివస్వరూపము. దుందుభిని ప్రయోగించుటకుపయోగించుదండమునుండి తాడనరూపమున ఉత్పన్నమైనవాడును మహాదేవుడే అందుచేతనే శివునకుదుందు భ్యాహనన్యనామములు ఏర్పడినవి. కాన ఆ నామములతో శివుడు నమస్కరింపబడుచున్నాడు.

*175* నామము- శివ:- "నమోదుందుభ్యాయ"

భ. భా. భా:— అనెడి అను వాకమునకు హేమకోశనామకుడు ఋషి. శ్రీరుద్రుడుదేవత. మహాపంక్తినామము దీనికి ఛందస్సు. మహాదేవుని

హుంకారనాదముఫంటిదే ఈ "దుందుం" నాదముకూడ. హుంకారనాదము నుండివలె ఈ "దుందుం" నాదమునుండియు శివశక్తియే బయల్వెడలి బ్రహ్మాండమునునింపినది. అందుచే మహాదేవుడు దుందుభ్యనామకుడాయెను. "ఉభి = పూరణే" అను ధాతువునుండి ఉభిపదముఏర్పడెను. దుందుధ్వనితో బ్రహ్మాండమును, ఉభి = పూరించువాడు, అనాదమునుండి ఉద్భవించిన వాడునుగావున శివుడు దుందుభ్యుడాయెను. "సైషావాగ్వనవ్పతిషువదతి, యాదుందుభౌ, యాతూణవే, యావీణాయామ్" అను శ్రుతిచేవాక్కులరూప మగునాదమును ఉద్భవింపజేయు దుందుభి మున్నగు వాదిత్రములరూపమున శివుడువెలసినట్లు తెలియుచున్నది. పైకారణముచేశివుడు దుందుభ్యనామకు డాయెనని తెలియుచున్నది.

విష్ణుః-

ఆనందదాయకమైన దుందుంశబ్దముతో భాతి = ప్రకాశించువాడైఅందు భయం కర రూపముననుండుటచే విష్ణువు దుందుభ్యుడాయెను. ఇందుచేతనే "భయకృత్ భయనాశనః" అని విష్ణువును బేర్కొనుచున్నారు. మేఘగంభీరమైన వేదరూప ఘోషకలవాడు కావున విష్ణువు "సుఘోషః" అని సహస్రనామములో బేర్కొనబడెను. "దుందుభి" యనునామము విష్ణునామముగా నిఘంటువు నందుగలదు. శ్రీరామావతారమున దుందుభిరాక్షసునిమొండెమును దన కాలితో మీటి దానినుండి వెడలిన ధ్వనితో బ్రపంచమునునింపెను. అందు నాదరూపముననుండెను. "శబ్దఃఖేపౌరుషంనృషు" అను గీతాసూక్తిలో భగ వానుడు తాను శబ్దస్వరూపుడనని చెప్పినాడు. కావున విష్ణువు, దుందుభ్య నామకుడాయెనని చెప్పవచ్చును.

*బీజాక్షరసంపుటి:-*

"దుందుభ్య" అను నామమున "ద్+ఉ+మ్+ద్+ఉ+భ్+య్+అ" అని ఎనిమిదక్షరములుకలవు. ఇవి అష్టప్రకృతులకును, శరీరమందలి అష్టచక్రములకును జిహ్వాములు. ఇందు, దుర్గాబీజములైన దకారములు రెండును, వాయుబీజములైన ఉకారయకారములును, మదనబీజమైన మకారముతోడను సర్వదేవబీజమగు అకారముతోడనుగూడియున్నవి. పైనామమును యోగులు ప్రాణాయామక్రియలో దుర్గాదేవిని ధ్యానించి, నవదుర్గారాధకులై భూతప్రేతాద్యుచ్చాటనముద్వారా శత్రునాశకులై రాజవశీకరులై సర్వకామములను, సర్వత్ర విజయమును బొందగలరని తెలియుచున్నది. శ్యామలము మున్నగుచర్మ రోగములను సైతము పరిహరించగలరని తెలియుచున్నది.

*176 నామము:- శివ:- "నమఆహనన్యాయచ"*

భ భా. భా:— హంసోపనిషత్తులో జెప్పినట్లు దుందుభిధ్వానము శివుని హుంకారము. దుందుభిని మ్రోగించి, ధ్వనినుత్పాదించు వంశదండము, శరీరమందలి సుషుమ్నానాడి. అది శివస్వరూపము అందు శివుడు పరమాత్మస్వరూపముననుండి నమస్కరింపబడుచున్నాడు ఆహననమనగావంశదండము సుషుమ్నానాడి. అందుండుకారణమున పరమశివుడు ఆహనన్యుడాయెను.

*విష్ణు:—*

ఆహననమనగా వంశదండమువలెనుండి ధ్వనినుత్పాదించు సుదర్శనచక్రము. దానియందు శక్తిరూపముననుండువాడు విష్ణువు. కాన విష్ణువు ఆహనన్యుడాయెను. అయ్యాహననమే శ్రీ కృష్ణుని చేతియందు వంశనాళము; పిల్లనగ్రోవి. దానిని విష్ణువు వృద్ధిచేయును. అందుచే విష్ణునామములలో "వంశవర్ధనః" అను పదముకలదు. ఆ వంశమే ఆహననము అందుండి వృద్ధిచేయువాడే ఆహనన్యుడు; వంశవర్ధనుడు. ఈరెండునామములును సమానభావసూచకములే కావున విష్ణువు ఆహనన్యనామకుడాయెనని తెలియుచున్నది.

బీజాక్షరసంపుటి—

అహనన్యనామమున "అ+హ్+అ+న్+అ+న్+య్+అ" అని ఎనిమిదక్షరములుకలవు. అవి శివుని ఇష్టమూర్తులను, మనోబుద్ధిచిత్తముల తోడి పంచేంద్రియములను సూచించును. ఇందు పరాశక్తిసావిత్రీబీజములు శివబీజమైన హకారముతోడను వాయుబీజమగు యకారముతోడను, సర్వదేవ బీజమగు అకారముతోడనుగూడియున్నవి. ఈనామము నుపాసించువారు ప్రాణధారణలో శక్తి సహిత శివుని ధ్యానించి, సకలపాపరోగనాశకులై, లోకక్షేమంకరులు కాఁగలరని తెలియుచున్నది.

-: రెండవయజుస్సు :-

"నమోధృష్ణవేచప్రమృశాయచ"

అర్థము:-

ధృష్ణవే = యుద్ధమునఁ బలాయనరహితుడును, ప్రమృశాయచ = పర సైన్యవృత్తాంతమును బరామర్శించువాడునగు శివునకు, నమః = నమస్కారము.

తాత్పర్యము:-

సా. భా:— త్రిమూర్తులలో సంహారకరుడు మహాదేవుడు కావున అతని కెప్పుడును అడ్డులేదు. నిర్భయుడు కాన యుద్ధమున శత్రువులను ఎదిరించి నిలుచునేకాని పలాయనముచిత్తగించడు. వాయ్వగ్నిరూపమున సర్వవ్యాపకుడు కాన బలరుసైన్యములకు జెందిన వృత్తాంతములను సాకల్యముగాఁ దెలిసికొన గలడు. కావున సర్వరక్షకుడగు అతనికి నమస్కారము.

## *177 వ. నామము:- శివ:- "నమోధృష్ణవేచ"*

భ.ఖా ఖా. :—

"ఞి ధృషా = ప్రాగల్భ్యే, జయే, నాశకే" అను నర్థములుగల ధృష ధాతువునుండి ధృష్ణు పదమేర్పడెను. శత్రువులనెదుర్కొనుటలో దిట్ట కావున శివుడు ధృష్ణుడాయెను. ధృష్ణుడనగా శక్తిమంతుడు. అందుచే మహాదేవుడు సకల జగద్రక్షణ కుశలుడగుచున్నాడు. తనరూపులైన ఆదిత్యాగ్నివాయువులచే మహాదేవుడు ప్రాణశక్తినొసగి సకల జగంబులను రక్షించుచున్నాడు. కావున శివుడు ధృష్ణు నామకుడై నమస్కరింపబడుచున్నాడు

విష్ణు:—

ధృష ధాతువునకు జయించుట అను నర్థము కలదు. కావున ధృష్ణువు = విజేతయని తెలియుచున్నది. "మహావిష్ణువు సకల భూతములనతిశయించి సకలమును జయించినవాడు" అను విషయము రామకృష్ణాద్యవతారగాధలచే దెలియుచున్నది. "అనఘోవిజయోజేతా" అను విష్ణు సహస్రమునగల "జేత" అను నామమును "ధృష్ణు" అను నామమును సమానార్థకములనియు, విష్ణువు ష్ణునామకుడనియును దెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

"ధృష్ణు" అను నామమున "ధ్+ఋ+ష్+ణ్+ఉ" అని యైదక్షరములుకలవు. అవి పంచభూతములను, అన్నమయాదిపంచకోశములను సూచించును ఇందు ధనదబీజము ధకారము బ్రహ్మబీజమైన ఋకారముతో గూడియుండుటచే ఈనామము నుపాసించువారు బాలగ్రహాదిబాధలను,కామెల మున్నగురోగములను నివారింపగలవారలగుదురని తెలియుచున్నది. నందిబీజమైన ణకారము, సూర్యబీజమైన షకారమును, వాయుబీజమైన ఉకారముతో గూడియుండుటచే, బైనామము నుపాసించువారు వాయుశక్తితో నందివలె యంత్రనాయకులై సూర్యమండలగాములు కాగలరనియును, వంద్రెండు

విధములైన సూర్యకిరణ శక్తులను గనుగొని సకలరోగనివారకులై సర్వార్థసిద్ధి నందగలరనియును దెలియుచున్నది.

## *178 నామము- శివ:- "నమః ప్రమృశాయచ"*

భ. భా. భా:— పరమేశ్వరుడు పండితుడు కావున సర్వులను బరామర్శించుటలో గుశలుడైయున్నాడు. ప్రకృష్టశీలుడగుటచే ఆతనిని అందఱును దమ తమకోరికలు తీర్చుకొనుటకును శ్రేయస్సును = ముక్తినిబొందుటకును భజించుచున్నారు. "ఆత్మవత్సర్వభూతానియఃపశ్యతిసపండితః" అను సూక్తిలోఁ జెప్పినట్లు ఆమహాశివుడు అందఱిని దననుగా భావించుకొని రక్షించుచున్నాడు. కావున ఆతనికి ప్రమృశనామమేర్పడెను.

*విష్ణు-*

ప్రపూర్వక మృశ్ ధాతువునుండి ప్రమృశపదమేర్పడెను. మృశ్ ధాతువునకు "మర్దించుట, స్పృశించుట, పరామర్శించుట" అను నర్థములుకలవు. మహావిష్ణువు తన భక్తులను కుచేలాదులను పరామర్శించి రక్షించినాడు. రావణాదిరాక్షసులను మర్దించినాడు. శిలారూపముతోనున్న అహల్యను స్పృశించి నిజరూపమొసంగిరక్షించినాడు అందుచే విష్ణువు ప్రమృశ నామకుడాయెను.

*బీజాక్షరసంపుటి-*

ప్రమృశ నామమున "ప్+ర్+అ+మ్+ఋ+శ్+అ" అని యేడక్షరములు కలవు. అవి సప్తమేఘమండలములను, శరీరమందలి సప్తధాతువులను సూచించును. ఇందు పర్జన్యబీజమైనపవర్ణము, అగ్నిబీజ సర్వదేవ బీజములతోడను, మకారము బ్రహ్మబీజముతోడను, లక్ష్మీబీజమైన శవర్ణము అకారముతోడనుగూడియున్నకారణమున నీనామము నుపాసించువాడు అగ్న్యారాధానమున వర్షము కురిపించి, వంటలుపండించి, జీవులను లక్ష్మీసంపన్నులగావించి, లోకులకోర్కెలను దీర్పగలవాడు కాగలడని తెలియుచున్నది.

## -: 3. వ. యజుస్సు :-

### "నమోదూతాయచ ప్రహితాయచ"

**అర్థము:-**

దూతాయచ = స్వామివృత్తాంతములను స్వస్వామిజనులకుఁ దెలియ జేయుటలోఁ గుశలుడైనట్టియును, ప్రహితాయచ = స్వామిచేఁబంపబడిన పురుషుడైనట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము-**

సా. భా:— లోకస్వరూపుడైన మహాదేవుడు లోకవృత్తాంతమును దెలియ జేయుటకు అగ్నినిదూతగా నియోగించెను. మహాదేవుడే అయ్యగ్నియై దూత కృత్యమున గుశలుడైయుండెను. స్వామియైన హిరణ్యగర్భునిచే వాయురూపు డుగాఁ బంపబడెను. అట్టి పరమశివునకు నమస్కారము.

### 179 వ. నామము- శివ;- "నమోదూతాయచ"

భ. భా. భా:— మహాశివుడు స్వయముగా దౌత్యమువున్నగుకృత్యము లాచ రించి భక్తులను రక్షించినాడు. దూతయనగా సందేశహారుడు. పరమశివుడు భక్తవత్సలుడగుటచే అగ్నిరూపుడై యజ్ఞయాగాదికర్తలయాహ్వానమును దేవత లకు దెలియజేయుచు, వారొసంగుహోమద్రవ్యములను దేవతలకు జేర్చుచు దేవదూత అయెను.

"అగ్నిందూతంవృణీమహే హోతారం విశ్వవేదసమ్;"
"అగ్నిర్దేవానాందూతఆసీత్;"
"త్వందూతఃకవిరసిప్రచేతాః;"

మున్నగుశ్రుతులచే మహాదేవుడు అగ్నిరూపమున దేవదూతయైనట్లు తెలియు చున్నది. పార్వతీపరిణయానంతరమున, దన సంసారకృత్య విషయమును

హంసరూపుడైన అగ్నివలననే దేవతలకు దెలియజేసెను. ఆ సమయమున పార్వతి ఆగ్రహించి, తన సంసారకృత్యమెఱిగిన దేవతలకు తర్వాత సంతతి కలుగనట్లు శపించి, శాశ్వత సంతాన నిరోధము నేర్పఱచెను. అందుచే, దేవతల సంఖ్య ముప్పదిమూడుకోట్లతోఁ బరిమితమాయెను. శ్రీరామావతారమున మహాశివుడు హనుమంతుడై సీతారాములవృత్తాంతమును, అన్యోన్యము తెలియఁజేసెను. శివావతారుడైన హనుమంతుడు ఆసందర్భమున దూత అయెనుగదా! కావున అతడు దూతనామకుడై నమస్కరింపఁబడుచున్నాడు.

విష్ణువు:—

"దూఞ్" ధాతువునుండి దూతపదమేర్పడెను. "దూఞ్" ధాతువునకు, పీడించు, బాధించు, ఇచ్చు, మున్నగునర్థములుకలవు. "బలంబలవతాంచాహమ్" అను గీతాసూక్తిచే మహావిష్ణువు బలరూపుడైనట్లు తెలియుచున్నది. సీతాదేవికి శ్రీరామసందేశమును ఎఱుగజేయుటకు దూతగా నేగినహనుమంతునిలో విష్ణువు బలరూపుడైయుండి, రాక్షసులనుబాధించి, లంకాదహన రూపమున వారినిబీడించెను పరులను = శత్రువులను బరితపింవజేయుటయు దూతకృత్యమేకదా! విష్ణువు మత్స్యాద్యవతారములనుదాల్చి దూతయై పరులైన రాక్షసులను పరితపింపజేసెను. "పవనఃపవతామస్మి" అను సూక్తిచే విష్ణువు పవనరూపుడైనట్లు తెలియుచున్నది. పవనుడనగావాయువు. అతని పుత్రుడు పావని. అతడే హనుమంతుడు ఆత్మావైపుత్రనామాసి" అను శ్రుతిలోఁ జెప్పినట్లు పవనుడేపావనియైన హనుమంతుడు పితాపుత్రులకు భేదములేదు. కావున దూతకృత్యము నెఱపిన హనుమంతునిలో విష్ణువు పవన రూపమునసుండి దేవకార్యము నెఱవేర్చెను. అందుచే విష్ణువు దూతనామకుడేయని చెప్పవచ్చును.

*బీజాక్షరసంపుటి:—*

దూతనామమున "ద్ + ఊ + త్ + అ" అని నాల్గుఅక్షరములు కలవు అవి చతురగ్నులను, అంతఃకరణచతుష్టయమును సూచించును, పైనాపమున

దుర్గాబీజమగు దకారము, భూమి బీజమగు ఊకారముతోడను, వాస్తుసర్వ దేవబీజములగు తకారాకారములతోడనుగూడియుండుటచే బైనామము నుపాసించువాడు దుర్గారాధకుడై భూమిలోని వస్తువులను వెలిబుచ్చుయంత్రములను నిర్మింపగలవాడును, తెలుపునలువునచ్చలు ఏర్పడుటయను చర్మరోగములను నివారింపఁ గలవాడునగుననియును తెలియుచున్నది.

## 180 నామము- శివ:— "నమః ప్రహితాయచ"

భ. భా. భా:— పరమశివుడు భక్తవత్సలుడగుటచే దాసునివలె ప్రహితుడై పంపబడినవాడై భక్తులకార్యములను నెఱవేర్చినట్లు శైవకథలవలన దెలియుచున్నది. ప్రకృష్టమైనహితుడు ప్రహితుడు. అనగా జలాగ్నివాయురూపముల నుండి శివుడు జీవులకు గొప్పహితకారియగుచున్నాడు; అని "ప్రైషకృత్ ప్రథమస్సృతః" అను శ్రుతిచేఁదెలియుచున్నది. కావున మహాదేవుడు ప్రహిత నామకుడాయెనని తెలియుచున్నది.

### విష్ణు:—

"ప్రహితుడు" అనుపదమునకు (1)ముందునకు బెట్టినవాడు.(2)పంప బడినవాడు అని యర్థములుకలవు. విష్ణువు వామనావతారుడై బలిచక్రవర్తి నడంపవచ్చి, అతడొసంగుమూడడుగుల నేలకొలుచునపుడు బ్రహ్మాండమంతటికను బెట్టెను. ఈ విషయమునే పోతనామాత్యుడు "ఇంతింతైవటుడింతయై" అను పద్యమున చక్కగానిరూపించెను. రాక్షససంహారమునకై విశ్వామిత్రుని వెంటపంపబడిన శ్రీరామచంద్రుడెంతటి ఘనకార్యములనుజేసెను? గొప్ప హితమొనరించిన శ్రీరాముడు విష్ణువేకదా! కావున విష్ణువు ప్రహితనామకుడాయెను; అని తెలియుచున్నది.

### బీజాక్షరసంపుటి:-

ప్రహితనామమున "ప్+ర్+అ+హ్+ఇ+త్+అ" అవి ఏడ

క్షరములుకలవు. ఇవి సప్తార్చులకును, సప్తధాతువులకును జిహ్వాములు. ఇందు రేఫహకారములు అగ్నిశివబీజములు ప్రధానములు. ఈనామము నుపాసించువారు అష్టసిద్ధులను భుక్తిముక్తులను బొందుటయేకాక అగ్నిశక్తులతో యంత్రసహోముతో బర్జన్యమును = మేఘమును సృష్టించి, సకాలవర్షదాయకుడై లోకక్షేమంకరుడు కాగలడని తెలియుచున్నది.

-: 4. యజుస్సు :-

"నమోనిషంగిణేచేషుధిమతేచ"

**అర్థము;-**

నిషంగిణే = ఖడ్గముకలవాడును, ఇషుధిమతేచ = బాణాధారమైన అమ్ములపొదికలవాడునగు శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము-**

సా. భా:— శివుడు లోకస్వరూపుడు కావున లోకనాకశత్రువులను సంహరించుటకు, చేతనిషంగమును (ఖడ్గమును) బాణములకాధారమైన అంవపొందిని భుజమునను గల్గియుండెను.

**181, 182. నామములు- "నమోనిషంగిణే, ఇషుధిమతేచ"**

**శివ:—**

భ భా. భా:— ఇంతకుమున్ను ఈ రెండునామములును స్తేయపరముగా వివరింపబడినవి. భూతరక్షణముకొఱకు మహాదేవుడు, ఆయుధములను గ్రహించునని సూచించుటకు మఱలవానిని బేర్కొని చెప్పెను. ఈ రెండు నామముల యర్థము ఇంతకుమున్నే శివాద్యర్థపరముగా వివరింపబడెను.

-: 5. వ. యజుస్సు :-

"నమస్తీక్ష్ణేషవేచాయుధినేచ"

**అర్థము;-**

తీక్ష్ణేషవే = వాడిబాణములుకలవాడును, ఆయుధినేచ = బహ్వాయుధములుకలవాడునగు శివునగు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:— త్రిపురాసురుడు మున్నగు రక్కసులను సంహరించుటకు విష్ణువు మున్నగువారిశక్తులతోఎన్నియో వాడిబాణములు మహాదేవునకు జేకూరినవి. త్రిశూలము మున్నగు శ్రేష్ఠమైన ఆయుధములెన్నియో శివునకుగలవు. అందుచే ఆతనికి నమస్కారము.

*183 వ. నామము- శివ:- "నమఃతీక్ష్ణేషవే"*

భ. భా. భా:— మహాదేవుడు తీక్ష్ణము అనగా విషమువలె భయంకరమును వాడియును, నారాయణరూపమునగు ఇషువు = బాణము కల్గియుండెను. అగ్ని వాయువు మున్నగునవన్నియును ఆతనికి తీక్ష్ణమైన ఇషువులే. వానితో ఎందఱినో రాక్షసులను శివుడు సంహరించెను. కావున ఆతనికి తీక్ష్ణేషు నామము సార్ధకమాయెను.

విష్ణువు:—

"తిజ = నిశాతనే" అను ధాతువునుండియేర్పడిన తీక్ష్ణపదమునకు హింసించునదనియర్ధము. 'ఇష = గతౌ' అనుధాతువు నుండియేర్పడిన ఇషు పదమునకుబోవునదియని యర్ధము. మహావిష్ణువునకు యుద్ధమునవడిగాబోయి హింసించునాయుధముకలదు. అది సుదర్శన చక్రరూపము, బ్రహ్మాస్త్ర రూపము, నారాయణాస్త్రరూపమునైయున్నది. వానితో విష్ణువుకృత్తి, హిరణ్యాక్షుడు, రావణుడు మున్నగు దుష్టులనెందఱినో సంహరించి లోకములను గాపాడెను. అందుచే విష్ణువునకును తీక్ష్ణేషునామము సార్ధకమేఅగును.

తీక్ష్ణేషు నామమున "త్ + ఈ + క్ + ష్ + ణ్ + ఏ + ష్ + ఉ" అని యెనిమిదక్షరములుకలవు అవి అష్టప్రకృతులకును మనోబుద్ధులతోడి షట్చక్రములను సూచించును. ఇందు ఈకారమొక్కటియే మాయాశక్తిబీజము.

మిగిలిన యక్షరములు వాస్తుమదన సూర్యనంది వీరభద్రవిష్ణుబీజములే. కాన నైనామము నుపాసించువాడు శక్తిమహిమచే బుద్ధిబలమునంది ప్రాణులకోర్కెలను దీర్చువస్తువులను సూర్యమండలమేగుయంత్రములను, శత్రుసంహారకములగు అణ్వస్త్రాదులను సృష్టించగలవాడునగునని తెలియుచున్నది.

## *184 నామము:- శివ:- "నమఆయుధినేచ"*

భ. భా. భా:— "సహస్రాణిసహస్రధాబాహూవోస్తవహేతయః" అను శ్రుతిచే మహాదేవుడు అనన్తకోటి జీవస్వరూపుడు కావున వేలకొలది బాహువులను వేలకొలది ఆయుధములను గల్గియుండెనని తెలియుచున్నది ఆవన్నియును ప్రశస్తములేకాన శివుడు ఆయుధినామకుడాయెను.

విష్ణు:—

(1) ప్రహరణము (2) హస్తముక్తము (3) యంత్రముక్తము అని ముఖ్యముగా ఆయుధములు ముప్విధములు. నందకమను ఖడ్గము విషువునకుగల ప్రహరణరూపాయుధము. సుదర్శనచక్రము విష్ణువుయొక్క హస్తముక్తమైన ఆయుధము. నారాయణాస్త్రము మున్నగునవి యంత్రముక్తాయుధములు. అవికలవాడుకావున విష్ణువు ఆయుధినామకుడాయెను.

*బీజాక్షరసంపుటి—*

"ఆయుధీ" అను నామమున "అ+య్+ఉ+ధ్+ఈ" అని ఆయిదు అక్షరములుకలవు. ఇవి పంచభూతములను పంచకోశములను సూచించును. ఇందు పరాశక్తిమాయాశక్తిబీజములు చివరలందును వాయువిష్ణుధనదబీజములు మధ్యనుగలవు. కావున నైనామము నుపాసించువాడు శాక్తేయుడై వాయుశక్తినాధారముగాజేసికొని ప్రకృతిలోగల వివిధ ధనరాసులను బైటపెట్టగలవాడగును; అని తెలియుచున్నది.

## — 6. వ. యజుస్సు —

## "నమస్స్వాయుధాయచసుధన్వనేచ"

**అర్థము:-**

స్వాయుధాయచ = శోభనమైన త్రిశూలరూపమగు ఆయుధముకల వాడును, సుధన్వనేచ = శోభనమైన పినాకరూపమైన ధనుస్సుకలవాడునగు శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా.భా.:— మహాశివుని ఆయుధము త్రిశూలము. అది చాల శోభనమైనది. ఆతని ధనుస్సు పినాకము. అదియును శోభనమైనదే. అందుచే శివుడు నమస్కరింపబడుచున్నాడు.

**185 నామము- శివ:- "నమఃస్వాయుధాయచ"**

భ. భా. భా:— శివుని ఆయుధము త్రిశూలము అది సోభనమైనదేకాదు. అమోఘమైనదికూడ. దానియాకారముచూడ( జక్కగానుండెను. దానికిగల మూడుశూలములును సత్త్వరజస్తమోగుణములను మూడింటిని సూచించును. దానిని ధరింపశివుడొక్కడే అర్హుడు; అను విషయము "అరన్బిభర్షిసాయకాని ధన్వఇతిచ" అను శ్రుతిచే( దెలియుచున్నది. అందుచే శివుడు స్వాయుధ నామకుడాయెను.

విష్ణువు:—విష్ణువు ఆయుధము సుదర్శనచక్రము. అది సు = అనగా శోభనమైనది; అమోఘమైనదియును; శోభనాకారముకలదియును. దాని అంచులు అనంతమైన సూర్యకిరణములను సూచించును. అందుచే విష్ణువు స్వాయుధ నామకుడాయెను.

**బీజాక్షరసంపుటి:-**

స్వాయుధ నామమున "స్+వ్+ఆ+య్+ఉ+ధ్+అ" అని యేడక్షరములుకలవు. ఇవి సప్తవాయుమండలములను, సప్తధాతువులను సూచించును. ఇందు రెండు శక్తిబీజములు రెండువాయుబీజములుకలవు. అవి వరుణధనదబీజాకారములతోగూడియున్నవి కాన యీనామమునుపాసించువారు

సకలశక్తులను స్వాధీనముచేసికొని, వాతరోగములను జలరోగములను, భూతాదులను దొలగింపగలవారలును అగుదురు. అంతేకాదు. అనేక విధ వాయువుల సహాయమున, నీరమునదూరి, నీటిలోగల ధనరాసులను, వస్తువులను వెలిబుచ్చగలవారలగుదురని తెలియుచున్నది.

## *186 నామము:- శివ:- "నమస్సుధన్వనేచ"*

భ. భా. భా:— శివకోదండము పినాకము, సువర్ణమయము; మేరుస్వరూపము. అందుచే శోభనమైనది దానితో త్రిపురాసురాదిరాక్షసులను సంహరించెను. కావున శివుడు అతిశయప్రభావుడై సుధన్వానామకుడాయెను. అంతేకాదు. "ధన్వ = మరణే" అను ధాతువునుండి ధన్వపదమేర్పడెను. "సుధన్వతీతిసుధన్వా" అనగా మహాప్రళయమున సకలమునునశింపజేయువాడు;కావున సుధన్వనామము శివునకు సార్థకమాయెను.

విష్ణు:- శివుని పినాకమువలె విష్ణువు శార్ఙ్గముకూడ ప్రధానమైనదే దానితో విష్ణువు గ్రసనాదిరాక్షసులను సంహరించి లోకములనుగాపాడెను. "ధన్యతే = ప్రార్థ్యతే" అను ధాతువునుండియేర్పడిన ధనుఃపదమునకు ప్రార్థన అర్థము. శోభనమైన ప్రార్థనకలవాడు కావున సుధన్వఅయెను. అనగా గజేంద్రాదులచే బాగుగా ప్రార్థింపబడినవాడన్నమాట. శోభనధనుస్సుకలవాడు సుధన్వా అనునదియును"ఈశ్వరోవిక్రమీధన్వీ"అను విష్ణుసహస్రసూక్తిలోని ధన్వినామమునకు సమానార్థకమే. కావున "రామశ్శస్త్రభృతామహమ్" అను గీతాసూక్తిలో ధన్వులలో రాముడనునేను అని భగవంతుడు చెప్పుకొనుట సమంజసమే. పైకారణములచే సుధన్వనామము విష్ణువునకుఁ జెల్లునని తెలియుచున్నది.

బీజాక్షరసంపుటి:—

"సుధన్వా" అను నామమున "స్+ఉ+ధ్+అ+న్+వ్+ఆ" అని ఏడక్షరములు కలవు ఇవి సప్తమేఘ మండలములను, మనోబుద్ధులతో గూడిన జ్ఞానేంద్రియములను సూచించును. ఇందు సకారనకారాకారములు శక్తిబీజములు. అవి వాయు ధనద వారుణబీజములతోఁగూడియున్నవి. పైనామము నుపాసించువాడు త్రిశక్తుల వశమొనర్చుకొని వాత జల రోగనాశకుడైజీవులకు ధనములను జేకూర్చగలవాడు అగునని తెలియుచున్నది.

# 7. వ. యజుస్సు

## "నమస్స్రుత్యాయచపథ్యాయచ"

**అర్థము:-**

స్రుత్యాయచ = పాదసంచార యాత్రయోగ్యమైన క్షుద్రమార్గమునకు అర్హుడును, పథ్యాయచ = రథాశ్వాది సంచారయోగ్యమైన ప్రౌఢమార్గము కలవాడునగు శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— మహాశివుడు అదిభిక్షుకుడైకాలినడకతో క్షుద్రమార్గమున సంచరించినాడు. పాశుపతాస్త్రమునొసంగుసందర్భమున బోయవాడై క్షుద్రమార్గమున సంచరించెను. అందుచే స్రుత్యుడాయెను. స్రుతియనగామార్గము. రాక్షససంహారసందర్భమున మహావీరుడై రథాశ్వాదిసంచారయోగ్యమైన ప్రౌఢమార్గమున నుండి పథ్యుడాయెను. అందుచే నమస్కరింపబడుచుండెను.

187 నామము- శివ- "నమఃస్రుత్యాయచ"

భ. భా. భా:— మహాశివుడు భృత్యరక్షణకై సర్వత్రనియంతగానుండెను అందుచే స్రుతిలో క్షుద్రమార్గముననుండెను. సకలజీవ స్వరూపుడు కాన "మానావమానయోస్తుల్యః" అన్నట్లు అవమానకరమార్గమున సైతముండెను. అందుచే స్రుత్యనామకుడాయెను.

**విష్ణు-**

"స్రు = గతౌ" అను ధాతువునుండి స్రుతిపదమేర్పడెను. స్రుతిలోగలవాడు కాన స్రుత్యుడు. విష్ణువు సర్వాంతర్యామియగుటచే క్షుద్రవస్తువులలో నున్నవుడుస్రుత్యుడాయెను. వరాహాదిరూపములదాల్చి క్షుద్రమార్గమున నుండుటచే స్రుత్యనామకుడాయెను.

*బీజాక్షరసంపుటి:-*

సృత్యనామమున "స్ + ఋ + త్ + య్ + అ" అని అయిదక్షరములు కలవు. అవి పంచప్రాణములను, పంచేంద్రియములను సూచించును. ఇందు శక్తిబీజమైన సకారము బ్రహ్మబీజముతోడను, వాస్తుబీజముతకారము వాయు బీజదేవబీజములతోడనుగూడియున్నవి. అందుచే నీనామము నుపాసించు వారు శాక్తాద్వైతులై వాయువాహకయంత్రనిర్మాతలై గ్రహాంతరయాత్ర చేయగలరు. ప్రాణాయామక్రియలో శక్తిపురుషులనారాధించి, పీతగ్రహ వినాశకులుకాగలరని తెలియుచున్నది.

## *188 వ. నామము:- శివ:- "నమఃపథ్యాయచ"*

భ. భా. భా:— మహర్షులకు జ్ఞానబోధచేయుటకును, మహావీరులతో బోరాడుటకును మహోన్నతమార్గములందుండుటచే మహాశివునకు పథ్యుడను నామమేర్పడెను జీవులకు ఆరోగ్యముచేకూర్చుటకుపథి = నిరామయమార్గమున ఉండుటచే శివునకు పథ్యనామమేర్పడెను.

*విష్ణు:—*

సత్పథమున = సన్మార్గమున జరించువాడు కాన సత్పథాచారుడను నామమేర్పడినట్లు "ఊర్ధ్వగస్సత్పథాచారః" అను విష్ణుసహస్రసూక్తిచే దెలియు చున్నది. పరమే = ఉత్కృష్టమైన మహామార్గమున మార్గదర్శకుడై ఉండు వాడు కావున పరమేష్ఠినామకుడైనట్లు "పరమేష్ఠీ పరిగ్రహః" అను సహస్ర సూక్తిచే దెలియుచున్నది పథి = మహామార్గముననుండువాడు కావున పథ్యు డాయెను. పరికింపగా "సత్పథాచారుడు, పరమేష్ఠీ, పథ్యుడు అను నవిసమా నార్థకములని తెలియుచున్నది అందుచే పథ్యుడనునామము విష్ణువునకు జెల్లు నని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి-*

పథ్యనామమున 'ప్ + అ + థ్ + య్ + అ" అనిఐదు అక్షరములుకలవు

ఇవి శ్రుతిప్రసిద్ధపంచఋతువులను, పంచేంద్రియములను సూచించును ఇందు ధర్మబీజమైన ధకారము, పర్జన్యవాయుదేవబీజములతోఁ గూడియున్నది. పైనామము నుపాసించువాడు సకాలవర్షముకురిపించి వృద్ధిసిద్ధులను గల్గించు వాడును, ధర్మస్థాపనలో నియంతయై జయమొసంగువాడును, యోగియునై బాహ్యాభ్యంతరశత్రునివారకుడు కాఁగలడని తెలియుచున్నది.

## — 8. వ. యజుస్సు —

"నమఃకాట్యాయచనీప్యాయచ"

**అర్థము;-**

కాట్యాయచ = కుత్సితమైన జలము అనగా అల్పజలము, అటతి = ఎచట ప్రవహించునో ఆస్థలమును కటము అందురు. అందు జలరూపమున నున్న శివుడు కాట్యుడుఅగును ఆతనికి, నమః = నమస్కారము. నీప్యా యచ = అధోముఖముగాను అడ్డముగాను ప్రవహించుచోటను జలరూపమున నున్నట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము;-**

సా. భా:— పరమశివుని రూపములలో జలమొకటి. కొన్నిచోట్లజలము కుత్సితముగా (అల్పముగా ప్రవహించును. దానినే కుల్యాప్రదేశము అందురు అచట మహాదేవుడు జలరూపముననుండును: కావున కాట్యనామకుడై నమస్క రింపబడును. పర్వతాగ్రమునుండి జలము; నిమ్నగాభవమున అనగా అధో ముఖముగా పడుచుండును. (ని + అపము = నీపము) ఆప్రదేశమును నీప మందురు. ఆప్రదేశమునగూడ మహాశివుడు జలరూపముననే ఉండును. కావున నీప్యనామమున సైతము నమస్కరింపబడుచున్నాడు.

**189. నామము- శివ: "నమఃకాట్యాయచ''**

భ. భా. భా:— ఇంద్రఃకృత్వో వృత్రహణంశచీపతింకాటేనిబాహ్ల" అను సూక్తిచే కాటము అనగా కూపము అనితెలియుచున్నది. కాటమునందు జలరూపమున నుండువాడు కాన శివుడు కాట్యుడని తెలియుచున్నది.

"చతుష్టయ్య ఆపోగృహ్ణాతి, కూప్యాగృహ్ణాతి, ఏతావైతేజస్వినీరాపః" అనెడి అరుణశ్రుతిచే కూపమున శివతేజస్సుతోనిండిన జలములున్నట్లు తెలియుచున్నది. ఇంతేకాదు, కటియందుండు లింగము కాటము. అందునిత్యము సన్నిహితుడైయుండువాడు కావున మహాదేవుడు కాట్యనామకుడైనట్లు "నతాఅర్వారేణుకకాటోఅశ్నుతే" అను శ్రుతిచేదెలియుచున్నది కటము అనగా శ్మశానము అందుండువాడు కాన శివుడు కాట్యుడై నమస్కరింపఁబడుచున్నాడు.

**విష్ణుః-**

"కటతిమదంకటః" అనువ్యుత్పత్తిచే మదమును స్రవించు గజేంద్రుని చెక్కిలిలో దేజోరూపముననుండి భక్తుడైనకారణమున దానిని విష్ణువు మొసలి బారినుండి తప్పించిరక్షించెను, అందుచే విషువునకు కాట్యనామమువాటిల్లెను. అంతేకాదు, కటధాతువునకు గతి,ప్రకాశము అను నర్థములుకలవు. అంతటను సంచరించు విష్ణువు "ప్రభాస్మిశశిసూర్యయోః" అను గీతాసూక్తిలో జెప్పినట్లు సూర్య చంద్రులలో ప్రభగా ప్రకాశముగా నుండెడివాడని తెలియుచున్నది. కావునవిష్ణువుకూడ కాట్యనామకుడాయెనని చెప్పవచ్చును.

**బీజాక్షరసంపుటి:-**

కాట్యనామమున "క్+అ+ట్+య్+అ" అని ఐదక్షరములుకలవు ఇవి పంచాగ్నులను, పంచేంద్రియములను సూచించును. ఈనామమున ప్రజా

పతి ఛాను వాయుబీజములు అకారాకారములతో గూడియున్నవి. ఈ నామము నుపాసించువారు సూర్యకిరణాణువులను వాయ్వణువులను గ్రహించు యంత్రములనిర్మించి, వాని మూలమున వర్షముకురిపించగలరు. సకల జీవులకును సామాన్యపద్ధతులను, కృత్రిమపద్ధతులను, సంతానము 'గల్గించుమార్గములను వెలిబుచ్చగలరు. తన్మూలమున ప్రభవించురోగములను పుట్టువ్రణాదిబాధలను సూర్యకిరణశక్తిచే దొలగించువారలును, సుఖావహులునుగాఁ గలరని తెలియుచున్నది ప్రాణాయామపద్ధతిని సూర్యుని ఉపాసించువారై సకలలోకారోగ్యకరులు కాఁగలరని తెలియుచున్నది.

## *190 వ. నామము- శివ;- "నమోనీప్యాయచ"*

భ. ఛా. భా:— నీపపదమునకు నిర్గతజలముకలవి, చేర్చబడిన జలముకలవి అని రెండర్థములుకలవు. "ణీఞ్ = ప్రాపణే" అను ధాతువునుండిఏర్పడిన "నీ" అను పదమునకు "నీత" అను నర్థముకలదు. నిర్గతమైన జలముకల ప్రదేశములకు జలముచేర్చునది నీపము = మేఘము. అందు విద్యుద్రూపమున నుండువాడు పరమశివుడు. కాన ఆతనికి నీప్యనామము సంభవించినది. నిర్గతమైన జలముకలపర్వతాదులందు శిలావృక్షాదుల రూపముననను లోహాదిరూపమున నుండువాడు పరమశివుడు, కావున ఆతనికి నీప్యనామము ఏర్పడెను. అందుచే నీప్యనామకుడైన శివుని నమస్కరించుచున్నారు.

### *విష్ణు;-*

ణీఞ్ ధాతువునుండి ఏర్పడిన "నీ" అను పదమునకు "స్వీకరింపబడిన అను నర్థముకలదు. "నీ+అపః నీపః = అనుదానికి నేమియని జలము ఆవిరిరూపమున సూర్యునిచే స్వీకరింపబడును; కావున సూర్యుడు నీపనామకుడాయెను. "ప్రభాస్మిశశిసూర్యయోః" అను సూక్తిచే నీపునియందు = సూర్యునియందు ప్రభారూపముననుండుటచే విష్ణువునకు నీప్యనామముపాటిల్లెను. అంతేకాదు. "నయతిప్రాణినస్సుఖమ్" అను వ్యుత్పత్తిచే ప్రాణులకు సుఖమును

జేకూర్చు సూర్యాగ్నివాయుమేఘాదులకును నీపనామము వర్తించును. వాని యందుండు విష్ణువునకు నీప్యనామము వాటిల్లును విష్ణు సహస్ర మందలి "సుఖదః" అను నామమును నీప్యనామమును .సమానార్థకములే అని తెలియుచున్నది. అందుచే విష్ణువు నీప్యనామకుడై నమస్కరింపబడును.

**బీజాక్షరసంపుటి:-**

నీప్యనామమున "న్ + ఈ + ప్ + య్ + అ" అని ఐదక్షరములుకలవు అవి పంచప్రాణములను, జ్ఞానేంద్రియములను సూచించును. ఇందు సావిత్రీ దేవతోపాసనాపద్ధతికలదు. ఉపాసకులు ప్రాణాయామపరులై సావిత్రీసాక్షాత్కారమంది భూతప్రేతాదిభయమును, పాపములను దొలగించువారై వాయు శక్తితో కృత్రిమమేఘనిర్మాతలు కాఁగలరని తెలియుచున్నది.

**-: 9. వ. యజుస్సు :-**

**"నమస్సూద్యాయచ సరస్యాయచ"**

**అర్థము:-**

సూద్యాయచ = బురదనేలలో జలరూపమున నున్నట్టియును, సరస్యాయచ = సరస్సున జలరూపముననున్నట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— పరమశివుడు బ్రహ్మాండమంతటను పంచభూతాత్మకుడై యుండెను. అందుచే అతడు సూదమందును (బురదనేలలోను) సరస్సునందును జలరూపముననుండి, నమస్కరింపబడుచున్నాడు.

**191 వ. నామము:- శివః:- "నమస్సూద్యాయచ"**

భ. బా. భా:— మహాదేవుడు సూదమునందు (బురదలో) జలరూపుడై యుండెను. సూదము = సంహరించునది. త్రిశూలాదికము. అందు జల

రూపమునను, తేజోరూపమునను మహాదేవుడుండును. అందుచే అతనికి సూద్యనామమువాటిల్లెను.

విష్ణు-

సూదము = ఊఖ. యజ్ఞములందలి అగ్ని ఈ యుఖతో తయారుచేయబడును. దానినే ఊఖాగ్ని యందురు. సూదమునందు అగ్ని రూపమున మహావిష్ణువు ఉండును. సూదము అనగా ఆధారము. ఆధారమైన బ్రహ్మాండమున సూర్యచంద్రాగ్ని రూపములతోనుండుటచే విష్ణువు ఆధేయమాయెను. సకల చరాచరప్రపంచమునకును ఆధారమైన విష్ణువు ఆధేయముగా సైతము ఉండుటచే సూద్యనామకుడాయెను.

"అన్తర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థ్సితః"

అను శ్రుతి పైవిషయమునకుమూలము.

బీజాక్షరసంపుటి—

సూద్యనామమున "స్+ఊ+ద్+య్+అ" అని ఐదక్షరములు కలవు. అవి పంచభూతములను పంచకోశములను సూచించును. ఇవి పంచ భూతములను, పంచకోశములను సూచించును. ఇందు శక్తి దుర్గాబీజములైన సకారదకారములు భూమి వాయు సర్వదేవబీజములతో గూడియున్నవి. ఉపాసకుడు ప్రాణాయామమున భూచక్రమైన మూలాధారమునందు ఆదిశక్తిని ఆమెరూపాన్తరయైనదుర్గాదేవిని ధ్యానించి, సకలశక్తులనుస్వాధీన మొనర్చుకొనును రక్తవాయుప్రకోపములచే గల్గురోగములను తొలగించుచున్నూ, వాయుభేదములనుగనుగొని, సకల శక్తుల నుపయోగించి భూమిలోగల సకల ధనరాసులను వెలిబుచ్చగలవాడగునని తెలియుచున్నది.

## 192 వ. నామము:- శివ:- "నమస్సరస్యాయచ"

భ. భా. భా:— పరమశివుడు కృత్రిమజలాశయమైన సరస్సునందు జల రూపముననుండుటచే సరస్యనామకుడాయెను. "జలాయనమః, జలవికరణాయ నమః" అని శివుని బేర్కొందురు. మహాశివుడు భూజలాశయములందు, వడిగా బోవు సరరస్సులందు అనగా యంత్రములందు జలరూపమునను తేజో రూపముననుండుటచే సరస్యనామకుడాయెను.

విష్ణు:—

"సరతీతిసరః" అను వ్యుత్పత్తిచే అంతటను ప్రవహించుజలమునకు "సరః" అను నామముకలదు. సరస్సునందు విష్ణువు రసరూపముననుండు నని "రసోఽహమప్సుకౌంతేయ" అను గీతాసూక్తిచేఁ దెలియుచున్నది. కావున విష్ణువు సరస్యనామకుడాయెనని చెప్పవచ్చును.

బీజాక్షరసంపుటి:-

సరస్యనామమున "స్+అ+ర్+అ+స్+య్+అ" అని యేడ క్షరములుకలవు. అవి సప్తజ్వాలలను, సప్తధాతువులను సూచించును. ఇందు శక్తిబీజములైన సకారములు, అగ్నివాయుసకలదేవబీజములతోగూడియుండు టచే ఆమెను శక్త్యగ్నిస్వరూపిణిగా యోగమున సేవించవలెననియును దెలియు చున్నది. పైనామము నుపాసించువాడు శక్తిసహాయమున అగ్నివాయుభేదము లను, వానితోనడుచుయంత్రములను గ్రగనుగొనుననియును, వాయ్వగ్ని ప్రకోపముచేవాటిల్లురోగములను దొలగించి జీవులను రక్షించుననియును దెలియుచున్నది.

## — 10. వ. యజుస్సు —

### "నమోనాద్యాయచ వైశన్తాయచ"

**అర్థము:-**

నాద్యాయచ = నదీగతజలరూపుడైనట్టియును, వైశన్తాయచ = అల్ప సరస్సులందు జలరూపమున నున్నట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము-**

సా. భా:— పరమశివుడు చరాచరముల నన్నింటిని ఆవరించి పలువిధము లైన రూపములతోనున్నాడు. నదులందును అల్పసరస్సులైన వేశన్తములందును జలరూపముతోనుండి మహాదేవుడు నమస్కరింపఁబడుచున్నాడు.

### 193 నామము- శివ:- "నమోనాద్యాయచ"

భ. బా. బా:— పంచభూతములు శివస్వరూపములు. మహాదేవుడు నదులలో జలరూపముననుండుటచే నాద్యనామకుడాయెను. అంతేకాదు. వాయురూపు డగుటచే యోగనాదమునందుండి నాద్యనామధేయుడాయెను.

**విష్ణు-**

"ప్రణవస్సర్వవేదేషు" అను గీతాసూక్తిచే వేదములందలి ప్రణవము విష్ణుస్వరూపము. అది నాదస్వరూపము అందుండుటచే విష్ణువు నాద్యనామకు డాయెను. నాదమనగావాక్కు. అందుస్తోత్రరూపమున నుండుటచే అతడు నాద్యనామకుడాయెను స్తోత్రము విష్ణునామముగా "స్తవ్యస్స్తవప్రియస్స్తో త్రమ్" అను సూక్తిలోఁ జేర్కొనఁబడెను.

**బీజాక్షరసంపుటి—**

నాద్యనామమున "న్ + అ + ద్ + య్ + అ" అని ఐదక్షరములుకలవు అవి పంచభూతములను, పంచప్రాణములను సూచించును. ఇందు వరుసగా

సావిత్రీపరాశక్తిదుర్గాబీజములుకలవు. అవివాయుసర్వదేవబీజములతోఁగూడి యున్నవి. శాక్తేయులకిది ప్రధాననామము. ఈనామమును ప్రాణాయామ క్రియలో నుపాసించువారు వాయుభేదములను గుర్తించివాని సాయమున నూతన యంత్రములను నిర్మింపఁగలరు. దేవీసాక్షాత్కారముపొంది తాము తరించుటయేకాక ఉపాసకులు పాండువు, రక్తపుఁబోటు శ్యామల, తెల్లమచ్చలు, వాతరోగములు అను వ్యాధులను దొలగింపగలవారలును, బైవ్యాధులను నిర్మూలించు ఔషధములను తయారుచేయగలవారలును గాగలరని తెలియు చున్నది.

## *194 నామము;- శివ:- "నమో వైశంతాయచ"*

భ. భా. భా:— వేశన్తముఅనగా అల్పసరస్సు. అందుదేవతర్పణాదులకు వయోగించుజలరూపమున మహాదేవుడుకలడు. మహిషాది సకల జీవుల హృదయకోశమే అల్పసరస్సు. అందు ప్రాణరూపముననున్నవాడగుటచేమహా శివునకు వైశంతనామము వాటిల్లెను.

**విష్ణు:—**

"విశ = గమనే" అను ధాతువునుండి వేశన్తపదమేర్పడెను. మహా విష్ణువు వ్యాపనమునకు నిలయమైన బ్రహ్మాండము ఈవేశన్తపదముచే సూచింపబడెను. అందు సూర్యచంద్రాగ్నివాయ్వాదులరూపమున నుండుటచే విష్ణువునకు వైశంతనామమువాటిల్లెను.

వైశన్తపదమున "వ్+ఐ+శ్+అ+మ్+త్+అ" అని ఏడక్షరములుకలవు. అవి సప్తమండలములను, మనోబుద్ధులతోడిపంచేంద్రియములను సూచించును. ఇందు వరుణబీజమువాగ్బీజమైన ఐకారముతోగూడి

యున్నది. అందుచే ఈనామమును జలచక్రమున వాగ్దేవినిధ్యానించి జపించు వారికి సకలవిద్యలును ప్రాప్తించుటచే జ్ఞానసిద్ధినొందుదురు. మూకాదులకు మాటలు వచ్చునట్లును, జ్ఞాపశక్తినిజేకూర్చుటకు అనువగు నౌషధములను గావించుటకు సమర్థులునుకాగలరు. లక్ష్మీబీజమైన శకారము మదనవారుణాది బీజములతోగూడియుండుటచే జలచక్రమున లక్ష్మీనిధ్యానించి ఉపాసించువారు సకలకామములను, సకలసంపదలను బొందుటయేకాక, లోకులకును వానిని జేకూర్పఁగలవారలగుదురని తెలియుచున్నది.

## — 11. వ. యజుస్సు —

### "నమఃకూప్యాయచావట్యాయచ"

**అర్థము:-**

కూప్యాయచ = కూపములందు జలరూపముననున్నట్టియును, అవట్యాయచ = గర్తములందు జలరూపముననున్నట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— పరమశివుడు, నదులు సరస్సులును, లేక బావులు మాత్రమే కలతావులందుండు జీవుల నుద్ధరించుటకై వానిలో జలరూపముననుండెను. గర్తములందును జలరూపముననుండెను. అందుచే అతనిని నమస్కరించు చున్నారు.

**195 నామము- శివ- "నమఃకూప్యాయచ"**

భ. భా. భా:— కూప్యాగ్నష్టోతి, ఏతావైతేజస్వినీరాపః" అనెడి అరుణశ్రుతిచే గూపములందలి జలముతేజోవంతము అని తెలియుచున్నది. మహాశివుడు, తన తేజస్సైన అగ్నినికూపస్థ జలమందుఁ బ్రవేశపెట్టి అందుండుటచేఁ గూప్యనామ కుడై నమస్కరింపఁబడుచున్నాడు.

విష్ణు:- కూపమనగా రంధ్రము. అదియే జీవుల శిరంబులందుండు బ్రహ్మ రంధ్రము. అందుఁగల సహస్రారమున మహావిష్ణువు శక్తిసహితుడై తేజో రూపమునగలడు. అందుచేతనే శిరస్సు పూజార్హమైన స్థలము. అందున్న కారణ మున విష్ణువు కూప్యనామకుడై నమస్కరింపబడుచున్నాడు.

*బీజాక్షరసంపుటి —*

కూప్యనామమున "క్ + ఊ + ప్ + య్ + అ" అని ఐదక్షరములు కలవు. అవి పంచాగ్నులను, పంచేంద్రియములను సూచించును. ఇందు ప్రాజాపత్యబీజము, భూబీజమైన ఊకారముతోడను, పర్జన్యవాయుదేవబీజ ములతోడనుగూడియున్నవి. ఉపాసకులు ప్రాణాయామమున భూచక్రము నందు ప్రజాపతి పర్జన్యులను ధ్యానించి జపించుటచే, భూమిలోఁగల జల రాసులను గనుగొని, వాయుశక్తితో వానిని బైటపెట్టి వర్షింపఁజేయుగలవార లగుదురని తెలియుచున్నది. అంతేకాదు భూమిలోఁగల తైలజలలోహాదులను గనుగొనువారలు కాగలరని తెలియుచున్నది.

## 196. నామము- శివ: "నమోవట్యాయచ"

భ. భా. భా:— భూమిపైగల రంధ్రమునకు అవటమనిపేరు. దానిలో జల రూపముననుండుటచే మహాదేవుడు అవట్యనామకుడాయెను. భూరంధ్రమున గల సర్పాదిజీవులను రక్షించుటకై అందున్న కారణమున శివునకు అవట్య నామమువాటిల్లెను. అ = శివునియొక్క, వటః = కోశము అవటము అనగా హిమాలయపుగుహ. అందు తపంబునకుండువాడు కావున శివుడు అవట్య నామకుడాయెననియుఁ జెప్పవచ్చును.

విష్ణు:- అ = విష్ణువు. వటము = అతనిని ఆవరించియుండుకోశము అవటము. అదియే జీవుల హృదయకుహరము. అందుండుటచే విష్ణువు అవట్యనామకు డాయెను. అ = ఓంకారమును, వటము = ఆవరించియుండుకోశము వేదత్ర యము. ఋగ్యజుస్సామవేదస్వరూపము. దానియందుండుటచేతను [illegible]డై విష్ణువు అవట్యనామకుడాయెననియుఁ జెప్పవచ్చును.



*బీజాక్షరసంపుటి-*

అవర్ష్య నామమున "అ+వ్+అ+ర్+ష్+య్+అ" అని ఆరక్షరములు కలవు. అవి షడృతువులను, షట్చక్రములను సూచించును. ఇందలి మూడకారములు త్రిమూర్తులను సూచించును. వీనిలో సూర్యబీజమైన ఉకారము వరుణవాయుబీజములమధ్యనున్నది. అందుచే నీనామము నుపాశించువాడు జలవాయు ప్రేషకయంత్రములసాయమున సూర్యమండల గామి కాగలడనియును, జలవాయు శక్తుల తోడ్పాటుచే సూర్యకిరణ శక్తులను గ్రహించి సకల రోగనివారకుడు కాగలడనియును తెలియుచున్నది సూర్యోపాసకులకు ఇది ప్రధాననామము.

## — 12. వ. యజుస్సు —

"నమోవర్ష్యాయచావర్ష్యాయచ"

*అర్థము:-*

వర్ష్యాయచ = వర్షజలరూపుడైనట్టియును, అవర్ష్యాయచ = సముద్రాది జలరూపుడైనట్టి శివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సో.భా. :— మేఘము, వర్షము జలరూపములు. జలము శివుని రూపములలో నొకటి. కావున మహాదేవుడు వర్షజలమందును, సముద్రాది జలమందు నుండి జీవులను రక్షించుచు, నమస్కరింపబడుచున్నాడు.

*197 నామము- శివ:- "నమోవర్ష్యాయచ"*

భ.భా.భా. :— "చత్వారివా అపాగ్ంరూపాణి, మేఘోవిద్యుత్, స్తనయిత్నుర్వృష్టిః" అను శ్రుతిచే జలరూపములలో వర్షమొకటియని తెలియుచున్నది. అందు మహాశివుడు జలరూపమునందుటచే వర్ష్యనామకుడై నమస్కరింపబడుచున్నాడు.

విష్ణు:—
వర్ష పదమునకు సంవత్సరమని యర్థము కలదు. వర్షమునందు మహావిష్ణువు కాలమునుదెల్పు సూర్యుని రూపముననుండెను. "వత్సరోవత్సలో వత్సః" అను విష్ణు సహస్రసూక్తియందలి వత్సరపదము విష్ణువునే తెల్పుచున్నది. వత్సరవర్షపదములు రెండును సమానార్థకములై విష్ణువునే తెల్పును కాన విష్ణువు వర్ష్యనామకుడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

వర్ష్య నామమున "వ్+అ+ర్+ష్+య్+అ" అని ఆరక్షరములు కలవు. అవి షడృతువులను, షడింద్రియములను సూచించును. ఇందు అకారముతోబాటు వరుణాగ్నివాయుబీజములతోగూడినసూర్యబీజము షకారము కలదు. సూర్యప్రధానముగా ఈ నామము నుపాసించువారు జలాగ్నివాయు ప్రకోపములచే నేర్పడిన రోగములను నివారించువారును జలాగ్నివాయు శక్తులతోగూడిన యంత్ర సహాయమున సూర్యమండల గాములును సూర్య కిరణ శక్తిగ్రాహకులును గాగలరని తెలియుచున్నది. అంతేకాదు, శరీరమున నేర్పడు నానావర్ణపు మచ్చలతో గూడిన చర్మరోగములను నివారించు వారలును గాగలరని తెలియుచున్నది.

## *198 వ. నామము- శివః- "నమోఽవర్ష్యాయచ"*

భ.భా.భా. :— వర్షింపకయే జలముగల సముద్రాదులందు మహాదేవుడు జలరూపముననును, బడబాగ్నిరూపముననుండుటచే అవర్ష్యనామకుడై నమస్కరింపబడుచున్నాడు.

విషు-

వర్షింపనివి అవర్షములు. సముద్రము పర్వతముమున్నగునవి. వాని యందుండువాడు అవర్ష్యుడు. మహావిష్ణువు క్షీరసముద్రమున శేషశాయియై యుండెను. అతడే "రసోఽహమప్సుకౌంతేయ!" అను గీతాసూక్తిచే సముద్రాది జలమున రసరూపముననున్నట్లు తెలియుచున్నది అందుచే విష్ణువు అవర్ష్యనామకుడాయెను. రత్నగర్భుడు = సముద్రుడు రత్నగర్భోధనేశ్వరః" అను విష్ణుసహస్రసూక్తిలో సముద్రార్థకమైన రత్నగర్భపదము విష్ణునామముగాగలదు రత్నగర్భుడు, అవర్ష్యుడు" అను రెండు నామములును సమానార్థకములే. రత్నగర్భుడును (సముద్రుడును) వర్షింపనివాడేకదా! కావున విష్ణువునకు అవర్ష్యనామముచెల్లును. అవర్షము = పర్వతము అని చెప్పఁ నను శేషాచలభద్రాచలాది పర్వతములందును విష్ణువుండుటచే ఆతనికి అవర్ష్యనామముచెల్లును. విష్ణువవలె శివుడును శ్రీశైలపర్వతమునగలడు కాన అవర్షనామకుడగును. "అచలశ్చలః" అను విష్ణుసహస్రసూక్తిలో అచలపదము విష్ణుపరముగాఁగలదు. "స్థావరాణాంహిమాలయః" అను గీతాసూక్తిచే హిమాలయమున విష్ణువిభూతియున్నట్లు తెలియుచున్నది. హిమాలయము అవర్షకమే అందుండుటచే విష్ణువు అవర్ష్యనామకుడగును. ఈవిధముగా విష్ణువు నమస్కరింపఁబడుచున్నాడు.

*బీజాక్షరసంపుటి:-*

వర్ష్యనామముకంటె అవర్ష్యనామమున అకారము మాత్రము అధికముగాగలదు. ఇందుగల ఏడక్షరములును సప్తకిరణములను, సప్తధాతువులను సూచించును. ఈనామము నుపాసించువాడును వర్ష్యనామోపాసకుడు పొందు శక్తులనే పొందగలడు.

## — 13. వ. యజుస్సు —

### "నమోమేఘ్యాయచవిద్యుత్యాయచ"

**అర్థము:-**

మేఘ్యాయచ = మేఘమునందున్నట్టియును, విద్యుత్యాయ = మెఱపుతో సహసంచరించునట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— మహాదేవుడు మేఘమునందు జలవాయ్వగ్నిరూపముననుండెను అతడు విద్యుత్తునందు (మెఱపునందు) సువర్ణచ్ఛాయరూపముననుండెను. అందుచే ఆతనిని నమస్కరించుచున్నారు.

### *199* నామము:- శివ:- "నమోమేఘ్యాయచ"

వ.భా.భా. :— "ధూమజ్యోతిస్సలిలమరుతాంసన్నిపాతఃక్వమేఘః" అను కాళిదాససూక్తిచే "పొగ, అగ్ని, నీరు, గాలి" అను నాల్గింటికలయికచే మేఘము ఏర్పడినట్లు తెలియుచున్నది. వాయ్వగ్నిజలములు శివస్వరూపములు మేఘమున జలాగ్నివాయురూపమున నుండిలోకమునకుమేలుచేయుటచే మహాశివుడు మేఘ్యనామకుడాయెనని తెలియుచున్నది

**విష్ణు:-**

"జ్యోతిషాంరవిరంశుమాన్" "పవనఃపవతామస్మి" అను గీతాసూక్తులచే జ్యోతిస్సు, పవనము (గాలి) విష్ణువిభూతులని తెలియుచున్నది. పైరెండును మేఘమునందుగలవు. కావున విష్ణువునకు మేఘ్యనామము ఉచితమని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి* —

మేఘ్యనామమున "మ్ + ఏ + ఘ్ + య్ + అ" అని ఐదక్షరములు కలవు. అవి దంచాగ్నులను, పంచకోశములను సూచించును. ఇందు మదన బీజము వీరభద్రబీజమైన ఏకారముతోడును భైరవబీజమైన ఘకారము వాయు సర్వదేవబీజములతోడను గూడియున్నవి. పైనామము శైవులకు ముఖ్యోపాస్యము. [ప్రాణాయామమున బైనానుము నుపాసించువారు బాహ్యాభ్యన్తర శత్రు సంహారకులై సర్వసిద్ధుల నొసంగగలరని తెలియుచున్నది. అంతేకాదు, భౌతికములైన వాయువులతో నిండిన అయుధములను నిర్మింపగలవారలును అట్టి వాయుశక్తితో సర్వశత్రుసంహారకులును గాగలరని తెలియుచున్నది.

## *200 నామము;- శివ:- "నమోవిద్యుత్యాయచ"*

భ.భా.భా. :— మహాశివుని రూపములలో నొకటగు జలము ప్రకృతిలో "మేఘము, విద్యుత్తు, స్తనయిత్నువు, వృష్టి" అను నాలుగు రూపములతో నున్నట్లు

"చత్వారివాఅపాగ్ంరూపాణి,

మేఘో విద్యుత్, స్తనయిత్నుర్వృష్టిః"

అనెడి ఆరుణ మంత్రముచే దెలియుచున్నది, అట్టి విద్యుత్తులోగల అగ్నియే శివునిరూపమైన వైద్యుతమని ప్రసిద్ధమైనది. వైద్యుతము, విద్యుత్యము ఒక్కటియే. కాన విద్యుత్తులో అగ్నిరూపముననున్న శివుడు విద్యుత్యనామకుడై నమస్కరింపబడుచున్నాడు.

విష్ణువు:—

"విశేషణద్యోతత ఇతివిద్యుత్" అనువ్యుత్పత్తిచే విశేషముగా ప్రకాశించు విష్ణువు విద్యుత్తు అయెను. అందుగల తేజస్సే విద్యుత్యము. అదియే మహా

ప్రళయమున సహస్ర సూర్యతేజస్సుతో తుల్యమై యుండును. "తేజస్తేజస్వినామహమ్" అను గీతాసూక్తిచే తేజస్వులైన సూర్యచంద్రాగ్ని విద్యుత్తులందలి తేజస్సు విష్ణువిభూతియని తెలియుచున్నది. ఈ యర్థముననే "సహస్రార్చిస్సప్తజిహ్వః" అను విష్ణుసహస్రసూక్తిలోని సహస్రార్చి పదము విష్ణునామముగా పేర్కొనబడెను. సహస్రార్చి విద్యుత్య పదములు రెండును సమాన విషయములు కాన విష్ణువు విద్యుత్యనామకుడై నమస్కరింపబడెను.

విద్యుత్యనామమున "వ్ + ఇ + ద్ + య్ + ఉ + త్ + య్ + అ" అని ఎనిమిదక్షరములుకలవు. అవి అష్ట ప్రకృతులను, అష్టాంగములను సూచించును. ఇందు వరుణ విష్ణువాయువాస్తుసకల దేవబీజములు, దుర్గాబీజమైన దకారముతో గూడియున్నవి. ఇది దుర్గోపాసనకు ముఖ్యము. దుర్గాదేవి అగ్నిస్వరూపిణి. అందుచే నీనామము నుపాసించువారు సర్వార్థసిద్ధిదాయకులగుదురు. అంతేకాదు, సర్వవ్యాపకములైనట్టి జలాగ్నివాయ్వస్త్రముల నిర్మింపగలవారలై సకల భయంకరులై సర్వప్రపంచమును వశమొనర్చుకొని, రక్షింపగలవారలగుదురని తెలియుచున్నది.

## -: 14. వ. యజుస్సు :-

"నమఈధ్రియాయచాతప్యాయచ"

అర్థము:-

ఈధ్రియాయ = నిర్మలముగా ప్రకాశించు శరత్కాలమేఘమున నున్నట్టియును, ఆతప్యాయచ = ఆతపముచే వర్షించు మేఘముననున్నట్టి శివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము-*

సా భా:— ప్రకృతిలోగల సకల వస్తువులందును బరమేశ్వరుడుకలడు. కాన ఆతడు నిర్జలమై నిర్మలముగా బ్రకాశించుమేఘమునందుండెను. ఆతప ముచే వర్షించుమేఘమునందును ఉండెను.

## *201 వ. నామము:- శివ:- "నమఈధ్రియాయచ"*

భ భా. భా. మహాదేవుడు చక్కగా బ్రకాశించు శరత్కాలమేఘమున శ్వేత తేజోరూపుడైయుండి ప్రకృతిని బ్రకాశింపజేయును. అందుచే ఈధ్రినామకుడై యుండెను. అంతేకాదు. ఈ = మాయాశక్తిని, తనలో జలరూపమునదాల్చి యుండుటచే ఈధ్రియనామకుడాయెననియుజెప్పవచ్చును.

విష్ణు:—

శరత్కాలమేఘమున సకలమును ఆకర్షించి ఆనందపఱచుకాంతిరూప మున మహావిష్ణువుఉండెను. విష్ణుసహస్రమున శర్వరీకరనామము విష్ణువర ముగాగలదు. శర్వరీకరుడైన (రాత్రింకరుడైన) చంద్రునిలోగలప్రభ విష్ణు తేజస్సే. అది శరత్కాలమేఘమునందునుగలదు కావున విష్ణువు ఈధ్రియు డాయెను. ఈ = మాయాశక్తిస్వరూపిణియైన లక్ష్మీదేవిని తనవక్షంబునదాల్చి యుండువాడు కావున విష్ణువు ఈధ్రియనామకుడాయెను.

*బీజాక్షరసంపుటి —*

ఈధ్రియనామమున "ఈ+ధ్+ర్+ఇ+య్+అ" అని అక్షర ములుకలవు. అవి షడృతువులను షడింద్రియములను సూచించును. ఇందు మాయాశక్తిని, విష్ణువును సర్వదేవతలనుదెల్పు అచ్చులుకలవు. వాని నడు మను ధనదవాయ్వగ్నిబీజములుకలవు. ప్రాణాయామ ప్రక్రియలో శక్తి విష్ణువులను ధ్యానించి, పైనామము నుపాసించువారు దైవశక్తినార్జించుకొని

వాయ్వగ్నుల నుత్పాదించుయంత్రములను గనుగొని, వానిసాయమున భూజలస్థ ధనములను వెలిబుచ్చఁగలవారలగుదురు. వాయ్వగ్నిప్రకోపముచే గల్గు రోగములను నిర్మూలింపఁగలవారలగుదురని తెలియుచున్నది.

## 202 వ. నామము:- శివ:- "నమఆతప్యాయచ"

భ. భా. బా:— శివుడు సూర్యాగ్నిస్వరూపుడగుటచే సముద్రారణ్యాదులను, సకలచేతనాచేతనములను ఆతపముననుండి తపింపజేయును. విషక్రిములను దుర్వాసనలను దొలగించి, సకలమును ఆరోగ్యవంతముగావించును. అందుచే శివుడు ఆతప్యనామకుడాయెను.

### విష్ణు:-

ఆఙ్పూర్వకమగు "తప = తపనే" అనుధాతువునుండిఏర్పడిన ఆతప్య పదమునకు సంపూర్ణముగా తపంబొనర్చుటకును, ప్రత్యక్షముగావించుకొనుట కును దగినవాడగు విష్ణువు అని అర్థము. కావుననే ధ్రువాదులాతనినిగూర్చి తపంబొనర్చిరి. అందుచే విష్ణువు ఆతప్యనామకుడాయెను.

### బీజాక్షరసంపుటి—

ఆతప్యపదమున "ఆ+త్+అ+ప్+య్+అ" అని ఆరక్షరములు కలవు. అవి షడావరణలను, షడింద్రియములను సూచించును. పరాశక్తి ప్రధానముగాఁ బైనామము నుపాసించి వాతరోగములను నిర్మూలింపగల వారును వాయుప్రేషకయంత్రములను నిర్మించువారును కృత్రిమమేఘ నిర్మాతలునుగాఁగలరని తెలియుచున్నది.

## — 15. వ. యజుస్సు —

'నమోవాత్యాయచరేష్మియాయచ

**అర్థము:-**

వాత్యాయ = వాయువుతోగూడినవర్షముకురిపించువాడును, రేష్మియాయచ = సకలభూతములు నశించుప్రళయకాలమున నుండువాడును ఇసుక రాళ్లు మున్నగువానితోగూడిన వర్షమునొసంగువాడునగు శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా: — పరమశివుడు సంహారకర్తయగుటచే వ్యష్టిగా, సమష్టిగాను శిక్షలనొసంగ సమర్థుడు. అందుచేతనే పెనుగాలులతోగూడిన వర్షముకురిపించియు, ఇసుక, రాళ్ళు, వడగండ్లు, అగ్నికణములు, మున్నగువానితో గూడిన, వర్షముకురిపించియు, జీవులను శిక్షించును. అందుచే అతనిని నమస్కరించుచున్నారు.

### 203 వ. నామము- శివ:- "నమోవాత్యాయచ"

భ. భా. భా: — మహాదేవుడు వర్షముకురిపించి ప్రకృతిని, పోషించును. ప్రపంచమంతటను వర్షముపడుటకు వాయుసహాయము అవసరము. వాయువు శివస్వరూపము కావున వాయువుతోగూడిన వృష్టిలోదానుండెను. అంతే కాదు. గాలివానలో అగ్నిస్వరూపుడైయుండివేడిగాలులు వీపించి, ప్రకృతిని శిక్షించును. కావున శివుడు వాత్యనామకుడాయెను.

ప్రశ్న: —

"పవనఃపవతామస్మి" అను గీతాసూక్తిచే వాయువు విష్ణు విభూతియని తెలియుచున్నది అందుచే విష్ణువు జీవులకు జీవనము నొసంగుటచే ముని వాయు

రూపమున ఉండెను. అందుచే విష్ణువు వాత్యనామకుడాయెను. "పవనః పావనోఽనలః" అను విష్ణుసహస్రసూక్తిలోఁగల పవననామమును ఈవాత్య నామమును సమానభావముగలవి. కావున విష్ణువునకును వాత్యనామము చెల్లును. పృథివిలోఁ బుణ్యగంధమువీచుటకు విష్ణువు వాయురూపుడై యుండు టచే వాయునామము విష్ణువునకు ఏర్పడెను. అందుచేతనే వాయుర్వాయురధో క్షజః" అను విష్ణుసహస్రసూక్తిలో వాయునామము విష్ణువరముగాగలదు. వాత్యవాయునామములును సమానభావములే. కావున విష్ణువు వాత్యనామకు డాయెను.

***బీజాక్షరసంపుటి:-***

వాత్యనామమున "వ్+అ+త్+య్+అ" అని ఐదక్షరములు కలవు. అవి పంచాగ్నులను, పంచకోశములను సూచించును. పైనామమున వరుణవాస్తువాయుబీజములు అకారాకారములతోగూడియున్నవి. పరాశక్తి ప్రధానముగాఁ బైనామము నుపాసించువారు, జలోదరవాతపిశాచాదిబాధలను దొలగింపగలరు. అంతేకాదు. జలవాయుయంత్రములను గనుగొని, వాని సాయమున నూతనయంత్రనిర్మాతలుకాఁగలరని తెలియుచున్నది

## 204 నామము- శివ:- "నమోరేష్మియాయచ"

భ. భా. భాః— పరమశివుని ప్రభావముచే భూతప్రేతాదులు మిక్కిలి వేగముగా నశించును యుగాన్తకాలమున "సంవర్త"మని ప్రసిద్ధమైనవాయువు శిలాపాషాణములను వర్షింపఁజేసి సర్వమును నాశనముచేయును. దానినే "రేష్మ" అందురు. అది శివస్వరూపము. గ్రీష్మఋతువునుగూడ రేష్మ యందురు. గాలిచే ఎగిరిపడు ఇసుకరేణువులుకూడ రేష్మలు అనఁబడును. వానియందును శివశక్తికలదు. కావున శివుడు రేష్మియనామకుడాయెను.

**విష్ణు:—**

"భూతాత్మాభూతభావనః" అను విష్ణుసహస్రసూక్తిచే రేష్మలు అనగా నశించునట్టి భూతములు విష్ణువు వానిలోఁ దానాత్మయైయున్నాడని తెలియు

చున్నది. కావున భూతాత్మనామమును, "రేష్మియ" యనునామమును సమానార్థకములేయని తెలియుచున్నది రేష్మియుడనగా రేష్మలందున్న వాడనితెలియుచున్నది. విష్ణు శక్తిగలవాయుభేదమే సంవర్తము. అందుండి విష్ణువు ప్రళయమున భయంకరముగావీచి, సర్వమును నశింపఁజేయును. పైకారణములచే విష్ణువునకును రేష్మియనామము సార్థకమేయనితెలియు చున్నది.

*బీజాక్షరసంపుటి—*

రేష్మియనామమున "ర్+ఏ+ష్+మ్+ఇ+య్+అ" అని ఏడ క్షరములుకలవు. అవి సప్తధాతువులను సూచించును. వానిలో వీరభద్ర బీజము అగ్నిబీజమైన రేఫముతోడను, సూర్యమదనబీజములు విష్ణుబీజమగు ఇకారముతోడను, వాయుబీజముదేవబీజమగు అకారముతోడనుగూడియున్నవి. పైనామమును సూర్యప్రధానముగా నుపాసించువారు లోకములందలి శత్రు శక్తులను నశింపజేయగలవారును, కామోద్రేకముతోఁ బ్రవర్తించి సంపా దించిన అగ్నివాయుప్రకోపజాతరోగములను నివారించువారునుగాఁగలరని తెలియుచున్నది. ప్రాణాగ్నిప్రాణవాయుసహాయమున సూర్యమండలగాము లగుటయేకాక సూర్యకిరణశక్తిగ్రాహకులై లోకరక్షకులుకాఁగలరనియును దెలియుచున్నది.

## — 16. వ. యజుస్సు —

### "నమోవాస్తవ్యాయచవాస్తుపాయచ"

*అర్థము:-*

వాస్తవ్యాయచ = ధనరూపముననను, గవాశ్వాదిరూపముననుఉండుటయే కాక, తత్కార్యరూపముననున్నట్టియును, వాస్తుపాయచ = గృహనిర్మాణ భూమియైన వాస్తువును బాలించువాడునగు శివునకు, నమః = నమస్కారము.

తాత్పర్యము:-

సా భా:— భగవంతుడు శివుడు సకలచరాలరవస్తువులందునుగలడు. ముఖ్యముగా జనులజీవనాధారమైన ధనమునందును, గవాశ్వాదులందునుగలడు. గృహనిర్మాణమునకు అవసరమగు భూమిలో వాస్తుపురుషరూపముననుండి జీవులను రక్షించును కావున అతనికి నమస్కారము.

## 205 నామము- శివ: "నవాస్తవ్యాయచ''

భ. భా. భా:— "మేధనంచమేవసుచమేవసతిశ్చమే" అను చమకమంత్రమున జీవులు అపేక్షించుధనమునందుండి శివుడు జీవులను రక్షించును. అని కలదు. గోవులు అశ్వములు మున్నగువానిలోనుండి మహాశివుడు క్షీరాదిజీవన సామగ్రినిచ్చుననియును తెలియుచున్నది. యోగక్షేమంవహామ్యహమ్" అను సూక్తిలోజెప్పినట్లు జీవులవస్తుభారమును వహించియు రక్షించుచున్నాడు. కావున వాస్తవ్యనామము శివునకేర్పడెను.

విష్ణు:—

"గతిర్భర్తాప్రభుః" నేను సకలమునకును గతినైయున్నాను. "మత్తః సర్వంప్రవర్తతే" నానుండే సర్వమును ప్రవర్తించుచున్నది. "జీవనం సర్వ భూతేషు" సర్వప్రాణులందునుగల జీవమునునేనే. అనిగీతలో భగవంతుడు చెప్పినాడు. కాన విష్ణువు వస్తువులందు అనగా ధనము గోవులు, అశ్వములు మున్నగువానియందుండి జీవుల సకల జీవనమును నడుపుచున్నాడు. కావున విష్ణువు వాస్తవ్యనామకుడాయెనని తెలియుచున్నది.

**బీజాక్షరసంపుటి-**

వాస్తవ్యనామమున "వ్+అ+స్+త్+అ+వ్+య్+అ" అని ఎనిమిదక్షరములు కలవు. అవి అష్టసిద్ధులను, శరీరమందలి అష్టచక్రములను సూచించును. ఇందు పరాశక్తిబీజములు రెండుకలవు. కావున శక్త్యుపాసనకు ఇది ప్రధాననామము. పైనామము నుపాసించువారు సకల చర్మరోగములను, భూతదిబాధలను, జలవాతసంబంధిరోగములను నివారింపగలవారలగుదురని తెలియుచున్నది. అంతేకాదు జలవాయువులందుఁగల అగ్నిని వెలిబుచ్చుయంత్రములను నిర్మింపగలరనియుఁ దెలియుచున్నది.

## *206 నామము- శివ- "నమోవాస్తుపాయచ"*

భ. భా. బా:— వాస్తుప్రభావము "అణిమ, మహిమ, గరిమ. లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము" అను రీతిని అష్టవిధములైయున్నది. అందుండి లోకములనుగాపాడును, గాన శివుడు వాస్తుపనామకుడాయెను. "నమోరుద్రాయవాస్తోష్పతయే" అను శ్రుతిచే వాస్తుననగా స్వామియై రక్షించువాడు కాన వాస్తుపనామకుడాయెను. వాస్తోష్పతి వాస్తుప పదములు సమానములే. అవి ఇంద్రునిదెల్పును. శివుడు ఇంద్రరూపుడై లోకములను రక్షించును; కాన వాస్తుపనామకుడై నమస్కరింపబడుచున్నాడు.

**విష్ణు-**

"వస్తువేవాస్తువు" అని వ్యాకరణమున వస్తుపదమువాస్తుపదముగా మారును. వాస్తువు అనగా సత్యము. విష్ణువు సత్యస్వరూపుడైయుండి, ప = రక్షించుచున్నాడు; కాన వాస్తుపనామకుడాయెను. వాస్తు అనగా నివాసభూమి అదియే జీవులకు, శరణము = రక్షకము. "నివాసశ్శరణం సుహృత్" అని గీతలోఁ జెప్పినట్లు విష్ణువువాస్తువై నివాసస్వరూపుడై జీవులను రక్షించుచున్నాడు. కావున విష్ణువునకు వాస్తుపనామముచెల్లును.

**బీజాక్షరసంపుటి:-**

వాస్తుపనామమున "వ్+అ+స్+త్+ఒ+ప్+అ" అని ఏడక్షర ములుకలవు. అవి సప్తవాయుమండలములను, సప్తధాతువులను సూచించును. పైనామమున శక్తి బీజములు రెండుకలవు. కావునఁ బ్రాణాయామమున శక్తిని బ్రధానముగా ధ్యానించి, ఉపాసించి, మహిమనార్జించి, శారీరికరోగనివారక యంత్ర నిర్మాతలును, జలవాయుప్రేషకయంత్రనిర్మాతలును గృత్రిమమేఘ నిర్మాతలునై వృష్టికరులును, రాజవశీకరులునుగాఁ గలరనితెలియుచున్నది.

భ భా. భాష్యము:— సప్తమానువాకమంత్రపురశ్చరణవిధానము ఇందుఁ గలదు. ఒకదినమున ఉపవాసమొనర్చి, 8 వందల జపముచేసినఁ బురశ్చరణ గావించినవాడగును. చతుర్వర్ణములవారును వశముకావలెనని కోరినచో అశ్వత్థోదుంబరవటప్లక్షసమిధలను దధిమధుఘృతములతోఁ దడిపి, 10 వేల హోమము ఈయనువాకముతో జేయవలెను. మేధాశక్తికావలెననికోరెనవాడు కపిల గోవునేతితో 5 వేలహోమముచేయవలెను. వానికి మేధావియైనపుత్రుడు జన్మించును వృష్టికావలెననికోరినవాడు, అపూపములతో 9 వేలహోమము చేయ వలెను. ఆరోగ్యమును గాంక్షించువాడు ఖాదిరసమిధలను దధిమధుఘృత ములతోఁ దడిపి, 5 వేలహోమముచేయవలెను. సౌందర్యకాంక్షి 10 వేల మామిడి చిగుళ్ళను దధిమధుఘృతములతోఁ దడిపి హోమము చేయవలెను. శ్రీకాముకుడు కాన్తారమున న్వాకారప్రమాణముగల అగ్నికుండమును ద్రవ్వి అందుంచిన మథితాగ్నిలోఁ దెల్లకమలములను దధిమధుఘృతములతోఁ దడిపి 5 వేలహోమముచేయువలెను. ఇట్లాచరించినచో వాని వంశము పరమేశ్వర ప్రసాదముచే భూమియున్నపర్యంతము వృద్ధినొందును. కార్పాసవస్త్రకాంక్షి, ప్రత్తిగింజలను తేనేతోఁదడిపి 10 వేలహోమముచేయవలెను. గోవులుకావలె నని కాంక్షించువాడు గోవులమందలో ఈయనువాకమును జపించుచు 10వేల ప్రదక్షిణములుచేసినచో గోవులనుబొందును. పుత్రకాముడు పలాశసమిధలను

దధిమధుఘృతములతోఁదడిపి, 10 వేలహోమముచేసినచో వంశకరుడైన పుత్రుని బొందును. ఆయుర్దాయమును గాంక్షించువాడు దూర్వాంకురములను నేతిలో దడిపి, ప్రతిసంవత్సరము 10వేల హోమముచేసినచో శతసంవత్సరములు జీవించును. విద్యలనుగోరువాడు అశ్వత్థసమిధలను నేతితోఁదడిపి, 100 వేల హోమముచేసినచో సర్వవిద్యాపారంగతుడగును. రాజ్యమును గాంక్షించువాడు సౌగంధికసమిధలనుతేనెలోఁ దడిపి, 5 లక్షలహోమముచేసినచోఁ జక్రవర్తియై జన్మించును.

పిమ్మట ముక్త్యుపాయము చెప్పబడుచున్నది. మోక్షమును గాంక్షించువాడు తొలుత చాంద్రాయణవ్రతమునాచరించి, ఈయనువాకమును 21 వేలు జపించి అటుపిమ్మట 5 వేల ప్రదక్షిణములు ఆచరించి ప్రాణాయామము ఒనర్చిన పిమ్మట శంభునిసన్నిధిని అగ్నిలోఁ బలాశాశ్వత్థసమిధలను మధుఘృతములతోఁదడిపి, 3 లక్షలహోమముచేసినచో శంభుని ప్రసాదమువలన ముక్తుడగును అన్యకులజాతులు సైతము రౌరవనరకమునఁ బడ్యమానులైనను శివపురమున రమింతురు ఇంద్రపంచకముగడిచిన పిమ్మటను ఆయా కులజాతులు పైనఁ జెప్పినట్లుచేసి పృధివియున్నంతకాలము వృద్ధినొందుదురు

ధ్యానము:-

శ్లో॥ జటాభిర్లంబమానాభిర్నృత్యంతమభయప్రదం।
దేవంశుచిస్మితంధ్యాయేత్ వ్యాఘ్రచర్మపరిష్కృతమ్॥

తాత్పర్యము-

వ్రేలాడుచున్నజటలతో నాట్యముచేయునట్టియును, అభయమొసంగువాడును, తెల్లని చిఱునవ్వుగలవాడును, వ్యాఘ్రచర్మముదాల్చినవాడునగు మహాదేవుని ధ్యానించవలెను.

ఈశ్లోకమును జపించినను, ఈ యనువాకమంత్రములను జపించి, హోమప్రదక్షిణలు గావించినను పైనఁజెప్పినఫలములను అందఁగలరని తెలియుచున్నది.

## :: అష్టమానువాకము :-

ఈ యనువాకమందును అన్యతరతోనమస్కారములైన యజుస్సులు చెప్పఁబడుచున్నవి.

"ఓంనమస్సోమాయచ రుద్రాయచ"

**అర్థము:-**

సోమాయచ = ఉమతోఁగూడియున్నట్టియును, రుద్రాయచ = సకల జీవులరోదనహేతువైన దుఃఖమును ద్రవింపఁజేయునట్టి, శివునకు నమః = నమస్కారము.

**తాత్పర్యము-**

సా. భా:— మహాదేవుడు అర్థనారీశ్వరావతారమునఁ బార్వతీదేవితోఁగూడి యుండెను. అతడు సకలజీవులను దుఃఖింపఁజేయుకష్టములను నశింపఁజేయును కాన అతనిని నమస్కరించుచున్నారు

**207 నామము- శివః "ఓంనమస్సోమాయచ"**

భ. భా. భా:— "నమస్సోమాయ" మొదలు "నమోవఃకిరికేభ్యః" అనునంతవరకునుగలవి ఒకే మంత్రముగానున్నవి. దీనికి భగవంతుడే" ఋషి. మహానుష్టుప్ ఛందస్సు. దేవతయును భగవంతుడే. ఇటదేవుని అనుగ్రహ రూపములైన మంత్రములు ప్రదర్శింపఁ బడుచున్నవి. మహాశివుని అనుగ్రహ రూపమును ప్రకటించుటకు రుద్రుడు, పశుపతి మున్నగుపదములు పూర్వోక్తములైనను మఱల చెప్పఁబడుచున్నవి.

జీవులపట్లను, అందునను భక్తులపట్లను దనకుఁగలప్రసాదమును, దయను బ్రదర్శించుటకై మహాశివుడు ఉమాసహితుడై కనఁబడి నమస్కరింపబడుచున్నాడు. సోముడు అనగాఁ జంద్రుడు. రుద్రుడు చంద్రాత్ముడై అమృత కిరణములద్వారా, ఆహారమును సమర్పించి, సకలచేతనాచేతనములను ఆనందపఱచుటయేకాక పితృదేవ మనుష్యులకు ముఖ్యముగాఁ దృప్తికల్గించుచున్నాడు. సోమయాగాత్మకుడై సోమయాగరూపమున బురుషులకు అభివృద్ధిని జేకూర్చుచున్నాడు. సోమరూపుడై = వాయురూపుడై జీవులను బ్రతికించుచున్నాడు. పైకారణములచే శివుడు సోమనామకుడై నమస్కరింపబడుచున్నాడు

విష్ణు-

మహావిష్ణువు చంద్రరూపుడై ఓషధులను బోషించుటచే సోమనామకుడై "సోమపోఽమృతపస్సోమః" అని విష్ణుసహస్రసూక్తిలోఁ బేర్కొనబడెను. పాలసముద్రమును మధించునపుడు విష్ణువుకూర్మరూపుడై మంథరపర్వతమును జలమునఁ దేల్చియుంచుటచే అందుండి అమృతముఉద్భవించెను. "సూతేఅమృతమితిసోమః" అనువ్యుత్పత్తిచే ఈయర్థమే ప్రకటింపఁబడుచున్నది. కావున విష్ణువుసోమనామకుడాయెను. సోమపదమునకు, గాలి, యముడు అనియు నర్థములుకలవు. విష్ణువుయమరూపుడై సకల జీవులను శిక్షించుచు సన్మార్గమున నియమించుచున్నాడు. కావున విష్ణువు సోమనామకుడాయెననియుఁ జెప్పవచ్చును.

*బీజాక్షరసంపుటి:-*

సోమనామమున "స్+ఓ+మ్+అ" అని నాల్గక్షరములుకలవు. అవి ధర్మార్థకామమోక్షములను అంతఃకరణచతుష్టయమును సూచించును. ఇందు సకారౌకారములు శక్తిశివబీజములు. వానితో మదనబీజములుకూడియున్నవి. పైనామమును శివశక్త్యభేదముగా నుపాసించువారై సర్వశక్తులను సముపార్జించుకొని విజ్ఞానులై స్థితికరులును సర్వఫలప్రదులును గాఁగలరని

తెలియుచున్నది. అంతేకాదు. అణిమాద్యష్టసిద్ధులనొందినవారై సర్వకార్య జయప్రదులును అగుదురనితెలియుచున్నది

## 208 నామము- శివ:- "నమోరుద్రాయచ"

భ. భా. భా:— ఈరుద్రనామార్థము శివవిష్ణుబీజాక్షరాది పరముగా ఇంతకమున్నువివరింపబడెను.

### — 2. వ. యజుస్సు —

### "నమస్తామ్రాయచారుణాయచ"

**అర్థము:-**

తామ్రాయచ = ఉదయకాలమున ఆదిత్యరూపుడగుటచే అత్యంత రక్తవర్ణుడైయున్నట్టియును, అరుణాయచ = ఉదయానంతరమున ఇంచుకంతరక్తవర్ణుడైయుండునట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— పరమశివుడు సూర్యస్వరూపుడు. సూర్యుడు ఉదయకాలమున మిక్కిలి యెఱ్ఱగానుండును. అతడే ఉదయించినపిమ్మట ఇంచుకంతరక్తవర్ణుడై యుండును. మహాదేవుడు సూర్యరూపమునఁ బ్రకాశించి, జీవులను మేల్కొలిపి జ్ఞానమునొసంగును. సకల జంతువులకును వారివారికర్మలను ఆచరించుటకుఁ బురికొల్పి, ఆరోగ్యదాతయైకాపాడును.

## 209, 210. నామములు-

తామ్ర అరుణనామముల యర్థము, శివవిష్ణు బీజాక్షరసంపుటి పరముగా ఇంతకుమున్నే వివరింపబడెను. శ్రీవిష్ణుసూరిగారి భాష్యానుసారమైన అర్థము శాక్తాద్వైతపరముగవ్రాయబడు గ్రంథభాగమున మున్ముందు వివరింపబడును.

-: తృతీయ యజుస్సు :-

'నమశ్శంగాయచ పశుపతయేచ"

**అర్థము:-**

శంగాయచ = సుఖమును బొందించువాడును, సుఖము నుత్పాదించు వాడును, పశుపతయేచ = భయ హేతువులైన పాపరోగచోరాదులనుండి రక్షించువాడునగు మహాదేవునకు నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. సా:— భగవంతుడైన మహాదేవుడు సూర్యాదిరూపములతో జీవులకు సుఖమును జేకూర్చును. పాపరోగచోరాదులనుండి భయపడు జీవులను రక్షించును. కాన అతనికి అందఱును నమస్కరించుచున్నారు.

**211 వ. నామము:- శివ:-**

భ. భా. భా:— పరమశివుడు జీవులకు సూర్యస్వరూపుడై ఆరోగ్యమును, అగ్నిస్వరూపుడై జీర్ణశక్తిని, వాయుస్వరూపుడై ప్రాణశక్తిని, చంద్రస్వరూపుడై జీవశక్తిని ఒసంగి సుఖమును జేకూర్చుటచే శంగనామకుడాయెను.

విష్ణు:—

"సుఘోషస్సుఖదస్సుహృత్" "సుఖదోనైకదోఽగ్రజః" అను విష్ణు సహస్రసూక్తులలో "సుఖదః" అను నామము విష్ణుపరముగాఁగలదు. విష్ణువు రావణాదిదుష్టులను సంహరించి, లోకమునకు సుఖముచేకూర్చెను. మకరమునుఖండించి, గజేంద్రునకు సుఖముచేకూర్చెను. ప్రహ్లాదునకు సుఖము నిచ్చెను. శంగః = సుఖమునుజేకూర్చువాడు అను నర్థముగల శంగ నామము సుఖద నామమును, సమానార్థకములేకాన విష్ణువును శంగనామకుడేయని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి—*

శంగనామమున "శ్+అ+మ్+గ్+అ" అనియైదక్షరములు కలవు అవి పంచభూతములను, పంచేంద్రియములనుసూచించును. ఈనామమును లక్ష్మీగణపతి ప్రధానముగా నుపాసించువారికి సకల సంపదలును లభించును నిర్విఘ్నముగా సకల కార్యములునెఱవేర్చి, సకలకాంక్షలను బొందఁగల వారలగుదురని తెలియుచున్నది.

***212* నామము:- "నమఃపశుపతయేచ"**

అను నామముయొక్క అర్థము ఇంతకుమున్నే వివరింపఁబడెను.

-: 4. వ. యజుస్సు :-

*"నమఉగ్రాయచ భీమాయచ"*

**అర్థము:-**

ఉగ్రాయచ = విరోధులను నశింపఁజేయుటకుఁగ్రోధయుక్తుడైనట్టియును, భీమాయచ = దర్శనమాత్రమున విరోధులకు భయహేతువైనట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— మహాదేవుడు జీవులకుఁగల బాహ్యశత్రువులను, అంతరంగిక శత్రువులను నశింపఁజేయుటకు ఉగ్రరూపముననుండెను. అతడుకంటితోఁ జూచినమాత్రాన శత్రువులకు భయమొదలించి, జీవులను రక్షించుచుండెను. అందుచే అతనికి నమస్సులర్పించుచున్నారు.

## 213 వ. నామము- శివ;- "నమఉగ్రాయచ"

భ. భా. భా:— "భయకృత్ భయనాశనః" అని పెద్దలుచెప్పినట్లు భగవంతుడైన మహాదేవుడు కర్మఫలానుభవమునకు అనుకూలముగా పాపరోగనరకాదులను జేకూర్చి, జీవులకు భయము ఒదవించుచున్నాడు అతడే యజమానియు, అధిష్ఠాతయునగుటచే జీవులను రక్షించుటకుగాను, వారిరోగాదులను అడంచుచున్నాడు. అతడే వారికిఁగల కామక్రోధాద్యాంతరంగిక శత్రువులను, బాహ్యశత్రువులైన రాక్షసులను నాశనముచేయుటకై ఉగ్రమూర్తిగానున్నాడు. కావున శివుడుగ్రనామకుడాయెను.

### విష్ణు:—

ఉగ్రస్సంవత్సరోదక్షః" అను విష్ణుసహస్రసూక్తిలో ఉగ్రనామము విష్ణుపరముగాఁగలదు. "భీషోదేతిసూర్యః" అను శ్రుతిలోఁ జెప్పినట్లు సూర్యాదులకు విష్ణువు భయమొదవించుటకు నారసింహాదిభయంకరరూపమునను న్నాడు. కావున విష్ణువును ఉగ్రనామకుడాయెను.

### బీజాక్షరసంపుటి-

ఉగ్రనామమున "ఉ+గ్+ర్+అ" అని నాల్గక్షరములుకలవు అవి చతురగ్నులను అంతఃకరణచతుష్టయమును సూచించును. ఇందు వాయ్వగ్ని బీజములు గణపతిదేవబీజములతోఁగూడియున్నవి. పైనామమును గణపతి ప్రధానముగా నుపాసించి వాయ్వగ్నిభేదములను గనుగొని వానిచే సంహరింపదగు ఆయుధములను శీఘ్రముగా నిర్మింపఁగలవారలగుచున్నారు; వాతాగ్నిమాంద్యాదిరోగనివారకులునగుచున్నారు; అని తెలియుచున్నది.

## 214 నామము- శివ- "నమోభీమాయచ"

భ. భా. భా:— మహాశివుడు భీముడు; అనగాఁ బాపరోగాదులకే భయహేతువు. ఆతనిమహిమచే జీవుల నాక్రమించియున్న పాపరోగాదులు వడా

పంచలగును. ఈతనివలన సకల లోకములను బీడించురాక్షసులు బీతులు అగుదురు ఈతడాకాశమూర్తికి అధిష్ఠాతకావున ఆకాశమునందును రాక్షసాదులుండుటకు వెఱచెదరు.

"భీషాస్మాద్వాతఃపవతే భీషోదేతిసూర్యః—మృత్యుర్ధావతి పంచమఇతి"

అను శ్రుతిచే వాయువు, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు, ఈతనిమూర్తులైనను, ఈతనివలన భీతులైమెలుగుచున్నారట. బ్రహ్మాండమంతటినిబట్టి మ్రింగునట్టి మృత్యువుసైతము ఈతనివలన భీతుడై పఱువులిడుచున్నాడట. కావుననే మహాశివుడు భీమనామకుడాయెనని తెలియుచున్నది.

**విష్ణు:-**

"అతులశ్శరభోభీమః భీమోభీమపరాక్రమః" అను విష్ణుసహస్రసూక్తులలో భీమనామము విష్ణుపరముగాఁగలదు. విష్ణువు సర్వభయంకరుడు. హిరణ్యాక్షాదులను ద్రుంచినాడు. శ్రీరామావతారమున సముద్రుడుకూడ భయపడి, ప్రత్యక్షమై, అమోఘమగు అతని బాణమును దనలోదాగియున్న రాక్షసులుగల ప్రాంతమున విడిచిపెట్టించినాడు. ఇట్టి గాథలెన్నియోకలవు. "మహద్భయంవజ్రముద్యతమ్" అను శ్రుతిలోఁ బరమాత్మ వజ్రమువలె అప్రతిహతుడు; భయకారకుడు; అని తెలియుచున్నది. కావున విష్ణువును భీమనామకుడాయెనని తెలియుచున్నది,

**బీజాక్షరసంపుటి:-**

భీమనామమున "భ్ + ఈ + మ్ + అ" అని నాల్గుఅక్షరములుకలవు. అవి చతురగ్నులను, అంతఃకరణచతుష్టయమును సూచించును. ఇందు భార్గవబీజము , మాయాశక్తిబీజముతోఁగూడియున్నది. కావునఁ బైనామమును ఉపాసించువారు జ్ఞానులై శాక్తేయులై సకలైహికకామములను బరిత్యజించగలరని తెలియుచున్నది. అంతేకాదు. లౌకిక వ్యవహారములందు సకల సిద్ధులను బొందఁగలరనియుఁ దెలియుచున్నది.

## — 5. వ. యజుస్సు —

### "నమోఅగ్రేవధాయచ దూరేవధాయచ"

**అర్థము:-**

అగ్రేవధాయచ = అగ్రమునందు వధగలవాడు, అనగా ఎదుటనున్న వారిని వధించునట్టియును, దూరేవధాయచ = దూరమందు వధగలవాడు, అనగా దూరమందున్నవానిని వధించునట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— మహాదేవుడు సర్వవ్యాపకుడు. అతనికెందును అడ్డులేదు. అతడు ఎదురుగానున్న శత్రువులనుగాని, దూరమందున్న శత్రువులనుగాని చంపగలడు ఆకారణమున లేశమంతదోషముగలవారైనను భయంపడి అతనిని నమస్కరింతురు.

**215 నామము శివ:- "నమోఅగ్రేవధాయచ"**

భ. భా. భా:—

నమోఽస్తురుద్రేభ్యో యేపృధివ్యాంయేఽన్తరిక్షే"

అను శ్రుతిచే పరమేశ్వరుడు పృధివిలోను, అంతరిక్షమున దివియాదుఅంతటను ఉన్నట్లుతెలియుచున్నది. మహాదేవుని స్వరూపములే పంచభూతములు. వానిలో అణుశక్తికలదు. వాని ఆయుధములైన త్రిశూలాదు లందును, అణుశక్తికలదు అందుచే అతడు సకలాయుధములందును, శతఘ్ని మున్నగువానిలోనుండి, ఎదురుగానున్న వైరులను, వ్యతిరేకశక్తులను, శత్రు దేశములను సైతము వధించి, భస్మముచేయగలడు. అందుచే అతనికి అగ్రే వధనామము సార్థకము.

విష్ణు-

"పురుషఏవేదగ్ంసర్వమ్; పాదోఽస్య విశ్వాభూతాని;
చక్షోస్సూర్యోఽజాయత; ముఖాదింద్రశ్చాగ్నిశ్చ"

అను శ్రుతులచే బ్రహ్మాండమంతయును విష్ణుస్వరూపమేయనియును, ఆతని నేత్రములనుండి సూర్యుడు, ముఖమునుండి ఇంద్రాగ్నులు ప్రభవించినట్లును దెలియుచున్నది. అందుచే విష్ణుస్వరూపములే పంచభూతములనియును, ఆతని ముఖనేత్రములు అగ్నిమండలములనియును దెలియుచున్నది. అందుచే ఆతని ఆయుధములును అణ్వస్త్రములేయని తెలియుచున్నది. కాన ఆతడు ఎదురుగా నున్న శత్రువులను శత్రుదేశములనుగూడ ధ్వంసముచేయఁగలవాడనియును దెలియుచున్నది. అందుచే విష్ణువు అగ్రేవధనామకుడని చెప్పవచ్చును.

సం

అగ్రేవధనామమున "అ+గ్+ర్+ఏ+వ్+అ+ధ్+అ" అని యెనిమిదక్షరములుకలవు. అవి అష్టప్రకృతులను, శరీరస్థాష్టచక్రములను సూచించును. ఈనామమున వీరభద్రబీజమైన ఏకారము, అగ్నిబీజము రేఫము, వరుణబీజమగు వకారమును బ్రధానములు. వీనిని బ్రధానముగాఁ జేసి, పైనామము నుపాసించువారు జలాగ్నిరోగములను దొలగించఁగలవార లును, జలాగ్నిశక్తులచే భూమిలోని సకల ధనములను వెలిదీయఁగలవారలును అగుదురని తెలియుచున్నది. అంతేకాదు. ఈనాటి నూతనాయుధములైన అణు బాంబులను, ఉదజనిబాంబులను నిర్మింపఁగలవారలును అగుదురని తెలియు చున్నది. అణూదజనిశక్తులను ధరించు ఆయుధములను నిర్విఘ్నముగాఁ బ్రయోగించి, వీరభద్రునివలె సర్వసంహారకులగుటయేకాక, అణ్వాదిశక్తులను శాంతిసాధనములుగా వినియోగింపఁగలవారలును అగుదురని తెలియుచున్నది

## 216 నామము- శివ- "నమోదూరేవధాయచ"

భ. భా. భా:— పరమేశ్వరుడు తననేత్రాగ్నిచే దూరమునందుండు శత్రువు లను, దూరకాలమునందుండు దురాత్ములను ద్రుంచఁగలడు. ఖండాంతర వేధులు ఈతనిశక్తిజనితములే. కాన మహాశివుడు దూరేవధనామకుడై నమస్క రింపఁబడుచున్నాడు.

### విష్ణు:—

"చక్షోస్సూర్యోఅజాయత" అను శ్రుతిచే సూర్యుడు విష్ణువునేత్రముల నుండి ఉద్భవించినట్లుతెలియుచున్నది. ఆసూర్యమండలము అణ్వాగ్నిసంపూ ర్ణము. దానినెవ్వరును జేరలేరు. అట్టి అణ్వాగ్నివిష్ణుచక్రమునఁగలదు. అదియే సుదర్శనచక్రము దానితో ఎంతటిదూరమందున్న శత్రువులనైనను అతడు వధించఁగల్గినాడు. ఈనాటి ఖండాంతవేధులు ఆసుదర్శన చక్రపుటణువులే. వానితో దూరమందలివారిని వధించిన కారణమున విష్ణువును దూరేవధనామ కుడై నమస్కరింపఁబడుచున్నాడు.

### బీజాక్షరసంపుటి-

దూరేవధనామమున "ద్+ఊ+ర్+ఏ+వ్+అ+ధ్+అ" అని యెనిమిదక్షరములుకలవు. అవి అష్టదిశలను, అష్టాంగములను సూచించును. దుర్గాబీజమైన దకారము భూమిబీజమైన ఊకారముతోడను, అగ్నిబీజము వీరభద్రబీజముతోడనుగూడియున్నవి ఈనామమును భూమియైన మూలా ధారమున దుర్గాగ్ని వీరభద్రులను ధ్యానించి, బాహ్యాంతర శత్రువులను, బాహ్యాంతరరోగములను నివారింపఁగలరు సకల ధనరాసులను భూజలములను అన్వేషించి, పొందఁగలరు. అంతేకాదు. అగ్రేవధపదముచే దెలియు, అణ్వా ద్యస్త్రములనేకాక, దూరదేశధ్వంసక ఖండాంతరవేధులను దూరగమనము లైన రాకెట్లను, నిర్మింపఁగలవారలగుదురు. తమ తపశ్శక్తిచే భూజలాంతరస్థ

విధ్వంసకవస్తువులను అగ్నిశక్తితో వెలిబుచ్చఁగలవారలగుదురు. వాని నిర్మాణమునకవసరమైన ధనవస్తురాసులను జేకూర్చఁగలరు ఈనామమున గల దూర్గాగ్నివీరభద్రజలములు, విధ్వంసకరశక్తిసంపన్నములు. కాన ఉపాసకులు అశక్తులను బడయఁగలరని తెలియుచున్నది.

## — 6. వ. యజుస్సు —

### "నమోహన్త్రేచహనీయసేచ"

**అర్థము:-**

హన్త్రేచ = దూరసమీపవర్తిశత్రువులను ధ్వంసముచేయువాడును, శత్రుధ్వంసకరూపముననున్నవాడును, హనీయసేచ = సర్వాతిశాయిశక్తిచే సర్వులను సంహరించువాడునగు, శివునకు నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— అగ్రమునఁగాని దూరమునఁగానియున్న విరోధులను మహాదేవుడు అనాయాసముగా సంహరింపఁగలడు. లోకమున శత్రుహన్తకులైన వీరులందఱును రుద్రరూపులే శత్రుసంహారకవస్తువులన్నియు రుద్రతేజస్సంపూర్ణములే. సర్వాతిశాయిపరాక్రమసంపన్నుడై సర్వులను సంహరించువాడును మహారుద్రుడే. అందుచేతనే సర్వేశ్వరుడు అర్జునితో

శ్లో॥ మయైవైతేనిహతాఃపూర్వమేవ। నిమిత్తమాత్రంభవసవ్యసాచిన్॥
ఓసవ్యసాచీ! అర్జున! నీవునిమిత్తమాత్రముగానుండవయ్యా! నాచేఁబూర్వమే శత్రువులందఱును సంహరింపఁబడినారు; అని చెప్పినాడు. అందుచే ఆసర్వేశ్వరునకు నమస్కారము.

## 217 నామము- శివ:

భ. భా. భా.— సృష్టించుట బ్రహ్మవిధి. రక్షించుట విష్ణువిధి. సంహరించుట శివునివిధి. ముచ్చురను బరమాత్మస్వరూపులే. ఆతని మూర్తులే ఒక్కడే ముచ్చురుగామారినను, వారుగావించువిధుల ననుసరించి, భిన్నులుగా భావింపఁబడుచున్నారు. సంహరించువారందఱిలోను, నాశనముచేయువస్తువు లన్నింటిలోను, శివశక్తి కలదు. కావున శివుడు హన్తృనామకుడాయెను. శివ శక్తి సూర్యునిలోఁగలదు. సూర్యుడు అష్టవిధస్వరూపుడై బ్రహ్మాండమంత టిలోఁగలదుష్టజీవులను సంహరించును.

"అరోగో భ్రాజఃపటరఃపతంగః। స్వర్ణరోజ్యోతిషీమాన్
విభాసః। కశ్యపోఽష్టమః"
అనెడి అరుణశ్రుతిలో అష్టవిధసూర్యమండలములు పేర్కొనఁబడెను.
"అగ్నిశ్చజాతవేదాశ్చ। సహోజాఅరుణాప్రభుః।
వైశ్వానరోనర్యాపాశ్చ। పంక్తిరాధాశ్చసప్తమః। విసర్పేవాష్టమోఽగ్నీనామ్"
అను శ్రుతిలో అష్టవిధాగ్నులు పేర్కొనఁబడెను. ఆయగ్నియే సముద్రమున బడబారూపముననును, అరణ్యములందు దవాగ్నిరూపముననును, జీవులలో జఠ రాగ్నిరూపముననును, మేఘములందు వైద్యుతాగ్నిరూపముననుండి విక్రమి సంహారముచేయుచున్నది. సముద్రజలము నుప్పొంగనీయక సమస్థితిలోనుంచు చున్నది. ఆటవికమృగసంఖ్యను అధికముకానీయక అరికట్టుచున్నది. ఈనాటి ఆణ్వాయుధములందును, ఖండాంతరవేధులందును, మారణాయుధములందును శివతేజస్సే, అగ్నిరూపమునఁగలదు. పైకారణములచే పరమశివుడు హన్తృ నామకుడై నమస్కరింపబడుచున్నాడు.

### విష్ణుః-

జగద్రక్షణకై విష్ణువు దశావతారములనుదాల్చి, సోమకహిరణ్యాక్షాది రాక్షసులనెందఱినో సంహరించెను. "అణోరణీయాన్మహతో మహీయాన్" అను శ్రుతిచేఁదెలియు అణుశక్తి విష్ణుతేజస్సే విష్ణువు మహాహన్తకావుననే విష్ణు సహస్రమున "సర్వశస్త్రభృతాంవరః" "సర్వప్రహరణాయుధః" అను

నామముతోఁ బేర్కొనఁబడెను. "విదారణః" అను విష్ణునామమునకు సమస్త మును జీల్చిచెండాడువాడని యర్థముకలదు. "అణుర్బృహత్" అను సూక్తిలో విష్ణువు అణుశక్తిగాఁబేర్కొనఁబడెను. కావున విష్ణువునకు "హన్తృ"నామము చెల్లునని తెలియుచున్నది.

సం

"హన్తృ" నామమున "హ్+అ+న్+త్+ఋ" అని యైదక్షరములుకలవు. అవి పంచాగ్నులను బంచకోశములను సూచించును. ఇందలి హకారము శివబీజము నకారతకారములు సావిత్రీవాస్తుబీజములు. అవి సకల దేవబీజముతోడను బ్రహ్మబీజముతోడనుగూడియున్నవి. పైనామము నుపాసించువారు పాపవినాశకులు, పితృగ్రహవినాశకులును అగుదురు. అంతేకాదు శక్తిశివులు ఇరువురును సంహారకరులేకాన ఈనాటిమారణాయుధ విశేషములన్నింటిని దయామచేయుటకు పైలైనయంత్రములను సృష్టించఁగలవారలు అగుదురని తెలియుచున్నది.

## 218 నామము- శివ:- "నమోహనీయచ"

భ. భా. భా:— మహాదేవుడు విశ్వాతిశాయి బలముకలవాడై జీవులకన్నిటికిని ప్రభువుగానుండెను. అతనితేజస్సును ఏతేజస్సుమించలేదు. అందుచే అతని చేతనే మహాప్రళయమున సమస్తబ్రహ్మాండమును, సంహరింపఁబడును. కావున "హనీయాన్" అను నామము ఆతనికి సార్థకమాయెను.

విష్ణు:.

"తమేవభాన్తమనుభాతిసర్వమ్" ప్రకాశించునట్టి ఆతనిని అనుసరించియే సర్వమును బ్రకాశించుచున్నది. "యదాదిత్యగతంతేజః" సూర్యకాంతి సర్వత్రవ్యాపించినట్లే విష్ణుతేజస్సు సర్వత్రవ్యాపించును. అందుచే విష్ణువునకు "జ్యోతిర్గణేశ్వరః" అను నామము సహస్ర సూక్తులలోఁగలదు. సకల తేజోగణములకును అతడే ఈశ్వరుడు కావున అతడే సర్వమును అతిశయముగా సంహరించుచున్నాడు ఆందుచే విష్ణువునకు "హనీయాన్" అను నామము సార్థకమాయెను.

***బీజాక్షరసంపుటి:-***

"హనీయాన్" అను నామమున "హ్ + అ + న్ + ఈ + య్ + అ + న్" అనియేడు అక్షరములుకలవు. అవి సప్త వాయుమండలములను, మనోబుద్ధులతోడి పంచేంద్రియములనుసూచించును. ఇందలి హకారము సర్వసంహారక శివబీజము మాయాశక్తిపరాశక్తి బీజములు అకారేకారములు. వాని మధ్యను వాయుబీజముతోఁగూడిన సావిత్రీబీజములు రెండుకలవు. శక్తినుండి యేర్పడిన బ్రహ్మాండమును శివసహితయై మాయాస్వరూపిణియైన పరాశక్తియే సంహరించును. అజ్ఞానధ్వంసమునొనర్చి, జ్ఞానమొసంగునది సావిత్రీదేవి. అమెయే పాపవినాశిని. ఇదిశక్తిప్రధానమైన నామము. ప్రాణాయామక్రియలో శక్తిసహిత శివునుపాసించి, తపోఽగ్నిజ్వాలలతోసర్వమును సంహరింపఁగలరు. అంతేకాదు. బ్రహ్మాండధ్వంసకసకల మారణాయుధములను నిర్మింపఁగలరు. సకలరోగనివారకౌషధ నిర్మాతలై సర్వమును రక్షింపఁగలరని తెలియుచున్నది.

## — 7. వ. యజుస్సు —

***"నమోవృక్షేభ్యోహరికేశేభ్యః"***

***అర్థము:-***

వృక్షేభ్యః = కల్పవృక్షాదిస్వరూపుడును, హరికేశేభ్యః = హరితవర్ణములును, కేశసదృశములునగు ఆకులుగల వృక్షములు స్వరూపముగాఁగలవాడునగు శివునకు, నమః = నమస్కారము.

***తాత్పర్యము:-***

సా. భా:— పరమేశ్వరుడు సకల సస్యలతాగుల్మ వృక్షస్వరూపుడు. కేశసదృశములై అకుపచ్చగానుండు ఆకులుగల కల్పవృక్షాదులును శివ

స్వరూపములే. కావున జీవకోటి కవసరమగు ఆహారమునిచ్చిపోషించియు, కల్పవృక్షస్వరూపుడై సకలకాంక్షలను నెఱవేర్చుచున్నాడు. అందుచేనిత్యము ఆతనిని నమస్కరింతురు.

## 219, 220. నామములు- వృక్షేభ్యః, హరికేశేభ్యః

అను రెండునామములకు, శివ, విష్ణు, బీజాక్షరసంపుటిపరముగాఁగల అర్థ వివరణములు ఇంతకుమున్ను వివరింపఁబడెను.

### -: 8. వ. యజుస్సు :-

### "నమస్తారాయ"

**అర్థము:-**

తారాయ = ఓంకారరూపమైన ప్రణవముచేఁ బ్రతిపాదింపఁబడు శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— ఋగ్యజుస్సామవేదస్వరూపమగునట్టియును, అకార, ఉకార, మకారాత్మకమునగు ప్రణవముచే మహాదేవుడు ప్రతిపాదింపబడును. కావున ఆతనికి నమస్కారము.

## 221 వ. నామము- శివః- "నమస్తారాయ"

భ. భా. భా:— మహాదేవుడు జననమరణస్వరూపమైన సంసారమునుండీ జీవులను తరింపఁజేయును. సంసారము సముద్రమువలె గంభీరము; మహా జంతువులను బోలినకష్టములతో నిండియుండును. అట్టి సంసారబాధలు లేకుండ జీవులను తరింపఁజేయువాడు పరమ శివుడు

అత్రహి జంతోః ప్రాణైరుత్క్రమమాణస్య రుద్రస్తారకం బ్రహ్మ వ్యాచష్టే"
అను జాబాలోపనిషత్సూక్తిలో మహారుద్రుడు ప్రాణోత్క్రమణము (ప్రాణాలు పోవుట) పొందినప్పుడు తరింపఁజేయుటకు జీవులకు బ్రహ్మోపదేశించెనని కలదు. అందుచే రుద్రుడు తారకుడు అంతేకాదు. శివుడు నాల్గుఆశ్రమముల వారిని సకల జాతులవారిని తరింపఁజేయుటకుఁ త్రిగుణాత్మక ప్రణవరూపము దాల్చెను తారమే తారకము — కంటిలోని నల్లగ్రుడ్డు శివుడు జీవులనేత్రము లందు నల్లగ్రుడ్డురూపమునను, అందు తేజోరూపమునను ఉండి, అంధకారము నుండియు, అజ్ఞానమునుండియు జీవులను తొలగించును. తారము అనగా నాదము. అతడు ఘంటలో నాదరూపముననుండి, జీవులదృష్టిని తనపై మరల్చి, భక్తిజ్ఞానములను ఒసంగి వారిని రక్షించును. పైకారణములచే మహా దేవుడు తారకనామధారియై నమస్కరింపఁబడును.

విష్ణుః —

విష్ణువు జగద్రక్షకుడు. తనపాలనలోఁగల జీవులను జ్ఞానవంతులఁ గావించి, గర్భనరకమునుండియు, జన్మదుఃఖమునుండియు, జరామరణముల నుండియు, వాటిల్లుభయమును తొలగించి, తనలోఁజేరుటయను ముక్తిని ఒసంగును. ప్రహ్లాదుడు, ధ్రువుడు, గజేంద్రుడు మున్నగు భక్తులగాథలు పైవిషయమునకుఁదార్కాణము. కావుననే "ఆశోకస్తారణస్తారః" అను విష్ణు సహస్రసూక్తిలో విష్ణుపరముగాఁ దారనామము పేర్కొనఁబడెను. శ్రీరామ చంద్రుడు జీవులకు మార్గదర్శకుడుగాఁ బ్రవర్తించి, సద్విషయములు బోధించి, తరింపఁజేయుటచే దాను "తార" నామకుడాయెను. అందుచేతనే అతనికిఁ జెందిన శ్రీరామనామమును తారకమంత్రముగాఁ బెద్దలు చెప్పుదురు. సప్తర్షులు బోధించి, ఉపదేశించిన రామనామక తారకమంత్రమును జపించుటచేతనే, దారులుకాచి దోపిడీలు హత్యలును జేసిన బోయవాడు, వాల్మీకియై శ్రీమద్రా మాయణమును రచించి, ఆదికవియాయెను. అవతారపురుషుడైన శ్రీరాముడు విష్ణువే కాన తారనామము అతనికిఁజెల్లును. తారనామమే వ్యాకరణమున "క"

ప్రత్యయముచేరుటచేఁ దారకనామమాయెను. అంతేకాదు. విష్ణువు ప్రణవ స్వరూపుడై జీవులను సంసారసాగరమునుండి దరిచేర్చి, రక్షించుననుటకు "ఋచేలుని" గాథయేతార్కాణము కావుననే "తారణస్తారస్సవితా ప్రపితామహః" అను విష్ణుసహస్రసూక్తిలో దారనామము విష్ణుపరముగాఁ జేర్కొనబడెను కావున విష్ణువుకూడ తారనామకుడాయెను.

*బీజాక్షరసంపుటి:-*

తారనామమున "త్ + అ + ర్ + అ" అని నాల్గక్షరములుకలవు. అవి చతురగ్నులను, అంతఃకరణచతుష్టయమును సూచించును. పైనామమును అగ్నిప్రధానముగా నుపాసించి ఆయురారోగ్యైశ్వర్యాదులను బొందఁగలరు. అగ్నిమాంద్యము, రక్తరోగము, తెల్లమచ్చలు, బొల్లి మున్నగురోగములను నివారించుకొనఁగలరు. పరులకుఁ బ్రాప్తించిన రోగములను నివారింపఁగలరు. పరాశక్తిసహాయమున అగ్నిమండలమైన సూర్యమండలమునకును బోఁగల యంత్రములను నిర్మింపఁగలరు

— *6. వ. యజుస్సు* —

*"నమశ్శంభవేచమయోభవేచ"*

*అర్థము:-*

శంభవేచ = "శం" అనగా సుఖము నుత్పాదించువాడును, మయోభవేచ = లోకములకు సుఖమును భావించువాడునగు శివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా భా: — మహాదేవుడు సుఖహేతువు. అతనివలననే సుఖముకలుగుచున్నది. అతడు నిరతము లోకసుఖమునే మనస్సునభావించును. అందుచే అతనికి నమస్కారము.

## 222 నామము- *శివ:-* *"నమశ్శంభవేచ"*

భ. భా. భా:— పరమశివుడు సూర్యాగ్నిచంద్రేంద్రపర్జన్యస్వరూపుడగుటచే అతనివలననే లోకమునకు సుఖము కల్గుకారణముననను శంభుడాయెను. శం = ఆనందరూపసుఖము అతడేయని "ఆనందోబ్రహ్మేతివిజానాత్" అను శ్రుతివలనఁ దెలియుచున్నది. సుఖమార్గద్రష్టయునాతడే. కాన అతనికి శంభునామము ఏర్పడెను; అని తెలియుచున్నది.

విష్ణు:—

"స్వయంభూశ్శంభురాదిత్యః" అను విష్ణు సహస్రనామాక్తిలో శంభు నామము విష్ణుపరముగాఁగలదు. విష్ణువు గజేంద్రాదిభక్తులకు సుఖమును జేకూర్చును. కావున శంభునామకుడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

శంభునామమున "శ్ + అ + మ్ + భ్ + ఉ" అని యైదక్షరములు కలవు. అవి వేదోక్తపంచఋతువులను బంచప్రాణములను సూచించును. పైనామమున లక్ష్మీబీజము అకారమకారములతోడను, భార్గవబీజము ఉకారముతోడనుగూడియుండుటచేఁ బైనామమును వాయుచక్రమున ఉపాసించి, భూమిలోనను జలమునందునుగల సకల సంపదలను, సకలవిద్యలను బొందఁ గలడని తెలియుచున్నది. తన్మూలమున సకల సుఖములను బొందఁగలడని యును దెలియుచున్నది. అంతేకాదు. వాతరోగములను రక్తపుఁబోటు పాండువు మున్నగురోగములను స్వయముగాఁ బోఁగొట్టుకొనుటయేకాక, పరులకువాటిల్లి నను బైరోగములను బోఁగొట్టఁగలడనియును దెలియుచున్నది.

## 223 నామము శివ:- "నమోమయోభవేచ"

భ. భా. భా:— మయమును అనగా ఐహికాముష్మిక సుఖములను జీవులకు జేకూర్చువాడు పరమేశ్వరుడే. అతనిదయవలననే ప్రాణులు భూలోకమున సకల సుఖములను భార్యాపుత్రాదులవలనను, భూభవనకనకవస్త్రాదుల వలను అనుభవించుచున్నవి. అతని ప్రేరణచేతనే సత్కార్యములనాచరించి, ఆముష్మికమును అనగా స్వర్గలోకసౌఖ్యమును బొందుచున్నవి. అతడు అభ్యుదయరూపముననను, మోక్షరూపముననుండి, జీవులకు అనుఖమును జేకూర్చుచున్నాడు. తుదకు మయరూపమున అనగా ఒంటెలరూపముననుండి, ఎడారులలోఁ బయనించువారికి, సుఖమును జేకూర్చుచున్నాడు. మయము అనగా

అశ్వము పరమశివుడు అశ్వరూపముననుండి రాజాదులకు యుద్ధములు మున్నగువానిలో, దోడ్పడి, విజయరూపసుఖము నుజేకూర్చుచున్నాడు. కావున శివుడు మయోభవనామకుడై నమస్కరింపఁబడుచున్నాడు.

*విష్ణు:*—

మహాశివుడేకాదు, మహావిష్ణువుకూడ గజేంద్రునికిఁ ప్రాణరక్షణ మొసంగియు, కుచేలునకు సంపదలనొసంగియు, ధ్రువునకు శాశ్వతమండలము నొసంగియుఁ, బ్రహ్లాదునకు అగర్భవిజ్ఞానమును ప్రాణప్రమాదవిముక్తిని శాశ్వతానందమును జేకూర్చి ఇహపరలోక సౌఖ్యప్రదాతయని ప్రతిష్ఠ నఁదినాడు.

శ్లో॥ జ్ఞానానందమయందేవం నిర్మలస్ఫటికాకృతిం।
ఆధారం సర్వవిద్యానాంహయగ్రీవముపాస్మహే॥

అను సూక్తిని బరిశీలించినచో మహావిష్ణువు మయోభవుడు అశ్వముఖుడు అనగా హయగ్రీవుడై భక్తులకు నిర్మలస్ఫటికారమును బ్రదర్శించి, సర్వవిద్యలను, జ్ఞానాందమునొసంగి సౌఖ్యదాతయైనట్లు తెలియుచున్నది. మయుడురూపమున నుండి పాండవులకు నవరత్నమయభవనమునొసంగి సుఖము చేకూర్చినాడు. శ్రీకృష్ణరూపముననుండి వారికి విజయమును మోక్షమును ఒసంగినాడు. మయోభవుడు సుఖదుడు అను నామములు సమానార్థకములు. కావుననే "సుఖదోనైకదోఽగ్రజః" అను విష్ణు సహస్రసూక్తిలో సుఖదనామము విష్ణు పరముగానున్నది. అందుచే ఆతనికి మయోభవనామము చెల్లునని చెప్పవచ్చును.

*బీజాక్షరసంపుటి*—

"మయోభవ" నామమున "మ్+అ+య్+ఓ+భ్+అ+వ్+అ" అని ఎనిమిదక్షరములుకలవు. అవి అష్టవిధప్రకృతిని, శరీరస్థాష్టచక్రములను

సూచించును. ఇందు మదనబీజము అకారముతోడను, వాయుబీజము ఈశ్వర బీజమైన ఓకారముతోడను, భార్గవవరుణబీజములు ఆకారముతోడను గూడియున్నవి. ఈనామము నుపాసించువారు, ఇహపరలోకసుఖములను, ప్రాణాయామధారణశక్తిని, జలప్రేషణశక్తినిబొందఁగలరు. అంతేకాదు. అష్టైశ్వర్యములను, సకల విద్యలను భూమిలోని సకలవస్తుజాలమును బొంద గలరు. చర్మరోగములను, వాతరోగములను, రక్తదోషరోగములను, భూతాది బాధలను, జలోదరాదిరోగములను బోఁగొట్టుకొనఁగలరు. వాయుశక్తి సహాయ మునఁ జిన్నమెదడుకుఁజెందినరోగములను దొలగించుకొనఁగలరని తెలియు చున్నది.

## — 10. వ. యజుస్సు —

*"నమశ్శంకరాయచమయస్కరాయచ"*

**అర్థము:-**

శంకరాయచ = విషయసుఖమునుజేకూర్చువాడును, మయస్క రాయచ = మోక్షసుఖమును జేకూర్చువాడునగు శివునకు, నమః = నమస్కా రము.

**తాత్పర్యము:-**

సా. భా:— విషయసుఖమని, మోక్షసుఖమని సుఖమురెండు విధ ములు. పైమంత్రమున జీవులకు ఈరెండు సుఖములను బరుఁడచే జేకూర్చి నట్టుకలదు. ఇందుఁదానే స్వయముగావానిని జేకూర్చినట్టు చెప్పఁబడెను. తల్లిదండ్రులుమున్నగు వారిరూపమున లౌకిక సుఖములను జీవులకు మహే

శ్వరుడుచేకూర్చెను. ఆచార్యుడు, శాస్త్రము మున్నగువానిరూపమున జీవులకు మోక్షసుఖమును ఈశానుడే చేకూర్చెను. ఈవిషయము శివపురాణము, హర విలాసము అనెడి సంస్కృతాంధ్రగ్రంథములవలనఁ దెలియుచున్నది. కావున ఆ శివుని అందఱును నమస్కరించుచున్నారు.

## 224 వ. నామము- "నమశ్శంకరాయచ"

సూచన:—

ఈ శంకరనామముయొక్క అర్థము శివ విష్ణు బీజాక్షరసంపుటిపరముగా ఇంతకుమున్నే వివరింపఁబడెను.

## 225 నామము:- శివ+విష్ణు:- "నమోమయస్కరాయచ"

మయోభవానామార్థమునందే మయస్కరనామార్థము ఇమిడియున్నది. అందే ఈమయస్కరనామార్థము శివ విష్ణుపరముగా వివరింపఁబడెను.

*బీజాక్షరసంపుటి*—

మయస్కరనామమున మ్+అ+య్+అ+స్+క+అ+ర్+అ" అని తొమ్మిదక్షరములుకలవు. ఇవి నవగ్రహములను, శరీరస్థ నవద్వారములను సూచించును. ఈనామము నుపాసించువారు వాయ్వగ్నిస్వరూపిణియగు శక్తినిధ్యానించి, సకాలవర్షములు కురిపించియు, కృత్రిమమార్గమున సైతము వర్షము కురిపించియుఁ బంటలు పండింపఁగలరు. జీవులకు శివుడు సకల విధ సుఖములను జేకూర్చునని తెలియుచున్నది.

## -: 11. వ. యజుస్సు :-

### 'నమశ్శివాయచ శివతరాయచ"

*అర్థము:-*

శివాయచ = కల్యాణస్వరూపుడై, స్వయముగా నిష్కల్మషముగానుండు నట్టియును, శివతరాయచ = మిక్కిలి కల్యాణస్వరూపుడుగానుండునట్టి శివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:— మహాదేవుడు అష్టసిద్ధులుకలవాడు కావున లోకములకు 'స్వయముగాఁ గల్యాణమునొసంగఁగలడు. అంతయధికముగా జీవులకుఁ గల్యాణము చేకూర్చువాడు ఇంకొకడులేడని తెలియుచున్నది.

### 226 నామము- శివ- "నమశ్శివాయచ"

వ. భా. భా:— మహాదేవుడు నిష్కల్మషుడును, సత్వరజస్తమోగుణహీనుడునగుచున్నాడు. కల్యాణస్వరూపుడాతడే అభ్యుదయము, నిశ్శ్రేయసము (మోక్షము) అనెడికల్యాణములను శివుడు జీవులకుఁ జేకూర్చును. "శివః పంథాశ్శివోఽభ్యుపాయః" అను సూక్తిచేఁ గల్యాణమార్గస్వరూపుడును, గల్యాణప్రాప్తికి ఉపాయమైనవాడును శివుడేయని తెలియుచున్నది.

"శివఏకోధ్యేయః, శివంకరస్సర్వమన్యత్పరిత్యజ్య"
అన్యమును సర్వమునువిడిచి, శివునొక్కనేధ్యానింపవలెను; అతడే శివంకరుడు అని అథర్వశిఖావచనముచేఁ దెలియుచున్నది.

శ్లో॥ సమేధయతియన్నిత్యం సర్వార్థాన్సర్వకర్మసు।
శివమిచ్ఛన్ మనుష్యాణాంతస్మాద్దేవశ్శివస్స్మృతః"

అనెడి మహాభారతవచనముచే శివుడొక్కడే సర్వకర్మలందును విజయము చేకూర్చుచు, నిత్యము జీవుల సర్వార్థములను వృద్ధిచేయుచున్నాడనియును, అతడే మనుష్యులకుఁ గల్యాణము కలుగవలెననికోరుచున్నాడనియును,అందు వలన ఆదేవుడే శివుడని తలంపఁబడుచున్నాడనియును దెలియుచున్నది. సజ్జనమనస్సులు శివునియందేకలవు కాన శివుడాయెను. ఇవ్విధంబున శివ నామము అతనికిఁజెల్లును.

విష్ణు-

విష్ణువు సత్త్వరజస్తమోగుణాతీతమైన శుద్ధస్వరూపముకలవాడు. కావున "సర్వశ్శర్వశ్శివస్థాణుః" అను సహస్రసూక్తిలో శివనామము విష్ణుపరముగా గలదు. "సబ్రహ్మసశివః అను శ్రుతిలోఁ త్రిగుణాతీతుడైన విష్ణువు బ్రహ్మగా, శివుడుగాఁబేర్కొనఁబడెను. తననామమును స్మరించుభక్తులను పావనము చేయువాడు కావున "క్షేమకృచ్ఛివః" అను విష్ణు సహస్రసూక్తిలో శివ నామము విష్ణుపరముగాఁ బ్రయోగింపఁబడెను. అంతేకాదు. పరమానంద రూపుడై శాంతించుకారణమున విష్ణువు శివుడాయెను. నిర్వికారుడై సజ్జ మనస్సులో మహావిష్ణువుశయనించును. శుభప్రదుడై భక్తులను రక్షించును. పైకారణములచే విష్ణువునకును శివనామము సార్థకమాయెనని తెలియుచున్నది

*బీజాక్షరసంపుటి:-*

శివనామమున "శ్ + ఇ + వ్ + అ" అని నాల్గక్షరములుకలవు. ఇవి చతురగ్నులను అంతఃకరణచతుష్టయమును సూచించును. జలచక్రమున లక్ష్మీప్రధానముగాఁ బైనామము నుపాసించువారు సకల సంపదలను బొంద గలరు. రోగనాశకులుకాఁగలరు. జలమందలి ధనధాన్యములను వస్తుజాతమును గనుగొనఁగలరు; అని తెలియుచున్నది.

## 227 వ. నామము:- శివ+విష్ణు- "నమశ్శివతరాయచ"

అత్యంతశుభంకరులైనకారణమున శివతరనామము శివకేశవులను ఇరువురిని దెలియఁజేయును.

*బీజాక్షరసంపుటి—*

శివతరనామమందలి యెనిమిదక్షరములును అష్టవిధాగ్నులను, అష్ట చక్రములను సూచించును. శివనామముకంటె శివతరనామమున వాస్తు బీజాగ్నిబీజములు అధికముగాఁగలవు. జలాగ్నిచక్రములందు లక్ష్మీరూపశక్తిని ధ్యానించుచు ఈనామము నుపాసించినవారు, మహదైశ్వర్యసంపన్నులును యంత్రసహాయమునను మంత్రశక్తితోడను జలాగ్నిప్రకోపముచేఁ గల్గువ్యాధు లను నివారింపఁగలవారలగుదురు జలాగ్నిప్రమాదనివారకయంత్రనిర్మాత లును ఉదజని, అణువున్నగువానితో నిండినయంత్రములను నిర్మింపఁ గలవారలై శత్రుభయంకరులుకాఁగలరని తెలియుచున్నది.

### -: 12. వ. యజుస్సు :-

### "నమస్తీర్థ్యాయచకూల్యాయచ"

*అర్థము:-*

తీర్థ్యాయచ = ప్రయాగాదితీర్థములందు సన్నిహితుడైయుండునట్టియును, కూల్యాయచ = నదీతీరములందుఁ బ్రతిష్ఠింపఁబడిన లింగరూపముననుండునట్టి శివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:— మహాదేవుడు తన భక్తులను నిష్కల్మషులుగాఁ జేయుటకుఁ బ్రయాగాదితీర్థములందు సన్నిహితుడైయుండెను. అతడు గంగాదిపుణ్యనదుల

తీరములందులింగరూపమునఁ బ్రతిష్ఠింపఁబడియుండి తనభక్తులనుగాపాడు
చుండెను. అందుచే అతని నమస్కరించుచున్నారు.

## 228 వ. నామము- శివ;- "నమస్తీర్థ్యాయచ"

భ. భా. భా:— మహాశివుడు ఆధారవిశేషవశమున జగత్తును అనుగ్రహించు
చున్నాడు; అని ఋపుడుచెప్పెను. తీర్థముఅనగాఁ బ్రయాగాదిపుణ్యక్షేత్రము.
అందుఁదనమహిమనుంచి పరమేశ్వరుడు జీవుల నుద్ధరించుచున్నాడు. కావున
దీర్థ్యనామకుడాయెను. తీర్థము అనగా గురువు. శివుడు గురువుగానుండి, సకల
మునులకు జ్ఞానమును, విద్యలను ఒసంగెను. అదియే శివుని దక్షిణామూర్తి
స్వరూపము. అందుచేఁ దీర్థ్యనామకుడాయెననియుఁ దెలియుచున్నది. అంతే
కాదు తీర్థమునందు అగ్నిలోఁ దనతేజస్సునుంచి, రక్షించెను. కావునఁ దీర్థ్య
నామకుడై శివుడు నమస్కరింపఁబడుచున్నాడనియును జెప్పవచ్చును.

విష్ణు-

తీర్థపదమునకు శాస్త్రమనియు నర్థముకలదు. శాస్త్రములందు శివమహి
మతోఁ బాటు, విష్ణుమహిమయుఁ బేర్కొనఁబడెను తీర్థములను శాస్త్రాదివిద్య
లను హయగ్రీవరూపమున విష్ణువు లోకములకొసంగెను. అందుచేతనే
"మనోజవస్తీర్థకరః" అను విష్ణుసహస్రసూక్తిలోఁ దీర్థకరనామము విష్ణుపర
ముగాఁ బేర్కొనఁబడెను తీర్థకరతీర్థ్యనామములు సమానార్థకములని తెలియు
చున్నది. కావున విష్ణువునకును దీర్థ్యనామముచెల్లును ప్రయాగాదితీర్థము
లందుండి, విష్ణువు జీవులనుద్ధరించుచున్నాడు. కావున దీర్థ్యనామకుడై విష్ణువు
నమస్కరింపఁబడుచున్నాడు.

*బీజాక్షరసంపుటి:-*

తీర్థ్యనామమున "త్+ఈ+ర్+థ్+య్+అ" అని ఆరక్షరములు కలవు. అవి షడ్రుతువులను షట్చక్రములను సూచించును. అగ్నిస్వరూపిణి యగుకుండలినీశక్తిని ప్రాణాయామప్రక్రియలో ఈశరీరయంత్రమున ఉత్థాపించి, పైనామమును జపించి, ఈంకారవాచ్యయగుశక్తిని వశపఱచుకొని ఆమె మహిమవలన ఉపాసకులు ధర్మసంస్థాపనచేయఁగలరు. అణిమాదిశక్తులను ఆర్జించుకొని వాయ్వగ్ని ప్రేషకయంత్రములను సృష్టింపఁగలవారలగుదురు; అని తెలియుచున్నది

## 229 నామము శివ:- "నమఃకూల్యాయచ"

వ. భా. భా:— కావేరి మున్నగు మహానదీతీరములందు లింగ రూపమున మహాదేవుడుకలడు. కాశీవిశ్వేశ్వరుడు అందులకుఁదారాగ్కణము.అందుచే శివుడు కూల్యనామకుడాయెను పంచభూతముల రూపమున జీవులనావరించియుండఁదగినవాడు మహాదేవుడు. కావున, గూల్యనామకుడాయెను. "కూల=అవరణే" అను ధాతువునుండియేర్పడిన కూలపదమునకు ఆవరించియుండువాడని యర్థముకలదు.

*విష్ణు:*

కూలమనగా జలాశయము. కాళీయుడను సర్పరాజు యమునానదీ జలాశయమునందుండెను. అతడు ఆనదీతీరవాసులగు గోగోపాలకులను, ప్రాణులను ఆప్రాంతమున సంచరింపవీలుకలుగనీయక, తనవిషాగ్నిజ్వాలలచేఁ బీడించుచుండెను. దానిబారినుండి తప్పించి, వారిని రక్షించుటకు, ఆకాళీయుని అడంచుటకును, మహావిష్ణువు ఆయమునాకూలమున దుమికి, అందుండి వానినడంచి, దూరముగాఁ బారద్రోలెను. అందుచే విష్ణువుకూల్యనామకుడాయెను. అంతేకాదు. కూల్యుడనగా జీవుల హృదయమునను జఠరాగ్ని

రూపమున అవరించియున్నవాడనియునర్థముకేదు. "అహంవైశ్వానరో భూత్వాప్రాణినాందేహమాశ్రితః" నేనువైశ్వానరుడనై (అగ్నినై) ప్రాణుల దేహములనాశ్రయించి, అవరించియున్నవాడనని చెప్పిన గీతాసూక్తియే అందులకుఁ బ్రమాణము. అంతేకాదు.

"అంతర్బహిశ్చతత్సర్వంవ్యాప్యనారాయణస్థితః"

అను శ్రుతిలో ప్రాణులదేహాంతర్బహిర్భాగములను వ్యాపించినారాయణుడు = విష్ణువు, కలడని చెప్పఁబడెనుగదా! కావున విష్ణువుకూల్యనామకుడై నమస్కరింపఁబడుచున్నాడు.

*బీజాక్షరసంపుటి-*

కూల్యనామమున "క్ + ఊ + ల్ + య్ + అ" అని ఐదక్షరములు కలవు అవి పంచభూతములను, ఐంచకోశములను సూచించును. ఈనామము నుపాసించువారు భూచక్రమున వాయుధారణమొనర్చి, ప్రజాపతినిధ్యానించి నూతనవస్తుసృజనశక్తిని సంపాదింపఁగలరు. భూతాదిబాధలను దొలగింపఁ గలరు. భూమిపైని కృత్రిమవర్షముకురిపించఁగలవారలై, వాతరోగాదులను దొలగించి, అనందకరులుకాఁగలరని తెలియుచున్నది. యోగదృష్టితో భూమిలోనున్న వస్తుజాలమునుగనుగొనఁగలవారలగుదురు.

## -: 13. వ. యజుస్సు :-

"నమఃపార్యాయచావార్యాయచ"

**అర్థము:-**

పార్యాయచ = సంసారసముద్రమువాటించి, మోక్షకాములచే ధ్యానింప దగినవాడును, అవార్యాయచ = సంసారమధ్యముననున్నవారికిఁ గామ్యఫల

ముల నొసంగువాడునగు శివునకు, నమః = నమస్కారము.

తాత్పర్యము:-

సా. భా:— సంసారము సముద్రమువంటిది. అందుఁగల భార్యాపుత్రాదులు మకరాదులను, బోలినవారు. వారినుండివాటిల్లుచిక్కులను గష్టములను బోగొట్టుకొని మోక్షమును బొందఁగోరినవారు పరమేశ్వరుని ధ్యానింతురు. అతడు వారిని సంసారసముద్రతీరము చేర్చిరక్షించును. అవారము అనగా అర్వాక్తీరము. అదియే సంసారమధ్యము. అందుండి జీవులు కామ్యఫలములను అపేక్షింపగా మహాదేవుడు భక్తులు వాంఛించుకోరికలను దీర్చును.

## 230 నామము- శివ:- "నమఃపార్యాయచ"

భ. భా. భా:— పార = తీరకర్మసమాప్తౌ" అనుధాతువునుండి, "పార" అనుపదమేర్పడెను. పారమందుండువాడు పార్యుడు. అనగా మోక్షకాములై తనను అర్థించుభక్తులకర్మలను నశింపఁజేసి, సంసారదుఃఖములను బాపి, పరమశివుడువారిని రక్షించును. అందులకే అతడు నద్యాదులతీరములందు లింగరూపముననుండి, భక్తులకు సులభుడగును. కావున శివుడు పార్యనాముకుడాయెను.

విష్ణు:-

పరము అనగా ఉత్తమమగు వైకుంఠస్థానము. అందుండుటచే విష్ణువు పార్యుడాయెను. గోదావర్యాది మహానదుల పారమందుండు భద్రాచలాది క్షేత్రములందు భగవంతుడు శ్రీరామాదులరూపములనుండి, భక్తులను గాపాడును. తీరకర్మసమాప్తిలో మునిగియుండును. అర్జునుడు, తిన్నడు మున్నగు భక్తులను గాపాడి, మోక్షమొసంగుకారణమున విష్ణువు పార్యనాముకుడాయెను.

*బీజాక్షరసంపుటి:-*

"పార్యనామమున "ప్+ఆ+ర్+య్+అ" అని ఐదక్షరములు కలవు. అవి పంచాగ్నులను పంచకోశములను సూచించును. ఈనామమును వాయ్వగ్నిప్రధానముగా వాయుస్థానమున ఉపాసించినచో ఉపాసకులు వాయ్వగ్నిశక్తి సంపన్నులై ముక్తులుకాఁగలరు కృత్రిమమేఘస్రష్టలై వర్షము కురిపించఁగలవారలగుదురు. అగ్నిమాంద్య వాతరోగాదినివారకులుకాఁగలరు. భూతప్రేతపిశాచాది బాధానివారకులునుగాఁగలరని తెలియుచున్నది.

## *231 నామము:- శివ— "నమోఽవార్యాయచ"*

భ. భా. భా:— అవారముఅనగా సముద్రముయొక్క అర్వాక్తీరము. విశుద్ధమైన సముద్రతీరమునకుఁ బారము అనిపేరు. విశుద్ధులైన శివారాధకులు అందుండి ముముక్షువులు అగుదురు. అవిశుద్ధమైన (అపవిత్రమైన) సముద్రతీరమునకు అవారమనిపేరు. అందుండు జీవులు ఐహికవాంఛలతోనుందురు. వారు పరమశివుని బూజించి, కామ్యఫలములను బొందుదురు. సర్వాంతర్యామియైన పరమశివుడు ఆజీవులను రక్షించుచుండును. కావున అవార్యనామకుడాయెనని తెలియుచున్నది.

*విష్ణు:*

"నవిద్యతే, వాః = జలంయత్రతదవారమ్" అను వ్యుత్పత్తిచే నీరు లేనితావునకు అవారమనిపేరున్నట్లు తెలియుచున్నది. అవారములు అనగా, శేషాద్రి, భద్రాద్రిమున్నగు పర్వతములు. వానిపై, విష్ణు, శ్రీవేంకటేశ్వర శ్రీరామాదినామములతోనున్నవాడు. అందుచే విష్ణువు అవార్యనామకుడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

అపార్యనామమున "అ+వ్+అ+న్+య్+అ" అని ఆరక్షరములు కలవు. అవి షడృతువులను, షట్చక్రములను సూచించును. ఈనామమును శక్తిప్రధానముగా నుపాసించినవారు జలాగ్నివాయురూపధారులై భగవంతునిలో(జేర(గలరు. అంతేకాదు పరాశక్తికృపాలబ్ధవిజ్ఞానముచే జలసంచారక, అగ్నిగోళసంచారక, వాయుమండలసంచారక యంత్రనిర్మాతలుకా(గలరు. తన్మూలముగ నిధినిక్షేపాదులను వెలిబుచ్చ(గలరు. జలాగ్నివాయుప్రేషక యంత్రముల నిర్మింప(గలరు. జలాగ్నివాయుప్రకోపజనిత రోగనివారకులు కా(గలరని దెలియుచున్నది.

## -: 14. వ. యజుస్సు :-

*"నమః ప్రతరణాయచోత్తరణాయచ"*

*అర్థము:-*

ప్రతరణాయచ = ప్రకృష్టమైన (గొప్పవగు) మంత్రజపాదులయొక్క రూపమున( బాపతరణమునకు హేతువైనట్టియును, ఉత్తరణాయచ = తత్త్వజ్ఞానరూపమున సంపూర్ణముగా సంసారమునుండి దాటించువాడునగు శివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా: — భక్తులు మహాదేవునకు(జెందిన మంత్రజపాదులనాచరించి, పాపములనుండి తరించుచున్నారు. తత్త్వజ్ఞానమార్జించి, జననమరణరూప సంసారమునుండి, పూర్తిగాముక్తులగుచున్నారు. అట్టి శక్తినొసంగుటచే భక్తులు మహాదేవునే సేవింతురు.

## 232 నామము- శివ- "నమః ప్రతరణాయచ"

భ. భా భా:— తరణ మనగా బ్లవనము = తేలుట, దాటుట అని యర్థము ప్రకృష్టమైన తరణము ప్రతరణము. ఉత్తమయోనులలో జన్మించుటయే ప్రకర్ష. ఉత్తమాధమయోనులలో నెచట జన్మించినను, అజన్మ, బంధకారణమే యగును. అందుచే మహాదేవుడు తనను ఆరాధించినవారిని సంసారసముద్రమునుండి తరింపఁజేయుటకుఁ బ్లవమువలె (తెప్పవలె) ఉండును. వారి నుద్ధరించి, ముక్తులఁ గావించును. కావున శివుడు ప్రతరణనామకుడాయెను.

### విష్ణు:-

"అశోకస్తారణస్తారః" "తారశ్శ్వితా ప్రపితామహః" అను విష్ణు సహస్రనూక్తులలో "తారణః, తారః" అను పదములురెండును విష్ణుపరములుగాఁగలవు. విష్ణువుతనభక్తులను, సంసారగర్భ జన్మజరామృత్యువులనుండి తరింపఁజేయును. కావునఁ బైనామములు అతనికివీర్పడెను. "ప్రతరణుడు, తారణుడు" అను పదములు సమానార్థకములేకాన తరణనామము విష్ణువునకు జెల్లునని తెలియుచున్నది.

### బీజాక్షరసంపుటి—

ప్రతరణనామమున "ప్+ర్+అ+త్+అ+ర్+అ+ణ్+అ" అని తొమ్మిది అక్షరములుకలవు. అవి నవావరణలను, నవద్వారములను సూచించును. పైనామమును అగ్నిప్రధానముగా నుపాసించువారు నందికేశ్వరదయాపాత్రులై తరింతురు. వారు అగ్నిప్రేషకయంత్రలను, వర్షదాయకయంత్రములను సృష్టించి, దుష్టశిక్షకులుకాఁగలరని తెలియుచున్నది. అనేక విధయంత్రములను నిర్మించు ఇంజనీర్లు కాఁగలరని తెలియుచున్నది.

**233 వ. నామము:- శివ "నమఉత్తరణాయ"**

భ. భా. భా:— ఉత్తరణుడు అనగాఁ దాటించువాడు. సంసారమునఁ బడఁ ద్రోయుకామక్రోధలోభమోహమదమాత్సర్యములనుండి భక్తులను నిర్గమింప జేసి రక్షించువాడు కాన మహాశివుడు ఉత్తరణనామకుడాయెనని తెలియుచున్నది.

విష్ణు:—

"ఉత్తారణోదుష్కృతిహా" అను విష్ణుసహస్రసూక్తిలో ఉత్తారణపదము విష్ణుపరముగాఁగలదు. పరికింపగా "ఉత్తరణుడు, ఉత్తారణుడు" అను రెండు పదములును సమానార్థకములే. శివుడువలె విష్ణువును భక్తులను భవదుఃఖము నుండి తొలగించువాడే కాన ఉత్తరణనామకుడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి*—

ఉత్తరణనామమున "ఉ+త్+త్+అ+ర్+అ+ణ్+అ" అని ఎనిమిదక్షరములుకలవు. అవి అష్టసూర్యమండలములను, శరీరమందలి అష్ట చక్రములను సూచించును. ఇందలినందికేశ్వరబీజము ణకారము, వాయు వాస్తు అగ్నిబీజములతోఁగూడియున్నవి. దీనినుపాసించువారు వాయ్వగ్ని పురుషులతోఁగూడిన వాస్తుప్రభావముచే, సూర్యమండలాంతర్గతులై తరింపఁ గలరు. వాయుశక్తిపూర్ణయాత్రసహాయమున అగ్నిగోళములను జేరఁగలరు. అందులకు అవసరమగు యంత్రములను నిర్మింపఁగలరు. సేనానాయకులై శత్రువిజేతలుకాఁగలరని తెలియుచున్నది.

## — 15. వ. యజుస్సు —

## "నమఆతార్యాయచాలాద్యాయచ"

***అర్థము:-***

అతార్యాయచ = జీవరూపమున మఱల సంసారగమనమునకు అర్హుడై నట్టియును, అలాద్యాయచ = సంపూర్ణముగాఁ గర్మఫలమును అనుభవించు జీవుడైనట్టి శివునకు, నమః = నమస్కారము.

***తాత్పర్యము:-***

సా. భా:— సంసారవిముక్తిసాధనమైన తత్త్వజ్ఞానముకలిగినను దానినుపేక్షించి జీవులు కామ్యకర్మలను అనుష్ఠించుటకు సంసారమునే మఱలవచ్చి చేరుదురు. అట్లువచ్చిచేరుటనే అతారము అందురు మహాదేవుడు జీవరూపుడై సంసారమున జేరనర్హుడైయుండును కావున అతార్యుడాయెను. అలం = సంపూర్ణముగాఁ గర్మఫలమనుభవించును. అందుచే జీవునకు "అలం + అదుడు = అలాదుడు" అని పేరువాటిల్లెను. "తయోరన్యఃపిప్పలంస్వాద్వత్తి" అను శ్రుతిలో, జ్ఞాని, జీవుడు అను వారిలో అన్యుడైనజీవుడు కర్మఫలానుభవమునకై సంసారమునుజేరునని చెప్పఁబడెను. సంసారప్రేరకుడై సంసారబంధము ననుభవించు జీవుడుగానున్న శివుడు అలాద్యనామకుడాయెను. అతనికి నమస్కారము.

## *234 వ. నామము:- శివ "నమఅతార్యాయచ"*

భ. భా. భా:— ప్రారబ్ధాదికర్మములఫలము శేషించినచో దానిననుభవించుటకై జీవుడు సంసారమునుజేరును. శివుడు సంసారమున చైతన్యరూపముననుండి, సంసారస్థజీవులను అనుగ్రహించి, తరింపఁజేయును. అందుచే అతార్యనామకుడాయెను. అంతేకాదు. లోహములలో రజితము శివునితేజోరూపమైనరేతస్సు. అట్టి రజితరూపముననుండి జీవులనుద్ధరింపయోగ్యుడాయెను. "నమశ్శివాయ" యనెడి తననామమును స్మరించువారిని బుణ్యపాపములనుండి తరింపఁజేసిరక్షించును. జీవులకన్నులలో నల్లగ్రుడ్డురూపముననుండి దృష్టి నొసంగి శివుడు వారిని అంధకారమునుండి దాటించి, రక్షించును తారము అనగా నాదము పరమశివుడు నాదరూపుడై జీవులనానందపఱచును. తద్ద్వారా వారిని దరింపఁజేయనర్హుడైయుండును. కావున శివుడు అతార్యనామకుడై నమస్కరింపఁబడుచునాడు.

విష్ణు:—

తారము అనగాఁ గాంతి. అదియే ప్రకాశము. "ప్రభాస్మి శశిసూర్యయోః" అను గీతాసూక్తిననుసరించి, సూర్యచంద్రులలోఁగల కాంతిని విష్ణుతేజస్సుగా జెప్పవచ్చును. విష్ణువు ఆతారము అనగా సంపూర్ణమగు కాంతిగానుండి, జీవులను దరింపఁజేయనర్హుడై యుండెను. అందుచేతనే "అశోకస్తారణస్తారః" అను సహస్రసూక్తిలో తారణతారపదములు విష్ణుపరములుగానున్నవి. అందుచే విష్ణువు ఆతార్యనామకుడాయెను. తారలనగా నక్షత్రములు చంద్రుడునక్షత్రములలోఁ బ్రధానుడు అతడు విష్ణువిభూతి యను విషయము "నక్షత్రాణామహంశశీ" అను గీతాసూక్తిచేఁ దెలియుచున్నది. విష్ణువు చంద్రాది నక్షత్రముల రూపముననుండి, ఎడారులందును సముద్రమందును ప్రయాణించువారలకు మార్గదర్శకుడై తరింపఁజేయుచున్నాడు. కావున విష్ణువు ఆతార్యనాముడై నమస్కరింపఁబడుచున్నాడు.

***బీజాక్షరసంపుటి:-***

ఆతార్యనామమున "ఆ + త్ + ఆ + ర్ + య్ + అ" అని ఆరక్షరములుకలవు. అవి షట్కృత్తికలను షట్కర్మలను సూచించును. ఇందు వాయ్వగ్నిబీజములు పరాశక్తిబీజమైన అకారద్వయముతోడను, ఆకారము తోడనుగూడియున్నవి. ఈ నామమును శక్తిప్రధానముగా వాయ్వగ్నిస్థానములందు పాసించినచో ఉపాసకుడు వాయ్వగ్నిస్వరూపుడై శక్తిమహిమలనంది, వాయ్వగ్నులతో నడచుయంత్రములను, వాయ్వగ్నిప్రేషకయంత్రములను సృష్టించఁగలవాడగును. వాయ్వగ్నిదోషజనితరోగనిర్మూలకుడగునని తెలియుచున్నది

***235 నామము:- శివ:- "నమో౽లాద్యాయచ"***

భ. భా. భా:— అలాదపదమునకు సృష్టి, స్వర్గము అను నర్థములుకలవు. అలాదము అనగా సర్గము (సృష్టి) మాటిమాటికివి సంసారసాగరమున మునిఁ

వలె దిరుగుచునుండి, పరమశివుడు సృష్టిలోనుండియే ప్రళయమున సృష్టిని ధ్వంసముచేయును. జీవులను సంసారసాగరమునఁ బడద్రోసి సుడివలెఁ ద్రిప్పుచుహింసించును. పుణ్యఫలభోగానంతరమున స్వర్గమునుండి పడఁ ద్రోయును. జీవులను దరింపఁజేయువాడును, శిక్షించువాడును బరమశివుడే కావున ఆతనికి అలాద్యుడను నామమేర్పడెను. అందుచే ఆతనిని నమస్కరించుచున్నారు.

విష్ణు:—

"అంతర్బహిశ్చతత్సర్వంవ్యాప్యనారాయణస్థితః" అను శ్రుతిలోఁ జెప్పినట్లు విష్ణువు అలాదమున (సృష్టిలో) జేతనాచేతనరూపమునఁగలడు. అతడు తనభక్తులైన ప్రహ్లాదాదులను సైతము సంసారముద్రమున జొనిపి; పెక్కుకష్టములను అనుభవింపఁజేసి, తుదకు రక్షించెను. జీవులను రక్షించుటకు విష్ణువుతానును సంసారమున రామకృష్ణాదిరూపములఁ బ్రవేశించి, కష్టములను అనుభవించెను. స్వర్గమునఁ గలదేవతలను సైతము కర్మానుకూలముగాఁ గష్టములననుభవింపఁజేసి, రక్షించెను. కావున విష్ణువునకు అలాద్యుడను నామము ఏర్పడెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి*-

అలాద్యనామమున "అ+ల్+అ+ద్+య్+అ" అని అరక్షరములుకలవు. అవి షడృతువులను షట్కోశములను సూచించును. ఇందు పృథివీబీజమైన లకారమును దుర్గాబీజమైన దకారమును బరాశక్తిబీజమైన అకారమునుగలవు. ఆమూడును స్త్రీబీజములే కాన అవి ఇచ్ఛాక్రియాజ్ఞానశక్తులను మూడింటిని సూచించును. వివి వాయుసర్వదేవబీజములతోఁగూడియున్నవి. పైనామమును బృథివీచక్రమున దుర్గాప్రధానముగాఁ బ్రాణాయామక్రియలో ఉపాసించినచోవాడు శక్తిసహితపురుషునిలో లీనుడగును. ఈనామము నుపాసించువాడు ప్రాణశక్తిసహాయమున భూమిలోదూరి

అందుఁగల సకల వస్తుజాతమును వెలిబుచ్చఁగలడనియుఁ, జన్మరోగములను నిర్మూలింపఁగలడనియును దెలియుచున్నది.

## — 16. వ. యజుస్సు —

### "నమశ్శష్ప్యాయచ ఫేన్యాయచ"

*అర్థము:-*

శష్ప్యాయచ = గంగాతీరాదులలో జన్మించు కుశాంకురాదులకు అర్హుడై యున్నట్టియును, ఫేన్యాయచ = నదీమధ్యగత ఫేనమునకు అర్హుడైయున్నట్టి శివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:— శష్పములనగా బాలతృణాదులు. లేతగడ్డియున్నగునవి. వానిలో జేరినవే కుశదర్భాదులు. అవి గంగాతీరాదులలో జన్మించినపుడు గంగాది జలసారము వానిలో నుండును అందు దివ్యతేజస్సుఉండును. అది శివ స్వరూపము. అందుచేతనే కుశదర్భాదులను దేవపితృకార్యములందు ఉపయోగింతురు. అట్టి శష్పములను గుశదర్భాదులను బొందుటకు శివుడు అర్హుడై శష్ప్యనామకుడుఅయెను. నదీజలములరాపిడిచే నదీమధ్యమున, నురగవిర్పడును. అదియేఫేనము. అందుఁగల శ్వేతకాంతి శివకాంతియే. అందుచే శివుడు ఫేనమును బొందనర్హుడై ఫేన్యనామకుడై నమస్కరింపఁబడుచున్నాడు.

*236 నామము:- శివ— "నమశ్శష్ప్యాయచ"*

భ. భా. భా:—

"పవిత్రవంతః పరివాజమాసతే। పితైషాంప్రత్నో అభిరక్షతివ్రతమ్"

అను శ్రుతివలనఁగు శదర్భాదులకుఁ బలిత్రమనునామముకలదని తెలియు చున్నది. ఇందలి శష్ప్యపదముచేఁగుశదర్భాదులుచెప్పఁబడుచున్నవి. వానిలోఁగలతేజస్సు శివస్వరూపము. వానిలో శివుడు గలడన్నమాట కావున ఆతడు శష్ప్యనామకుడాయెను. "శసు = హింసాయాం" అను ధాతువునుండి యేర్పడిన శష్పపదమునకు హింసించునదని యర్థముకలదు. హింసించు వస్తువులందుఁగల సంహారశక్తి శివునకుఁ జెందినదే. వానియందున్నకారణ మున శివుడు శష్ప్యనామకుడాయెనని తెలియుచున్నది.

విష్ణు:

శష్పమనగా దూర్వ. అదిశతమూలయు, శతాంకురయునై తనతో దైవమునర్చించువారిపాపములను బరిహరించును. అందు విష్ణుశక్తివ్యాపించి యుండుటచేతనే దానికి అపాపపరిహారకశక్తిలభించినది. కావున విష్ణువుకూడ శష్ప్యనామకుడాయెను. బుద్ధిసన్నిధిని శష్పమందురు. బుద్ధిసన్నిధినుండునది సహస్రారము. అందు కుండెడివాడు కావున విష్ణువు శష్ప్యనామకుడాయెను.

శష్ప్యనామమున "శ్ + అ + ష్ + ప్ + య్ + అ" అని అరక్షరములు కలవు. అవి షడావరణలను, షడింద్రియములను సూచించును. ఇందు ద్వాద శాత్మకుడైన సూర్యునిబీజము షకారము పర్జన్యవాయుదేవబీజములతోఁబాటు లక్ష్మీబీజముతోడనుగూడియున్నది. అందుచే ఈనామము నుపాసించువారికి సూర్యుడుప్రాణశక్తిని, ద్వాదశవిధతేజస్సులనుఒసంగి, వజ్రదేహులను దివ్య తేజస్కులనుగావించును. వారిపై అమృతస్రావమును వర్షింపఁజేయును.

అంతేకాదు. ఈనామము నుపాసించువారు సూర్యకిరణములనుండి పంద్రెండు విధములైన విద్యుత్తులను స్వీకరించి, వివిధవాయువులశక్తులతో వానిని జోడించి, సూర్యమండలగాములుకాఁగలశక్తినొసంగఁగలరు. సర్వకాలము లందును సువృష్టికరులను గావింతురని తెలియుచున్నది.

## 237 నామము- శివ- "నమఃఫేన్యాయచ"

ప. భా. భా:— మహాదేవుడు ఫేనమునందు నీటినురగలోఁ దనదగుశ్వేత తేజస్సును బ్రవేశపెట్టి, ప్రకాశించునుగాన ఫేన్యుడాయెను. మహాశివుడు తన రూపములైన పంచభూతములతో ఉప్పొంగుబ్రహ్మాండమునఁ జేతనాచేతన ముల రూపముననుండును. కావున శివుడు ఫేన్యనామకుడాయెను. "స్ఫాయీ వృద్ధౌ" అను ధాతువునుండియేర్పడుటచే ఫేన్యశబ్దమునకు ఈయర్థమువచ్చెను

విష్ణు;-

సముద్రమునందలి ఫేనమువలెనుండి, అందునుండి జన్మించుటచేఁ జంద్రుడు ఫేనమువంటివాడు. అతనిలోఁ బ్రభారూపముననుండుటచే విష్ణువు ఫేన్యుడాయెను. "స్ఫాయతే = వర్ధత ఇతిఫేనః" అనువ్యుత్పత్తిచేఁ దనరక్ష ణచే నుప్పొంగు బ్రహ్మాండమునకు ఫేనమనిపేరు. అందు సకలవస్తువుల రూపముననుండుటచే విష్ణువు ఫేన్యనామకుడాయెను.

బీజాక్షరసంపుటి;-

ఫేన్యనామమున "ఫ్+ఏ+న్+య్+అ" అని ఐదక్షరములుకలవు. అవి పంచభూతములను, ఐంచేంద్రియములను సూచించును ఇందు ఫకారై కారములురెండును వీరభద్రపశుపతిబీజములు. అవి సావిత్రీబీజముతోడను, వాయుదేవబీజములతోడనుగూడియున్నవి. పైనామము శాక్తేయులకును, శైవులకును, అద్వైతులకును బ్రధానోపాస్యము. ఈనామము నుపాసించు వారు సకలపాతకములనుండి విముక్తులగుదురు. వైష్ణవమతస్థులు సావిత్రీ

ప్రధానముగాఁ బైనామము నుపాసించి, ముక్తులుకాఁగలరు. భూతప్రేతాది భయమును బోఁగొట్టగలరు. సంహారక రాయుధములనెల్ల నిర్మించి, దుష్టులను అదుపులోనుంచఁగలరని తెలియుచున్నది.

## -: 17. వ. యజుస్సు :-

"నమస్సికత్యాయచ ప్రవాహ్యాయచ"

**అర్థము:-**

సికతాయచ = సికతకు అర్హుడైయున్నట్టియును, ప్రవాహ్యాయచ = ప్రవాహమునకు అర్హుడైయున్నట్టిశివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— సైకతలింగరూపముననుండుటచేతను, గంగాప్రవాహమును నెత్తిపైధాల్చుటచేతను, శివుడు, సికతకు (ఇసుకకును) ప్రవాహమునకును అర్హుడై నమస్కరింపబడుచున్నాడు.

**238 నామము- శివః**

భ. భా. భా:— మానవుడు శ్రద్ధాళువగుచు, స్నానాది తత్పరుడును గంగాదీ తీరవాసియునైయున్నవాడు శష్పాద్యదిధారియైతరించఁగలడు సికతలనగా ఇసుకరేణువులు. వానియందు రజతసువర్ణాదులు తళతళమెఱయుచుండును. వెండి మున్నగులోహములన్నియును శివతేజస్సులే. అగ్నిబీజము పవిత్రతగల దర్భాదులను, సువర్ణాదివస్తువులను ధరించుమానవుడు శివతేజస్సొంది ఆరోగ్యవంతుడగును. కావున సికతలందుండి సికత్యనామకుడైన శివుని మాన వులు నమస్కరింతురు.

విష్ణువు:—

విష్ణువు యమునానదీ సైకతములందు గోపికలతో గూడియుండి, విహరించి, హితబోధ చేసి, గోపికలను భక్తురాండ్రగావించితరింపఁజేసెను. ఈవిషయము భాగవతమునఁగలదు. అందుందుకారణమున విష్ణువు సికత్యానామకుడై నమస్కరింపబడుచున్నాడు.

*బీజాక్షరసంపుటి:-*

సికత్యానామమున "స్ + ఇ + క్ + అ + త్ + య్ + అ" అని యేడక్షరములుకలవు. అవి సప్తవాయుమండలమును, మనోబుద్ధులతోడి పంచేంద్రియములను సూచించును. ఇందలి శక్తిబీజము సకారములక్ష్మిని, ఇకారము విష్ణువును సూచించును కాన ఇది లక్ష్మీనారాయణోపాసకులకుఁ బ్రధానము. దీనినుపాసించువారు విష్ణుసాయుజ్యము పొందుదురు. అంతేకాదు. వాయుభేదములను, వాయుప్రేషకయంత్రములను గనుగొనఁగలరు. జలాగ్ని వాయుశక్తులచే కృత్రిమవర్షము కురిపింపగలరు. చర్మరోగములను రక్తరోగములను బోఁగొట్టఁగలరు; అనితెలియుచున్నది

*239 నామము- శివ:- "నమః ప్రవాహ్యాయచ"*

భ. భా. భా:— ప్రవాహముఅనగా నదీస్రోతస్సు. అందుఁగలవేగము, అగ్నిరసము, పరమేశ్వరస్వరూపములు.

"చతుష్టయ్యా ఆపోగృహ్ణాతి; చత్వారివాఅపాగ్ంరూపాణీ; మేఘోవిద్యుత్; స్తనయిత్నుర్వృష్టిః"

అను శ్రుతిచే మేఘము, విద్యుత్తు (కరంటు) స్తనయిత్నువు (అగ్గిపిడుగు) వృష్టి అనునాల్గును జలదాయకములు. వానిలోఁ బరమేశ్వరుడు తన శక్తిని ప్రవేశపెట్టినాడు. కావున శివుడు ప్రవాహ్యానామకుడై నమస్కరింపఁబడుచున్నాడు.

విష్ణు:—

ప్రత్యక్షముగా జలమును వహించునది సాగరము (లేక) పర్జన్యము. సాగరము విష్ణువిభూతి. అందు విష్ణువు బడబాగ్నిరూపమునఁగలదు. "సరసామస్మిసాగరః" అను గీతాసూక్తిచేఁ బైవిషయము తెలియుచున్నది. మేఘము నందలి రసము (నీరు అందుండురుచియు) విష్ణుస్వరూపము. రసోఽహమప్సు కౌంతేయ" అను గీతాసూక్తిచే అవిషయము తెలియుచున్నది ప్రవాహ్యము, పర్జన్యము అను రెండును సమానార్థకములు "పర్జన్యఃపావనోఽనిలః" అను విష్ణుసహస్రసూక్తిలోఁగల బర్జన్యపదము విష్ణునామముగాఁగలదు. పర్జన్య నామమువలెఁబ్రవాహ్యనామముకూడ విష్ణువునకుఁజెందినదే

*బీజాక్షరసంపుటి*—

ప్రవాహ్యనామమున "ప్+ర్+అ+వ్+అ+హ్+అ" అని యెనిమిదక్షరములుకలవు. అవి అష్టసూర్యమండలములను, శరీరమందలి అష్టచక్రములను సూచించును. ఇందుఁ బర్జన్యాగ్నివరుణవాయుదేవబీజములు శివశక్తిబీజములైన హకారాకారములతోఁగూడియున్నవి. ఇదిశాక్తాద్వైతులకుఁ బ్రధానోపాస్యము. దీనినుపాసించువారు కైలాసమును, వైకుంఠమును బొందుదురు. జలోదరాగ్నిమాంద్యవాత శ్విత్రాదిరోగపరిహారకులై జీవులకు వృద్ధి సిద్ధులనుజేకూర్పఁగలరు. వాయ్వగ్నిజలశక్తులతోఁ గృత్రిమమేఘములను సృష్టించి, వర్షదాయకులుకాఁగలరు. వాయ్వగ్నిజలమండలసంచారులును గాఁగలరని తెలియుచున్నది.

# -: నవమానువాకము :-

అష్టమానువాకోక్తనామములకంటె భిన్నములైన నామములు
ఇందుఁ జెప్పఁబడుచున్నవి.

## — 1. వ. యజుస్సు —

"నమ ఇరిణ్యాయచ ప్రపథ్యాయచ

**అర్థము:-**

ఇరిణ్యాయచ = ఊషరక్షేత్రములందు (చవిటినేలలో) ఉండునట్టి
యును, ప్రపథ్యాయచ = పదిమందినడుచుత్రోవలోనుండునట్టి శివునకు,
నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— భగవంతునకు సర్వమును సమానమే. అందుచేఅతడు చవిటినేల
లందును, పదిమందినడిచిపోవు మార్గములందునుగలడు. పదుగురు అడు
మాటయును బదుగురుపోవుత్రోవయును పాడియై ధరలోఁ జెల్లును అప్పాడి
యును శివస్వరూపమే. కావుననే ఈవిషయమును సూటిగావేమన "పదుగు
రాడుమాట పాటియైధరచెల్లు" అని తనసూక్తిలోఁ బేర్కొనినాడు. అందుచే
ఇరిణ్యుడు ప్రపథ్యుడు అను నామములతోఁ బరమశివుడు స్తుతింపఁబడి
నమస్కరింపఁబడుచున్నాడు.

240 నామము:- శివ:- "నమఇరిణ్యాయచ"

భ భా. భా:— చవిటినేలలు నివాసయోగ్యములుకావు. అచటనున్నచో
ఆహారపానీయాదులు లభింపక నశింతురు. చేతనాచేతనములందు గల శివుడు

వానితోఁబాటుతానును ఇరిణములందుండి అటకుఁ జేరినవానిని నశింపఁజేయును చవిటినేలలోగలమట్టిలో శివస్వరూపమైన అగ్నికలదు. కావున ఆనేలలో అశ్వమునునిలిపి, దానిడెక్కలక్రిందిమట్టినిద్రవ్వి, దానిని గాడిదలచేమోయించితెచ్చి ఉఖాగ్నినిర్మాణమునొనర్చుటకుఁ బుయ్యిని తయారుచేయునట్లు వేదమునఁ గలదు. కావున ఇరిణిలోఁగల శివుడు ఇరిణ్యానామకుడాయెను.

విష్ణు:-

చవిటినేలలో ఉప్పుపండింతురు. ఉప్పులో తిన్నఅహారమును జీర్ణము చేయుశక్తికలదు. అదిలేనిదే ఏపదార్థమునను రుచిపుట్టనేరదు. అందుచేతనే "నవరుచులకుఁ దల్లినౌవడాఉప్పుగల్లి" అనుసూక్తియేర్పడినది అయ్యుప్పులో గలరుచియేవైశ్వానరశక్తి అందుచేతనే పరమాత్మ" అహంవైశ్వానరో భూత్వా ప్రాణినాందేహమాశ్రితః। ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నంచతుర్విధమ్" "నేను ఉప్పులోఁ గలరుచియైన వైశ్వానరుడనై ప్రాణులదేహమునఁజేరివారు తినెడి చతుర్విధాహారమును పచనముచేయుచున్నాను" అనిగీతాసూక్తిలోఁ జెప్పినాడు. "ఇందుఁగలడందులేడనిసందేహమువలదు। చక్రిసర్వోపగతుడు." కావున విష్ణువు నివాసయోగ్యముకాని ఇరిణమునందుండియును జీవులకుమేలు చేసి ఇరిణ్యనామకుడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

"ఇరిణ్య" నామమున "ఇ+ర్+ఇ+ణ్+య్+అ" అని ఆరక్షర కలవు. అవి షడృతువులను, షడింద్రియములను సూచించును. ఇందలి ఇకార ద్వయము విష్ణుబీజము. అది అగ్నిబీజముతోడను, నందిబీజమైన ణకారము వాయుదేవబీజములతోడను, గూడియుండుటచేఁ బైనామము నుపాసించువారు శివకేశవశక్తులను రెండింటిని సంపాదించుకొని ముక్తులుకాఁగలరు అంతే కాదు. అగ్నివాయుభేదములను, తన్మాత్రకవస్తువులను సృజించి, ఆరోగ్యదాతలును భూతప్రేతపిశాచాదిబాధానివారకులునుగాఁగలరు. అగ్నివాయుప్రధానాయుధములద్వారాదుష్టులను శిక్షించి, శిష్టులను రక్షింపఁగలరని తెలియుచున్నది.

## 241 నామము- శివ:- "నమః ప్రపథ్యాయచ"

భ. భా. భా:— పరుగుచుపాటించు సన్మార్గము అనగా జపయజ్ఞదానాది మార్గమునందు రక్షించువాడును, కర్మఫలప్రదాతయనగుటచే శివుడు ప్రపథ్య నామకుడాయెను. ప్రకృష్టమైనపథమున సూర్యవాయ్వగ్ని స్వరూపుడై యుండి హితకరుడైనకారణమున శివుడు ప్రపథ్యనామకుడాయెననియుఁ జెప్ప వచ్చును. దివి, అంతరిక్షము, పృథివి అను మూడింటికిని జెందినమార్గములే ప్రపథములు. పథమనగామార్గము.

"సూర్యోనోదివస్పాతువాతో అంతరిక్షాత్, అగ్నిర్నః పార్థివేభ్యః"
అనెడి సౌరమంత్రమువలనఁ బైవిషయముతెలియుచున్నది.

విష్ణు:-

ప్రపథము అనగాఁ బ్రకృష్టమైన కల్యాణమార్గము. అందుండి విష్ణువు తన భక్తులకు శుభములను జేకూర్చును. "భూః పాదౌ యస్య నాభిర్వియదసుర నిలశ్చంద్ర సూర్యౌచనేత్రే" అను సూక్తిలోఁ జెప్పినవిధముననుసరించి, విష్ణువు సూర్యచంద్రాగ్నివాయుస్వరూపుడని తెలియుచున్నది. అందుచే విష్ణువు జీవులకు సూర్యరూపమున ఆరోగ్యమును, చంద్రరూపమున అన్నమును, వాయురూపమునఁ బ్రాణశక్తిని, అగ్నిరూపమునఁ దేజస్సును, ఒసఁగుచు శ్రేయస్కరుడైన కారణమునఁ బ్రపథ్యనామకుడైనట్లు తెలియుచున్నది.

బీజాక్షరసంపుటి:-

ప్రపథ్యనామమున "ప్+ర్+అ+ప్+అ+థ్+య్+అ" అని యెనిమిదక్షరములుకలవు. అవి అష్టప్రకృతులను, అష్టచక్రములను సూచించును. పైనామము నుపాసించువారు ఆధ్యాత్మారాధకులై, యోగులై

వైకుంఠమునొంధ(గలరు. వాయ్వగ్ని పర్జన్యశక్తులతో గ్నృత్రిమమేఘములను సృష్టించి, పాడిపంటలతో దేశమును తులతూగించి, జనులకు వృద్ధిసిద్ధులను జేకూర్ప(గలరు. అగ్నిమాంద్యవాతమత్రిభ్రమణాదిరోగపరిహారకులుకా(గలరని తెలియుచున్నది.

## — 2. వ. యజుస్సు —

### "నమఃకిగ్ంశిలాయచక్షయణాయచ"

**అర్థము:-**

కిగ్ంశిలాయచ = కుత్సితములు అనగా క్షుద్రములైన శిలలుగలప్రదేశమందుండునట్టియు, క్షయణాయచ = నివాసయోగ్యప్రదేశమందున్నట్టి, శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— మహాదేవుడు జీవచైతన్యమున(జేరినకారణమున జీవులకవసరమగు చేతనాచేతనవస్తువులందెల్ల(గలడు. అందుచే( గుత్సితశిలలుగల ప్రదేశములందు లోహరూపమున(గలడు. నివాసయోగ్యప్రదేశములందు ఆహారవస్త్రభవనాదిరూపముననున్నవాడు. అందుచే అతనికి నమస్కారము.

### 242 వ. నామము:- శివ "నమఃకిగ్ంశిలాయచ"

భ. భా. భా:— కింశిలలనగా క్షుద్ర శిలావృతప్రదేశములు అందుమహాదేవుడు స్ఫటికములు మున్నగురత్నములరూపముననున్నాడు. అందుచేతనే జనులు అమోఘఫలములనందుటకై నవరత్నధారణమొనరింతురు. కింశిలలు దొరకుతావున(గలవాడు కావున శివుడు కింశిలనామకుడాయెను.

విష్ణు

"తేజస్తేజస్వినామహమ్" అనుగీతాసూక్తిచే(దేజోవంతములైన రత్నాదులలోని తేజస్సు విష్ణువిభూతియని తెలియుచున్నది. కింశిలలలో నవరత్నాదులలో విష్ణువు తేజోరూపమునగలడు. "శిఞ్ = నిశాతనే" అను ధాతువునుండి యేర్పడిన శిలాపదమునకు అయుధములను తనూకరించునదియని తెలియుచున్నది. కిం = అణురూపమున అల్పమైయుండు, శిల = అయుధములను తనూకరించు సుదర్శనముకలవాడు విష్ణువు పైవిషయములచే విష్ణువు కింశిల నామకుడాయెనని తెలియుచున్నది.

బీజాక్షరసంపుటి-

కింశిలనామమున "క్ + ఇ + మ్ + శ్ + ఇ + ల్ + అ" అని యేడక్షరములుకలవు. అవి సప్తమేఘమండలములను, మనోబుద్ధులతోడి పంచేంద్రియములను సూచించును. లక్ష్మీవిష్ణుబీజములైన శకారేకారములు ప్రజాపతి మదనపృథివీ దేవబీజములతో( గూడియున్నవి. పృథివీచక్రమున లక్ష్మీనారాయణుల నుపాసించినవారు వృష్టికరులై సకల సస్యములను బండించియు బృథివియందు(గల సకలధనరాసులను, సకలలోహౌషధ రాసులను బైటపెట్టి ప్రజల కోర్కెలను దీర్ప(గలవారలగుదురు. చర్మరోగనివారకులు కా(గలరని తెలియుచున్నది.

## 243 వ. నామము- శివ;- "నమః క్షయణాయచ"

భ. భా. భా:— "క్షి = నివాసగత్యోః" అను ధాతువునుండియేర్పడిన క్షయణపదమునకు నివాసయోగ్యప్రదేశమందున్నవాడనియర్థము మహాదేవుడుచేతనాచేతనవస్తువులందువలె నివాసయోగ్యప్రదేశమందును గలడు. అనగా గ్రామ, నగరాదులందంతటను గలడు. అందుచే క్షయణనామకుడాయెను. సకల సంహారకర్తయై క్షయమొందించువాడు కావునక్షయణి నామకుడాయెను.

స్వల్పప్రాణులైన జీవులు శష్పతుల్యములు. స్వల్పాయుష్కులు ఫేనతుల్యులు, అతిక్షుద్రులు సికతసమానులు. ప్రకృష్టములైనమహావిభూతులు ప్రవాహతుల్యములు. శూన్యశక్తులు ఇరిణసదృశులు. ప్రకృష్టమార్గప్రవర్తనులు ప్రప్రథతుల్యులు. కుత్సితశీలురు కింశిల సమానులు క్షయశీలురుక్షయణులు. వీరందఱిలో నుండుటచే శివుడు శష్ప్యాది నామధేయుడైయుండెను. అందుచేశివుడు పైవానిపై అనుగ్రహముచూపును.

### విష్ణు:

మహావిష్ణువు దుష్టులైన రాక్షసాదులనెల్లనశింపఁజేయువాడును, శిష్టులైనదేవాదులనెల్లక్షయములను = గృహములనుజేర్చి, రక్షించువాడగుటచే క్షయణనామకుడాయెను. ఈక్షయపదముయొక్క అర్థమునే "క్షేమకృత్, క్షోభణః" అను విష్ణుసహస్రనామములు వ్యక్తముచేయును. అందుచే విష్ణువు క్షయణనామకుడాయెను.

### బీజాక్షరసంపుటి:-

క్షయణనామమున "క్ + ష్ + అ + య్ + అ + ణ్ + అ" అని యేడక్షరములుకలవు. అవి సప్తమేఘమండలములను, మనోబుద్ధులతోడి పంచేంద్రియములను సూచించును. ఈనామమున ద్వాదశాత్మబీజము షకారము ప్రధానము దీనినుపాసించువారు సూర్యమండలభేదులై వైకుంఠము చేరగలరు. తాము ఆరోగ్యవంతులగుటతోబాటు ఉపాసకులులోకులకు ఆరోగ్యముచేకూర్పగలరు. సూర్యకిరణములనుండి ద్వాదశ విధతేజస్సులను స్వీకరించి, వాయుప్రజాపతిశక్తులనుజోడించి, మారణాయుధప్రస్థులై శత్రుభేదకులు కాఁగలరు. వాయుప్రజాపతినందికేశ్వరశక్తులను స్వీకరించి, సూర్యమండలగాములుకాఁగలరని తెలియుచున్నది.

-: 3. వ. యజుస్సు :-

"నమఃకపర్దినేచపులస్తయేచ"

**అర్థము:-**

కపర్దినేచ = జటాబంధముకలవాడును, పులస్తయేచ = భక్తులయెదుట నుండునట్టి శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— పరమేశ్వరుడు గంగాప్రవాహప్రమాదనివారణకై జటాబంధము కల్గియుండెను. తననుధ్యానించి, తపస్సుచేయుభక్తులయెదుట దయాశాలియై యుండును. అందుచే జనులాతనిని నమస్కరింతురు.

## 244 నామము- శివ- "నమఃకపర్దినేచ"

భ. భా. భా.— భగవానుడు పరమేశ్వరుడు భక్తులపట్ల అనుగ్రహముచూపు కాలమునఁ గపర్దియై అనగా జటాబంధముకలవాడైవచ్చునని కొందఱు అందురు. మహానుభావుడైన అతడు తననుగొల్చువారికెల్ల సులభుడని తెలిసికొనవలసియున్నది. అతడు గంగాజలముతోఁ దనశిరస్సును బూరించియుండి. తజ్జలముతో లోకములను బవిత్రముచేయువాడు కావున. కపర్దినామకుడాయె నని తెలియుచున్నది.

విష్ణు:—

విష్ణువు, కేన = నీటితో, పర్ది = జగంబులను బూరించుచున్నాడు. ఆతడు తన పాదములనుండిపుట్టిన గంగాజలముతో బ్రహ్మాండమును నింపి, పవిత్రముచేయుచున్నాడు. కం = వాయువును, పివర్తిపర్ది = లోకముల వ్యాపింపఁజేసి నింపుచున్నాడు. పైకారణములచే విష్ణువు కపర్దినామకుడాయె నని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి—*

కపర్దినామమున "క్+అ+ప్+అ+ర్+ద్+ఇ+న్" అని యెని మిదక్షరములుకలవు. అవి అష్టదిక్కులను, శరీరమందలి అష్టచక్రములను సూచించును. ఇందు అగ్నిదుర్గాబీజములు రేఫదకారములు విష్ణుబీజముతోడను ముందున ప్రజాపతివర్ణన్యసర్వదేవబీజములతోడను, గూడియున్నవి. దీని నుపాసించువాడు అగ్నిస్వరూపిణియగు దుర్గాదేవిని, మహాలక్ష్మిని విష్ణువును గన్నులారఁగాంచి ముక్తుడగును, రక్తదోషరోగములను, శ్యామలరోగమును, పచ్చకామెర్లనుదొలగించి, లోకము నుద్ధరింపఁగలడని తెలియుచున్నది.

*245 వ. నామము:- శివ— "నమఃపులస్తయేచ"*

భ. భా. భా:— పులస్తలను (ముంగురులను) గల్గి, భక్తులకు అనుగ్రహముతో దర్శనమొసంగును. సర్వదా సకలజనులపురోభాగముననుండి రక్షించును. కావున పులస్తినామకుడాయెను. రేఫలకారములకు వ్యాకరణశాస్త్ర రీత్యాభేదములేనికారణమున "పుల పుర"అను రెండుపదములను సమానార్థకములే కాన "పులస్తి" పదమునకుఁ బురోభాగముననున్నవాడను నర్థము వాటిల్లెను. అందుచే శివుడు పులస్తి (పురస్తి) నామకుడాయెనని తెలియుచున్నది

*విష్ణు:-*

"పులఃసర్వవ్యాపకస్సన్స్త్యాయతి = సంచినోతిసర్వమ్" అను వ్యుత్పత్తిచే, సర్వవ్యాపకుడైన విష్ణువు ప్రళయమున సమస్తమును నశింపఁజేయును. కావున అతడు పులస్తినామకుడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి-*

పులస్తిపదమున "ప్+ఉ+ల్+అ+స్+త్+ఇ" అని యేడక్షరములుకలవు. అవి సప్తవాయుమండలములను సప్తగ్రంథులను సూచించును. పైనామమును ఉపాసించువాడు పృధివిలోనుండియే శక్తిపిష్ట సాక్షాత్కారము పొందఁగలడు. సకలవాయువులను సృష్టించి, వానిసాయమున భూమిలోగల వస్తువులనెల్లవెలిబుచ్చుయంత్రములకు నిర్మాతయు, కృత్రిమమేఘనిర్మాతయునై ప్రపంచప్రఖ్యాతుడుకాఁగలడని తెలియుచున్నది.

## — 4. వ. యజుస్సు —

### "నమోగోష్ఠ్యాయచగృహ్యాయచ"

*అర్థము:-*

గోష్ఠ్యాయచ = గోశాలలోనుండునట్టియు, గృహ్యాయచ = సామాన్య గృహమునందుండునట్టి శివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:— మహాదేవుడు గోశాలలో గోరూపమునను, సామాన్యగృహములందు సామాన్యజనులుగానుండును. కాన అతనికి నమస్కారము.

## 246 వ. నామము- శివ:- "నమోగోష్ఠ్యాయచ"

భ. భా. భా:— పశుపతియైన శివుడు గోశాలలో గోరూపమునయుండుటచే గోష్ఠ్యుడాయెను. "గావఃజలానిఅత్రతిష్ఠన్తి" అను వ్యుత్పత్తిచే జలము సమృద్ధిగానుండు సముద్రమునకు గోష్ఠమనిపేరు. అట్టిగోష్ఠములోబడబాగ్నిరూపమున మహాదేవుడుండును గోవులు అగ్నియును పరమపవిత్రములు వానిరూపమున నుండుటచే శివుడు గోష్ఠ్యనామకుడాయెను.

విష్ణు-

గోవులు అనగా కాంతికిరణములు. వానికి నిలయులైన సూర్యచంద్రులు గోష్ఠులగుదురు వారిలోఁ బ్రభారూపమున (కాంతిరూపమున) విష్ణువు ఉండును. కాన అతడు గోష్ఠ్యుడాయెను. గోవులు అనగా ఇషువులు = బాణములు. అవి గలది కావున అమ్ములపొదికి గోష్ఠమని పేరు. అందు నారాయణాస్త్రమున్నగు రూపముననుండువాడు కావున విష్ణువు గోష్ఠ్యుడాయెను, గోవులు అనగా వాక్కులు. వానికి తావులు వేదములు. వానియందు మహిమరూపమున నుండుటచే విష్ణువు గోష్ఠ్యుడాయెను. పైవిధమున గోష్ఠ్యనామకుడైన విష్ణువునకు నమస్కారము.

*బీజాక్షరసంపుటి;-*

గోష్ఠ్యనామమున "గ్+ఓ+ష్+ఠ్+య్+అ" అని ఆరక్షరములు కలవు. అవి షడృతువులను, షడింద్రియములను సూచించును. ఇందు గకారము గణపతిబీజము, ఈశ్వరబీజమైన ఓకారముతోడను, ద్వాదశాత్మ (సూర్య) బీజముచంద్రబీజమైన ఠకారముతోడను, వాయుదేవబీజముల తోడను గూడియున్నది. ఈనామమున మహాదేవుడు సూర్యచంద్రవాయురూపుడుగా ధ్యానింపఁబడి, ఉపాసకులకు యోగమున్నగు సకలవిద్యలను, కైలాసమును ఒసంగును పైనామము నుపాసించువారు సూర్యచంద్రమండలగాములును ద్వాదశసూర్యతేజోగ్రాహకులునై ఆరోగ్యదాతలు కాఁగలరని తెలియుచున్నది.

## *247 నామము;- శివ— "నమోగృహ్యాయచ"*

భ. భా. భా:— ప్రతిగృహమందున్నవాడగుటచే శివుడు గృహ్యుడాయెను. భారతీయులు ప్రతిగృహమునందును ఐశ్వర్యమును జ్ఞానమున పేక్షించి, శివునారాధింతురు. అందుచే శివుడు గృహ్యనామకుడాయెను.

విష్ణు:—

ప్రతిమానవుడును రక్షణకాముడై సంపదనభిలషించువాడై తమ గృహములందు లక్ష్మీనారాయణులను ఆరాధించును. నారాయణునిరూపాన్తరములైన సూర్యసత్యనారాయణవేంకటేశ్వరులనారాధింతురు. కాన 'విష్ణువు గృహ్యానామకుడాయెను.

*బీజాక్షరసంపుటి-*

గృహ్యానామమున "గ్ + ఋ + హ్ + య్ + అ" అని యైదక్షరములు కలవు. అవి పంచభూతములను పంచకోశములను సూచించును. ఈనామము బ్రహ్మశివప్రధానము. దీనినుపాసించువారు యోగులును జ్ఞానులునై ముక్తులగుదురు. ఈనామము నుపాసించువారు నిర్విఘ్నముగా నూతన వస్తు సృష్టిని, శత్రుసంహారమునుగావింపఁగలరు. రక్తదోషరోగములను, కామెలను శ్యామలరోగమును, భూతాదిబాధలను దొలగింపఁగలరు; అని తెలియుచున్నది.

— తై. వ. యజుస్సు —

*"నమస్తల్ప్యాయచగేహ్యాయచ"*

*అర్థము:-*

తల్ప్యాయచ = తల్పమునందును, మంచముపైని శయనించునట్టియును గేహ్యాయచ = ధనికుల ప్రాసాదములందుండువాడునగు శివునకు, "నమః" = నమస్కారము.

తాత్పర్యము:-

సా. భా:— మహాశివుడు జీవరూపముదాల్చుటచే సామాన్యమానవునివలెఁ దల్పమునందును, మంచమునందును శయనించియుండును. అతడు ధన వంతులవలె మహాప్రాసాదములందును ఉండును. అట్టి యాతనికి నమస్కారము.

## 248 నామము- శివ:- "నమస్తల్ప్యాయచ"

భ. భా. భా:— జీవులకు సుఖముచేకూర్చుటయే మహాదేవుని కృత్యము. అతడు చేతనాచేతనములందెల్లనుగలడు. అతడు అచేతనమైన తల్పమందుండి సుఖకరుడై తల్ప్యనామకుడాయెను. భగవంతునిలోఁగలశక్తియే మూల ప్రకృతి ఆమె జలస్వరూపిణి. అందు శివుడు వసము శైత్యము, మున్నగురూపముల నుండుటచేఁ దల్ప్యనామకుడాయెను. అతని తల్పమే పుష్కరపర్ణము. అందుండు ప్రజాపతియే పరమశివుడు; అను నీవిషయము "సప్రజాపతిరేకః పుష్కరపర్ణే సమభవత్" అను శ్రుతిలోఁ జెప్పఁబడెను. అట్లు తల్ప్యుడైన శివు వకు నమస్కారము.

విష్ణు:—

మహావిష్ణువు తన ప్రతిబింబమును జీవుడునగు ఆదిశేషుని దల్పముగాఁ జేసికొని అందుండుటచేఁ దల్ప్యనామకుడాయెను. తల్పపదము "తల = ప్రతిష్ఠాయామ్" అనుధాతువునుండియేర్పడెను. ఆతల్పపదమునకు భార్య యని యర్థము. భగవంతునకు భక్తులెల్లరును భార్యలే అందుచే అతడు "గోవువెంటఁదగులుకోడెభంగి" నుండి తనభక్తులవెంటనేగుచువారిలోనుండును వారే వానికిఁ బ్రతిష్ఠచేకూర్తురు. అందుచే విష్ణువు తల్ప్యనాముడాయెను.

*బీజాక్షరసంపుటి—*

తల్ప్యపదమున "త్+అ+ల్+ప్+య్+అ" అని అక్షరములు కలవు. అవి షడావరణలను, షడింద్రియములను సూచించును. ఈనామము నుపాసించువారు పృధివిలో సుప్రతిష్ఠులు కాఁగలరు వారువాయుభేదములను తెలిసికొని వానితోఁ బలురకములగు యంత్రములను నిర్మించి, పృధివిలోఁగల సకల వస్తువులను వెలిబుచ్చఁగలరు. కృత్రిమమేఘనిర్మాతలు కాఁగలరు. చర్మమున నేర్పడు తెలుపు, ఎఱుపు, నలుపు మచ్చలనుబోఁగొట్టఁగలరని తెలియుచున్నది.

## *249 నామము:- శివ:- "నమోగేహ్యాయచ"*

ఫ. భా. భా:— ధనవంతులు నివసించుప్రాసాదాదులకు గేహమనిపేరు. అందుండు జీవులలోఁ జేరిపరమశివుడు నివసించును. "గ్రహ = ఉపాదానే" అను ధాతువునుండియేర్పడిన గేహపదమునకు గ్రహించుట అని యర్థము. పురుషుడు సంపాదించు పురుషార్థములలో ధనమును గ్రహించునది గేహము అధనమే ఐశ్వర్యము. తనభక్తులకు ఐశ్వర్యమొసంగుటకు మహాదేవుడు వారి గృహములందుండును. కావున గేహ్యానామకుడాయెను. అంతేకాదు. జీవుల దేహములకును ఇంద్రియాదులను గ్రహించియుండుకారణమున గేహమను సంజ్ఞకలదు. ఆగేహమున జీవరూపముననుండుటచే శివుడు గేహ్యానామకుడాయెనని చెప్పవచును.

విష్ణువు:—

భగవంతుడు మహావిష్ణువు లక్ష్మీదేవినివిడువకయేయుండు. లక్ష్మీదేవి రూపములలో ధనమొకటికావుననే ఆమెకు ధనలక్ష్మియనునామమువాటిల్లెను. ఆమెగేహములందుండును ఆమెతోగూడిగేహములందున్నకారణమున విష్ణువునకు గేహ్యానామముఘటిల్లెను. "ధనమగ్నిర్ధనంవాయుర్ధనం సూర్యో

ధనంవసుః" అను సూక్తివలన అగ్ని, వాయువు ధనలక్ష్మీరూపాన్తరములని తెలియుచున్నది అవి గేహమైనశరీరములో నుండును. అగేహమునందేవానితోఁ గూడి విష్ణువు జ్యోతీరూపమునగలడు. అగేహము పద్మకోశప్రతీకాశమైన హృదయము. అందున్నకారణమున విష్ణువు గేహ్యానామకుడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

గేహ్యానామమున "గ్ + ఏ + హ్ + య్ + అ" అని ఐదక్షరములు కలవు. అవి పంచభూతములను ఐంచేంద్రియములను సూచించును. వీనిలో శివబీజమైన హకారము వీరభద్రగణపతివాయుదేవబీజాక్షరములతోగూడి యుండెను. ఇవన్నియును శివసంబంధములే. దీనినుపాసించువాడు అష్టైశ్వర్య సంపన్నుడై శివసాయుజ్యమునందును. పైనామము నుపాసించువాడు సర్వ సైన్యాధ్యక్షుడై, సకల సంహారకర్తకాఁగలడనియును, సకల చర్మరోగములను భూతప్రేతపిశాచాదులను దొలగించువాడుకాఁగలడనియును తెలియుచున్నది.

## -: 6. వ. యజుస్సు :-

## "నమఃకాట్యాయచ గహ్వరేష్ఠాయచ"

*అర్థము:-*

కాట్యాయచ = కుత్సితముగాఁ దిరుగువారును, ముండ్లతోనిండిన లతా దులచేఁ బ్రవేశింపనలవికానిప్రదేశమున నున్నవాడును, గహ్వరేష్ఠాయచ = విషయములైన గిరిగుహాదులలోనుండువాడునగు శివునకు నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:— మహాదేవుడు దిగంబరుడును, సర్పభూషణుడునగుటచేఁ గుప్తముగాఁదిరుగుచుండును. సర్వవ్యాపకుడుకాన ముండ్లతుప్పలతోనిండి, దుష్ప్రవేశమైన దుమారణ్యమందునుగలడు. గిరిగుహాదులందునుగలడు. అట్టియాతనికి నమస్కారము.

## 250 నామము- శివ:+విష్ణు: "నమఃకాట్యాయచ"

భ. భా. భా:— ఈకాట్యనామమునకు అర్ధము 218 వ. నామమున శివవిష్ణు బీజాక్షరపరముగా ఇంతకుమున్నే వివరింపఁబడెను.

## 251 నామము- శివ- "నమోగహ్వరేష్ఠాయచ"

భ. భా. భా:— పరమేశ్వరుడు సతీదేవియొక్క దేహత్యాగానన్తరమున హిమవత్పర్వతారణ్యగుహలందుండి తపంబొనరించెను. అందుచే గహ్వరేష్ఠనామకుడాయెను. దుష్టశక్తులు విహరించునట్టి తావులందుండుటచే 'గహ్వరేష్ఠనామకుడాయెననియుఁ జెప్పవచ్చును.

విష్ణు:—

"అంతశ్చరతి భూతేషుగుహాయాం విశ్వమూర్తిషు" అను శ్రుతిలో మహానుభావుడైన విష్ణువు సకలభూతములందేకాక గహ్వరమందునుగలడని చెప్పఁబడెను. అంతేకాదు గహ్వరమనగాఁగానరానిచోటు. హిరణ్యకశిపుడు వెదకాడునపుడు కానరానిచోటైన వానిహృదయమందేదాగియుండెను. పైకారణములచే విష్ణువు గహ్వరేష్ఠనామకుడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

గహ్వరేష్ఠనామమున 'గ్+అ+హ్+వ్+అ+ర్+ఏ+ష్+ఠ్+

ఆ'' అని పదక్షరములుకలవు. అవి దశదిక్కులను, దశేంద్రియములను సూచించును. ఇది కేవలము శివశక్తిసంబంధమగు నామము ఇందు గణపతి వీరభద్ర ధనద బీజములు శక్తిశివబీజములును సర్వదేవవరుణాగ్నిబీజములతో గూడియున్నవి. ఈనామమును ఉపాసించువారు శివశక్తి సాయుజ్యమునంద గలరు. ఇహలోకమున ధనములనందగలరు అంతేకాదు అగ్నిశక్తిసహాయులై జలశక్తినిబైటపెట్టి వారుణాగ్నేయాస్త్రములను (ఉదజన్యణుబాంబులను) గనుగొని సకల శత్రుసంహారకులు కాగలరని తెలియుచున్నది. రక్తపుబోటు, కామెల, శ్విత్రరోగము అనువానిని పరిహరించువారై, స్ఫటికములను వెలి బుచ్చగలవారలును అగుదురని తెలియుచున్నది.

## — 7. వ. యజుస్సు —

### "నమోహ్రదయ్యాయచ నివేష్ప్యాయచ"

**అర్థము:-**

హ్రదయ్యాయచ = అగాధజలములందుండువాడును, నివేష్ప్యాయచ = నీహారజలమందుండువాడునగు, శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా.భా, :— మహాదేవుడు అగాధజలములందును, మంచునీళ్ళలోనుండి, జలజంతువులను రక్షించుటేకాక నీహారమందలి(మంచులోని) చల్లదనముతో సకలవస్తువులును బహుకాలము చెడకయుండునట్లు గావించును. అందుచే అతనికి నమస్కారము.

### 252 నామము- శివ- "నమోహ్రదయ్యాయచ"

భ. ఖా. భా: — హ్రదమనగా అగాధజలాశయము. అందుండి కెరటములచే మహాధ్వని బయల్వెడలును. అదిఆకాశగుణము. ఆకాశము శివస్వరూపము. మహాశివుడు హ్రదయ్యనామకుడాయెను.

విష్ణు:—

శబ్దఃఖేపౌరుషంనృషు" అను గీతాసూక్తిచే ఆకాశమందలి శబ్దము విష్ణు స్వరూపమని తెలియుచున్నది. ఆ శబ్దము హ్రాదమందును గలదు. కావున విష్ణువు హ్రాదయ్యానామకుడాయెను.

*బీజాక్షరసంపుటి:-*

హ్రాదయ్యానామమున దుర్గాబీజమైన దకారమును, శివబీజమైన హకారమును అగ్నివాయుసర్వదేవబీజములతోఁగూడియున్నవి. ప్రాణాయామ క్రియలోఁ బై నామమును శివదుర్గాప్రధానముగా నుపాసించువారు అష్టసిద్ధుల నొందఁగలరు. వాయ్వగ్నిశక్తులచే దుర్గమప్రదేశములనైనను జేరఁగలరని తెలియుచున్నవి. వాతరక్తదోషసంజనితరోగములను నిర్మూలింపఁగలరని తెలియుచున్నది ఇందు "హ్+ర్+అ+ద్+అ+య్+య్+"అ అని యెనిమిదక్షరములుకలవు. అవి అష్టప్రకృతులను అష్టచక్రములను సూచించును.

*253 నామము:- శివ— "నివేష్యాయచ"*

భ. భా. భా:— నివేష్యమనగా మంచునీరు. అందు శీతల గుణరూపమున నుండుటచే మహాశివుడు నివేష్యుడాయెను. పరమశివుడు హిమాలయమునఁ దపంబొనరించునపుడు నివేష్యమైన మంచునీటియందేకలడు. కావున ఆ నామమాతనికి సార్థకము.

*విష్ణు-*

"రసోఽహమప్సుకౌంతేయ" అను గీతాసూక్తిచే జలమందలిరసము విష్ణుస్వరూపమని తెలియుచున్నది. విష్ణువు నీహారజలమందు రసరూపమునఁ గలడు; కావున నివేష్యనామకుడాయెను.

*బీజాక్షరసంపుటి:-*

నివేష్యనామమున "న్+ఇ+వ్+ఏ+ష్+వ్+య్+అ" అని యెనిమిదక్షరములుకలవు. అవి అష్టప్రకృతులను మనోబుద్ధిచిత్తములతోడి

పంచేంద్రియములను సూచించును. వీనిలో సావిత్రీవరుణసూర్యబీజములు, విష్ణువీరభద్రపర్జన్యవాయుదేవబీజములతోగూడియున్నవి. దీని నుపాసించువారు వైకుంఠముచేరుదురు. సూర్యమండలగామి యంత్రములను సూర్యకిరణజన్యశక్తిస్ఫోరకయంత్రములను, జలాంతర్గామియంత్రములను, జలవస్తుసూచకయంత్రములను, సర్వవ్యాపకములగు అణువాయుశక్తులచే నిర్మింపగలవారలగుదురు. జలోదరము, పుట్టవ్రణము, చిన్నమెదడునకుఁజెందిన రోగములు, వాతరోగములు సర్వవ్యాపకక్రిమిరోగములు మున్నగువానిని అణుయంత్రములచే నిర్మూలింపఁగలవారలగుదురని తెలియుచున్నది.

## — 8. వ. యజుస్సు —

"నమఃపాగ్ంసవ్యాయచ రజస్యాయచ"

**అర్థము:-**

పాంసవ్యాయచ = పరమాణువులందున్నట్టియును, రజస్యాయచ = విస్పష్టమైన ధూళిలోనున్నట్టి, శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— ఇందుగలడందులేడని సందేహమువలదు. మహాశివుడు పరమాణువులందుఁగలడు. అటులనే ధూళిలో సైతముకలడు. అతనికి నమస్కారము,

**254 వ. నామము- శివ:- "నమఃపాంసవ్యాయచ"**

భ. భా. భా:— "అణోరణీయాన్" అను శ్రుతిచొ॥న మహాదేవుడు అణువుకంటె అణువుగానుండును. అందుచే నాతడు పాంసువులందు = సూక్ష్మరేణువులందుండి పాంసవ్యనామకుడాయెను. "పసి = నాశనే" అను ధాతువునుండియేర్పడిన పాంసుపదమునకు నశింపఁజేయునదవి యర్థము. సర్వమును నశింపఁజేయునవి అణుశక్తులు. వానిలో సంహారకుడుగానుండుటచే శివునకుఁ బాంసవ్యుడని నామమేర్పడెను.

*విష్ణుః-*

"పాంసయతివృష్టిమ్" అను వ్యుత్పత్తిచే చూపరులవృష్టిని నశింపఁ జేయువాడు సూర్యభగవానుడు. అతనిలోఁ బ్రభారూపమున విష్ణువున్నట్లు "ప్రభాస్మిశశిసూర్యయోః" అను గీతాసూక్తిచేఁ దెలియుచున్నది. కావున విష్ణువునకును పాంసవ్యుడనునామము సార్థకమని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి —*

పాంసవ్యనామమున "ప్+ఆ+మ్+స్+అ+వ్+య్+అ" అని యెనిమిదక్షరములుకలవు. అవి అష్టప్రకృతులను, అష్టచక్రములను సూచించును. శక్తిపరాశక్తిబీజములు, పర్జన్యమదన విష్ణుబీజములతోఁగూడి యున్నవి. వరుణవాయుబీజములు అకారముతోగూడియున్నవి. ఈనామము శక్తిప్రధానము. దీనిని బ్రాణాయామమున జలస్థానమున నుపాసించువారు సకలకామములనుబొందగలరు. జలమునందలి వస్తుజాలమునెల్లఁ గనుగొనఁ గలరు. వాయుసహాయమున సముద్రాదులలో సంచరింపఁగలరు; అని తెలియు చున్నది.

*255 వ. నామము:- శివ — "నమోరజస్యాయచ"*

భ. భా. భా:— "మహతోమహీయన్" అను శ్రుతిలోఁ జెప్పినట్లు మహా దేవుడు మహత్తులకంటెమహత్తైయున్నాడు. రజస్సు అను దానికి ధూళి, రజో గుణము అని రెండు అర్థములుకలవు. రెండును మహత్తులే. వానిలో మహా దేవుడుకలడు. రజస్సుతో = ధూళితోఁగూడిన ఆహారపదార్థములు హాని చేకూర్చును. రజస్సుకన్నులలోఁ బడిదృష్టిని జెడఁగొట్టును. అందుచే రజస్సు లందు స్థూలరేణువులందుఉన్నవాడై రజస్యుడాయెనని ఇందుఁజెప్పఁబడెను. అంతేకాదు. రజస్సునుండి = రజోగుణమునుండి ప్రాణులకుహానిచేయు కామ క్రోధములుద్భవించునని "కామఏషక్రోధఏషరజోగుణసముద్భవః" అను గీతాసూక్తిచేఁ దెలియుచున్నది. లోకముపైఁ గ్రోధముచూపువాడు శివుడు. అతడు క్రోధరూపుడై రజోగుణముననుండును. అందుచే రజస్యుడాయెను.

"యదస్యపారేరజసః" అనుసూక్తిచే రజశ్శబ్దము లోకవాచకమని తెలియు చున్నది రజోలోకమున నుండుటచే శివుడు రజస్యనామకుడాయెననియుఁ దెలియుచున్నది.

విష్ణు: "రజ్యంతే అనేనేతిరజః" ఈరజోగుణముచే అందఱును రాగయుక్తులగుదురు. లోకమును రాగయుక్తముగానొనర్చుటకు విష్ణువు రజోగుణమున నుండునను విషయము "ధర్మావిరుద్ధోరాగోఽస్మి" ధర్మవిరుద్ధముకాని రాగమునేననిచెప్పిన గీతాసూక్తిచేఁ దెలియుచున్నది. "రజఃకర్మణిభారత" అను గీతాసూక్తిచే రజోగుణము జీవులకుఁ గర్మలందాసక్తిని గల్గించునని తెలియుచున్నది. విష్ణువు రజోగుణముననుండి రాక్షసులలో రజోగుణమును రేకెత్తించి వారిచే దుష్టకృత్యములనుజేయించి, వారిని శిక్షించినాడు. అందుచే విష్ణువు రజస్యుడాయెను. అతడు రజోగుణముననుండుటచేతనే రజోగుణనిలయులైన వానరులు శ్రీరామచంద్రుని ప్రేమించి భావిజన్మలోగోపికలై శ్రీకృష్ణుని ప్రేమించినారు. అపుడు విష్ణువు శ్రీకృష్ణుడై భ్రమరగీతమువారిచేఁ బాడించినాడు. కావున విష్ణువును రజస్యనామకుడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి:-*

రజస్యనామమున "ర్+అ+జ్+అ+స్+య్+అ" అని యేడక్షరములుకలవు. ఇవి సప్తవాయుమండలములను, సప్త ధాతువులను సూచించును. ఇందు ఇంద్రశక్తిబీజములు జకారసకారములు ప్రధానములు. వానిముందువెనుకలలో అగ్నివాయుదేవబీజములుకలవు. ఇందుచే గుండలినీ శక్తిని అగ్నిరూపిణిగాభావించి ప్రాణాయామమున ఉపాసించవలెను. ఇట్లు చేసిన ఉపాసకులు ఇంద్రలోకమును జేరఁగలరు. అంతేకాదు. పైనామము నుపాసించువారు శక్తిదయచే మహిమనొంది రాజులును నాయకులును అధికారులుకాఁగలరు. శత్రుంజయులుకాఁగలరు వాయ్వగ్నిశక్తులుకల ఓషధులను దయారుచేసి రక్తదోషరోగములను, వాతరోగములను చిన్నమెదడునకుఁ జెందినరోగములను దొలగించఁగలరు.

## -: 9. వ. యజుస్సు :-

"నమశ్శుష్క్యాయచహరిత్యాయచ"

**అర్థము:-**

శుష్క్యాయచ = కాష్ఠములందు (కట్టెలందు) ఉన్నట్టియును, హరిత్యాయచ = తడిసినదానియందును క్రొత్తవానియందునున్నట్టి, శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము-**

సా. భా:— మహాదేవుడు అచేతనములైన కాష్ఠములందును (కట్టెలందును) తడిసినవానియందునుండును. అట్టి శివునకు నమస్కారము.

**256 నామము:- శివ:- "నమశ్శుష్క్యాయచ"**

భ. భా. భా:— శుష్కము అనగా నీరు లేక ఎండినస్థలము. అది నివాస యోగ్యము. కాన అందుండు వస్తువులలో పంచభూతాత్మకుడై పరమేశ్వరు డుండును. అంతేకాదు. దగ్ధమైన స్థలమునుగూడ శుష్కముఅందురు. అందుండు భస్మము తనకుఁ బ్రీతికరము. కాన శుష్కమున శివుడుండి శుష్క్య నామకుడాయెను.

విష్ణు:— శుష్కము అనగా ఎండినకట్టె స్తంభము మున్నగునదికదా! విష్ణువు స్తంభమునందుండుటచేతనేకదా! హిరణ్యకశిపుడు పగులఁగొట్టిన స్తంభము నుండి ఉద్భవించి, వానిని సంహరించెను. భగవంతుడు విష్ణువు సర్వమున నుండుననియేకదా "ఇందుఁగలడందులేడని సందేహమువలదు।

చక్రిసర్వోపగతుండు।

ఎందెందు వెదకిచూచిన నందందేగలడు దానవాగ్రణి! వింటే"

అను పోతన పద్యమువలనఁ దెలియుచున్నది. శుష్కమునందు (స్తంభము నందు) నృసింహరూపమునను, ఎండిన కట్టెలో అగ్నిరూపముననుండుటచే విష్ణువు శుష్క్యనామకుడాయెను.

*బీజాక్షరసంపుటి—*

శుష్క్యనామమున "శ్ + ఉ + ష్ + క్ + య్ + అ" అని అక్షరములు కలవు. అవి షడృతువులను షడింద్రియములను సూచించును. లక్ష్మీబీజము వాయుబీజమైన ఉకారముతోడను, సూర్యబీజమైన షకారము ప్రజాపతి వాయుదేవబీజములతోడనుగూడియున్నది. దీనినుపాసించువారు. సూర్య తేజస్సును మోక్షలక్ష్మినిబొందుదురు. వాయుసూర్యశక్తులసహాయమున నేలపైనున్న ప్రజలకుఁ జేకూర్పఁగలవారలై, సకలరోగహరులై ఆరోగ్య ప్రదులుకాఁగలరని తెలియుచున్నది.

*257 నామము; శివ; "నమోహరిత్యాయచ"*

శ. భా. భా:— హరితముఅనగా అకుపచ్చనిరంగు. పింగళవర్ణము. వానిలో శివుడు పోషకశక్తిరూపముననుండి జీవులను రక్షించును. కాన హరిత్య నామకుడాయెను.

విష్ణు:—

హరితమనగా సింహము. "మృగాణాంచమృగేంద్రోఽహమ్" అను గీతాసూక్తిచే హరితమైన సింహమునందు విష్ణువిభూతికలదు. కావున విష్ణువు హరిత్యనామకుడాయెను.

*బీజాక్షరసంపుటి-*

హరిత్యనామమున "హ్+అ+ర్+ఇ+త్+య్+అ" అని ఏడక్షరములుకలవు. శివబీజము, అగ్నిబీజము, వాస్తువాయుబీజములును సకలదేవ విష్ణుబీజములతోగూడియున్నవి. దీనినుపాసించువారు శ్రద్ధామేధాయశః ప్రజ్ఞాసంపన్నులై శివ విష్ణుసాయుజ్యములనుబొందఁగలరు. అంతేకాదు. వాయ్వగ్నిశక్తులతోనిండినమారణయంత్రములను సృష్టించి, వానిని సర్వత్ర వ్యాపింపఁజేసినసర్వ సంహారకులును అగ్నివాయుప్రకోపముఃచేఁ గల్గురోగములను నివారించువారలునుగాఁగలరని తెలియుచున్నది.

## -: 10. వ. యజుస్సు :-

### "నమోలోప్యాయచోలప్యాయచ"

*అర్థము:-*

లోప్యాయచ = తృణాదికములోపించుకఠిన ప్రదేశమునను న్నట్టియును, ఉలప్యాయచ = రెల్లుమొదఁగు తృణములందున్నట్టి శివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:— భగవంతుడు సమవర్తి సమదర్శియగుటచే తృణాదికములుండని కఠినప్రదేశముననుండును. అటులనే రెల్లుమొదలగు తృణలతలందును ఉండును అందుచే అతనికి నమస్కారము.

*258 నామము- శివ:- "నమోలోప్యాయచ"*

భ. బా. భా:— పరమశివుడు చేతనాచేతనములందంతటనుండును. మొక్కలు మొలవని నేలఃందు, కఠిన ప్రదేశములందు జాతినేలలందునుగలడు

కఠిన ప్రదేశమునందు, భూమిలో రత్నాలు, లోహములు, అభ్రకాదులు నుండును. వానిలో తేజోరూపమున శివుడుండును. అజాతినేలే లోపములు. వానిలోనుండుటచే శివుడు లోప్యనామకుడాయెను.

విష్ణు — "అదర్శనంలోపః" కానరాకుండుటయేలోపము. సామాన్యనేత్రము లకుఁగానరాని వైకుంఠాదిలోకజాతమునకు లోపము అనిపేరు వానియందు విష్ణువుండును. లోపమనగా కఠిన ప్రదేశమవిచెప్పియుంటినికదా! అదియే మహాభారమును వహింపఁగలనేల. "బలంబలవతాంచాహమ్" అను గీతా సూక్తిచే బలముగలవానిలో బలరూపమున విష్ణువిభూతియుండునని తెలియు చున్నది. బలవంతమైన లోపములోనుండుటచే విష్ణువుకూడ లోప్యనామకు డాయెను.

*బీజాక్షరసంపుటి-*

లోప్యనామమున "ల్ + ఓ + ప్ + య్ + అ" అని ఐదక్షరములుకలవు అవి పంచభూతములను, పంచేంద్రియములను సూచించును. ఇందుపృథ్వీ బీజమైన లకారము ఈశ్వరబీజముతోడను, పర్జన్యబీజము వాయుదేవబీజముల తోడనుగూడియున్నది పైనామమును పృథ్వీచక్రమున శివప్రధానముగా ధ్యానించి, జపముచేయువానికి అణిమాద్యష్టశక్తులులభించును. దానిమూల మున శత్రుస్తంభనమును కృత్రిమమేఘవృష్టిని జేయగలరు. పృథివిలోఁగల సకలవస్తుజాతమును వాయుశక్తితోఁగనుగొని పృథివీశ్వరులుకాఁగలరు. భూత ప్రేతాదులను దొలగించి జీవులనుగాపాడఁగలరు.

**259 వ. నామము:- శివ — "నమఉలప్యాయచ"**

భ. భా. భా:— "ఉల = సంవరణే" అను ధాతువునకు చుట్టుకొనియుండు నది. లత, అనిఅర్థములుకలవు ఉలచే = లతచే, ప = రక్షించువాడై, వానిలో నుండువాడు ఉలప్యుడు. తెల్లుమొదలగు తృణాదులను ఉలపములందురు. వానిలో తేజోరూపమున శివుడుండును. కావున వానిని యజ్ఞయాగాది కర్మ లకు ఉపయోగించుచున్నారు. అవి పరమ పవిత్రములు కావుననే వానికి

పవిత్రమని పేరున్నట్లు "పవిత్రంతేవితతంబ్రహ్మణస్పతే" అను శ్రుతివలనఁ దెలియుచున్నది. వానిలోనున్న కారణమున శివునకు ఉలప్య నామము వర్తించును.

విష్ణు-

తృణజ్యోతిర్గతలైన "సంజీవని" మున్నగువానిని ఉలపములందురు. వానిని గొనివచ్చి హనుమంతుడు రావణయుద్ధమునమూర్ఛితులైన శ్రీరామ లక్ష్మణులను వానరులను బ్రతికించినట్లు శ్రీరామాయణకథవలనఁ దెలియు చున్నది. ఉలపములైన అలతలలో విష్ణువు జీవశక్తిరూపమునయుండెను. కావున విష్ణువు ఉలప్యనామకుడాయెను.

*బీజాక్షరసంపుటి*—

ఉలప్యనామమున "ఉ+ల్+అ+ప్+య్+అ" అని ఆరక్షరములు కలవు. అవి షణ్మండలములను, షట్చక్రములను సూచించును. ఇది వాయు ప్రధాననామము. యోగులకు ముఖ్యము. పృధివీచక్రమున వాయువునునిల్పి, ప్రాణాయామముచేయువారికి పృధివీలోకముననే ముక్తిలభించును. దీని నుపా సించువారు పృధివీగతవస్తుజాలమును గనుగొనఁగలరు. అనేక విధచర్మ రోగములను బోఁగొట్టఁగలరు.

## — *11. వ. యజుస్సు* —

*'నమఊర్వ్యాయచ సూర్మ్యాయచ'*

*అర్థము*:-

ఊర్వ్యాయచ = భూమియందుండువాడును, సూర్మ్యాయచ = చక్కని కెరటములు కలనదులందుండువాడునగు శివునకు, నమః = నమస్కారము,

*తాత్పర్యము:-*

సా. భా:— మహేశ్వరుడు భూమిపై నానారూపములనుండి జీవులను రక్షించుచున్నాడు. కెరటములతోనిండిన నదులలో నానారూపములనుండి జీవులనుగాపాడుచున్నాడు కాన అతనిని నమస్కరించుచున్నారు.

***260* నామము; శివ; "నమఊర్వ్యాయచ"**

భ. భా. భా:— మహేశ్వరుని రూపములెనిమిదింటిలో భూమియొకటి. అందుచే శివుడు ఉర్విలోనుండెను, అందు అన్నరూపముననున్నకారణమున శివుడు ఊర్వ్యనామకుడాయెను. అతని సహనశక్తియే భూమికి సంక్రమించెను అందుచే ఊర్వ్యనామకుడై శివుడు నమస్కరింపఁబడుచున్నాడు.

విష్ణు:—

శివునివలె విష్ణువును భూమిలోనుండుటచే భూగర్భుడాయెను. "గర్భః కుక్షిస్థజంతౌచ" అను హలాయుధ నిఘంటుసూక్తిచే గర్భస్థ శిశువునుకూడ గర్భమనియందురు విష్ణువుభూమిలో గర్భుడుగానుండెను. "హిరణ్యగర్భో భూగర్భః" అను విష్ణుసహస్రసూక్తిలో విష్ణునామముగానున్న భూగర్భపద మును ఊర్వ్యనామమును సమానార్థకములే కావున విష్ణువు ఊర్వ్యనామకు డాయెను. ఉర్విలో గంధరూపముననుండుటచే ఊర్వ్యుడైన విష్ణువు నమస్క రింపఁబడుచున్నాడు.

*బీజాక్షరసంపుటి:-*

ఊర్వ్యనామమున "ఊ + ర్ + వ్ + య్ + అ" అని యైదక్షరములు కలవు. అవి పంచభూతములను, పంచకోశములను సూచించును. ఇది అగ్ని ప్రధాననామము. దీని నుపాసించువారు జ్యోతీరూపమును బొందుదురు. పంచభూతగోళములందును. విహరించుశక్తిలభించును. శ్యామల, రక్తపుఁ బోటు, జలోదరము శ్విత్రము, వాతరోగము మున్నగువానిని బోఁగొట్టగల రని తెలియుచున్నది.

### 261 నామము- శివ- "నమస్సూర్మ్యాయచ"

భ. భా భా:— సుషిరమనగా, నళియను సుగంధ ద్రవ్యము. అది చక్కగా నుండుచోటును సూర్మియందురు. "సూర్మింజ్వలన్తీంవాశ్లిష్య" అను వచనముచే సూర్మిని ఆశ్రయించి, శివుడుండును, అని తెలియుచున్నది. కావున శివుడు సూర్మ్యనామకుడాయెను.

విష్ణు:- శోభనములైన కెరటములు కలనదులను సూర్మ్మలందురు ఊర్మ్మలనగా గెరటములు. రసోఽహమప్సుకౌంతేయ" అను సూక్తిచే విష్ణువునదులలో రస రూపముననుండునని తెలియుచున్నది. అందుచే విష్ణువు సూర్మ్యనామకుడాయెనని తెలియుచున్నది.

*బీజాక్షరసంపుటి—*

సూర్మ్యనామమున "స్+ఊ+ర్+మ్+య్+అ" అని ఆరక్షరములుకలవు. అవి ఆరుఋతువులను, షట్చక్రములను సూచించును. ఇందు శక్తిబీజము సకారము, భూమిబీజమైన ఊకారముతోఁగూడియున్నది. వాని తర్వాత అగ్నిమదనవాయు సకల దేవబీజములుకలవు. ఇదిశక్తిప్రధానబీజము దీనినుపాసించువారు శక్తిచే నేర్పడిన సంసారమును బొగొట్టుకొని ముక్తులగుదురు. దీనిప్రభావముచే ఉపాసకులు వాయ్వగ్నిభేదములనుగనుగొని, వాని సాయమునభూమిలోని సకల వస్తుజాతమునుగనుగొనిబైటఁబెట్టి జీవులకువలయు సకలకామములను జేకూర్చెదరు. శ్యామలాదిరోగములను దొలగింపఁగలరు.

### -: 12. వ. యజుస్సు :-

"నమః పర్ణ్యాయచ పర్ణశద్యాయచ"

అర్థము:-

పర్ణ్యాయచ = ఆకులందున్నట్టియును, పర్ణశద్యాయచ = ఎండుటాకుల మొత్తమందున్నట్టి శివునకు, నమః = నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:— పరమేశ్వరుడాకులందుండియు జీవులను రక్షించుచున్నాడు. అతనికి నమస్కారము.

**262 నామము- శివ:- "నమః పర్ణ్యాయచ"**

భ. భా. భా.— పర్ణమనగా ఆకు, చెట్టుననుండి దానికిఁ బోషకద్రవ్యమును జేకూర్చియు, జెట్టునకు అవసరమగు జలమును, బొగ్గుపులుసుగాలిని విడుచుచు దానిని రక్షించును "ప్యా = పాలనపూరణయోః" అను ధాతువునుండి యేర్పడిన పర్ణపదమునకు రక్షించునదియనియర్థముకలదు. మహాశివుడు అశ్వత్థవృక్షమునఁ (సంసారవృక్షమున)గల పర్ణములందు అనగాఁ బర్ణములు ఉపలక్షకములుగాఁ గలత్రిశక్తులందు ఇచ్ఛాక్రియాజ్ఞానశక్తులందుండి జీవులను రక్షించుచున్నాడు కావుననే పర్ణ్యనామకుడాయెను. "త్రిసుపర్ణమయాచితం బ్రాహ్మణాయదద్యాత్" అను శ్రుతిచేఁ దెలియుత్రిసుపర్ణము భగవద్గీతలోఁ జెప్పబడిన అశ్వత్థవృక్షమే దానిపర్ణములందున్నవాడు శివుడే. అతడే త్రిసు పర్ణములందును అనగాఁ బర్ణములచే సూచింపఁబడుముల్లోకములందునుగలడు. అందుచేతనే ఆపర్ణములు సుపర్ణములాయెను. అంతేకాదు పర్ణములందు బాణములకు వడిగాఁబోవుటకుఁగట్టఁబడుఱెక్కలందు మహాశివుడుండి శత్రు సంహారక్రియలో యోధులకుఁదోడ్పడును. అందుచే అతడు పర్ణ్యనామకు డాయెను.

విష్ణు:- "ప్యా" ధాతువునుండి యేర్పడిన పర్ణపదమునకు రక్షించుట, పోషించుట అని యర్థములుకలవు. మహావిష్ణువు తనవాహనమైన గరుత్మంతుని యొక్క ఱెక్కలందుండి గమనవేగమునుజేకూర్చును అటులనే యోధులబాణపు ఱెక్కలందుండి గమనవేగమునుజేకూర్చి, యోధులకు యుద్ధమున దోడ్పడును. గమనవేగముచేకూర్చుశక్తి పర్ణములకుండుటచేతనే విమానములకును ఱెక్కలను సంధించినారు. త్రిపురసంహార సమయమున విష్ణువు శివుని ధనుస్సున బాణముగానుండి, దానికిఁగల ఱెక్కలందు శక్తిరూపముననుండి, త్రిపురాసురుని సంహరించి, లోకములనుగాపాడెను. పర్ణమున = పాలనక్రియలో నుండెనన్నమాట. పర్ణము అనగా బలాశవృక్షము. విష్ణువు అందుండి, యజ్ఞమునకవసరమగు సమిధలుతానై యజ్ఞమునుగాపాడెను. కావున విష్ణువు పర్ణ్య నామకుడాయెననుట సమంజసమే.

*బీజాక్షరసంపుటి:-*

పర్ణ్యపదమున "ప్+అ+ర్+ణ్+య్+అ" అని ఆరక్షరములు కలవు. అవి షడృతువులను, షట్చక్రములను సూచించును. వాయ్వగ్ని ప్రధానమైన ఈనామము నుపాసించువారు యోగులై అగ్నిస్వరూపిణియైన దుర్గాదేవినారాధించి, ముక్తులగుదురు. పైనామమును నంది కేశ్వరప్రధానముగా నుపాసించువారు. నాయకులై వాయవ్యాగ్నేయాస్త్రములను గనుగొని శత్రుసంహారకులుకాఁగలరు. కృత్రిమమేఘములను సృష్టించి, వృష్టికరులై సస్యపోషణముగావించి, అన్నదాతలగుదురు. రక్తవాతప్రకోపజనితరోగ పరిహారకులునుగాఁగలరని తెలియుచున్నది.

## *263 నామము:- శివ:- "నమః పర్ణశద్యాయచ"*

భ. భా. భా:— శుష్కపర్ణములరాశిని (ఎండుటాకులప్రోవును) పర్ణశదము అందురు పరమశివుడు అందుండి సర్వజనులకును సులభుడగుచున్నాడు. "శద్" ధాతువునుండియేర్పడిన శదపదమునకు శాకము, ఫలము అని యర్థములుకలవు. పర్ణ = రక్షించునట్టి, శదములందు = శాకఫలములందు ఆతడుండి, జీవులకాహారమునొసంగి, రక్షించువాడు కావున, మహాశివునకు పర్ణశద్యుడను నామము ఏర్పడెను.

*విష్ణు:-*

పాలించుట, పూరించుట అను నర్థములుగల "పౄ" ధాతువునుండి ఏర్పడిన పర్ణపదమునకు ఇచటఁ బూరించుటయనియర్థము. విష్ణువు తన రూపములైన సూర్యాగ్నివాయువులను బ్రహ్మాండమున వ్యాపింపఁజేసి, దుష్టులను నాశనముచేసి శిష్టులను రక్షించుచున్నాడు. శదధాతువునకు నాశనము చేయుటయనునర్థముకూడకలదు సూర్యాగ్నివాయువులు శదులైదుష్టనాశకులై యున్నకారణమున, వారిరూపముననున్న విష్ణువు పర్ణశద్యనామకుడాయెను.

**బీజాక్షరసంపుటి:-**

పర్ణశద్యనామమున "ప్+అ+ర్+ణ్+అ+శ్+అ+ద్+య్+అ" అని పదక్షరములుకలవు. ఇవి పదిదిక్కులను, దశేంద్రియములను సూచించును. ఇందు లక్ష్మీదుర్గాబీజములైన శకారదకారములు ప్రధానములు. శాక్తేయులకిదిముఖ్యనామము. దీనినుపాసించువారు అమితతేజస్సునుబొంది దుర్గమములైన వైకుంఠాదులను జేరఁగలరు. లక్ష్మీదుర్గాబీజములతోఁగూడి యుండుటచే దీనినుపాసించువారు సకాలవర్షములు కురిపించియు జీర్ణశక్తిని ప్రాణశక్తినొసంగియు, నాయకత్వమునుజేకూర్చియు జీవులను రక్షింపఁగలరు. పలువిధములైన చర్మరోగములను బాపఁగలరు.

## -: 13. వ. యజుస్సు :-

"నమోపగురమాణాయచాభిఘ్నతేచ"

**అర్థము:-**

అపగురమాణాయ = సిద్ధముచేయఁబడిన అయుధములుకలవాడును, అభిఘ్నతేచ = సంపూర్ణముగా సంహరించునట్టి శివునకు నమః = నమస్కారము

**తాత్పర్యము:-**

సా. భా:— మహాదేవుడు రాక్షససంహారమునకొనర్చుయుద్ధమునకు అయుధములను సిద్ధముచేసెను. రాక్షసులను సంపూర్ణముగా సంహరించెను అట్టి దేవునకు నమస్కారము.

**264 నామము:- శివ:— "నమోపగురమాణాయ"**

భ. భా. భా:— "గుర్"ధాతువునకు గాయపఱచుట, చంపుటయనునర్థములు కలవు దానినుండి గురమాణశబ్దమేర్పడెను. అపపూర్వకమైన గురమాణ

పదమునకు ("అప + గురమాణ") నిగ్రహించువాడు, సంహరించువాడని యర్థములుకలవు. మహాదేవుడు దురాత్ములను నిగ్రహించి, సంహరించుటకుఁ బ్రవర్తించినవిధము ఇందు చెప్పఁబడెను. త్రిపురాసురుడు మున్నగు రక్కసులు లోకపీడకులు కాన నిగ్రహింపఁదగినవారు వారిని సంహరించుటకు ఆతడు ఆయుధములను సిద్ధముచేసెను. అందుచే ఉద్యతాయుధుడాయెను. కావున శివునకు అపగురమాణనామమువేర్పడెను.

విష్ణు:

అపగురమాణపదమునకు అంతటకునుబోవువాడనియు నర్థముకలదు. అనగా సర్వవ్యాపకుడనియర్థము విష్ణువు సర్వవ్యాపకుడు కావున అపగురమాణనామకుడాయెను. విష్ణువు, అపగురమాణుడు అను రెండుపదములును సమానార్థకములే.

*బీజాక్షరసంపుటి—*

అపగురమాణపదమున "అ + ప్ + అ + గ్ + ఉ + ర్ + అ + మ్ + అ + ణ్ + అ" అని పదునొకండక్షరములుకలవు. అవి ఏకాదశరుద్రులను శరీరమందలి ఏకాదశద్వారములను సూచించును. ఇందు సర్వదేవపర్షద్య గణపతి వాయ్వగ్నినందికేశ్వరబీజములుకలవు. ఇవి పరాశక్తిమదనబీజములతోఁగూడియున్నవి. ఇది పరాశక్తిప్రధానమగునామము. దీనినుపాసించువారికిఁ బరాశక్తిదుర్వాంఛలను దొలఁగించి, మోక్షేచ్ఛగల్గించి తరింపఁజేయును అంతేకాదు. ఈనామము నుపాసించుటచే, నీలిమ, రక్తపుఁబోటు, శ్విత్రము, శ్యామల, కామెల మున్నగురోగములుతొలఁగును. నిర్విఘ్నముగా సకలకార్యములనెఱవేర్చి, రాజాదరణమున మహానాయకులుకాఁగలరని తెలియుచున్నది.

*265 వ. నామము:- శివ— "నమోఽభిఘ్నతే చ"*

భ. భా. భా:— మహాదేవుడు హంతవ్యులైన రాక్షసాదులకెదురుగానిల్చి, వారిని సంహరింపఁగలడు. జీవచైతన్యమై జీవులకుఁగల లౌకిక శత్రువులను సైతము ఎదిరించి సంహరించును. అందుచే శివుడు "అభిఘ్నన్" అను నామముకలవాడాయెను.

**విష్ణు:**

విష్ణువు నృసింహాద్యవతారములందు మహోగ్రుడై అభిముఖముగానున్నహిరణ్యకశిప్వాదులను సంహరించెను. అందుచే ఆతడును అభిఘ్నన్ నామకుడాయెను.

***బీజాక్షరసంపుటి—***

"అభిఘ్నన్" అను నామమున "అ + భ్ + ఇ + ఘ్ + న్ + అ + న్" అని యేడక్షరములుకలవు. అవి సప్తవాయుమండలములను మనోబుద్ధులతోడి పంచేంద్రియములను సూచించును. ఇది శివవిష్ణుప్రధాననామము. దీనినుపాసించువారు భార్గవబీజప్రభావముచే మహావిద్యావంతులు, మహావిజ్ఞానులును అగుదురు. జలాకాశపృథువులందుఁగల సకల శత్రువులను సంహరింపఁగల నానావిధాయుధ నిర్మాతలుకాఁగలరనియు, అందులకుఁదగిన యంత్రములను నిర్మింపఁగలరనియును దెలియుచున్నది.

## — 14. వ. యజుస్సు —

### "నమఆఖిదతేచ ప్రఖిదతేచ"

**అర్థము:-**

ఆఖిదతేచ = ఇంచుకంతదుఃఖము కల్గించునట్టియును, ప్రఖిదతేచ = అత్యంతము దుఃఖముకల్గించునట్టి, శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— మహాదేవుడు దుష్కర్మఫలము తక్కువైనచో జీవులకు ఇంచుకంతదుఃఖముకల్గించును. దుష్కర్మఫలము మిక్కుటమగుచో జీవులకు మిక్కిలిగా దుఃఖముకల్గించును.

**266 నామము- శివః+విష్ణు- "నమఆఖిదతేచ"**

భ. భా. భా:— శివుడు సంహారకర్త. విష్ణువు శిక్షించి, రక్షించువాడు. ఇరువురును ప్రాణులుచేయుదుష్కర్మతక్కువైనచో దక్కువగా శిక్షించి, దుఃఖముకల్గింతురు. శివుడు పార్వతీసహితుడై కైలాసముననుండగా వానిని గదిలించి, పరాభవింపఁదలంచిన రావణాసురుని కాలిబొటనవ్రేలితోఁ బర్వతమునడంచి, దానిక్రిందనున్నవానిని, కికీలాడించి, నమకనామములతో స్తోత్రముచేయగా విడిచిపెట్టినాడు. దక్షుడుగర్వముతో శివునాహ్వానింపక యజ్ఞముచేయుచు ఆసమయమునవచ్చినకూతు సతీదేవిని అదరింపమిచేయోగాగ్నిలోఁ బడిఆమె మరణింపగా వీరభద్రరూపుడై శివుడువచ్చి, అదక్షుని శిరంబుఖండించెను. అపుడు దక్షుడు చమకమంత్రములతో స్తోత్రముచేయగా శివుడు మేకతలనతికి వానిని రక్షించెను. విష్ణువు ఇంచుకంతఁగావించిన దుష్కర్మఫలమనుభవింపఁజేయుటకై సుగ్రీవుని వాలిచేఁ జితుకమొత్తించి కాపాడెను. కర్మఫలానుకూలముగాఁ గష్టములనుభవింపఁజేసి, విష్ణువు, కుచేలుని, గజేంద్రునిగాపాడెను. అందుచే శివకేశవులిరువురికిని "ఆఖిదన్" అను నామము వర్తించును.

*బీజాక్షరసంపుటి:-*

"అఖిదన్" అను నామమున "అ+ఖ్+ఖ్+ఇ+ద్+అ+న్" అని యేడక్షరములుకలవు. అవి సప్తమేఘమండలములను, సప్తధాతువులను సూచించును. ఇందు బరాశక్తి గంగాదుర్గాబీజములు, సావిత్రీబీజమును విష్ణుదేవబీజములతో గూడియున్నవి. ఇది శక్తిప్రధానమైన నామము. దీనినుపాసించువారు పాపములనుబోగొట్టుకొని, దేవీకృపచే విముక్తులగుదురు. శక్తిప్రభావము సర్వవ్యాపకము. బాహ్యాభ్యన్తర శత్రునాశకము. దీనినుపాసించువారు జలప్రయాణయంత్రములను, జలము లందలి వస్తువులను బైటపెట్టుయంత్రములను, శత్రుసంహారకయంత్రములను చర్మరోగపరిహారకౌషధములను సృష్టింపగలవారలగుదురని తెలియుచున్నది.

*267 నామము:- శివ+విష్ణు:- "నమః ప్రఖిదతే చ"*

భ. భా. భా:— శివకేశవులు ఇరువురును మహాపాతకకర్తలైన రాక్షసులను త్రిపురాసురరావణాసుర శిశుపాలాదులను అపరాధానుకూలముగా శిక్షించి సంహరించిరి. అందుచే వారిరువురకును "ప్రఖిదన్" అను నామముసార్థకమే యగును.

*బీజాక్షరసంపుటి:-*

"ప్రఖిదన్" అను నామమున "ప్+ర్+అ+ఖ్+ఖ్+ఇ+ద్+అ+న్" అని తొమ్మిదక్షరములుకలవు. అవి నవావరణలను, నవద్వారములను సూచించును. ఇది దుర్గాప్రధానమైననామము. దీనినుపాసించువారు దేవీసాక్షాత్కారమంది ముక్తులగుదురు. జలాగ్నిశక్తులసహాయమున కృత్రిమ మేఘనిర్మాతలును, జలప్రేషక అగ్నిప్రేషకయంత్రనిర్మాతలును అగుదురు. జలాగ్నిప్రకోపజనితరోగపరిహారకులు అగుదురని తెలియుచున్నది.

ఖ. ఖా. ఖాష్యవిశేషాలు;

ఈమంత్రముయొక్క పురశ్చరణాదికమునుగూర్చి చెప్పుచున్నాము వినుడు. కృచ్ఛ్రద్వయమాచరించి, తొలుత అయిదువందలజపముచేయవలెను అట్లైనచో పురశ్చరణచేయువాడగును. మొదట రాజులకుఁ జెందిన నియమము చెప్పఁబడుచున్నది. సామ్రాజ్యమును గోరురాజు ఈచెప్పఁబోవుపనినిజేయ వలెను. వసన్తకాలమున, దేశమునందో, పర్వతమునందో, కాంతారమునందో కలశివాలయమునదేవసన్నిధిని బ్రాహ్మణులచేఁ గార్యసిద్ధికనుకూలము గు మంత్రములను బఠింపఁజేసి, దేవునిబూజించి, మిగిలిన కార్యమారంభింప వలెను. ఆర్ద్రానక్షత్రమునందో, అమావాస్యనాడో ఆరంభింపవలెను. మంత్ర సిద్ధులగు బ్రాహ్మణులను గ్రహింపవలెను. లేదా ఆచార్యుడు తక్షణమే కర్మ సిద్ధిని ఆచరింపవలెను. కల్పవేత్తయైన ఆచార్యుడే సిద్ధుడుగాఁ జెప్పఁబడును. అతడు పలికినట్లే సిద్ధిచేకూరును. అప్పుడే సద్యస్సిద్ధియని చెప్పఁబడుచున్నది. సంశుద్ధుడును, ఆచార్యుడునగు ఆబ్రాహ్మణునుండి, మంత్రమును స్వీకరించి 15 దినములు నిరంతరము జపించవలెను. పిమ్మటను గర్మయోగ్యులగుదురు. ఇట్లు సిద్ధులైనవారిచేతనే హోమముచేయఁదగినదైయున్నది. ప్రతినమస్కా రమునందును ఆహుతిచేయవలెను తిలలు వ్రీహులు యవలుమున్నగువానిని నేతితోఁగలిపి, హోమముచేయవలెను. సూర్యోదయము మొదలు సూర్యాస్త మయమువరకును హోమకాలమే. ఎల్లపుడు పదునొకండు గురువిప్రులచే 30 దినములు ఇట్లు చేయింపవలెను. హోమముచేయువారికిఁ బాత్రలతోఁబాటు ఉత్తరీయాదులు ఒసంగవలెను. ఆచార్యునకును గుండలాదుల నొసంగవలెను. హోమాగ్నిపైఁబాత్రతో ధారగానేయిపోయ

వలెను. ఇట్లు కార్యము సమాప్తమైన పిమ్మట దేవునుద్దేశించి, ప్రతిదినము ఎనిమివేలమందికి, భోజనము పెట్టవలెను. బ్రాహ్మణులకు సంపూర్ణముగా భోజనముపెట్టినపిమ్మట ప్రతిదినముతాను భుజింపవలెను. తుదిదినమున నిత్యముకంటె రెండురెట్లుభోజనము పెట్టవలెను. ఆచార్యునకు సారవంతమైన భూమి దానముచేయవలెను. ఋత్విజులకు నూరు బంగారునాణెములనుగాని, దానిలో సగముకాని దక్షిణగానొసంగవలెను దానికి రెండురెట్లు దక్షిణ ఆచార్యునకు ఒసంగవలెను. శివపూజలోగంధము, కర్పూరము ఒసంగవలెను తామరపూలను అర్పించవలెను. కర్పూరముతోఁబాటు గుగ్గిలపుధూపము సమర్పించవలెను. ఆవునేతితో దీపము పెట్టవలెను. నైవేద్యముగూర్చిచెప్పితిమికదా! ఇట్లు ప్రతిసంవత్సరము రుద్రారాధనముచేయవలెను. ఇట్లు ఆరాధించినచో రాజుచక్రవర్తి అగును. సాగర మధ్యస్థులైన రాజులైనను రుద్రరూపులచే జయింపఁబడుదురు ఇహలోకమున సకల భోగములననుభవించిన పిమ్మట రుద్రరూపులచే అనుగ్రహింపఁబడినవాడై ఆచక్రవర్తి శివపురముచేరును. అచట రుద్రరూపుడై పదివేలకల్పములు శివపురమున భోగములనుభవించిన పిమ్మట శివభక్తుడైన ఆరాజు సప్తద్వీపాధిపతియగును. అట్టివానిచేతులందు శివ ధనుస్సు గుఱుతులుండును. అట్టిగుఱుతులచే ఆరాజు రుద్రారాధన కారియని తెలియును. ఏరాజుచేతులలో ఈగుఱుతులుండునో వాడును రుద్రారాధకుడే యని తెలియును. ఇట్లు 11 గురు విప్రులచేఁ బ్రతిసంవత్సరము రుద్రపూజ చేయింపవలెను.

ధాన్యము-

శ్లో॥ పినాకపాణింభూతేశముద్యత్సూర్యాయుతద్యుతిం।
భూషితంభుజగైర్ధ్యాయేత్ కంఠేకాలంకపర్దినమ్॥

*తాత్పర్యము:-*

పినాకమను ధనుస్సుచేతఁగలవాడును, సకల భూతములకుఁ బ్రభువును, పదివేలమంది ఉదయకాలపు సూర్యులకాంతికలవాడును, సర్పములచే అలంకరింపఁబడినవాడును, కంఠమందు నలుపుకలవాడును. జటాజూటము గల శివునిధ్యానింపవలెను.

## -: 15. వ. యజుస్సు :-

*"నమోవఃకిరికేభ్యోదేవానాగ్ంహృదయేభ్యః"*

*అర్థము:-*

కిరికేభ్యః = భక్తులకుధనములను జిమ్మెడి ఉదారుఁగు రుద్రావతారులకును, దేవానాంహృదయేభ్యః = సర్వదేవప్రియుడగుటచే సర్వదేవతల హృదయమగువారికి, నమః = నమస్కారము.

*తాత్పర్యము-*

సా. భా:— మహాదేవుడు భక్తులకు రుద్రావతారులైన ఉదారులరూపమున వచ్చి, ధనములనొసంగును. సర్వదేవప్రియుడైన అతడు దేవతలహృదయము లందుఁజేరి, ఆయారూపముల సేవింపఁబడి, పెక్కుకోర్కెలను దీర్చును. కాన అతనికి నమస్కారము.

*268 నామము:- శివ— "నమోవఃకిరికేభ్యః"*

భ. భా. భా.:— ఈనామముతో అరంభమైన ఈయనువాకము చివరవరకును ఒకటేమంత్రము భగవంతుడైన ఈశ్వరుడే ఈమంత్రమునకు ఋషియు

దేవతయునైయున్నాడు. ఈమంత్రము షట్పదియైన జగతీఛందస్సునకుఁ జెందియున్నది. ఈమంత్రము ప్రత్యక్షకృతము అనునది యుష్మచ్ఛబ్ద ప్రయోగమువలనఁ దెలియుచున్నది. గుణములు, క్రియలు, జాతి, ఆకారము అనునవి దేవతావిగ్రహమూర్తులకు ఆధారము అయియున్నవి ఇట్టి ఆధారము యొక్క భేదముచే, దేవుని విగ్రహములలో భేదములు ఏర్పడుచున్నవి. ఇట్లు ఈశివుని విగ్రహములు భిన్నములైయున్నవి. వీటికన్నిటికిని ప్రత్యేకముగాఁ బ్రతినమస్కారములు సమర్పింపఁబడుచున్నవి. ఇపుడు మాత్రము సమూహ రూపమున నమస్కరింపఁ బడుచున్నవి. మహాదేవుని నమస్కరించి, ఇపుడు వానియనుచరులను నమస్కరించుచున్నారనికొందఱుచెప్పుచున్నారు. మహాదేవునియొక్క ప్రసిద్ధవేషాకారములు నమస్కరింపఁబడుచున్నవి. జగంబులను శాసించువారి స్వభావముఅజ్ఞాతముగాఉండును. వారువాలగుప్తముగానుందురు వారిపుడు నమస్కరింపఁబడుచున్నారని ఇతరులు చెప్పుచున్నారు. ఇంతవరకు జెప్పిన ఈపక్షము సాధిష్ఠమైయున్నది. అజ్ఞాతవిషయుఁడొకడు ముందుగానే ఉపపన్నతరుడగుచున్నాడు. "దేవానాంహృదయేభ్యః" అను వచనముచే దేవతలహృదయప్రవర్తనమునే మేము తెలిసికొనుచున్నాము నమస్కార పదముండుటచే ఇది అందఱికినీ విశేషణమని తెలియుచున్నది. కిరికాది స్వభావులైన దేవాదులే వీరినెఱుగఁగలరు; కాని మనుష్యాదులు ఎఱుగఁజాలరు ఆమీకును నమస్కారమగుగాక. మీరు దయచూపుడు; ఆయుధములను ఉప సంహరింపుడు; అని దీనియర్థము. ఇంతవరకును ఇది ఉపోద్ఘాతము

"నమోవః కిరికేభ్యః"

లోకులనుగూర్చియులోకములనుగూర్చియు స్వేచ్ఛగా హింసాకర్మలను వెదజల్లువారిని కిరులు అందురు. స్వేచ్ఛగాలోకములను నాశనముచేయు వానినిగూడ కిరులందురు. కిరులే. కిరికులు. కిరుకులైనమీరు దేవతల హృదయములంటే మెలఁగుదురు. అందుచే కిరికులగుమీరు దేవులే అగుదురు. దేవతలే

మిమ్ములను ఎఱుగుదురు. మీరు లోకులను అనుగ్రహించుటకై దేవతల హృదయములందు ఆవిర్భవింతురు. లోకులు తమకోర్కెలు సిద్ధించుటకు ఆకిరికులను సదాస్మరింతురు. దేవతావిశేషములు వారియందుండును గాన వారు దేవహృదయులైరి. దేవులైనకిరికులు అగ్నివాయుసూర్యరూపులును, వారివిభూతులునై పృథివియందును, అంతరిక్షమునందును, దివియందునుందురు. దేవవిభూతులైన వారు పదునొకండుగురు. "యేదేవాసోదివ్యేకదశస్థ" అను శ్రుతిలో దేవులు పదునొకండుగురై దివియందుగలరని చెప్పఁబడెను. ఈసంఖ్యననుసరించి ముల్లోకములందుఁగలవారు ముప్పది ముగ్గురని తెలియుచున్నది. ప్రధాన దేవునితోఁబాటు అతని విభూతులు నూర్వురుదేవులు. ప్రధానులైన అగ్ని వాయు, సూర్యులగుణములుమూడు. వానినిరెట్టింపుచేసికలిపినచో తొంబది తొమ్మండుగురు (99) అగుచున్నారు. నూర్వురిలెక్కలో ఒకడు ప్రధానుడు. అతడే మహాదేవుడు. ఇట్లు పృథివిలోఁ బదునొకండుగురు ప్రధానభూతులు. వారిని అగ్నివాయుసూర్యులతో రెట్టింపుచేసిన ముప్పదిముగ్గురు అగుదురు. వారే ముప్పదిమూడుగణములు అగుచున్నారు. వారే గణాధిపులు "త్రయోదేవాఏకాదశత్రయస్త్రింశాస్సురాధసః" అను శ్రుతిలో బైవిషయముకలదు. ఈదేవతలే అగ్నియొక్కవిభూతులు. విశేషులైన వాయుసూర్యులు ఇద్దఱును అగ్నిననుసరించిచేయువారు. ఇట్లు వీరందఱునుగలిసి ఒకవేయి నూటముప్పది తొమ్మండుగురు అగుదురు (1139) అంతరిక్షమందున్నవాయు విభూతులైన దేవులును అందఱేయని తెలిసికొనవలెను. విశేషులైన అగ్నిసూర్యులు ఇరువురును సూర్యుననుసరించిచేయువారు. ఇట్లు పైనఁబేర్కొన్నవారందఱును గలిసి మూడువేలమూడువందల ముప్పదితొమ్మండుగురు (3339) దేవతలు అగుచున్నారు "త్రీణిశతానిత్రిసహస్రాణ్యగ్నింత్రింశచ్చ దేవానవచాసపర్యన్" అను శ్రుతివలన బైవిషయము తెలియుచున్నది. వీరందఱును నానావేషాధికారములుకలవారై, ఇష్టాపూర్తభాగధేయులై మహాభూతముయొక్క విస్ఫు

లింగములగుచున్నారు. ఒక బ్రాహ్మణమునఁ గలప్రక్రియననుసరించి, ఈవిధమైన వారందఱును బ్రహ్మాండపిండాండములందుండి అనన్తులగుచున్నారు. ఇట్లు ఈవిషయమును వివరించిన అతిప్రసంగమగును.

**విష్ణు:**

విష్ణువుకిరియై (వరహమై) భూమిని జాపవలెఁ జుట్టిన హిరణ్యాక్షుని సంహరించెను. అటులనే లోకములనుబీడించువారిని సంహరించుటకు విష్ణువు తనశక్తులను దేవతలందుఁ బ్రవేశపెట్టెను. వారిచేదుష్టులను సంహరింపఁ జేసెను. కిరులే కిరుకులు. కాన దేవహృదయులైన కిరుకులును విష్ణువవలెఁ గిరికనామకులు అగుదురు. అందుచే విష్ణువుకూడ దేవహృదయుడగుటచేఁ గిరికనామకుడాయెను.

**బీజాక్షరసంపుటి-**

"కిరిక"నామమున "క్ + ఇ + ర్ + ఇ + క్ + అ" అని అరక్షరములు కలవు. అవి: షడృతువులను, షట్చక్రములను సూచించును. పైనామమునుపాసించువారు అగ్నిస్వరూపులై ముక్తులగుదురు. అగ్నిభేదములను వానిశక్తులను బైటపెట్టి కృత్రిమమేఘములద్వారా సకలకాలములందును వర్షము కురిపించి, పంటలు పండించి, జీవులను రక్షింపఁగలవారలును, రక్తపుఁబోటు, కామెర్లమున్నగురోగములనుబోగొట్టఁగలవారలును అగుదురని తెలియుచున్నది

## -: 16. వ. యజుస్సు :-

### "నమోవిక్షీణకేభ్యః"

**అర్థము:-**

విక్షీణకేభ్యః = క్షీణించువానికంటె విపరీతములై ఎన్నటికిని నశింపని శివశక్తులకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— జీవశక్తులునశించును. జీవులనుద్ధరించుశివశక్తులుమాత్రముఎప్పుడును నశింపవు. కావున వానికి నమస్కారము.

### 269 నామము:- శివ— "నమోవిక్షీణకేభ్యః"

భ. భా. భా:— పరమేశ్వరుడు తనశక్తులను, నానాదేవతలందును బలవంతు లందును బ్రవేశపెట్టి, భక్తులుకానివారిని విచిత్రముగాహింసించును. వారిని హింసించిశిక్షించుటకే వ్యాధులను, చోరులను నరకము మున్నగువానిని ఏర్ప ఱచెను. కావున శివశక్తులు విక్షీణకములాయెను. వ్యాధిచోరాదులలోఁగల శివ శక్తులువివిధముగా క్షీణించును. కాన విక్షీణకములాయెను అందుచే విక్షీణక నామము శివునకు సార్ధకము.

### విష్ణు-

"ఉద్భవఃక్షోభణోదేవః" అను విష్ణుసహస్రసూక్తిలో క్షోభణనామము విష్ణుపరముగాఁగలదు. "ప్రకృతిపురుషంచైవ ప్రవిశ్యాత్మేచ్ఛయాహరిః। క్షోభయామాస" అను విష్ణుపురాణసూక్తిచే సృష్టిసమయమున విష్ణువు ప్రకృతి లోను బురుషునియందును బ్రవేశించి, క్షోభపఱచును; అని కలదు. అందుచే విష్ణువు క్షోభణుడాయెను. పైక్షోభణపదమును హింసార్ధకమైన విక్షీణక నామ్నమును సమానార్ధకములు, కావున విక్షీణకనామము విష్ణువునకుఁ జెల్లు నని తెలియుచున్నది.

### బీజాక్షరసంపుటి:-

విక్షీణకనామమున "వ్+ఇ+క్+ష్+ఈ+ణ్+అ+క్+అ" అని తొమ్మిదక్షరములుకలవు. అవి నవదుర్గలను, శరీరమందలి నవద్వారము లను సూచించును. ఇందుద్వాదశాత్మబీజము (సూర్యబీజము) ప్రధానము, దీనినుపాసించువారు సౌరలోకముచేరుదురు. ఆరోగ్యవంతులు తేజోరూపు లునుకాఁగలరు. విష్ణుబీజమాయాశక్తిబీజప్రభావముచే దీనినుపాసించువారు జలమండలమున, సూర్యమండలమునఁగల వస్తువులను బరిశోధించువారు, జలాగ్నిమండలయాన నిపుణులునై జలోదరమును, శ్వాసల, కామెల అను

వానిని, రక్తదోషరోగములను నిర్మూలింపఁగలవారఁగుదురు. నందికేశ్వర ప్రజాపతిబీజములున్నకారణమున దీనిని ఉపాసించువారు మహానాయకులును గాఁగలరని తెలియుచున్నది.

-: 17. వే. యజుస్సు :-

"నమోవిచిన్వత్కేభ్యః"

**అర్థము:-**

విచిన్వత్కేభ్యః = అపేక్షించు అర్థమును సంపాదించియొసంగు శివునకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము-**

సౌ. భా:— ఐశ్వర్యకాములు పరమేశ్వరుని పూజింతురు. ఐశ్వర్యము పొందుదురు. పరమేశ్వరుడు తన భక్తులకు వారపేక్షించిన అర్థజాతముసంపాదించి యొసంగును. కావునవారు శివుని నమస్కరింతురు.

**270 నామము- శివః- "నమోవిచిన్వత్కేభ్యః"**

భ. శా. భా:— పరమేశ్వరుడు సుకృతముచేసినవారెవరు? అని పరిశోధించి సుకృతులనురక్షించును. కాన, విచిన్వత్కనామము శివునకు సార్థకము.

**విష్ణుః—**

విష్ణువు తనపాలనలోఁగల జీవులను చక్కఁగా పరీక్షించును. సజ్జనులైనవారిని, విభీషణ సుగ్రీవాదులనువలె వృద్ధిచేయును. దుష్టులను రావణాది రాక్షసులనువలె సంహరించి తగ్గించును. కావున విష్ణువునకును విచిన్వత్క నామము సార్థకమగును.

**బీజాక్షరసంపుటి:-**

విచిన్వత్కనామమున "వ్ + ఇ + చ్ + ఇ + న్ + వ్ + అ + త్ + క్ + అ" అని పదక్షరములుకలవు అవి దశదిక్కులను, పశేంద్రియములను, సూచించును. ఇందు రెండు విష్ణుబీజములు, రెండువరుణబీజములును సావిత్రీ వాస్తుప్రజాపతి దేవబీజములతోఁగూడియున్నవి. ఇందు శివకేశవబీజములు కలవు. కావున ఇది అద్వైతులకుఁ బ్రధానోపాస్యనామము. దీనినుపాసించు వారు ముక్తులగుదురు. అంతేకాదు. రక్షకసంహారకయంత్రనిర్మాతలై,సముద్ర మందలి వస్తువులను బరిశీలించి, ప్రజలకుఁదెచ్చియిచ్చి రక్షింపఁగలరు. సముద్రములో సంచరింపఁగలమారణాయుధములను జలాంతర్గాములు మున్నగు వానిని సృష్టించి, శత్రువులను సంహరించియుఁ బ్రజలను రక్షింపఁ గలరని తెలియుచున్నది. అంతేకాదు శ్యామల, కామెల, నీలిమ, శ్విత్రము, మున్నగు రోగములను రక్తము నీరుగామారు రోగమును జలోదరాదులను దొలగింపఁగలరనితెలియుచున్నది.

## — 18. వ. యజుస్సు —

## "నమఆనిర్హతేభ్యః"

**అర్థము:-**

అ = సంపూర్ణముగా, ని = నిశ్శేషముగా, హతేభ్యః = జీవులపాపము లను, అచేతనములందలిదోషములను, లోపములను దొలగించు, శివులకు, నమః = నమస్కారము.

**తాత్పర్యము:-**

సా. భా:— మహాదేవుడుచేతనాచేతనములందు సమదృష్టిచూపి, సకల మును రక్షించును. ప్రాణులలోఁగలలోపములేపాపములు. వానిని శివుడు సంపూర్ణముగా నిశ్శేషముగా దొలగించి, రక్షించును. అట్లేప్రాణములేని వస్తువులందలి లోపములను దొలగించి, నిర్దుష్టములైన వస్తువులను లోకుల కొసంగి రక్షించును. కాన శివుడు అనిర్హతనామకుడాయెను. వాని శక్తులు అనిర్హతములాయెను. అందుచే శివులను అందఱును నమస్కరింతురు.

**271 వ. నామము:- శివ—**

భ. భా. భా:— హననము (లేక) హతముఅనగా హింసఅనియర్థము. ఇది "ఆ + నిస్ + హతేభ్యః" అని పదవిభాగము. ఆకారము, మర్యాదనుదెల్పును

నిర్ అనునదినిశ్చయమును దెల్పును. మర్యాదగానిశ్చితమైచేయఁబడినది అనిర్హతము. అధికలవారు అనిర్హతులు. పాపులను భగవంతుడు మర్యాదతో, నిశ్చయముతోసంహరించును కాన అనిర్హతుడగును. అతడు పాపులను సైతము అన్యాయముగా సంహరింపడు. అపరాధముకలవారిని ఉపేక్షింపడు: అని దీనివలనఁ దెలియుచున్నది. మర్యాదనుండి నిర్గమించినవారిని, (హద్దు మీరినవారిని) అమర్యాదగాఁ బ్రవర్తించినవారిని, నహుషుడు రావణుడు మున్నగువారిని మహారుద్రుడు శిక్షించును; సంహరించును. కాన అనిర్హత నామకుడాయెనని తెలియుచున్నది. అట్టివారినిశిక్షింపకున్నచో అప్పాపాత్ములను మిగిలిన వారితోఁబూజించుట, కొనియాడుట జరుగును. అందుచే వారిని మిగిలిన దేవతలనుండి శివుడు వేరుచేసి, సంహరించును.

"మాత్వారుద్రచుక్రుధా, మానమోభి,ర్మాదుష్టుతీ, వృషభమాసహూతీ" అను మంత్రమున "రుద్రుడా! దుష్టులతోనున్నమాత్రాన మమ్ములను ఆగ్రహింపకుము;" అని చెప్పఁబడెను "స్వాయామేవదిశిరుద్రంనిరవదయతే"అను బ్రాహ్మణవచనమునఁ బైవిషయమే చెప్పఁబడెను.

విష్ణు:- శివునువలె విష్ణువుకూడ పాపులను దైత్యదానవరాక్షసులను శిక్షించెను సంహరించెను. "చంద్రమామనసోజాతః" మున్నగు శ్రుతులను బరిశీలించినచో, విష్ణువునంశ చంద్రాదిదేవతలలోఁ గలదనియును, తాను స్వయముగా దుర్మార్గులను సంహరించుటయేకాక, తనయంశగలవారిచే సైతము సంహరింపజేసెను. కావున విష్ణువునకును అనిర్హతనామము సార్థకమగును.

***బీజాక్షరసంపుటి:-***

అనిర్హతనామమున "అ+న్+ఇ+ర్+హ్+అ+త్+అ" అని ఎనిమిదక్షరములు కలవు ఇవి అష్టదిక్కులను, అష్టాంగములను సూచించును ఇందుఁ బరాశక్తి; సావిత్రీబీజములతోఁబాటు శివకేశవాగ్నివాస్తుదేవబీజములు కలవు. ఈనామము నుపాసించువారు శక్తిసహిత శివకేశవులను ఆరాధించి, అగ్నిసాయమున ఉత్తమలోకములనుబొందుదురు. అగ్నిమాంద్యచర్మరోగాదులనుబోఁగొట్టఁగలరు. సర్వవ్యాపకములైన సంహారక[illegible]ను సృష్టించగలరని తెలియుచున్నది.



## — 19. వ. యజుస్సు —

### "నమఆమీవత్కేభ్యః"

*అర్థము:-*

ఆమీవత్కేభ్యః = సంపూర్ణముగా స్థూలభావముపొందిదేవతలలోఁగల శివులకు నమస్కారము.

*తాత్పర్యము:-*

సా. భా:— మహాశివుడు స్థూలములైన చేతనాచేతనవస్తువులందును దేవహృదయములందును ఉండి సకల జీవులను, సకలలోకములను గాపాడెను. కాన ఆమీవత్కనామకుఁడాయెను. నమస్కరింపఁబడెను.

పంచమానువాకముమొదలు నవమానువాకాంతముగల మంత్రములందలినామములు అన్యతరనమస్కారములుగాఁ జెప్పఁబడెను పరమేశ్వరుడు సర్వాత్ముడని ప్రతిపాదించుటకు, ఏకైకయజుస్సుతో స్థావరజంగమరూపము ఒక్కొక్కటి చెప్పఁబడెను. ఒక్కొక్క యనువాకమును ఒక్కొక్క మంత్రముగా భావింపవచ్చును మంత్రపురశ్చరణాదిప్రకారము రుద్రకల్పమునఁ జెప్పఁబడెను.

*వేదార్థప్రకాశమగు సాయన భాష్యముగల*
*నవమానువాకము సమాప్తము*

### 272 నామము- శివ- "నమఆమీవత్కేభ్యః"

భ. భా. భా:— "మీఙ్ = హింసాయామ్" అను ధాతువునుండియేర్పడిన మీవత్పదమునకు సంహరించువాడనియర్థము. "ఆ + మీవత్కేభ్యః = అంతటను విజృంభించుచు దురాత్ములను దూరముగాఁ దొలగించు శివులకు ఆమీవత్పనమేర్పడెను అవి నమస్కరింపఁబడెను.

*బీజాక్షరసంపుటి* —

అమీవత్క నామమున "అ + మ్ + ఈ + వ్ + అ + త్ + క్ + అ" అని యెనిమిదక్షరములు కలవు. ఇవి అష్టప్రకృతులను. శరీరస్థాష్టచక్రములను సూచించును ఇందు శక్తిబీజములగు అకారమును, ఈకారమును దేవబీజమైన అకారముతోఁగూడియున్నవి. ఇందు మదనబీజము, వరుణవాస్తుప్రజాపతి బీజములును కలవు శక్తిప్రధానమైన ఈనామము నుపాసించువారు జల యంత్రనిర్మాత, వృష్టికరులునై జలమందలి సకలవస్తువులను బైటపెట్టి, సకలకాంక్షలను దీర్పఁగలరని తెలియుచున్నది.

భ. భా. భా:— ఈమంత్రపురశ్చరణమును బరిశీలింపుడు. సావధానుడై 40 వేలసార్లు ఈమంత్రమును జపించవలెను అప్పటికి పురశ్చరణముపూర్తి యగును. మంత్రశోధనకై గురుసన్నిధిని 8 వేలజపముచేయవలెను. అందు వలనఁగర్మయోగ్యుఁడగును. ఈమంత్రముచే సాధింపరానిదేదియును, ఏమాత్రమునులేదు మంత్రప్రభావముచే సమస్తమునుజేకూరును. దీనిచేఁ గామ్యకర్మచెప్పఁబడెను. దేవుడైన దక్షిణామూర్తియొక్క సన్నిధిని, ఆత్మాగ్ని యందుగాని, మధితాగ్నియందుగాని పేలాలను, తిలలను (నూవులను) లక్ష సంఖ్యగా హోమముచేయవలెను. అట్లైనచో సువర్ణము ఉత్పన్నమగును. అపామార్గబీజములను పెరుగులోదడిపియు, వేణుబీజములనుదేనెలోఁ దడి పియు, యవలను నేతిలోఁదడిపియును, 10 వేలుహోమమును చేయవలెను. వేయి రెట్లు బంగారము ఉత్పన్నమగును. కన్యాకాముకుడు గుగ్గిలముతోఁ దనకిష్ట మైన కన్యయొక్క ఆకారమును నిర్మించి, దానిని స్వీకరించి 5 వేలజపమొనర్చి తర్వాతను అభొమ్మనుఛేదించి, 6 వేలుహోమముఛేయవలెను. అపుడు సర్వా భరణభూషితయైన ఇష్టమైనకన్యనుబొందును, తామరపూవులను నల్లకలువలను, తెల్లకలువలను, లక్షహోమముచేసినవానికి రాజ్యలక్ష్మి ప్రత్యక్ష మగును.

మోదుగ మొలకనుబాలతోఁ దడిపి, లక్షహోమముచేసినచో యక్ష రాక్షస భూతప్రేతపిశాచాదులు అదృశ్యులును వశ్యులును అగుదురు. మహా రణ్యభూమిలో, అగ్నికుండమొనర్చి, మథితాగ్నిలోఁ బదివేలమారడిపండ్లను హోమముచేయవలెను. పిడికిలితో మారడియాకులనుగైగొని, నేతితోఁదడిపి 5 వేలహోమముచేయవలెను. మారేడుపండు ఆకారముగల బంగారము ఉత్పన్నమగును. స్వర్ణవేదిపిండమగును సార్వభౌముడు, అనగా చక్రవర్తియైన కుమారుడుకావలెననుకోరికయున్నచో మహాదేవునిపైఁ దెల్లతామర పూవులను ఆవునేతితోఁ దడిపి లక్షహోమముచేయవలెను. జమ్మి సమిధలను దెచ్చివాని చివరలనువంచి, వెండిపాత్రలోనుంచి, పెరుగు, తేనె, నేయి, అను వస్తువులతోఁ దడిపి, 10 వేలుహోమముచేసినచో శివభక్తుడులభించును. తెల్ల సుగంధిఫలములచూర్ణమును వెండిపాత్రలోనుంచి, కపిలగోవునేతితోఁగలిపి, మంత్రించి, స్వయముగాసేవించినచో కవియగును. మేడికఱ్ఱ సమిధలను పెరుగు, తేనె, నేయి, అనువానితోఁ దడిపి, 10 వేలుహోమముచేసినచో, మహా భోగియగును. జాగరణముచేసి, మంత్రపురశ్చరణచేసినవాడు, మనోజవము కలవాడగును.

ఒక సంవత్సరము కృచ్ఛ్రవ్రతముచేసి, ఆత్మసంశోధనముచేసికొన వలెను. పిమ్మట బదునెనిమిది దినములు చరుశాకమూలఫలములు ఆహారముగా గలవాడై నిరంతరము జపముచేయవలెను. మధ్యలో బుద్ధిపూర్వకస్వప్నమైనను రాదు. బుద్ధిపూర్వకముగాక స్వప్నమువచ్చినచో స్నానముచేసి, జపము చేయవలెను. పిమ్మట జపాన్తమున మంత్రానుసారముగా వశమగుటకు గురువుగారికి ఐదుబంగారునాణెములను ఒసంగవలెను. పిమ్మట 50వేలు గురు సన్నిధినో దేవసన్నిధినో జపముచేయవలెను. పిమ్మట వానికి సాక్షాత్తుగా రుద్రుడే ప్రత్యక్షమగును. వానిదయవలన మనోజవముకలవాడగును. గురు వును స్మరించి, 800 మంత్రజపముచేసినవాడు తానుగోరినదేశమును చేరఁ గలడు. పూర్వమువలెఁ బురశ్చరణమొనర్చి, ఎఱ్ఱచందనము కపిలగోవుపాలతో

గలిపి, ఆగంధమును అశ్వత్థపత్రముననుంచి, స్పృశించి, 8 వేలు జపము చేయవలెను పిమ్మట దేవుని స్పృశించి, స్మరించి, ప్రాణాయామముచేసిన వాడు అదృశ్యుడగును. రాజు, రాజపురుషులును వశులగుదురు. దక్షిణా మూర్తిసన్నిధిని నిత్యము 800 జపమొనర్చినచో రాజపురుషులవలన భయము తొలంగును.

పైమంత్రమునకు బదులు ఈక్రిందిశ్లోకమును జపించినను పైనం చెప్పొకినఫలములన్నియును ప్రాప్తించును.

శ్లో॥ విశ్వతఃపాణిపాదాబ్జంవిశ్వతోఽక్షి శిరోముఖం।
జ్వలన్తంవిశ్వమావృత్యతేజోరాశింశివంస్మరేత్॥

**తాత్పర్యము-**

14 లోకములందును వ్యాపించియున్నకారణమున 14 లోకములందలి జీవరాసుల, పాణులు, పాదములు, నేత్రములు, శిరస్సులు, ముఖములును బరమశివునివేయగును. ప్రకాశించుచున్న విశ్వమును ఆవరించి, తేజోరాశియై యుండు శివుని స్మరింపవలెను.

*శ్రీ భట్టభాస్కరవిరచిత యజుర్వేదభాష్యమున*
*శ్రీ రుద్రప్రశ్నమున నవమానువాకము సమాప్తము.*

—★—

## శ్రీ రుద్రాభిషేకమాహాత్మ్యము

## -: దశమానువాకము :-

—: ప్రథమ ఋక్కు :—

"ద్రాపే అంధసస్పతేదరిద్రంనీలలోహిత।
ఏషాంపురుషాణామేషాం పశూనాంమాభేర్మారో।
మోఏషాంకించనామమత్"

సా. భా:— ద్వితీయానువాకముమొదలు నవమాంతములైన అనువాకము లందు వివిధములైనయజుస్సులు ఉభయతోనమస్కారములు, అన్యతరతో నమస్కారములును, జెప్పఁబడినవి. ఏమ్మట దశమానువాకమున ఋగ్రూపములైన మంత్రములు చెప్పఁబడుచున్నవి.

**అర్థము:-**

ద్రాపే = కుత్సితమైనగతినిబొందించువాడా! అంధసస్పతే = అన్నమును రక్షించువాడా! దరిద్రత్ = ఏమియునులేనివాడా! నీలలోహిత = కంఠమున నల్లనివాడవై, ఇతరత్రఎఱ్ఱనివాడా! ఏషాం = ఈమాదగు, పురుషాణాం = పుత్రపౌత్రాదులయొక్కయు, ఏషాం = ఈమాదగు, పశూనాం = గోమహిష్యాదులయొక్కయు, సమూహమును, మాభేః = భయపెట్టకుము. ఏషాం = ఈమోక్షమందిన అందఱిలో, కించన = ఒకవస్తువునైనను, మారః = నశింపజేయకుము. మోఆమమత్ = రోగమందిన వారిగాఁ జేయకుము.

**తాత్పర్యము:-**

సా. భా:— ఓమహాదేవ! పాపమొనర్చిన వారికందఱికినీ నరక

మొసంగి బాధపెట్టుచున్నావు. భక్తులయొక్క అన్నమును గాపాడుచు, అన్న ప్రదానముచే వారిని రక్షించుచున్నావు. నీవు సహజముగా ఏమియునులేని వాడవే. "ఏకమేవాద్వితీయంబ్రహ్మనేహనానాస్తికించన" మహాదేవా! పర మాత్మవైననీవు ఒక్కడవే. నీకంటె వేఱొండవదిలేదు. ఇటునీలో నానాత్వము ఏమాత్రమునులేదు; అని పైశ్రుతిచెప్పుచున్నది. గరళము మ్రింగుటచే నీవు కంఠమందుమాత్రమే నల్లదనముకలవాడవు. ఇతర దేహభాగములందు ఎఱ్ఱనివాడవు. నీవు భక్తులచే ఇట్లు సంబోధింపఁబడుచున్నావు. నీవు మాపుత్ర పౌత్రాదులను, మాగోమహిష్యాదులను భయపెట్టకుము. నీ దయచే మేమందఱమును ముక్తులమే. మామధ్యనున్నవస్తువు ఏదియును నశింప కుండునుగాక. ఏదియును, రోగమొందకుండునుగాక.

**273, 274, 275, 276.** నామములు-

శివ+విష్ణుః—

"ద్రాపే, అంధసస్పతే, దరిద్రత్, నీలలోహిత!"

"ద్రాపే అంధసస్పతే" అను ఈమంత్రమునకు ఋషిపులహుడు. ఆస్తారపంక్తి ఛందస్సు ఆస్తారపంక్తిఛందస్సులో పన్నెండు అక్షరములు కలవు. శ్రీరుద్రుడేదీనికిదేవత. ఈవిధముగా విశ్వరూపముతో దేవునిస్తుతించి, పిమ్మట మాకెవ్వరికిని భయములేకుండునుగాకయని భక్తుడుయాచించుచున్నాడు ఈ వివరణమున శివపరముగను, విష్ణుపరముగను విషయముండును. జీవుల గతి వారికర్మఫలమునకు అనుకూలముగానుండును. అందుచే అది ఒకప్పుడు ఉత్కృష్టమును, ఒకప్పుడునికృష్టమునైయుండును. తీవ్రవేదనను అనుభ వించుటయే అక్కర్మగతియొక్కస్వభావము. ఒకప్పుడది దరిద్రస్వరూపమై యుండును. పైవిధములనుండునదే వికర్మగతి. కర్మ అకర్మ, వికర్మ, అని తొల్లిమానవులుచేయుపని ముర్విధములుగానుండును. వానిలో వికర్మఫల మును సంహారకర్తయైన శివుడు, రక్షణకర్తయైన విష్ణువును, జీవులచే అనుభ వింపఁజేయుదురు

"ద్రా = కుత్సాయాంగతౌ" అను ధాతువునుండియేర్పడిన "ద్రా" అను పదమునకు, కుత్సగతి అనగా నీచమైన గతియని అర్థము. అది శోచ్యము = దుఃఖింపదగినది. సర్వలోకమును ఉపసంహరించుటయే దానిలక్షణము. "అప్లగతౌ" అనుధాతువునుండియేర్పడిన "అపి" అను పదమునకు చేర్చువాడనియర్థము శివకేశవులు కర్మఫలముతగ్గించి, తమభక్తులను తమయొద్దకు జేర్చుకొనుటకు వారిచే అనేక దుఃఖములను, కష్టములను అనుభవింపజేయుదురు. కావున శివకేశవులు ఇరువురును "ద్రాపి" అను నామముకలవారే. "ద్రాపి" అనగా కవచముకలవాడు అనియునర్థముకలదు. శివకేశవులు రాక్షసులతోఁ బోరాడునపుడు కవచముకల్గియేయుందురు. కావున వారికి "ద్రాపి" యను నామముసార్థకమే.

శివుడు చంద్రసూర్యస్వరూపుడై జీవులకవసరమగు అన్నమునొసంగును కావున అంధస్సునకు = అన్నమునకుఁబతియై అంధసస్పతి నామకుడాయెను. అంధస్సుఅనగా నీరు. దానికిఁ బతియైనవాడును అంధసస్పతియగును. మూలప్రకృతియైన జలము పరమాత్మనుండివేరై ప్రకృతియాయెను ఆజలమే విష్ణుపాదోద్భవమై ప్రపంచమునవ్యాపించి, జీవులకు అన్నముగా సైతముఉండెను. అందుచే విష్ణువుకూడ అంధసస్పతినామకుడాయెను. దరిద్రత్ = నిష్పరిగ్రహుడు అనగా ఎవరినుండియును ఏమియును స్వీకరింపనివాడనన్నమాట మహాదేవుడే మహావిష్ణువు. వారుఇరువురును జీవులకు సకలమును ఒసంగుదురు కానివారు ఎవ్వరినుండియును ఏమియును గ్రహింపరు కావున శివకేశవులు ఇరువురును దరిద్రన్నామకులేయన్నమాట.

శివకేశవులు ఇరువురును నీలలోహితనామకులే. ఎట్లన? దేవుని హృదయమునుండి ఆవిర్భవించుటచే రుద్రుడు నీలలోహితుడాయెను. శివుడు భిక్షాటనాదికముచేయుటచేనీలుడును, నారి = వనిత సగభాగముననుండుటచే లోహితుడునాయెను. నామరూపాత్మకుడగుటచేనైనను శివుడు నీలలోహితుడే

కంఠమునందు నీలమును, వామభాగమున లోహితమును అగు శరీరము కలవాడగుటచే సైతము శివుడు నీలలోహితుడే అగును.

విష్ణువునీలుడు = నల్లనివాడును, సూర్యరూపముననుండుటచే లోహితుడునుఅయెను లోహిత, రోహిత, అరుణనామములు సమానార్థకములే అగుటచే లోహితనామము విష్ణువునకుజెల్లును.

రాక్షససంహారముచే వాటిల్లిన కాలుష్యమంతయును దొలగుటచే సైతము నీలలోహితనామము శివకేశవులకు సార్థకమే అగును. ఇట్లు శివకేశవాత్మకుడైన రుద్రుని సంబోధించి, భక్తులు అతనిని అభయము ఒసంగుమనియాచించుచున్నారు. శివకేశవస్వరూపుడవైన భగవంతుడా! పుత్ర పౌత్రాదిరూపులైన ఈమాపురుషులకుగాని గోవులుమున్నగు పశువులకుగాని ఏవిధమైన భయమువాటిల్లనీయక రక్షింపుము హింసింపకుము. వీనికిమారము అనగా అకాలమరణాదికముప్రాప్తింపకుండ, రక్షింపుముతండ్రీ! మహాదేవా! మహావిష్ణో! నిన్నుబూజించుయజమాని ఏవిధమైన ఆర్తినిపీడనుబొందకుండుగాక. యజమానికిఁ జెందిన పశువులును ఆర్తినిజ్వరాదికమును బొందరాదని మాకోరిక.

ఒకదినమున ఉపవాసముచేసి, ఈమంత్రమును 10 వేలు జపింపవలెను. అపుడు పురశ్చరణముపూర్తియగును. పిమ్మట కపిలగోవునేతితో ఆర్ద్రానక్షత్రయుక్తదినమున 10 వేలఆహుతులనుహోమముచేసినచో ధనవంతుడగును. సన్నిపాతజ్వరముతోబాధపడువాని శిరస్సునుండి దూర్వాగ్రములను తుడిచి 5 వేలుహోమముచేసినచో రోగిజర్వవిముక్తుడై దీర్ఘాయుష్మంతుడుఅగును పరులుగావించు ప్రయోగమును, మారణహోమమును అభిచారమందురు అట్టి అభిచారమునుండి భయముపోగొట్టుకొనుటకు, మానవుడు 10 వేలకంకతములను (ప్రసాధనములను) హోమముచేయవలెను. నేతితోఁదడిపినతిలలను 10 వేలుహోమముచేసినచో మహాజనులుగావించు ద్రోహభయముతొలగును. 10 వేలు మేడిపుల్లలను నూలుగింజలతోఁ గలిపిహోమముచేసినచో సర్వభూత భయముతొలఁగును.

గ్రామనగరమధ్యభాగమున అగ్నినుంచి, అందునేతితోఁ దడిపిన తెలకపిండిని 10 వేలుహోమముచేయవలెను. రాత్రియాకులందు బలిని సమర్పించవలెను. తొల్త 8 వేలుహోమముచేయవలెను. అపుడు రుద్రుడు భైరవరూపియై భూతములతో సహప్రత్యక్షమగును. అతనిని జూచిభయపడకున్నచో మహాసిద్ధిజరుగును. చలించి భయపడినచో ఉన్మాదియగును. ఆపదలో ఆమావమును స్మరించినచో ఆపదలు తొలగును. పిమ్మట మహాదేవునిట్లు ధ్యానించవలెను.

శ్లో॥ ఆగుల్ఫాసితకంచుకో డమరుకాశ్లిష్టోల్లసత్కుంతలీ।
శూలీకుండలితశ్రవాస్సతిలకోమందంక్వణన్నూపురః।
శ్రీమన్నిర్మలదంతపంక్తికిరణశ్శ్వేతాయమానాననో
దేవోభైరవవేషభూషితవపుర్ధ్యేయోమృడానీపతిః॥

**తాత్పర్యము-**

మహాదేవుడు కాలిసీలలవరకునువ్రేలాడు తెల్లనికంచుకము కల్గియుండెను. ఢక్కాచే బాగుగాఁ దాకఁబడినట్టియును, ప్రకాశించుముంగురులు కల్గియుండెను. చేతఁద్రిశూలము కల్గియుండెను. చెవులఁగుండలములు కల్గియుండెను. నుదుటఁదిలకముతోఁగూడియుండెను. అతని నూపురములు మెల్లగాధ్వనిచేయుచుండెను అతనికి దంతములవరుస శోభావంతములై నిర్మలములైన కాంతికిరణములు కల్గియుండెను. అతని ముఖము తెల్లగానుండెను. స్వయంప్రకాశమానుడైన అతడు భైరవవేషముదాల్చియుండెను. అట్టి పార్వతీపతియే సదా ధ్యానింపఁగగినవాడైయుండెను.

**బీజాక్షరసంపుటి—**

ద్రావిపదమున "ద్ + ర్ + అ + ప్ + ఇ" అని ఐదక్షరములుకలవు. మద్యావహ్ని ప్రధానమైన పైనామము నుపాసించువాడు శక్త్యుపాసకుడై

జ్ఞానవంతులై తరింతురు. దీని నుపాసించువారు అగ్నిభేదములను గనుగొని దుర్గాప్రభావముచేఁ గృత్రిమమేఘములను, సకాలవర్షమునుకురిపించి, లోక రక్షకులు కాఁగలరని తెలియుచున్నది.

అంధసస్పతినామమున "అ+మ్+ధ్+అ+స్+అ+స్+ప్+అ+త్+ఇ" అని పదునొకండు అక్షరములుకలవు. ఇందలి సకారద్వయము శక్తిప్రధానము. అకారచతుష్టయము పురుషప్రధానము. కావునఁ బైనామము శాక్తాద్వైతులకుఁ బ్రధానము. దీనినుపాసించువారు జ్ఞానులై తరింతురు. శక్తి ప్రభావముచే లోకకాంక్షలను దీర్పఁగలధనరాసులను గనుగొనియుఁ గృత్రిమమేఘసృష్టిచే వర్షముకురిపించియు లోకరక్షణగావించఁగలరని తెలియు చున్నది.

"దరిద్రత్'' అను నామమున రెండు అగ్నిబీజములును, రెండు దుర్గా బీజములునుగలవు. అవివాస్తుబీజముతోఁగూడియున్నవి. కానఁ బైనామము నుపాసించువారు శాక్తేయులై తరింతురు. ఈ నామము నుపాసించువారు అగ్ని ప్రేషకయంత్రములను, సృష్టించిదేశరక్షకులు, వ్యాధినివారకులును గాఁగలరు. నీలలోహితనామమున "న్+ఈ+ల్+అ+ల్+ఓ+హ్+ఇ+త్+అ" అని పదక్షరములుకలవు అవి దశదిక్కులను, దశేంద్రియము లను సూచించును. ఇందు వరుసగా సావిత్రీమాయశక్తిపృథివీబీజములుకలవు. అవి వరుసగా బ్రహ్మశివ విష్ణుబీజములతోడను, వాస్తుబీజముతోడనుగూడి యున్నవి. ఇది సకల మతస్థులకును ఉపాస్యమైన నామము. దీనినుపాసించు వారు సాయుజ్యాది ముక్తులనుబొందుదురు. అంతేకాదు. పృథివిలోఁగల పాంచభౌతికవస్తువులనెల్ల యంత్రసహాయమున వెలికిఁదీసి, లోకోపకార మొనర్పఁగలరని తెల్పియుచున్నది. పృథివీగత వస్తువులనెల్ల బైటికిదీయఁగల యంత్రములను నిర్మింపఁగలవారలుకాఁగలరనియును దెలియుచున్నది.

## -: 2. వ. ఋక్కు :-

*"యాతే రుద్ర! శివాతనూశ్శివావిశ్వాహభేషజీ,*
*శివారుద్రస్యభేషజీ, తయానో మృడజీవసే"*

**అర్థము:-**

హేరుద్ర = ఓ శివుడా! తే = నీదగు, తనూః = ఒకశరీరము, శివా = శాంతమైనది. తయా = అశరీరముతో, నః = మమ్ములను, జీవసే = జీవింపఁజేయుటకు, మృడ = సుఖింపఁజేయుము సా = ఆశరీరము, విశ్వాహభేషజీ = విశ్వ+అహా = అన్నిదినములందును, రోగదారిద్ర్యాదులను దొలగించుటకు, భేషజీ = ఔషధమువంటిదికాన, శివా = శుభకరమైనది. రుద్రస్య = శివుని యొక్క, తాదాత్మ్యముపొందుటకు, భేషజీ = ఔషధరూపమైనదియును, జ్ఞానదానముచే సంసారదుఃఖముతొలగించునుగాన, శివా = మంగళకరమైనదియును అగుచున్నది.

**తాత్పర్యము:-**

సా. భా:— మహాదేవా! నీకు "ఘోర, శివ" అని రెండు శరీరములుకలవు. వానిలో శివ అను శరీరము శాంతస్వరూపము. ఆశరీరముతో మమ్ములను, అనగా జీవులను జీవింపఁజేయుదువు. మాకు సుఖమును జేకూర్చెదవు. పైశరీరముతో, అన్నిదినములందునను, జీవులరోగములను దొలగించెదవు. వారికిఁగల దారిద్ర్యాలను సైతముతొలగించెదవు. కావున ఆనీశరీరము ఔషధమువంటిదై సుఖముచేకూర్చును. నిన్ను సేవించుభక్తులకు నీఆత్మలోఁ జేరుటయనెడి తాదాత్మ్యరూపమోక్షమునొసంగెదవు. జ్ఞానమునొసంగి, జీవులకు జననమరణాదులచేఁ బ్రాప్తించు దుఃఖమును నివారించెదవు. అందుచే నీశరీరమునకుఁగల శివయను నామముసార్థకమైనది.

**శివ + విష్ణు:-**

"యాతేరుద్ర" అను మంత్రమునకు స్కందుడుఋషి. అనుష్టుప్పు ఛందస్సు స్కందరూపియైన రుద్రుడుదేవత. ఓ రుద్రుడా! నీవు విష్ణుస్వరూ

పుడవైన శివుడవు శివకేశవరూపుడవైన నీ శరీరము, సకలజీవులకును సుఖ కరమైనదే. ఆనీశరీరముతో మాకు శుభముచేకూర్పుము. నీవుచేయు శుభము రెండువిధములు. సర్వదుఃఖములను దొలగించుటలో భేషజముగా, ఔషధ ముగానుండుట ఒకవిధము. అత్యంతముకల్గు దుఃఖములను దొలగించుటలో భేషజముగానున్నది రెండవ విధము. మహాదేవ! నీవు తొలుత ధనపుత్రాదుల సుఖమును, స్వర్గసుఖమును, సంసారసుఖమును ఒసంగుచున్నావు. అది ప్రథమ శుభము. పిమ్మటనిన్ను ఆరాధించు భక్తులకు నిశ్శ్రేయసలక్షణసుఖమును (మోక్షసుఖమును) జేకూర్చుచున్నావు. అది రెండవశుభము. పైనఁజెప్పినట్లు రెండు విధముల సుఖమునుజేకూర్చు టచే "శివ"యనుపేరుగల నీ శరీరము సకలదినములందును జీవులకు భేషజ ముగానున్నది పరమశివా! "ఘోర" యనుపేరుగల నీశరీరము, దేశభేద మును, కాలభేదమును, సకల శరీరభేదమును, అవస్థాభేదమును, అనుసరించి, జీవులను రక్షించుటచే, భేషజముగానున్నది. మహాదేవ! నీవు రుజనుఅనగా సంసారమనురోగమును జీవులకువాటిల్లనీయక ద్రవింపఁజేయుచున్నావు. అనగా నశింపఁజేయుచున్నావు కావున నీవు రుద్రుడవైతివి. అందుచే నీశరీరమునకు భేషజనామము ఔషధమను పేరువాటిల్లినది. నీవు నీశరీరముతో సంసారరోగమునుండి భూతములను ఉద్ధరించుచున్నావు. నీశరీరమువలె, నీస్వభావము సైతము, జీవరక్షణకే ఉపయోగపడుచున్నది. కావున నీవు జీవులమగు మమ్ములను సుఖపెట్టుము.

శివుడువలె విష్ణువుకూడ జీవులను రక్షించుటకేపాటుపడుచుండుటచే విష్ణుశరీరమునకును శివయనునామము సార్థకమేయగును. శివశరీరమునకు వలె విష్ణుశరీరమునకును, శివ, ఘోరయనుభేదముకలదు. శివునియొక్క ఘోరనామకశరీరమువలె, విష్ణువుయొక్కఘోరనామకశరీరముసైతము జీవు లను రక్షించును.

ఈ మంత్రమునెట్లు పునశ్చరణచేయవలెనో గమనింపుడు. 8 వందల ప్రాణాయామములుగావించి, 5 వేలు జపముచేసినచోఁ బునశ్చరణపూర్తి యగును. దీనిచేఁ గేవలము గర్భరక్షణజరుగును. 3 నెలలగర్భమని వ్యక్తమైన పిమ్మట శిశురక్షణచేయవలెను రుద్రమంత్రముచే సిద్ధినంది బ్రాహ్మణునిచే గర్భస్థశిశువువృద్ధినొందుటకై తన విభవమునకు అనుకూలముగా అలంకరించి,శంభునిగాభావించి, ఆవిప్రుని నమస్కరింపవలెను. గర్భిణీస్త్రీ దేహమున చక్కనికాంతివాటిల్లినపుడు, సాధుగర్భమును అసాధువులు చూడరాదను తలంపుతో ఈపనిచేయింపవలెను. రాజుగారిగృహమధ్యభాగమున జనశూన్య ప్రదేశమున అడ్డముగా అర్వాగ్గామిద్వయమును స్వీకరించి ధ్వజాద్యలంకారములతో అలంకరించవలెను. రెండుమంత్రములతోఁ బ్రస్థమందలి పరిశుద్ధ తండులములనుజల్లి ఆప్రదేశమున అగ్నికుండమును వేదికను గావించవలెను. ఆవేదికయందు సాధారణఘటముమీదను మహాసేనమంత్రముతో స్వర్ణపుష్పముతో శివుని ఆవాహనచేయవలెను. దానియందు అర్వాగ్గామిద్వయముతో గలశనుంచవలెను. ఆకలశలుబిందుయుతములై దారముతోఁ జుట్టఁబడవలెను ఆకలశలలో స్వర్ణమువేసిహాసిపై మూకుళ్ళుబోర్లించవలెను ఆకలశలునిండుగా సముద్రమును జేరునదీజలముతోనింపవలెను. వానిపై గ్రొత్తబట్టనుగప్పవలెను. ఆమంటపమధ్యమున జలపూర్ణఘటమునుంచవలెను. ఆర్ద్రాది నక్షత్రములతో దినములను లెక్కించవలెను. దానిలో సువర్ణమువేసి, మిగిలిన వానిని నవరత్నములతోనింపవలెను. మూడు రత్నములను వీజతో నిండిన ఘటమున ఉంచవలెను. వానిపై విలువైన వస్త్రములను గప్పవలెను. వానిని స్థిరముగానుంచి దేవుని ఆరాధించవలెను ఆతనిపై గంధమును పూయవలెను. అందావహించిన శ్రీకంఠుని (శివుని) తామరపూలతోఁ

బూజింపవలెను పిమ్మట గగ్గులధూపమును సమర్పించి, నేతిదీపమును చివర కుంచవలెను. అంతటను గర్పూరముతోఁగలుపవలెను. ఇట్లారాధించి, ఆశివుని సన్నిధిని, ఉపస్థానమంత్రమును జపింపవలెను. పిమ్మటఁపటసంసారమంత్రముతో హోమముచేయవలెను నూవులు, దూర్వాగ్రములు, పేలాలు, తులిసి మంచిగంధము, పెరుగు, తేనె, నేయి, అనువానితోఁగూడిన హోమద్రవ్యముతో హోమముచేయవలెను. పిమ్మట హా[illegible]పూజచేయవలెను. ప్రస్థతండులములనువండి, పైమంత్రముతో హవిస్సును అగ్నిలో హోమముచేయవలెను పిమ్మట గంధమును, వస్త్రమును, కర్పూరమును ఒసంగవలెను. పిమ్మట గురువులను ఆదరించుచు, ఉద్దిష్టపురుషుడుకాని, ఇతరుడుకాని భుజించవలెను తర్వాతసాయంకాలమునను, అగ్నికుండలములను, స్పృశించి, ఆచార్యుడు జపముచేయవలెను. నిత్యముచేయు విధముననే వస్త్రాచ్ఛాదనము, వసనోత్తరీయములు సమర్పించుటయును జరుగును నిత్యము బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. ఇట్లాచరించిన రాజునకే శక్తి లభించును. అపుడాతనికి ఆయుర్దాయముగల మంచిసంతానముకల్గును. గర్భస్రావము జరుగనేరదు. గురూపదేశమునననుసరించి, గంధముకంటె మిగిలినదానినిఁ ప్రధానముగాఁ జేయవలెను వపాఖండాదులు మంత్రసంబంధవైదికకృత్యములగుటచే అవిచేయు ప్రదేశమున స్త్రీశూద్రాదులు ప్రవేశింపరాదు. తుదిదినమున స్నానముచేయవలెను. దండదానరూపముగా దాసిని గురువున కొసంగవలెను. పిమ్మట పుత్రస్వీకారమునకై గణపతిపూజచేయవలెను. అట్లైనచో వాని సంతానము, ఆయుర్దాయముకలదగును. కన్యాదేవతనుద్దేశించినేతితోఁ దడిపిన పేలాలను హోమముచేసినచో కన్యలభించును. అపామార్గసమిధలతో హోమముచేసి

పండితుడు అలక్ష్మినిబోగొట్టుకొనవలెను. తిలాహుతులను సమర్పించినచో సర్వ కల్మషములునశించును. మేడిపుల్లలను హోమముచేసినచో బ్రాహ్మణులు వశు లగుదురు. శ్వేతరక్తనీలపీతసూత్రములతోఁ గలశలను బరివేష్టించి, లక్ష సారులు నేతితోహోమముచేసినచో సాధకుడు సర్వకామములనుబొందును. వస్త్రకాముకుడుశ్వేతకుసుమహోమముచేయవలెను. ఏరంగుపుష్పములు హోమముచేసిన ఆరంగువస్త్రములు లభించును.

వృష్టికాముకుడు ఈక్రిందిరీతినిజేయవలెను ఎట్లన? గోమయముతో అలికి పరిశుభ్రముచేసినప్రదేశమున రక్తద్రవ్యముతో అచటనే మండలము చేయవలెను. మండలముఎదుట నూతన కుంభమునుంచవలెను. గంధజల ముతోనింపిన ఆకుంభమును సూత్రముతోఁ గట్టవలెను. పిమ్మట ఆకుంభ మున సూర్యుని ఆవాహనముచేసిఏకాగ్రమానసుడై సాధకోత్తముడు అటనున్న సూర్యదేవుని బూర్వమువలెఁ బూజింపవలెను. అచటపాలతో 108 సార్లు హోమముచేయవలెను. ఏకాగ్రబుద్ధితో ధ్యానించుచు, వేయిసార్లు సూర్య మంత్రమును జపింపవలెను ఇట్లుఏడుదినములో పండ్రెండుదినములో చేసినచో సూర్యభగవానుడు ప్రసన్నుడై మహావర్షముకురిపించును. పుత్రులుకావలెనని కోరువాడుశుచియైమంచి నియమములుకలవాడై రేయింబవళ్ళుఉపవాసముచేయవలెను అగ్నిలోఁ బాయసహోమముచేయవలెను 108 ఆహుతులను సమర్పించవలెను ఋతుస్నాతయైనపిమ్మట 4 వ దినమునస్నానమాడిన తర్వాత భార్యను శుచి యైన వస్త్రాదికముతో అలంకరించవలెను పిమ్మట హుతశేషమును ఆమెచే భుజింపఁజేయవలెను బుధుడైనవాడు 108 సార్లు జపమొనర్చి బ్రాహ్మణులకు భోజనముపెట్టవలెను. స్వస్తివచనముచెప్పింపవలెను. ఇట్లు చేసినచో తేజ

శ్శాలియును, రోగహీనుడునగు పుత్రుడు లభించును అనిష్టమైనవస్తువును జూచినపుడును, దుస్స్వప్నముగాంచినపుడును, అభిచారకర్మలొనర్చుటచే దోషము వాటిల్లినపుడును, అలక్ష్మితోఁగూడినపుడును, విగ్రహాదులుపోయినపుడును, భయము గల్గినపుడును, సూర్యాదిగ్రహపీడలు కల్గినపుడును, భూతపిశాచాదులు తనలో ఆవేశించినపుడును, ఇతరదోషములు వాటిల్లినపుడును. ఇంతకమున్నుచెప్పినట్లే మండలముకావించి, నూతనకుంభమును గంగోదకముతోనింపి, దానికిఁ జెందిన మంగళకరకార్యములాచరించి, ఏలకలను, లవంగాలను, కర్పూరమును నిమ్మపండ్లును, జాజిఫలములను, అకుంభమున ఉంచవలెను. ఆ కలశలో మహాదేవుని ఆవాహన చేయవలెను. పూజింపవలెను అచటనే హోమముచేయవలెను. (1108) 1 వేయి 108 సార్లు ఈ మంత్రముతో మహాశివుని మంత్రించవలెను. పిమ్మట యజమానికాని పరుడుకాని రుద్రాభిషేకముచేయవలెను. ఇట్లు చేసినచో దోషము తెల్లతొలగిపోవును. నిత్యము ప్రాతఃకాలమునస్నానమొనర్చి, వేయిసార్లు ఈమంత్రమును జపించిననో, మానవుడు తప్పక, తనసంపదను, ఆరోగ్యమును, తేజస్సును, సర్వదావృద్ధిచేసికొనఁగలడు. ఒక సంవత్సరము క్షీరాహారుడై జితేంద్రియుడై, జపమొనర్చి యథాశక్తిగాఁ బ్రతిదినము 10 వేలుపూజ చేసినవాడు సాటిలేనిసిద్ధినిబొందును. అతడు అణిమాదిశక్తులనుబొందగలడు. వానికిఁ దప్పక జగత్పతి ప్రసన్నుడగును. వానికి మానుషభోగములేల? ఇట ఒహుగాఁ జెప్పనేల? మహాదేవునియందే చిత్తమునుంచి, తత్పరాయణుడై "మహాశివోఽహమ్" అనుభావముపొందినవాడై పైమంత్రముజపించినచో, మానవుడై తప్పక ముక్తుడగును. పైమంత్రమును బఠింపఁజాలనివాడు ఈక్రింది విధమున శివుని ధ్యానించి, ఈక్రింది శ్లోకమునే జపమొనర్పవలెను.

ధ్యానశ్లోకము:-

"ద్రుతచామీకరప్రఖ్యంశక్తి పాణింషడాననం।
మయూరవాహనారూఢం స్కందరూపం శివంస్మరేత్"

తాత్పర్యము-

అపుడే కరిగిన బంగారమువలెనున్నవాడును, శక్తి యనునాయుధము చేతగలవాడును, అరుమోములుకలవాడును, నెమలివాహనము నధిష్ఠించిన వాడును, కుమారస్వామిరూపుడునగు శివుని స్మరింపవలెను.

## -: 3. వ. ఋక్కు :-

"ఇమాగ్ంరుద్రాయతవసేకపర్దినే క్షయద్వీరాయప్రభరామహేమతిం।
యథానశ్శమసద్ద్విపదేచతుష్పదే విశ్వం పుష్టంగ్రామే అస్మిన్ననాతురమ్"

అర్థము:-

యథా = ఏప్రకారముగా, నః = మాయొక్క, ద్విపదే = పుత్ర పౌత్రాదిరూపమనుష్యునకును, చతుష్పదే = మహిష్యాది రూపపశువునకును, (గేదెలుమున్నగుపశుసమూహామునకును) శం = సుఖము, అసత్ = అగునో, కించ = ఇంతేకాదు, అస్మిన్గ్రామే = ఈగ్రామమునందలి, విశ్వం = ప్రపంచము, పుష్టం = సుఖపూర్ణమును, అనాతురం = ఉపద్రవశూన్యమును, అగునో, తథా = అట్లు, వయం = మేము, రుద్రాయ = రుద్రునికొఱకు,

ఇమాం = ఈ, మతిం = పూజ ధాన్యము, మున్నగువానికిఁ జెందినబుద్ధిని, ప్రభరామహే = గొప్పగాఁ బోషించుచున్నాము. తవసే = బలయుక్తుడును, తాపసవేషుడును, క్షయద్వీరాయ = క్షీణించు ప్రతిపక్షపురుషులుకలవాడునగు, కపర్దినే = రుద్రునకు, సకలమును సమర్పించుచున్నాము.

తాత్పర్యము:-

మహాదేవుడు బలవంతుడు. తాపసవేషముకలవాడు. సృష్టిలోఁగల సమస్తము ఆతనిస్వరూపమే. తనకువ్యతిరేకముగానున్నవన్నియు, శత్రువులైన రాక్షసుల సమూహమంతయును, ఆతని దివ్యతేజస్సుచే క్షీణించును. తనకు వ్యతిరేకముగా భాసించు పాపమంతయు నశించుటకు ఆతడే హేతువు. అట్టి రుద్రునిదయ సంపాదించుటకు మాబుద్ధిని ఆతని పట్లనే ప్రవర్తింపజేసి, మన సారధ్యానింతుము. ఆతడు పుత్రుడు, పౌత్రులు మున్నగు మనుష్యులకును, మాపోషణలోఁ గలపశువులకును, సుఖముచేకూర్చునుగాక. బ్రహ్మాండమనెడి ఈగ్రామమునగల సకలప్రాణులును ఆతని దయచే సుఖము పొందునుగాక. ప్రపంచమున ఏయుపద్రవములును వాటిల్లకుండునుగాక.

శివ + విష్ణు:

భ. భా. భా:— "ఇమాగ్ం రుద్రాయ" "మృడానోరుద్రః" అను రెండు మంత్రములకును మాండవ్యుడుఋషి. ఈరెండును జగతీఛందస్సునకుఁ జెందినవే. రుద్రుడు దేవత. ఈరెండుఋక్కులును ఒకటేమంత్రమని కొందఱితలంపు. శివకేశవరూపుడగు పరమాత్మకుఁ జేయు పూజలు, శారీరకము, వాచికము, మానసికము, అనిమువ్విధములు. అందుచే భక్తులు బుద్ధిలోఁ బరమేశ్వరునిధ్యానించి, ప్రకృష్టముగా మానసికపూజచేయుచున్నారు "స్తుతంస్తోతారఃణప్రియః" అని విష్ణుసహస్రసూక్తిలోఁ జెప్పినట్లు స్తుతిరూపులైన శివకేశవులనుస్తుతిచేసి, భక్తులు ఆతనినిఃప్రసన్నునిజేసికొనుచున్నారు. ఈవిధ

ము గ స్తుతిరూపపూజయును శివకేశవులకు సమర్పింపఁబడును. యజ్ఞాదులలో జేయుస్తుతుఃతోడను, అగ్నిలో సమర్పించు హవిర్దానములచేతను, భక్తులు తమ మతిని శివకేశవులపట్ల అవిచ్ఛిన్నముగా నుంచుచున్నారు, శివకేశవులే స్తోతవ్యులు (స్తుతింపఁదగినవారు.) ఉపాసింపదగినవారు. ఆశ్రయింపఁదగినవారు చూడఁదగినవారు. వినదగినవారు. మన్తవ్యులు. నిధిధ్యాసయోగులు. "ద్రష్టవ్యశ్శ్రోతవ్యోమన్తవ్యోనిధిధ్యాసితవ్యః" అను శ్రుతిలో ఈవిషయమే చెప్పఁబడెను. శివుడు వాయ్వగ్నిచంద్రాదిత్యాదిరూపములతో బ్రహ్మాండము ను వృద్ధిచేయుచుండగా విష్ణువురక్షించుచున్నాడు. "బలాయనమోబలప్రమథ నాయనమః" అను మంత్రమునఁ జెప్పినట్లు శివుడు తవము (బలము) కల్గియుండగా "బలంబలవతామస్మి" అను గీతాసూక్తిలోఁజెప్పినట్లు విష్ణువు తన విభూతిని బలముననుంచినాడు. కానవారు బలవంతులాయెనన్నమాట. కపర్దిమను జటలవరుసగల్గి శివుడుండగా, విష్ణువు, క = జలముచేపర్ది = బ్రహ్మాండమును బవిత్రముచేసెను. అందుచే శివకేశవులు కపర్దులైరి వీరు లందఱును శివునాశ్రయించి, క్షయన్తి = నివసించుచున్నారు. మహావీరులైన రాక్షసులు విష్ణువును సమీపించి, క్షయంతి = నశించుచున్నారు. అందుచే శివకేశవులు క్షయద్వీరులైరి. ఓశివకేశవులారా! మీరు మమ్ములను బ్రకృష్టముగా భరించువారు కాన ద్విపదులైన మాపుత్రాదులను, చతుష్పాత్తులైన మా పశ్వాదులను రక్షింపఁ బ్రార్థించుచు, మీయందే మా మతిని లగ్నము చేయుచున్నాము . మా ప్రాణిజాతము ను సకలము ను సుఖము చేకూర్చి రక్షింపుడు. పుష్టినొందునట్లు చేయుడు. వివిధములైన రోగములు లేకుండునట్లు కాపాడుడు.

"రుద్రాధ్యాయీవసేద్యత్రగ్రామేవానగరేఽపివా,
నతత్రక్షుత్పిపాసాద్యాదుర్భిక్షవ్యాధయోఽపిచ"

అను పురాణసూక్తిచే రుద్రులైన శివకేశవుల మహిమగలమంత్రములను అధ్యయనము చేయువారు నివసించెడి గ్రామమునందుగాని నగరమునందుగాని క్షుత్పిపాసాదిబాధలుండవనియు, దుర్భిక్షమువ్యాధులునుండవనియుఁ దెలియు చున్నది. కావున శివకేశవులారా! జీవులమగుమాకు ధనధాన్యాదికమును సమృద్ధిగానొసంగుడు; అనిభక్తులుప్రార్థించిరి.

## -: 4 వ. ఋక్కు :-

"మృడానోరుద్రోతనోమయస్కృధిక్షయ ద్వీరాయ
నమసావిధేమతే,
యచ్ఛంచయోశ్చమనురాయజేపితాతదశ్యామ తవరుద్ర
ప్రణీతౌ"

అర్థము:-

హేరుద్ర = ఓశివ! నః = మమ్ములను, మృడ = ఇహలోకమున సుఖింపఁజేయుము; ఉత = ఇంతేకాదు నః = మాకు, బరలోకమునను, మయః = సుఖమును, కృధి = చేయుము. క్షయద్వీరాయ = నశింపఁజేయఁబడిన మాపాపములును, వీరులునుగల, తే = నీకు, నమసా = నమస్కారముతో, విధేమ = సేవించెదము. పితా = పాలకుడైన, మనుః = ప్రజాపతి, యత్ = ఏ, శంచ = సుఖమును, యోశ్చ = దుఃఖమునకు దూరముగానుండుటను, యత్ ఆయజే = ఏలేశమును, సంపాదించెనో, తత్ = అసర్వమును, వయం = మేము, హేరుద్ర! = ఓ శివుడా!, తవ = నీ యొక్క, ప్రణీతౌ = ప్రణయమును స్నేహాతిశయమునుగలుగగా, అశ్యామ = పొందఁగలము.

**తాత్పర్యము-**

సా. భా:— మహాదేవ! నీయధీనమునఁగల జీవులకు ఇహలోకసుఖమును పరలోకసుఖమును జేకూర్చుము. జీవులుచేసినపాపములను నశింపఁజేయుము నీసేవచేయుదుము. నీకుమాయందుఁగల వాత్సల్యముచే నీయధీనముననుండి పాలించెడి మనువుచేయుసుఖమును అనుభవించెదము. నీమూలమునఁ బాపమునకుదూరులగుదుము; అని భక్తులు ప్రార్థించిరి.

**శివ+విష్ణు:**

భ. భా. భా:— శివునిదయచే మృకండమహర్షి పుత్రవంతుడాయెను. అతని దయచేతనే అందఱును ఐశ్వర్యవంతులగుదురు. అటులనే విష్ణువుదయచే గజేంద్రుడు బ్రతికెను. కుచేలుడు ఐశ్వర్యవంతుడాయెను. బ్రహ్మాండమందలి జీవులెల్లరును శివకేశవులదయచేతనే, పుత్రధనాదిసమృద్ధిని, సుఖమును బొందుచున్నారు. నిరతిశయమోక్షానందమును బొందుటకు వారేమూలకారణము. మహావీరులు వీరినాశ్రయించియున్నవారు. తమ భక్తులశత్రువులు నశించుచున్నారు. వీరికృపాదృష్టిచే భక్తులందుఁగల కామక్రోధాదివీరులు నశించినారు కాన మహాప్రభులారా! మిమ్ముల నమస్కరించియు, చరువు రోడాశాదులను సమర్పించియు, మీసేవచేయుచున్నారము. కావున మమ్ములను రక్షించి సుఖముచేకూర్చుడు. సుఖమునొసంగినట్టే మాదుఃఖములను పైతము తొలగింపుడు. మాకుఁగష్టములు కలుగుటకుగలకారణములను నిర్మూలించియు, రాబోవుకష్టములను రానీకకయు, రక్షింపుడు. పరమేశ్వరులారా! మీసృష్టిలోనున్నజీవులకు సుఖమునుజేకూర్చుటకై మీయంశతో మనువును సృష్టించినారు అతని యధీనమున బ్రహ్మాండమందలి జీవులకు సుఖము చేకూర్పఁదలంచువాడుకావున అతడు మనువాయెను. ప్రజలకెల్లఁ బితయాయెను ప్రజాపతియైన మనువు మీప్రేరణలననుసరించి, తనవశమునఁగల జీవులకు

వర్ణాశ్రమాదిభేదముతో, మర్యాదను = హద్దును, వ్యవస్థను విస్మరించినాడు. అతనిచే మీరుమాక(గుండుఃఖ)ములను దొలగింపఁజేయుచున్నారు. ఇటులనే మీప్రసాదమువలన మేము ప్రమత్తులముకాక ఉండుచు ప్రమాదమున్నప్పటికిని మీదయవలన మీమాట మీకుటయనుదోషముపొందినవారముకాము. అతిశయముగా మాకు అభిముఖులుకండని భక్తులు శివకేశవులను, రుద్రా! అని సంబోధించుచున్నారు. రుద్రులారా! మీశాసనమున ఉండగలము. మాపట్ల మీకు ప్రణయముకల్గినచో, మేము స్వామములైన తమచెంతను భృత్యులుగా ఉండగలము. అయ్యలారా! మనువు మీచేనియుక్తుడై ప్రజాపతియై ప్రజాహితముచేయుచున్నాడు. మాదుఃఖములను అతడు తొలగించునట్లు, మాకు సుఖము చేకూర్చునట్లును మెలగఁగలము. మనువుకూడ సర్వజ్ఞుడైనను జగత్పితయై మాకృత్యములను ప్రశంసించుచున్నాడు. అతనిరక్షణకు మేము భాజనముకాఁగలము అనితమమొఱవినిపించుకొనిరి

పైరెండుమంత్రముల పురశ్చరణమును గమనింపుడు కృచ్ఛ్రవ్రతమాచరించి పైమంత్రములను 9 వేలసార్లు జపించవలెను. అమావాస్యదినమున, నాల్గుజాతులు కలియుచోటనున్న అగ్నినుంచి, అందుపడిని 10 వేల అహూతులు హోమముచేయ్యవలెను. అందుచే గోశాంతి జరుగును. జలమును స్పృశించి, ఆర్ద్రానక్షత్రయుక్తదినమున 10 వేలుజపమొనర్చి, జలమును వాహనశాలలో జల్లవలెను. అశ్వినితో రాజవాహనములకు శాంతిజరుగును.

పశుపక్ష్యాదుల శాంతికి 10 వేలసార్లునేతితోఁ దడిపిన తిలలను హోమము చేయవలెను. ఇతరజీవులశాంతికి 10 వేలు దూర్వలను హోమము చేయవలెను. మంత్రపఠనార్థ తలేనివారు ఈక్రిందిధ్యానశ్లోకమును జపించవలెను.

*శ్లో॥ దివ్యసింహాసనాసీనస్సోమమాసంముహర్షిభిః*
*ప్రసన్నవదనంధ్యాయేత్ "సోమంసోమార్ధధారిణమ్"*
*("సోమాంశధారిణమ్") అని పాఠాంతరముకలదు.*

**తాత్పర్యము-**

దివ్యసింహాసనాసీనుడై మహర్షులచే స్తుతింపఁబడునట్టియును, చంద్ర రేఖనుదాల్చిఁనసోముని (శివుని) ధ్యానింపవలెను.

## -: 5 వ. ఋక్కు :-

*"మానో మహాంతముతమానో అర్భకం।*
*మానఉక్ష న్తముతమానఉక్షితం*
*మానో వధీః పితరంమోతమాతరం*
*ప్రియామానస్తనువోరుద్రరీరిషః"*

**అర్థము:-**

హేరుద్ర! = ఓరుద్రుడా! నః = మాయొక్క, మహాంతం = ముదుసలియైనపురుషుని, మారీరిషః = హింసింపకు, ఉత = ఇంతేకాదు. నమః = మాయొక్క, అర్భకం = బాలుని; మారీరిషః = హింసింపకుము; కించ = ఇంతేకాదు; నః = మాయొక్క; ఉక్షంతం = నీరుచిమ్ముటకు, సేవచేయుటకును సమర్థుడైన పురుషుని, మారీషః = హింసింపకుము ఉత = ఇంతేకాదు. నః = మాయొక్క, ఉక్షితం = గర్భమందలి పురుషుని, మారీరిషః = హింసింపకుము నః = మాయొక్క, పితరం = తండ్రిని, మావధీః = చంపకుము. ఉత = అంతేకాదు, మాతరం = మాతల్లినిగూడ, మావధీః = చంపకుము నః = మాయొక్క ప్రియాశ్చ = ప్రియమైన, తనువః = శరీరములను, మా రీ రి షః = హింసింపకుము

**తాత్పర్యము:-**

సా. భా— ఓమహాదేవ! మాయింటగల ముదుసలి మాతాత మహాపురుషుడు, అతని, మాబాలుని, మాసేవక జనమును, మాగర్భస్థశిశువును, మాతండ్రిని, మాతల్లిని మా ప్రియమైన శరీరములను హింసింపకుము; అని గృహస్థుడు ప్రార్థించెను.

శివ + కేశవ:-

వ. భా. భా:- ఓశివకేశవులారా! మీరురుద్రులు. మీరేబ్రహ్మాండమంతటికిని తండ్రులు, మాయింట, విద్యావయోజ్యేష్ఠులైన పితామహాదులుగలరు. వారిని మీరు అనుగ్రహింపవలెను. శ్రద్ధాభక్తులు, సద్గుణములుగల మాపుత్రుని రోగాదులలోముంచి, హింసింపకుడు, మీరు ఆరోగ్యదాతయగు సూర్యుని స్వరూపులుకాన ఆరోగ్యమొసంగిరక్షింపుడు. దయాశీలురుకాన అత్యంతము శిశువగు మాపుత్రునిపట్ల అనుగ్రహముచూపుడు. సంసారయోగ్యుడు, యువకుడు, సంతానకరుడునగు మాపుత్రునిరక్షించి, మావంశమును నిలబెట్టుడు వంశోద్ధారకుడైన శిశువుగర్భమునగడు వానిని రక్షింపుడు. అన్నమును ఆరోగ్యమునొసంగు మాతల్లిని, విద్యాబుద్ధులు జీవమునొసంగు మాతండ్రిని రక్షింపుడు. వారు శ్రద్ధచూపదగినవారు. ప్రతిప్రాణికిని, తనశరీరము ప్రియము. అధిధర్మసాధనము కాన దానిని రక్షింపుడు. రోగాదులచే పీడింపకుడు. ముఖ్యముగా భార్యపుత్రాదులను రక్షింపుడు. అని భక్తులు తమ కుటుంబరక్షణకై పరమశివుని ప్రార్థించిరి.

ఇక మంత్రపురశ్చరణ ఫలితములను గమనింపవలెను మూడువవాన ములు అచరించి, ఈమంత్రమును 5 వేలుజపించవలెను. దానిచే స్వజన రక్షణ జరుగును. అందులకుగాను నేతితోగలిపినయవలను దిలలను, 10వేలు హోమముచేయవలెను. నేతిలో ముంచి, 10 వేలు రావిసమిధలను హోమము చేయవలెను. ప్రతిసంవత్సరము ఆర్ద్రానక్షత్రయుక్తకాలమున 10 వేలు హోమముచేసినచో దనయొక్క స్త్రీబాలవృద్ధజనులకు శాంతిజరుగును. ఇతర విషయములశాంతికిని 10 వేలజపమేచేయవలెను. రాజు తన అంతఃపురజనాభి వృద్ధికి ప్రతిమాసమున ఈమంత్రముతోడనే ఆర్ద్రానక్షత్రకాలమున హోమముచేయవలెను. అందువలన గాంతియులభించును.

ధ్యానము:-

శ్లో॥ బాలేందుమకుటందేవంతరుణాదిత్యవిగ్రహం।
ధాయేన్నందీశ్వరాకారంగణేశ్వరసమావృతమ్"

తాత్పర్యము:-

బాలచంద్రునిమకుటమున దాల్చినట్టియును,మధ్యాహ్నకాలపు సూర్యుని వలె మెఱయు శరీరముకలవాడును, స్వయంప్రకాశమానుడును, నందికేశ్వరాకారముకలవాడును, గణాధిపతులతోఁగూడినట్టి దేవుని ధ్యానించవలెను.

## -: 6. వ. ఋక్కు :-

మానస్తోకేతనయేమాన ఆయుషిమానోగోషుమానో అశ్వేషురీరిషః।
వీరాన్మానోరుద్రభామితోఽవధీర్హవిష్మంతో నమసావిధేమతే॥

అర్థము;

హేరుద్ర = ఓరుద్రుడా! నః = మాయొక్కతోకే = సంతానమునందును దయచూపి మారీరిషః = హింసింపకుము నః = మాయొక్క, ఆయుషి = ఆయుర్దాయము విషయమై, మారీరిషః = హింసింపకుము అనగా ఆయువును తగ్గింపకుము నః = మాయొక్క గోషు = గోవులందును, నః = మాయొక్క అశ్వేషు = గుఱ్ఱముల విషయమై, మారీరిషః = హింసను ఆచరింపకుము. భామితః = క్రుద్ధుడవై, నః = మాయొక్క, వీరాన్ = వీరులను, భృత్యులను, మావధీః = వధింపకుము వయం = మేము, హవిష్మంతః = హవిస్సుగలవారమై, తే = నీకు నమసా = నమస్కారముతో, విధేయ = సేవించెదము.

**తాత్పర్యము:-**

సా భా:— మహాదేవ! మేము నిన్నాశ్రయించియున్న జీవులము. కావున నీవు మాసంతానమును, వంశోద్ధారకుడైన మాపుత్రుని హింసింపకుము. మా ఆయుర్దాయమును తగ్గింపకుము మాగోవులను మాగుఱ్ఱములను హింసింప కుము నీక్రోధము అణుశక్తి. అగ్రహించి దానితో మావీరులను, సేవకులను హింసింపకుము మేము నిత్యము హవిస్సులను సమర్పించుచునిన్ను సేవించు చున్నాము.

**శివ + విష్ణు:-**

శి. భా. భా:— ఈమంత్రమునకు భగవంతుడేఋషి. జగతీఛందస్సు దేవ రును భగవంతుడే. శివకేశవులారా! మీరు రుద్రులు. మీరు మాసంతానమును పుత్రపౌత్రులను, రోగాదులచే గృశింపజేసి, హింసింపకుడు.

"ఆయుష్షోడశవర్షశతంప్రహ, షోడశం వర్షశతమజీవత్। ప్రహ షోడశం వర్షశతంజీవతి" "సప్తవింశత్యధికాని శతంవర్షాణి" "ఇత్యేకే" "శతమేవ" "ఇత్యన్యే" అనెడి ఛాందోగ్యాదిశ్రుతులచే నూరుసంవత్సరములకు దక్కువకానిది ఆయుఃప్రమాణమనితెలియుచున్నది. అట్టి ఆయుర్దాయమును తగ్గనీయక కాపాడుడు. ఆహారాదులనొసంగుగోమహిష్యాదులను, యుద్ధప్రయో జనములకుపయోగపడు అశ్వగజాదులను హింసింపకుడు మావీరులుకాని, మాప్రజలుకాని ఏవేని అపచారములనుగావించినను క్రోధమందక రక్షింపుడు. మీక్రోధముతగ్గింపుటకై మేము పురోడాశాది హవిస్సులను సమర్పించు చున్నాము. నమస్కరించుచున్నాము సేవించుచున్నాము. కావున మీరు ఎల్లపుడు మమ్ములను రక్షింపుడు.

ఈమంత్రమునకు జెంపిన పురశ్చరణమును గమనింపుడు కృచ్ఛ్ర వ్రతమాచరించి, ఉదుంబరపాత్రతో కపిలగోవునేతినిదీసి, వేయిసార్లు మంత్రించవలెను. పిమ్మట మధించితీసిన అగ్నిలో 8 వేలహోమమును, మహా వ్యాహృతులతో సమర్పింపవలెను. హోమశేషమును భక్షించి మూడురాత్రులు ఉపవాసముచేయవలెను. పిమ్మట చరుభక్షణముచేసి 50 వేలు జపముచేయ వలెను దీనినాచరింపజేయుగురువునకు ఐదువాణెములనొసంగవలెను ఈవిధ ముగాఁజేయుటచే రాజులు ఆయుస్సునొందుదురు. నిత్యముచేసినట్లే రాజు మధించిన అగ్నిలో కేవలమునేతితోతడిపిన నూవులతో 10 వేలు హోమము చేయవలెను. ఎనమండుగురు విప్రులు ఎనిమిదిదిక్కులందును 8 వందలసార్లు అభిమంత్రించిన భస్మను జల్లి రాజునురక్షింపవలెను. శ్వేతకమలములను (తెల్లతామరపూవులను) దధిమధుఘృతములతోఁదడిపి 10 వేలు హోమము చేయవలెను. రుద్రరూపులును మంత్రసిద్ధులును సద్యస్సిద్ధులునగు పదు నొకండుగురు విప్రులచేఁ బైనఁజెప్పినపనిచేయించవలెను అట్లైనో దక్షిణమే సిద్ధినొందుదురు. ఆచార్యునివలన మంత్రోపదేశముపొంది, మూడు రాత్రులుపవసించి, నిరంతరజపముచేసినచో రాజుయొక్క రాజ్యశ్రీవృద్ధి నొందును. నేతితోఁదడిపిన దూర్వాలు 10 వేలు పైవిధమున జపించిన పిమ్మట హోమముచేసినచో రాజు చిరంజీవియగును. పైవిధమున జపించిన పిమ్మట బంగారుతో వెండితో రాగితోఁ జేయబడిన కలశలను 8 వేలో, 8 వందలో నీటితోనింపి, అభిమంత్రించి గంధాదులతో ఆరాధించి వానిపై నూతన వస్త్రములనుగప్పి, ఇతర మంగళకార్యములనాచరించి, ఆచార్యుడు రాజు జన్మదినమున అతనికి స్నానముచేయించి, పూజింపఁజేసినచో ఆమహా రాజుశారీరకదోషములతోడను మహాపాతకములతోడను విముక్తుడగును. రాజు గారి అభివృద్ధికొఱకు నిత్యము ఒక విప్రునిచే 8 వేలు జపముచేయించవలెను. రాజుగారి ఆయుధవాహనశాలలందును రత్నాకరాదులందును, ప్రతిమాసమున సౌమ్యనక్షత్రమున శాంతిచేయించవలెను. అశ్వత్థసమిధలను, అపామార్గ

సమిధలను దధిమధుఘృతములతోఁ దడిపి, 10 వేలు హోమము చేయించినచో ఆయుస్సు గడిచినవానికిని ఆయుష్షు వృద్ధిచెందును జూదమునందుగాని, వ్యవహారమునందుగాని ఈ మంత్రమును జపించినచో రాజు ఓటమిని బొందడు. మూడు రాత్రులుపవసించి, నిరంతర జపమాచరించి, చరు భోజియై తేనెతోఁ దడిపిన బిల్వఫలములను 10 వేలు హోమముచేసినచో వేల కొలది బంగారు నాణెములు లభించును. దధిమధుఘృతములతోఁ దడిపిన తెల్ల కలువలను 10 వేలు హోమము చేసినచో చక్కని కన్య లభించును. ఈ మంత్రమును 1 సంవత్సరము జపించి, చరుభోజియై కపిలగోవు ఘృతముతో అగ్నిలో నిత్యమువలె 8 వేలో, 8 వందలో ఆహుతులు సమర్పించినచో సకల మహాపాతకములనుండి ముక్తుడగును. ఈ మంత్రముతోడనే రక్తచందన గంధమును అభిమంత్రించి, లలాటమున ధరించినచో సర్వులును వశ్యు లగుదురు. అపామార్గసమిధలను 8 వేలు ప్రతి జన్మదినమున హోమముచేసి నచో అపమృత్యువు తొలగును వర్షము కురియుటకుగాను సూర్యుని 10 వేల జపాపుష్పములతో ఆదివారమునాడు ఆరాధించి, ఎఱ్ఱని తలపాగను వస్త్రము లను, గంధమును దాల్చినచో భగవంతుడైన ఆదిత్యుడు మహావృష్టి కురిపిం చును దూరదేశము పోవువాడు దశశర్కరలను గ్రహించి, 8 వేలు అభి మంత్రించి, 10 దిక్కులందు జల్లిపోయినచో, క్షేమముగా నున్నవాడై ఇల్లు చేరును నిర్విఘ్నముగా మహాకార్యమాచరింపఁదలచినవాడు, 10 వేలు జపము చేసినచో అనాయసముగా అకార్యమును బూర్తిచేయఁగలడు పుత్రకాముకుడు ఈమంత్రము పఠించుచు నేతితో 1లక్ష హోమము చేసినచో వంశకరుడైన పుత్రుని బొందును. సర్వత్ర విజయము పొందును. దేవుని మంత్ర ప్రభా వము వలన సాక్షాత్తు సిద్ధులైన వారికే ఇవి ఫలించును సిద్ధులుకానివారికి వృథాప్రయాసమే జరుగును.

ధ్యానము:-

శ్లో॥ దధానమే కాదశథా విభక్త
దేహం విశుద్ధ స్ఫటికప్రకాశం।
తేజోనిధిం శూలిన మిందుమౌళిం విచింతయే
త్త్రతస దైవరుద్రమ్॥

తాత్పర్యము:-

పరమేశ్వరుడు పరిశుద్ధమైన స్ఫటికపుఁగాంతి కలవాడు. పదునొకండు విధములుగా విభజింపఁబడిన దేహము కల్గియున్నవాడు. ఆతడు తేజస్సునకు నిధి. శూలము చేతగలవాడు. చంద్రుడుకొప్పుముడపై.గలవాడు. అట్టి రుద్రుని సదా ధ్యానింపవలెను.

## -: 7. వ. ఋక్కు :-

"ఆరాత్తే గోఘ్న ఉత పూరుషఘ్నే క్షయ
ద్వీరాయ సుమ్న మస్మేతే అస్తు।
రక్షాచనో అధిచ దేవ బ్రూహ్యధాచనః
శర్మ యచ్ఛద్వి బర్హాః॥"

అర్థము:-

గోఘ్నే = గోవులనుజంపునట్టియు; ఉత = అంతేకాదు; పూరుషఘ్నే = పుత్ర పౌత్రాది పురుషులను సంహరించినట్టియును; క్షయద్వీరాయ = నశింపఁ జేయఁబడిన సేవకులు కల్గినట్టి; తే = నీయొక్క, ఉగ్రరూపము; ఆరాత్ = దూరమున; అస్తు = ఉండుగాక; సుమ్నం = సుఖకరమగు; తే = నీయొక్క రూపము; అస్మే = మాయందు; అస్తు = ఉండుగాక; కించ = ఇంతేకాదు;

నః = మమ్ములను; రక్ష = అన్నివిధములఁ గాపాడుము; కించ = ఇంతేకాదు; హే దేవ = ఓ ప్రభూ; అధిబ్రూహి = పమ్ములను ఇతరులకంటె అధికులుగ జెప్పుము. అథాచ = ఇంతేకాదు; ద్విబర్హాః = రెండులోకములను వృద్ధిచేయు నీవు; శర్మ = సుఖమును; దేహా = ఒసంగుము.

*తాత్పర్యము:-*

సా. భా : — మహాదేవ! నేరముచేయు శిశువులను, పురుషులను, వీరులను, సేవకులను నీవు సంహరింతువు. మంచిచేసినవారిని రక్షింతువు సంహరించు నీ శరీరమును మాకు దూరముగా ఉంచుము. అఁ నీ శరీరమునే "ఘోర" అందురు. శివసంజ్ఞకల్గి అందఱికిని సుఖమును జేకూర్చు నీ శరీరమును మా పట్ల ఉపయోగించుము. మమ్ములను రక్షించుము, ఇతర యజమానులకంటె గొప్పవారినిగ దేవతలచెంతఁ జెప్పుము. దేవభూలోకములరెంటిని వృద్ధిచేయు నీవు మాకు సుఖము చేకూర్పుము.

*శివ + కేశవ:-*

భ. భా. భా : — "ఆరాత్తే" అను మంత్రమునకు ఋషి అత్రి. త్రిష్టుప్పు ఛందస్సు. శంభుడు దేవత. కేశవ! మహాదేవ! మీకు గోవులను, పురుషులను హింసించుటచేఁ గల్గిన తృప్తిని దూరముగా ఉంచుడు. అనగా వారిని హింసింపకుడు. దుష్టులను హింసించుచుఁ గ్రీడింపుడు. వీరులను హింసించుటలో మీకుఁగల్గు తృప్తిని మాపట్ల ఉంచుడు. అనగా హింసింపకుడు. అందులకే మిమ్ము నమస్కరించుచున్నాము. గోవులను, పురుషులను సంహరించు నీ రూపములను మాత్రము మాకుఁ జూపక దూరముగా ఉంచుడు. పయద్వీరులు అనగా మీలో నివసించు ప్రజలు. వారిపైఁజూపు అనుగ్రహమును మాపైఁ జూపుడు. వారినివలె మమ్ములను రక్షింపుడు. భయంకరులును, భయనాశనులును మీరేకావున "భయపడకుడు జీవులారా!" అని పల్కుడు. భక్తులమగు మాకు సుఖమొసంగుడు, ఇహలోకపరలోక ప్రసిద్ధ సుఖమును జేకూర్చువారు

కావున మీరు ద్విబర్హులైరి. కాన మాకు ఇహపరసుఖముల నొసంగుడు; అని భక్తులు శివకేశవులను ప్రార్థించిరి.

పురశ్చరణము :—

మూడు రాత్రులుపవసించి, జపము చేసినచో పురశ్చరణము పూర్తి యగును. ఆయుష్కాములే ఇట్లు చేయవలెను "శతాయుః పురుషః" అను శ్రుతి ఈవిషయమునే తెల్పును. ఇట్లు చేసినచో, ఇహజన్మలోను జన్మాంతర మునను ఆయుఃక్షయమగునట్లుచేయు బాలగ్రహాదులు నశించును యజమానికి ఆయుర్వృద్ధి జరుగును. నిత్యమువలె ఈ మంత్రము పఠించుచునే స్వాగ్నిలో నేతితో 8వేలో, 8వందలో ఆహుతులను హోమము చేయవలెను. దధిమధు ఘృతములతో తడిపిన దూర్వాలతో 8వేలు హోమము చేయవలెను. స్వజన్మ నక్షత్రదినమున నిత్యము 8 వేలు జపము చేయవలెను. విశేషించి ఆర్ద్రానక్షత్రమున ఆప చేయవలెను. ప్రత్యార్ద్రా నక్షత్రమునందును దధిమధుఘృతములతో తడిపిన దూర్వాలను, దుచ్చన పుల్లలనుజమ్మి పుల్లలను, నూవులను ప్రత్యేకముగా పదివేలు ఆహుతులతో హోమము చేయవలెను. రాత్రియందు పూర్ణముగా 5వేల జపమొనర్చి, 5వేల ప్రదక్షిణ ములు చేయవలెను. రాజు తన జన్మదినమున దూర్వాపామార్గాదులను ప్రత్యే కముగా పదివేలు చొప్పున హోమము చేయవలెను ఇట్లు చేసినచో రాజు దీర్ఘాయుష్మంతుడగును. శక్తిహీనులు ప్రవాహమున హోమము చేయవలెను. మిక్కిలి శక్తిలేనివారు జపము మాత్రము చేసిన చాలును తేనెతోడను నేతి తోడను దడిపిన శుద్ధ తండులములతో హోమము చేసినచో ఆయుర్వృద్ధి జరుగును. ఈ మంత్రముతోడనే మహాదేవుని శిరస్సున అర్కపుష్పములతో (జిల్లేడు పూవులతో) 10వేల సార్లు పూజించినచో యజమాని సంపద వృద్ధి నొందును. అలయము పశ్చిమ ద్వారముచెంత చరుభోజియై, అధశ్శాయియై బ్రహ్మచర్యముతో వేయిజపము చేసినచో సప్తజన్మములందునను శతాయుష్మం తుడగును. శక్తిలేనివాడు భిక్షాహారము తీసికొనుట ప్రశస్తము.

ధ్యానము :—

శ్లో॥ కర్పూరం సన్నిధౌదేవ్యాదేవమానంద తాండవం।
హుతాశనధరంధ్యాయేత్, తప్తకాంచన సన్నిభమ్॥

తాత్పర్యము:-

దేవి చెంతను ఆనంద తాండవము చేయునట్టియును, అగ్నిని నేత్రమున ధరించినట్టియును, అప్పుడే కరిగించిన బంగారముతో సమానచ్ఛాయగల మహాదేవుని ధ్యానింపవలెను.

-: 8 వ. ఋక్కు :-

"స్తుహిశ్రుతంగర్తసదంయువానం మృగన్నభీమముపహత్నుముగ్రం।
మృడాజరిత్రే రుద్రస్తవానో అన్యంతే అస్మన్నివపంతుసేనాః॥

అర్థము:-

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జునతిష్ఠతి" అను గీతాస్మృతిలో సర్వ ప్రాణుల హృద్దేశమున ఈశ్వరుడు కలడని అర్జునుని గూర్చి కృష్ణభగవానునిచే జెప్పబడెను. అందుచే గర్తసదం = గుహనుబోలిన హృదయ పద్మమున సర్వదా యుండునట్టియును, యువానం = నిత్యము యువకుడైనట్టి యును, భీమం = భయంకరమైన, మృగంన = సింహమునువలె, ఉపహత్నుం = ప్రళయకాలమున సర్వజగత్తును నశింపజేయుటకు, ఉగ్రం = భయంకరుడైనట్టియును, శ్రుతం = ప్రసిద్ధుడైన రుద్రుని, హే మదీయవచః = ఓ నాదగు వాక్కా!, స్తుహి = స్తోత్రముచేయుము, ఓ రుద్ర! స్తవానః = మా వచనముచే స్తుతింపబడినవాడవై, జరిత్రే = ప్రతిదినము నశించు మా శరీరమునకు, మృడ = సుఖము చేకూర్పుము, తేసేనా = నీసేనలు, అస్మత్ = అన్యుడగు శత్రువును, నివపంతు = నశింపజేయునుగాక. ఇందలి నకారము, 'వంటి, వలెను,' అను నర్థమును దెల్పును.

*తాత్పర్యము-*

సా. భా :— భగవంతుడు శివుడు. యంత్రములనువలె, సర్వభూతములను చలింపఁజేయుచు, సకలప్రాణుల హృత్పుండరీకమునఁ (హృదయపద్మమున) గలఁడు. ఏనుగును సంహరించుటకు సింహమువలెఁ ప్రళయకాలమున సకల జగంబులను సంహరించుటకు, భయంకరుడైయున్నాడు. సకల వేదములందును ప్రసిద్ధుడైయున్నాడు అట్టి పరమేశ్వరుని, ఓవాక్కా! కొనియాడుము నిత్యము యువకుడవై మాచేఁ గొనియాడఁబడుచుఁ, ప్రతిదినము క్షీణించు మా శరీరమునకు సుఖమును జేకూర్పుము. నీ సేనలు మా శత్రువులను సంహరించును గాక.

*శివ + కేశవ :—*

భ. భా. భా :— ఈ మంత్రమునకు ఋషి వైయాఘ్రుడు. త్రిష్టుప్ ఛందస్సు. రుద్రుడు దేవత. శివకేశవ రూప విగ్రహము అత్యుగ్రము కాన భయముతో దేవుని మంత్రపూర్వార్ధమున పరోక్షునిజేసి కొనియాడెను.

శివకేశవులారా! మిమ్ములనుగూర్చి అంతరాత్మ ప్రబోధము గావించుకొనుచు మనసారాకొనియాడుచున్నాను. శివకేశవులమహిమ శ్రుతిప్రసిద్ధము. వారు గర్తసదులు. గర్తమనగా రథము. త్రిపురాసుర ధ్వంస సమయమున మహాదేవుడు రథమధిష్ఠించియుండెను. మహావిష్ణువు, శ్రీరాముడై మహేంద్రునిచేఁ బంపఁబడిన రథమధిష్ఠించి, రావణుని సంహరించెను. అందుచే శివకేశవులు గర్తసదులు. అంతేకాదు, హృదయాన్తరమును గర్తమందురు. శివకేశవులు జ్యోతీ రూపులై ప్రాణుల హృదయాభ్యన్తరములందుండిరి. "గిరతి = కవలయతి విశ్వమ్ అను వ్యుత్పత్తి ననుసరించి చూచినచో, గర్తమును = విశ్వమును ఆవరించి శివకేశవులు సకల వస్తువులందుండిరని తెలియుచున్నది. విశ్వమంతటినిఁ దేజస్స్వరూపులై శివకేశవులు ఆవరించియుండుటచే గర్తసదులైరి. "గిర్యన్తే = అగ్నినా భక్ష్యన్తే ప్రజాః అత్రశ్మశానే"

అను వ్యుత్పత్తిచేఁ బ్రాణత్యాగానన్తర సమయమున సకల ప్రజలును శ్మశానమున అగ్నిస్వరూపుడైన శివునిచే భక్షింపఁబడుదురు. అనగాఁ గైకొనఁబడుదురు. యుద్ధమున అగ్నిస్వరూపుడగు విష్ణువుచే రాక్షసులు భక్షింపఁబడుదురు. (సంహరింపఁబడుదురు.) అందుచే హరిహరులు గర్తసదులైరి. శబ్దవంతమైన ఆకాశమును గర్తమందురు. ఆకాశస్వరూపుడైన శివుడు ఆకాశమున వాయుస్వరూపుడై యుండగా విష్ణువు అందు సూర్యస్వరూపుడైయుండెను. అందుచే హరిహరులు గర్తసదులైరి. "యువాపి తాన్వపారుద్ర వీషామ్" అను మంత్రమున జీవులకు రుద్రుడు తండ్రియైయున్నట్లు చెప్పుటచే అతడు నిత్య యువకుడాయెను. అటులనే విష్ణువును యువకుడై రావణాదులను సంహరించి, పితా సద్గతి ప్రాపకుడు అయెను. మృగరాజైన సింహమువలె జీవప్రభువైన శివుడు భయంకరుడైయుండగా "మృగాణాంచ మృగేంద్రోఽహమ్" అను గీతానూక్తిలోఁ జెప్పినట్లు విష్ణువును భయంకరుడాయెను. శివుడు దుష్టులను సంహరింప నుద్యుక్తుడైయుండగా, విష్ణువు శత్రువులైన రాక్షసాదులను సంహరింప నుద్యుక్తుడాయెను. మృత్యువునుజయింప శివుడు సన్నద్ధుడైయున్నట్లు దుష్టులనడంప విష్ణువు సన్నద్ధుడైయుండెను. శివకేశవు లిరువురును దుర్మార్గులకు మృత్యుసదృశులే. ఇట్లు దేవ సంకీర్తనముచే భయము తొలఁగించుకొని, భక్తులు హరిహరులను ప్రత్యక్షమొనర్చుకొనుచున్నారు. కావున జీవుడా! శివకేశవులను స్తుతిచేయుము. పిమ్మట సుఖము చేకూర్చుడు తండ్రులారా! శివకేశవులారా! అని జీవులు ప్రార్థించుచున్నారు. అయ్యలారా! మేము మిమ్ములను స్తోత్రము చేయుచున్నాము కావున జరిత్రులము. మీరు స్తోత్రము చేయఁదగినవారు. మీరు జగత్తులకు క్షోభకల్గించువారిని మాకంటె అన్యులను సంహరింతురుగాక.

*పురశ్చరణము :—*

ఒక రాత్రి ఉపవసించి, మూడు రాత్రులు నిరంతరము జపించినచో పురశ్చరణము పూర్తియగును. రాజులు తమ శత్రువులకు నష్టము కల్గించుటకు

ఈ మంత్రమును జపించి, వైకంకత సమిధలు మున్నగువానితో హోమము చేయవలెను.

ధ్యానము :—

శ్లో॥ "ఉద్యద్భాస్కరకోటిప్రకాశమాదీప్తదహనమూర్ధానం।
అంబరనిలయం భీమంధ్యాయేదభయం శివం
సురౌఘనుతం"

తాత్పర్యము-

మహాదేవుడు ఉదయించెడి కోటి సూర్యుల కాంతి కలవాడు. బాగుగా మండుచున్న అగ్ని శిరస్సున గలవాడు ఆకాశము వస్త్రముగ నిలయముగా గలవాడు. భయంకరుడైనను అభయమొసంగువాడు. మంగళకరుడై దేవ సంఘముచే స్తుతింపబడుచున్నాడు ఆతనిని ధ్యానము చేయవలెను.

## -: 4 వ. ఋక్కు :-

"పరిణో రుద్రస్య హేతిర్వృణక్తు పరిత్వేషస్య దుర్మతిరఘాయోః।
అవస్థిరా మఘవద్భ్యస్తనుష్వ మీఢ్వస్తోకాయ తనయాయ మృడయ"

అర్థము:-

రుద్రస్య = శివునియొక్క, హేతిః = ఆయుధము, నః = మమ్ములను పరివృణక్తు = పూర్తిగా విడిచిపెట్టునుగాక, త్వేషస్య = క్రోధముచే(జ్వ)లించు వ్యక్తియును, అఘాయోః = పాపపరిహారకరూపమునుగోరు శివునియొక్క, దుర్మతిః = భయంకరమగుబుద్ధి, నః = మమ్ములను, పరివృణక్తు = విడిచి పెట్టునుగాక, స్థిరా = విరోధ వినాశమునకై చెక్కుచెదరకయున్న భయంకర

బుద్ధిని, మఘవద్భ్యః = హవిస్సునెడి అన్నముతోఁగూడిన యజమానులనుండి అవతనుష్వ = తొలఁగింపుము; మీఢ్వః = భక్తుల కోరికలను అమితముగా నొసంగు రుద్రుడా! తోకాయ = మాపుత్రులకు, తనయాయ = మా మనుమల కును, మృడయ = సుఖమునొసంగుము.

తాత్పర్యము-

సా. భా:— ఓరుద్రా! నీ ఆయుధము అందరిని సంహరించును. దానిని మాపట్ల విడువకుము. మమ్ములను దానితో బాధింపకుము. నీక్రోధము మహా శ్రమము. క్రోధముతో విజృంభించునీవు మాపాపములను బరిహరించుటకు ఆక్రోధమును ఉపయోగింపుము. భయంకరమగునీబుద్ధిని జీవులపాపములను నశింపఁజేయుటలో ఉపయోగించుము. ఉగ్రమైన నీబుద్ధివిరోధులను నశింపఁ జేయునుగాక. నిత్యముసీకై యాగములనొనర్చుచు, హవిస్సును భజించు యజమానులనుండి నీయుగ్రబుద్ధిని మఱల్చుము మేఘమునీటినివర్షించునట్లు సర్వులకోర్కెలను దీర్చునీవు, మాపుత్రులను, మనుమలను రక్షించి, వారికి సుఖముచేకూర్చుము.

శివ + కేశవ:-

భ. భా. భా:— ఈమంత్రము త్రిష్టుప్ఛందస్సునకు జెందినది. పర మేశ్వరుడే దీనికి ఋషియును, దేవతయునైయున్నాడు. ఇందుఁ బేర్కొనఁ బడిన విగ్రహములుకూడ పూర్వమువలె ఉగ్రరూపములగుటచే పరోక్షము గాను బ్రత్యక్షముగానుజేయఁ బడినప్రార్థనమిందుఁగలదు అర్థముకన్న నకు ఒక్కటిచొ॥న వాక్యభేదమునుగలదు. మూడగ్నులును మూడు శిఖలుగాఁగల త్రిశూలము మహాదేవునాయుధము. అదిజీవులమగు మమ్ములను బాధింపక విడిచి పెట్టవలసినదిగాఁబ్రార్థించుచున్నాము. అగ్నిరూపమైన విష్ణుచక్రము

జీవులను బాధింపక విడిచిపెట్టవలసినదిగా విష్ణువును ప్రార్థించుచున్నాము.
నాదరూపమగు హుంకారము క్రోధము. దానితో మహాదేవుడు విజృంభించును
అటులనే నాదధ్వనియగు శంఖమును పాంచజన్యమును పూరించుచు విష్ణువు
విజృంభించును వారిరువురును పాపకారులైన పురుషులకు వ్యసనములు కల్గ
జేయుదురు. వారు నిగ్రహాత్మకబుద్ధితో భక్తులమగు మాపట్ల అనుగ్రహము
చూపుదురు కాక. మేము పాపాత్ములము కామని ప్రార్థించుచున్నాము పరమ
శివా! స్థిరమైన నీధనుస్సును పినాకమును, మహావిష్ణూ! స్థిరమైన నీధనుస్సును
శార్ఙ్గమును మాపైగురిపెట్టక విడువుడు. మేము శైవవైష్ణవయాగాగ్నులందు
హవిస్స్వరూపముననున్న ధనమును విడుచుచున్నాము కావున మమ్ములను
హింసింపకుడు. మీరు భక్తులకోర్కెల జెల్లించువారు కావున మీఢ్వులు అగు
చున్నారు. మీరు మాపుత్రులకును, మనుమలకును సద్బుద్ధి జేకూర్చి సుఖ
మొసంగుడు.

*పురశ్చరణము :—*

పుత్రకాములు ఈమంత్రమును ప్రతిదినము 8 వేలు గుప్తముగా జపించ
వలెను. పలాశఖదిరసమిధలను దధిమధుఘృతములతో దడిపి, శివాలయపు
పశ్చిమద్వారమున అగ్నిలో 10 వేలుహోమముచేసినచో శివసదృశపుత్రుడు
లభించును, దేవాలయమున అశ్వత్థవృక్షపునీడలోగాని, ఆత్మగృహమునగాని,
గోశాలలోగాని, ఆర్ద్రానక్షత్రయుక్తమగు అమావాస్యనాడుగాని, కృష్ణ
పక్షాష్టమినాడుగాని జపమారంభించవలెను. దంపతులు ముందురోజున చరు
భోజనులుకావలెను. జలపూర్ణకలశలకు దారమునుజుట్టి, అందుంచివాని
మధ్యను ఉన్నతకుంభముంచి, దానియందు సోముని ఆవాహనమొనర్చవలెను.
గంధాదులతో బూజింపవలెను. మధ్యకలశమునుండి ప్రతికలశమునందును
ఒక్కొక్క మంత్రాక్షరముంచవలెను. పిమ్మట 9 వేలు జపమొనర్చి మధు
ఘృతములతో దడిసినలాజలను 8 వేలుహోమముచేయవలెను. పిమ్మట
మొదటికలశనుగైకొని, అక్షరరూపుడైన భగవంతునిస్మరించుచు స్నానము

చేయించవలెను. 8 వేలు లేక 8 వందలు విప్రులకు భోజనము పెట్టవలెను. పిమ్మట గలశలను, వస్త్రములను, ప్రీహులను, 5 బంగారు కణములను ఆచార్యునకు ఒసంగవలెను. అట్లుచేసినచో దీర్ఘాయుష్మంతుడైనట్టియు, వంశకరుడైన పుత్రుడు కల్గును.

ధ్యానము:-

శ్లో॥ గజచర్మావృతతనుం స్ఫురత్ ప్రహరణోజ్జ్వలం।
సర్వపాపహరంధ్యాయేత్, దేవంకుంజరభేదినమ్॥

తాత్పర్యము:-

గజచర్మముచే ఆవరింపఁబడిన శరీరము కలవాడును, స్ఫురించుచున్న ప్రహరణముచే ఉజ్జ్వలమైనవాడును, సర్వపాపములను బరిహరించువాడును, గజాసురభేదియునగు మహాదేవుని ధ్యానింపవలెను.

## -: 10. వ. ఋక్కు :-

"మీఢుష్టమశివతమశివోనస్సుమనాభవ। పరమేవృక్షఆయుధం।
నిధాయకృత్తింవసానఆచరపినాకంబిభ్రదాగహి।"

అర్థము:-

హే మీఢుష్టమ = అతిశయముగా వర్షించితడుపువాడా! కామముల నొసంగువాడా! హే శివతమ = మిక్కిలిశాంతమైన స్వరూపముకలవాడా! నః = మమ్ములనుగూర్చి, శివః = శాంతుడవును, సుమనాః = మంచిమనస్సు తోడను, స్నేహముతోడను గూడినవాడవు, భవ = అగుము. ఆయుధం = త్రిశూలాదికమును, పరమే = అత్యున్నతమైన, వృక్షే = మఱ్ఱి,' రావిమున్నగు

వృక్షజాతమునందును, నిధాయ = ఉంచి, కృత్తింవసానః = వ్యాఘ్రచర్మ
మును మాత్రముధాల్చువాడవై, అచర = మాకెమరుగారమ్మ పినాకం =
పినాకమనుధనుస్సును, బిభ్రత్ = హస్తమున ధరించుచు, అగహి = రమ్ము.

***తాత్పర్యము:-***

సా. భా:— మహాదేవ! నీవు బ్రహ్మాండమున అత్యధికముగా వర్షము కురిపించుటేకాక, జీవులకమితముగా గోరికలనొసంగెదవు నీవు మిక్కిలి శాంతస్వరూపుడవుకాన భక్తులమగు మాకట్టి శాంతుడవుకమ్ము నిర్మల మనస్కుడవై మాయెడల స్నేహముతోనుండుము. త్రిశూలముమున్నగు నీయాయుధములను, మాకుగానరాకుండ అత్యున్నతములైన వటాశ్వత్థాది వృక్షములపైనుంచుము. వ్యాఘ్రచర్మవసనుడవై, మాకభిముగారమ్ము. వచ్చునపుడు పినాకమను ధనుస్సును హస్తమున అలంకారముగా దాల్చుము బాణాదికములను విడిచిరమ్ము.

***శివ + విష్ణుః***

భ. భా. భా:— పైమంత్రమునకు, వైరాజఋషి. మూడు, నాల్గు, ఐదు, ఎనిమిది, పండ్రెండు అక్షరములుగల, త్రిష్టుప్ఛందస్సులలో, పంచపదత్రిష్టుప్ఛందస్సులో ఇదికలదు. శివుడు దీనికిదేవత. విష్ణువు ఇంద్రరూపుడై ప్రేరేపించగా శివుడు పర్జన్య రూపుడై వర్షము కురిపించును. హరిహరులు లోకసుఖంకరులు. దేవ! రూపద్వయముతో మావాడవై మంగళకరుడవగుము. నీవుజీవులపట్ల సౌమనస్యముతో నుండుటయేకాక మామనస్సును సైతము శోభనమైనదిగానుంచుము.

*శ్లో॥ "మూలతో బ్రహ్మరూపాయ, మధ్యతో విష్ణు రూపిణే*
*అంతతశ్శివరూపాయ, వృక్షరాజాయతే నమః"*

అని నిత్యము జనులు ప్రార్థించుచు, రావిచెట్టునకట్టును ప్రదక్షిణములు చేయుదురు. రావిచెట్టు త్రిమూర్తిస్వరూపము. కావున హరిహరస్వరూపా! దేవా! నీయాయుధములైన త్రిశూలసుదర్శనచక్రాదులను దాసిపైవాచి, మాకు క్షేమము చేకూర్చుము అందుంచిన నీయాయుధములు మాకుగానరావు. దూర ప్రదేశమున దృష్టికిగానరాకుండు వృక్షములందైనను నీయాయుధములను దాచుము. దేవా! శివస్వరూపుడవై, వ్యాఘ్రచర్మమును, విష్ణుస్వరూపుడవై కృత్తిని అనగా ధరింపదగిన పీతవస్త్రమునుదాల్చి, భక్తులమగు మాయభి ముఖమునకురమ్ము. దర్శనమొసంగుము. నీపినాకమునుగాని, శార్ఙ్గమునుగాని జ్యాబాణరహితముగావించి, హస్తాలంకారముగాదాల్చి, దర్శనమొసంగుము; రక్షింపుము; అని హరిహరాత్మకమైన దైవమును భక్తులు ప్రార్థించిరి.

*పురశ్చరణము:—*

ఉపాసకులు ఈ మంత్రమును ఏకరాత్రదీక్షగా 15 వేలు జపముచేయవలెను. కేవలమునేతితో 5 వేలు ఆహుతులను అగ్నిలోహోమము చేయవలెను ఇట్లుచేసినచో ధన నాశభయము, ప్రాణభీతి, మహావిపత్తుచోరాదిభయమును దొలగి పోవును.

ధ్యానము :—

శ్లో॥ *మంగళాయతనందేవం యువానమతి సుందరం।*
*ధ్యాయే ద్వనచరాకార మాగచ్ఛన్తం పినాకినమ్॥*

*తాత్పర్యము:-*

శివకేశవ స్వరూపుడైన దేవుడు మంగళములకు నిలయమైనవాడు. యువకుడు, అతి సుందరుడు అతడు తపముజేయు అర్జుననకు శివాంశమగు వనచర రూపమున (కిరాతరూపమున) ప్రత్యక్షముఅయెను భూమిని కాపగా

చుట్టు హిరణ్యాక్షుని సంహరింప కేశవవాంశగల వనచరమైన వరాహము యొక్క రూపమునఁ గానవచ్చెను, శివరూపమునఁజేత పినాకమును ధనుస్సునుదాల్చెను. విష్ణు రూపమున శార్ఙ్గమను ధనుస్సును చేతఁ దాల్చెను హరిహరాత్మకుడైన దేవుని ఈ విధముగా ధ్యానించవలెను.

## -: 11 వ. ఋక్కు :-

*"వికిరిదవిలోహిత నమస్తే అస్తు భగవః।*
*యాస్తేసహస్రగ్ం హేతయోఽన్య మస్మన్నివపంతుతాః*

***అర్థము:-***

వికిరిద = విశేషముగా భక్తులసన్నిధిని బహువిధముల ధనరాసులను జిమ్మి ఒసగువాడా! విలోహిత = తెల్లనివాడా! లేదా, మిక్కిలి యెఱ్ఱనివాడా, హే భగవః = ఓ భగవంతుడా! తే = నీకు, నమోఽస్తు = నమస్కారమగు గాక తే = నీకు యాః = ఏ! హేయతః = ఆయుధములు, సహస్రంగ్ం = వేలకొలదికలవో, తాః = వానిని, అస్మత్ = మాకంటె, అన్యం = ఇతరుడైన విరోధిని, నివపంతు = నశింపఁజేయునుగాక

***తాత్పర్యము-***

సా భా. మహాదేవ! సమగ్రమైన ఐశ్వర్యము, పంపూర్ణమైన ధర్మము, యశస్సు సకల సంపదలు: జ్ఞానము, వైరాగ్యము అనెడి ఆరును గలవాడవు కావున నీవు భగవంతుడవు. అంతేకాదు, బ్రహ్మాండముయొక్క ఉత్పత్తిని, వినాశమును భూతముల యాగమనమును, వాని నిష్క్రమణమును, విద్యను అవిద్యనుఎరిగినవాడవు కావున భగవంతుడవు. నీవుభక్తుల సన్నిధిని బహువిధ ధనరాసులను జిమ్మెదవు. వారికొసంగెదవు.

"ధ్యేయోముక్తా పరాగాప్ర్యు తరస కవితాదిశ్రిప్రభః" ముత్యాల పొడివలెను, అమృతరసముతోఁ గూడినట్లును. పరమశివుడు తెల్లగానుండును. అని మాంత్రికులు నిన్ను పంచాక్షర ధ్యానము నస్మరింతురు. "కాంచనాభో ధ్యేయః పద్మాననః" పద్మాసనమున నున్న మహాశివుడు బంగారు రంగువాడై ధ్యానింపఁ దగినవాడు" అని - ష్టాక్షర ధ్యానమున నిన్ను స్మరింతురు కావున శివా! నీవు తెల్లగానొకప్పుడు ఎఱ్ఱగానొకప్పుడును ధ్యానింపఁ బడుచున్నావు. అనంత శక్తులుకల నీకు నమస్కారము. వేఁకొలదిగానున్న నీ యాయుధములను మాపైఁగాదు మా శత్రువులపైఁ జిమ్మి వారిని నశింపఁ జేయుమని, భక్తులు శివుని ప్రార్థించుచున్నారు.

శివ + విష్ణు :— భా. భా భా. :- విరికిద అను మంత్రమునకు బులహుడు ఋషి; శంభుడు దేవత. అనుష్టుపు ఛందస్సు. పరమాత్మ మహాశివరూపమున దుష్ట శక్తులపై హింసా కర్మను విశేషముగాఁ జిమ్ముచున్నాడు కిరి = అనగా హింసను ఒసంగునవి కాన ఆయుధములు కిరి + దములగుచున్నవి. మహాశివుడు భక్తుల పట్ల వి + కిరిదుడు = హింసింప నందున ఆయుధ హీనుడు అగుచున్నాడు శత్రు పీడకములైన ఆయుధములు యుద్ధముచేయునపుడు అతనికి ఉండవు. వి = అనేక విధముల, కిర్తి = హింసించు చున్నవి; కావున వికిరులు = వ్యాధులు, సంసారాదులును అగును. అనగా జీవులకు పాపకర్మానుభవమునకై విడువఁబడిన వ్యాధులును కర్మానుభవమునకై వినియోగింపఁబడిన సంసారాదులును వికిరులు అగును. "దో = అవఖండనే" అను ధాతువునుండి ఏర్పడిన "దః" అను పదమునకు, ఖండిచు వాడని యర్థము. అనగా మహాదేవుడు తపోధ్యాన భక్తి కర్మ జ్ఞాన మార్గములననుసరించి, తనను జేరు జీవులకు పునర్జన్మ లేకుండఁ జేయునుగాన "వికిరుదుడు" అగుచున్నాడు. అటులనే పరమాత్మ విష్ణు స్వరూపుడగుచు, తనవాహనమైన వి = పక్షిచేతను, (గరుత్మంతుని చేతను) కిరి = హింసించు శత్రువులను దః = ఖండింపజేయును అంతేకాదు భూమిని

జాపగా జుట్టిన హిరణ్యాక్షుని, వి = వింతయైన, కిరి = వరాహమై, దః = ఖండించెను. కావున విష్ణువు వికిరిదుడాయెనని తెలియుచున్నది, కిరి = మేఘము. విష్ణువు పర్జన్యుడై. వి + కిరి = విశేషముగా, మేఘముఃచే, దః = లోకములకు నీటిని ఒసంగువాడు; కావున విష్ణువు వికిరుదుడాయెను. "దరిద్రం నీలలోహిత; పురుషంకృష్ణ పింగళమ్" అను మంత్రములందు శివుడు నీలదేహము కొంత; లోహిత దేహముకొంత కల్గియున్నట్టు చెప్పఁబడెను. గరళ భక్షణచే ఖంఠము నీలమైనను, మిగిలిన దేహము విగతమైన, లౌహిత్యము కల్గియుండుటచే శివుడువిలోహితుడాయెను అంతే కాదు లౌహిత్యముఅనగా కాలుష్యము (మలినము) అదియేవికారము వికారమేమియును లేనివాడుకాన, పరమేశ్వరుడు విలోహితుడాయెను. యథార్థముగా కామాది వికారహేతువులేమియును శివునకులేవన్నమాట చిత్తమునకు మాలిన్యముతెచ్చు క్రోధాది వికారములు, యుద్ధేతర కార్యములందుఁ బరమేశ్వరునకు లేవన్నమాట. దుష్టులయిన రాక్షసులను సంహరించుటకుఁ దప్పు జీవులను శిక్షించుటకు మాత్రము మహాదేవుడు ఆయుధములను దాల్చుడు; అని తెలియు చున్నది. పరమేశ్వరుడువలె విష్ణువుకూడ, వి = విగతమైన, లౌహిత్యము = వికారము (షడ్భావవికారములు) కలవాడు. కావున విలోహితుడాయెను. విష్ణువు ఆయాకార్యము లాచరించుటకు రామకృష్ణాది జన్మముఁలెత్తి, వికారములు పొందినను యదార్థముగా మాత్రము అతనికి భావాదివికారములు లేవు. "పుట్టువులేని నీక భవ పుట్టుట" అనుభాగవత పద్యమునఁ బోతన్న క్రీడాజన్ముడైన శ్రీకృష్ణునకు భవాది దశలు లేవని చక్కగా వ్రాసినాడు.

"జగదుత్పత్తి వినాశాదులను ఎఱుగుటయనెడి షడ్గుణములును, భగశబ్దముచే జెప్పఁబడు సమగ్రైశ్వర్యాదులును శివకేశవులను ఇరువురకునుగలవు. కావున ఇరువురను భగవంతులే అన్నమాట. పికిరిదుఁడవు, విలౌహితుడవు, భగవంతుడవునగు హరిహరస్వరూపా! నీకు నమస్కారము. నీరూపుడవగు నీకు ఒక్కఆయుధమైనను లేదు. కానిజగత్తులనుపసంహరించునపుడు నీకు, వేయి కాని, వేఁకొలఁదిగాఁగాని ఆయుధములుండును. వానిని, భక్తుడనగునాకంటె అన్యుడైన శత్రువును సంహరింప నుపయోగింపుము. భక్తుడనగు నాపట్ల అనుగ్రహముచూపుము; అని భక్తుడు పరమాత్మను బ్రార్థించెను.

*పురశ్చరణము :—*

చరుభోజియైమూడురాత్రులు పదివేలు జపముచేయవలెను జపాంతమున పదివేలు ప్రదక్షిణములుచేయుచు జపముచేయవలెను. దధిమధుఘృతములలో ముంచిన సమిధలను పదివేలుహోమముచేసినచో మహాజన విరోధము, భయమును దొలగిపోవును. సకలజయముకోరువాడు అపామార్గసమిధలను కపిల గోవునేతిలోదడిపి లక్షహోమముచేయవలెను. దానిచే వరాహాదులు వశమగును. తిర్యగ్జంతువులను జయింపఁగోరువాడు దధిమధుఘృతములలోఁ దడిపిన బిల్వసమిధలను లక్షహోమముచేయవలెను. జలమధ్యమున అత్మాగ్నిని బ్రతిష్ఠించి, కపిలగోవుపాలతో లక్షహోమముచేసినచో జలప్రమాదములను బోఁగొట్టుకొనఁగలడు.

*ధ్యానము:-*

*శ్లో॥ ప్రసన్నవదనం సౌమ్యంరచితోద్వాహమండనం।*
*అంబయాసహితంధాయేత్ పురసంఘైరభిష్టుతమ్॥"*

**తాత్పర్యము:-**

ప్రసన్నముఖుడును, సౌమ్యుడును వివాహాభరణధారియును, పార్వతీ సహితుడును పురసంఘములచే స్తుతింపఁబడినట్టి పరమేశ్వరుని ధ్యానింపవలెను

## -: 12 వ. ఋక్కు :-

*"సహస్రాణిసహస్రధాబాహువో స్తవహేతయః,*
*తాసామీశానో భగవఃపరాచీనాముఖాకృధి॥"*

**అర్థము:-**

హేరుద్ర! = ఓశివా! తవ = నీయొక్క, బాహువోః = చేతులందు, హేతయఃఆయుధములు సహస్రధా = వేయివిధముల, సహస్రాణి = వేలకొలది కలవు. హేభగవః = ఓభగవంతుడా! ఈశానః = సమర్థుడవగుచు,తాసాం = ఆయాయుధములకు, ముఖా = ముఖములను, శల్యములను, పరాచీనా = మాకు పరాఙ్ముఖములగునట్లు, కృధి = చేయుమా!

**తాత్పర్యము-**

సా. భా.- ఓరుద్రుడా! ధనుస్సు, ఖడ్గము, త్రిశూలము, మున్నగు విధమున ఆయుధములు అనేక విధములుకలవు. అవి నీచేతులందు వేలకొలదిగాగలవు షడ్గుణములచే భగవంతుడవైన నీవు వీవసిచేయుటకైనను సమర్థుడవే. కాన వానిని మాపట్ల విముఖములుగాఁజేయుము.

**శివ + విష్ణు-**

వ. భా. భా:— ఈమంత్రమునకు నారదుడు ఋషి. కణ్వుడును ఋషియే అనుష్టుప్పు ఛందస్సు. రుద్రుడుదేవత. రాజోపద్రవశాంతికై దీనిని వినియోగింతురు.

పరమాత్మ రూపాన్తరులే శివకేశవులు. "శివాయ విష్ణురూపాయ, శివరూపాయవిష్ణవే" అను మంత్రమున శివ కేశవులకు భేదములేదని చెప్పఁబడెను. ఈవిషయముననే తిక్కన సోమయాజి విరాట పర్వారంభమున వ్రాసిన

"శ్రీయనగౌరినాఁబరఁగుచెల్వకుఁజిత్తముపల్లవింపఁభ,
ద్రాయితమూర్తియైహరిహరంబగురూపముదాల్చివిష్ణురూ,
పాయనమశ్శివాయయనివల్కెడి భక్తజనంబువైదిక,
ధ్యాయితఁజిచ్చుమెచ్చుపరతత్త్వముగొల్చెదనిష్టసిద్ధికై"

అను పద్యమున శివకేశవాభేదమును బేర్కొని నమస్కరించినాడు. హరిహరు లిరువురును సహస్రశీర్షులే సహస్రాక్షసహస్ర బాహువులే అను విషయము "సహస్ర శీర్షా పురుషః, సహస్రాక్షస్సహస్రపాత్" అను మంత్రమునఁ బేర్కొనఁబడెను. సామాన్యస్వరూపము నద్విబాహువులైనను, రాక్షససంహార సమయమునమాత్రము సహస్రబాహువులై వేలకొలఁదిగా ఆయుధములను జేత దాల్చెదరు. కావుననే శివకేశవులారా! మీరు సహస్రబాహువులందును సహస్రవిధ ఆయుధములను దాల్చెదరనియు, సర్వసమృద్ధులుకాన భగవంతులనియును భక్తులు కొనియాడిరి. మీరు ప్రయోగోపసంహారసమర్థులుకాన మీయాయుధము లను, మాశత్రువులపైఁ బ్రయోగించి, మాపైఁ బరాఙ్ముఖులఁగావింపుడు; అనివేడుకొనిరి.

*పురశ్చరణము:—*

ఈ మంత్రమును 15 వేలసార్లు జపించినచో రాజోపద్రవశాంతి జరుగును. ఉపద్రవనాశమునకై శాల్మలీవైకంకత సమిధలను, వ్రీహియవతిలలను నేతితోఁదడిపి, 10 వేలుహోమముచేయవలెను ప్రధానపురుషునిమారణము తొలగుటకు దక్షిణామూర్తి సన్నిధిని లక్షజపముచేయవలెను. షట్టిమన్నుతో జేసినశివలింగమునకు అభిషేకముచేయవలెను, అమట్టినినదిలోఁ బారవైచి, నదీతీరముననేతితోఁ దడిపినతండులములను అగ్నిలో 10 వేలుహోమము చేయవలెను. దుర్గమారణ్యమున సంచరించువాఁడు, భస్మను 18 వేలసార్లు అభి మంత్రించి, దానిని శరీరమంతటను బూసికొనివెళ్ళినచో ఏ భయమునుండదు.

రాక్షసేభ్యోబలిముపహరామి" రాక్షసులకు బలినొసంగుచున్నాను; అని చెప్పి కృష్ణపక్షచతుర్దశినాడు రాత్రిశ్మశానమున మార్జాలమాంసముతో బలినొసంగినచో రాక్షసభయముతొలగును; రాజకోపహతులైనను దైవోపహతులైనను, ఈమంత్రమును జపించిహోమముచేసినచో, రాజభయము, దైవోపద్రవములును దొలగును.

ధ్యానము :—

శ్లో॥ *సర్వపాపహరందేవంసర్వాభరణభూషితం*
*సర్వాయుధధరం ధ్యాయేత్ సర్వలోకమహేశ్వరమ్"*

*తాత్పర్యము:-*

సర్వపాపములను బోగొట్టెడివాడును, సర్వాభరణములచే అలంకరింపబడినవాడును, సర్వాయుధములనుదాల్చినవాడును, సర్వలోకములకును ప్రభువగు పరమేశ్వరుని ధ్యానింపవలెను.

—: దశమానువాకము సమాప్తము :—



## -: శ్రీ రుద్రాభిషేకమాహాత్మ్యము :-

## -: ఏ కా ద శా ను వా క ము :-

దశమానువాకమున ఋగ్రూపములైన మంత్రములుకొన్ని చెప్పఁబడినవి. ఈయేకాదశానువాకమున ఎనిమిది (8) ఋగ్రూపములు. మిగిలినవియజుస్సులు

### -: ప్రథమ ఋక్కు :-

*"సహస్రాణిసహస్రశో యేరుద్రా అధిభూమ్యాం।*
*తేషాగ్ంసహస్రయోజనేఽవధన్వానితన్మసి॥"*

**అర్థము:-**

భూమ్యామధి = భూమియొక్క ఉపరిభాగమున, యే = ఏ, రుద్రాః = రుద్రులు సహస్రశః = సహస్రప్రకారులై, సహస్రాణి = సహస్రసంఖ్యాకులై, కలరో, తేషాం = అరుద్రులయొక్క ధన్వాని = ధనుస్సులును, సహస్ర యోజనే = మాకంటె ' సహస్రయోజనములుదాటిన పిమ్మటగలదేశమున అవతన్మసి = తొలగింపఁబడిన వింటిత్రాడుగలవిగాఁ జేసిఉంచుము.

**తాత్పర్యము-**

సా. భా: — మహాదేవుడు తన తేజస్సును పిపీలికాది బ్రహ్మపర్యంతము గల జీవులందును, ప్రాణములేని వస్తువులందును బ్రవేశపెట్టి భూమిపై నంతటనువ్యాపింపజేసినాడు. వానిలోఁగలవారు రుద్రులే. వారు అనేక విధములుగా లెక్కలే నందఱుగానున్నారు. వారందఱి చేతులందును ధనుస్సులుగలవు. అవి బాణములతోఁగూడియున్నచో లోకములకు బ్రమాదము వాటిల్లును, కాన వానిని ఎన్నియోజనముల దూరమందున్నను వింటిత్రాడు లేనివిగాఁజేసియుంచుముతండ్రీ! అని ప్రార్థించిరి.

శివ + కేశవ:-

వ. భ. భా:— "సహస్రాణిసహస్రశః" మున్నగు మంత్రములు ఈయనువాకమున అనుష్టుప్ఛందస్సులోఁగలవు. ఈయనువాకమునకు "అవతానము" అనుసంజ్ఞకలదు. ఈయనువాకమంత్రములచివరను "తేషాగ్ంసహస్రయోజనేఽ వధన్వానితన్మసి" అను దానిని జేర్చిచదువవలెను. జపారంభమున, అద్యన్తములందు దీనినిజేర్చి చదువవలెను. నమోరుద్రేభ్యః" మున్నగు మూడుమంత్రములును యజుస్సులు. ఇటఁజెప్పిన విషయమేమన? దేవునిచేఁ బ్రార్థింపఁబడిన బ్రహ్మామహాదేవునితో సమానులైన రుద్రులను సృష్టించెను. వారు సకలస్థావరజంగమములను రక్షించుచుఁ బోషించుచు, ఉపసంహరించుచున్నారు. వారువానికిఁ గర్మానురూపమైన ఫలమునుజేర్చు చున్నారు అరుద్రులు బ్రహ్మాండమంతటను, వాయువు, కిరణము, మనుష్యుడు మున్నగు నానారూపములను అధివసించియుండిరి. అరుద్రులు ఇపుడు అనుగ్రహ సంపాదనకై ప్రార్థింపఁబడుచున్నారు. మఱికొందఱుచెప్పినదేమన? ఈమహా దేవుడు అను గ్రాహ్యావశమున వందలుగా, వేలుగా, లక్షలుగ దనయాత్మను విభజించి, ప్రత్యేకముగా దర్శనమొసంగుట, అభిమతములనొసంగుట; మున్నగు విధముల అనుగ్రహించుచున్నాడు. అరుద్రులు ఇట్లు అనేకరూపములతో విభక్తులైనొకలేని సంసారసాగరమున, అసంఖ్యాకులుగానుండి, జగత్తును అనుగ్రహించుటకై ప్రవర్తించుచున్నారు. వారినుద్దేశించి, ఈమంత్రములు ప్రవర్తించుచున్నవి, అనిరి, మఱికొందఱు ఇట్లనిరి. సంహారకర్తయైన మహాదేవునియొక్క క్రోధాత్మ విస్ఫులింగములై ప్రాణులుగామారి, గొప్పవారమని తలంచుచు, విజృంభించి, సర్వలోకములందును సంచరించుచున్నది. వానికిఁ జెందినప్రసాదనమేఇది; అనిరి. రుద్రతుల్యులైన గణేశ్వరులందఱును రుద్రులే అని కొందఱనిరి అమంత్రములతో మొదటినాల్గు మంత్రములకును దూర్వాసుడు ఋషి. మిగిలిన మంత్రములకు దేవలుడుఋషి, అన్నింటికిని అనుష్టుప్ఛందస్సు. అన్నింటికిని రుద్రుడేదేవత.

పైమంత్రములలో మొదటిది "సహస్రాణి సహస్రశః" అనునది. ఇందలి రుద్రపదమునకు (1) సంహారకములు, (2) భయంకరములు (3, రుద్రతేజస్సుతోనిండినవి, (4) రుద్రాంశగలజీవులు, (5) కిరణములు (6) వాయురూపములు, (7) రుద్రగణములు, అని పెక్కు అర్థములుకలవు. "రుద్రోబహుశిరాబభ్రుః" అను విష్ణుసహస్రసూక్తిచే రుద్రపదము, శివునకు వలె విష్ణువునకును జెల్లునని తెలియుచున్నది. శివవిష్ణుశక్తులలో శివశక్తి ప్రళయసంహారకముకాగా విష్ణుశక్తి రక్షణలో దుష్టసంహారకమని తెలియుచున్నది. శివవిష్ణుతేజస్సులు రెండును భయంకరములేయని శివసిష్పీడితుడైన రావణుడును, విశ్వరూపముచూచిన అర్జునుడును గొనియాడిరి శివకేశవులు సూర్యస్వరూపులు కాన, వారులోకములను రుద్ర = తీవ్రమైనతేజస్సుతోనింపిరి. ఇరువురి కిరణములును లోకప్రకాశకములే యనువిషయము "తస్యభాసాసర్వమిదంవిభాతి" అను శ్రుతిచేఁ తెలియుచున్నది. ఇరువురును ప్రాణాపానాది వాయురూపులే. శివ విష్ణుగణములు రెండును బాపులను ఏడిపించునవే "పాదోఽస్యవిశ్వాభూతాని" అను శ్రుతిలో శివకేశవస్వరూపుడైన పరమాత్మయొక్కపాదమే సర్వభూతములని చెప్పఁబడుటచేవారు సహస్రప్రకారముల సహస్రసంఖ్యాకజీవులై భూమిపైనుండిరి. వారు ఇరువురును భూమీశ్వరులే. వారుకర్మానుకూలముగాఁ ప్రాణులను అనుగ్రహించుచు, శిక్షించుచున్నారు. ఇవ్విధమున బృధివీశులైన మీరు మీ యాధనుస్సులను వింటిత్రాటితో వేరుచేసియుంచెదరుగాక. మిమ్ములను స్తుతులతో, నమస్కారములతో హవిస్సులతోఁ గృపావంతులుగాఁ జేయుదుము అందుచే మీధనుస్సులనుగొన్నియోజనాలదూరమునునుంచుచు, అచటనుగూడ వానివలన హింసలేకుండుటకుఁగాను వింటిత్రాటితో శూన్యములుగానుంచుదురుగాక; అని ప్రార్థించిరి.

## -: 2 వ. బుుక్కు :-

"అస్మిన్ మహత్యర్ణవేఽంతరిక్షేభవా అధి"

**అర్థము:-**

అస్మిన్ = ఈకానవచ్చు, మహత్యర్ణవే = మహాసముద్రముతో సమాన మైన, అంతరిక్షే అధి = అంతరిక్షము నాశ్రయించియున్న. భవాః = రుద్ర మూర్తివిశేషములు, సహస్రయోజనములదూరమున ఉండుగాక.

**తాత్పర్యము:-**

సా. భా:— మహాదేవ! భవములు అనగా నీమూర్తులు. చేతనాచేతన రూపమున అనేకవిధములుగానున్నవి. అవిమహాసముద్రమునందువలె సము ద్రమువలెఁ బౌఢముగానున్న అంతరిక్షమునందునుగలవు వానిలో హింసా త్మకమగు నీశక్తికలదు. కావున అవియును జీవులు నివసించుప్రాంతములకు కొన్నివేఁయోజనములదూరమున నుండుగాక. అవి అణుశక్తివంటివి.

**శివ+విష్ణు:**

భ భా. భా: మహాశివుడు మహాసముద్రమున అగ్నిరూపముననుండగా విష్ణువు "రసోఽహమప్సు" అను గీతాసూక్తిలో జెప్పినట్లు రసరూపమునఁ గలడు. భూమ్యాకాశముల మధ్యభాగముఅంతరిక్షము. అందు శివుడు వాయు రూపముననుండగా, విష్ణువు సూర్యచంద్రరూపమునఁగలడు. సముద్రము నందును, అంతరిక్షమునందునుగల శివకేశవశక్తులకు "భవములు" అని పేరుగలదు. హానికలుగకుండుటకుఁగాను, అభవములు దూరముగానుండి ఉప కారముచేయునుగాకయని భక్తులు ప్రార్థించిరి.

## -: 3 వ. ఋక్కు :-

*"నీలగ్రీవాశ్శితికంఠాశ్శర్వా అధఃక్షమాచరాః"*

**అర్థము:-**

సా. భా:— రుద్రునియొక్క మూర్తివిశేషములు నీలగ్రీవాః = కొన్ని ప్రదేశములందు నీలవర్ణములును, ఇతరప్రదేశములందు శ్వేతవర్ణముతై యుండును. శితికంఠాః = నీలకంఠములును, శర్వాః = హింసించునవియును అధఃక్షమాచరాః = పాతాళమునందు సంచరించునవియునైయున్నవి. (తాత్పర్యమునుభయము)

**శివ+విష్ణు:**

భ. శా. భా:— నీలగ్రీవ, శితికంఠ, శర్వఅను నామములకు అర్థములు శివ విష్ణుపరములుగ ఇంతకమున్నే వ్రాయబడినవి శివకేశవులమూర్తివిశేషములును, కిరణములును, నీలగ్రీవములును, శితికంఠములును శర్వములు = హింసించునవైయున్నవి అంతేకాదు. అవి జలరూపములు, సర్పరూపములునై భూమికి, క్రిందుగాఁగలపాతాళమునందును సంచరించుచున్నవి అవి జీవులకు గొన్నివేలయోజనములదూరముననుండుఁగాక.

## -: 4 వ. ఋక్కు :-

*"నీలగ్రీవాశ్శితికంఠాదివగ్ం రుద్రాఉపశ్రితాః"*

**అర్థము:-**

నీలగ్రీవాః = నీలశ్వేతవర్ణులును, శితికంఠాః = నలుపుకంఠమునందుఁ గల, రుద్రాః = రుద్రాంశగలదేవాదులు, దివం = స్వర్గమును, ఉపశ్రితాః = ఆశ్రయించియుండిరి.

*తాత్పర్యము-*

సా. భా.- రుద్రాంశగలదేవతలందఱును, నీలగ్రీవులును, నీలకంఠులునై స్వర్గమునందుండుగలరు. వారు మిగిలిన భూలోకాదివాసులను రక్షించుచున్నారు.

*శివ + విష్ణు-*

భ. భా. భా:— శివకేశవులు ఇరువురును నీలగ్రీవులే. నీలకంఠులే. రుద్రులే వారిలో శివుడు ఇంద్రరూపమునను, కేశవుడు సూర్యరూపమునను, ఇంద్రాది లోకములను అధిష్ఠించి, ప్రభువులై, మిగిలినలోకవాసులను రక్షించుచున్నారు

*పురశ్చరణము:—*

చాంద్రాయణవ్రతమునాచరించిశరీరశోధనమునకై ఈమంత్రములను నాల్గింటిని 5 వేలసార్లు జపించవలెను. అట్లైనచో పురశ్చరణముపూర్తియగును. ముఖ్యముగా రాజులు శత్రునాశనమునకుగాను, ఈమంత్రములతో అభిచారిక హోమములనుజేయుదురు. దూర్వాదిహోమములచే భైరీతినిఁజేసినహోమములచేఁ గల్గినపాపములను బోగొట్టుకొందురు.

*ధ్యానము:-*

*శ్లో॥ దంష్ట్రాకరాళవదనంజ్వలజ్జ్వలనమూర్ధజం।*
*బిభ్రాణంత్రిశిఖందీపంధ్యాయేభుజగభూషణమ్॥"*

*తాత్పర్యము:-*

పైనాల్గుమంత్రములను జపించనర్హతలేనివారు, ఈ శ్లోకమును జపించుచు శివుని ధ్యానించవలెను. మహాదేవుడు నాగభూషణుడు అతని

వదనమునిమ్నోన్నతముగానున్నకోరలచే భయంకరముగానుండును అతని జుత్తుమందుచున్న అగ్నివలెమెఱయును త్రిశూలమునువలె మూడు శిఖలుగల దీపమును జేతఁదాల్చును. అట్టిపరమేశ్వరుని ధ్యానించుటచే సకలకార్యములు నెఱవేరును.

## -: 5 వ. ఋక్కు :-

"యేవృక్షేషుసస్పింజరా నీలగ్రీవా విలోహితాః"

**అర్థము:-**

వృక్షేషు = వృక్షములందు, యే = ఏరుద్రులుకలరో, తే = వారు, సస్పింజరాః = లేతగడ్డివలెపింజరవర్ణముకలవారు. నీలగ్రీవాః = నీలవర్ణమైన గ్రీవముకలవారు. విలోహితాః = కొందఱు విశేషముగా రక్తవర్ణముకలవారు.

**తాత్పర్యము-**

భగవంతుడైన రుద్రుని అంశలు వృక్షములందునుగలవు. కావుననే వృక్షనామమురుద్రునకుఁ జెల్లును. రుద్రులు లోకములందువలె, వృక్షములందును, సస్పింజరులై, అనగా పింజరవర్ణముకలవారైయున్నారు. వృక్షములందలి రుద్రులు నీలవర్ణగ్రీవులునై, విశేషముగ రక్తవర్ణముకలవారైయున్నారు.

**శివ + విష్ణు:-**

భ భా. భా — "వృక్షః, సస్పింజరః, నీలగ్రీవః, విలోహితః". అను నాల్గు నామములును శివవిష్ణుపరములుగా వ్యాఖ్యానింపఁబడినవి. మహాదేవుడు

స్థావరజంగమరూపమునఁగలడు. కావుననే వృక్షములు సస్యింజరములై లోకములకు అనేకవిధములుగా ఉపకరించుచున్నవి. వానిలో నీలగ్రీవములు లోకపీడకులను నశింపఁజేయును ఏలోహితములు లోకములకు ప్రభువులై రక్షించుచున్నవి కావుననే అశ్వత్థాదివృక్షములను శివవిష్ణురూపములుగా భావించి, ప్రజలు పూజించుచున్నారు.

## -: 6 వ. ఋక్కు :-

"యేభూతానామధిపతయోవిశిఖాసఃకపర్దినః"

**అర్థము:-**

యే = ఏరుద్రులు, భూతానాం = కానరాని శరీరములకలవారై, మనుష్యులకు ఉపద్రవములను గావించుభూతగణములకు, అధిపతయః = ప్రభువులో, తేషు = వారిలో, కేచిత్ = కొందఱు, విశిఖాసః = నున్నగాఁ జేయఁబడిన శిరస్సులుకలవారై, కపర్దినః = జటాజూటముకలవారై జీవులను హింసించుచున్నారు. వారు దూరముగానుందురుగాక.

**తాత్పర్యము:-**

సా. భా:— రుద్రుడు భూతప్రేతగణములందును, తనతేజస్సును ప్రవేశపెట్టినాడు. అట్టి భూతములగణములు, కానరాని శరీరముకలవై, మనుష్యులను కర్మఫలానుకూలముగాఁ బీడించుచున్నవి. వారందఱును భూతాధిపతులైనరుద్రులే. వారిలోఁగొందఱునున్ననితలకాయలు కల్గియుండిరి. మఱికొందఱు జటాజూటములనుదాల్చియున్నారు. వారుజీవులను హింసింపకుండుటకు కొన్నియోజనాలదూరమునఉందురుగాక.

శివ+విష్ణు: —

భ. భా. భా: — శివకేశవులు ఇరువురును తమతేజస్సులను, భూమి, నీరు, గాలి, అగ్ని, ఆకాశము అనెడి పంచభూతములగణములకును, ఒసంగి, వారికి అధిపతులైయున్నారు. ఆభూతగణములు మానవుల ప్రవృత్తినివృత్తులకు హేతువులై, వారికి దుఃఖములతోఁబాటు సుఖములను సైతము ఒసంగుచున్నవి గణరూపులలోఁ గొందఱకు శిఖలులేవు. కొందఱు వివిధశిఖలను, అనేక విధకాంతులను, కల్గియున్నారు. కొందఱు జటామకుటములను, దాల్చి యున్నారు. జీవులకు ప్రమాదకరులుకాకుండుటకై వారు కొన్నియోజనముల దూరముననుండురుగాక. (కపర్దినామముయొక్క అర్థము ఇంతకుమున్ను వివరింపఁబడెను.)

## -: 7 వ. ఋక్కు :-

### "యేఅన్నేషువివిధ్యన్తిపాత్రేషుపిబతోజనాన్"

**అర్థము:-**

యే = ఏరుద్రులు, అనగా, రుద్రాంశగలవి అన్నేషు = భుజింపఁదగిన వస్తువులందుగూఢముగానున్నవై, జనాన్ = జనులను, వివిధ్యన్తి = విశేషముగా బాధించుచున్నవో, పాత్రేషు = త్రాగదగినపాలుమున్నగువానిలోనున్నవై, పిబతః = త్రాగుచున్న జనులను, వివిధ్యన్తి = విశేషముగా బాధించుచున్నవో, అవిదూరముగానుండుగాక.

**తాత్పర్యము:-**

సా. భా: — మహాదేవునితేజస్సు క్రిమికీటకాదులందునుగలదు. అవి ఆహారపదార్థములందుఁగలవు అవి తినఁదగిన వస్తువులను, అనగా, అన్నము కూర, పచ్చడి పిండివంటలుమున్నగువానిలోనుండి జనులను బీడించును. అటులనే నీరు, పాలుపాయసము మున్నగు త్రాగెడివస్తువులందుండి కీటకాదులు ప్రజలను బీడించును. అవి కంటికిఁగానరాకయుండును. అందుచే అవి కొన్నియోజనాలదూరముననుండుఁగాక యనిప్రార్థించుచున్నారు.

శివ + విష్ణు:-

భ. భా:— "అన్నంబ్రహ్మేతివిజానాత్; అన్నాద్ధ్యేవఖల్విమానిభూతాని జాయన్తే" అను శ్రుతివలన అన్నము బ్రహ్మపదార్థము. దానినుండే భూతములు జన్మించినవి; అని తెలియుచున్నది. అన్నము బ్రహ్మవిష్ణుమహేశ్వరాత్మకము. త్రిమూర్తిస్వరూపులురుద్రులు. వారితేజస్సు ప్రాణులు తినదగిన ఆహారాది వస్తువులందుఁగలదు. శివకేశవులు అన్నమును ఆహారాదికమును భక్షించు జీవులుచేసినకర్మలకు అనుకూలమగు ఫలమును వారికొసంగుదురు. ముఖ్యముగాఁ బాపుల పాపఫలమునకు అనురూపమగు వ్యాధులు మున్నగు వానిని, వారికాహారపదార్థములద్వారాచేకూర్చెదరు. అంతేకాదు. పాత్రములందును త్రాగఁదగినపాలుమున్నగువానిలోనున్నవారై శివకేశవులు పాపజీవులకుఁ బానీయములద్వారారోగాదులనుజేకూర్చెదరు. అందుచే అట్టిబాధలువాటిల్లకుండుటకై జీవులు శివకేశవులను బ్రార్థింతురు.

## -: 8 వ. ఋక్కు :-

"యేపథాంపథిరక్షయ ఐలబృదాయవ్యుధః"

అర్థము:-

యే = ఏరుద్రులు, పథిరక్షయః = లౌకికములును, వైదికములునగు మార్గములను రక్షించువారో, ఐలబృదాః = అన్నసమూహమును భరించువారో అన్నప్రదానముచే జీవులను బోషించువారో, తే = వారు, యవ్యుధః = మిత్రములై విరోధులతో యుద్ధముచేయువారు, అగుచున్నారు. వారుదూరముగా ఉందురుగాక.

తాత్పర్యము:-

సా. భా:— యోధులు రుద్రాంశగలవారై లౌకికములైన మార్గముల నన్నింటిని రక్షింకురు దేవతలు, మునులు, మున్నగువారు రుద్రతేజస్సు

గలవారై వేదములలోఁ జెప్పిన మార్గములనన్నింటిని రక్షింతురు. ఇర, అనగా, అన్నము. ఆహారము అనేకవిధములుగాగలదు. అన్నసమూహామునే ఐరము అందురు. అదియే ఐలము దానిని భరించువారే ఐలభృతులు. వారే ఐలబృదులు. రుద్రుడు సూర్యచంద్రకిరణముల ద్వారా తన తేజస్సును ఆహార పదార్థములందు ప్రవేశపెట్టెను అందుచే ఆహారసమూహామును భరించు చేతనాచేతనములు రుద్రులేఅగును. అవి అన్నప్రదానముచే జీవపోషకము లగును రుద్రులు అనేకవస్తువులలో నుండుటచే మిశ్రమములగుదురు. అవి కర్మఫలమునకు అనుకూలముగా జీవులయెడలఁ బ్రవర్తించుటచే విరోధులును అగును. ఆవిధముగా అవి జీవులయొక్క అనిష్టములను నివారించును. అందుచే రుద్రాంశగలవానినెల్ల జీవులు నమస్కరింతురు.

శివ+విష్ణః—

భ. భా. భా:— "పంథ" అనగా మార్గము. అది లౌకికము, వైదికము అని రెండు విధములుగాఁగలదు 14 లోకములకుఁ జెందినది లౌకిక మార్గము. వేదములందుఁ జేతనాచేతనములచరిత్రకుఁ జెందినట్లుచెప్పినది వైదికమార్గము. పైరెండుమార్గములను రక్షించువారురుద్రులే వారు సకల ప్రాణులను నిరోధించుటకును, నడిపించుటకును సమర్థులు రుద్రులు సమష్టి స్వరూపులేకాదు. వ్యష్టిస్వరూపులు కూడ అగుచున్నారని వేదములందుఁగలదు. "వసూయవోవసుపతేవసూనామ్" "గవామసిగోపతిరేక ఇంద్రః" ఇతి "నిధీనాంత్వానిధిపతిగ్ంహవామహే" "ఇత్యాది" తేజస్సును ధనము నొసంగుటచే వసువులలో వసుపతివైయుంటివి. గోవులను అనగా జీవులను రక్షించువాడవు; కావున గోపతియైన ఇంద్రుడవైతివి. నిధులను రక్షించు వాడవు కావున నిధిపతిగాఁగొనియాడఁబడుచున్నావు; అని పైమంత్రములచేఁ దెలియుచున్నది. శివకేశవులు ఇరువురును లౌకికవైదికమార్గరక్షకులే. కాన పథిరక్షకులగు రుద్రులగుచున్నారు. వారు సమష్టివ్యష్టస్వరూపులు. కావుననే పైమంత్రములందు రుద్రుడు వసుపతిగా గోపతిగా, నిధిపతిగాఁ గొనియాడఁ

బడెను. సకల మార్గరక్షకులు శివకేశవులని సాకల్యమును = సకలస్వరూపు డుగా నుండుటను ప్రతిపాదించుటకే "పథాం" అని బహువచనము చెప్పఁ బడెను. రేఫకునులకారమునకు భేదములేదుగావున "ఇరా, ఇలా" అను పదములు రెండింటికిని అన్నమనియే అర్థము సన్మార్గమున మెఁగినవారిని గూర్చి అన్నమును భరించు శివకేశవులు ఇలాభృతులు అగుదురు. వ్యాకరణ శాస్త్రరీత్యా ఇలాభృతులే బిలబ్బదులు అగుదురు. జీవులంపఁయును శివకేశవా ధీనులేకాన వారిని రక్షించు శివకేశవులు బిలబ్బదులు అగుదురు. "పరోక్ష ప్రియా ఇవహిదేవాః" అను శ్రుతిచే దేవులు తమ పరోక్షమందున్నవారికి ఇష్టులగుదురని తెలియుచున్నది. "అన్నమన్నాదఏవచ" అను సూక్తిచే, అన్నము అన్నాదుడును శివకేశరూపుడగు భగవంతుడే అని తెలియుచున్నది. "అహమన్నాదో అహమన్నాదః" అను శ్రుతిచే అన్నాదుడు శివకేశవస్వరూ పుడే అని తెలియుచున్నది. "య" అనగా యువకులు. వారితో యుద్ధముచేసి సంహరించువారు "యువ్యధులు" అగుదురు. శివకేశవులు యుద్ధరంగమున యువకులతోడను యుద్ధముచేసి, సంహరించువారే కావున "యువ్యధులు" అగుదురు. శరీరేంద్రియ ప్రాణములను మిళితముచేసి జీవులను నిర్మింతురు కాన "యువ్యధులు" అగుదురనియు జెప్పవచ్చును.

పరికింపగా శివకేశవులు లౌకిక వైదిక మార్గములందుఁ ప్రవర్తించు జీవులకు ప్రారబ్ధకర్మానుగుణముగా ఒకప్పుడు అన్నమును, ఒకప్పుడు ఆయువును ఇచ్చుచు ఒకప్పుడు ఆరెండింటిని అపహరింతురు, అనియును దెలియుచున్నది. వారు హింసింపఁ దగినదానినే హింసింతురనియును జెప్పవచ్చును

## —: 9 వ. యజుస్సు :—

'యేతీర్థాని ప్రచరంతి సృకావన్తో నిషంగిణః'

*అర్థము:-*

యే = ఏరుద్రులు, తీర్థాని = కాశీప్రయాగాదిక్షేత్రములను, ప్రచరన్తి = రక్షించుటకు సంచరించుచున్నారో, తే = వారు, సృకావన్తః = ఈటెలుకల వారును, నిషంగిణః = కత్తులుగలవారును అయియుండిరి.

*తాత్పర్యము:-*

సా. భా:— దేవాలయములుగల ప్రదేశములు క్షేత్రములు. పుణ్య నదులుగల ప్రదేశములు తీర్థములు. తీర్థపదముక్షేత్రములకు ఉపలక్షకము. కాశీగయాప్రయాగాదిక్షేత్రతీర్థములు దేవతలకు నిలయములు. వానిని రాక్ష సులు పాడుచేయఁదలంతురు. వానికేగుత్రోవలందు, చోరులు, క్రూరమృగ ములు మున్నగునవి ఉండి అటకువచ్చుజనులను బీడించును. రుద్రాంశగల వారు ఆదుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించుటకు, శూలములు, ఖడ్గములు మున్నగునవిచేతఁ దాల్చియుందురు. తీర్థములకేగువారిలో, దుష్టులు పాపాత్ములు కొందఱుందురు. వారిని అటకేగకుండ నిరోధించుటకును రుద్రులు ఖడ్గాదిధారులైయుందురు. భక్తులమగుమమ్ముకాపాడుటకు ఆరుద్రులను కొన్నియోజనాలదూరమున నుంచుమని భక్తులు శివుని ప్రార్థించిరి.

*శివ+విష్ణు:*

భ. భా. భా:— కాశీ, శ్రీశైలము మున్నగునవి శివక్షేత్రములు. తిరు పతి భద్రాచలము మున్నగునవి విష్ణుక్షేత్రములు. రుద్రరూపులైన శివకేశ వులు అయాక్షేత్రములకు వచ్చుప్రజలకు ఫలములనొసంగుటకును, క్షేత్రా గతభక్తులను బాధించువారిని రానీయక నిరోధించుటకును ఖడ్గాద్యాయుధములను జేతఁ దాల్చియుందురు. ప్రతిప్రాణియొక్కహృదయమునను బరమాత్మగలడు ఆపరమాత్మను దర్శించు భక్తులను మనసునిలువనీయక కామక్రోధాదులు బాధించుచుండును. వానిని దొలగించుటకై పరమాత్మసూక్ష్మరూపమున శమదమములమున్నగు నాయుధములను జేతఁదాల్చిభక్తులలోనుండి, జ్ఞాన మొసగి రక్షించును. అపరమాత్మయే దుష్టజీవులకు గర్మఫలమనుభవింప జేయుటకై జ్ఞానము కలుగనీయక, కష్టములఁ గల్గించి, శిక్షించును, అని తెలియుచున్నది.

*పురశ్చరణము:—*

మానవుడు కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములనాచరించి, పైమంత్రములను 5 వేలజపముచేయవలెను. ఋతుగమనదినమున భార్యతోఁ గలియుటకు ముందుస్వాగ్నిలో, కపిలగోవుపాలనునేతిని గలిపి పైమంత్రములతో 8 వేలు హోమముచేసి, భార్యతోఁగలిసినచో విద్వాంసుడును వంశకరుడునగు పుత్రుడు జన్మించును. మహాతీర్థములకేగునపుడు, స్వాగ్నిలోనేతితోఁ దడిపిన శుద్ధతండులములతోఁ పైమంత్రములు పఠించుచు, 10 వేలుహోమముచేయవలెను. వెళ్ళునపుడు మాటాడరాదు. స్నానముచేసివచ్చి, అగ్నినారాధించి, పైమంత్రములను జపించినచో యథార్థముగా తీర్థఫలమునుబొందును. పూర్వమువలె ధ్యానముచేయవలెను.

## — *10 వ. యజుస్సు* —

*"యఏతావన్తశ్చభూయాగ్ంసశ్చదిశోరుద్రావితస్థిరే।*
*తేషాగ్ం సహస్రయోజనేవధన్వానితన్మసి"*

*అర్థము:-*

యేరుద్రాః = ఏరుద్రులు, ఏతావంతశ్చ = వేలకొలదికలరో భూయాగ్ంసశ్చ = అంతకంటె అధికులై, :దిశః = అన్నిదిక్కులను ప్రవేశించి, వితస్థిరే = కలరో; తేషాం = వారియొక్క, ధన్వాని = ధనుస్సులను, సహస్రయోజనే = వేయియోజనములదూరమున, అవతన్మసి = వింటిత్రాడు తొలగించి ఉంచుదు.

*తాత్పర్యము:-*

సా. భా:— మహాశివుడు తనతేజస్సును, సూర్యచంద్రాగ్ని వాయునక్షత్రాదులందుఁ బ్రవేశపెట్టెను. రుద్రతేజస్సుకలవారు రుద్రనామకులే. వారు శ్రేష్ఠ

కొలదిగా అన్నిదిక్కులందునుగలరు. అందుచే హింసాత్మకములైన వారి ధనుస్సులు కొన్నివేలయోజనములదూరమందుండుగాక.

శివ + విష్ణు:-

భ. భా. భా:— మహాదేవుడు, మహావిష్ణువును తమశక్తులను భూమిపైఁ గల చేతనాచేతనములందును, అంతరిక్షమునందుగల సూర్యచంద్రాదు లందును, మహాసముద్రమునఁగల జలములందును, జలచరములందును, పాతాళమునందును, దివమునందును, వృక్షాదులందును, భూతములందును, అన్నపానీయములందును, మార్గములందును, తీర్థములందును, వ్యాపింపఁ జేసిరి అందుచే రుద్రాఖ్యకలశివ విష్ణుస్వరూపములను ఎవ్వరును లెక్కింపఁ జాలరు. అందుచే వారందఱును నమస్కరింపఁబడిరి. దీనిపురశ్చరణము పూర్వమువలెనే చేయవలెను.

## — 11 వ. యజుస్సు —

*నమోరుద్రేభ్యోయేపృధివ్యాం, యేఽంతరిక్షే।*
*యేదివి, యేషాంమన్నంవాతోవర్షమిషవ।*
*స్తేభ్యోదశప్రాచీర్దశదక్షిణాదశప్రతీచీ।*
*ర్దశోదీచీర్దశోర్ధ్వాస్తేభ్యోనమస్తేనోమృడయంతు।*
*తేయంద్విష్మోయశ్చనోద్వేష్టి, తంవోజంభేదధామి"*

అర్థము:-

యే = ఏరుద్రులు, పృధివ్యాం = భూమిపైఁగలరో, యేషాం = ఏరుద్రులకు, అన్నం = ఆహారమే, ఇషవః = బాణములో, తేభ్యః = అన్నమేబాణము గాఁ గల, రుద్రేభ్యః = రుద్రులకు, నమః = నమస్కారము.

యే = ఏరుద్రులు, అంతరిక్షే = ఆకాశమునందుఁగలరో, యేషాం = ఏరుద్రులకు, వాతః = వాయువు ఇషవః = బాణములో, తేభ్యఃరుద్రేభ్యః = ఆరుద్రులకు నమః = నమస్కారము యే = ఏరుద్రులు, దివి = స్వర్గమునందు గలరో, యేషాం = ఏరుద్రులకు, వర్షం = వర్షము ఇషవః = బాణములో, తేభ్యః = ఆరుద్రులకు, నమః = నమస్కారము, దశప్రాచీః = తూర్పు ముఖముగాఁ బదివ్రేళ్ళచివరలుగల అంజలులతోడను, దశదక్షిణాః = దక్షిణముఖముగాఁ బదివ్రేళ్ళ చివరలుగల అంజలులతోడను, దశప్రతీచీః = పడమటి ముఖముగాఁ బదివ్రేళ్ళచివరలుగల అంజలులతోడను, దశోదీచీః = ఉత్తరముఖముగాఁ బదివ్రేళ్ళచివరలుగల అంజలులతోడను, దశోర్ధ్వాః = ఊర్ధ్వముఖముగాఁ బదివ్రేళ్ళచివరలుగల అంజలులతోడను, తేభ్యః = ఆరుద్రులకు, నమః = నమస్కారము. తే = ఆరుద్రులు, నః = మమ్ములను, మృడయన్తు = సుఖపఱచుదురుగాక. యం = ఎవనిని, ద్విష్మః = ద్వేషింతుమో, యశ్చ = ఏశత్రువు, నః = మమ్ములను, ద్వేష్టి = ద్వేషించునో, తం = ఆశత్రుద్వయమును, వః = రుద్రులారా! మీయొక్క, జంభే = తెఱచిఉన్ననోటిలో, దధామి = ఉంచుచున్నాను.

*తాత్పర్యము:-*

సా. భా:— (1) పృథివి, (2) అంతరిక్షము, (3) ద్యులోకముఅని, లోకములుమూడువిధములుగాఁగలవు. (1) భూలోకవాసులగురుద్రులకు అన్నము బాణము (2) అంతరిక్షవాసులగు రుద్రులకు వాయువుబాణము. (3) ద్యులోవాసులగు రుద్రులకు వర్షముబాణము. పృథివీవాసులగురుద్రులు తప్పుచేసినవారిచే అవశ్యమైన అన్నముతినిపించి, రోగములు తెప్పించి, వారిని హింసించుచున్నారు. అన్నముకొఱకుదొంగతనముచేయించి, ఆదొంగలను హింసించుచున్నారు. కావున భూలోకవాసులైన రుద్రులకు నమస్కారము. అటులనే అంతరిక్షవాసులగురుద్రులు నేరముచేసినవారికి తీవ్రమైనవాయువుచే రోగములుపుట్టించి, హింసించుచున్నారు. కావున వారికి నమస్కారము. అటులనే ద్యులోకవాసులైన రుద్రులు అతివృష్టిచేతను, అనావృష్టిచేతను,

ప్రాణులను హింసించుచున్నారు. రుద్రులు ఐదు దిక్కులందునుగలరు. దోసి లొగ్గి, తూర్పుదిక్కున నున్నవారికిని, దక్షిణాభిముఖులై దక్షిణదిగ్వాసులకును పశ్చిమాభిముఖులై పడమటి దిక్కునందలి వారికిని, ఉత్తరాభిముఖులై ఉత్తర దిగ్వాసులకును, ఊర్ధ్వాభిముఖులై ఊర్ధ్వదిగ్వాసులకును నమస్కరించుచున్నారు పదిప్రేళ్ళచివరలుకలిపి, చేతులతో రుద్రులను జూపుచున్నారు. ఆరుద్రులు మాకుసుఖముచేకూర్చెదరుగాక. ఊరకనేయున్నశత్రువును, ఊరకనేయున్న మమ్ములను ద్వేషించుశత్రువులను తెరువబడియున్నరుద్రులనోటిలోఁ ద్రోసి యుంచుచున్నాము. వారిని హింసింపుడని ప్రార్థించిరి. "ప్రభ్రాజమానా వ్యవదాతాః" అనెడి అరుణమంత్రముచేఁ దెలియు స్త్రీపురుషవాయువులను, అష్టదిక్పతులను రుద్రులుగాఁ దెలిసికొనవలసియున్నది.

*మంత్రవినియోగము:-*

పంచమప్రశ్నలో శతరుద్రీయహోమముచెప్పఁబడెను. "నమస్స భాపతిభ్యః" అను నంతవరకును 1. వ. మంత్రము "అవార్యాయ" అను నంతవరకును 2. వ. మంత్రము. "తన్మసి" అను నంతవరకును 3. వ. మంత్రము. నమోరుద్రేభ్యః" అనుదానిలో పృధివ్యాదిభేదముతో మూడు మంత్రములునుగలవు. మొత్తము ఈయారుమంత్రములతో హోమము చేయవలెను.

> *శ్లో॥ వేదార్థస్యప్రకాశేనతమోహార్దంనివారయన్,*
> *పుమర్థాంశ్చతురోదేయాత్ విద్యాతీర్థమహేశ్వరః"*

**తాత్పర్యము-**

తీర్థమనగా సద్విషయముల నుపదేశించువాడు. మహేశ్వరుడు లోకులకు విద్యలను దక్షిణామూర్తిరూపుడై ఉపదేశించుటచే విద్యాతీర్థుడాయెను. అతడు నాలుగువేదములందలి విషయములను వెల్లడిచేసి, తెలయఁజేసి, లోకుల హృదయములందున్నమోహమును (అజ్ఞానమును) నివారించుచు నాలుగుపురుషార్థములను, ధర్మార్థకామమోక్షములను లోకులకు ఒసంగునుగాక.

సాయనాచార్య విరచితమైన వేదార్థప్రకాశమను భాష్యమున యజుర్వేద సంహితలోచతుర్థకాండలోఁగలక్ష్మి పంచమప్రపాఠకమందలి రుద్రమునకు నమకమునకు వ్రాసిన భాష్యము సమాప్తము:—

(.)

శివ + విష్ణుః-

భ. భా. భా:— "నమోరుద్రేభ్యః" అను మంత్రమునకు భగవంతుడేఋషి అనుష్టుప్ఛందస్సు. రుద్రుడేదేవత. పృధివ్యాదిలోకములు మూడింటఁగల రుద్రులను నమస్కరించి, తనకుసుఖమును, దనశత్రువులకునాశమును జేకూర్చుమని ఈమంత్రమునఁ బ్రార్థింపఁబడెను. "నమోరుద్రేభ్యః అని మొదలగు మూడుయజుస్సులతో "తేభ్యోదశప్రాచీః" మున్నగుమంత్రములను జోడించి, అర్థము చెప్పవలెను. "సూర్యోనోదివస్పాతు,వాతో అంతరిక్షాత్, అగ్నిర్నః పార్థివేభ్యః" అను సారమంత్రమునఁ జెప్పినట్లు సూర్యుడు దివమున నుండియు, వాయువు అంతరిక్షముననుండియు, అగ్నిభూమిపైనుండియు, ప్రజలకుమేలుచేయుచున్నారు. ఆవిషయమే ఈమంత్రమునఁగలదు. పృథివి, అంతరిక్షము, దివము, అని మూడులోకములుకలవు శివకేశవులు ఇరువురును అగ్నిరూపరుద్రులై భూమిపైఁగలరు శివుడు యజ్ఞాగ్ని స్వరూపమునుదాల్చియు విష్ణువు, "బడబము దావము, జఠరము, లౌకికాగ్ని, అను నాల్గురూపములను దాల్చియు, లోకరక్షణకైనేలపైఁగలరు. వారు అగ్నిరూపులై ఆయువును, అన్నమును ఒసంగుదురని "ఆయుర్దాఅగ్నేహవిషోజుషాణః" అను మంత్రమున జెప్పఁబడెను. అందుచే నేలపైఁగల అగ్నిరూపరుద్రులకు, జీవులను రక్షించుటకుఁగాని, శిక్షించుటకుఁగాని అన్నమేసాధనము(బాణము) అగునని తెలియుచున్నది. అందుచేవారు కర్మఫలానుకూలముగా జీవులచే అపథ్యమైన అన్నము తినిపించి, వ్యాధులుపుట్టించి, బాధించుచున్నారు. కొందఱు జీవులకు అన్నము లేకుండఁజేసి, ఆకలితో బాధపడునట్లుచేయుచున్నారు. ఆహారమునకవసరమగు ధనమును వస్తువులను, సంపాదించుటకై జీవులచే దొంగతనము మున్నగు దుష్కార్యములు చేయించి, మరణదండనాదులను అనుభవింపఁజేయుచున్నారు. అందుచే జీవులు అన్నసాధనుడగు అగ్నియొక్కరూపముదాల్చిన రుద్రులను నమస్కరించుచున్నారు. అపథ్యాహారముచే జ్ఞానేంద్రియములగునేత్రాదులై దింటికిని, కర్మేంద్రియములగు కరచరణాదులెదింటికిని, బాధకల్గింపకుడని

తెల్పుటకై పదిప్రేళ్ళను జోడించి, జీవులు రుద్రులను నమస్కరించుచున్నారు. పంచభూతములవలన బాధకలుగ నీయకుడని తెల్పుటకై తూర్పు, దక్షిణము పడమర, ఉత్తరము, ఊర్ధ్వము అనెడి ఐదుదిక్కులకు ఎదురుమోముకలవారై నమస్కరించుచున్నారు. "ఉపకారకసజ్జనుండొ పెగియుండిననైన దురాత్మకుండు నిష్కారణమోర్వలేక యపకారముచేయుటవానివిద్యగా అని భాస్కరకవి చెప్పి నట్లు శత్రువులూరకనేయున్నను మమ్ములను బాధింతురు. అందుచే మేము వారిని ద్వేషించెదము ఋణశేషము, శత్రుశేషమును మిగులరాదు కావున ఆశత్రువులను మీనోళ్ళలో ఉంచుచున్నాము. వారిని సంహరింపుడు మీజంభము లతో (దన్తములతో)గొఱికి, అదుష్టులను నశింపజేయుడు. తనకోపము తన శత్రువు కావున మాకువారిపైకోపములేకుండ జేయుదురుగాక. మానవులు చేయుకర్మలు, వాచికములు, కాయికములు, మానసములు, అనిముప్పేధములు కావున శివకేశవరూపరుద్రులారా! "నమోరుద్రేభ్యః" అనుచుమిమ్ముమాట లతో నమస్కరించుచున్నాము "నమస్తేభ్యోదశప్రాచీః" అనుచుమిమ్ములను జేతులతో నమస్కరించి, మీకు శారీరకనమస్కారములను నమర్పించు చున్నాము. తేభ్యోనమః" అని ధ్యానించుచు, మీకు మానసిక నమస్కారము లను సమర్పించుచున్నాము. మీరు మాకు సుఖముచేకూర్చెదరుగాక; అని తొల్తపృథివిపైగల రుద్రులను నమస్కరించిరి శివకేశవరూపరుద్రులారా! మీరు వాయురూపులై అంతరిక్షముననున్నారు. "ప్రభ్రాజమానావ్యవదాతాః" మున్నగు అరుణమంత్రములను బరిశీలించినచో బ్రహ్మాండమున బంచప్రాణ వాయువులు, వంచఉపవాయువులు పదునొకండు పురుషవాయువులు, పదు నొకండుస్త్రీవాయువులు, ఇంద్రుడు వజ్రముతో దితిగర్భమును ఛేదింపగా వెలువడినసప్తవాయువులు, వానికిజెందిన 49 ఉపవాయువులునుగలవని తెలియుచున్నది. ఇట్లు పరిశీలించినచో వాయువులు అనన్తముగాగలవని తెలియును. వానిలో రజతాదివాయువులు శివస్వరూపములు. వైద్యుతాది వాయువులు విష్ణుస్వరూపములు. ఇట్లు శివకేశవస్వరూపములైన వాయువులు రుద్రములై అన్తరిక్షమునగలవు. ఇవన్నియును హింసాసాధనములే. ఇవి

కర్మఫలానుకూలముగా జీవులను రక్షించుటకును, శిక్షించుటకును, అధికముగానో, అల్పముగానో వీచుచుండును. ఒకప్పుడవి వాతస్తంభముగానేర్పడును. ఒకప్పుడు అగ్నిగుండములుగా, సుడిగాలుగానేర్పడును అందుచేఁ బ్రాణులకు వాతరోగములు, రక్తపుఁబోటు, గుండెజబ్బుమున్నగునవివాటిల్లును. అందుచే ప్రాణులు మృతిచెందుదురు. కావున జీవకోటి అగ్నిరూపరుద్రులను నమస్కరించిప్రార్థించును. శివకేశవులు సూర్యరూపరుద్రులై దివమునందున్నారు. "ఆరోగోభ్రాజః పటరఃపతంగః" అను నారుణమంత్రమును బట్టిఎనిమిది సూర్యమండలములుకలవనియు, వానిలో "ఆరోగుడు" అను సూర్యుని మండలము భూలోకమునకుఁ జెందియున్నదని తెలియుచున్నది. ఆరోగుడను సూర్యుడు భూమిపైగల తేమను ఆవిరిగాఁ దీసికొని, దానిని నీటిగామార్చి మఱలనేలపై దానిని వర్షింపఁజేయును. ఆవర్షజలముతోఁ బంటలుపండించి, వానివలనవచ్చిన ఆహారమును ప్రాణులు స్వీకరింతురు. ఆవర్షజలమును త్రాగుదురు. సూర్యుడు వర్షముకురిపింపకున్నచో నీరులేక, ఆహారములేక, ప్రాణులునశింతురు. నరులేకాదు; జంతువులు, పక్షులు, క్రిమికీటకాదులు, వృక్షములు అన్నియును నీరులేకున్నచోనశించును. శివకేశవరూపరుద్రుడగు సూర్యుడు జీవుల కర్మఫలముననుసరించి, అనుకూలముగా వర్షింపక, అతివృష్టి, అనావృష్టి మున్నగునవిచేకూర్చి శిక్షించును. నశింపఁజేయును. ఆసూర్యుడు శివకేశవరూపుడనివేదాదులవలనఁ దెలియుచున్నది. అందుచే భక్తులు అగ్నిని వాయువును ప్రార్థించినట్లే, హింసాసాధనమైన వర్షమును జేపట్టిన సూర్యుని సైతము నమస్కరించుచున్నారు. "పృథివి, అంతరిక్షము దివి, అను మూడును శక్తియైన ప్రకృతియొక్కరూపములు. వాని నధిష్ఠించియున్న "సూర్యుడు, వాయువు, అగ్ని" అనువారు పరమాత్మస్వరూపులు. అందుచేఁ బ్రతిప్రాణియును ప్రకృతి సహితపరమాత్మను ఆత్మరక్షణకై ప్రార్థించును.

*పురశ్చరణము :—*

21 దినములు దీక్షవహించి, 10 దినములు అనుమునే తప్పమఱి దేనిని భుజింపరాదు మొదటి ఐదురోజులుపాలుత్రాగి, తర్వాత ఐదురోజులు ఫలములు భక్షించి పిమ్మట ఐదురోజులు పెరుగుత్రాగి, ఆటుపిమ్మట ఐదురోజులు వండ్లుతినవలెను తుదిదినమున ఉపవాసముచేయవలెను ఇట్లుచేసి 21 దినములు హోమపదార్థమును భక్షించుచుండి. జపముచేయవలెను పిమ్మట ఐదుదినములు కత్తుకబంటినీటిలోనిల్చి జపముచేయవలెను. ఆటుపిమ్మట అఘమర్షణస్నానముచేసి, జపముచేసి, గురుసేవచేసి. ఆచార్యునకు 10॥ బంగారునాణెములు దక్షిణగా నొసంగవలెను పిమ్మటను హోమాదులుచేసి. మౌనదీక్షతోనుండి. సిద్ధిపొందిన వానికిగలశత్రువులు జయింపఁబడుదురు. అభిమత సిద్ధివారికిచేకూరును. కాలజ్ఞానములభించును, ఆయుఃప్రమాణము అధికమగును.

భ. భా. భా:— సమష్టిరుద్రాధ్యాయము ననుసరించిఁ చేయదగిన జపహోమాదిక్రమము నిరూపింపఁబడుచున్నది. తత్ఫలముకూడఁ జెప్పఁబడుచున్నది.

*శ్లో॥ వృషాధిరూఢందేవేశం సర్వలోకైకకారణం।*
*ధ్యాయేత్ బ్రహ్మాదిభిస్తుత్యం పార్వతీసహితంశివమ్॥*

*తాత్పర్యము—*

పార్వతీ సహితుడైన మహాశివుడు వృషభమును అధిష్ఠించియుండెను. అతడు దేవతలకెల్లఁ బ్రభువు. సర్వలోకములకును అతడే ముఖ్యకారణము. బ్రహ్మాదులు అతనినిస్తోత్రముచేయుచున్నారు. అతనిని ధ్యానింపవలెను.

ఈ రుద్ర సముదాయము ను జపించిన మాత్రాన సర్వసిద్ధులు చేకూరును త్రిషవణస్నానము చేసి జపము చేసినవాడు పంచమహాపాతకము లను బోగొట్టు కొని పవిత్రుడు అగును శౌనకుడుచెప్పిన రుద్రపూజాఫలము ను గమనింపుడు. నమకమునఁ ప్రథమానువాకమును, చమకమునఁ ప్రథమానువాకమును జోడించి, జపముచేసి, శివుని బూజింపవలెను. పిమ్మట బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. పైరీతిని జేసినచో సర్వకామములు నెరవేరును రాజ్యకాముకుడు రుద్రాధ్యాయమును జపించి "మానస్తోకే" అనుమంత్రముతో హోమముచేసి, పద్మోత్పలాదులతోఁ బూజింపవలెను. "ప్రముంచధన్వనస్త్వమ్" అను మంత్రముతోఁ జందనాదులను సమర్పించవలెను. "నమో వఃకిరికేభ్యః" అను దానితో తండులహోమముచేయవలెను. బోధాయనుడు చెప్పిన విధమును ఆచరించినవాడును ఐశ్వర్యమును బొందును. కాళికాపురాణమున సనత్కుమారుడుచెప్పిన పూజావిధానమెట్టిదన? స్నానమాచరించిన పిమ్మట నదీతీరమున, వృషభాదిరహితుడైన రుద్రుని పశ్చిమాభిముఖముగాఁ బ్రతిష్ఠించి, పంచగవ్యాదులతో స్నానముచేయించవలెను. గోరోచనము, బిల్వపత్రములు మున్నగువానితోఁ బూజించవలెను. ఇట్లు 11 దినములర్చించి, జపహోమాదులుచేసినచో సకలకాంక్షలు నేరవేరును. నిధులు మున్నగునవి లభించును కృష్ణపక్షాష్టమిమొదలు కృష్ణచతుర్దశివరకును అభిషేకాదులతో మహాదేవుని అర్చించి, నమోఽఅస్తునీలగ్రీవాయ" అను మంత్రమును జపించవలెను. దానిచే సర్వసిద్ధులుపొందుదురని కొందఱుచెప్పిరి. అన్నకాముడు "అసౌయస్తామ్రః" అను మంత్రమును ఆదిత్యునుద్దేశించి, జపించవలెను. వర్షముకురియుటకును ఈమంత్రమునే జపించవలెను. పూర్వోక్త విధిననుసరించి, దేవునారాధించి, రుద్రానువాకములు పదునొకండింటిని 11సార్లు జపించి, "ఆరాత్తేగోఘ్న" అనుమంత్రముతో షోడశోపచారములుచేసి, ఆమంత్రమును వేయిసార్లుజపించినచో దీర్ఘాయుష్మంతుడగును. ఆదివారము నాడు బ్రాహ్మణునకు దక్షిణనొసంగి వేయిజపముచేసినచో వ్యాధివిముక్తుడై శతాయుష్కుడగును. "పరిణోరుద్రస్య" అను మంత్రముతో వటసమిధలు

10 వేలుహోమముచేసినచో అయుష్మంతుడగు పుత్రునిబొందును. గోవృద్ధికి "నమోవఃకిరికేభ్యః" అను మంత్రముతో జపహోమములుచేయవలెను. మహారాజమార్గమునఁ బుట్టమన్నుతోఁజేసిన శివలింగమును బ్రతిష్ఠించి, పంచగవ్యస్నానముచేయించి పూజించి, "నమోవఃకికిరికేభ్యః" "మానస్తోకే" అను మంత్రములను దక్షిణామూర్తి చెంతనుజపించినచో మాటలురానివానికి మాటలువచ్చును. ఉపన్యాసకుడగును.

నాభిమాత్రజలమునందుండి, ఆదిత్యాభిముఖుడై జపాహుద్రములను జపించి, పిమ్మట శివున్చించినచో వరమడును. భక్తవత్సలుడునగు వృష కేతుడు ప్రత్యక్షమగును. అతడు విశ్వవిజేతయగును. "మానోమహాన్తమ్" అను మంత్రమును 10 వేలు జపించినచో బాలురకు పరిజనమునకు, యజ మానికిని ఆరోగ్యము లభించును. "మీఢుష్టమ" అనుమంత్రముతో షోడశోప చారములుచేసి, రుద్రమును 11 సార్లు జపించినచో సర్వభయమును, సర్వ క్లేశములనుతొలగును. మహాన్యాసపూర్వకముగా ఏకాదశవారాభిషేకమును అచరించినచో స్వస్థుడగును. "నమోభవాయ; నమోజ్యేష్ఠాయ" అనుమంత్రము లతో జపహోమాదులనాచరించి, భస్మనభిమంత్రించి, రక్షచేయవలెను. చేయుంచవలెను. రాత్రిశిఖాబంధము చేయవలెను. ఇందుచే గ్రహభయము తొలగును. "మీఢుష్టమ" అను మంత్రమును జపించినచో మహాభయము చోరభయము, అగ్నిభయము, ప్రాణభయమును దొలగిపోవును, "ఇమాగ్ం రుద్రాయ'' అను మంత్రజపముచే మహాజ్వరబాధతొలగిపోవును. "నమస్తే రుద్రమన్యవ" అను మంత్రమును జపించుటచే వాయుబాధతొలగును. "అధ్యవోచదధివక్తా" అను మంత్రముజపించి, రక్షాబంధముధరించి, ప్రయా ణముచేయమొదలిడినచో మార్గమున అతనికి బ్రహ్మరాక్షస భూతప్రేతపిశాచ బాధలు ఉండనేరవు. "యాతేరుద్రశివాతనూ'' అను మంత్రముజపించి, ఏకాదశగ్రంధులను హస్తమునఁ గట్టినచో, బాలురును, గుర్విణీలును (గర్భిణీ స్త్రీలును) సుఖముగా వృద్ధినొందుదురు. "సహస్రాణి సహస్రధా" అను

మంత్రముజపించి, భాష్యములోఁ జెప్పినట్లు శాంతి విధానమాచరించినచో సర్వలోకగత శత్రువులునునశింతురు నమోహిరణ్యబాహవే” అను మంత్రమును జపించి, హోమముచేసినచో చక్రాద్యాయుధబాధలుతొలగును. శౌనకమునిచెప్పిన అభిచారికహోమాదులు ఈకాలమున ఆచరణీయములుకావు

ప్రతిదినము శివలింగాభిషేకముగావించువారు జన్మజన్మాంతరకృత పాపములను దొలగించుకొనఁగలరు నమకచమకములతో ఏకవారాభిషేకము చేసినచో ఘురుద్రమగును. 11 సార్లు నమకచమకములతో అభిషేకము చేసినచో మహారుద్రముఅగును. దీనిచే నిర్ధనుడు ధనవంతుడగును. మేరు తంత్రోక్తవిధానమునసుసరించి, చెప్పిన విధానము సమాప్తము.

—: శ్రీ భట్టభాస్కరాచార్యకృతనమకభాష్యము సంపూర్ణము :—

—: ఏకాదశానువాకములుగల నమకమంత్రములకు, (1) యజ్ఞపరముగా, (2) శివపరముగా, (3) విష్ణుపరముగా, (4) బీజాక్షరసంపుటి ననుసరించి విజ్ఞానశాస్త్రసూచకముగా :—

*శ్రీ తెలికిచెర్లోపనామకులును, కౌండిన్యసగోత్రులును*

*పుణ్యదంపతులునగు లక్ష్మీకాంతాకామేశ్వరులపుత్రుడగు*

*రాజేశ్వరశర్మచే వ్రాయఁబడిన*

*అర్థవివరణములుగల*

*శ్రీ రుద్రాంధ్ర భాష్యము*

*—: స మా ప్త ము :—*






